ఓమ్

వాసిష్ఠ రామాయణము

అను

# శ్రీయోగవాసిష్ఠము

(తాత్పర్యప్రకాశికయను ఆంధ్రానువాద సహితము)

## మహర్షి వాల్మీకి ప్రణీతము

పూర్వార్థము - చతుర్థ సంపుటము


అనువాదకులు :

శ్రీ పూర్ణానంద స్వాములవారు



సంపాదకులు - ప్రకాశకులు :

శ్రీ వ్యాసాశ్రమము

వ్యాసాశ్రమము పోస్టు, (మార్గము) ఏర్పేడు, చిత్తూరు జిల్లా. (ఆ.ప్ర.)

పిన్ : 517 621 ఫోన్ నెం. 08574 - 68528

2009

★

జిజ్ఞాసువులైన పాఠకుల ప్రీతికి పాత్రమై మూడుసార్లు ముద్రితమయింది.

ఇటీవల చాలాకాలం నుండి దుర్లభంగా వుండిపోయిన ఈ గ్రంథరత్నం కావాలంటూ ఆశ్రమానికి పలువురు లేఖలు వ్రాసేవారు. భగవదనుగ్రహం వల్ల, గురుకరుణవల్ల ఈ మహాగ్రంథాన్ని ఇప్పుడు మళ్లీ ప్రచురించే సదవకాశం లభించింది. పాఠకుల సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకొని దీని నిప్పుడు డెమ్మీ 1/8 సైజులో ఎనిమిది సంపుటాలుగా ప్రచురిస్తున్నాము.

ఈ గ్రంథగౌరవాన్ని గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం వారు దీని పునర్ముద్రణకు ఉదారంగా ఆర్థిక సహాయం అందించారు. ఇందుకు దేవస్థానం పాలకమండలికి ఎంతో కృతజ్ఞులము. ఈ విషయంలో సహకరించిన ఆశ్రమపూర్వ విద్యార్థి, తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారిని అభినందిస్తున్నాము.

ఈ ఉద్గ్రంథం ఇంకా విస్తృత వ్యాప్తి చెంది పాఠకులకు ఆత్మానందాన్ని ప్రసాదించుగాక!

శ్రీ వ్యాసాశ్రమం — ప్రకాశకులు

22-8-1997.



ఓమ్.

# శ్రీ యోగవాసిష్ఠము.

## పూర్వార్ధము — ద్వితీయసంపుటము.

## విషయానుక్రమణిక.

ఓమ్ తత్ సత్.

—O—



## ఏకవింశః సర్గః

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఏవంప్రబోధితస్తేన తదా పుణ్యేనపావనః
ప్రబోధమాపప్రాకాశ్యం ప్రభాతఇవభూతలమ్. 1

శ్రీవసిష్ఠుఁడు:—ఓరామా ! ఇవ్విధమున పుణ్యునిచే బోధింపఁబడిన పావనుఁడంత ప్రాతః కాలమున భూతలము ప్రకాశ మొందునట్లు జ్ఞానప్రకాశమునొందెను.

ఉభావపి తతఃసిద్ధౌ జ్ఞానవిజ్ఞానపారగౌ
విచేరతుర్వనే తస్మిన్యావదిచ్ఛమనిన్దితౌ. 2

ఇటుపిదప, మోక్షసిద్ధినిబడసినవారును జ్ఞాన విజ్ఞాన పారంగతులును, అనిందితులునగు వారిరువురు నవ్వనముననే సంచరింపదొడగిరి.

తతఃకదాచిత్కాలేన నిర్వాణపదమాగతౌ
తౌవిదేహతాగతస్నేహౌ దీపావివశమంగతౌ. 3

పిమ్మట కాలక్రమమున వారిద్వరును తైలరహిత దీపద్వయమువలె ప్రశమన మొంది నిర్వాణపదవి నధిష్ఠించిరి.

ఏవంప్రాగ్భుక్తదేహానామనన్తా జనబన్ధుతా
ఆః కైకింగృహ్యతే తాభ్యః కింవాసంత్యజ్యతేఽనఘ. 4

పాపరహితుఁడవగు నో రామా ! ఇట్లు పూర్వకాలిక దేహములకుఁ జెందిన బంధువులెందఱో జీవునకు గలరు. వారిలో నిక యేరిని త్యజించుట ! యేరినిగ్రహించుట !

తస్మాదాసామనన్తానాం తృష్ణానాంరఘునన్దన
ఉపాయస్త్యాగ ఏవైకో న నామపరిపాలనమ్. 5

కావున నో రాఘవా ! శోకాదులన్నింటికి మూలభూతములగు విషయవితృష్ణలన్నింటిని పూర్ణముగ త్యజించుటయే శాంతికి యుపాయముగాని విషయగ్రహణ మెన్నటికిని గానేరదు.

చిన్తనేనైధతేచిన్తా త్విన్ధనేనేవ పావకః
నశ్యత్యచిన్తనేనేవ వినేన్ధన మివానలః 6

ఇంధనముచే నగ్ని ప్రజ్వలించునట్లు విషయచింతనచే చింత వృద్ధినొందును. అట్టిచింతన లేనిచో యింధనములేని అగ్నివలె చింతయును నశించును.

ధ్యేయత్యాగరథారూఢః కరుణోదారయాదృశా
లోకమాలోకయన్దీన మాతిష్ఠోత్తిష్ఠరాఘవ. 7

ఓ రామా ! 'ధ్యేయవాసనాత్యాగ'మను రథమారోహించి, కరుణాదృష్టితోను, యుదారచిత్తముతోను దీనులఁగాంచుచు సర్వభూతదయగల్గి ప్రకృత వ్యవహారముల నాచరింపుము.

ఏషాబ్రాహ్మీస్థితిః స్వచ్ఛా నిష్కామావిగతామయా
ఏనాంప్రాప్యమహాబాహో విమూఢోఽపినముహ్యతి. 8

మహాబాహువవగు నో రామా! ఇదియే మిగుల నిర్మలమైనదియు, నిష్కామసహితమును ఉపాధిరహితమునగు బ్రాహ్మీస్థితి యగును. ఇద్దానిని పొందిన, లోకవ్యవహారమందచతురుడున్నూ విమోహితుడు గానేరడు.

ఏకంవివేకంసుహృదమేకాం ప్రౌఢసఖీం ధియమ్
ఆధాయవిహరన్నేవం సంకటేషునముహ్యతి. 9

వివేకమను మిత్రుని, పరమార్థబోధమను ప్రియసఖిని వెంటనిడుకొని విహరించుచో మనుజుండాపదలందును మోహితుడు గాకయుండును.

వినివారితసర్వార్థా దపహాస్తితబాంధవాత్
నసద్ధైర్యాదృతేకశ్చి దభ్యుద్ధరతిసంకటాత్. 10

సంపదలన్నింటిని పరిత్యజించినప్పటికిని, బంధువుల విడనాడినప్పటికిని, స్వధైర్యమున కన్యమగు మరెద్దియును యాపదలనుండి మనుజుని సంరక్షింపజాలదు.

వైరాగ్యేణాథశాస్త్రేణ మహత్త్వాదిగుణైరపి
యత్నేనాపద్విఘాతార్థం స్వయమేవోన్నయేన్మనః. 11

వైరాగ్యము చేతను, శాస్త్రాధ్యయనము చేతను, మహత్త్వాది గుణముల చేతను ఆపద్వినాశమునకై విషయగర్తమునుండి నిన్ను నీవు లేవనెత్తికొనుము.

నతత్త్రిభువనైశ్వర్యాన్న కోశాద్రత్నధారిణః
ఫలమాసాద్యతేచిత్తా ద్యన్మహత్త్వోపబృంహితాత్ 12

ఓ రామా! విషయత్యాగము చే మహత్తరరూపమొందు చిత్తము చే నేఫలములభించునో అయ్యది ముల్లోకములందలి యైశ్వర్యము చేగాని, రత్నభండారము చేగాని లభింపదు.

తదేతస్మింజగత్కుక్షౌ పాతోత్పాతనదోలనైః
పతన్తిపురుషాయేవై మనస్తేషాంగతజ్వరమ్. 13

ఇక్కారణమున యూర్ధ్వాధోగతులును, జన్మపరంపరలునుగల్గి యీ సంసారకుక్షియందు వసించు జీవుల మనంబెల్లపుడును దుఃఖసహితముగనేనుండును.

పూర్ణేమనసిసంపూర్ణం జగత్సర్వంసుధాద్రవైః
ఉపానద్గూఢపాదస్య నను చర్మాస్తృతైవభూః. 14

మనస్సు బ్రహ్మజ్ఞానము చే పరిపూర్ణమగునపుడు లోకమంతయు అమృతమయముగ గన్పట్టును. పాదరక్షలు గలవానికి భూభాగమంతయు చర్మము చే నాచ్ఛాదింపబడినదేయగును గదా!

వైరాగ్యాత్పూర్ణతామేతి మనోనాశావశానుగమ్
ఆశయారిక్తతామేతి శరదేవ సరోమలమ్. 15

ఆశావశము గాని మనస్సు వైరాగ్యము చే పూర్ణత్వమునొందును. కాని ఆశ చే శరత్కాలమందలి సరోవరమాలిన్యమువలెనది శూన్యత్వము జెందును.

హృదయంశూన్యతామేతి ప్రకటీకృతకోటరమ్
అగస్తిపీతార్ణవవదాశా వివశచేతసామ్. 16



ఆశ చే వివశులగువారి హృదయము క్షోభదైన్యాది దోషములతో గూడినదై, అగస్తి ఋషి చే పానమొనర్పబడిన సముద్రమువలె శూన్యత్వము నొందును.

యస్యచిత్తతరౌస్ఫారే తృష్ణా చపలమర్కటీ
నవల్గతిమహత్తస్య రాజతేహృద్వనంతతమ్. 17

శాంతివైరాగ్యాది ఫలసంయుక్తమగు యెవని చిత్తమను మహావృక్షముపై తృష్ణయను చపలవానరము గంతులిడకుండునో వాని హృదయవనము మిగుల శోభనుబడయును.

పద్మాక్షకోశంత్రిజగద్గోష్పదం యోజనవ్రజమ్
నిమేషార్ధంమహాకల్పః స్పృహారహితచేతసామ్. 18

ఇచ్ఛారహితులును, బ్రహ్మజ్ఞానము చే పూర్ణచిత్తులునునగు వారికి ముల్లోకములును కమలబీజమువలె యల్పముగాతోచును. మఱియు, జన సమూహమంతయు వారికి గోష్పాదమువలెను మహాకల్ప మర్ధనిమిషముగను గన్పట్టును.

శీతతాసా నశీతాంశో ర్నహిమాచలకన్దరే
నరంభాచందనావల్యాం నిఃస్పృహేషుమనఃసుయా. 19

నిస్పృహుడగువాని (ఇచ్ఛారహితుని) చిత్తమునగల శీతలత్వము చంద్రుని యందుగాని హిమాలయ కందరమునగాని, కదళీవనమునగాని, చందనవృక్షములందుగాని యుండనేరదు.

నతథాభాతిపూర్ణేందుర్న పూర్ణఃక్షీరసాగరః
నలక్ష్మీవదనంకాన్తం స్పృహాహీనంయథామనః. 20

నిస్పృహుని మనంబునగల శోభ పూర్ణచంద్రునియందుగాని, క్షీరసాగరమునగాని, లక్ష్మీముఖారవిందమునగాని యుండనేరదు.

యథాబ్దలేఖాశశినం సుధాలేపంమషీయథా
దూషయత్యేవమేవాన్త ర్నరమాశాపిశాచికా. 21

మేఘమండలము చంద్రునిన్ని, సున్నపు లేపనమును కజ్జల (కాటుక) ద్రవమున్ను మలినమొనర్చు చందమున మనుజుని యంతఃకరణమును ఆశయను పిశాచము కలుషితమొనర్చుచున్నది.

ఆశాఖ్యాశ్చిత్తవృక్షస్య శాఖాఃస్థగితదిక్తటాః
తాసుఛిన్నాసుస్థాణుత్వం యాతిచిత్తమహాద్రుమః. 22

చిత్తమను వృక్షముయొక్క ఆశారూప శాఖలు దిగంతములగూడ విస్తరించుచున్నవి. అవి ఛేదింపబడినచో చిత్తమను మహావృక్షము స్థాణు (బ్రహ్మ) రూపత్వము నొందును.

ఛిన్నతృష్ణామహాశాఖే చిత్తస్థాణౌస్థితింగతే
ఏకరూపతయాధైర్యం ప్రయాతిశతశాఖతామ్. 23

దీర్ఘములగు తృష్ణారూపశాఖలు విచ్ఛిన్నములు గాబడినవై చిత్తమను స్థాణువు శోభించునపుడు పూర్వ మల్పరూపముననున్న ధైర్యము శతశాఖలుగా పరిణమించును.

అనస్తమితధైర్యేణ తేన చిత్తే క్షయం గతే
తత్పదం ప్రాప్య తే రామ యత్ర నాశో న విద్యతే. 24

ఓ రామా! నశింపని ధైర్యముగలవాడు (వైరాగ్యము జితేంద్రియత్వము ద్వంద్వసహిష్ణుత మున్నగు గుణములుగల ధీరుడు), అక్షయమగు యుత్తమపదవిని జెందును.

ఏతాసాం చిత్తవృత్తీనాం మూఢానాముత్తమాశయః
నదదాసి ప్రరోహం చేత్తద్భయం నాస్తి రాఘవ. 25

ఓ రాఘవా! పవిత్రాంతఃకరణముగల్గి చిత్తవృత్తులకు తావీయక నుంటివో నీకిక జన్మాదులఁగూర్చిన భయములేదనియే యెంచుము.

చిత్తం వృత్తివిహీనం తే యదాయాతమచిత్తతామ్.
తదా మోక్షమయీమస్తః సత్తామాప్నోషి శాంతతామ్. 26

చిత్తవృత్తిరహితమై యెపుడు నీచిత్తము అచిత్తత్వము నొందునో అపుడే నీవాపూర్ణమగు మోక్షస్థితిని బొందగలవు.

చిత్తకౌశికపక్షిణ్యా తృష్ణయాక్షుబ్ధమానసే
అమంగలాని విస్తారమలమాయాంతి రాఘవ. 27

ఓ రామా! తృష్ణయను యులూకము (గుడ్లగూబ) విక్షోభమొనర్చుచు నీచిత్తమున నెపుడు నెలకొనియుండునో అపుడు కేవలమశుభమే నీకు సంప్రాప్తమగును.

చిన్తనం వృత్తిరిత్యుక్తం వర్తతే చిత్తమాశయా
చిత్తవృత్తిమతో హ్యాశాం త్యక్త్వా సశ్చిత్తతాం వ్రజ. 28

చింతననే వృత్తి (చిత్తవృత్తి) యందురు అట్టిచిత్తవృత్తి ఆశచే ప్రవృత్తమగును. కాన ఆశయను చిత్తవృత్తిని త్యజించి నీవు చిత్తరాహిత్య స్థితినొందుము.

యో యయా వర్తతే వృత్త్యా స తయైవ వినాశ్యతే
అతశ్చిత్తోపశాన్త్యర్థం తద్వృత్తిం ప్రక్షయం నయ. 29

ఏది యేవృత్తితో గూడియుండునో, ఆవృత్తియొక్క యభావముచేతనే దానికి నాశము గల్గును. కాన చిత్తోపశమనార్థము నీవు చిత్తవృత్తినే క్షయమొనర్పుము.

ప్రశమితసకలైషణో మహాత్మా
న్భవభవబంధమపాస్య ముక్తచిత్తః
మనసి నిగడరజ్జవః కదాశాః
పరిగలితాసు చ తాసు కో న ముక్తః. 30

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే తృష్ణావిచికిత్సాయోగోత్పత్తిర్నామైక
వింశః సర్గః ॥ 21 ॥



ఓ మహాత్మా! పుత్ర, విత్త, లోకాదులఁగూర్చిన కోర్కెలన్నింటిని వదలి, ఆశయను సంసారబాధమును వీడి, ముక్తచిత్తుఁడవై జీవన్ముక్తుడవుగమ్ము. ఏలయన మనంబున గల దుష్టమాశలే ఆత్మను బంధించునట్టి రజ్జువులగును. అట్టి దుష్టమాశ లుపశమింప నికయెవడు ముక్తుడుగా నుండును?

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
తృష్ణావిచికిత్సా యోగోత్పత్తియను ఏకవింశ
సర్గము ॥ 21 ॥

---

## ద్వావింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అథ వా రఘువంశాఖ్య నభఃపూర్ణనిశాకర
బలివద్బుద్ధిభేదేన జ్ఞానమాసాదయామలమ్. 1

శ్రీ వసిష్ఠుడు:—రఘుకులాకాశచంద్రుఁడవగు నో రామా! అట్లుగాని చో యక స్మాత్తుగ ప్రబోధముదయించుటచేనైన బలివలె నీవున్ను పూర్ణజ్ఞానోత్పత్తి నొందుము.

శ్రీరామ ఉవాచ :—

భగవన్సర్వధర్మజ్ఞ త్వత్ప్రసాదాన్మయాఽఽహ్నికి
ప్రాప్తం ప్రాప్తవ్యమఖిలం విశ్రాన్తం చామలే పదే. 2
శరదీవాంబరాదభ్రిసుదభ్రిమం మమ చేతసః
విభో వ్యపగతం సర్వం తృష్ణాఖ్యం తన్మహాతమః. 3
అమృతాపూరితః స్వస్థః శీతలాత్మా మహాద్యుతిః
తిష్ఠామ్యానన్దవానన్తః సాయంపూర్ణ ఇవోడురాట్. 4
అశేషసంశయాంభోద శరత్సమయ కిం త్వహమ్
తృప్తిమేష్యామి న గచ్ఛామి న చ సాంవదతస్తవ. 5
బలేర్విజ్ఞానసంప్రాప్తిం పునర్మద్బోధవృద్ధయే
విభో కథయ ఖద్యస్తే సన్తోనావనతం ప్రతి. 6

శ్రీరాముడు:—ఓ మహాత్మా! సర్వధర్మజ్ఞా! తమ కృపావిశేషముచే ప్రాప్తింపదగిన దంతయు నేను ప్రాప్తినొందితిని. నిర్మలమగు యాత్మపదమున విశ్రాంతిని బడసితిని. దేవా! శరదాకాశమున విశాలమేఘమండలము శీఘ్రముగ నాశమొందునట్లు నా చిత్తమున తృష్ణయను నిబిడాంధకారము నుపశమించినది. జ్ఞానామృతముచే పరిపూర్ణుడను శీతలచిత్తముఁన్ను, మహాప్రకాశయుక్తమగు యంతఃకరణమున్ను గల్గి ఆనందయుతుడనై సాయంసమయ పూర్ణచంద్రునివలె వెలుగొందుచున్నాను కాని, సంశయములను మేఘమండలమునకు శరత్కాలమునంటి తమయొక్క

దివ్యవచనంబుల నాలింప నాకు దృప్తి గలుగకున్నది. కావునో దేవా! మజ్జ్ఞానాభివృద్ధికై బలిచక్రవర్తియొక్క జ్ఞానప్రాప్తి విషయమునుగూర్చి నాకుఁ దెలియజేయుము. నమ్రశీలుడగు శిష్యున కుపదేశించుటయందు మహాత్ములు ఖేదమునొందరుగదా.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

శృణు రాఘవ తే వక్ష్యే బలేర్వృత్తాంతముత్తమమ్
శ్రుతేన యేన తంతత్త్వబోధం ప్రాప్స్యసి శాశ్వతమ్. 7

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! బలియొక్క యుత్తమవృత్తాంతమును నీకు జెప్పబోవుచున్నాను వినుము. దీనిని వినిన శాశ్వతమగు తత్త్వబోధను నీవుపొందగలవు.

అస్త్యస్మిం జగతః కోశే కస్మింశ్చిద్దిక్ని కుంజకే
పాతాలమితి విఖ్యాతో లోకో భూమేరధః స్థితః. 8
క్షీరోదార్ణవజాతాభిర్దిగ్ధాభిరమృతాంశుభిః
క్వచిద్దానవకన్యాభిర్భాతి నిర్వివరాన్తరః. 9
జిహ్వాగణోద్దామరవైర్విలోలరసనాయుతైః
క్వచిద్భోగిభిరాపూర్ణః సహస్రశతమస్తకైః. 10
దేహాద్రివలితాశేష విశ్వోద్ధరణఘస్మరైః
క్వచిద్దనుసుతైర్వ్యాప్తశ్చలద్భిరివ మేరుభిః. 11
కుంభకూటాగ్రవిశ్రాంత వసుధామండలోదరైః
క్వచిద్దిగ్దన్తిభిర్దన్త ద్రుమహాద్రిభిరుపాశ్రితః. 12
మహాకటకటాశబ్ద త్రస్తభూతపరంపరైః
క్వచిద్దుర్గంధభూతాభైరధోనారకమండలైః. 13
ఆభూతలమభిప్రోత సప్తపాతాలమండలైః
క్వచిద్రత్నాకరైర్వ్యాప్తః పాతాలైర్వివరైరివ. 14
సురాసురశిరః సుప్త పాదాంభోరుహపాంసునా
క్వచిద్భగవతా తేన కపిలేన పవిత్రితః. 15
ఆసురీసంభృతానన్త పూజనక్రీడనైషిణా
క్వచిద్భగవతా తేన హాటకేశేన పాలితః. 16

ఈ బ్రహ్మాండమందలి యొకానొక దిక్కుంజమున భూమికధోభాగమున ప్రసిద్ధమగు పాతాళమను లోకముగలదు. క్షీరసాగరమున జనించిన అమృతకిరణములచే యుక్తులగు దానవకన్యలచే నందొకభాగము శోభించునుండె. అందు మఱియొక భాగము పెక్కుశిరస్సులు, నాలుకలు గల్గి శబ్దముజేయుచున్న సర్పములచే పూర్ణమై యొప్పుచుండె. పర్వతసదృశములగు తమ దేహములచే జగత్తును వ్యాప్తమొనర్చువారును, విశ్వోద్ధరణధర్మమును (లేక యజ్ఞమందలి హవిస్సును) బలాత్కారముగ గ్రసించువారును, చలించు మేరుపర్వతములవంటివారునగు దానవులచే పూర్ణమైయుండలి మఱియొక ప్రదేశము శోభించుచుండె. దిగ్గజ గండస్థలములను శిఖరములపై దాల్చి



భూమధ్యభాగము విశ్రమించుచుండె. మఱియు దిగ్గజదంతములను వృక్షముల కప్పు దేశము పర్వతమువలె నాశ్రయభూతమై దనరుచుండె. కటకటాశబ్దములచే ప్రాణులకు భీతిఁగొల్పువారును దుర్గంధయుతులునగు నరకనివాసులచే నాయధోభాగము వ్యాప్తమైయుండె. భూతలమువఱకు వ్యాపించిన సప్తపాతాళమండలములుగలదై యాప్రదేశము రత్నాకరములగు మేర్వాది పర్వతములకు నిలయమైయుండెను. సురాసురులకును వందనీయుడగు కపిలమహామునిచే నాప్రదేశము పవిత్రమొనర్పబడెను. మఱియు అసురస్త్రీల (లేక సైనికుల) చేత పూజితుడును, స్వర్ణలింగాత్మకుడును నగు మహేశ్వరునిచే నాదేశము పాలితమైయుండెను

తస్మిన్నసురదోస్తంభ ధార్యమాణమహాభరే
బభూవ దానవో రాజా విరోచనసుతో బలిః 17
సాక్రన్దనసమంసర్వైః సురవిద్యాధరోరగైః
పాదసంవాహనం యస్య సురరాజేన వాంఛితమ్. 18
కోశస్త్రైలోక్యరత్నానాం పాతా సర్వశరీరిణామ్
ధర్తా భువనభర్తౄణాం యస్య పాలయితా హరిః. 19
ఐరావణస్య సంశోషం యన్నామ్నా కటభిత్తయః
కేకయోవాహిహృన్నాదాః జగ్ముర్గజగ్మురా తతామ్. 20
ప్రతాపోగ్రోష్మభిర్యస్య కల్పకాలఇవాబ్ధయః
యయుః శోషోన్ముఖాః సప్త సప్తతాం కుపితాకృతేః. 21
యదధ్వరాగ్ర్యసూమాభ్ర రాజయో వలితాబ్ధయః
బ్రహ్మాండకోటరస్యాస్య సదా కవచతాం యయుః 22
యస్యదృష్టిదృశాఘూర్ణ మున్నాధారకులాచలాః
వినమన్తి దిశః సర్వా లతాః ఫలనతా ఇవ 23

అసురుల భుజస్తంభములచే ధరింపబడిన మహారాజ్యభారముగల నాపాతాళమునకు విరోచనుని పుత్రుడగు బలియను దానవుడు రాజైయుండెను. విద్యాధరులును, యురగసమూహమున్ను, యింద్రుడును గూడ వానియెడ భీతిల్లి వానిపాదముల సేవింప నుంకించుచుందురు. త్రైలోక్యరత్నాకరులును, సర్వజీవసంరక్షకులును సర్వలోకధారకులునగు బ్రహ్మాదులకుఁగూడ యాశ్రయభూతమగు విష్ణుభగవానుడు వాని రక్షకుడైయుండెను. మయూరనాదము వినినంతనే సర్పములు హృదయము కంపించునట్లు వానినామము వినగానే ఐరావతముయొక్క గండస్థలముశుష్కించి బలహీనమైపోవును. వానిప్రతాపాగ్నిస్పర్శచే సప్తమహాసముద్రములును జలశూన్యములై ప్రళయకాలమందువలె గర్తమాత్రమున శేషించియుండును. వానిచే గావింపబడు అశ్వమేధాది యజ్ఞములనుండి నుద్భూతమగు ధూమమను మేఘపంక్తి సముద్రము నాచ్ఛాదించుచు బ్రహ్మాండమునకు కవచమువలె నగుచుండును. వాని కుపితనిరీక్షణముచే భూమండలమున కాధారభూతములగు సప్తకులాచలములున్ను విదీర్ణములగును. ఫలభారముచే వంగు లతలవోలె దిగంతములందలి ప్రాణికోట్లన్నియు వానిఁ గాంచినంతనే నమ్రవంతములగును.

లీలావిజితనిఃశేష భువనాభోగభూషణః
దశకోటీఃసవర్షాణి దైత్యోరాజ్యంచకారహ. 24

సర్వలోకవిభూషణుఁడగు యింద్రునిగూడ లీలామాత్రముగ జయింపగల్గు మహాపరాక్రమశీలుఁడైన నాదైత్యాధీశుఁడగు బలిచక్రవర్తి పదికోట్ల సంవత్సరములు రాజ్యపాలన మొనర్చెను.

అథగచ్ఛత్స్వనల్పేషు యుగేష్వావర్తవృత్తిషు
సురాసురమహౌఘేషు ప్రోత్పతత్సుపతత్సుచ. 25
అజస్రమతిభుక్తేషు త్రైలోక్యోదారవృత్తిషు
భోగేష్వభజదుద్వేగం బలిర్దానవనాయకః. 26

తదుపరి జలావర్తముభంగి పరివర్తనశీలములైన అనేక యుగములు గడచిన పిదప, సురాసురులు పతనోత్పాతంబులనొంద, ముల్లోకములందలి యుత్తమ భోగములన్నింటిని యనుభవించిన మీఁదట, దానవేశుఁడగు నా బలిచక్రవర్తికి వైరాగ్యము జనించెను.

మేరుశృంగశిఖారత్న కృతవాతాయనస్థితః
ఏకదాచిన్తయామాస స్వయంసంసారసంస్థితిమ్. 27

అత్తఱి యొకనాఁడు మేరుపర్వత శిఖరముపైని రత్ననిర్మిత వాతాయనములందు గూర్చుండి సంసారస్థితిని గూర్చి యాతఁడు స్వయముగ నిట్లాలోచించెను —

కియన్తమిదమక్షుణ్ణశక్తినైవమయాధునా
సామ్రాజ్యమిహకర్తవ్యం విహర్తవ్యంజగత్త్రయే. 28
మహతామమరాస్త్రేణ త్రైలోక్యాద్భుతకారిణా
కింవాభవతిభుక్తేన భూరిభోగాతిహారిణా. 29

'అకుంఠిత శక్తిసంపన్నుఁడనగు నేనిక యెంతకాలము రాజ్యపాలన మొనర్పవలెను? ముల్లోకములందిక యెంతతడవు నేను విహరింపవలెను? త్రిలోకములందద్భుత కర్మలఁ గావించిన నా యొక్క యీ విశాలరాజ్యముచే నేమిప్రయోజనము? అతిమనోహరములగు భోగములననుభవించుటచే నేమిఫలము?

ఆపాతమాత్రమధుర మనావశ్యకపరిక్షయమ్
భోగోపభోగమాత్రంమే కింనామేదంసుఖావహమ్. 30

అవిచారముచే మిగుల రమణీయములును, నిక్కముగ నాశశీలములు నగు యీ భోగములన్నియు నాకు సుఖప్రదములెట్లగును?

పునర్దినైకకలనా శర్వరీసంస్థితిఃపునః
పునస్తాన్యేవకర్మాణి లజ్జాయై సచతుష్టయే. 31

మఱలనదియే దినము; మఱలనదియే రాత్రి; మఱలనవియే స్నానపానాది కర్మలు; ఇట్లు గడచినవే మఱల వచ్చుచున్నవి. మహాత్ములకియ్యవి లజ్జాస్పదములేయగును గాని సంతుష్టికరములు గానేరవు.



పునరాలింగ్యతేకాన్తా పునరేవచభుజ్యతే
సేయంశిశుజనక్రీడా లజ్జాయైమహతామిహ. 32

మఱల నాకాంతాలింగనమే; మఱల నాభోగానుభవమే; బాలక్రీడవంటిదగు నిదంతయు మహాత్ములకు లజ్జాకరమేయగును.

తమేవభుక్తవిరసం వ్యాపారౌఘంపునఃపునః
దివసేదివసేకుర్వన్ప్రాజ్ఞః కస్మాన్నలజ్జతే. 33

రసహీనములగు నాక్రియలనే మఱల ప్రతిదినమాచరించుచున్నను బుద్ధిమంతుఁడేల నాటి యెడ లజ్జితుఁడగుటలేదు?

పునర్దినంపునారాత్రిః పునఃకార్యపరంపరాః
పునఃపునరహంమన్యే ప్రాజ్ఞస్యసంవిడంబనా. 34

మఱల నదియే దినము; మఱల నదియే రాత్రి; మఱల నాకర్మపరంపరయే; ప్రాజ్ఞని దృష్టియందిదంతయు విడంబనామాత్రమేయగునని నేనెంచెద.

ఊర్మితాంపునరాసాద్య పునరేతి నిరూర్మితామ్
యథాజలంతథైవాయం తాంతామేతిక్రియాంజనః. 35

జలము తరంగరూపత్వమునొంది మఱల తరంగాభావము నొందునట్లు ఆ పూర్వపుక్రియలనే జనులు మఱల మఱల పొందుచున్నారు కాని నూతనమగు మఱియే వస్తువున్నుగాదు.

ఉన్మత్తచేష్టితాకారా పునఃపునరియాక్రియా
జనంహాసయతేప్రాజ్ఞం బాలలీలోపమాముహుః. 36

ఉన్మత్తుని చేష్టవంటిదియు, బాలక్రీడాసదృశమును, పౌనఃపున్య మొనర్పబడునదియు నగు నీ క్రియాసరంపర ప్రాజ్ఞునకు హాస్యాస్పదమేయగును.

కృతమాప్యనయానిత్యం క్రియయాకృతకార్యయా
కోఽర్థఃస్యాత్తాదృశోయేన పునఃకర్మనవిద్యతే. 37

నిరంతరమీక్రియలను సఫలతాపూర్వకముగ నెఱవేర్చినను కర్మరాహిత్యముగు కృతకృత్యత్వము సంభవింపనందువ నానిచే నికయేమి ప్రయోజనము?

కియన్తమథవాకాల మిదమాడంబరంమహత్
ఇహాస్మాభిరనుష్ఠేయం కింతేనసత్సమవాప్యతే. 38

లేక యీప్రపంచమున దృష్టాదృష్టరూపమగు నీకర్మసమూహమింకెంత కాలము చరింపవలసియుండును? ఎపుడియ్యది సమాప్తముకాగలదు?

అనన్తేయంశిశుక్రీడా వస్తుశూన్యైవవస్తుతః
ఆవృత్త్యాక్రియతేవ్యర్థ మనర్థప్రసరార్థిభిః. 39

యథార్థముగ వస్తుశూన్యమును, విశాలమునగు యీ బాలక్రీడవంటియు దుఃఖార్థమే జీవులు మాటిమాటికి వ్యర్థముగ నొనర్చుచున్నారు.

ఫలమేకంమహోదారం నేహపశ్యామికించన
కార్యమస్తీతరత్ప్రాప్తే యస్మిన్నామ నకించన. 40

దేనిని పొందిన పిదప కర్తవ్యమేమియు మిగిలియుండదో అట్టియుత్తమ పురుషార్థము నే నెచటను గాంచుటలేదు.

భోగాద్యతేకిమన్యత్స్యాత్తద్భవ్యమవినాశియత్
ఏవంసంచిన్తయామ్యాశు దధ్యామత్వేత్యసౌబలిః. 41

'తుచ్ఛమగు విషయసుఖముకంటె నన్యమగు నిత్యసుఖమెద్దేని గలదా విచారించెద'యని నిశ్చయించి బలిచక్రవర్తి యంతశీఘ్రముగ ధ్యానస్థుఁడయ్యె.

అథాభ్యనాచాసురరాడాః సంస్మృతమితితక్షణాత్
స్వాత్మన్యేవమనస్యర్థం సభ్రూభంగంవిమర్శయన్. 42

తదుపరి (ధ్యానానంతరము) దానవులప్రభువగు నా బలిచక్రవర్తి కనుబొమ్మల విశాల మొనర్చి యాలోచించుచుండ నంతక్షణములో పూర్వకాలిక సంస్కారోద్బోధముచే తానిదివఱకు వినిన యర్థము స్మృతిపథమునరాఁగా 'ఆహా! జ్ఞప్తికి వచ్చినద'ని యాతఁడు బల్కెను.

పురాకిలేహ భగవాన్పృష్టోఽభూత్సవిరోచనః
పితామయాత్మతత్త్వజ్ఞో దృష్టలోకపరావరః. 43
యథాసకలదుఃఖానాం సుఖానాంచమహామతే
యత్రసర్వేభ్రమాఃశాన్తాః కోసావసీమాన్తఉచ్యతే. 44
క్వోపశాన్తోమనోమోహః క్వాతీతాఃసకలైషణాః
విరామరహితంకుత్ర తాత విశ్రమణంచిరమ్. 45
కింప్రాప్తేహ సమస్తేభ్యః ప్రాప్యేఽస్మింస్తృప్తిమాన్పుమాన్
కిందృష్ట్వాదర్శనంభూయో నతాతోపకరోత్యలమ్. 46
అత్యన్తబహవోఽప్యేతే భోగాహీనసుఖావహాః
క్షోభయన్తిమనోమోహే పాతయన్తిసతామపి. 47
తత్తాతావిహతానన్దసుందరంకించిదేవమే
తాదృక్కథయయత్రస్థశ్చిరం విశ్రాన్తిమేమ్యహమ్. 48
ఇత్యాకర్ణ్యపురా నిశాకరకరస్పర్ధాలుగుచ్ఛస్థల
త్పుష్పాపూరకృతావగుణ్ఠనపదస్యోక్తం తతేతేనమే
మిత్రాత్స్వర్గహృతస్య సాగరతరోః సంకోపితస్యాజిరే
స్ఫారాకారరసాయనాసనసమం సంమోహశాన్త్యైనచః. 49

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే విరోచనస్మరణంనామ ద్వావింశః
సర్గః ॥ 22 ॥



అపుడు బలిచక్రవర్తి తన మనంబున యిట్లు చింతించెను—ఇహపరలోకజ్ఞుఁడును తత్త్వవేత్తయు మహాత్ముఁడునగు మజ్జనకుఁడైన విరోచనుని పూర్వము నేనిట్లడిగితిని. ఓమహామతీ! సర్వదుఃఖ వినాశమున్ను, విషయసుఖప్రాప్తి కసాధ్యభూతములగు సర్వవ్యవహారభ్రమల ప్రశమనమున్ను గల్గునట్టి సంసారావధియెద్ది? మనోమోహ మెచట సమించును? కోర్కెలన్నియు యెచట నంతరించును? దుఃఖరహితమగు పూర్ణవిశ్రాంతి సర్వదా మనంబున కెచట లభ్యమగును? ఎద్దానిని పొందిన మనుజుఁడిక బ్రహ్మలోకపర్యంతముగల సమస్తవిషయములను పొందినవాఁడగును? దేనిని దర్శించుటచే మఱల యితర దర్శనములెవ్వియు నుపకారకములు గా నేరవు? దేవా! అనేకములై యున్నను యీ సాంసారిక భోగములు సుఖప్రదములుగావు. పైగనవి సజ్జనుల మనంబును గూడ మోహపెట్టి విక్షోభితమొనర్చి పతనమొందించును. ఇక్కారణమున స్వాభావికముగ ఆనందదాయకమగు యుత్తమపదార్థమెయ్యదిగలదో నాకు వచింపుము. అద్దానియందు స్థితిఁబొంది నేను చిరకాలము విశ్రాంతి బడసెద! చంద్రకిరణములఁగూడ నిర్జించు పుష్పఫలగుచ్ఛంబులచే పరివేష్టితమగు మూలభాగము గలదియు, స్వర్గమునుండి బలాత్కారముగ తేబడి స్వగృహాంగణమున నెలకొల్పబడినదియునగు కల్పవృక్షముక్రింద యాసీనుడైయున్న మజ్జనకుఁడా నాప్రశ్న నాలించి, కల్పవృక్షపుష్పరసములవలె సుగంధితములును, మధురములును, అమృతతుల్యములును జరామరణనివారకములునైన యుత్తమ వచనంబులవేటిని నామనోమోహశాంతికై వచించియుండెనో వాటిని నేనిపుడు స్మరించుచున్నాను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమ ప్రకరణమున
విరోచనవాక్యస్మరణమను ద్వావింశ
సర్గము ॥ 22 ॥

---

## త్రయోవింశః సర్గః.

---

విరోచన ఉవాచ :—

అస్తిపుత్రాతివితతో దేశేవిపులకోటరః
త్రైలోక్యానాంసహస్రాణి యత్రమాన్తిబహూన్యపి. 1
యత్రనామ్బుదయోనాపి సాగరానా నచాద్రయః
నవనానినతీర్థాని ననద్యోనసరాంసిచ. 2
నమహీనాపిచాకాశం నవాయుర్నపవనాదయః
నచంద్రార్కానలోకేశా నదేవానచదానవాః. 3
నభూతయక్షరక్షాంసి నగుల్మానవనశ్రియః
నకాష్ఠతృణభూతాని స్థావరాణిచరాణిచ. 4
నాపోనజ్వలనోనాశా నోర్ధ్వంనాధోనవిష్టపమ్
నలోకో నాతపోనాహం నహరీంద్రహరాదయః. 5

విరోచనుడు.—కుమారా! వేలకొలది త్రిలోకములుగూడ పట్టునంతటి అతివిశాలమైన దేశ మొండుగలదు. అచట సముద్రములుగాని, పర్వతములుగాని, వనములుగాని, తీర్థములుగాని, నదులుగాని, చెఱువులుగాని, భూమిగాని, ఆకాశముగాని, అంతరిక్షముగాని, వాయువుగాని, చంద్రుడుగాని, సూర్యుడుగాని, లోకేశులగు యింద్రాదులుగాని, విష్ణుమహేశ్వరాదులుగాని, దేవదానవులుగాని, భూతయక్షరాక్షసాదులుగాని, లతావనంబులుగాని, తృణకాష్ఠములుగాని, చరాచర ప్రాణికోట్లుగాని, జలముగాని, అగ్నిగాని, ఆశగాని, ఊర్ధ్వాధోదిశలుగాని, స్వర్గలోకాదులుగాని, హిమాతపములుగాని యెవ్వియును లేవు.

ఏక ఏవాస్మిన్సుమహాం స్తత్రరాజా మహాద్యుతిః
సర్వకృత్సర్వగః సర్వః సచతూష్ణీంవ్యవస్థితః. 6

అచట గొప్పమహనీయుఁడును, మహాప్రకాశశీలుడును, సర్వకర్తయు, సర్వవ్యాపియు, సర్వరూపుడునగు రాజొకడు (ఆత్మ) గలడు.

తేనసంకల్పితోమన్త్రి సర్వసన్మన్త్రిణోన్ముఖః
అఘటంఘటయత్యాశు ఘటంవిఘటయత్యలమ్. 7

ఆ రాజుయొక్క సంకల్పముచే కల్పింపబడిన మంత్రి (మనస్సు) వాని మంత్రణకార్యమొనర్ప సదా సంసిద్ధుడైయుండును. మఱియు నాతడు ఘటింపని దానిని (ఆత్మయొక్క సంసారిత్వమును) ఘటిల్లజేయును, ఘటించుదానిని (ఆత్మయొక్క పూర్ణానందత్వమును) విఘటితమొనర్చును.

భోక్తుంనకించిచ్ఛక్నోతి నచజానాతికించన
రాజార్థం కేవలంసర్వం కరోత్యజ్ఞోఽపిసన్సదా. 8

ఆ మంత్రి దేనిని యనుభవింపజాలడు; యేమియు నెఱుంగడు అజ్ఞుడైనను రాజార్థమెల్లపుడు నాతడు కార్యమొనర్చుచునే యుండును.

సఏవసర్వకార్యైక కర్తాతస్యమహీపతేః
రాజా కేవలమేకాన్తే స్వస్థఏవావతిష్ఠతే. 9

రాజుయొక్క కార్యములన్నింటిని ఆ మంత్రియే నిర్వహించును. రాజు కేవలమేకాంతమున స్వస్థచిత్తుడైయుండును.

బలి రువాచ :—

ఆధివ్యాధివినిర్ముక్తః కఃసదేశోమహామతే
కథమాసాద్యతేచాపి కేనవాధిగతఃప్రభో. 10

కఃసతాదృగ్విధోమన్త్రీ రాజాచాపిమహాబలః
హేలాలూనజగజ్జాలైర్యోఽస్మాభిరపినోజితః. 11

అపూర్వమేతదాఖ్యానం మమామరభయప్రద
కథయాపనయాస్మాకం హృద్వ్యోమ్నఃసంశయాంబుదమ్. 12



బలి:—ఓ మహామతీ! శారీరక మానసిక బాధావినిర్ముక్తమగు నా దేశంబెయ్యది? అయ్యదెట్లు ప్రాప్తించును? ఎవరద్దానినిపొందిరి? ఆ మంత్రియెవరు? లీలామాత్రమున జగత్సమూహములన్నింటిని జయింపగల్గు మనచేగూడ వినిర్జితుఁడుగాని మహాబలశాలియగు నా రాజెవడు? దేవతలకును భయప్రదుఁడనగు నో మహాత్మా! అపూర్వమగు యీగాథ నాకెఱింగించి నాహృదయాకాశమునుండి సంశయరూప మేఘమును తొలఁగింపవేడెద.

విరోచన ఉవాచ :—

సతత్రమన్త్రిబలవా న్దేవాసురగణైః సుతః
సమేతైర్లక్షగుణితైరపి నాక్రమ్య తేమనాక్. 13

నాసౌసహస్రనయనో నయమోనధనేశ్వరః
నామరో నాసురోవాపి యదిపుత్రకజీయతే. 14

తత్రాసిముసలప్రాస వజ్రచక్రగదాదయః
హేతయఃకుంఠతాంయాన్తి దృషదీవోత్పలాహతిః. 15

గమ్యోఽసౌనాస్త్రశస్త్రాణాం నభటోద్భవకర్మణామ్
తేనదేవాసురాః సర్వేసర్వదైవవశీకృతాః. 16

విరోచనుడు:—కుమారా! ఇప్పటి యీ దేవాసుర సమూహమునకు లక్షగుణముగ నధికమగు సైన్యమేతెంచినను మహాబలిష్ఠుఁడగు నా మంత్రిని (మనస్సును) జయింపజాలరు. ఈ యింద్రుడుగాని, యముడుగాని, కుబేరుడుగాని, దేవాసురులలో నెవడుగాని వానిని జయింప శక్యులుగారు. శిలపై కమలప్రహారమువలె ఖడ్గ, వజ్ర, గదా, చక్రాది శస్త్రాస్త్రములన్నియు వాని సమీపమున కుంఠితములైపోవును. (మనోరూపుడగు) ఈ మంత్రి శస్త్రాస్త్రములకుగాని, వీరుల పరాక్రమునకుగాని వివశయుఁడుగానేరడు. ఇక్కారణమున నాతడు దేవాసురులఁగూడ తనవశమొనర్చుకొనెను.

అవిష్ణునాపి తేనేహ హిరణ్యాక్షాదయోఽసురాః
పతితాఃకల్పవాతేన మేరుకల్పద్రుమాఇవ. 17

నారాయణాదయోదేవా అపిసర్వావబోధినః
తేనాక్రమ్యయథాకామ మవటేష్వనివేశితాః. 18

తత్ప్రసాదేనసాటోపం పంచమాత్రశరఃస్మరః
త్రైలోక్యమిదమాక్రమ్య సమాక్రీడవివల్గతి. 19

సురాసురౌఘగృహ్యోఽపి గుణహీనోఽపిదుర్మతిః
దురాకృతిరపిక్రోధ స్తత్ప్రసాదేనజృంభతే. 20

దేవాసురసహస్రాణాం సంగరోయఃపునఃపునః
తదేతత్క్రీడనం తస్య మన్త్రిణో మన్త్రశాలినః. 21

విష్ణువు గాకున్నను యాతడు హిరణ్యాక్షుఁడాదిగాగల యసురులను, ప్రళయవాయువు సుమేరుపర్వత కల్పవృక్షములఁ బడద్రోయులాగున వినాశమొనర్చెను. సర్వులకు జ్ఞానోపదేశము చేయునట్టి నారాయణాది దేవతలఁగూడ తన వశమొనర్చుకొని గర్భగర్తమున వారలఁ బడవైచెను.

వాని ప్రతాపముచేతనే మన్మథుడు గర్వముతో తన పంచబాణములచే త్రిలోకంబుల నాక్రమించి సమ్రాట్టువలె విజృంభించుచున్నాడు. సురాసుర సమూహంబుల వివశ మొనర్చునదియు, గుణహీనమును, దుర్మతియు, దురాచారయుతమునగు క్రోధము వాని ప్రతాపముచేతనే వికాసమునొందుచున్నది. పెక్కుమారులు మాటిమాటికి జరుగు దేవాసురుల సంగ్రామము మంత్రకుశలుఁడగు యామంత్రి యొక్క క్రీడామాత్రమే యగును.

సమస్తి కేవలం పుత్ర తేనైవ ప్రభుణా యది
జీయతే తత్సు జేయోఽసావన్యథా త్వచలోపమః. 22

కుమారా! ప్రభువు (ఆత్మ) చే జయింపబడిన నిక యాతడు సులభముగ జయింప సాధ్యుడగును. లేనిచో పర్వతమువలె యచంచలుడై యుండును.

తస్యైవ తత్ప్రభోః కాలే జేతుం తం మస్త్రిణం నిజమ్
ఇచ్ఛా సంజాయతే తేన జీయతేఽసావయత్నతః. 23

సుకృత పరిపాకముచే వివేకముదయింప కాలక్రమమున నా ప్రభువునకు మంత్రిని జయింప కోర్కె జనించును. అపుడప్రయత్నముగనే వాని నాతడు జయించినవాడగును.

త్రైలోక్యబలినాం మల్ల ముచ్ఛ్వాసితజగత్త్రయమ్
జేతుం చేదస్తి తే శక్తి స్తత్పరాక్రమవానసి. 24

పుత్రా! ముల్లోకములందలి బలిష్ఠులందఱికంటె మిగులబలిష్ఠమై, త్రిలోకంబుల మృతప్రాయ మొనర్చునట్టి యీ మనస్సను మంత్రిని జయింపశక్తి గల్గియున్నచో నీవు పరాక్రమవంతుడవే యగుదువు.

తస్మిన్నభ్యుదితే సూర్యే త్రైలోక్యకమలాకరాః
ఇమే వికాసమాయాన్తి విలీయన్తేఽస్తమాగతే. 25

ఆ మంత్రియను సూర్యుఁడుదయింప, ముల్లోకములను కమలసమూహము వికాసము నొందును. అతడస్తమింప నవియు వినాశ మొందును.

తమేవమేకయా బుద్ధ్యా వ్యామోహపరిహీనయా
యది జేతుం సమర్థోఽసి ధీర స్తదసి సువ్రత. 26

సువ్రతుఁడవగు నో కుమారా! అజ్ఞానమును బారద్రోలి యేకాగ్రచిత్తుఁడవై యామంత్రిని జయింపగల్గుచో నీవు ధీరుఁడవే యగుదువు.

తస్మిఞ్జితే జితా లోకా భవిష్యన్త్యజితా అపి
అజితే త్వజితా ఏతే చిరకాలజితా అపి. 27

అతడు జయింపబడిన నిక జయింపబడని లోకములున్ను జయింపబడినవే యగును; జయింపబడనిచో చిరకాలము జయించినలోకములున్ను జయింపబడనివే యగును.

తస్మాదనన్తసిద్ధ్యర్థం శాశ్వతాయ సుఖాయ చ
తజ్జయే యత్నమాతిష్ఠ కష్టయాపీహ చేష్టయా. 28



కాన యనంతసిద్ధి (ఆత్మప్రాప్తి) కొఱకును, నిత్యసుఖప్రాప్తి నిమిత్తమును, వానిఁ జయించుటయందెట్టి కష్టముల (సర్వత్యాగాదుల) కైన సంసిద్ధుడవై ప్రయత్నమాచరింపుము.

ససురదనుజనాగ యక్షసంఘం
సనరమహోరగ కిన్నరం సమేతమ్
త్రిజగదపి వశీకృతం సమన్తా
దతిబలినా నను హేలయైవ తేన. 29

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే విరోచనవచనం నామ త్రయో
వింశః సర్గః ॥ 23 ॥

మిగులబలశాలియగు నామంత్రి, సురాసుర, నాగ, యక్ష, నర, మహోరగ, కిన్నరసహితమగు ముల్లోకంబుల గూడ తనవశ మొనర్చుకొనెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
విరోచనవచనమను త్రయోవింశ
సర్గము ॥ 23 ॥

---

## చతుర్వింశః సర్గః.

---

బలిరువాచ :—

కేనోపాయేన బలవా న్స తాత పరిజీయతే
కోఽసావతిమహావీర్యః సర్వం ప్రకథయాశు మే. 1

బలిచక్రవర్తి:—మహాత్మా! ఏయుపాయముచే మిగుల బలశాలియగు నాతడు (మనస్సను మంత్రి) జయింపబడును? మఱియు నా మహాపరాక్రమశీలుఁడెవడు? ఇవ్విషయమంతయు సత్వరము వచింపవేదేవ.

విరోచన ఉవాచ :—

మస్త్రిణ స్తస్య తనయ సిత్యాజేయస్థితేరపి
శృణు వచ్మి సుసాధత్వం యేనాసౌ పరిజీయతే. 2

విరోచనుడు:—కుమారా! ఆమంత్రి అజేయుఁడైనను సులభముగ వానిఁ జయించు నుపాయము వచించుచున్నాను, వినుము.

పుత్ర యుక్త్యా గృహీతోఽసౌ క్షణాదాయాతి వశ్యతామ్
యుక్తిం వినా దహత్యేష ఆశీవిష ఇవోద్ధతః. 3

యుక్తిచే నాతడు క్షణములో వశీకృతుడగును. కాని యుక్త్యాభావముచే క్రుద్ధసర్పము వోలె పరుల భస్మీభూత మొనర్చును.

బాలవల్లాలయిత్వైనం యుక్త్యాసియమయ స్థియో
రాజానంతంసమాలోక్య పదమాసాదయస్తితే. 4

బాలునివలె లాలించి యుక్తిచే వానిని తమవశ మొనర్చుకొనువారు యాపిమ్మట రాజును సందర్శించి వాని దివ్యపదమును పొందుదురు.

దృష్టేతస్మిన్మహీపాలే సమన్త్రీ వశమేతిచ
తస్మింశ్చమన్త్రిణ్యాక్రాన్తే సరాజాదృశ్యతేపునః. 5

రాజ (ఆత్మ) దర్శనమైనచో మంత్రి వశీభూతుడగును. మంత్రి వశపడినచో రాజ దర్శనమగును.

యావన్నదృష్టోరాజాసౌ తావన్మన్త్రీనజీయతే
మన్త్రీచయావన్న జితస్తావద్రాజానదృశ్యతే. 6

రాజదర్శనము గానంతవఱకు నామంత్రి జయింపబడడు. మంత్రిని జయింపనంతవఱకు నారాజు గాన్పింపబడడు.

రాజన్యదృష్టేదుర్మన్త్రీ సదుఃఖాయఫలత్యతి
మన్త్రిణ్యనిర్జితేరాజా సోఽత్యన్తం యాత్యదృశ్యతామ్.

ఏలనిన, రాజదర్శనము గానిచో నా దుష్టమంత్రి రాగద్వేషాది దుష్ఫలముల నే గలుగ జేయువాడను. మంత్రి జయింపబడనిచో నా రాజు గన్పింపకయే యుండును.

అభ్యాసేనోభయం తస్మాత్సమమేవసమారభేత్
రాజసందర్శనం తస్య మన్త్రిణశ్చపరాజయమ్. 8

ఇక్కారణమున నభ్యాసముచే రాజదర్శన మంత్రిపరాజయముల రెంటిని బుద్ధిమంతుడొకేసారి ప్రారంభింపవలెను.

పౌరుషేణప్రయత్నేన స్వభ్యాసేనశనైః శనైః
ద్వయంసంపాద్యయత్నేన దేశమాప్నోషితంశుభం. 9

పురుషప్రయత్నముచే అభ్యాసముద్వారా క్రమముగ రాజదర్శన మంత్రిపరాజయముల రెంటిని యొకేతూరి యొనర్చిన శుభపదమగు ఆత్మపదమును నీవు పొందగలవు.

త్వమభ్యాసేఫలీభూతే తందేశమభిగచ్ఛసి
యదిదైత్యేన్ద్రితమ్యాభయో మనాగపినశోచసి. 10

ఓ దానవేంద్రా! అభ్యాసము ఫలీభూతమైనచో మఱియెన్నటికి లేశమైనను దుఃఖము [illegible] యుత్తమస్థానమును నీవు పొందగలవు.

సంశాన్తసకలాయాసా నిత్యప్రముదితాశయాః
సాధవస్తత్ర తిష్ఠన్తి ప్రశాన్తాశేషసంశయాః. 11

సంసార [illegible] యంతయు నశించినవారును, నిత్యము వికసితాంతఃకరణము గల్గియుండు [illegible] సంశయ [illegible] నశించినవారగు మహాత్ములట్టి యుత్తమస్థానము నలంకరించుదురు.



శృణుకఃపుత్రదేశోఽసౌ సర్వంప్రకటయామి తే
యేనాప్యున్నయోక్తస్తే మోక్షఃసకలదుఃఖహా. 12

వినాశకర కుమారా! ఆదేశ మెద్దియో వచించెద నాలింపుము. నీకు వచించిన యాదేశ [illegible] సర్వదుఃఖ వినాశకమగు మోక్షమే యగును.

రాజాత్రతత్ర భగవానాత్మా సర్వపదాతిగః
తేనమన్త్రీకృతః ప్రాజ్ఞో మనోనామమహామతే. 13

ఓ మహామతీ! మనుష్యానందము మొదలు బ్రహ్మదేవునియానందము వఱకుగల యానంద [illegible] నధిష్ఠించిన సర్వమైనట్టి నిరతిశయానందరూపముగు (లేక ఇంద్రియముల కవిషయమగు) [illegible] రాజు. మిగుల ప్రజ్ఞావంతుడైన మనస్సు నాతడు తన మంత్రిగనొనర్చుకొనెను.

మనోనిష్పతవ్యూహ విశ్వమిదంపరిణతింగతమ్
ఘటత్వేనేవ మృత్పిండో ధూమోఽంబుదతయైవచ. 14

మృత్తిక ఘటరూపమునను, ధూమము మేఘరూపమునను పరిణతిజెందునట్లు మనంబు [illegible] సూక్ష్మవాసనలే యీ జగదాకారముగ పరిణమించుచున్నవి.

తస్మిఞ్జితేజితంసర్వం సర్వమాసాదితంభవేత్
దుర్జయంతద్విజానీయా ద్యుక్త్యైవ పరిజీయతే. 15

ఆమనస్సను మంత్రి జయింపబడినచో సర్వము జయింపబడినట్లే యగును; మఱియు [illegible] సంప్రాప్తించినదే యగును. ఆతడు దుర్జయుడు. కేవలము యుక్తిచేతనే యాతడు జయింపబడును.

బలిరువాచ :—

యాయుక్తిర్భగవంస్తస్య చిత్తస్యాక్రమణేస్ఫుటమ్
తాంమేకథయ తత్త్వావ ద్యథాజేష్యామిదారుణమ్. 16

బలిచక్రవర్తి:—మహాత్మా! ఏ యుక్తిచే చిత్తము జయింపబడునో దానిని ముందుగ నాకు వచింపవేడెద. అదివిని భీకరమగు నాశత్రువును జయించెద

విరోచన ఉవాచ :—

విషయాన్ప్రతిభోః పుత్ర సర్వానేవహిసర్వథా
అనాస్థాపరమాహ్యేషా సాయుక్తిర్మనసోజయే. 17

విరోచనుడు:—కుమారా! విషయభోగములన్నింటియందును కోర్కె సంపూర్ణ [illegible] పరచేయుటయే మనోజయంబున కుపాయము.

ఏషైవపరమా యుక్తి రనయైవమహామదః
స్వమనోమత్తమాతంగో ద్రాగిత్యేవావదమ్యతే. 18

ఇదియే (విషయములయెడ కోర్కె లేకుండుటయే) ఉత్తమమైనయుక్తి. దీనిచే మ [illegible] గజంబునుబోలిన మనస్సు శీఘ్రముగ వశమొనర్పబడును.

ఏషాహ్యత్యన్తదుష్ప్రాపా సుప్రాపా చ మహామతే
అనభ్యస్తాతిదుష్ప్రాపా స్వభ్యస్తా ప్రాప్యతే సుఖమ్. 19

ఓ మహామతీ! ఈ యుక్తి దుష్ప్రాప్యమును, సుప్రాప్యముగూడనగును. అభ్యాసమొనర్పనిచో దుష్ప్రాప్యమును, అభ్యాసమొనర్చిన సుప్రాప్యమునగును.

క్రమాదభ్యస్యమానైషా విషయారతిరాత్మజ
సర్వతఃస్ఫుటతామేతి సేకసిక్తా లతా యథా. 20

కుమారా! క్రమముగ నభ్యసింపబడినచో నీ విషయవిరక్తి జలసేకితలతవోలె యంతట వ్యాపించి విస్తృతరూపమును బడయును.

నాసాద్యతే హ్యనభ్యస్తా కాఙ్క్షితాపి శతాత్మనా
పుత్ర శాలిరివావ్యుప్తా తస్మాదేనాం సమాహర. 21

పుత్రా! విత్తనము నాటనిచో ధాన్యము ఫలింపనట్లు భోగాసక్తుఁ డిద్దానినిచ్ఛగించినను అభ్యాసాభావముచే నది వానికి లభింపకుండును. కాన నభ్యాసముచే యిద్దానిని నీయందు స్థిరమొనర్చుకొనుము.

తావద్భ్రమన్తి దుఃఖేషు సంసారావటవాసినః
విరతిం విషయేష్వేతే యావన్నాయాన్తి దేహినః. 22

సాంసారిక విషయములందు విరక్తిజెందనంతవఱకు జీవులీ సంసారగర్తముననే వసించుచు దుఃఖములఁ బరిభ్రమించుచుందురు.

అభ్యాసేన వినా కశ్చిన్నాప్నోతి విషయారతిమ్
అప్యత్యన్తబలో దేహీ దేశాన్తరమివాగతిః. 23

మిగుల బలవంతుఁడైనను మనుజుడు తాను స్వయముగ నడువనిచో దేశాంతరమును బొందజాలనట్లు అభ్యాసమొనర్పకున్నచో విషయవిరక్తి నెవరును బొందజాలరు.

ధ్యేయత్యాగమతోఽజస్రం ధ్యాయతా దేహధారిణా
భోగేష్వరతిరభ్యాసాద్వృద్ధిం నేయా లతా యథా. 24

కాన దేహధారియగు ప్రతిజీవుడును ధ్యేయవాసనాత్యాగమునే నిరంతర మభిలషించుచు సేకితలతవోలె భోగములయెడ విరక్తి నభివృద్ధిపఱచవలెను.

పురుషార్థాదృతే పుత్ర నేహ సంప్రాప్యతే శుభమ్
క్రియాఫలం పరిప్రాప్తుం హర్షామర్షవివర్జితమ్. 25

కుమారా! హర్షామర్ష (క్రోధ) విరహితమగు యుత్తమక్రియాఫలము నొందుటయందు తన పురుషప్రయత్నమున కన్యమగు మఱియొక శుభసాధనమెద్దియును జీవునకులేదు.

దైవమిత్యుచ్యతే లోకే న దైవం దేహవత్క్వచిత్
అవశ్యంభవితవ్యాఖ్యా స్వేహయా నియతిశ్చ యా. 26
ఉచ్యతే దైవశబ్దేన సా నరైరేవ నేతరైః
యద్యస్యేహ హి గుదాయత్ర సంపన్నం సమతాం గతమ్. 27



హర్షామర్షవినాశాయ తద్దైవమితి కథ్యతే
దైవం నియతిరూపం చ పౌరుషేణోపజీయతే. 28
సమ్యగ్జ్ఞానవిలాసేన మృగతృష్ణాభ్రమో యథా
యథా సంకల్ప్యతే యద్యత్ పౌరుషేణ తథైవ తత్. 29
ఫలవత్తాగ్రహీతత్వే ఫలవత్తాసుఖప్రదమ్
కర్తా నో మనసైవేహ యత్కల్పయతి తత్తథా 30
నియతిం యామ్యశీమేతత్సంకల్పయతి సా తథా
నియతానియతాన్కాంశ్చిత్పదార్థాననియతానపి. 31

నియతి ప్రేరితమగు స్వకీయ శుభాశుభకర్మమే ప్రారబ్ధమని సామాన్యజనులు బల్కుదురు గాని శాస్త్రదృష్టిగలవారు గారు. అయితే ప్రయత్నములేకనే ప్రారబ్ధముచే హర్షామర్షముల కుపశమనము కొందఱియందు గాంచుచున్నదేయనిన, హర్షామర్షములకు నిమిత్తభూతమగు పూర్వకర్మను క్షయింప, అట్టి హర్షామర్షముల వినాశార్థము సంప్రాప్తమగు కర్మయే ప్రారబ్ధమని శాస్త్రజ్ఞులమతము. మరుభూమియొక్క యథార్థజ్ఞానముచే మృగతృష్ణాభ్రమ నశించునట్లు, నియతిరూపమగు నట్టిప్రారబ్ధము పౌరుషప్రయత్నముచే జయింపబడును. మఱియు కర్తయగుజీవుడు మనస్సుచేతనే నిశ్చయము. ఆమనస్స్వభావమున దేనిని కల్పనజేయునో, దాని నవ్విధముగనే పొందుచుండును. నియతినిగూర్చి తాను చేయు కల్పననుసరించి యొకప్పుడు నియతపదార్థములను, మఱియొకప్పు డనియతపదార్థములను గాంచుచుండును.

కరోతి చిత్తం తేనైత చ్చిత్తం నియతియోజకమ్
నియత్యా నియతిం కుర్వన్కదాచిత్స్వార్థనామికామ్. 32
స్ఫురత్యప్రజ్ఞగతో కోశే జీవో వ్యోమ్నీవ మారుతః
నియత్యా విహితం కుర్వన్కదాచిన్నియతిం చరః. 23
సంజ్ఞార్థం సాక్షినియతి శబ్దఃస్ఫురతి సానువత్
తస్మాద్యావన్మనస్తావన్న దైవం నియతిర్న చ. 34

ఇట్లు చిత్తము స్వసంకల్పానుసారము నియతినిగూడ యుత్పన్నమొనర్చునదగును. ఇక్కారణమున నిత్యమును, నియతరూపమును, ఏకస్వభావయుతమునగు పరమాత్మయందు చిద్రూపుఁడగు జీవుడు మోక్షాధికార జన్మమున యొకపుడు సాక్షిచైతన్య సాక్షాత్కారమును (సమాధియను) నియతిని యొనర్చుచు చిదాకాశమున వాయువువలె సంగరహితమై తన చిత్స్వభావమున స్ఫురించును. మఱియొకపుడు సమాధివ్యుత్థాన కాలమున శాస్త్రనియతిచే విహితమగు స్వస్వవర్ణాశ్రమోచిత కర్మలఁ గావించుచు అజ్ఞుల ప్రబోధార్థము శిష్టాచారాదులఁ బ్రవర్తింపజేయుచు, ఇవ్విధమున, స్వయముగ నచలమైనను వాయువేగముచే వృక్షములు చలించుచుండ తానును చలించుచున్నట్లు గన్పట్టు పర్వతశిలవలె లోకమున సుప్రసిద్ధమగు నియతిరూపమునను సమాధి నిష్ఠలందు స్థిరసమాధియుతముగను నుండును. కాన మనస్సు జయింపబడనంతవఱకు నియతిగాని ప్రారబ్ధముగాని జయింపబడదు.

మనస్యస్తంగతేసాధో యన్భవత్యస్తుతత్తథా
జీవోహిపురుషోజాతః పౌరుషేణసయద్యథా. 35
సంకల్పయతిలోకేఽస్మిం స్తత్తథాతస్యనాన్యథా
పురుషార్థాదృతేపుత్ర నకించిదిహవిద్యతే. 36

సాధుపుంగవా! మనస్సుయొక్క యథార్థ (చేతన) రూపమునట్లనే యుండనిమ్ము. మానవజన్మనెత్తి కర్మజ్ఞానాధికారశరీరముబడసిన జీవుడెట్టిలోకమున సంకల్పముగావించునో, అట్లనే దానిని పొందుచుండును గాన, తన యధీనమునన్న సంకల్పముచే వైరాగ్యాది పురుష ప్రయత్నముల ద్వారా బ్రహ్మభావమునుగూర్చియే చింతనచేయవలెను. ఏలన, పురుషార్థముదప్ప యీలోకమున మఱెద్దియును లేదుగదా.

పరంపౌరుషమాశ్రిత్య భోగేష్వరతిమాహరేత్
నభోగేష్వరతిర్యావ జ్జాయతేభవనాశనీ. 37
నతావన్నిర్వృతిస్తావ త్ప్రాప్యతే జయదాయినీ
విషయేష్వరతిర్యావ త్క్షీణాసంమోహకారిణీ. 38
తావద్భవదశాదోలా విలోలాన్దోలనస్థితిః
అభ్యాసేన వినాపుత్ర నకదాచనదుఃఖదా. 39
భోగభోగిభరప్రోతా కదాశావినివర్తతే. 40

పరమపురుషార్థము నాశ్రయించి భోగములందు విరక్తినొనగూర్చుకొనవలెను. భవనాశకరంబగు విషయవిరక్తి గలుగనంతవఱకు దివ్యమగు పరమశాంతి లభింపదు. మఱియు మోహహేతువులగు విషయములందనురాగము గల్గియున్నంతవఱకు చంచలభోగములను సర్పముల బాధగల్గి దుఃఖదాయకమైన యీ సంసారస్థితి శ్రవణ మనన నిధిధ్యాస సమాధిరూపమగు అభ్యాసములేనిచో యెన్నటికిని తొలగనేరదు.

బలిరువాచ :—

భోగేష్వరతిరేవాన్తః కథంసర్వాసురేశ్వర
స్థితిమాయాతుజీవస్య దీర్ఘజీవితదాయినీ. 41

బలిచక్రవర్తి :—దానవేశ్వరా! నిరంతరమాత్మయందు స్థితిఁగల్గజేయునట్టిదగు విషయవిరక్తి మనుజుని కెట్లు సిద్ధించును? అయ్యది వానియందెట్లు స్థిరత్వముఁజెందును?

విరోచన ఉవాచ :—

ఆత్మావలోకనలతా ఫలినీఫలతిస్ఫుటమ్
జీవస్యభోగేష్వరతిం శరదీవమహాలతా. 42

విరోచనుడు:—కుమారా! ఆత్మసందర్శనమను లత మోక్షఫలమును ప్రసాదించునదై శరద్రుతువందలి ద్రాక్షలతాదులవలె విషయవిరక్తి యను ఫలమును గల్గజేయును.

ఆత్మావలోకనేనైషా విషయారతిరుత్తమా
హృదయేస్థితిమాయాతి శ్రీరివాంభోజకోటరే. 43



ఆత్మదర్శనముచే నీవిషయవిరక్తి కమలవనమందు లక్ష్మివోలె హృదయమున సుప్రతిష్ఠితమగును.

తస్మాత్ప్రజ్ఞానికాషేణ విచారేణాతిచారుణా
దేవమాలోకయద్భోగా ద్రతించావహరేత్సమమ్. 44

ఇక్కారణమున ప్రజ్ఞయను వరిపిడిరాతితో గూడుకొని ఉత్తమ విచారముచే ఆత్మదర్శనమొనర్చి తత్కాలముననే భోగములందలి ప్రీతినిగూడ త్యజించుచుండవలెను.

చిత్తస్యభోగైర్ద్వౌభాగౌ శాస్త్రేణైకంప్రపూరయేత్
గురుశుశ్రూషయాచైక మవ్యుత్పన్నస్యసత్క్రమే. 45

దినమునువలె చిత్తమును రెండుభాగములుగచేసి యందొకభాగమును శరీరనిర్వహణమునకు వలసిన యుపభోగములతోను మఱియొకదానిని శాస్త్రశ్రవణముచేతను పూరింపవలెను. లేక అపరిశుద్ధచిత్తముయొక్క ఒకభాగమును గురుశుశ్రూషాదియుక్తమగు సన్మార్గమందైనను నియోగింపవలెను.

కించిద్వ్యుత్పత్తియుక్తస్య భాగంభోగైఃప్రపూరయేత్
గురుశుశ్రూషయాభాగౌ భాగంశాస్త్రార్థచిన్తయా. 46

కొంచెము పరిపక్వమైన చిత్తమగుచో, నాల్గుభాగములొనర్చి యందొక భాగమును దేహయాత్రకు సంబంధించిన వానితోడను, రెండుభాగములను గురుశుశ్రూషాదులచేతను ఒకభాగమును శాస్త్రశ్రవణముచేతను పూరింపవలెను.

వ్యుత్పత్తిమనుయాతస్య పూరయేచ్చేతసోఽన్వహమ్
ద్వౌభాగౌ శాస్త్రవైరాగ్యై ద్వౌధ్యానగురుపూజయా. 47

తత్వనిశ్చయయుక్తమగు పరిపక్వచిత్తముయొక్క రెండుభాగములను ప్రతిదినము శాస్త్రవైరాగ్యాదుల సంపాదనముచేతను, తక్కిన రెండుభాగములను ధ్యాన, గురుపూజాదులచేతను క్రమముగ పూర్ణమొనర్పవలెను.

సాధుతామాగతోజీవో యోగ్యోజ్ఞానకథాక్రమే
నిర్మలాకృతిరాదత్తే పటఉత్తమరంజనామ్. 48

శుభ్రవస్త్రము రంగును గ్రహించునట్లు సాధుత్వము (మాలిన్యాది దోషరాహిత్యముచే శుద్ధరూపత్వము) బడసిన జీవుడు జ్ఞానప్రాప్తికి యోగ్యుడగును.

శనైఃశనైర్లాలనీయం యుక్తిభిఃపావనోక్తిభిః
శాస్త్రార్థపరిణామేన పాలయేచ్చిత్తబాలకమ్. 49

యుక్తులచేతను పావనములగు శ్రుతి, స్మృతి, గురువాక్యాదులతోడను చిదేకరసత్వము నొందించుచు చిత్తమును బాలుని లాలింపవలెను.

పరేపరిణతంజ్ఞానే శిథిలీభూతదుర్గ్రహమ్
జ్యోత్స్నాన్తఃహీనస్ఫటికవ చ్చేతః శీతం విరాజతే. 50

శిథిలమైన కాష్ఠమున చంద్రికకభిన్నమై వెలుఁగు స్ఫటికవోలె ఉత్తమజ్ఞానము బొందిన చిత్తము కడు శీతలమై విరాజిల్లును.

ప్రజ్ఞయాపరయాబుజ్వ్యా భోగానామీశ్వరస్యచ
సమమేవాథదేహస్య రూపమాశ్వవలోకయేత్. 51

కాటిల్యరహితమగు ఉత్తమ బ్రహ్మాకారబుద్ధిచే ఇంద్రియములను, విషయములను, వృత్తులను, వాటిననుభవించు జీవుని, దేహమును, వీటన్నింటిని సచ్చిదానందరూపమైన అధిష్ఠానబ్రహ్మస్వరూపముగనే వీక్షింపనగును.

ప్రజ్ఞావిచారవశతః సమమేవ సదాసుత
ఆత్మావలోకనంతృష్ణా సంత్యాగంచసమాహరేత్. 52

కుమారా! ప్రజ్ఞావిచారములచే ఆత్మదర్శన, తృష్ణాత్యాగములు రెంటిని యేకకాలముననే నిరంతరము సమకూర్చుకొనుచుండవలెను.

పరదృష్టావితృష్ణత్వం తృష్ణాభావేచదృక్పరా
ఏతేమిథఃస్థితేదృష్టీ తేజోదీపదశేయథా. 53

ఆత్మదర్శనముచే తృష్ణాఽభావము (మూలావిద్యా వినాశనము), తృష్ణాఽభావముచే ఆత్మదర్శనము - ఈ రెండును అగ్నియొక్క తేజఃప్రకాశములవలె యేకకాలముననే పరస్పరము స్థితిఁబొందియున్నవి.

భోగపూగే గతాస్వాదే దృష్టేదేవే పరావరే
పరేబ్రహ్మణివిశ్రాన్తి రనన్తోదేతి శాశ్వతీ. 54

భోగములందుప్రీతి జనించుటచేతను, సర్వోత్తమమగు ఆత్మయొక్క దర్శనమగుటచేతను పరబ్రహ్మమున శాశ్వతమగు విశ్రాంతి సమకూరును.

విషయాకలితానన్త మనన్తోదేతి నిర్వృతిః
నకదాచనజీవానా మాత్మవిశ్రవణాదృతే. 55

విషయానందమునే సారభూతముగనెంచి యద్దాని ననుభవించు జీవులకు అనంతమగు పరమశాంతి యెన్నటికినిగలుగదు. ఆత్మవిశ్రాంతి దప్ప శాంతికి సాధనము మఱియొకటెద్దియును లేదు.

యజ్ఞదానతపస్తీర్థ సేవాభిర్జాయతేసుఖమ్
నతపోభిర్నదానేన నతీర్థైరపిజాయతే. 56

యజ్ఞ తప తీర్థసేవనాదులచే విషయసంబంధమగు సుఖమే లభించును గాని విషయవిరక్తి యెన్నటికిని జనించదు.

భోగేషువిరతిర్జన్తోః స్వభావాలోకనాదృతే
కదాచిదపినోయుక్త్యా బుద్ధిరాత్మావలోకనే. 57

ఆత్మదర్శనము గానిచో జీవునకు భోగములందు విరక్తి గలుగదు. అట్లనే విషయవిరక్తిలేనిచో నేయుక్తిచేనైనను ఆత్మదర్శనమున బుద్ధి ప్రవర్తింపనేరదు.



స్వప్రయత్నాదృతేపుంసః శ్రేయసేసంప్రవర్తతే
భోగసంత్యాగసంప్రాప్త పరమార్థాదృతేసుతః. 58
నబ్రహ్మపదవిశ్రాన్తి సుఖమాసాద్యతేపరమ్
ఆబ్రహ్మస్తంబపర్యన్తే జగత్యస్మిన్నకుత్రచిత్. 59
తద్వదాశ్వస్యతే భాతే పరమేకారణేయథా
పౌరుషంయత్నమాశ్రిత్య దైవంకృత్వాసుదూరతః. 60
భోగాన్విగర్హయేత్ప్రాజ్ఞః శ్రేయోద్వారదృఢార్గలాన్
ప్రౌఢాయాంభోగగర్హాయాం విచారఉపజాయతే. 61

కుమారా! విషయవిరక్తి సమాధ్యాదుల యభ్యాసమను పురుషప్రయత్నములేనిచో ఆత్మదర్శనమున నీ బుద్ధి యెపుడును ప్రవర్తింపదు. భోగత్యాగముచేగల్గు పరమార్థముచేదప్ప మఱిద్దానిచేతను మనుజునిబుద్ధి ఆత్మశ్రేయమున యెన్నటికిని జొరఁగొనదు. మఱియు నట్టి విషయవిరక్తిలేనిచో బ్రహ్మాదిస్తంబపర్యంతముగల యీ జగత్తునందెచటనుగూడ బ్రహ్మపదవిశ్రాంతియను యుత్తమసుఖము మనుజునకు గలుగజాలదు. మఱియు తన యాత్మరూపమున నభివ్యక్తమగు పరమకారణంబైన పరమాత్మయందు మనస్సునకు విశ్రాంతియున్ను లభింపదు. కాన పురుషప్రయత్నమునాశ్రయించి ప్రారబ్ధమును దూరీకరించి బుద్ధిమంతుఁడు మోక్షమార్గమున ప్రబల ప్రతిబంధరూపములైన భోగముల గర్హింపవలెను. అట్టి భోగవిగర్హణ దృఢమైనచో వివేకముదయించును.

వృద్ధాయాంప్రావృషిశ్రీమాఞ్శరత్కాల ఇవామలః
విచారోభోగగర్హాతో విచారాద్భోగగర్హణమ్. 62
అన్యోన్యమేతేపూర్యేతే సముద్రజలదావివ
భోగగర్హావిచారశ్చ స్వాత్మాలోకశ్చశాశ్వతః. 63
అన్యోన్యంసాధయన్త్యర్థం సుస్నిగ్ధాఃసుహృదోయథా

వర్షర్తువు ప్రవృద్ధమైనవెనుక శాల్యాది సస్యసంపత్తియుతమగు శరత్కాలమేతెంచువిధమున విషయవిరక్తిచే వివేకమున్ను, వివేకముచే విషయవిరక్తియున్ను జనించుచుండును. ఈ రెండును సముద్రమేఘములవలె పరస్పరమొకదానినొకటి ప్రపూరితమొనర్చుచుండును. భోగములయెడ యప్రీతి, సదసద్వివేకము, నిత్యాత్మసందర్శనమను నీ మూడును మిగుల యనురాగముగల మిత్రులవోలె పరస్పరమొకదానికొకటి సహాయభూతములగుచుండును.

పూర్వందైవమనాదృత్య పౌరుషేణప్రయత్నతః. 64
దన్తైర్దన్తాన్ప్రసంపీడ్య భోగేష్వరతిమాహరేత్

మొట్టమొదట ప్రారబ్ధము ననాదరించి, పురుషప్రయత్నము నవలంబించి, దంతములచే దంతముల కొఱికి (మిగుల పరిశ్రమమొనర్చి) యేవిధముగనైనను భోగములయెడ వైరాగ్యమును సంపాదింపవలెను.

దేశాచారావిరుద్ధేన బాన్ధవైకమతేనచ. 65
పౌరుషేణక్రమేణాదౌ ధనాని సముపార్జయేత్
ధనైరభ్యాహరేద్భవ్యా న్సుజనాన్గుణశాలినః. 66

ప్రవర్తతేసమాసజ్జాత్తేషాం భోగవిగర్హణా
తతోవిచారస్తదను జ్ఞానం శాస్త్రార్థసంగ్రహః 67
తతఃక్రమేణ పరమ పదప్రాప్తిః ప్రజాయతే

దేశాచారముల కనుకూలముగను, బంధుజనసమ్మతముగను పురుషప్రయత్నముచే క్రమముగ ధనమార్జించి, యద్దానిచే సజ్జనులను, గుణశీలురను, మోక్షమార్గముపదేశించునట్టి మహాత్ములను నారాధింపవలెను. ఏలన నట్టిమహాత్ముల సంసర్గముచే విషయవిరక్తి జనించును. విషయవిరక్తిచే విచారముత్పన్నమగును. విచారముచే శాస్త్రార్థము, అనగా శ్రుతులన్నియు అద్వైతబ్రహ్మమునే ప్రతిపాదించుచున్నవను నిశ్చయజ్ఞాన ముదయమగును. అపిదప మననసిదిధ్యాసనములచే క్రమముగ సత్యోత్తమమగు ఆత్మపదము సంప్రాప్తమగును.

యదాతూపరతేకాలే విషయేభ్యోవిరమ్యసే. 68
తదావిచారవశతః పరమం పదమేష్యసి
సమ్యక్ప్రాప్స్యసివిశ్రాన్తి మాత్మన్యత్యన్తపావనే. 69
నపునఃకల్పనాపఙ్క దుఃఖాయ నిపతిష్యసి
స్థితాపినాస్థా తేశుద్ధ నమస్తేస్తుసదాశివ. 70

ఎపుడు నీకు విషయవిరక్తిగల్గునో, అపుడే విచారముద్వారా యుత్తమపదము నొంది మిగుల పవిత్రమగు ఆత్మయందు విశ్రాంతినిబడయగలవు. మఱల కల్పనాపంకమునఁబడి నీవెన్నటి దుఃఖము ననుభవింపకుందువు. విషయవిరక్తి నీకిపుడుపూర్ణముగ లేకున్నను ముమ్ముందయ్యది గలుగనున్నది గాన శుద్ధసదాశివబ్రహ్మస్వరూపుఁడవగు యట్టి నీకు నమస్కారము.

దేశక్రమేణ ధనమల్పవిగర్హణేన
తేనాజ్ఞసాధుజనమర్జయ మానపూర్వమ్
తత్సంగమోత్థ విషయాద్యవహేలనేన
సమ్యగ్విచారవిభవేన తవాత్మలాభః. 71

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే చిత్తవిచికిత్సా యోగోపదేశోనామ
చతుర్వింశః సర్గః ॥ 24 ॥

ప్రియుఁడవగు నోపుత్రా! దేశాచారములకవిరుద్ధమగు రీతి మొట్టమొదట ధన ముపార్జించుము. అద్దానిని భోగార్థము వ్యయపఱుపక బ్రహ్మవేత్తలగు సాధుమహాత్ముల సేవాదులందే వినియోగింపుము. పిదప, యమ్మహాత్ముల సంసర్గవశమున నావిర్భూతములైన విషయవిరక్త్యాదులచేతను, సాధన చతుష్టయ సంపత్తిచేతను ప్రవృత్తమగు అధ్యాత్మశాస్త్రవిచారముద్వారా మఱచిన కంఠమణిని బొందునట్లు నీవాత్మలాభమును బడయగలవు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
చిత్తవిచికిత్సా యోగోపదేశమను
చతుర్వింశ సర్గము ॥ 24 ॥



## పఞ్చవింశః సర్గః.

---

బలి రువాచ :—

ఏతన్మేకథితంపూర్వం పిత్రా చారువిచారిణా
ఇదానీంసంస్మృతందిష్ట్యా సంప్రబోధమహంగతః. 1
అద్యేయంమమసంజాతా భోగాన్ప్రత్యరతిఃస్ఫుటమ్
దిష్ట్యాశమసుఖంస్వచ్ఛం విశామ్యమృతశీతలమ్. 2
పునరాపూరయన్నాశాం పునరప్యాహరన్ధనమ్
పునరావర్జయన్కాన్తాం ఖిన్నోఽస్మివిభవస్థితౌ. 3

బలిచక్రవర్తి:- ఉత్తమవిచారశీలుఁడగు మజ్జనకుఁ డిట్టివిధమునపూర్వము నాకు జెప్పియుండెను. దైవవశాత్తుగ నేనిపుడద్దానిని స్మరించి ప్రబోధితుఁడనైతి. ఇపుడు ప్రత్యక్షముగ నాకు భోగములయెడ యరుచి జనించినది. స్వచ్ఛమై అమృతమువలె శీతమైన శాంతిసుఖమునదై యుపశమముచే నేనిపుడు ప్రవేశించుచున్నాను. మఱల మఱల యాశలదీర్చుకొనుచు, ధనమును జేకూర్చుకొనుచు, లలనాగణంబునకనుకూలముగ వర్తించుచు - ఇవ్విధమున సంపదలస్థిరత్వముకొఱకే యత్నించుచు నేనింతవఱక మిగులపరితప్తుఁడనైతి.

అహోనుఖలుధన్యోయం శమభూఃశీతలాన్తరా
సర్వాఏవశమంయాన్తి సుఖదుఃఖదృశఃశనైః. 4
శామ్యామిపరినిర్వామి సుఖమాసేసమేస్థితః
అయమన్తఃప్రహృష్యామి చన్ద్రబిమ్బఇవార్పితః. 5
ఉత్తాణ్డవన్మనోరంహః ప్రోషితోరు శరీరకమ్
అనారతపరిక్షోభం మహాదుఃఖంవిభవార్జనమ్. 6
అఙ్గమఙ్గేనసంపీడ్య మాంసంమాంసేనచస్త్రియః
పురాహమభవంప్రీతో యత్తన్మోహవిజృమ్భితమ్. 7
దృష్టాన్తదృష్టయోదృష్టా భుక్తంభోక్తవ్యమక్షతమ్
ఆక్రాన్తమఖిలంభూతం జాతంకిమివశోభనమ్. 8

ఆహా! శీతలమగు నీస్థితి యిపుడెంత ప్రశాంతముగను రమణీయముగను నున్నది! శమముదయించుటచే సుఖదుఃఖదశలన్నియు వినాశమొందును. శమత్వముగల్గి నేనిపుడంతఃకరణమున యే విధమైన పరితాపములేక చంద్రబింబమువలె ప్రశాంతముగనున్నవాఁడనై నిరతిశయానందమును బొందుచున్నాను. ప్రబల మనోవేగసంయుక్తమును, దేశభ్రమణముచే భ్రాంతశరీరసహితమును, నిరంతరక్షోభయుక్తమునగు విభవోపార్జన మిగుల దుఃఖప్రదమైనదేయగును. పూర్వము నేను స్త్రీల యంగసమ్మర్దనముచే యానందమునొందుట కేవల మజ్ఞానవిలాసమాత్రమేయగును. మహదైశ్వర్యము లన్నింటిని నేను గాంచితిని. పగులచే నాశమొనర్పబడని రాజ్యాదివిభవములన్నిటిని యనుభవించితిని.

స్వసామర్థ్యముచే ప్రాణికోటినంతయు వశీభూతమొనర్చుకొంటిని. కాని వీటిచే నిత్యసుఖమెయ్యది నాకు లభించినది ?

పునస్తాన్యేవ తాన్యేవ తత్రేహాన్యత్ర వాపిచ
ఇతశ్చేతశ్చ వస్తూని నాపూర్వం నామకించన. 9
సర్వమేవ పరిత్యజ్య పరిహృత్య ధియా స్వయమ్
స్వస్థ ఏవావతిష్ఠేఽహం పూర్ణాత్పూరణ ఇవాత్మని. 10
పాతాలే భూతలే స్వర్గే స్త్రీరత్నోపలాదయః
సారం తదపి తుచ్ఛేన కాలేనాశు నిగీర్యతే. 11
ఏతావన్తమహం కాలం భృశం బాలోఽభవం పురా
యః కుర్వన్ద్వేషమమరైస్తుచ్ఛయా జగదిచ్ఛయా. 12
మనోనిర్మాణమాత్రేణ జగన్నామ్నా మహాధినా
త్యక్తేనానేన కోఽర్థః స్యాత్కోఽనురాగో మహాత్మనః. 13
కష్టం చిరతరం కాలమనర్థోఽర్థధియా మయా
అజ్ఞానమదమత్తేన కాలేన స్వేన సేవితః. 14
తరత్తరలతృష్ణేన కిమివాస్మిఞ్జగత్త్రియమ్
మయానకృతమజ్ఞేన పశ్చాత్తాపాభివృద్ధయే. 15
ఏతయా తదలం మేఽస్తు తుచ్ఛయా పూర్వచిన్తయా
పౌరుషం యాతి సాఫల్యం వర్తమానచికిత్సయా. 16

ఇహపరలోకములందంతటను అనుభవించిన వస్తువులే మరల మరల యనుభవింపబడుచున్నవి. కాన వీనియందపూర్వత్వమెద్దియును లేదు. సర్వము పరిత్యజించి, బుద్ధిచేనంతయు స్వయముగ విడనాడి తత్వబోధచే పూర్ణస్వరూపమొంది స్వాత్మయందు పరిపూర్ణుఁడనైయుండెద పాతాళమందును స్వర్గమునను, భూమియందును, అజ్ఞులచే నధికముగ దలంపబడు స్త్రీరత్నాది భోగ్యములన్నియు అల్పకాలమున వీడిపోవునవేయగును. నేనింతకాల మజ్ఞుఁడనైయుంటిని. ఏలన, తుచ్ఛమగు నీజగత్తు యొక్క యాధిపత్యముకొఱకై పూర్వము దేవతలతో విరోధము కల్పించుకొంటిని. మనోరచనా మాత్రమగు యీజగత్తను గొప్పమానసికవ్యాధి త్యజింపబడినచో నే మహత్ఫలము చేకూరగలదు? అట్టిమహాత్ములకు జగత్తునందు ప్రీతియెట్లుజనించును? ఆహా! దుఃఖము! అజ్ఞానమదోన్మత్తుఁడనై నేను బహుకాల మనర్థమునే యర్థముగ దలంచి సేవించితిని. అజ్ఞానసహితుడను చంచలతృష్ణాయుక్తుఁడనునై నేనీముల్లోకములందు యొనర్పని కార్యమేలేదు. అదంతయు భావికాలమున మిక్కిలి పశ్చాత్తాపమునే గల్గజేసినది. ఇక తుచ్ఛమగునీ పూర్వకాలిక చింతచే నేమిప్రయోజనము ? వర్తమానకాలమందలి అజ్ఞానము నశించుటకై యత్నముచేసిననే మానవజన్మ సఫలమగును.

అద్యాపరిమితాకారాకారణైకతయాత్మని
సర్వతః సుసమభ్యేతి రసాయనమివార్ణవే. 17
కోఽయం తావదహం కిం స్యాదాత్తేత్యాత్మావలోకనమ్



పృచ్ఛామ్యాశ నసం నాథం నూనమజ్ఞానశాన్తయే. 18
సంచిన్తయామి పరమేశ్వరమాశు శుక్ర
ముద్యత్ప్రసాదమథ తేన గిరోపదిష్టే
తిష్ఠామ్యనన్తవిభవే స్వయమాత్మనాత్మ
న్యక్షీణమర్థముపదేశగిరః ఫలన్తి. 19

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే బలిచిన్తాసిద్ధాన్తయోగోపదేశో నామ
పఞ్చవింశః సర్గః ॥ 25 ॥

క్షీరసాగరమును మథించుటచే నలువైపుల అమృతమావిర్భవించినట్లు, అనంతాకారయుతుఁడును, కారణరూపుఁడు నగు పరబ్రహ్మముతోటి యైక్యమునొందుటచే ఆత్మయందంతట పూర్ణసుఖమావిర్భవించును. కాన నాయజ్ఞానోపశమనముకొఱకై నేడు నా కులగురువగు శుక్రాచార్యుని ఆత్మసాక్షాత్కారోపాయమును గూర్చి యడుగుచు, ఈ దృశ్యప్రపంచమేమి? అహంప్రత్యయరూపుడగు జీవుడెవడు? అని యివ్విధమున ప్రశ్నించెద. నేనిపుడు పరమేశ్వరుఁడును ఆశ్రితజనులయెడ మిగుల ప్రసన్నుడును నగు శుక్రాచార్యుని ధ్యానించి అతని యుపదేశముచే అనంతవిభవయుక్తమగు పరమాత్మస్వరూపమున స్వయముగ స్థితిఁబొందెద. మహాత్ములచే నుపదిష్టమగు వచనము లక్షయఫలంబును గలుగజేయును గదా!

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
బలిచింతా సిద్ధాంతయోగోపదేశమను
పంచవింశ సర్గము ॥ 25 ॥

---

## షడ్వింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇతి సంచిన్త్య బలవాన్బలిరామీలితేక్షణః
దధ్యౌ కమలపత్రాక్షం శుక్రమాకాశమన్దిరమ్. 1

శ్రీ వసిష్ఠుడు:—ఇట్లు చింతించినవాడై బలిచక్రవర్తి కనులుమూసికొని చిదాకాశమున విశ్రమించువాడును, కమలనేత్రుడునగు శుక్రాచార్యుని గూర్చి ధ్యానించెను.

సర్వస్థం చిన్తయానం తు నిత్యధ్యానోఽథ భార్గవః
చేతః స్థం జ్ఞాతవాన్ శిష్యం బలిం గుర్వర్థినం పురే. 2

అంతట నిరంతర బ్రహ్మధ్యానతత్పరుండగు శుక్రాచార్యుడు సర్వరూపమగు బ్రహ్మమునందు స్థితిగల్గియున్నట్టి తన్ను ధ్యానించుచున్నవాడును, స్వచిత్తస్థుడును, తత్వజ్ఞానాభిలాషియునగు బలిచక్రవర్తి నెఱింగెను.

అథసర్వగతానన్త చిదాత్మాభార్గవఃప్రభుః
ఆనినాయ సదేహంస్వం రత్నవాతాయనంబలేః. 3

అనంతమై సర్వవ్యాపకమైన చిదాత్మస్వరూపుడైన భగవంతుఁడగు శుక్రాచార్యుఁడంత బలిచక్రవర్తియొక్క గృహాంతరాళమందలి రత్నవాతాయనంబున ప్రవేశించె.

గురుదేహప్రభాజాల పరిమృష్టతనుర్బలిః
బుబుధేప్రాతరర్కాంశు సంబోధితమివామ్బుజమ్. 4

అత్తఱి ప్రాతఃకాలమున సూర్యకిరణములచే కమలము వికసించునట్లు గురువగు శుక్రాచార్యుని శరీరదీప్తిచే బలిచక్రవర్తి మిగుల వికాసంబొందెను.

తత్రరత్నార్ఘ్యదానేన మన్దారకుసుమోత్కరైః
పాదాభివన్దనైరేనం పూజయామాసభార్గవమ్. 5
రత్నార్ఘ్యపరిపూర్ణాఙ్గం కృతమన్దారశేఖరమ్
మహార్హాసనవిశ్రాన్త మథోవాచ గురుంబలిః. 6

అంతట నాబలిచక్రవర్తి రత్ననిర్మిత పాత్రముచే నుసువున అర్ఘ్యమునిచ్చి వందనాదులనొనర్చి కల్పవృక్షకుసుమంబులచే వానిని బూజించెను. అర్ఘ్యముచే పరిపూరితమైన దేహముగలవాఁడును మందార పుష్పములే శిరోభూషణముగ గలవాఁడును, బహుమూల్యమైన యాసనముపై గూర్చొని యున్నవాడునగు తన గురువునుగూర్చి బలిచక్రవర్తి యిట్లుపల్కెను.

బలిరువాచ :—

భగవంస్త్వత్ప్రసాదోత్థా ప్రతిభేయంపురస్తవ
నియోజయతిమాంవక్తుం కార్యం కర్తుమివార్కభాః. 7
భోగాన్ప్రతివిరక్తోస్మి మహాసంమోహదాయినః
తత్త్వంజ్ఞాతుమిచ్ఛామి మహాసంమోహహారియత్. 8
కియన్మాత్రమిదంభోగ జాలంకిమయమేవవా
కోఽహంకస్త్వంకిమేతేవా లోకాఇతివదాశుమే. 9

బలిచక్రవర్తి :- ఓమహాత్మ! సూర్యకాంతి తనసన్నిధానమాత్రముచే ప్రజల నిత్యకార్యములందు నియోగించునట్లు తమయనుగ్రహముచే నుద్భూతమైన ప్రభావిశేషముగల యీ నాబుద్ధి తమతో నొకింతవచించుటకు ప్రేరేపించుచున్నయది. దేవా! అత్యంతమోహకరమగు విషయభోగములయెడ నేను విరక్తిఁజెందితిని. ఇక మహామోహ (అజ్ఞాన) నివర్తకమగు పరమార్థతత్త్వము నెఱుఁగ గోరుచున్నాను. మహాత్మా విషయసుఖముయొక్క అవధి యెద్ది? దానిస్వరూపమేమి? నేనెవఁడను? మీరెవరు? ఈ తత్త్వమంతయు నాకు శీఘ్రముగ దెలియఁజేయవేఁడెద.

శుక్ర ఉవాచ :—

బహునాత్రకిముక్తేన ఖంగన్తుంయత్నవానహమ్
సర్వదానవరాజేన్ద్ర సారంసంక్షేపతఃశృణు. 10



చిదిహాస్తీహచిన్మాత్ర మిదంచిన్మయమేవచ
చిత్త్వంచిదహమేతేచ లోకాశ్చిదితిసంగ్రహః. 11
భవ్యోసిచేత్తదేతస్మా త్సర్వమాప్స్యసినిశ్చయాత్
నోచేత్తద్బహ్వపిప్రోక్తం త్వయిభస్మనిహూయతే. 12
చిచ్చేత్యకలనాబన్ధ స్తన్ముక్తిర్ముక్తిరుచ్యతే
చిదచేత్యాఖిలాత్మేతి సర్వసిద్ధాన్తసంగ్రహః. 13
ఏనంనిశ్చయమాదాయ విలోకయసిహేలయా
స్వయమేవాత్మనాత్మాన మనన్తంపదమాప్స్యసి. 14
ఖంప్రజామ్యహమత్రైవ మునయఃసప్తసంగతాః
కేనాపిసురకార్యేణ వస్తవ్యంతత్రవైమయా. 15
రాజన్యావదయందేహ స్తావన్ముక్తధియామపి
యథాప్రాప్తక్రియాత్యాగో రోచతే నస్వభావతః. 16

శ్రీ శుక్రాచార్యుడు:— "దానవేశుఁడవగు నో బలిచక్రవర్తీ! నేనిపుడాకాశమునకు న సన్నద్ధుఁడనైయుంటిని. కావున నధికముగ వచించుటకిపుడవకాశములేదు; సంగ్రహముగ దెల్పెదవినుము. "ఈజగత్తు చైతన్యస్వరూపము. చిత్తుయొక్క అధీనమగుటచే దృశ్యమంతయును చిన్మాత్రమే. చిత్తునందే అధ్యాసింపబడినదగుటచే అంతయు చిన్మయమే. నీవున్ను చిన్మయుడవే; నేనున్ను చిన్మయుడనే; ఈసమస్తలోకములున్ను చిన్మయములే" ఇదియే తత్త్వమంతటియొక్క సారము. నీవు శ్రద్ధావంతుడవును, వివేకియునైనచో యీ నిశ్చయముచేతనే సమస్తమును పొందగలవు. అట్లుగానిచో నధికముగ వచించినను భస్మమందలి యాహుతివలె వ్యర్థమగును. 'చిత్తుయొక్క విషయాకార కల్పనయే బంధము. అట్టి కల్పన లేకుండుటయే ముక్తి. చేత్య (విషయాకార) విముక్తమగు చిత్తు పూర్ణాత్మస్వరూపమేయగును! ఇదియే సమస్త సిద్ధాంతములయొక్క సారము. ఇట్టినిశ్చయ మవలంబించి అఖండాకార వృత్తిచే నీజగంబంతయు నవలోకించుచో నీవు స్వయముగనే బ్రహ్మపదమును నిక్కముగ పొందగలవు. నేనిపుడాకాశమున కేగుచున్నాను. సప్తఋషులున్ను నాతోటి యిట నేతెంచియున్నారు. ఒకానొక దేవకార్యము నిమిత్తమై నేనట కేగవలసియున్నది. ఓ రాజా! దేహముండువఱకును జీవన్ముక్తులకు గూడ ప్రాప్తించిన కార్యముల నుపేక్షించుట స్వభావముగ నెన్నటికిని యుచింపదు.

ఇతికథితవతాథ భార్గవేణ
స్ఫుటజలరాశిపథా మహాజవేన
ప్లుతమలిశబలే నభోన్తరాలే
తరలతరఙ్గవదాకులే గ్రహౌఘైః. 17

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే బల్యుపదేశయోగోనామ
షడ్వింశః సర్గః ॥ 26 ॥

ఇట్లు వచించి, శుక్రాచార్యుండు గ్రహమండలమును పుష్పపరాగముచే వ్యాప్తమై భ్రమరమువోలె శ్యామవర్ణయుక్తమైయున్న నయ్యాకాశ మధ్యమున మేఘమార్గముగుండా యతివేగమున బైకెగసెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
బల్యుపదేశ యోగమను షడ్వింశ సర్గము. ॥ 26 ॥

---

## సప్తవింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సురాసురసభాజ్యేష్ఠే తస్మిన్భృగుసుతేగతే
మనసాచిన్తయామాస బలిర్బుద్ధిమతాంవరః. 1

శ్రీ వసిష్ఠుడు :—ఓ రామచంద్రా! సురాసురుల సభయందతి ప్రశంసనీయుండగు నా శుక్రాచార్యుండు వెడలిన పిదప ధీమంతులలో శ్రేష్ఠుడగు నా బలిచక్రవర్తి యిట్లు చింతనజేసెను.

యుక్తముక్తంభగవతా చిదేవేదంజగత్త్రియమ్
చిదహంచిదిమేలోకా శ్చిదాశాశ్చిదయంక్రియా. 2
సబాహ్యాభ్యన్తరేసర్వం చిదేవంపరమార్థతః
అస్తిచిద్వ్యతిరేకేణ నేహకించనకుత్రచిత్. 3

మహాత్ముడగు శుక్రాచార్యుడు వచించిన దంతయు సత్యమే. ఈ ముల్లోకములు చిన్మాత్రస్వరూపములే. నేనున్ను చిద్రూపుడనే. సమస్తలోకములున్ను చిద్రూపములే. దిక్కులన్నియును, క్రియలన్నియును చిన్మయములే. యథార్థముగ నీ బాహ్యాభ్యంతర దృశ్యసమూహమంతయును చిద్రూపమే. చిత్తునకు భిన్నముగ యీ బ్రహ్మాండమందు దేవస్తువున్ను లేదు.

అయమాదిత్యఇత్యర్కో నచితాయదిచేత్యతే
తదర్కతమసోర్భేదః కఇహేహోపలభ్యతే. 4
ఇయంభూరితిభూరేషా చితాయదినచేత్యతే
భూమేఃకింనామభూమిత్వం తద్భవ్యేభవ్యతాంగతమ్. 5
ఇమాదిశోదిశ ఇతి చేత్యన్తే నచితాయది
తత్కింనామ దిశాందిక్త్వం శైలానాంచాపి కాద్రితా. 6
ఇదంజగజ్జగదితి చితాయది నచేత్యతే
తత్కింజగత్త్వంజగతో భభస్త్వంనభసోథకిమ్. 7
కాయోఽయంపర్వతాకార శ్చితాయది నచేత్యతే
తత్కింనామ శరీరత్వం శరీరస్యశరీరిణామ్. 8



సూర్యుని సూర్యరూపముగ నీ చైతన్యము ప్రకాశింప జేయనిచో నికసూర్యునకు, అంధకారమునకు భేదమేముండును? అట్లనే పృథివిని పృధ్వీరూపమున చైతన్యమెఱుంగనిచో జలాదులకంటె భిన్నముగనయ్యదెట్లు ప్రసిద్ధిబొందును? ఇవ్విధముననే దిక్కులను పర్వతములను, జగత్తును, ఆకాశమును, శరీరమును చైతన్య మాయారూపములుగ ప్రకాశింపజేయనిచో, వానికిక యునికి యెచట?

చిదిస్త్రియాణి చిత్కాయ శ్చిన్మనశ్చిత్తదేషణా
చిదన్తశ్చిద్బహిశ్చిత్తం చిద్భావాశ్చిద్ధ్రువస్థితిః. 9
చిత్తైవైనమహంసర్వం స్పర్శనైషణపూర్వకమ్
కరోమిమాత్రాసంస్పర్శం శరీరేణ నకించన. 10
కిమనేన శరీరేణ కాష్ఠలోష్టసమేనమే
అశేషజగదేకాత్మా చిదహంచేతనాత్మకః. 11
అహంచిదమ్బరేభానా వహంచిద్భూతపఙ్క్తిషు
సురాసురేషుచిదహం స్థావరేషుచరేషుచ. 12

ఇంద్రియములు, దేహము, మనస్సు, ఇచ్ఛ, బాహ్యాభ్యంతరములు, శూన్యాకాశము, ధృవలక్షణమగు భావసముదాయము, జగత్స్థితి ఈ సమస్తమున్ను చిద్రూపమే. శబ్దస్పర్శాది విషయముల నిచ్ఛాపూర్వకముగ ననుభవించునది చిద్రూపుండనగు నేనేగాని యీ శరీరమెంతమాత్రమును కాదు. కొయ్యవలెను, మంటిగడ్డవలెను అచేతనమైన యీశరీరముతో నాకేమి ప్రయోజనము? ఉపాధిరహితమై, సర్వజగదాత్మకమై, చేతనస్వరూపమైన చిద్వస్తువే నేను. ఆకాశమందును, సూర్యాది ప్రకాశ వస్తువులందును, భూతసముదాయమందును, సురాసురులందును స్థావరజంగమాత్మకములగు తగితర పదార్థములందును గల చైతన్యమే నేను.

చిదస్తీహద్వితీయోహి కల్పనైవ నవిద్యతే
ద్విత్వస్యాసంభవాల్లోకే కఃశత్రుఃకశ్చవా సుహృత్. 13

ఈ బ్రహ్మాండమందంతట కేవలము చైతన్యమాత్రమే గలదు. దానికివేఱుగ మఱియేకల్పనయున్న లేదు. అన్యమెద్దియు లేనందుచే నిక యీ ప్రపంచమున శత్రువెవడు? మిత్రుడెవడు?

బలినామ్నఃశరీరస్య చ్ఛిన్నేశిరసిభాసురే
చితఃకింతద్భవేచ్ఛిన్నం సర్వలోకావపూరణాత్. 14

బలియనుసంజ్ఞచే వ్యవహరింపబడు నీదేహము ఛేదింపబడినను అసంగమై, సర్వలోకవ్యాప్తమైయున్న చిత్స్వరూపుండనగు నేనెట్లు ఛేదింపబడుదును?

చితాసంచేతితోద్వేషో ద్వేషోభవతినాన్యథా
తస్మాద్ద్వేషాదయఃసర్వే భావాభావాశ్చిదాత్మకాః. 15

చిత్తుచే ప్రకాశితమగునపుడే ద్వేషము ద్వేషరూపమున భాసించును గాని లేనిచో గాదు. ఇట్లు రాగద్వేషాది భావాభావపదార్థములన్నియు చైతన్యమున కధీనములగుటచే చిద్రూపములే యగును.

నచితోఽవ్యతిరేకేణ ప్రవిచార్యాపికించన
ఆసాద్యతేకిలస్ఫారా దస్మాత్త్రిభువనోదరాత్. 16
నద్వేషోఽస్తినరాగోఽస్తి నమనోనాస్యవృత్తయః
చిన్మాత్రస్యాతిశుద్ధస్య వికల్పకలనాకుతః. 17
చిదహంసర్వగోవ్యాపీ నిత్యానన్దమయాత్మకః
వికల్పకలనాతీతో ద్వితీయాంశవివర్జితః. 18
చితశ్చిదితియన్నామ నిర్నామమాయానామతత్
శబ్దాత్మికైషాచిచ్ఛక్తిః పరిస్ఫురతిసర్వగా. 19

ఎంతవిచారించినను విశాలమగు నీత్రిలోకమందు చైతన్యమున కన్యమేదియు గనఁబడుట లేదు. శుద్ధచిన్మాత్రస్వరూపుఁడనగు నాకు రాగముగాని ద్వేషముగాని, మనస్సుగాని మనోవృత్తి గాని యేమియు లేనందుచే వికల్పమను కల్పనయే నాయందెట్లు సంభవించును? సర్వవ్యాపకమై, వికల్పకల్పనాతీతమై అద్వితీయమై, నిత్యమై, ఆనందమయాత్మకమైన చిద్రూపమే నేను. నామ రూపాత్మమగు యీప్రపంచము నామరహితమగు చైతన్యముయొక్క సంజ్ఞకానేరదు. సర్వత్రవ్యా ప్తమై నామరూప కల్పనకంతకును అధిష్ఠానభూతమై వెలయు చిచ్ఛక్తియే శబ్దాత్మకరూపమున స్ఫురించుచున్నది.

దృశ్యదర్శననిర్ముక్తః కేవలామలరూపవాన్
నిత్యోదితోనిరాభాసో ద్రష్టాస్మిపరమేశ్వరః. 20
కల్పనా వికలాకారః కాలకాన్తకలామయః
ఆభాసమాత్రముదితో నిత్యాభాసవివర్జితః. 21
భారూపైకస్వరూపేఽస్మి న్స్వరూపేణజయామ్యహమ్
చేత్యరఞ్జనరిక్తాయ విముక్తాయ మహాత్మనే. 22
ప్రత్యక్చేతనరూపాయ స్వరూపాయనమోస్తుతే
చితయేచేత్యముక్తాయ యుక్తాయుక్తాయయోగ్యయా. 23
సర్వావభాసదీపాయ మహ్యామేవ నమోస్తుతే
చేత్యనిర్ముక్తచిద్రూపం విష్వగ్విశ్వావపూరకమ్. 24
సంశాన్తసర్వసంవేద్యం సచ్చిన్మాత్రమహంమహత్
ఆకాశవదనన్తోఽహ మణ్వణోరణురాతతః. 25

దృశ్యదర్శన వర్జితమై, నిర్మలమై, నిత్యమై, అన్యప్రకాశరహితమైయుండు ద్రష్టయగు పరమేశ్వరుఁడనే నేను. ఇట్టినిత్యప్రకాశమాత్రుఁడనగు నాయందు ఆత్మప్రకాశరహితమై, జలాగ్ర భాగమున ప్రతిబింబించిన చంద్రకళవలె సూక్ష్మమై, స్వకల్పనచే పరిచ్ఛిన్నమైన యాకృతిగల్గి యుచ్ఛలించునట్టి యీ జీవభావము భ్రాంతియేగాని యథార్థముగాదు. ఇక్షణమున అంతిమ సాక్షాత్కారవృత్తిచే నుద్భూతమగు శుద్ధస్వరూపముచే నేను నాజీవభావమును నిర్జించెద. ఇట్లు జీవ భావరహితమై, విషయకళ [illegible] [illegible]మై, మహత్తమైయుండు సాక్షిచైతన్య



మగు నాయాత్మస్వరూపమునకు నమస్కారము. విషయవర్జితమును, చిద్రూపమును, మననిదిధ్యాసనసమాధిరూపయుక్తిసహితమునగు నాసాక్షిచైతన్యమునకు నమస్కారము. సర్వప్రకాశకమైన జ్యోతిరూపమగు నాకు నమస్కారము. నిర్విషయమును, చిద్రూపమును, బ్రహ్మాండమంతయు, వ్యాప్తమొనర్చునదియు, శాంతస్వరూపమును, సర్వవేద్యమునగు సచ్చిన్మాత్రమైన మహాత్స్వరూపమే నేను. మఱియు నేనాకాశమువలె అనంతమై, వ్యాపకమై, అణువుకంటెను సూక్ష్మమైయున్న వాఁడను.

నాసాదయన్తిమామేతాః సుఖదుఃఖదశాదృశః
సంవేదనమసంవేద్య మచేత్యంచేతనంతతమ్. 26
నశక్తామాంపరిచ్ఛేత్తుం భావాభావాజగద్గతాః
అథచైతేజగద్భావాః పరిచ్ఛిన్నస్తుమామిమమ్. 27
యథాభిమతమేవైతే మత్తోనవ్యతిరేకిణః
మయిస్వభావభూతేన వస్తునా వస్తునీయతే. 28
హ్రియతేదీయతేవాపి తత్కింకస్యకిలక్షతమ్
సర్వదాసర్వమేవాహం సర్వకృత్సర్వసంగతః. 29
చేత్యమస్మ్యహమేవైత న్నకించిదపి చోదితమ్
కింసకల్పవికల్పాభ్యాం చితంచిదియమేకికా. 30
సంక్షోభయామ్యహంతావ చ్ఛామ్యామ్యాత్మని పావనే

ఈజగత్తునందలి సుఖదుఃఖాదులు నన్ను స్పృశింపనేరవు. ఏలన వర్తమానవిషయమందు సంవేదన (జ్ఞాన) మసంవేద్యమైయ్యు, భూతభవిష్యద్విషయములందు వ్యాపకచైతన్యము విషయ శూన్యమైయ్యునుండును. జగత్తునందలి భావాభావపదార్థములుగాని, దేశకాలాదులుగాని నన్ను పరిచ్ఛిన్నమొనర్పజాలవు. తత్వనిశ్చయ ప్రమాణాది జగద్గతపదార్థములు పరిచ్ఛిన్నమొనర్చుచున్నవనిన, అదిమాకు సమ్మతమే. ఏలనిన, స్వస్వరూపమాత్ర పరిచ్ఛేదముచే అవినాకంటె వేఱు గానేరవు. గదా ఒకని వామహస్తమందలి ధనమును దక్షిణహస్తము గైకొనినను, హరించినను, వాని కేమియు హానిలేనివిధమున, ఒక వస్తువుయొక్క స్వరూపభూతమైన మఱియొకవస్తువు యేకదేశమున పొందిపబడినను, హరింపబడినను, యావస్తువునకేమియు హానికలుగనేరదు. యథార్థముగ నేను సర్వకాలములందును సర్వత్ర వ్యాప్తమై, సర్వకర్తయై, స్వరూపమై వెలుఁగుచున్నవాఁడను. మఱియు నే నద్వితీయ చైతన్యస్వరూపుఁడను, సర్వవిషయసర్వరూపుఁడనునగుదును. వాస్తవముగ పరమార్థమున నేదియు యుత్పన్నమగుటలేదు. ఏలన చిద్రూపుఁడనగు నాకు సంకల్ప వికల్పములచే చేకూరునదేమి? వృద్ధియగునదియేమి? నశించునదేమి నేనజ్ఞానముచే క్షోభను, జ్ఞానముచే శాంతిని బడయుచున్నాను.

ఇతిసంచిన్తయన్నేవ బలిఃపరమకోవిదః. 31
ఓంకారాదర్ధమాత్రార్థం భావయన్మౌనమాస్థితః
సంశాన్తసర్వసంకల్పః ప్రశాన్తకలనాగణః. 32

నిఃశబ్దమపిదూరాస్త చేత్యచిత్తకచిత్తనః
ధ్యాతృధ్యేయధ్యానహీనో నిర్మలః శాన్తవాసనః. 33
బభూవావాతదీపాభో బలిఃప్రాప్తమహాపదః
ఉపశాన్తమనాస్తత్ర రత్నవాతాయనేబలిః
అవసద్బహుకాలం స సముత్కీర్ణఇవోపలే. 34
ప్రశమితైషణయా పరిపూర్ణయా
మననదోషదశోజ్ఝితయైతయా
బలిరరాజతనిర్మలసత్తయా
విఘనమచ్ఛతయేవ శరన్నభః. 35

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే బలివిశ్రాన్తిర్నామ సప్తవింశః
సర్గః ॥ 27 ॥

ఇట్లు చింతనజేయుచు మిగుల ప్రజ్ఞావంతుఁడగు నాబలిచక్రవర్తి ప్రశాంతుడై, సర్వసంకల్పవర్జితుడై కల్పనారహితుడై, ఓంకారముయొక్క మూఁడుమాత్రలకును పరమైనట్టి అర్థమాత్రను అనగా తురీయాత్మస్వరూపమగు బ్రహ్మమును భావించుచు మౌనస్థుఁడైయుండెను. నిశ్చలముగ నాతడు చేత్యచేతనచింతకవర్జితుఁడై ధ్యాతృధ్యానధ్యేయ రహితుఁడై, నిర్మలుడై, వాసనావర్జితుఁడై, వాయువులేనిస్థలమందలి దీపమువలె నిశ్చలముగనుండెను. బ్రహ్మపదము నొందినవాడును, శాంతచిత్తుడునగు నాబలిచక్రవర్తి యారత్నవాతాయనమందే శిలయందు చెక్కబడిన విగ్రహము వలె బహుకాలము సుస్థిరముగనుండెను. శమించిన కోర్కెలుగలవాడై, పరిపూర్ణుడై, విషయదోషములులేక, నిర్మలబ్రహ్మభావప్రాప్తియను సత్తగల్గి మేఘరహిత శరత్కాలాకాశమువలె బలిచక్రవర్తియపుడు శోభించెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
బలివిశ్రాంతియను సప్తవింశ సర్గము ॥ 27 ॥

---

## అష్టావింశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అథ తేదానవాస్తత్ర బలేరనుచరాస్తదా
తద్గేహంస్ఫాటికంసాథ మచ్ఛైరారురుహుః క్షణాత్. 1
డిమ్బాద్యామన్త్రిణోధీరాః సామన్తాఃకుముదాదయః
సురాద్యాశ్చైవరాజానో వృత్రాద్యాబలహారిణః. 2
హయగ్రీవాదయఃసైన్యాశ్చక్రాజాద్యాశ్చబాంధవాః
లడుకాద్య[illegible] [illegible] కాద్యాశ్చ[illegible]లకాః. 3



కుబేరయమశక్రాద్యా ఉపాయనకరాఃసురాః
యక్షవిద్యాధరానాగాః సేవావసరకాఙ్క్షిణః. 4
రమ్భాతిలోత్తమాద్యాశ్చ చామరిణ్యోవరాఙ్గనాః
సాగరాఃసరితఃశైలా దిశశ్చవిదిశస్తథా. 5
సేవార్థమాయయుస్తస్య తంప్రదేశం తదాబలేః
అన్యేచబహవఃసిద్ధాస్త్రైలోక్యోదరవాసినః. 6

శ్రీ వసిష్ఠుడు :— ఓ రామా! బలిచక్రవర్తి నిశ్చేష్టుడైయుండుటఁగాంచి వాని యనుచరులగు దానవులపుడు స్ఫటికమణి నిర్మితమగు నా యున్నత రాజభవనమును క్షణములో నధిరోహించిరి. డింభుడుమున్నగు ధీరమంత్రి పుంగవులును, కుముదాది సామంతులును, సురాది రాజులును, వృత్రాది సేనాపతులును, హయగ్రీవాది సైనికులును, చాక్రాజాది బంధుగణమున్ను, లడుకాది మిత్రులును, వలుకాది మోదకారులును, కానుకలర్పించు కుబేర, యమ, ఇంద్రాది దేవతలును, సేవాభిలాషుల య యక్షవిద్యాధర నాగులున, చామరముల హస్తములందిడుకొనిన ఉత్తమ దేవాంగనలున్ను, సముద్ర, నదీ, పర్వత, దిశలున్ను, ఇంకను ముల్లోకములందు వసించు పెక్కుసిద్ధులును, దేవతలును, బలిచక్రవర్తిని సేవించుటకై యపుడాస్థానమునను విచ్చేసిరి.

ధ్యానమౌనసమాధిస్థం చిత్రార్పితమివాచలమ్
నమత్కిరీటావలయో దదృశుర్బలిమాదృతాః. 7
తందృష్ట్వాకృతకర్తవ్య ప్రణామాస్తేమహాసురాః
విషాదవిస్మయానన్ద భయమన్థరతాంయయుః. 8

కిరీటధారులై, వంగి నమస్కరించుచు యా దేవాదులత్తఱి ధ్యానవిష్ఠుడై, మౌనము వహించి, సమాధియందున్నట్టి బలిచక్రవర్తిని యత్యాదరమునఁగాంచిరి. అట్లు వానిఁ గాంచిన సురాసురులలో మిత్రులు విషాదము జెందిరి. ఉదాసీను లాశ్చర్యయుతులైరి. తత్వజ్ఞాను లానందమును జెందిరి. అజ్ఞానులు భయవిస్మయచకితులైరి.

మన్త్రిణఃప్రవిచార్యాత్ర కింప్రాప్తమితిదానవాః
భార్గవంచిన్తయామాసు ర్గురుంసర్వవిదాంపరమ్. 9
చిన్తనానన్తరంప్రైత్యా భార్గవంభాస్వరంవపుః
దదృశుఃకల్పితంప్రాప్తం గన్ధర్వనగరంయథా. 10
పూజ్యమానోఽసురగణై ర్నివిష్టోగురువిష్టరే
దదర్శధ్యానమౌనస్థం భార్గవోదానవేశ్వరమ్. 11
విశ్రమ్యసక్షణమివ ప్రేమవానవలోక్యచ
బలింవిచారయన్దృష్ట్వా పరిక్షీణభవభ్రమమ్. 12
దేహారశ్మిశతైర్దత్త దీప్తభిఃక్షీరసాగరమ్
క్షిపన్నివ సభామాహ హాసనావాక్యమిదంగురుః. 13

అపుడా దానవులగు మంత్రులందఱును కర్తవ్యము నాలోచించి మహాప్రాజ్ఞుఁడైన స్వగురువగు శుక్రాచార్యునిఁగూర్చి చింతన జేసిరి. పిమ్మట వారు దేదీప్యమానమగు శుక్రాచార్యుని దేహమును, కల్పిత గంధర్వనగరమువలె వ్యక్తమగుటను గాంచిరి. అంతయసురులచే బూజితుడును, మహా సింహాసనాధిష్ఠితుఁడునగు శుక్రాచార్యుడు మౌనస్థుడైయున్న యా దానవేశునిగాంచి, యొకక్షణము విశ్రమించి, సంసార భ్రమరహితునిగ వానిని దెలిసి, క్షేమాన్వితుడై, చింతనాయుక్తుడై స్వశరీర కాంతులచే సభాసదుల క్షీరసాగరమున బడద్రోయుచున్నవానివలె గన్పట్టుచు, యిట్లు బల్కెను.

అతిమాత్రమిదం దైత్యాః స్వవిచారణయైవయత్
సంప్రాప్తవిమలావాసః సిద్ధోఽయంభగవాన్బలిః. 14
అయంత దేవమేవేహ తిష్ఠన్దానవసత్తమాః
స్వాత్మనిస్థితిమాప్నోతు పదంపశ్యత్వనామయమ్. 15
శ్రాన్తోవిశ్రామమాయాతః క్షీణచిత్తభవభ్రమః
శాన్తసంసారనీహారో నాచనీయో నదానవాః. 16
స్వవివాలోకవ తేన సంప్రాప్తోఽజ్ఞానసంక్షయే
శాన్తేఽత్రసంభ్రమే సారో దినేనేవ కరోత్కరః. 17
స్వయమేవహి కాలేన ప్రబోధమయమేష్యతి
బీజకోశాత్స్వసంవిత్త్యా సుప్తమూర్తిరివాఙ్కురః. 18
కురుధ్వంస్వామికార్యాణి సర్వేదానవనాయకాః
బలిర్వర్షసహస్రేణ సమాధేర్బోధమేష్యతి. 19

ఓ దానవులారా! స్వవిచారవశమున బలిచక్రవర్తికి సర్వాధిష్ఠానమగు బ్రహ్మపదము సంప్రాప్తించినది! ఇది మిగుల ఆశ్చర్యకరమైనది. ఇక మహానుభావుఁడగు యీతఁడు త్తమసిద్ధిని బొందినట్లేయగును. కాన నోదైత్యప్రముఖులారా! సమాహితచిత్తుఁడగు వీని నిర్విఘ్నముననే చిరకాల మాత్మయందు స్థితిఁ బడయనిమ్ము; శాంతమగు బ్రహ్మపదమును వీక్షింపనిమ్ము. ప్రాపంచిక వ్యవహారములచే నీతఁడలసియున్నవాఁడు. ఇఁక నీతని చిత్తమునుండి దృశ్యభ్రమయంతయు తొలగినది. సంసారతుషారమ స్తమించినది. ఇక్కారణమున నీతడు విశ్రాంతిఁ బ్రాప్తినొంచెను. కాబట్టి మీరీతనిని పలుకరించవలదు. రాత్రియందలి యంధకారము శమించినమీదట పగటివేళ సూర్యకిరణములుదయించునట్లు, అజ్ఞానసంకటము శమింప బలిచక్రవర్తికి ఆత్మదర్శనము స్వయముగ సంప్రాప్తమైనది. సుప్తావస్థయందున్న అంకురము క్రమముగ బీజమునుండి వినిర్గతమగునట్లు? కాలక్రమమున నీతడు సమాధినుండి స్వయముగ జాగృతిని బడయును. కాన మీరందఱును రాజకార్యములను జాగరూకతతో నొనర్చుచుండుడు. వెయ్యిసంవత్సరములైన పిదప యీతడు సమాధినుండి మేల్గాంచును.

ఇత్యుక్త్వాగురుణాతత్ర హర్షామర్షవిషాదజామ్
దైత్యాశ్ఛిన్నాంజహుఃశుష్కాం మఞ్జరీమివపాదపాః. 20
వైరోచనిసభాసంస్థాం విధాయప్రాగ్వ్యవస్థయా
స్వవ్యాపారపరాస్తస్థుః సర్వఏవాసురాస్తతః. 21



నరామహీంమహీపతయోరసాతలం
గ్రహానభస్త్రిదశగణాస్త్రివిష్టపమ్
దిశోఽద్రయోదిక్పతయశ్చకందరా
స్వవనేచరా గగనచరాశ్చ ఖంయయుః. 22

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే బలిసమాధానవర్ణనం నామాష్టావింశః సర్గః ॥ 28 ॥

గురువగు శుక్రాచార్యుడిట్లుబల్క యంత నా దైత్యులందఱును శుష్కించిన లతను వృక్షము వీడుచందమున హర్షామర్షవిషాదజనితమగు చింతను వీడిరి. అపుడు వారు పూర్వవ్యవస్థననుసరించి రాజ్యవిధానము నేర్పఱచి ఆయా రాజవ్యవహారములఁజూచుచుండిరి. తదుపరి మనుజులు భూతలమునకును, శేషాది సర్పములు రసాతలమునకును, గ్రహములు లాకాశమునకును, దేవతలు స్వర్గమునకును, కులపర్వతముల యధిష్ఠానదేవతలున్నూ ఇంద్రాది దిక్పాలురున్నూ వారివారి దిశలకును, వనచరులు వారివారి కందరములకును, గగనచరు లాకాశమునకును జనిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున బలిసమాధానవర్ణమను అష్టావింశ సర్గము ॥ 28 ॥

---

## ఏకోనత్రింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అథవర్షసహస్రేణ దివ్యేనాసురపుఙ్గవః
దేవదున్దుభినిర్ఘోషైర్బుబుధే భగవాన్బలిః. 1
బలొప్రబుద్ధే తద్బాలం విరేజే నగరంతదా
వైరిఞ్చఇవసూర్యాంశు ఉదితే కమలాకరః. 2
బలిఃప్రబుద్ధఏవాసౌ యావన్నాయాస్తి దానవాః.
తావత్సంచిన్తయామాస సమాధి సదనేక్షణమ్. 3

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! అటుపిదప వెయ్యిదివ్యవత్సరములు గడచినమీదట దైత్యప్రముఖుఁడును మహాత్ముడునునగు నాబలిచక్రవర్తి దుందుభిశబ్దమును విని సమాధినుండి మేల్గాంచెను. ఆకాశమున సూర్యకిరణములుదయింపగనే కమలవనము వికాసమొందునట్లు అత్తఱివాని నగరమంతయు మిగుల శోభనుబొందెను. అట్లుసమాధినుండిలేచి బలిచక్రవర్తి దానవులేతెంచువఱకు నచ్చటనేయుండి యిట్లుచింతనజేసెను.

అహోనురమ్యాపదవీ శీతలాపారమార్థికీ
అహమస్యాంక్షణం స్థిత్వా పరాంవిశ్రాన్తిమాగతః. 4

తదేతామేవపదవీ మవలమ్బ్య కరోమ్యహమ్
భవతీహాలోపభుక్తాభిః కింమే బాహ్యవిభూతిభిః. 5
ఐన్దవేష్వపిబిమ్బేషు నతథానన్దవీచయః
తోషయన్తియథాన్తర్మే సంసిద్ధిభవభూతయః. 6
ఇతిభూయోఽపివిశ్రాన్త్యై కుర్వాణంగలితంమనః
బలిమావారయామాసు ర్దైత్యాశ్చన్ద్రమివామ్బుదాః. 7

తానాలోక్యపునర్ధ్యాత్వా తత్రప్రణమాకులేక్షణః
తైఃకులాచలసంకాశైః పరివీతవపుస్త్విదమ్. 8

'ఆహా! ఈపరమార్థపదమెంత రమణీయమైనది! యెంతప్రశాంతమైనది! క్షణకాల మిందు వసించుటచే సర్వోత్తమమగు విశ్రాంతిఁబొందితిని. కాన నీసమాధియను దివ్యపదమునే యాశ్రయించి నేను విశ్రమించెద. బాహ్యవిభవముల ననుభవించుటచే నేమిప్రయోజనము? సమాధి పరిపాకముచే జనించు యానందము చంద్రబింబమునగూడ యయుండజాలదు.' అని యిట్లు చింతించుచు మఱల విశ్రాంతి వైపున తనమనస్సును మఱలించుచుండగా, చంద్రుని మేఘము లాక్రమించునట్లు యా బలిచక్రవర్తిని దానవులందఱును చుట్టుముట్టిరి. అట్లు, కులపర్వతములవలె విశాలాకృతిగల నాదైత్యులచే యావృతుఁడై వారిప్రణామములచే వ్యాకులనేత్రయుతుఁడై బలిచక్రవర్తి మఱల యిట్లు చింతన జేయ దొడగెను.

చితఃక్షీణవికల్పస్య కిముపాదేయమస్తిమే
మనస్తదభిపాతిత్వాద్ధ్యాతి తద్రసతామలమ్. 9
మోక్షమిచ్ఛామ్యహం కస్మాద్బద్ధః కేనాస్మివై పురా
అబద్ధోమోక్షమిచ్ఛామి కేయంబాలవిడమ్బనా. 10
నబన్ధోస్తినమోక్షోస్తి మౌర్ఖ్యం మే క్షయమాగతమ్
కింమేధ్యానవిలాసేన కింవాధ్యానేనమేభవేత్. 11
ధ్యానాధ్యానభ్రమంత్యక్త్వా పుంస్త్వంస్వమవలోకయత్
యదాయాతితదాయాతు నమేవృద్ధిర్నమేక్షయః. 12
నధ్యానంనాపివాఽధ్యానం నభోగాన్నాప్యభోగితామ్
అభివాఞ్ఛామి తిష్ఠామి సమమేవగతజ్వరః. 13
నమేవాఞ్ఛాపరేతత్త్వే నమేవాఞ్ఛాజగత్స్థితౌ
నమేధ్యానదశాకార్యం నకార్యంవిభవేనమే. 14
నాహంమృతోనజీవామి నసన్నాసన్నసన్మయః
నేదంమేనైవచాన్యన్మే నమోమహ్యమహంబృహత్. 15
ఇదమస్తుజగద్రాజ్యం తిష్ఠామ్యత్రతుసంస్థితః
నేహవాస్తుజగద్రాజ్యం తిష్ఠామ్యాత్మనిశీతలః. 16



కింమేధ్యానదశాకార్యం కింరాజ్యవిభవశ్రియా
యదాయాతితదాయాతు నాహంకించన మేక్వచిత్. 17
నకించిదపికర్తవ్యం యదినామమయాధునా
తత్కస్మాన్నకరోమీదం కించిత్ప్రకృతకర్మవై. 18

వికల్పరహిత చిద్రూపుఁడైన నాకిక గ్రహింపదగినదేమున్నది? కాని యనాదికాలము నుండియు మనస్సు విషయములందే ప్రవర్తించుటచే నయ్యది వానితో శీఘ్రముగ నేకత్వమునొందును. నేనేల మోక్షమిచ్ఛగింపవలెను, పూర్వమెద్దానిచేనైన బంధింపబడితినా? బంధవరహితుండగు నేను మోక్షమిచ్ఛగించుట మూఢత్వమేయగును గదా! యథార్థముగ బంధముగాని మోక్షముగాని లేదు. నా యజ్ఞానమిపుడు శమించినది. ఇక ధ్యానముచేగాని ధ్యానాభావముచేగాని నాకేమిప్రయోజనము? ధ్యానాధ్యానముల రెంటియొక్క భ్రమను వీడి స్వాత్మరూపమునే యవలోకించుచునుండెద. ఏది వచ్చునో వచ్చుగాక! ఏదిపోవునో పోవుగాక! వానిచే నాయాత్మస్వరూపమునకు వృద్ధి క్షయము లేవియు గలుగబోవు. ధ్యానమునుగాని ధ్యానాభావమునుగాని, భోగములగాని, భోగరాహిత్యమునుగాని నేను వాంఛించుటలేదు. నేను కేవలము దుఃఖరహితమగు సమరూపముననే స్థితిగల్గియున్నాను. బ్రహ్మతత్వప్రాప్తియందుగాని జగత్స్థితియందుగాని నాకిపుడు కోరికలేదు. ధ్యానముచేగాని, సంసారవిభవములచే గాని ప్రయోజనమున్నులేదు. నేను మృతుడనుగాను జీవితుడగాను. సత్తునుగాను యసత్తునుగాను. ఈ దేహాభువనాదులఁగాను, యన్యదేహాభువనాదులగాను. మహత్తరమైన శుద్ధచిదాత్మరయే నేను. అట్టినాకు నా నమస్కారము. ఈ రాజ్యముండుగాక, పోవుగాక, నేను మాత్రము నాయాత్మయందు శాంతరూపమున స్థితుఁడనై యున్నాను. ధ్యానముచేగాని రాజ్యవైభవములచేగాని నాకేమియును, ప్రయోజనములేదు. ఏదివచ్చునో వచ్చుగాక! నేనుగాని, నాకు సంబంధించిన యేవస్తువుగాని యెచటనులేదు. కర్తృత్వములోగూడిన కార్యమెద్దియు నాకిపుడు లేనందున రాజ్యపాలనాది యీ ప్రకృత వ్యవహారముల నేనేల యాచరింపరాదు?

ఇతినిర్ణీయపూర్ణాత్మా బలిర్జ్ఞానవతాంవరః
దైత్యానాలోకయామాస పద్మానీవదివాకరః. 19
దృష్టిపాతవిభాగేన సర్వేషాం దనుజన్మనామ్
శిరఃప్రణామాఞ్జగ్రాహ పుష్పామోదానివానిలః. 20
అథవైరోచనిస్తత్ర ధ్యేయత్యాగమయాత్మనా
మనసా సకలాన్యేవ రాజకార్యాణిసంవ్యధాత్. 21
ద్విజాన్దేవాన్గురూంశ్చైవ పూజయామాసపూజయా
సంమానయామాస సుహృద్బన్ధుసామన్తసజ్జనాన్. 22
అర్థేనాపూరయామాస భృత్యానర్థిగణాంస్తథా
లలనా లాలయామాస విచిత్రవిభవార్పణైః. 23

ఇట్లు నిశ్చయించుకొని జ్ఞానులలోనుత్తముఁడును, పరిపూర్ణాత్మస్వరూపుఁడునగు నా బలిచక్రవర్తి యంత, సూర్యుఁడు కమలముల వీక్షించునట్లు దైత్యుల నవలోకించెను. అట్లు సర్వుల

యుచితరీతిగాంచి వాయువు పుష్పగంధముల గ్రహించునట్లు వారి శిరఃప్రణామములన్నింటిసందు కొనెను. పిదపయాతడు 'ధ్యేయవాసనాత్యాగము'తోగూడిన చిత్తముచే రాజకార్యములన్నిటిని నిర్వర్తించెను. అర్ఘ్యపాద్యాదులచే దేవబ్రాహ్మణులను, గురువులను బూజించెను. బంధుమిత్రాదులను, సామంతులను, సజ్జనులను దానమానాదులచే సత్కరించెను. భృత్యులకును, అర్థిగణంబునకును విరివిగ దానమొసంగెను. పలువిధవిభవంబులచే యంగనల సంతుష్టిబఱచె.

ఇత్యసావవృధే తస్మిన్రాజ్యే సకలశాసనే
యజ్ఞంప్రతిబభూవాథ మతిరస్యకదాచన. 24
తర్పితాశేషభువనం దేవర్షిగణపూజితమ్
సహశుక్రాదిభిర్ముఖ్యైః సచకార మహామఖమ్. 25

ఇట్లు వానిరాజ్యమంతయు సమృద్ధివంతమై యలరుచుండ నొకనాడా బలిచక్రవర్తికి యజ్ఞమొనర్ప కోర్కెజనించెను. అతఁడట్లనే యజ్ఞమొనర్ప గావించెను. అందు భూతకోట్లన్నియు తృప్తిగావింపబడెను. దేవతలు, ఋషులు పూజింపబడిరి. ఇవ్విధమున నా మహాయజ్ఞమును శుక్రాచార్యుఁడాదిగాగల ముఖ్యులతోగూడి యాతఁడు నిర్వర్తించెను.

బలిర్భోగభరస్యార్థీ నేతినిర్ణీయమాధవః
బలేరీహితసిద్ధ్యర్థం సిద్ధిద స్తన్మఖంయయౌ. 26
భోగైకకృపణాయేదం జగజ్జఙ్గలఖణ్డకమ్
దాతుంశోచ్యాయచక్రాయ వయోజ్యేష్ఠాయకార్యవిత్. 27
క్రమమాణోబలేనాత్ర వఞ్చయిత్వాబలింహరిః
బబన్ధపాతాలతలే భూగేహఇహవానరమ్. 28

బలిచక్రవర్తి భోగముల యాశించువాడుకాడని నిశ్చయించి వాని మనోరథ మీడేర్చుటకై విష్ణుభగవానుఁడాయజ్ఞమున కేతెంచెను. భోగాసక్తుఁడగుటచే కృపణుఁడును, మిగులశోచనీయుఁడునునగు జ్యేష్ఠసోదరుఁడైన యింద్రునకీ జగద్రూపవనఖండంబు నొసంగుటకై కార్యచతురుఁడగు విష్ణుభగవానుడు బలిచక్రవర్తియొనర్చు యజ్ఞమునకుఁజనెను. మాయాబలముచే త్రిలోకములను తనపాదముచే నాక్రమించి బలిచక్రవర్తిని వంచించి, భూగృహమున వానరమునువలె పాతాళమందు వానిని బంధించినైచెను.

అద్యాసౌసంస్థితోరామ పునరిన్ద్రత్వహేతునా
జీవన్ముక్తవపుఃస్వస్థో నిత్యంధ్యానవిమ్ణధీః. 29
పాతాలకుహరే తిష్ఠఞ్జీవన్ముక్తగతిర్బలిః
ఆపదంసంపదంద్రుష్ట్వా సమమైవ సపశ్యతి. 30
నాస్తమేతినచోదేతి తత్సుఖజ్ఞానుఖదుఃఖయోః
సమాస్థిరకరాచిత్ర లేఖ్యాసూర్యావలిర్యథా. 31
ఆవిర్భావతిరోభావ సహస్రాణీహజీవతామ్
తన్మనశ్చిరమాలోక్య భీమేషువిరతింగతమ్. 32



దశకోటీశ్చవర్షాణా మనుశాస్యజగత్త్రయమ్
అన్తేవిరక్తతాంప్రాప్త ముపశాన్తంబలేర్మనః. 33
ఊహాపోహాసహస్రాణి భావాభావశతానిచ
బలినాపరిద్రుష్టాని కల్పసమాశ్వాసమేత్యసౌ. 34
భోగాభిలాషంసంత్యజ్య బలిఃసంపూర్ణమానసః
ఆత్మారామస్థితోనిత్యం మధ్యేపాతాలకోటరే. 35
పునరేతేనబలినా జగదిన్ద్రితయాఖిలమ్
అనుశాస్యమిదంరామ బహూన్యబ్దగణానిహ. 36
నతస్యేన్ద్రపదప్రాప్త్యా తుష్టిఃసముపజాయతే
నతస్యస్వపదభ్రంశా దుద్వేగ ఉపజాయతే 37
సమఃసర్వేషుభావేషు సర్వదైవోదితాశయః
సంప్రాప్తమాహరన్స్వస్థ ఆకాశఇవతిష్ఠతి. 38

ఓరామా! నేటికిని బలిచక్రవర్తి జీవన్ముక్తుడై, స్వస్థచిత్తుడై, నిరంతరధ్యానపరాయణుడై ప్రపంచముయెడ యుదాసీనుడై ప్రారబ్ధవశమున తనకుసంప్రాప్తింపనున్న యింద్రత్వమునకై వేచియున్నాడు. ఇట్లు పాతాళమున జీవన్ముక్తుఁడైయున్న యాతడు సంపదలను, యాపదలను సమముగఁజూచుచుండెను. చిత్రలిఖితసూర్యకిరణమువలె సుఖదుఃఖములందు వానిబుద్ధి యచంచలమునగనుండెను. భోగలంపటులను, పెక్కువిభవములను, అనేకజన్మములయొక్క ఆవిర్భావతిరోభావములను గాంచినట్టి యాబలిచక్రవర్తికి భోగములయెడ విరక్తిజనించినది. పదికోట్ల వత్సరములు ముల్లోకముల బాలించిన తదుపరి వైరాగ్యముదయింప వానిమనంబుపశాంతినొందెను. సుఖదుఃఖములను, వాటి యుత్పత్తి వినాశములను, భావాభావములను పెక్కింటిని యాతడు గాంచియుండెను. కాని వానియందుపశాంతి యెచట? కాన భోగాభిలాషను పరిత్యజించి, పూర్ణచిత్తుడై నిరంతర మాత్మారాముఁడై సప్తపాతాళమధ్యమందు రసాతలమున స్థితుఁడైయుండెను. మఱలనాతడే యింద్రపదవినొంది ముల్లోకములను బాలించుచు యీ బ్రహ్మాండమున చిరకాలము వసించును. వానికి యింద్రపదప్రాప్తిచే సంతోషముగాని, తత్పదచ్యుతిచే ఖేదముగాని లేదు. సర్వభావములందును సమరూపముగల్గి, సదా సంతుష్టచిత్తుడై, ప్రారబ్ధముచే సంప్రాప్తమగుదాని ననుభవించుచు, స్వస్థుడై, యాకాశము భంగి నిర్మలుఁడై యుండెను.

బలేర్విజ్ఞానసంప్రాప్తిరేషాతే కథితామయా
ఏతాంద్రుష్టిమవష్టభ్య త్వమప్యభ్యుదితోభవ. 39
బలివత్స్వవివేకేన నిత్యోఽహమితి నిశ్చయాత్
పదమాసాదయాద్వైతం పౌరుషేణైవరాఘవ. 40

ఓ రామా! ఇవ్విధమున బలిచక్రవర్తి యొక్క జ్ఞానప్రాప్తినిగూర్చి నీకు దెలిపితిని. వానియాజ్ఞానదృష్టి నవలంబించినీవున్ను, జీవన్ముక్తుఁడవై చెన్నొందుము. మఱియు బలిచక్రవర్తివలె నీవున్ను వివేకముచే 'నేను నిత్యాత్మస్వరూపుఁడ'నని నిశ్చయించి స్వపౌరుషవశమున అద్వైతపదమును ప్రాప్తినొందుము.

ద్వేచాష్టౌచైవవర్షాణాం కోటేర్భుక్త్వాజగత్త్రియమ్
అన్తేవైరస్యమాపన్నో బలిరప్యసురోత్తమః. 41

అసురులలో నుత్తముఁడగు బలిచక్రవర్తి పదికోట్లసంవత్సరములు ముల్లోకమందలి భోగములన్నియు ననుభవించినను తుదకు వైరాగ్యమునే పొందెను.

తస్మాదవశ్యవైరస్యం భోగభారమరిందమ
సంత్యజ్యసత్యమానన్ద మవైరస్యంపదంవ్రజ. 42

కాన శత్రునాశకుఁడవగు నోరామా! అంతమున తప్పక దుఃఖరూపములేయగు యీ భోగసమూహమును త్యజించి నిత్యమై, సత్యమై, సచ్చిదానందమై, దుఃఖరహితమైనట్టి యుత్తమపదమునొందుము.

ఇమాదృశ్యదృశోరామ నానాకారవికారదాః
నేహాకాన్తతయాజ్ఞేయా దూరాచ్చైలశిలాఇవ. 43

ఓ రామా! ఈ దృశ్యపదార్థములన్నియు పలువిధవికారములఁ గల్గజేయునవే యగును. దూరస్థపర్వతశిలవలె వీనియందు రమణీయత్వమెద్దియును లేదు.

ధావమానమిహోపుత్ర లుఠితంలోకవృత్తిషు
సంస్థాపయనిబద్ధ్వైత చ్చేతో హృదయకోటరే. 44

ఇహపరలోకసుఖులకు బరువిడుచు, ప్రాపంచిక వృత్తులందు మెలంగు నీమనంబును హృదయకోటరమున స్థాపితమొనర్పుము.

చిదాదిత్యోభవానేవ సర్వత్రజగతిస్థితః
కఃపరస్తేకఆత్మీయః పరిస్ఖలసికింముధా. 45
త్వమనన్తోమహాబాహో త్వమాద్యఃపురుషోత్తమః
త్వంపదార్థశతాకారైః పరిస్ఫూర్జతిచిద్వపుః. 46

సర్వప్రకాశకమైన చిదాదిత్యుఁడవై యీ ప్రపంచమంతట నీవే వ్యాపించియుండ యిక నీకు శత్రువెవడు? మిత్రుడెవడు? ఏలవ్యర్థముగ నీవాత్మపదమునుండి చ్యుతుఁడవగుచుంటివి. మహాబాహుఁడవగు నోరామా! నీవనంతుడవు. ఆదిపురుషుఁడవు. పురుషోత్తముడవు. చిన్మాత్రశరీరుఁడవగు నీవే వివిధపదార్థరూపములఁధరించి విజృంభించుచున్నాడవు.

త్వయిసర్వమిదంప్రోత్రం జగత్స్థావరజఙ్గమమ్
బోధేనిత్యోదితేశుద్ధే సూత్రేమణిగణా యథా. 47

నిత్యబోధస్వరూపుఁడవును, శుద్ధుఁడవునగు నీయందీ స్థావరజంగమాత్మక ప్రపంచమంతయు దారమందు మణులవలె గ్రుచ్చబడియున్నది.

నజాయతేనమ్రియతే త్వమజఃపురుషో విరాట్
చిచ్ఛుద్ధాజన్మమరణ భ్రాన్తయో మా భవన్తుతే. 48

నీవు జన్మించుటలేదు, మరణించుటలేదు. జననమరణరహితమగు శుద్ధచిద్రూపుఁడవే నీవు. మఱియు నీవు విరాట్పురుషుఁడవు, గాన జననమరణముల భ్రాంతి నీకు వలదు.



సమస్తజన్మరోగాణాం ప్రవిచార్యబలాబలమ్
తృష్ణాముత్సృజ్యభోగానాం భోక్తైవ భవకేవలమ్. 49

తృష్ణావృద్ధిచే జన్మాదులను రోగములు ప్రబలమగును. తృష్ణ సన్నగిల్లుటచే నవియును సన్నగిల్లును. ఇట్లువాని బలాబలంబుల పరీక్షించి భోగములందలి తృష్ణను విడనాడి కేవలము సాక్షిమాత్రుడవై యుండుము.

త్వయిస్థితేజగన్నాథే చిదాదిత్యేసదోదితే
ఇదమాభాసతేసర్వం సంసారస్వప్నమణ్డనమ్. 50

జగదీశ్వరుఁడవును, చిదాదిత్యుఁడవునగు నీవు నిత్యముదయించి యుండినందుననే స్వప్నతుల్యమైన యీ జగద్విలాసమంతయును ప్రతిభాసించుచున్నది.

మావిషాదంకృథావ్యర్థం సుఖదుఃఖైషణా నతే
శుద్ధచిత్తోఽసి సర్వాత్మా సర్వవస్త్వవభాసకః. 51

ఓ రామా! నీవు వ్యర్థముగ శోకింపజనదు. యథార్థముగ సుఖదుఃఖముల భావనయే నీకు లేదు. నీవుపరిశుద్ధచిత్తుఁడవు. సర్వాత్మస్వరూపుఁడవు. సర్వవస్తుప్రకాశకుఁడవు.

పూర్వమిష్టమనిష్టంత్వ మనిష్టంచేష్టమిత్యపి
పరికల్ప్యతదభ్యాసా త్తత్తతోఽపిపరిత్యజ. 52

మనమునకు మొట్టమొదట ప్రియముగ దోచు విషయాది పదార్థములన్నియు అంతమున దుఃఖదాయకములనియు, అప్రియముగదోచు తపఃక్లేశ, ఇంద్రియసంయమాదులంతమున సుఖదాయకములనియు నెంచి సప్తమభూమికాపర్యంతము వానినభ్యసించి తుదకట్టి కల్పననుగూడ పరిత్యజింపుము.

ఇష్టానిష్టదృశోస్త్యాగే సమతోదేతిశాశ్వతీ
తయాహృదయవర్తిన్యా పునర్జన్తుర్నజాయతే. 53

ఇష్టానిష్టకల్పనను త్యజించుచో శాశ్వతమగు సమత్వముదయించును. అట్టి సమత్వము హృదయమున స్థిరపడినచో జీవుడు మఱల యీ సంసారమున జన్మింపకుండును.

యేషుయేషుప్రదేశేషు మనోమజ్జతిబాలవత్
తేభ్యస్తేభ్యఃసమాహృత్య తద్ధితత్త్వేనియోజయేత్. 54

బాలునివలె యీమనస్సేయే పదార్థములందు సంలగ్నమగుచుండునో, వాటినుండి తొలగించి అధిష్ఠానమగు చిన్మాత్రమందే యద్దానిని నెలకొల్పవలెను.

ఏవమభ్యాగతాభ్యాసం మనోమత్తమతంగజమ్
నిబధ్యసర్వభావేన పరంశ్రేయోఽధిగమ్యతే. 55

ఇట్లభ్యాసముచేతను సర్వప్రయత్నములచేతను, సర్వాత్మభావముచేతను యీ మనస్సను మదగజము నిగ్రహింపబడినచో జీవునకు మోక్షమను యుత్తమశ్రేయము లభించును.

మాశరీరయథార్థజ్ఞై ర్మిథ్యాదృష్టిహతాశయైః
మూర్ఖైఃసంకల్పవిక్రీతై ర్వమూఢైఃసమతాంవ్రజ. 56

దేహమును సత్యమని నమ్మువారును, మిథ్యాదృష్టిచే కలుషితమైన చిత్తముగలవారును భోగసంకల్పములకు వశీభూతులునగు మూఢులవలె నీవెన్నటికిని గాకుము.

అకించనాత్స్వసిర్ణీతౌ లంబమానాత్పరో క్షితౌ
నమౌర్ఖ్యాదధికోలోకే కశ్చిదస్తీహదుఃఖదః. 57

ఆత్మతత్వనిర్ణయవిషయమున, (వివేకవైరాగ్యాది) ఉపాయరహితమును, అజ్ఞులయుక్తుల కాధారభూతమునగు మూర్ఖత్వమునకు (అవివేకమునకు) సమమగు దుఃఖప్రదమైన వస్తువీప్రపంచమున మఱియొకటిలేదు.

త్వమేతదవివేకాభ్రముదితం హృదయాంబరే
వివేకపవనేనాశు దూరం నయమహామతే. 58

ఓ మహామతీ! హృదయాకాశమున నుదయించిన అవివేకమను మేఘమును వివేకమను వాయువుచే శీఘ్రముగ తొలగించివేయుము.

ఆత్మనైవప్రయత్నేన యావదాత్మావలోకనే
నకృతోఽనుగ్రహస్తావన్న విచారోదయోభవేత్. 59

సచ్ఛాస్త్రశ్రవణ, వైరాగ్యాది పురుషప్రయత్నములచే ఆత్మదర్శనవిషయమున స్వయముగ యత్నింపనంతవఱకు ఆత్మవిచారము నీయందుదయింప నేరదు.

వేదవేదాన్తశాస్త్రార్థ తర్కదృష్టిభిరప్యయమ్
నాత్మాప్రకటతామేతి యావన్నస్వమవేక్షితమ్. 60

మఱియు గురూపదేశాదులద్వారా అంతర్ముఖదృష్టిచే స్వయముగ నవలోకింపబడనంతవఱకు కేవల వేదవేదాంత, తర్కదృష్టుల (బహిర్ముఖదృష్టి)చే నీయాత్మ యెన్నటికిని వ్యక్తముగానేరదు.

త్వమాత్మన్యాత్మనా రామ ప్రసాదేసముపస్థితః
ప్రాప్తోఽసివితతంబోధం మద్వచస్యేవ బుధ్యసే. 61

ఓ రామా! నాయుపదేశముచే నీవాత్మయందు స్థితిబొందినవాడవై విస్తృతమగు ఆత్మబోధమును ప్రాప్తినొందితివి.

వికల్పాంశవిహీనస్య త్వయైషాచిద్వివస్వతః
గృహీతావితతావ్యాప్తి ర్మదుక్త్యాపరమాత్మనః. 62

వికల్పరహితమగు చిన్మాత్మ స్వరూపమైన పరమాత్మయే దేశకాలవస్తువులన్నింటిని వ్యాపించియున్నదని నీవు నాయుపదేశముచే గ్రహించితివి.

విలీనసర్వసంకల్పః శాన్తసందేహవిభ్రమః
క్షీణకౌతుకనీహారో జాతోఽసివిగతజ్వరః. 63

ఓ రామచంద్రా! నీవిపుడు సర్వసంకల్పవర్జితుఁడవై, సంశయవిభ్రమములులేక బాహ్యప్రపంచకౌతుకమను నీహారము నుపశమించినవాడవై సంతాపరహితుఁడవైతివి.



యదుపగచ్ఛసి పాసి సిహంసివా
పిబసి విస్మయసేచ వివర్ధసే
తదపి తేన తదాస్తు యదా మునే
విగతబోధకలఙ్కవిశఙ్కితః. 64

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే బలేర్విజ్ఞానప్రాప్తిర్నామైకోనత్రింశః
సర్గః ॥ 29 ॥

ఓ రామా! ఆవరణవిక్షేపరూపమగు నీఆత్మయొక్క కళంకమెపుడు నశించునో, అపుడు జ్ఞానమును ప్రాప్తించుట, తత్సాధనభూతమగు విచారాదుల నొనర్చుట, వివేకవైరాగ్యాదులచే వాటి రక్షణయొనర్చుట, ప్రమాదాలస్యాది దోషముల నివారించుట, సమాధిసుఖమను అమృతమును పానమొనర్చుట, ఉత్తరోత్తరభూమికారోహణముచే విస్మయమును బొందుట, సప్తమభూమికయందలి విశ్రాంతిచే సుఖాభివృద్ధినొందుట మున్నగునవేమియును లేక కేవలము బ్రహ్మభూతుఁడవైయుందువు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
బలి విజ్ఞానప్రాప్తియను ఏకోనత్రింశ
సర్గము ॥ 29 ॥

---

## త్రింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అథేమం పరమం రామ విజ్ఞానాభిగమే క్రమమ్
శృణుదైత్యేశ్వరః సిద్ధః ప్రహ్లాదః స్వాత్మనా యథా. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! ఇక నిప్పుడు సర్వోత్తమజ్ఞానప్రాప్తి కుపాయమెఱింగించు నిమిత్తము దానవేశ్వరుడగు ప్రహ్లాదుఁడెట్లుసిద్ధిని బడసెనో యద్దానిని వచించెద, యాకర్ణింపుము.

ఆసీత్పాతాలకుహరే విద్రావితసురాసురః
హిరణ్యకశిపుర్నామ నారాయణపరాక్రమః. 2

సురాసురులఁ బారద్రోలువాడును, నారాయణునితోటి సమమైన పరాక్రమముగలవాడునగు హిరణ్యకశిపుఁడను దైత్యుడు పాతాళమున వసించుచుండె.

ఆక్రాన్తభువనాభోగః సజహార హరేర్జగత్
షట్పదస్యబృహత్పత్రం రాజహంస ఇవాంబుజమ్. 3

భ్రమరమునకు నివాసభూతమగు కమలమును ప్రాతఃకాలమున రాజహంస పెఱికివైచునట్లు సుశ్లోకములజయించునట్టి యాతఁడు యింద్రునినుండి త్రిలోకైశ్వర్యమునుఁగూడ పెఱికివైచెను.

చకార జగతాం రాజ్యం సమాక్రాన్తసురాసురః
దన్తీ నిరస్తహంసౌఘో నలిన్యామలినామివ. 4

హంసభ్రమర సమూహములఁ జయించి కమలసరమును గజమాక్రమించువిధమున, సురాసురులఁ జయించి యాతఁడు త్రిభువనముల నేలెను.

అథాసావసురాధీశః కుర్వంస్త్రిభువనేశతామ్
కాలేన సుషువే పుత్రానఙ్కురానివ మాధవః. 5

అట్లు రాజ్యమేలుచుండు ముల్లోకములఁ బాలించుచు వసంతకాలము అంకురముల నుత్పన్నము నొనర్చునట్లు కాలక్రమమున పలువురు పుత్రులఁబడసెను.

తేఽవర్ధన్తాచిరేణైవ తేజస్వ్యూర్జితబాలకాః
దశార్కాంశుశతానీవ వ్యోమాక్రాన్తి విలాసినః. 6

బాలకులైనను మిగుల పరాక్రమశీలురును, దేవలోకము నాక్రమింప దలంచువారలునగు నా సుతులు సూర్యకిరణములవలె యనంతరూపముల వృద్ధినొందసాగిరి.

ప్రహ్లాదనామా బలవాన్ప్రధానాత్మా బభూవహ
తేషాం మధ్యే మహార్ఘాణాం మణీనామివ కౌస్తుభః. 7

మణులందు కౌస్తుభమువలె వారలలో ప్రధానుఁడైన ప్రహ్లాదుడను నాతఁడు యువరాజయ్యెను.

తేనారాజత పుత్రేణ హిరణ్యకశిపుర్భృశమ్
సర్వసౌన్దర్యయుక్తేన వసన్తేనేవ వత్సరః. 8

సర్వసౌందర్యయుతుఁడగు నా ప్రహ్లాదునిచే హిరణ్యకశిపుడు వసంతకాలముచే వత్సరమువలె మిగుల శోభనుబొందెను.

అథ పుత్రసహాయోఽసౌ బలకోశసమన్వితః
ఆజగామ మదం దైత్యస్త్రిగణ్డగలితేభవత్. 9

అట్టిపుత్రుల సహాయము గల్గి, సేనా కోశసహితుఁడైయున్న యాదైత్యుఁడు త్రిగండస్థలముల నుండి స్రవించుచున్న మదధారలు గల యేనుగువలె మిగుల మదమును బొందెను.

తత్ప్రాక్రాన్తితాపేన త్రిజగత్స్వవికాసినా
కల్పాన్తసూర్యగణవన్నవమైవ కరశ్రియా. 10

నూతనకిరణయుక్తప్రళయకాల సూర్యసమూహముచే ముల్లోకములు సంతప్తమగునట్లు ఆ దైత్యుని ప్రతాపముచే త్రిలోకములును పీడితములయ్యెను.

అఖిద్యన్తాస్య తేనాథ సూర్యేన్దుప్రముఖాః సురాః
దుర్విలాసవిలోలస్య బాలస్యేవ స్వబన్ధవః. 11

దుష్టస్వభావముగల చపలబాలునిచే వాని బంధువులు పీడింపబడునట్లు, సర్వులఁ జయించినట్టి యాదైత్యుని ప్రతాపముచే సూర్యచంద్రాది దేవతలున్ను పీడితులైరి.



ప్రార్థయాంచక్రిరేఽథాజం దైత్యేన్ద్రేభపతేర్వధే
న క్షమన్తే మహాన్తోఽపి పౌనఃపున్యేన దుష్క్రియామ్. 12

అటుపిదప నా దైత్యేంద్రుఁడను గజమును సంహరించు నిమిత్తము దేవతలు విష్ణుభగవానుని ప్రార్థించిరి. ఏలన, మాటిమాటికొనర్చు యపరాధమును మహాత్ములైనను సహింపనోల్లరు.

తతః ప్రలయపర్యస్తజగద్ఘర్ఘరజృమ్భితమ్
దిగ్దన్తిదశనప్రఖ్యనఖవజ్రాదిజృమ్భితమ్. 13

స్థిరవిద్యుల్లతాజాలభాసురద్విజమణ్డలమ్
దశదిక్కోటరోద్భ్రాన్తజ్వలజ్జ్వలనకుణ్డలమ్. 14

సమస్తకులశైలేన్ద్రపిండపీనోద్భటోదరమ్
దోర్ద్రుమాఘాతనిర్ధూతస్ఫురద్బ్రహ్మాండఖర్పరమ్. 15

వదనోదరనిష్క్రాన్తవాతోత్సారితపర్వతమ్
త్రిజగద్దహనోద్యుక్తకోపకల్పాగ్నిగర్వితమ్. 16

సటావికటపీనాంసస్పన్దప్రేరితభాస్కరమ్
రోమకూపలసద్వహ్నిపుంజాపింజరపర్వతమ్. 17

కులాచలమహాకుడ్యఘటనోద్భటదిక్తటమ్
సర్వావయవనిష్క్రాన్తపట్టిశప్రాసతోమరమ్. 18

నారసింహం వపుః కృత్వా మాధవోఽహన్మహాసురమ్
లసత్కటకటారావం తురఙ్గమమివ ద్విపః. 19

అపుడు ప్రళయకాల జగంబువోలె ఘర్ఘరనినాదంబొనర్చుచు, అంగ పరివర్తనము సల్పుచు, దిగ్గజ దంతములవంటి నఖములుగల్గి వజ్రసమానమగు దేహముయొక్క ప్రకాశముచే శోభించుచు, మెరుపువలె ప్రకాశవంతమైన దంతములును, దశదిక్కులఁ జ్వలింపజేయు అగ్నివంటి కుండలములును, కులపర్వతముల యాకృతివలె భయంకరమైన యుదరమును, భుజరూప వృక్షములచే ప్రకంపితమై యెగురగొట్టబడిన బ్రహాండముగల్గి, ముఖద్వారమునుండి బయల్వెడలిన వాయువుచే పర్వతములఁగూడ నూడబెఱుకువాఁడై, త్రిలోకముల దగ్ధమొనర్ప నుద్యుక్తమగు క్రోధాగ్నిచే గర్వీభూతుఁడై, భయంకరమైన కంఠభాగముగలవాఁడై, భుజములచే సూర్యునిగూడ ప్రేరితమొనర్చుచు, రోమకూపములందలి యగ్నిసమూహములచే పర్వతములగూడ వినాశముగావించుచు, కులపర్వతముల త్రవ్వి భిత్తినిర్మాణ మొనర్పనుద్యుక్తమైన దిక్సమూహముచే శోభితుడై(విశాలదేహుఁడై), పలువిధ యాయుధంబుల ధరించిన శరీరభాగములు గల్గి శోభించుచు, నృసింహదేహమును ధరించి కటకటాశబ్దమొనర్చుచు విష్ణుభగవానుడు మహాసురుఁడగు హిరణ్యకశిపుని, గజమశ్వమును వధించునట్లు వధించివైచెను.

పౌరమాసురముద్వాన్తైర్దదాహేతుణవహ్నిభిః
స సర్వభూతకల్పాన్తే జగజ్జాలమివానలః. 20

మఱియు కల్పాంతమున ప్రాణికోటిసంయుక్తమగు జగత్సమూహమంతటిని యగ్ని భస్మీభూతమొనర్చునట్లు తన ప్రచండనేత్రాగ్నిచే నృసింహభగవానుఁ డయ్యసురునిగరమును గాల్చివైచెను.

నృసింహమారుతే తస్మిన్భృశం క్షోభముపాగతే
విస్ఫూర్జితఘనాస్ఫోటై రేకార్ణవ ఇవాకులే. 21
దుద్రువుర్దానవౌఘాస్తే దిగ్జ్వాలన్మశకా ఇవ
ఉపాయయురదృశ్యత్వం దీపాఇవ గతత్విషః. 22

విద్యుత్సహిత మేఘగర్జనలు గల్గి ప్రళయవాయువువలె విస్తృతమైన నృసింహుడను వాయువు విజృంభింప, దిక్కులందంతట యగ్నిరగుల్కొనుటచే మశకములన్నియు పారిపోవుచందమున యాదానవులందఱును పలాయనులై ప్రకాశరహితమగు దీపమువోలె నదృశ్యులైరి.

అథ విద్రుతదైత్యేన్ద్రం దగ్ధాన్తఃపురమండలమ్
బభూవ పాతాలతలం కల్పక్షుణ్ణజగత్సమమ్. 23

ఆత్తఱి నాయకరహితులగు దైత్యులున్ను భస్మీభూతమైన యంతఃపురములును గల యా పాతాళము ప్రళయకాలవిదగ్ధజగంబువోలె నుండెను.

అకాలకల్పాన్తవిధౌ హత్వాదైత్యం శనైర్విభౌ
క్వాపియాతేసమాశ్వస్త సురసంరభపూజితే. 24

అకాల కల్పాంతమువలెతోచిన యా సంగ్రామమున హిరణ్యకశిపుని వధించి సురసమూహమునకు ధైర్యముగొల్పి వారిచే నత్యాదరమున బూజితుడై విష్ణుభగవానుడు వాగగోచరమగు నిజపదమునకుఁ జనెను.

మృతశిష్టాదనుసుతాః ప్రహ్లాదపరిపాలితాః
దగ్ధంతం దేశమాజగ్ముః సరఃశుష్కమివాండజాః. 25
తత్రకాలోచితాంకృత్వా స్వనాశపరిదేవనామ్
ఔర్ధ్వదేహికసత్కారం చక్రుఃప్రేతేషు బన్ధుషు. 26

ప్రహ్లాదునిచే పాలితులును, మృతినొందగా శేషించినవారునునగు దానవులు శుష్కించిన తటాకమును పక్షులు సమీపించునట్లు భస్మీభూతమైన యాప్రదేశమును సమీపించినవారై బంధువినాశమునకై మిగుల పరితపించి, మృతించిన తమ యా బంధుగణమున కౌర్ధ్వదైహికక్రియల నొనర్చిరి.

హతబంధుజనం ప్లుష్టబంధుబాంధవమండలమ్
శనైరాశ్వాసయామాసుర్మృతశిష్టం స్వకం జనమ్. 27

హతులుకాగా మిగిలినట్టి యా బంధువర్గమును ప్రహ్లాదుఁడు క్రమముగ శాంతబఱచెను.

చిత్రార్పితోపమ దురాకృతయో నిరీహా
దీనాశయాహి మహతామ్బురుహోపమానాః
శోకోచ్ఛ[illegible]గనాయకాస్తే
[illegible] 28



ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ప్రహ్లాదవిశ్రాన్తౌ హిరణ్యకశిపువధోనామ
త్రింశః సర్గః ॥ 30 ॥

అంత శోకసంతప్తమానసులగు యసురనాయకులు లిఖిత చిత్రమువలెను, విదగ్ధ శాఖాపత్రసహితమగు వృక్షమువలెను నిశ్చేష్టులైరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రహ్లాద విశ్రాంతియందు హిరణ్యకశిపువధయను త్రింశ
సర్గము ॥ 30 ॥

---

## ఏకత్రింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అథదుఃఖపరీతాత్మా హరిణా హతదానవే
ప్రహ్లాదశ్చిన్తయామాస మానీ పాతాలకోటరే. 1

శ్రీవసిష్ఠుడు :—ఓ రామా ! అటుపిమ్మట, దానవసంహారము జరిగిన యా పాతాళలోకమున దుఃఖాక్రాంత చిత్తుడై ప్రహ్లాదుడు మానమునో నిట్లు చింతించెను.

కోన్వస్మాకముపాయః స్యాద్యపవేహాసురాఙ్కురః
తీక్ష్ణాగ్రో జాయతే తంతం భుఙ్క్తే శాఖామృగో హరిః. 2

ఇక మనకు రక్షకుఁడెవడు ? అసురులను యంకురము సంపదాదులను పత్రములతోగూడి స్థిరత్వము నొందునప్పుడెల్ల విష్ణువను వానరముచే నది భక్షించివేయబడుచున్నదే!

న కదాచన పాతాలే దైత్యా దోర్దండశాలినః
స్థిరా బభూవురుద్భిన్నాః పద్మాఇవ హిమాచలే. 3

హిమాలయపర్వతముపై కమలను స్థిరత్వమునొందినవిధమున తమ భుజపరాక్రమముచే శోభించు దైత్యులున్ను, స్వసామర్థ్యముచే పాతాళమున ప్రకాశమునొందకయు స్థిరరూపము బడయకయుండిరి.

ఉత్పత్యోత్పత్యనశ్యన్తి భాసురాకారఘర్ఘరాః
క్షీణప్రస్ఫురితారంభాస్తరంగా ఇవ వారిధేః. 4

చంచలరూపమున స్ఫురించి నశించునట్టి సముద్రతరంగములవలె, ప్రకాశవంతమగు యాకృతిగల్గి, ఘర్ఘరనినాదంబొనర్చునట్టి యియ్యసురులున్ను జన్మించివినాశంబొందుచుండిరి.

సబాహ్యాభ్యంతరం కష్టం సమగ్రాలోకహారిణః
రిపవఃప్రౌఢిమాయాతా అపూర్వతిమిరభ్రమాః. 5

రాజ్యాది బాహ్యవిభవములులను, హర్షోత్సాహాది యాంతరికసంపదలను హరించినట్టి భ్రమయుతులగు దేవతాశత్రువులిపుడు ప్రౌఢత్వమునొందిరి. ఆహా ! ఎట్టి కష్టకరమగు విషయము !

తమఃప్రపూర్ణహృదయాః సంకుచత్పత్రసంపదః
సుహృదః ఖేదమాయాన్తి సిశీథకమలాకరాః. 6

దుఃఖమను యంధకారముతోఁగూడి, సంపదలను యల్ప పత్రసంయుక్తములైన మిత్రులను కమలము లిపుడు మిగుల ఖిన్నములైనవి.

తాతస్యమలినైర్మ్లానం పాదపీఠోపమర్దకైః
సుతైర్విషయ ఆక్రాన్తో మృగైరివ మహావనమ్. 7

మలినచిత్తులును, ప్రణామములచే మజ్జనకుని చరణపాదుకల స్పృశించునారుగు దేవతలు, విశాలవనమును హరిణము క్రమించువిధమున యీ మా దేశమంతయును ఆక్రమించుకొనిరి.

నిరుద్యమాగతశ్రీకా దీనాః ప్రకటితాశయాః
బాంధవా నవిరాజన్తే పద్మాః ప్లుష్టదలా ఇవ. 8

ఉద్యమరహితులై, సంపదల గోల్పోయి, దీనులై, తమహార్దికదుఃఖమును వ్యక్తపఱచుచు నా బంధుగణము భస్మీభూతకమలమువలె శోభావిహీనమయ్యెను.

స్ఫురన్త్యసురవీరాణాం గృహేష్వవిరతానిలైః
ధూసరా భస్మనీహారా ధూపధూమభరా ఇవ. 9

అసురవీరుల గృహములందు నిరంతరోత్పాతములను వాయువుచే రేఁగురఁగొట్టబడిన భస్మమను నీహారము, ధూపముయొక్క ధూమమువలె శోభించుచున్నది.

హృతద్వారకపాటాసు దైత్యాన్తఃపురభిత్తిషు
ప్రభా మరకతస్యేవ జాతా నవయవాఙ్కురాః. 10

కవాటములులేని ద్వారములుగల యంతఃపురపు గోడలందు, మరకతమణులవలె ప్రకాశించునట్టి నూతన యవాంకురము లిపుడుత్పన్నమాయెను.

త్రిలోకీనాభినలినీ మత్తేభా దానవా అపి
దేవవద్దైన్యమాయాతాః కిమసాధ్యమహో విధేః. 11

త్రిలోకనాభికమలమును (మేరుపర్వతమును) మదగజమువలె సమ్మర్దనమొనర్ప సమర్థులగు దానవులిపుడు పూర్వము దేవతలవలెఁగున మిగుల దీనత్వము నొందియున్నారు. ఆహా! విధిగతి కసాధ్యమెద్ది?

మనాక్చలతి పూర్ణేఽపి దృష్టారిభయభీతయః
వధ్వస్త్రస్యన్తి విధ్వస్తా మృగ్యో గ్రామగతా ఇవ. 12

పత్రము లల్పముగ చలించినను భీతిఁజెందునట్టి దైత్యస్త్రీలిపుడు, గ్రామమున ప్రవేశించిన మృగసమూహమువలె మిగుల యుద్వేగము నొందుచున్నారు.

ఆసురీకర్ణపూరార్థం ఫుల్లా రత్నగులుచ్ఛకాః
నరసింహకరా[illegible]నాః స్థాణుతామాగతా ద్రుమాః. 13



అసురస్త్రీల కర్ణభూషణముల కుపయుక్తములగు రత్నమయగుచ్ఛములఁ ధరించు దివ్యవృక్షములిపుడు నరసింహుని హస్తములచే చిన్నభిన్నములగుటచే స్థాణుత్వముఁ జెందినవి.

దివ్యాంబరలతాపత్రా రత్నస్తబకదన్తురాః
పునరారోపితాస్తత్ర నన్దనే కల్పపాదపాః. 14

దివ్యవస్త్రి లతా పత్ర శాఖాసహితమై రత్నమయగుచ్ఛములతో నొప్పారు కల్పవృక్షములు నందనవనమున మఱలస్థాపింపబడెను.

పురా త్వమరబన్దీనామసురైః సంస్తుతం ముఖమ్
అద్య త్వసురబన్దీనాం సురైరాలోకితం ముఖమ్. 15

బందితులగు దేవతాస్త్రీల ముఖములను పూర్వమసురులు సంతోషముతో నవలోకించిరి. కానియిపుడు బంధితులగు యసురస్త్రీలముఖములనే దేవతలవలోకించుచుండిరి!

మన్యే దానమహానద్యః సురేభకటభిత్తిషు
ప్రవృత్తాస్తా భవిష్యన్తి శైలసానుష్వివాపగాః. 16

పర్వతశిఖరములనుండి ప్రవహించు నదులవలె యిపుడు దేవతాగజముల గండస్థలములను భిత్తిసమూహమునుండి మదధారలు ప్రవహించుచుండునని నేనెంచెద.

అస్మాకమిభగణ్డేషు దానదాహవిభూతయః
లసన్తి మరుఖణ్డేషు సంశుష్కేష్వివ ధూలయః. 17

కాని మన యేనుగుల గండస్థలములందలి మదదాహముచే జనించిన భస్మము శుష్కమరుభూములందలి ధూళివలె శోభించుచున్నది.

వికాసిసితమందార మకరందారుణానిలాః
తే మేరుశిఖరైస్తుల్యా దైత్యా దుర్లభతాం గతాః. 18

పరాగయుక్త వికసిత శ్వేత మందార పుష్పరససహితమైన వాయుస్పర్శచే పరితృప్తులును, మేరుపర్వత శిఖరములవలె విశాలదేహులునగు యసురులిపుడరుదైరి.

సురగంధర్వసుందర్యో దానవాన్తఃపురోచితాః
అద్య మేరౌ స్థితిం యాతా మంజర్య ఇవ పాదపే. 19

దానవాంతఃపురయోగ్యులగు దేవగంధర్వసుందరులిపుడు వృక్షముపై లతవలె మేరు పర్వతముపై స్థితిఁగొనియున్నారు.

కష్టం తాతపురంధ్రీణాం శుష్కాంబురుహనీరసాః
విలాసాః సురనారీభిర్భర్త్స్యన్తే లాస్యలీలయా. 20

ఆహా! కడుంగడు కష్టము! మజ్జనకుని పురంధ్రిగణముయొక్క శుష్కకమలసదృశములగు నీరస విలాసముల నిపుడు దేవాంగనలు తమ నృత్యలీలయందు భర్త్సనమొనర్చెదరు.

పూర్వం యైరేవ మత్తాతశ్చామరైరుపవీజితః
సహస్రనయనః స్వర్గే కష్టం తైరేవ వీజ్యతే. 21

ఏ చమరములు పూర్వము నాతండ్రికి వీవబడుచుండెనో అయ్యవి యిపుడు స్వర్గమున యింద్రునకు వీవబడుచున్నవి.

ఇయమస్మాకమప్యాపదాగతా దైన్యదాయినీ
తస్యైకస్యప్రసాదేన దుష్పౌరుషగతేర్హరేః. 22

దురతిక్రమమగు పరాక్రమముగల విష్ణువుచేతనే మనకిట్టిదీనత్వము గల్గజేయు యాపద మనకు తటస్థించినది.

తద్దోర్వనఘనచ్ఛాయా లబ్ధవిశ్రాన్తయః సురాః
న కదాచన తప్యన్తే హిమాద్రేరివ సానవః. 23

ఆ విష్ణువుయొక్క భుజములను దట్టమైన వనచ్ఛాయయందు విశ్రమించునట్టి దేవతలు హిమాలయశిఖరమువలె యెన్నటికిని సంతప్తులు గాకయున్నారు

శౌరిశౌర్యాగ్రశిఖర సంశ్రయేణాశ్రితశ్రియః
అస్మాన్సముపరున్ధన్తి శునః శాఖామృగాఇవ. 24

విష్ణుపరాక్రమమును పర్వతశిఖరముయొక్క యాశ్రయముచే సంపత్తియుతులగు దేవతలు, వానరము శునకముల నడ్డగించునట్లు దైత్యుల పాతాళమున యవరోధించుచున్నారు.

తేనాసురపురన్ధ్రీణాం నిత్యం మండనమండనే
ముఖపద్మేస్థితం బాష్పమబ్జినీనాం హిమం యథా. 25

విష్ణుపరాక్రమకారణమున, మిగుల సౌందర్యవంతులగు యసురస్త్రీల ముఖకమలములపైనను, కమలసరస్సుపై మంచుబిందువులవలె కన్నీటిబిందువులు నెలకొనియున్నవి.

శీర్ణభిన్నలురద్భిత్తిర్జగజ్జరఠమండపః
అయంనీలమణిస్తంభైస్తద్భుజైరేవ ధార్యతే. 26

అసురుల పరాక్రమముచే విదీర్ణమొనర్పబడి, క్రుంగుచున్న భిత్తిసమూహముగల యీ జగత్తను పురాతన మండపము, నీలమణిచందమున శ్రీ విష్ణుభగవానుని భుజములచే ధరింపబడి యున్నది.

సధర్తాసురసైన్యస్య మజ్జతోవిపదర్ణవే
క్షీరోదోదరమగ్నస్య మందరస్యేవ కచ్ఛపః. 27

క్షీరసముద్రమున మునుంగుచున్న మందరపర్వతమును కూర్మముద్ధరించిన చందమున విపత్సాగరమున మునుంగుచున్న దేవతాసైన్యమును విష్ణుభగవానుఁడుద్ధరించుచున్నాడు.

ఏతేతాతాదయః సర్వే తేనైవాసురసత్తమాః
పాతితాః క్షుబ్ధకల్పాన్తవాతేనేవ కులాచలాః. 28

ప్రళయ వాయువుచే కులపర్వతములవలె, మజ్జనకుఁడాదిగాగల యసురశ్రేష్ఠులందఱును విష్ణువుచే నాశమొనర్పబడిరి.

స ఏకఏవ సంహారకర్మక్షమభుజానలః
సురసార్థగురుః శ్రీమాన్విషమో మధుసూదనః. 29



శత్రుసంహారసమర్థుఁడును, భుజరూప యగ్నిసహితుఁడును, దేవతలలో నెల్ల శ్రీమంతుఁడును, పరులచే నిదుర్కొనబడనివాడునగు విష్ణుభగవానుఁడొకఁడే సర్వులలోను సమర్థుడగును.

దైత్యదోర్దండవనశో స్తస్య పౌరుష్యేణవీర్యవాన్
దానవాన్బాధతే శక్రో బాలకానివ మర్కటః. 30

దైత్యుల భుజసమూహముల ఛేదించుటయందు గండ్రగొడ్డలివంటి యీ విష్ణుభగవానుని యొక్క పరాక్రమము ననుసరించియే మిగుల శక్తిశాలియగు యింద్రుడును, బాలుని మర్కటము వోలె దైత్యుల బాధించుచున్నాడు.

దుర్జయఃపుండరీకాక్షః ప్రమముక్తాయుధోఽపి సన్
నాసౌశస్త్రాస్త్రవిచ్ఛేద్యైర్వజ్రసారో విదీర్యతే. 31

శస్త్రాస్త్రములు ధరింపకున్నను గూడ యీ విష్ణుభగవాను నెవరును జయింపలేరు. వజ్రమువంటి దృఢమైనవాడుగాన శస్త్రాస్త్రములచే నాతడు ఖండింపబడడు.

అభ్యస్తాబహవస్తేన మిథః ప్రేరితపర్వతాః
భీమాః సమరసంరంభాః సమనుస్మృత్పితామహైః. 32
తాసు తాస్వతిఘోరాసు వితతాస్వతిరాజిషు
యోనభీతఇదానీం స భయమేష్యతి కా కథా. 33

ఒకరిపైనొకరు పర్వతములఁగూడ విసరవేసికొనినంతటి భయంకర సంగ్రామములందు నా పితామహులతో యుద్ధమొనర్చి వారివద్దనుండి యాతఁడెన్నియో యుద్ధకౌశల విశేషంబుల నేర్చుకొనియుండెను. అట్టి ఘోరసంగ్రామములందును భీతిఁజెందని యాతఁడిప్పుడు భయభీతుఁడుగుట యెట్లు తటస్థించును?

ఉపాయమేకమేవేమం హరేరాక్రమణే స్ఫుటమ్
మన్యే తద్వ్యతిరేకేణ విద్యతే నప్రతిక్రియా. 34
సర్వాత్మనా సర్వధియా సర్వసంరంభరంహసా
స ఏవ శరణందేవో గతిరస్తీహ నాన్యథా. 35

సర్వభావములచేతను, సర్వయత్నములచేతను యీ విష్ణుభగవానుఁడొకఁడే యీ లోకమున శరణార్థులకందఱకును శరణ్యమగును. ఆతని శరణుబొందుటదప్ప జీవుల కన్యగతియొద్దియును లేదు. విష్ణువును వశీకరించుట కిదియొకటే ఉత్తమమగు యుపాయమని నేనెంచుచున్నాను. విష్ణుకృత బాధానివారణార్థమింతకు మించిన యుపాయము మఱియొకటి లేదు.

న తస్మాదధికః కశ్చిదస్తిలోకత్రయాన్తరే
ప్రలయస్థితిసర్గాణాం హరిః కారణతాం గతః. 36

విష్ణువుకంటె యధికుఁడీ ముల్లోకములందెవడును లేడు. సృష్టిస్థితిలయముల మూఁటికి నాతఁడే కారణభూతుడు.

అస్మాన్నిమేషాదారభ్య నారాయణమజం సదా
సంప్రపన్నోఽస్మి సర్వత్ర నారాయణమయోహ్యహమ్. 37

ఈ క్షణము మొదలుకొని నేనెల్లపుడును అజుఁడగు యా నారాయణుని నే శరణు బొందెదను. దేశకాలవస్తువులందంతటను నారాయణమయుఁడనై నేనిపుడొప్పుచున్నాను.

నమో నారాయణాయేతి మన్త్రః సర్వార్థసాధకః
నాపైతి మమ హృత్కోశాదాకాశాదివ మారుతః. 38

ఆకాశమునుండి వాయువు తొలగనట్లు సర్వార్థసాధకమగు 'నమో నారాయణాయ' అను మంత్ర మిక నాహృదయకోశము నెన్నటికి వీడకుండును.

హరిరాశా హరిర్వ్యోమ హరిరుర్వీ హరిర్జగత్
అహంహరిరమేయాత్మా జాతో విష్ణుమయో హ్యహమ్. 39

దిక్కులన్నియు విష్ణుస్వరూపములే; ఆకాశమున్న విష్ణురూపమే; ఈ జగత్తంతయును విష్ణురూపమే; నేనున్న అప్రమేయుఁడగు యా విష్ణువునే; నేనిపుడు విష్ణుమయుఁడనైతి.

అవిష్ణుః పూజయన్విష్ణుం న పూజాఫలభాగ్భవేత్
విష్ణుర్భూత్వా యజేద్విష్ణుమయం విష్ణురహంస్థితః. 40

విష్ణుస్వరూపుఁడుగాకయుండి (విష్ణుస్వరూపమం దైక్యముగాక) విష్ణుపూజచేయువాడు తత్పూజాఫలమును బొందజాలడు. కావన విష్ణుస్వరూపుఁడైయే పూజింపవలెను. ఇక్కారణమున విష్ణురూపుఁడనై యున్నాను.

హరిః ప్రహ్లాదనామా యో మత్తో నాన్యో హరిః పృథక్
ఇతి నిశ్చయవానన్తర్వ్యాపకోఽహం చ సర్వతః. 41
అనంతమిదమాకాశ మాపూర్య వినతాసుతః
కనకాద్రి మమాజ్ఞానామయమాసనతాం గతః. 42
కరశాఖైకవిశ్రాన్త సర్వహేతివిహంగమాః
నఖాంశుమంజరీకీర్ణా మహామరకతద్రుమాః. 43
ఇమే తే మృదుమన్దార దామదిగ్ధాంసమండలాః
మందరాఘృష్టకేయూరాశ్చత్వారో మమ బాహవః. 44
చలచ్ఛశికలాపూర చారుచామరధారిణీ
ఇయం మే పార్శ్వగా లక్ష్మీః క్షీరోదకుహరోత్థితా. 45
హేలావిలుబ్ధభువనా త్రైలోక్యతరుమంజరీ
ఇయం మే పార్శ్వగా కీర్తిరచలామలభాసినీ. 46
అనారతజగజ్జాల నవనిర్మాణకారిణీ
ఇయం మే పార్శ్వగా మాయా స్వేన్ద్రజాలవిలాసినీ. 47
ఇయం సా హేలయాక్రాన్త త్రైలోక్యతరుఖండికా
జయా స్ఫురతి మే పార్శ్వే లతా కల్పతరోరివ. 48

విష్ణువే ప్రహ్లాదనామమును ధరించియున్నాడు. విష్ణువున కన్యముగ రెండియును లేదని నిశ్చయించితిని గాన నేనే అంతటను వ్యాపించియున్నాను. అనంతాకాశమును వ్యాప్తమొనర్చి



యున్న సువర్ణకాంతియుతుఁడగు గరుడుడు నాకు వాహనముగ నున్నాడు. నా హస్తములను శాఖలపై చక్రగదాద్యస్త్రరూపములగు పక్షులు విశ్రమించుచున్నవి. మఱియు నఖకాంతులను లతాసమూహముతో గూడి అయ్యవి మహామరకతమణివృక్షములవలెనున్నవి. కోమల కల్పవృక్షపుష్పమాలలచే శోభించుచు యీ నా బాహువులు సముద్రమథనకాలమున మందరపర్వతముయొక్క రాపిడిచే యరగిన కేయూరములు గల్గియున్నవి. చంద్రకళాప్రవాహమువలె స్వచ్ఛమైనట్టి చామరము గైకొని క్షీరసముద్రమున జనించిన లక్ష్మీదేవి నా చెంతనున్నది. సర్వలోకవ్యాప్తమును, త్రిలోకవృక్షలతవలె శోభాయమానమును, అచంచలమును, నిర్మల ప్రకాశయుక్తమునగు విష్ణుకీర్తి మూర్తివంతమై నా యెదుటనున్నది. నిరంతరము నూతన జగత్సమూహములను నిర్మించునదియు, తన యింద్రజాలముతో గూడి విలాసమొనర్చునదియునగు విష్ణుమాయ నా సమీపముననే యున్నది. తన లీలావిలాసముచే ముల్లోకములను వనసమూహముల నాక్రమించునదియు, కల్పవృక్షలతాసదృశమునునగు జయయను లక్ష్మీదేవియొక్క సఖి నా చెంతనే యున్నది.

ఇమౌ మే నిత్యశీతోష్ణౌ దేవౌ శీతాంశుభాస్కరౌ
ప్రకటీకృతసంసారౌ ముఖమధ్యే విలోచనే. 49
మమేయముత్పలశ్యామా పీనామ్భోదరసుందరీ
శ్యామీకృతకకుప్చక్రా దేహదీప్తిర్విసర్పిణీ. 50
అయం మమ కరే శంఖః పాంచజన్యః స్ఫురద్ధ్వనిః
మూర్తం ఖమివ శబ్దాత్మా క్షీరోద ఇవ సంస్థితః. 51
అయం మే కర్ణికాకోశ నిలీనబ్రహ్మషట్పదః
పద్మః కరతలే శ్రీమాన్నాభికుహరోద్భవః. 52
ఇయం మే రత్నచిత్రాంగీ సుమేరుశిఖరోపమా
హేమాంగదా గదా గుర్వీ దైత్యదానవమర్దినీ. 53
అయం మే భాస్కరాకార ఉద్యదంశుః సుదర్శనః
జ్వాలాజటిలపర్యన్త పరిపాటలదిక్తటః. 54
అయం మే కేతుమద్వహ్ని సుందరో జ్వలితోఽసితః
కుఠారో దైత్యవృక్షాణాం నన్దయన్నన్దకః స్థితః. 55
ఇదం మే శరధారాణాం పుష్కరావర్తకోపమమ్
శార్ఙ్గం ధనురహీన్ద్రాభ మిన్ద్రకార్ముకసుందరమ్. 56

శీతోష్ణస్వభావములుగల్గి లోకమును ప్రకాశింపజేయు చంద్రసూర్యులను యిద్దరు దేవులు నా ముఖమందు నేత్రరూపమున వెలుంగుచున్నారు. ఈ నాశరీరకాంతి నీల కమలమువలె శ్యామవర్ణయుక్తమును, మేఘమువలె సుందరమును, దిక్కులను చక్రమును శ్యామవర్ణముగ నొనర్చునదియు, అంతటను వ్యాపించునదియునైయున్నది. చంచలధ్వనియుక్తమును, ఆకాశమువలె మూర్తివంతమైన శబ్దరూపమును, క్షీరసముద్రమువలె ధవళమునునగు పాంచజన్య శంఖమిదిగో, నా హస్తమున నున్నది. కర్ణికయందు లీనమై బ్రహ్మదేవుడను భ్రమరముచే శోభించుచు నాభియను గర్తమున

జనించినదగు కమలమిదిగో నా హస్తమున వెలయుచున్నది. రత్నములచే నలంకృతమును, సుమేరుశిఖర సదృశమును, సువర్ణయుక్తమును, దేవదానవుల మర్దించునదియునగు యిదియే నాగద; సూర్యునివంటి యాకృతిగలదియు, కిరణసహితమును, దీప్తిసమూహములచే నలునైపుల వ్యాపించి దిక్కులనక్రాంతముగ నొనర్చునదియునగు సుదర్శన చక్రమిదియే; ధూమసహితమగు అగ్నివలె సుందరమును, శ్యామవర్ణయుతమును, దైత్యులను వృక్షములను గండ్రగొడ్డలి వంటిదియు, దేవతలకానందప్రదమునగు నందకమను ఖడ్గమిదియే; బాణములను జలప్రవాహమునకు ప్రళయకాల పుష్కరావర్త మేఘమువంటిదియు, శేషునివలె దీప్తివంతమును, ఇంద్రధనుస్సువలె సుందరమునగు శార్ఙ్గమను ధనుస్సు యిదియే యున్నది.

ఇమాన్యహమనన్తాని జగన్తిజరఠేచిరమ్
బిభర్మిజాతనష్టాని వర్తమానాన్యనేకశః. 57
ఇమామహీమే చరణావిదం మే గగనం శిరః
ఇదంవపుర్మేత్రిజగదిమే మే కుక్షయోదిశః. 58

అసంఖ్యాకములగు యీ బ్రహ్మాండములన్నిటిని చిరకాలమునుండి నేనే నాయందు ధరించుచున్నాను. ఈ భూమియే నా రెండుపాదములు; ఆకాశమే శిరస్సు; త్రిలోకములే శరీరము; దిక్కులే యుదరము.

సాక్షాదయమహం విష్ణుర్నీలమేఘోదరద్యుతిః
సుపర్ణపర్వతారూఢః శంఖచక్రగదాధరః. 59
ఏతేమత్తః పలాయన్తే సమగ్రాదుష్టచేతసః
తార్ణాస్తరలసంచారాః పవనాదివ రాశయః. 60
అయంనీలోత్పలశ్యామః పీతవాసా గదాధరః
లక్ష్మీవాన్గరుడారూఢః స్వయమేవాహమచ్యుతః 61
కోఽయమేతి విరుద్ధాత్మా త్రైలోక్యదహనక్షమమ్
స్వనాశాయ తతఃక్షుబ్ధం కాలాగ్నిం శలభో యథా. 62
ఇమే మే తైజసీం సృష్టిం మమాగ్రస్థాః సురాసురాః
నశక్నువన్తి సంసోఢుం చక్షుర్మన్దాఃప్రభామివ. 63
ఇమంమామీశ్వరం విష్ణుం బ్రహ్మేన్ద్రాగ్ని హరాదయః
స్తువన్త్యనన్తయా వాచా బహువక్త్రసముత్థయా. 64
అయంవిజృంభితైశ్వర్యో జాతోఽహమజితాకృతిః
సర్వద్వన్ద్వపదాతీతో మహిమ్నా పరమేణ హి. 65
త్రిభువనభవనోదరైకమూర్తి
ప్రసభవిభిన్నసమస్తదుష్టసత్త్వమ్
ఘనగిరితృణకాననాన్తరస్థం
సకలభయాపహరం వపుఃప్రపన్నః. 66



ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ప్రహ్లాదనిర్వాణే నారాయణీకరణం
నామైకత్రింశః సర్గః ॥ 31 ॥

నేనిపుడు, నీలమేఘకాంతిగలవాడును, గరుత్మంతుడను పర్వతము నధిరోహించినవాడును, శంఖచక్రగదాధరుడును నగు సాక్షాత్ విష్ణుభగవానుడనే అయియున్నాను. రాక్షసాధులగు యీ దుష్టజీవులందఱును, వాయువుచే తృణసమూహమువలె, నన్నుగాంచి పరుగిడుచున్నారు. నీలకమలమువలె శ్యామవర్ణయుతుడను, పీతవస్త్రధారియు, గదాధరుడును, లక్ష్మీసహితుడను, గరుడారూఢుడును నగు అచ్యుతుడనే నేను. ముల్లోకముల దహింప సమర్థుడనగు నన్ను యెదుర్కొన జాలునట్టి విరోధి యెవడుండును? ఏలన, నన్నెదుర్కొనువాడు కాలాగ్నియందు మిడుతవలె తన వినాశమే గావించుకొనును. మంద దృష్టిగలవారు ప్రకాశమును సహింపజాలనట్లు, నా సమ్ముఖముననున్న యీ సురాసురులు నా తేజోమయకాంతుల సహింపజాలరు. ఈశ్వరుడను, విష్ణుస్వరూపుడనగు నన్ను బ్రహ్మేంద్రాగ్నిరుద్రాదులు వేనోళ్ల స్తుతించుచున్నారు. నేను మైశ్వర్యయుక్తుడను, ద్వంద్వములన్నిటి కతీతుడను, సర్వోత్తమ మహిమాన్వితుడను నగు నేనిపుడువిష్ణ్వాకార సదృశుడనై యొప్పుచున్నాను. ముల్లోకములను గృహమును తనయందు ధరించువాడును, దుష్టుల బలాత్కారముగ నాశమొనర్చువాడును, మేఘ, పర్వత, తృణ, వనాదులం దధిష్ఠానరూపమున వెలయువాడును, సాక్షాత్కారమాత్రముచే భయమంతయు నశింపజేయువాడునగు విష్ణుభగవానునకు (స్వస్వరూపమునకు) నమస్కారము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రహ్లాదనిర్వాణమున నారాయణీకరణమను ఏకత్రింశ
సర్గము ॥ 31 ॥

ద్వాత్రింశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ప్రహ్లాదఇతిసంచిన్త్య కృత్వానారాయణీం తనుమ్
పునఃసంచిన్తయామాస పూజార్థమసురద్విషః. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామచంద్రా! ప్రహ్లాదుడిట్లు చింతించి తన దేహమును నారాయణమయమొనర్చినవాడై మఱల విష్ణువును బూజింప నెంచెను.

వపుషో వైష్ణవాదస్మాన్మత్తోఽన్యస్త్వత్తః పరావరా
అయంప్రాణప్రవాహేణ బహిర్విష్ణుః స్థితోఽపరః. 2

నాచే కల్పితమగు యీ విష్ణుస్వరూపము, నాకన్యమగు సమష్టివ్యష్టిదేవతారూపమేమియుగాదు. మద్రూపుడేయగు యీ విష్ణుభగవానుడు హృదయభాగమునుండి ప్రాణవేగముచే పుష్పాంజలి భావనద్వారా బాహ్యదేశమున ఆవాహితమొనర్పబడి పూజాకాలమున యన్యునివలె గన్పట్టుచున్నాడు.

వైనతేయసమారూఢః స్ఫురచ్ఛక్తిచతుష్టయః
శఙ్ఖచక్రగదాపాణిః శ్యామలాఙ్గశ్చతుర్భుజః.
చన్ద్రార్కనయనః శ్రీమాన్ స్వనన్దకనన్దనః
పద్మపాణిర్విశాలాక్షః శార్ఙ్గధన్వా మహాద్యుతిః. 4
తదేనం పూజయామ్యాశు పరివారసమన్వితమ్
సపర్యయా మనోమయ్యా సర్వసంభారరమ్యయా. 5
తతఏనం మహాదేవం పూజయిష్యామ్యహం పునః
పూజయా బాహ్యసంభోగమహత్యా బహురత్నయా. 6

గరుడారూఢుడును, ఇచ్ఛాజ్ఞానక్రియానుగ్రహములను నాల్గు దివ్యశక్తులు గలవాడును, శంఖచక్రగదాహస్తుడును, శ్యామలాంగుడును, చతుర్భుజుడును, చంద్రసూర్యనేత్రుడును, శ్రీమంతుడును, అతిరమణీయమగు తన నందకఖడ్గముచే స్వజనుల కానందము గొల్పువాడును, కమలహస్తుడును, విశాలనేత్రుడును, శార్ఙ్గమను ధనుస్సును ధరించినవాడును, మిగుల ప్రకాశమానుడును, పరివారసహితుడునగు విష్ణుదేవుని సర్వసంభారయుతుడనై నేను మానసికపూజ గావించెద. పిదప బాహ్యవస్తుసముదాయముచేతను, అనేక రత్నములతోడను యమ్మహాదేవుని నేనర్చించెద.

ప్రహ్లాదఇతిసంచిన్త్య సంభారభరభారిణా
మనసా పూజయామాస మాధవం కమలాధవమ్. 7
రత్నౌఘపాత్రపటలైశ్చన్దనాదివిలేపనైః
ధూపైర్దీపైర్విచిత్రైశ్చ నానావిభవభూషణైః. 8
మన్దారమాలావలనైర్హేమాబ్జపటలోత్కరైః
కల్పవృక్షలతాగుచ్ఛై రత్నస్తబకమణ్డలైః. 9
పల్లవైర్దివ్యవృక్షాణాం నానాకుసుమదామభిః
కింకరాతైర్బకైః కున్దైశ్చమ్పకైరసితోత్పలైః. 10
కల్హారైఃకుముదైః కాశైః ఖర్జూరైశ్చూతకింశుకైః
అశోకైర్మదనైర్బిల్వైః కర్ణికారైఃకిరాతకైః. 11
కదమ్బైర్బకులైర్నిమ్బైః సిన్దువారైఃసయూథకైః
పారిభద్రైర్గుగ్గులీభిర్భిన్నకైః పుష్పకోత్కరైః. 12
ప్రియఙ్కుపటలైఃపాశైః పాటలైర్ధాతుపాటలైః
ఆమ్రైరామ్రాతకైర్గర్వైర్హరీతకబిభీతకైః. 13
శాలతాలతమాలానాం లతాకుసుమపల్లవైః
కోమలైఃకలికాజాలైః సహకారైఃసకుఙ్కుమైః. 14
కేతకైఃశతపత్రైశ్చ తత్రైలామఞ్జరీగణైః
సర్వసౌన్దర్యసంపూర్ణైః స్వయమాత్మార్పణైరపి. 15



హరిం పరయయా భక్త్యా జగద్విభవభవ్యయా
మనసా పూజయామాస ప్రహ్లాదోఽస్తఃపురేపతిమ్. 16

ప్రహ్లాదుడిట్లు చింతించి సర్వసామగ్రిసహితముగ లక్ష్మీపతియగు విష్ణుదేవుని బూజించెను. రత్నజటిత పాత్రములచే గావింపబడిన యభిషేకములచేతను, చందనాదిలేపనములతోడను, బహువిధ ధూపదీపములతోడను, విచిత్రవిధాలంకారములతోడను, మందారపుష్ప మాలలచేతను, సువర్ణకమలములతోడను, కల్పవృక్షలతాగుచ్ఛంబులతోను, రత్నమయపుష్పసమూహములతోడను, బహువిధ దివ్యవృక్షముల పుష్పపల్లవములతోను, కంకిరాత, బక, కుంద, చంపక, నీలకమల, కల్హార, కుముద, కాశ, ఖర్జూర, ఆమ్ర, కింశుక, అశోక, మదన, బిల్వ, కర్ణికార, కిరాత, కదంబ, బకుల, కుముద, కాశ, ఖర్జూర, ఆమ్ర, కింశుక, అశోక, మదన, బిల్వ, కర్ణికార, కిరాత, కదంబ, బకుల, నింబ, సిందువార, యూథక, పారిభద్ర, గుగ్గులి, ఆమ్ర, హరీతక, పటల, పాటల, తాల, తమాల, నింబ, సిందువార, యూథక, పారిభద్ర, గుగ్గులి, ఆమ్ర, హరీతక, పటల, పాటల, తాల, తమాలాది వివిధ పుష్పములతోను, పల్లవములతోను, కుంకుమసహిత ఆమ్రపుష్పములతోను యాతడు విష్ణుభగవానుని బూజచేసెను కేతక, కమలంబులతోడను, లతాసమూహములచేతను, ధూపదీప నైవేద్యాదులతోడను, ప్రదక్షిణ నమస్కృతులతోను, ఆత్మసమర్పణముచేతను విష్ణుదేవునర్చించెను. మఱియు నుత్తమభక్తితోగూడుకొని సర్వవైభవములతోను యాతడు తన యంతఃపురమున విష్ణుభగవానునకు మానసిక పూజగావించెను.

అథ దేవగృహేతస్మిన్బాహ్యార్థైః పరిపూర్ణయా
పూజయా పూజయామాస దానవేశో జనార్దనమ్. 17

పిదప తన యంతఃపురమందలి దేవగృహమున సమస్తబాహ్యపదార్థములతోను దానవేంద్రుడగు ప్రహ్లాదుడు జనార్దనుని బూజించెను.

బహిర్ద్రవ్యైరనేనైవ క్రమేణ పరమేశ్వరమ్
పునఃపునఃపూజయిత్వా తుష్టిమానానవోఽభవత్. 18

మానసికపూజ గావించినవిధముననే పూజాద్రవ్యములచే పరమేశ్వరుడగు యా విష్ణువును మఱల బాహ్యమున నర్చించి ప్రహ్లాదుడు మిగుల సంతుష్టినొందెను.

తత స్తతఃప్రభృత్యేవ ప్రహ్లాదః పరమేశ్వరమ్
తథైవ ప్రత్యహం భక్త్యా పూజయామాస పూర్ణయా. 19

నాటినుండి యాతడు ప్రతిదినమున్ను పరిపూర్ణభక్తితో యవ్విధముననే భగవానుని బూజింపసాగెను.

అథ తస్మిన్పురే దైత్యాస్తతః ప్రభృతివైష్ణవాః
సర్వఏవాభవన్నృపా రాజా హ్యాచారకారణమ్. 20.

అంత నా నగరమున అది మొదలు దైత్యులందఱును విష్ణుభక్తులై మోక్షభాగులైరి. ప్రజల యాచారమునకు కారణభూతుడు రాజే గదా!

జగామ వార్తా గగనం దేవలోకమథారిహన్
విష్ణోర్ద్వేషంపరిత్యజ్య భక్తాదైత్యాఽక్షితాఇతి. 21

శత్రుసంహారకుఁడవగు నోరామా! ఆటులిమ్మట విష్ణుద్వేషమును త్యజించి దైత్యులందఱును విష్ణుభక్తులైరను యీ వార్త దూతముఖమున స్వర్గమున వ్యాపించెను.

దేవా విస్మయమాజగ్ముః శక్రాద్యాః సమరుద్గణాః
గృహీతా వైష్ణవీభక్తిర్దైత్యైః కిమితి రాఘవ. 22

ఓరామా! ఆవార్త వినినతోడనే మరుద్గణసహితులగు యింద్రాది దేవతలందఱును, 'దైత్యులేల విష్ణుభక్తిని స్వీకరించిరి'ని తలంచి విస్మితులైరి.

క్షీరోదే భోగిభోగస్థం విబుధా విస్మయాకులాః
జగ్మురమ్బరముత్సృజ్య నారిమాహవశాలినమ్. 23

విస్మయాకులురగు దేవతలంత తమ నగరమును (అమరావతిని) వీడి క్షీరసాగరమున శేషశయనుఁడై యున్నవాఁడును, రణరంగమున మిగుల శోభించువాఁడును నగు విష్ణుభగవానుని చెంత కేగిరి.

తత్రైనం దైత్యవృత్తాన్తం కథయామాసురస్య తే
పప్రచ్ఛుశ్చైనమాసీనమపూర్వాశ్చర్యవిస్మయమ్. 24

అటకేగి దైత్యుల వృత్తాంతమంతయు విష్ణువున కెఱింగించి సుఖాసీనుఁడైయున్న యా విష్ణుభగవానునితో నత్యాశ్చర్యమున నిట్లనిరి.

విబుధా ఊచుః :—

కిమేతద్భగవన్దైత్యా విబుధా యే సదైవ తే
తేహి తన్మయతాం యాతా మాయేయమితి భావ్యతే. 25

దేవతలు:—ఓ దేవా! మీ కెల్లపుడు విరోధులుగానుండు దైత్యులిపుడు మీ యెడ భక్తిగల్గి తన్మయులైయుండుటకు గారణమేమి? ఇదంతయు జూడ మాయగా దోచుచున్నయది.

క్వ కిలాత్యన్తదుర్వృత్తా దానవా దలితాద్రయః
క్వ పాశ్చాత్యమహాజన్మలభ్యా భక్తిర్జనార్దనే. 26

మీ భక్తులగు మునీంద్రులు వసించుచున్నట్టి పర్వతాదులను విధ్వంసముచేసినట్టి దురాచారులగు దైత్యులెచట, ఉత్తమ (బ్రాహ్మణాది) జన్మలకు యోగ్యమైన విష్ణుభక్తి యెచట!

ప్రాకృతో గుణవాఞ్జాత ఇత్యేషా భగవన్కథా
అకాలపుష్పమాలేవ సుఖాయోద్వేజనాయ చ. 27

దేవా! మూర్ఖుడు పండితుఁడాయె ననునట్టివార్త మాకు భీతిఁగొల్పునదై అకాల పుష్పమాలవలె సుఖదుఃఖముల రెంటిని గల్గచేయుచున్నది.

నోపపన్నం హి యద్యత్ర తత్ర తన్న విరాజతే
మధ్యే కాచకలాపస్య మహామూల్యో మణిర్యథా. 28

గాజుపెంకులందు మూల్యమగు మణి శోభింపనట్లు, ఏ పదార్థమెచట యుక్తముగాదో యచట నయ్యది శోభింపకుండును.



యో యో యాదృగ్గుణో జన్తుః స తామేవైతి సంస్థితిమ్
సదృశేష్వప్యజేషు శ్వా న మధ్యే రమతే క్వచిత్. 29

సమాన (జంతు) వర్గము గల్గియున్నప్పటికిని మేషములతోటి శునకమెన్నఁడును క్రీడింపని విధమున, ఏజీవి యే గుణములు గల్గియుండునో, ఆజీవి అట్టిస్థితికే యోగ్యమగును.

న తథా దుఃఖయన్త్యగ్నేర్మజ్జన్త్యో వజ్రసూచయః
వైసాదృశ్యేన సంబద్ధా యథైతా వస్తుదృష్టయః. 30

అనుచితరీతి సంబద్ధమైన వస్తువులచే గల్గు దుఃఖములను, అంగములఁజొన్పు వజ్రసూచి [illegible]గ్నులను గల్గజేయజాలదు.

యద్యత్ర క్రమసంప్రాప్తముపపన్నమనిన్దితమ్
తదేవ రాజతే తత్ర జలేఽమ్బుజం న తు స్థలే. 31

కమలము జలముననే శోభించును గాని స్థలమునగాదు. అట్లనే యేపదార్థమెచట యోగ్యమగునో అచటనే అయ్యది లెస్సగ శోభించును.

క్వాధమః ప్రాకృతాచారమగ్నో హీనకర్మరతిః సదా
వరాకో దానవో హీనజాతిర్భక్తిః క్వ వైష్ణవీ. 32

ప్రాకృతవ్యవహారతత్పరులును, సదా హీనకర్మనిరతులును, అధములును, నీచజాతికిఁ జెందినవారునునగు దానవులెచట, అత్యుత్తమమగు విష్ణుభక్తియెచట!

కమలినీ పురుషోషరభూగతా
సుఖయతీహ యథా న దురాశ్రయా
దితిసుతోఽపి హి మాధవభక్తిమా
నితి కథా న తథేశ సుఖాయనః. 33

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే విబుధవాక్యం నామ
ద్వాత్రింశః సర్గః ॥ 32 ॥

ఓ మాధవా! తప్త యూషరక్షేత్రమందలి కమలసరస్సు దుష్టాశ్రయకారణమున జనులకానందము గొల్పనట్లు, దైత్యులు భక్తులగుట యను విషయమున్ను మాకానందము గొల్పకున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
విబుధవాక్యమును ద్వాత్రింశ
సర్గము ॥ 32 ॥

---

త్రయస్త్రింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

గర్జన్తమతిసంరబ్ధం సురలోకమథారిహా
ఉవాచ మాధవో వాక్యం శిఖివృన్దమివామ్బుదః. 1

శ్రీ వసిష్ఠుడు :— ఓ రామా ! మిగుల కుపితులై యుచ్చస్వరమున నిట్లు వచించిన యా దేవతలతో శత్రునాశకుఁడగు విష్ణుభగవానుడు, మయూరములతో మేఘము బల్కినట్లు యివ్విధమున బల్కెను.

శ్రీ భగవానువాచ :—

విబుధా మా విషణ్ణాః స్థ ప్రహ్లాదో భక్తిమానితి
పాశ్చాత్యం జన్మ తస్యేదం మోక్షార్హోఽసావరిందమః. 2

శ్రీ విష్ణుభగవానుడు :— ఓ దేవతలారా ! ప్రహ్లాదుఁడు నాభక్తుడు. మీరు చింతింపకుడు. వానికిది యంతిమజన్మమని యెఱుంగుఁడు. శత్రునాశకుఁడగు యాతఁడీ జన్మముననే మోక్షార్హుఁడగును.

అత ఉత్తరమేతేన గర్భతా దనుజన్మనా
న కర్తవ్యా ప్రదగ్ధేన బీజేనేవాఙ్కురక్రియా. 3

దహింపబడిన విత్తనము మఱల మొలకెత్తని విధమున యాతడు మఱల మాతృగర్భమున జనింపకుండును.

గుణవాన్నిర్గుణో జాత ఇత్యనర్థక్రమం విదుః
నిర్గుణో గుణవాఞ్జాత ఇత్యాహుః సిద్ధిదం క్రమమ్. 4

గుణవంతుడు గుణహీనుడగుట యనర్థదాయకమనియు, గుణహీనుడు గుణవంతుడగుట సిద్ధిదాయకమనియు పెద్దలు వచించిరి.

ఆత్మీయాసి విచిత్రాణి భువనాన్యమరోత్తమాః
ప్రయాత నాసుఖాయైషా ప్రహ్లాదీ గుణితేహ వః. 5

ఓ దేవప్రముఖులారా! మీరు మీమీ విచిత్రములగు లోకములకుఁ బొండు. ప్రహ్లాదుని సుగుణములు మీకెన్నటికిని దుఃఖదాయకములు గానేరవు.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇత్యుక్త్వా విబుధాంస్తత్ర క్షీరోదార్ణవ వీచిషు
అన్తర్ధానం యయావేవ స్తటతా పిచ్ఛగుచ్ఛవత్. 6

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! విష్ణుభగవానుడు దేవతలతో నిట్లుబల్కి తీరమందలి తమాల వృక్షముయొక్క పూగుత్తులు నీటిలోఁ బడి యదృశ్యమగునట్లు క్షీరసముద్రతరంగములం దంతర్ధానమయ్యెను.

సోఽపి సంపూజితహరిః సుకాఘౌ ప్రవజదమ్బరమ్
పురన్దర నిర్యాతాత్కణజాల మివార్ణవాత్. 7



మందరపర్వతము చే మథింపబడిన సముద్రమునుండి జలకణములు ఆకసమున కెగిరినట్లా దేవతలున్నూ యంత నాకసమునకుఁ జనిరి.

ప్రహ్లాదంప్రతి గీర్వాణా స్తతః స్నిగ్ధత్వమాయయుః
మహాన్తో యత్ర నోద్విగ్నా స్తత్ర విశ్వాసవన్మనః. 8

అప్పటినుండియు దేవతలు ప్రహ్లాదునియెడ స్నేహముగల్గియుండిరి. ఏలన, మహాత్ములైనవారిచే సంతుష్టిఁ జెందుమురో దానియెడ తక్కుఁ గల జనులకును విశ్వాసమేర్పడును.

ప్రత్యహం పూజయామాస దేవదేవం జనార్దనమ్
మనసా కర్మణా వాచా ప్రహ్లాదో భక్తిమానితి. 9

అదిమొదలు ప్రహ్లాదుడు దేవదేవుడగు జనార్దనుని మనోవాక్కాయములచే ప్రతిదినమును పూజింపసాగెను.

అథ పూజాపరస్యాస్య సమవర్ధత కాలతః
వివేకానన్ద వైరాగ్య విభవప్రముఖా గుణాః. 10

ఇట్లు విష్ణుపూజాతత్పరుడైయున్న యా ప్రహ్లాదునకు కాలక్రమమున వివేక, సంతుష్టి, వైరాగ్యైశ్వర్యాది యుత్తమగుణములు వృద్ధినొందజొచ్చెను.

నాభ్యనన్దదసౌ భోగపూగం శుష్కమివ ద్రుమమ్
నచారమత కాన్తాసు మృగో లోకమహీష్వివ. 11

శుష్కించిన వృక్షము జనులకానందము గొల్పనట్లు, అపుడు భోగసమూహములెవ్వియు ప్రహ్లాదున కానందము గొల్పకుండెను. మఱియు జనాకీర్ణప్రదేశములందు మృగములు సంచరింపని విధమున వనితాసమూహమందాతఁనికిష్టము లేకుండెను.

న రేమే లోకచర్యాసు శాస్త్రార్థ కథనాదృతే
న జాయతే రతిస్తస్య దృశ్యేష్వస్థల ఇవాబ్జినీ. 12

శాస్త్రార్థకథనమందు దప్ప లౌకిక విచారముల వేటియందును యాతడు ప్రీతిగొనకుండెను. మఱియు నీరులేని స్థలమును కమల సరస్సు ప్రేమింపనట్లు దృశ్యపదార్థములందాతనికి ప్రీతి లేకుండెను.

నవిశ్రామ చేతోఽస్య భోగరోగానురఞ్జనే
ముక్తాఫలమసంశ్లిష్టం ముక్తాఫల ఇవామలే. 13

(రంధ్రములేని) ముత్యము శ్రేష్ఠమైన ముత్తెపుమాలయందు స్థానము బడయనట్లు రోగరూపములగు భోగముల సేవించుటయందు వాని చిత్తము ప్రవర్తింపకుండెను.

త్యక్తభోగాది కలనం విశ్రాన్తి మనుపాగతమ్
చేతః కేవల మస్యాసీద్దోలాయామివ యోజితమ్. 14

భోగాశను వీడినదియు, కాని పూర్ణవిశ్రాంతిని బొందనిదియునగు వాని చిత్తము భోగములందుగాని, శుద్ధబ్రహ్మమందుగాని విశ్రాంతి నొందక రెంటిమధ్యను స్థితిఁ బొందియుండెను.

ప్రహ్లాదీం లాంస్థితిం విష్ణుర్దేవః క్షీరోదమన్దిరాత్
వివేద సర్వగతయా ధియా పరమకాన్తయా. 15

శుద్ధసాత్వికమును, సర్వత్ర వ్యాప్తమునునగు తన జ్ఞానశక్తిచే నంత విష్ణుభగవాను ప్రహ్లాదుని యాస్థితి నెఱింగెను.

అథ పాతాలమార్గేణ విష్ణురాహ్లాదితాగ్రతః
పూజా దేవగృహం తస్య ప్రహ్లాదస్య సమాయయౌ. 16

భక్తులకు పరమానందము గొల్పు యా విష్ణుభగవానుఁడత్తఱి పాతాళమార్గము గుండా ప్రహ్లాదుని పూజామందిరమున ప్రవేశించెను.

నిజ్ఞాయాభ్యాగతం దేవం పూజయా ద్విగుణోర్ధయా
దైత్యేన్ద్రః పుండరీకాక్ష మాదరాత్పర్యపూజయత్. 17

విష్ణుభగవానుఁడేతెంచుట గాంచి దైత్యేంద్రుఁడగు ప్రహ్లాదుఁడు ద్విగుణోపచారంబులచే నత్యాదరమున యా పుండరీకాక్షుని బూజించెను.

పూజాగృహగతం దేవం ప్రత్యక్షావస్థితం హరిమ్
ప్రహ్లాదః పరమప్రీతో గిరా తుష్టావపుష్టయా. 18

తన పూజాగృహమున మూర్తిమంతుఁడై విలసిల్లిన యా విష్ణుభగవానుని ప్రహ్లాదుఁడంత హర్షాతిశయముచే యుచ్చస్వరమున నిట్లు నుతించెను.

ప్రహ్లాద ఉవాచ:—

త్రిభువన భవనాభిరామకోశం
సకలకలఙ్కహరం పరంప్రకాశమ్
అశరణశరణం శరణ్యమీశం
హరిమజమచ్యుతమీశ్వరం ప్రపద్యే. 19

ప్రహ్లాదుఁడు:-త్రిలోకభవనమునకు ఉత్తమ రత్నస్థానీయుఁడును, బాహ్యాభ్యంతర కళంకరూపమగు యంధకారమును నశింపజేయువాఁడును, సూర్యచంద్రాది ప్రకాశక వస్తువులఁగూడ ప్రకాశింపచేయు పరమప్రకాశరూపుఁడును, శరణులేనివారలకు శరణ్యమును, సర్వశరణ్యుఁడగు ఈశ్వరుఁడును, అజుఁడును, సర్వదుఃఖహరుఁడును నగు విష్ణుభగవానుని నేను శరణుబొందుచున్నాను.

కువలయదలనీల సంనికాశం
శరదమలామ్బర కోటరోపమానమ్
భ్రమరతిమిర కజ్జలాఞ్జనాభం
సరసిజచక్రగదాధరం ప్రపద్యే. 20

నీలకమలములవంటి కాంతిగలవాడును, శరదాకాశమువలెను, భ్రమర, అంధకార, కజ్జల, అంజనములవలెను శోభితుఁడును, శంఖచంక్రగదాకమలధారియునగు విష్ణుభగవానుని నేను శరణునొందుచున్నాను.



విమలమలికలాప కోమలాఙ్గం
సితజలపఙ్కజ కుడ్మలాభ శఙ్ఖమ్
శ్రుతిరసితవిగర్భ చఞ్చరీకం
స్వహృదయపద్మదలాశ్రయం ప్రపద్యే. 21

మంచి తుమ్మెదలఁబోలు కోమలమైన యంగములు గలవాడును, శ్వేతకమలమువలె తెల్లనైన శంఖమును ధరించినవాడును, శ్రుతియే శబ్దముగాగల బ్రహ్మదేవుఁడను భ్రమరమును తన నాభికమలమున గలవాడునునగు విష్ణుదేవుని నేను శరణుబొందుచున్నాను.

సితనఖగణ తారకా వికీర్ణం
స్మితధవలాననపీవ రేన్దు బిమ్బమ్
హృదయమణి మరీచిజాలగఙ్గం
హరిశరదమ్బర మాతతం ప్రపద్యే. 22

శ్వేతనఖములను నక్షత్రములును, మందహాసయుతముఖమను చంద్రుఁడును, హృదయకౌస్తుభమణియొక్క కిరణజాలమను మందాకినియు గల్గిశోభించునట్టి విష్ణువను శరదాకాశమును నేను శరణునొందుచున్నాను.

అవిరలకృతసృష్టి సర్వలీనం
సతతమజాతమవర్ధనం విశాలమ్
గుణశతజరఠాభిజాత దేహం
తరుదలశాయినమర్భకం ప్రపద్యే. 23

విశాలమగు సృష్టినంతయు తనయందు లీనమొనర్చుకొనువాడును, ఉత్పత్తిరహితుఁడును, సత్వాది మాయాగుణములచే ప్రేరితుఁడును, సనాతనుఁడును, సుందర దేహుఁడును, ప్రళయకాలమున వటపత్రముపై శయనించునట్టి బాలస్వరూపుఁడునగు విష్ణుదేవుని నేను శరణునొందుచున్నాను.

నవవికసిత పద్మరేణుగౌరం
స్ఫుటకమలావపుషా విభూషితాఙ్గమ్
దినశమసమయారుణాఙ్గరాగం
కనకనిభామ్బరసున్దరం ప్రపద్యే. 24

నూతన వికసిత కమలపరాగములచే గౌరవర్ణయుక్తుఁడును, లక్ష్మీదేవిచే భూషితమగు వక్షస్థలముగలవాడును, సాయంకాల అరుణకాంతువలెనున్న రక్తవర్ణ గంధముచే నలంకృతుఁడును, సువర్ణమువలె శోభాయమానమగు రూపముగలవాడునగు విష్ణుభగవానుని నేను శరణుబొందుచున్నాను.

దితిసుతనలినీ తుషారపాతం
సురనలినీ సతతోదితార్కబిమ్బమ్
కమలజ నలినీ జలావపూరం
హృదినలినీనిలయం విభుంప్రపద్యే. 25

దైత్యులను కమలసరంబులకు హిమపాతమును, దేవతలను కమలసరస్సునకు నిత్యోదిత మగు సూర్యబింబమును, బ్రహ్మదేవుడను కమలమునకు తటాకమును, హృదయాకాశమున కాశ్రయ భూతమును, వ్యాపకమునగు విష్ణుస్వరూపమును నేను శరణునొందుచున్నాను.

త్రిభువననలినీ సితారవిన్దం
తిమిరసమానవిమోహ దీపమగ్ర్యమ్
స్ఫుటతరమజడం చిదాత్మతత్త్వం
జగదఖిలార్తిహరం హరిం ప్రపద్యే. 26

త్రిభువనములను కమలములకు సూర్యుడును, అజ్ఞానాంధకారమునకు నిర్మలదీపసదృశుం డును, నిత్యుండును, స్వప్రకాశకుండును, జడత్వవిలక్షణమగు చిదాత్మరూపుడును, సాక్షాత్కార మాత్రమున సర్వజీవుల దుఃఖమును హరించువాడునగు శ్రీహరిని నేను శరణునొందుచున్నాను.

(శ్రీ) వసిష్ఠ ఉవాచ :—

ఇతిగుణబహులాభిర్వాగ్భిరభ్యర్చితోఽసౌ
హరిరసుర వినాశః శ్రీనిషణ్ణాంసదేశః
జలదఇవ మయూరం ప్రీతిమాన్ప్రీయమాణం
కువలయదలనీలః ప్రత్యువాచాసురేన్ద్రమ్. 27

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే నారాయణాగమనం నామ త్రయస్త్రింశః
సర్గః ॥ 33 ॥

శ్రీ వసిష్ఠుడు:— ఇట్లనేక యుత్తమగుణయుక్తమగు స్తుతులచే సంపూజితుడును, లక్ష్మీ సమాలింగితుండును, దైత్యవినాశకుడును, నీలకమలమువలె శ్యామవర్ణముగలవాడును, ప్రేమమయు డును నగు విష్ణుభగవానుడు తనకు ప్రీతిపాత్రుడైన దైత్యేంద్రుండగు నా ప్రహ్లాదునితో, మేఘ ముతో మయూరమువలె నిట్లు బల్కెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
నారాయణగమనమను త్రయస్త్రింశ
సర్గము ॥ 33 ॥



## చతుస్త్రింశః సర్గః.

---

(శ్రీ) భగవానువాచ :—

వరం గుణనిధే దైత్యకులచూడామణే
గృహాణాభిమతం భూయో జన్మదుఃఖోపశాన్తయే. 1

శ్రీ భగవానుడు:— గుణాకరుండవును దైత్యకులచూడామణివినగు నో ప్రహ్లాదా ! భవ దుఃఖము మఱల గలుగకుండునట్లు నీవేదైన వరమును కోరుకొనుము.

ప్రహ్లాద ఉవాచ :—

సర్వ సంకల్పఫలద సర్వలోకాన్తరస్థిత
యదుదారతమం వేత్సి తదేవాదిశ మేప్రభో. 2

ప్రహ్లాదుడు:— సర్వసంకల్పఫలప్రదాతవగు నో పరమాత్మా ! సర్వలోకాంతరస్థితుండ వగునో దేవా ! దేనిని తాము సర్వోత్తమని యెంచెదరో, ఆట్టివరమునే నా కొసంగుము.

(శ్రీ) భగవానువాచ :—

సర్వసంభ్రమ సంశాన్త్యై పరమాయ ఫలాయచ
బహ్మవిశ్రాన్తిపర్యన్తో విచారోఽస్తు తవానఘ. 3

శ్రీ భగవానుడు:— పాపరహితుండవగు నో ప్రహ్లాదా ! సంసారభ్రమ నంతయు శమింపజేసికొనుటకును, పరమానందదాయకమగు ముక్తిరూపఫలము ప్రాప్తించు నిమిత్తమును, బ్రహ్మ మున విశ్రాంతి నొందుటకును నీవు తత్త్వవిచార మొనర్చుచుండుము.

(శ్రీ) వసిష్ఠ ఉవాచ :—

ఇత్యుక్త్వాదితిపుత్రేన్ద్రం విష్ణురన్తరధీయత
కృతఘర్ఘరనిర్హ్రాదస్తరఙ్గస్తోయధేరివ. 4

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా ! దానవేంద్రుడగు ప్రహ్లాదునకిట్లు వచించి, ఘర్ఘరనినాదం బొనర్చి తరంగము సముద్రమున లయించునట్లు, విష్ణుభగవానుం డంతర్ధానమయ్యెను.

విష్ణావన్తర్హితే దేవే పూజాయాం కుసుమాఞ్జలిమ్
పాశ్చాత్యం దానవస్త్యక్త్వా మణిరత్నపరిష్కృతమ్. 5

పద్మాసనస్థోతిముదా హ్యుపవిశ్య వరాసనే
స్తోత్రపాఠ విధావన్తశ్చిన్తయామాస చేతసా. 6

అట్లు విష్ణుభగవానుడంతర్ధానమైన పిదప రత్నపూరితమగు తన యంతిమ కుసుమాంజలిని పూజయందు సమర్పించి, ఉత్తమాసనంబుపై పద్మాసనము వైచి గూర్చుండి స్తోత్రపాఠకాలమున ఆనందముతో ప్రహ్లాదుడిట్లు చింతనజేసెను—

విచారనానేవ భవాన్భవత్వితి భవారిణా
దేవేనోక్తోఽస్మి తేనాన్తః కరోమ్యాత్మవిచారణమ్. 7

'నీవు విచారవంతుడవు గమ్ము'ని సంసారదుఃఖహారకుఁడగు విష్ణుదేవుడు నాకు వచించి యుండెను. కాన నేనిపుడు తత్త్వవిచారణ గావించెద.

కిమహం నామ తావత్స్యాం యోఽస్మిన్భువనడమ్బరే
వచ్మి గచ్ఛామి తిష్ఠామి ప్రయత్నేనాహరామి చ. 8

మాటలాడుచు, నడచుచు, కూర్చొనుచు, యత్నముచే విషయముల సేకరించుచు నున్నట్టి యీ నేనీప్రపంచమున యెవడను?

జగత్తావదిదం నాహం సవృక్షతృణపర్వతమ్
యద్బాహ్యమలమత్యన్తం తత్స్యాం కథమహం కిల. 9

వృక్ష, తృణ, పర్వతయుక్తమగు యీ ఈజగత్తు నేనుగాను. దేహమునకు బాహ్యము ననున్నట్టి పదార్థము నే నెట్లగుదును?

అసన్నభ్యుదితో మూకః పవనైః స్ఫురితః క్షణమ్
కాలేనాల్పేన విలయీ దేహో నాహమచేతనః. 10

అసద్రూపమై, ప్రాణవాయువుతోఁగూడి క్షణకాలము స్ఫురించునదై, నశ్వరమై, జడమై యుండు యీ దేహము నేనుగాను.

జడయా కర్ణశష్కుల్యా కల్ప్యమానః క్షణక్షయీ
శూన్యాకృతిః శూన్యభవః శబ్దో నాహమచేతనః. 11

కర్ణగోళమందు కల్పింపబడినదియు, క్షణములో నశించునదియు, శూన్యమగు ఆకాశము నుండి యుత్పన్నమైనదియు, జడరూపమునగు శబ్దము నేనుగాను.

త్వచా క్షణవినాశిన్యా ప్రాప్యమప్రాప్యమప్యథ
చిత్ప్రసాదోపలబ్ధాత్మ స్పర్శనం నాస్మ్యచేతనమ్. 12

అల్పకాలములో నశించునదియు, త్వగింద్రియమునుండి చైతన్యానుగ్రహముచే నుత్పన్నమైనదియు, ఒకపుడుండి మఱియొకపుడు లేకుండునదియునగు అచేతనమైన స్పర్శ నేనుగాను.

బద్ధాత్మా జిహ్వయా తుచ్ఛో లోలయా లోలసత్తయా
స్వల్పస్పన్దో ద్రవ్యనిష్ఠో రసో నాహమచేతనః. 13

అనిత్యమును, జిహ్వేంద్రియాధీనమును, జిహ్వాగ్రమునుండి కంఠప్రదేశమునకు మాత్రమే ఆస్వాదము గలుగజేయునదియు, పదార్థములందుండునదియునగు రసము నేనుగాను.

దృశ్యదర్శనయోర్లీనం క్షయిక్షణవినాశినోః
కేవలే ద్రష్టరి క్షీణం రూపం నాహమచేతనమ్. 14

అనిత్యమును, నేత్రేంద్రియాధీనమును, కేవలము ద్రష్టయందే పర్యవసించునదియునగు రూపము నేనుగాను.

నాసయాఽప్యన్యజడయా క్షయిణ్యా పరికల్పితః
పేలవోఽనియతాకారో గన్ధో నాహమచేతనః. 15



ప్రకాశరహితమును, నశ్వరమును, ఘ్రాణేంద్రియముచే కల్పితమును, కోమలమును, అనియతమైన యాకారము గలదియు, జడమునునగు గంధము నేనుగాను.

నిర్మమోఽమననః శాన్తో గతపఞ్చేన్ద్రియభ్రమః
శుద్ధచేతన ఏవాహం కలాకలనవర్జితః. 16

మమత్వరహితమై, మనోవర్జితమై, శాంతమై, పంచేంద్రియభ్రమరహితమై, సంకల్పవర్జితమైనట్టి శుద్ధచైతన్యరూపమగు ఆత్మమాత్రుడనే నేను.

చేత్యవర్జితచిన్మాత్రమహమేషోఽవభాసకః
సబాహ్యాభ్యన్తరవ్యాపీ నిష్కలోఽమలసన్మయః. 17

విషయవర్జితమును, సర్వప్రకాశకమును, బాహ్యాభ్యంతరములందు వ్యాప్తమును, నిష్కళంకమును, నిర్మలమును, సద్రూపమునునగు చిన్మయుఁడనే నేను.

అనేన చేతనేనేమే సర్వే ఘటపటాదయః
సూర్యాన్తా అవభాస్యన్తే దీపేనోత్తమతేజసా. 18

ఈ శుద్ధచైతన్యముచేతనే ఘటపటాదులు మొదలుకొని సూర్యునివఱకుగల పదార్థము లన్నియు మిగుల కాంతివంతమగు దీపముచేతవలె ప్రకాశితములగుచున్నవి.

ఆ ఆదానీం స్మృతం సత్వమేతత్తదిఖిలం మయా
నిర్వికల్పచిదాభాస ఏష ఆత్మాస్మి సర్వగః. 19

ఆహా! ఈజగత్తంతయు నిర్వికల్పచిదాభాసమగు ఆత్మమాత్రమేయనియు, అట్టి సర్వవ్యాపకమగు ఆత్మస్వరూపమే నేననియు నిపుడు నే నెఱింగితిని.

అనేనైతాః స్ఫురన్తీహ విచిత్రేన్ద్రియవృత్తయః
తేజసాన్తఃప్రకాశేన యథాగ్నికణపఙ్క్తయః. 20

అగ్నివలన కణములు స్ఫురించునట్లు ఇట్టి చైతన్యస్వరూపుఁడనగు నావలననే యింద్రియవృత్తులన్నియు స్ఫురించుచున్నవి.

అనేనైతాః స్ఫురన్తీహ విచిత్రేన్ద్రియపఙ్క్తయః
సర్వగేన సదా ఘనేన యథా మరుమరీచికాః. 21

గ్రీష్మఋతుకాలమున మరుభూమియందు యెండమావులుత్పన్నమగునట్లు, సర్వవ్యాపకమును, చేతనస్వరూపమునైన యీ ఆత్మచేతనే వివిధములగు యింద్రియవృత్తులన్నియు స్ఫురించుచున్నవి.

అనేనైతత్పదార్థానాం వస్తుత్వం ప్రతిపాద్యతే
శుక్లాదిగుణవత్త్వం స్వం ప్రదీపేనేవ వాససామ్. 22

తెలుపుదనము మున్నగు వస్త్రములయొక్క గుణములు దీపాదుల ప్రకాశముచే తెలియఁజేయబడుచునట్లు, ఈ చైతన్యముచేతనే పదార్థములన్నింటియొక్క సత్తయు ప్రతిపాదింపబడుచున్నది.

అసావేవహి భూతానాం సర్వేషామేవజాగ్రతామ్
సర్వానుభవితా భూమిరాత్మా ముకురవత్స్థితః. 23

ప్రతిబింబము లన్నింటికిని అద్దము ఆశ్రయమగుచందమున, చైతన్యరూపమగు యీ ఆత్మయే దేహేంద్రియ మనోబుద్ధ్యాదులన్నిటియొక్క అనుభవమునకు ఆశ్రయభూతమై యొప్పుచున్నది.

తస్యైకస్యావికల్పస్య చిద్దీపస్యప్రసాదతః
ఉష్ణోఽర్కః శిశిరశ్చన్ద్రో ఘనోఽద్రిర్ద్రుతం పయః. 24

ఏకమై, నిర్వికల్పమై నట్టి యీ చిద్రూప దీపప్రభావము చేతనే సూర్యుడు ఉష్ణముగను చంద్రుడు శీతలముగను, పర్వతము ఘనముగను, క్షీరము ద్రవయుక్తముగను నున్నవి.

సాతత్యేనానుభూతానాం సర్వేషాం చ జగత్స్థితౌ
ఏతత్కారణమాద్యం తత్కారణంనాస్య విద్యతే. 25

ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని-ఇట్టిక్రమము ననుసరించి శ్రుతిప్రత్యక్షాదులచే ననుభూతములగు జగత్తునందలి పదార్థములన్నింటియొక్క ఉత్పత్తికి ఆదికారణ మీ యాత్మయే. దీనికి మఱియొక కారణమెద్దియును లేదు. సద్రూపమున నిదియే సర్వకార్యములందును వ్యాపించియున్నది.

సాతత్యేనానుభూతానాం పదార్థానామనేన తత్
పదార్థత్వముదేత్యుచ్చైః ప్రతాపేనేవ తప్తతా. 26

గ్రీష్మర్తునందలి సూర్యతాపముచే భూమ్యాదులందు వేడిమి జనించునట్లు, పైక్రమమున నుత్పన్నమగు ఆకాశాదులందు పదార్థత్వ మీయాత్మచేతనే గలుగుచున్నది.

అనాకారాత్కారణాచ్చ సర్వకారణకారణాత్
ఏతస్మాదిదముత్పన్నం జగచ్ఛైత్యం హిమాదివ. 27

నిరాకారమును, కారణభూతులగు బ్రహ్మాదులకున్ను కారణమునునగు యీ ప్రత్యగ్రూపబ్రహ్మమునుండి జగత్తంతయును, శైత్యముచే హిమమువలె ప్రాదుర్భవించుచున్నది.

బ్రహ్మవిష్ణ్వీన్ద్రరుద్రాణాం కారణానాం జగత్స్థితౌ
ఏతత్కారణమాద్యం తత్కారణం నాస్య విద్యతే. 28

జగత్స్థితికి కారణభూతులగు బ్రహ్మవిష్ణ్వింద్రరుద్రాదులకున్ను ఆదికారణ మీ ఆత్మయే దీనికి మఱొక కారణమెద్దియును లేదు.

చిచ్చేత్యద్రష్టృదృశ్యాది నామభిర్వర్జితాత్మనే
స్వయం సకృద్విభాతాయ మహ్యామస్మై నమోనమః. 29

చిత్త, విషయ, ద్రష్టృ, దర్శన, దృశ్య, నామాదిరహితమును, నిత్య స్వయంప్రకాశస్వరూపమును నగు ఈ నాయాత్మకు పలుమారులు వందనమర్పించుచున్నాను.

ఏతస్మిన్సర్వభూతాని నిర్వికల్పచిదాత్మని
గుణభూతాని భూతేశే తిష్ఠన్తి వివిశన్తిచ. 30



సర్వగుణములకు కారణభూతమైన యీనిర్వికల్పచిదాత్మయందే గుణభూత పదార్థములన్నియు స్థితిగల్గి యందే ప్రవేశించుచున్నవి.

యత్కిలానేన కలితం చేతనేనాన్తరాత్మనా
తత్కద్భవతి సర్వత్ర నేతరత్సదపి స్థితమ్. 31

కారణమున సూక్ష్మరూపముననున్నను ఈశ్వరరూపమగు యీ చైతన్య మేపదార్థమును గూర్చి సంకల్పించునో, అదియే యంతటను సంభవమగును గాని అన్యము గాదు.

యచ్చితా కలితం కించిత్తదాప్నోతి నిజం పదమ్.
యచ్చితా కలితం నేహ తత్సదప్యస్తమాగతమ్. 32

ఈ చైతన్య మెద్దానిని భావించునో అదియే తన ఘటాది వ్యవహారరూపము నొందుచున్నది. దేనిని భావింపకుండునో అది స్థూలసూక్ష్మరూపముల నున్నను నాశమునే పొందినదగును.

ఇమే ఘటపటాకారాః పదార్థశత పఙ్క్తయః
జాగత్యో విపులాదర్శే హ్యస్మిన్వ్యోమని బిమ్బితాః. 33

ఘటపటాది యాకారరూపముల జగత్సంబంధములగు పదార్థసమూహము లెన్నియో దర్పణరూపమగు యీ విశాల చిదాకాశమున ప్రతిబింబితములైయున్నవి.

ఏతద్వృద్ధం వృద్ధతరే క్షయి క్షయిణి జాయతే
పదార్థే సదసచ్చాపి ప్రతిబిమ్బార్కవత్స్థితమ్. 34

ప్రతిబింబిత సూర్యునియందు వృద్ధిక్షయాదులు భాసించువిధమున ఈ యాత్మయందును పదార్థముల వృద్ధిక్షయాదు లధ్యస్తములై యున్నవి.

అదృశ్యం సర్వభూతానాం ప్రాప్యం గలితచేతసామ్
ఏతత్తద్దృశ్యతే సద్భిః పరంవ్యోమాతినిర్మలమ్. 35

ఈ ఆత్మ అజ్ఞులచే పొందరానిదియు చిత్తరహితులగు నిర్మల జీవులచే పొందబడుదదియు నగును. ఏలన, అతినిర్మలమగు ఈ యుత్తమ చిదాకాశము సజ్జనులగు జ్ఞానులకే గోచరించును.

ఇయమభ్యుదయం యాతి నానాదృశ్యసుమఞ్జరీ
ఆచారచఞ్చరీకాఢ్యా ఏతస్మాత్కారణద్రుమాత్. 36

సమస్తమునకు కారణభూతమగు యీ చిద్రూపవృక్షమునుండియే వివిధాచారములను భ్రమరములు గల్గిన దృశ్యలత విజృంభించుచున్నది.

అస్మాదియముదేత్యుచ్చైః సంసారరచనాచలా
విచిత్రతరుగుల్మాఢ్యా శైలాదివ వనావలీ. 37

పర్వతమునుండి చిత్రవిచిత్రములగు లతాదులు గల వనసమూహముత్పన్నమగునటుల, చేతనరూపమగు పరమాత్మనుండియే యీ విశాల ప్రపంచమంతయు నావిర్భవించుచున్నది.

సర్వేషా మవిభిన్నో ఽసౌ త్రైలోక్యోదరవర్తినామ్
బ్రహ్మాదీనాం తృణాన్తానాం చిదాత్మా సంప్రకాశకః. 38

బ్రహ్మాది తృణపర్యంత మీ ముల్లోకములందు గల పదార్థములన్నింటిని ప్రకాశింప జేయునదీ పరమాత్మయే.

ఏకో ఽసావహమాద్యన్తరహితః సర్వగాకృతిః
చరాచరాణాం భూతానామన్తః స్వానుభవః స్థితః. 39

ఆద్యంతరహితమై ఏకమై సర్వవ్యాపకమై నిరాకారమై చరాచరప్రాణికోట్ల హృదయాంతరాళమున ననుభవరూపముననున్నదెనట్టి యీ పరమాత్మను నేనే.

అస్య తస్య మమేమాని స్థావరాణి చరాణిచ
పరిసంఖ్యాదిహీనాని శరీరాణి బహూనిచ. 40

అట్టి పరమాత్మస్వరూపుఁడనగు నాయందే, అపరిచ్ఛిరూపమున నీస్థావర జంగమాత్మకమగు ప్రాణికోట్ల శరీరములన్నియును గలవు.

ఏకో ఽసావనుభూత్యాత్మా స్వానుభూతివశాత్స్వయమ్
సర్వదృగ్ద్రష్టృదృశ్యత్వా త్సహస్రకరలోచనః. 41

అనుభవస్వరూపమును, ఏకమునగు యీ పరమాత్మయే సర్వమునకు దృక్కును, ద్రష్టయు, దర్శనమునగుటచే అసంఖ్య హస్తపాదాదులుగలవాడగును.

ఏషో ఽసావహమాకాశే సూర్యదేహేన చారుణా
విహరామీతరేణాపి వాయుదేహేన వాయునా. 42

ఇట్టి ఆత్మస్వరూపుఁడనగు నేనే సూర్యరూపమును ధరించి ఆకాశమున విహరించుచున్నాను. మఱియు వాయువను దేహముతో సర్వత్ర సంచరించుచున్నాను.

మమైతద్వపురానీలం శఙ్ఖచక్రగదాధరమ్
సర్వసౌభాగ్యసీమాన్తం వ్యాప్నిజ్జగతి వల్గతి. 43

శ్యామవర్ణయుతమును, శంఖచక్రగదా పద్మసహితమును మిగుల సుందరమునునగు యీ నాదేహమే జగద్రూపమున వ్యవహరింపబడుచున్నది.

అహమస్మిన్సముద్భూతః పద్మాసనగతస్సదా
నిర్వికల్పసమాధిస్థః పరాం నిర్వృతిమాగతః. 44

నేనే యీ జగత్తునందావిర్భవించి, పద్మాసనమునందై సర్వదావిరాజమానుఁడనై నిర్వికల్పసమాధియందుండి మిగుల కాంతిని బడయుచున్నాను.

అహం త్రినేత్రతాం కృత్వా గౌరీవక్త్రాబ్జషట్పదః
సర్గాన్తే సంహరామీదం కూర్మోఽఙ్గపటలం యథా. 45

త్రినేత్రుఁడగు శివునిరూపము ధరించి నేనే పార్వతియొక్క ముఖకమలమునకు భ్రమరమై, కూర్మము తన యంగముల తనయందు లీనమొనర్చునట్లు ప్రళయకాలమున నీజగత్తునంతయు సంహారమొనర్చుచున్నాను.



అహమిన్ద్రేణ రూపేణ త్రిలోకీమఖిలామిమామ్
పాలయామిక్రమప్రాప్తాం మఠికామివ తాపసః. 46

తాపసి తన కుటీరమును సంరక్షించునట్లు యింద్రరూపమును బడసి యీముల్లోకములను నేనే పాలించుచున్నాను

స్త్రీ పుమానహమేవైతత్కుమారో హ్యహమిత్యపి
జీర్ణో ఽహం దేహధారిత్వాజ్జాతో ఽహం విశ్వతోముఖః. 47

స్త్రీ, పురుష, కుమారరూపుఁడను నేనే. దేహధారుఁడనగుటచే నేనే వృద్ధత్వమునొందుచున్నాను; మఱియు నేనంతముఖుఁడనై యొప్పుచున్నాను.

అహం తృణలతాగుల్మజాలం రసతయాస్థితః
ఉత్థాపయామి చిద్భూమేః కూపో ఽన్తరలతామివ. 48

ప్రాతబావి తనయందు లతనుజనింపజేయునట్లు రసరూపుఁడనై తృణలతాదుల నేనే చిద్రూప భూమినుండి యుత్పన్నమొనర్చుచున్నాను.

స్వలీలార్థమిదం చారు జగదాడమ్బరం తతమ్
మయాభిజాత బాలేన పఙ్కక్రీడనకం యథా. 49

క్రీడార్థము బాలుడు మంటిబొమ్మను నిర్మించునట్లు, ఈజగద్రూప యాడంబరమంతను స్వవిలాసార్థము నేనే విస్తరింపజేసితిని.

మయేదమాప్యతే సర్వం సత్తా మాం ప్రాప్య గచ్ఛతి
మత్పరిత్యక్తమేతచ్చ సదప్యేవ న కించన. 50

నేనే యంతట కారణరూపమున వ్యాపించియున్నాను మత్స్వరూపసాక్షాత్కారమున కార్యసత్తయంతయు నశించును. మఱియు తత్త్వదర్శనముచే పరిత్యక్తమగు యీజగత్తు జీవన్ముక్తవ్యవహారమున నున్నను లేనిదేయగును.

మయి స్ఫారే చిదాదర్శే ప్రతిబిమ్బం యదాగతమ్
తదస్తి నేతరద్యస్మాన్మత్తో ఽన్యన్నేహ విద్యతే. 51

విశాలచిద్రూపదర్పణమగు నాయందేయ్యది ప్రతిబింబించునో, అదియే స్థిరమైనది యగును గాని అన్యముకాదు. ఏలన, నాకంటెవేఱుగ యీ ప్రపంచమున యేదియును లేదుకదా.

కుసుమేష్వహమామోదః పుష్పపత్రేష్వహం ఛవిః
ఛవిష్వహం రూపకలా రూపేష్వనుభవో ఽప్యహమ్. 52

పుష్పములందలి సుగంధము నేనే అయియున్నాను. పుష్ప, పత్రములందలి శోభయు నేనే. శోభా కాంతులందలి యనుభవరూపమును నేనే.

యద్యత్కించిదిదం దృశ్యం జగత్స్థావరజఙ్గమమ్
సర్వసంకల్పరహితం తచ్చిత్తత్త్వమహం పరమ్. 53

స్థావరజంగమాత్మకమగు యీ ప్రపంచమంతయు సర్వసంకల్ప రహితమగు చిదాత్మస్వరూపమే యగును, అట్టి చిద్రూప పరమాత్మయే నేను.

ఆద్యా రసమయీ శక్తి రసౌఘో విస్తృతో యయా
సా యథా దారు కుడ్యేషు తథాహం సర్వవస్తుషు. 54

ఆది రసతన్మాత్ర సముద్ర నద్యాదులందు జలరూపమున వ్యాపించిన, ఆ జలశక్తియే వృక్షశాఖాపల్లవాదులందు వ్యాపించి స్థితిఁబొందునట్లు, సమస్త పదార్థములందును కార్యోత్పత్తి నిమిత్తరూపమున నేనే స్థితుఁడనై యున్నాను.

పరమాం తామహం సర్వపదార్థాన్తరవర్తితామ్
ఉపేత్య సంవిద్వైచిత్ర్యం ప్రతనోమి స్వయేచ్ఛయా. 55

సర్వోత్తముఁడనై, సర్వపదార్థములంతర్యామినై నేను నాకోర్కెచొప్పున పలువిధ జీవసంవిత్తుల నుత్పన్నమొనర్చుచున్నాను.

ఘృతం యథాన్తః పయసో రసశక్తిర్యథా జలే
చిచ్ఛక్తిః సర్వభావేషు తథాన్తరహమాస్థితః. 56

పాలయందు నేయియు, జలమందు రసమును నున్నట్లు పదార్థములన్నింటియందును చిత్-శక్తిరూపమున నేనే యున్నాను.

ఇదం జగత్త్రికాలస్థం చితిమధ్యే చ సంస్థితమ్
చేత్యోపచారరహితం వస్తుజాతమివావనౌ. 57

పృథివియందు వస్తుసమూహముండునట్లు, భూతభవిష్యద్వర్తమానకాలములందున్నట్టి ఈ జడ జగత్తు చైతన్యమున నెలకొనియున్నది.

భరితాశేషదిక్కుక్షిస్త్యక్తసంకోచవిభ్రమః
సర్వస్థః సర్వకర్తా చ విరాట్ సమ్రాడహం స్థితః. 58

దిక్కులందంతట వ్యాపించి, భ్రమ సంకోచవివర్జితుఁడనై, సర్వపదార్థములందును స్థితి గల్గి, సర్వకర్తనై విరాట్టుగను, సమ్రాట్టుగను (వ్యష్టి సమష్టిరూపముల) నేనే భాసించుచున్నాను.

అపూర్వమనిబద్ధేన్ద్రి మశస్త్రిదవితామరమ్
అప్రార్థితం మే సంప్రాప్తం జగద్రాజ్యమిదం తతమ్. 59

ఇంద్రుని యాధిపత్యమేమియు లేనిదియు, శస్త్రములులేకనే దేవతల నిర్జించునదియు నగు ఈ అపూర్వ విశాలజగద్రాజ్యము నాకు కోరకయే లభించినది.

అహో ను వితతాత్మాస్మి నమామ్యస్మ్యాత్మనాత్మని
కల్పాన్తపవనాఘూత ఏకార్ణవ ఇవార్ణవే. 60

అహా! నేనెట్టి విశాలరూపుఁడను! ప్రళయవాయువుచే కంపితమగు సముద్రము, శాంత సముద్రమున యిముడనట్లు, నేను నాయందిముడుట లేదు.

నాత్మనన్తమవాప్నోమి స్వస్థేఽన్తః స్వదితే స్వయమ్
క్షీరవారినిధౌ పఙ్గుః సరీసృప ఇవ స్ఫురన్. 61

మందగతిగల సర్పము క్షీరసాగరముయొక్కదరిని బొందజాలనట్లు నిరతిశయానంద రూపమున స్వయముగ ననుభూతమగు ఈ ఆత్మయొక్క అంతమును నేను బొందుటలేదు.



స్వల్పేయం మతికా బ్రాహ్మీ జగన్నామ్నీ సుసంకటా
గజో బిల్వ ఇవ స్వాఙ్గే న మాతి విపులం వపుః. 62

బిల్వఫలమున దేనుగు పట్టనట్లు, బ్రహ్మచే నిర్మితమగు ఈ జగత్తను చిన్నమఠమునందు విశాలమైన నా చిత్స్వరూపము పట్టుటలేదు.

విరిఞ్చి భవనాత్పారే తత్త్వాన్తేష్వాహరత్పదమ్
ప్రసరత్యేవ మే రూపమద్యాపి న నివర్తతే. 63

బ్రహ్మదేవుని భవనమగు ఈ విశాల బ్రహ్మాండము నతిక్రమించియు, తత్వము (24 లేక 36) లన్నింటిని దాటియు జనుచున్నను నా స్వరూపమున కింకను నివృత్తి సంభవించుట లేదు.

అయం నామాహమిత్యన్తః కుతో నిరవలమ్బనా
అపర్యన్తాకృతేరేషా కిలాసీత్స్వల్పతా మమ. 64

అహా! ఆశ్రయరహితమగు ఈ దేహాదులకల్పన నాకెట్లు గల్గినది? అనంతాకారము గల నాకీన్యూనత్వమెట్లు సంభవించినది?

భవానయమయం చాహమితి మిథ్యైవ విభ్రమః
కో దేహః కోఽప్యదేహో వా కో మృతం కశ్చ జీవతి. 65

'నీవు' 'నేను' ఇత్యాది కల్పనలన్నియు మిథ్యారూపములును, భ్రమమాత్రములునే యగును. దేహమేమి? దేహము లేకుండుటయేమి మేమి? మృతుఁడెవడు? జీవితుఁడెవఁడు?

వరాకాః పేలవధియో బభూవుర్నో పితామహాః
యే సామ్రాజ్యమిదం త్యక్త్వా రేమిరే భవభూమిషు. 66

ఆత్మజ్ఞానసామ్రాజ్యమును త్యజించి ప్రాపంచిక యైశ్వర్యములందే ప్రీతిగొనిన మా పూర్వులు నిక్కముగ అల్పులే యగుదురు.

క్వేయం కిల మహాదృష్టిర్భరితా బ్రహ్మబృంహితా
క్వ సరీసృప భీమాశా భీమా రాజ్యవిభూతిభిః. 67

బ్రహ్మజ్ఞానప్రవర్ధితమగు ఈ పూర్ణదృష్టి యెచట! సర్పములవలె భయంకరమైన యాశలతో గూడిన ఈ భీకర రాజ్యసంపదలెచట!

అనన్తానన్దసంభోగా పరోపశమశాలినీ
శుద్ధేయం చిన్మయీ దృష్టిర్జయత్యఖిలదృష్టిషు. 68

నిరతిశయానందానుభవ సహితమై, ఉత్తమశాంతితో గూడిన యీ శుద్ధ చిన్మయ దృష్టి సర్వదృష్టులలోను మిన్నయగును.

సర్వభావాన్తరస్థాయ చేత్యముక్తచిదాత్మనే
ప్రత్యక్చేతనరూపాయ మహ్యమేవ నమో నమః 69

పదార్థములన్నింటియందును స్థితిగల్గి విషయవర్జితమై సాక్షిరూపమై యున్నట్టి చిదాత్మ స్వరూపమగు నాకు నేనే పలుమారు వందనములర్పించుకొనుచున్నాను.

జరయామ్యహమజో జాతో జీర్ణసంసార సంసృతిః
ప్రాప్తప్రాప్యో మహాత్మాయం జీవామి చ జయామి చ. 70

చిరకాలమీ తుచ్ఛసంసార ప్రవాహమున బడియున్న నేనిపుడు జన్మరాహిత్యమొంది తిని. కాననే విజయ ఫలమగు సర్వానర్థనివృత్తిని యిపుడు బడసితిని. మఱియు పొందదగిన సు ములన్నింటిని పొందుటచే జీవితఫలమును ప్రాప్తినొందినవాడనై సర్వోత్తముఁడనగుచున్నాను.

ఇదముత్తమ సామ్రాజ్యం బోధం సంత్యజ్య శాశ్వతమ్
న రమేఽహమరమ్యాసు రాజ్యదుఃఖవిభూతిషు. 71

ఇట్టి శాశ్వతమైన ఆత్మజ్ఞానసామ్రాజ్యసుఖమును వదలి అమనోహరములును, దుఃఖప్రద ములునగు రాజ్యసంపదలందు యిక నేనెన్నటికిని రమింపను.

దారువారిదృషన్మాత్రే లులితో యో ధరాతలే
ధిగ్వరాకమనాత్మజ్ఞం తం కుదానవకీటకమ్. 72

కాష్ఠ, జల, శిలామాత్రమేయగు యీ ధరాతలమునందాధిపత్యము గాంక్షించి యుండ ప్రీతిఁగొను నట్టి దుష్టదానవకీటములకు ధిక్కారమగుగాత.

అవిద్యైకాత్మభిర్ద్రవ్యైరవిద్యామయ మజ్జకమ్
అజ్ఞేన సంతర్పయతా కిం నామ గురుణా కృతమ్. 73

అవిద్యాకార్యములగు అన్నపానాది వస్తువులచే అవిద్యామయమేయగు యవయవముల పుష్టి బఱచుచు అజ్ఞుఁడగు నా జనకుఁడీసరి కేమి యొనర్చియుండెను? (పురుషార్థ మెద్దియు గావింప లేదనుట.)

వర్షాణి కతిచిత్ప్రాప్య జగచ్ఛ్రీమతి కామిమామ్
కిం నామ ప్రాపదుచితం హిరణ్యకశిపుః కిల. 74

అల్పకాలమీ త్రైలోక్య సంపదయుక్త జగద్రూప యల్పభూభాగమును బడసి మజ్జన కుఁడగు హిరణ్యకశిపుఁడు కాశ్యపకులోచితమగు పురుషార్థమేమి యొనర్చెను?

అనాస్వాద్యైదమానన్దం జగద్రాజ్యశతాన్యపి
సమాస్వాదయతా నేహ కించిదాస్వాదితం భవేత్. 75

పెక్కు రాజ్యసౌఖ్యములనుభవించినను బ్రహ్మానందరసాస్వాదనము నొందయ్యవి అను భవించనట్లేయగును. మఱియు బ్రహ్మానందరసాస్వాదనముచే తక్కిన యానందములన్నియు ననుభవింపబడినవే యగును.

నకించిద్యేన సంప్రాప్తం తేనేదం పరమామృతమ్
సంప్రాప్యాన్తః ప్రపూర్ణేన సర్వం ప్రాప్తమఖణ్డితమ్. 76

విషయానందముల ననుభవింపకున్నను, పరమామృతస్వరూపమగు ఈ బ్రహ్మానందమును బొంది పరిపూర్ణహృదయుఁడగుచో యాతడు నిక్కముగ సమస్తమును బొందినట్లేయగును.

త్యక్త్వా పరమిదం మూర్ఖో మితమేతి న పండితః
ఉష్ట్రో హి త్యక్తసులతః కంటకం యాతి నేతరః. 77



ఇట్టియనంతమగు దివ్యపదమును త్యజించి పరిచ్ఛిన్నమగుపదమును అజ్ఞుఁడే వాంఛించును గాని జ్ఞాని కాదు. ఫలభారముచే వంగియుండు ద్రాక్షాది యుత్తమలతల వీడి కంటకముల పైపు [illegible] జనునది ఒంటెయేగాని యితర జంతువులు కాదు.

పరాం దృష్టిమిమాం త్యక్త్వా దగ్ధరాజ్యే రమేత కః
కస్త్యక్త్వేక్షురసం ప్రాజ్ఞః కటునింబపయః పిబేత్. 78

ఇట్టి పూర్ణమగు ఆత్మదృష్టిని వదలి తుచ్ఛమగు రాజ్యసౌఖ్యమునందెవఁడాసక్తిగొనును? చెఱకురసమును వదలి చేదగు వేపరసమును ప్రాజ్ఞుఁడు త్రావనెంచునా?

మూర్ఖా ఏవ హి తే సర్వే బభూవుర్మే పితామహాః
ఇమాం దృష్టిం పరిత్యజ్య రేమిరే రాజ్యసంకటే. 79

పూర్ణమగు యిట్టి ఆత్మదృష్టిని త్యజించి రాజ్యసంకటములందే ప్రీతిఁగొనిన మా పూర్వు లందఱును నిక్కముగ అజ్ఞులే యగుదురు.

క్వ ఫుల్లానన్దన స్థల్యః క్వ దగ్ధమరుభూమయః
క్వేమా బోధదృశః శాన్తాః క్వ భోగేష్వాత్మబుద్ధయః. 80

ఆత్మబోధదృష్టి యెచట! భోగాశ్రయములగు శరీరాదులందాత్మబుద్ధి యెచట!

న కించిదపి త్రైలోక్యే యద్రాజ్యమపి వాంఛతే
సర్వమస్త్యేవ చిత్తత్త్వే తత్కస్మాన్నానుభూయతే. 81

ఈ ముల్లోకములందును పొందదగిన దెద్దియును లేదు. ఏలన, రాజ్యమును పొందియు మనుజుఁడింకను యిచ్ఛగించుచునేయున్నాఁడు. చిద్వస్తువునందు సమస్తమున్నయుండ అద్దాని నేల యనుభవింపరాదు?

చితా సర్వస్థయా స్వస్థసముయా నిర్వికారయా
సర్వయా సర్వదా సర్వం సర్వతః సాధు లభ్యతే. 82

సర్వవ్యాపకమై స్వస్థమై, నిర్వికారమై, సర్వస్వరూపమై సదా నెలకొనునట్టి యా చైతన్యమునుండియే సమస్తసుఖములును, తత్సాధనములును లభ్యమగుచున్నవి.

భాసినీ తైజసీ శక్తిరమృతప్రాప్తిరైన్దవీ
బ్రాహ్మీ మహత్తా మహతీ శాక్రీ త్రైలోక్యరాజతా. 83

పరమాపూర్ణతా శార్వీ జయలక్ష్మీశ్చ వైష్ణవీ
మానసీ శీఘ్రగతితా బలవత్తా చ వాయవీ. 84

ఆగ్నేయీ దాహకలనా పాయసీ రసనిర్వృతిః
మానీ మహాతపః సిద్ధిర్విద్యా బార్హస్పతీ యథా. 85

వైమానికీ వ్యోమగతిః స్థిరతా చాపి పార్వతీ
గంభీరతాథ సాముద్రీ మైరవీ చ మహోన్నతిః. 86

శమశ్రీః సౌగతీ సౌమ్యా మాందిరీ మదలోలతా
మాధవీ పుష్పమయతా వార్షికీ ఘనశబ్దితా. 87

యాక్షీచ మాయామయతా నాభసీ నిష్కలజ్కతా
శీత తాపి చ తౌషారీ నైదాఘీ తాపతప్తతా. 88

ఏతాశ్చాన్యాస్తథా బహ్వ్యో దేశకాలక్రియాత్మికాః
నానాకారవికారోత్థా స్త్రికాలోదరసంస్థితాః. 89

విచిత్రాః శక్తయః స్వస్థసమయా నిర్వికారయా
చితా క్రియన్తే పరయా కలాకలనయుక్తయా. 90

తేజముయొక్క ప్రకాశశక్తి, చంద్రుని అమృతప్రాప్తి, హిరణ్యగర్భుని మహత్వము, సర్వోత్తమగు యింద్రుని త్రైలోక్యరాజ్యత్వము, పరమశివుని జ్ఞానైశ్వర్యపరిపూర్ణత్వము, విష్ణువుయొక్క విజయలక్ష్మి, మనస్సుయొక్క శీఘ్రగతి, వాయువుయొక్క బలము, అగ్నియొక్క దాహకత్వము, జలముయొక్క రసత్వము, మునీశ్వరుల మహాతపస్సిద్ధి, బృహస్పతియొక్క విద్య, విమానముల ఆకాశగమనశక్తి, పరత్వముల స్థిరత్వము, సముద్రముయొక్క గాంభీర్యము, మేరుపర్వతముయొక్క మహోన్నతి, సర్వోపద్రవరహితమై, జ్ఞానసంబంధమైన శమముయొక్క అధికశోభయు, మద్యముయొక్క చపలశక్తి, వసంతఋతువుయొక్క పుష్పమయత్వము, వర్షర్తువుయొక్క మేఘ గర్జన, యక్షుల మాయామయత్వము, ఆకాశముయొక్క నిర్మలత్వము, మంచుయొక్క చల్లదనము, గ్రీష్మర్తువుయొక్క యెండవేడిమి, యీ మున్నగునవియు, యింకను దేశకాలక్రియాత్మకములున్ను, పలువిధ వికారములచే నుత్పన్నములును, త్రికాలస్థములునునగు అనేక విచిత్రశక్తిసమూహములును, స్వస్థమై, సమరూపమై, నిర్వికారమై, సర్వోత్తమమై, తత్తచ్ఛక్తి కార్యానుసంధానమున నుద్యుక్తమైయుండునట్టి చైతన్యమునుండియే గలుగుచున్నవి.

వికల్పహీనా చిత్సర్వా పదార్థశతదృష్టిషు
సమమేవాభిపతతి ప్రభా ప్రాభాకరీ యథా. 91

కనక, కుడ్యాదులందు సూర్యప్రకాశమువలె వికల్పరహితమగు చిత్ శ[illegible] [illegible]విధ పదార్థములందేక కాలమున ప్రసరించుచున్నది.

సర్వాశా కోశవిశ్రాన్తాం పదార్థపటలీం మహీమ్
కాలత్రయేహాకలితాం యథానుభవతి క్షణాత్. 92

దిక్కులందంతటు నెలకొనియున్నవియు, కాలముచే పరికల్పితములునగు పదార్థములన్నింటిని ఈ చిత్-శక్తి సూర్యకాంతివలె నేక కాలముననే అనుభవించుచున్నది.

తథా సమస్తసంసారబృహద్దృశ్యదశాశ్రియః
కాలత్రయస్థామమలా చిచ్చేతతి తదాత్మికా. 93

ఇవ్విధమున త్రికాలస్థమగు ఈ విశాలదృశ్య ప్రపంచమునంతయు నిర్మలమగు చైతన్యమొకటియే [illegible]పదార్థ రూపములఁబొందినదై ప్రకాశింపజేయుచున్నది.



తుల్యకాల పరామృష్టా త్రికాలకలనాశతా
అనన్త భువనాభోగా పరిపూర్ణైవ శుద్ధచిత్. 94

అఖండమగు శుద్ధచైతన్యము త్రికాలములందలి పదార్థములతో గూడి పెక్కుకల్పనల [illegible]నుభవించుచున్నను స్వస్వరూపమున నది పరిపూర్ణముగనే నుండును.

పరామృష్టత్రికాలాయా దృష్టానన్త దృశశ్చితః
సమతా పరపర్యాయా పూర్ణతైవావశిష్యతే. 95

కాలత్ర[illegible]యముతో గూడి పెక్కు యనుభవములఁ బొందుచున్నప్పటికిని చిత్-శక్తియొక్క [illegible]త్వము పూర్ణరూపముననే విరాజిల్లుచుండును.

తుల్యకాలావబుద్ధేన స్వాదునా కటునాపి చిత్
సమేన సమతామేతి మధునిమ్బానుభూతివత్. 96

తేనె మొదలగు భిన్న మధుర పదార్థములను రెంటిని గాని, వేపరసము మున్నగు భిన్న [illegible]టుపదార్థములను రెంటిని గాని ఒకే పర్యాయము గైకొనిన, వాటియందొకేవిధమగు అనుభవము [illegible]లుగును గదా! (పదార్థములందు భేదమున్నను, అనుభవమునందు భేదము లేదనుట.)

త్యక్తసంకల్పకలయా సూక్ష్మయా చిద్వ్యవస్థయా
సర్వభావానుగతయా సత్తాద్వైతైకరూపయా. 97

విచిత్రాపి పదార్థశ్రీరన్యోన్యవలితాన్తరా
తుల్యకాలానుభవనా సామ్యేనైవానుభూయతే. 98

సంకల్పవర్జితమై, సూక్ష్మమై, సర్వపదార్థములందు వ్యాపించినదై, అద్వయమై, సత్తారూపమైనట్టి చిత్-శక్తిచే, పరస్పరము మిళితమై భిన్నరూపములనున్న యీ వివిధపదార్థజాలమంతయును ఏకకాలమున సమరూపముననే యనుభవింపబడుచున్నది.

భావేనాభావమాశ్రిత్య భావస్త్యజతి దుఃఖతామ్
ప్రేక్ష్యభావమభావేన భావస్త్యజతి దుష్టతామ్. 99

శ్రుత్యాచార్యోపదేశ, స్వవిచారాదులచే దృశ్యసమూహము యొక్క అభావమును గుర్తెఱింగి అట్టిభావన నాశ్రయించినదై చిత్తము శోకమోహాదిజనితమగు దుఃఖమును పరిత్యజించుచున్నది. మఱియు సమస్త పదార్థముల నిషేధించుచు పరమార్థాద్వైతబ్రహ్మరూపభావము చేనది రాగాదులను తన దుష్టత్వమును వీడుచున్నది.

కాలత్రయమపశ్యన్త్యా హీనాయాశ్చేత్యబన్ధనైః
చితశ్చేత్యముపేక్షిణ్యాః సమతైవావశిష్యతే. 100

వర్తమానకాలమున దృశ్యమును ఉపేక్షించునదియు, భూతకాలిక విషయములఁగూర్చిన వాసనాబంధములు లేనిదియు, దృశ్యవిషయముల కాధారభూతమగు కాలత్రయము నెన్నడు దర్శించనిదియునగు చిత్-శక్తి యందు సమత్వమే శేషించుచున్నది.

యాతి వాచామగమ్యత్వా దసత్తామివ శాశ్వతీమ్
నైరాత్మ్యసిద్ధాన్తదశా ముపయాతేవ తిష్ఠతి. 101

వాక్కునకు విషయముగుటచే నిత్యమగు ఈ చిత్-శక్తి లేనిదాని చందమున నున్నది. ఇట్లాగణమున నది ఆత్మాభావసిద్ధాంత-దశను బొందినదా యనిపించుచున్నది.

భవత్యాత్మా తథా బ్రహ్మా నకించిచ్చాఖిలం చ వా
పరమోపశమేఽలీనా మోక్షనామ్నా పరోచ్యతే. 102

ఈ చిద్వస్తువే సాక్షిరూపమగుటచే ఆత్మయనియు, మహత్తరమగుటచే బ్రహ్మమనియు పలింపబడుచున్నది. అయ్యది వాక్కునకతీతమగుటచే లేనిదిగను, శబ్దప్రవృత్తికంతటను నిమిత్తమగుటచే సర్వము తానయ్యునున్నది. మఱియు దృశ్యమంతయు శమించుటచే ఆ పరమచైతన్యమే మోక్షమనియు యెన్నబడుచున్నది.

సంకల్పకలితా త్వేషా మన్దాభాసతయా జగత్
న సమ్యక్పశ్యతీదం చిద్దృష్టిః పటలినీ యథా. 103

పటలముచే గప్పబడిన నేత్రమువలె, సంకల్పముచే కళంకితమై మందప్రకాశముగల్గియుండునప్పుడు చైతన్యము జగత్తును సమ్యగ్రీతి వీక్షింపజాలదు.

ఈహా నీహామయైర న్తర్యా చిదావలితా మలైః
సాహి నోడ్డయితుం శక్తా పాశబద్ధేవ పక్షిణీ. 104

(త్రాడుచే గట్టబడిన పక్షి యాకసమున కెగురజాలనట్లు, ఇష్టానిష్టములను మాలిన్యముచే కళంకితమైన ఈ చిద్వస్తువు ఆకసమును వ్యాప్తమొనర్పజాలకుండును. (పరిచ్ఛిన్నమైయుండునని భావము.)

సంకల్పకలనేనైవ యే కేచన జనా ఇమే
పతితా మోహజాలేషు వినేత్రా ఇవ పక్షిణః. 105

బోయవాని వలయందు పక్షులుపడునట్లు సంకల్పకల్పనచే మనుజులు మోహజాలమునబడుచున్నారు.

సంకల్పజాలవలితై ర్విషయాపటపాతిభిః
పదవీ గతబాధేయం నదృష్టా మత్పితామహైః. 106

సంకల్పజాలముచే పరివేష్టితులై విషయగర్తమునబడినట్టి మా పితామహులు దుఃఖరహితమగు నీయాత్మపదవిని జూడరైరి.

దినైః కతిపయైరేవ స్ఫురితా ధరణీతలే
వరాకాస్తేన తేనష్టా మశకాః కుహరేష్వివ. 107

దీనులగు యా మా పూర్వులీభూతలముపై కొలది కాలముమాత్రమే యుండి, ధూమమందు మశకములవలె వినాశమొందిరి.

యద్యజ్ఞాస్యన్ని మే తత్త్వం భోగదుఃఖార్థిన స్తదా
భావాభావాస్థకూపేషు నాపతిష్యన్న తాశయాః. 108



భోగజనిత దుఃఖములఁగాంక్షించు యానాపూర్వు లీయాత్మతత్వము నెఱింగియుండినచో ...ద్ధయుతులై భావాభావరూపమగు యంధకూపములఁ బడకుండెడివారు.

ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వంద్వమోహేన జన్తవః
ధరావివరమగ్నానాం కీటానాం సమతాం గతాః. 109

ఇచ్ఛాద్వేషసముత్పన్నమగు సుఖదుఃఖాది ద్వంద్వములచే విమోహితులై జీవులు భూగర్తములందలి కీటజాలముపగిది దీనత్వమునొందుచున్నారు.

ఈహితానీహితాకారాః కలనామృగతృష్ణికాః
సత్యావబోధమేఘేన యస్య శాన్తాః స జీవతి. 110

ఇష్టానిష్టములను మృగతృష్ణ, సత్యజ్ఞానమను మేఘముచే యెవనికి శమించునో అతని ...డే యీ ప్రపంచమున సార్థకమగును.

కుతః కిలాస్యాః శుద్ధాయా అవిచ్ఛిన్నామలాకృతేః
చన్ద్రికాయా రుచః కోష్ణాః కలఙ్కాః కలనాశ్ఛితః. 111

చంద్రికయందు ఉష్ణత్వము లేనట్లు శుద్ధమై సదా నిర్మలాకృతిగల్గి చంద్రికవలె వెలుంగు ...చిద్వస్తువు నందు కళంక కల్పనయే యెట్లుసంభవించును ?

ఆత్మనేఽస్తు నమో మహ్యమవచ్ఛిన్నచిదాత్మనే
లోకాలోకమణే దేవ చిరేణాధిగతోఽస్యహో. 112

అవిచ్ఛిన్న చిదాత్మస్వరూపమగు ఆ నాయాత్మకు నమస్కారము. అహా! మణివలె ...గునకు (జ్ఞాన) ప్రకాశముగల్గజేయు నోయాత్మదేవా ! బహుకాలమునకు పిదప నిన్నుగూర్చిన ...నము నాకు గల్గినది.

పరామృష్టోఽసి లబ్ధోఽసి ప్రోదితోఽసి చిరాయచ
ఉద్ధృతోఽసి వికల్పేభ్యో యోఽసి సోఽసి నమోస్తు తే. 113

చిరకాలమునకు నీవిపుడు నాచే విచారింపబడి పొందబడితివి. మహామహిమాతిశయము ...నీవిపుడుదయించితివి. వికల్పజాలమునుండి సముద్ధరింపబడితివి. సగమార్థమున ...మెయ్యదియో అదియే నీదగుగాక! అట్టి ఆత్మ, స్వరూపమగు నీకు నమస్కారము.

మహ్యం తుభ్యమనన్తాయ మహ్యం తుభ్యం శివాత్మనే
నమో దేవాధిదేవాయ పరాయ పరమాత్మనే. 114

జీవాభిన్నబ్రహ్మస్వరూపమై, అనంతమై, శివమై, బ్రహ్మాది దేవతలను, సమస్తేంద్రియ ...ములకును అధిష్ఠానదేవుడై భాసించు పరమాత్మకు నమస్కారము.

గతఘనపరిపూర్ణ మిన్దుబిమ్బం
గతకలనావరణం స్వమేవ రూపమ్
స్వవపుషి ముదితే స్వయం స్వసంస్థం
స్వయముదితం స్వవశం స్వయం నమామి. 115

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపా
ఉపశమప్రకరణే ప్రహ్లాదాత్మోపదేశో యోగో నామ
చతుస్త్రింశః సర్గః ॥ 34 ॥

మేఘరహిత పూర్ణచంద్రబింబ సదృశమును, ఆనందైకరసమును, అన్యాధారవర్జితము
స్వప్రకాశకమును నగు నాయాత్మరూపమునకు నమస్కారము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రహ్లాదాత్మోపదేశ యోగమను చతుస్త్రింశ
సర్గము ॥ 34 ॥

---

## పఞ్చత్రింశః సర్గః.

---

ప్రహ్లాద ఉవాచ :—

ఓమిత్యేకోచితాకారో వికార పరివర్జితః
ఆత్మైవాయమిదం సర్వం యత్కించిజ్జగతీగతమ్.

ప్రహ్లాదుడు:– ఈ జగత్తునందలి పదార్థములన్నియు బ్రహ్మస్వరూపబోధకమును, చిద్రూపమును, ఏకమును, ఓంకారాఖ్యమును, వికారరహితమును, అనుభవస్వరూపమునగు ఆత్మయే కా అన్యముకావు.

మేదోస్థిమాంసమజ్జాసృగతీతోఽస్త్యేష చేతనః
అన్తరస్థోహి సూర్యాదీన్ప్రకాశయతి దీపకః. 2

ఈచైతన్యాత్మ అస్థి మాంస మేదోమజ్జారక్తములందు వ్యాపించియున్నను, వాటికంటె పరమైనదియగును. ఏలన నది యాంతరమునయున్నను దీపమువలె సూర్యాదులఁగూడ ప్రకాశింప జేయుచున్నది.

ఉష్ణీకరోతి దహనం రసయత్యమృతం రసమ్
ఇన్ద్రియానుభవాన్భుఙ్క్తే భోగానివ మహీపతిః. 3

స్వసత్తచే నీయాత్మయే అగ్నిని యుష్ణముగను, అమృతమును రసవంతముగను నొనర్చుచున్నది. మఱియు రాజు భోగములననుభవించునట్లీ యాత్మయే స్పర్శాదియింద్రియానుభవముల నొందుచున్నది.

తిష్ఠన్నపిహి నాసీనో గచ్ఛన్నపి నగచ్ఛతి
శాన్తోఽపి వ్యవహారస్థః కుర్వన్నపి నలిప్యతే. 4

ఇయ్యది నిష్క్రియంబైనను గతివంతమై దనరుచున్నది. చలించుచున్నను యచలమై యున్నది. శాంతముగనున్నను సర్వవ్యవహారముల నొనర్చుచున్నది. కర్మలనాచరించుచున్నను నిర్లిప్తమైయున్నది.



పూర్వమద్య తథేదానీమిహాముత్రోభయత్రచ
విహితోఽవిహితోఽప్యేష సమః సర్వాసు వృత్తిషు. 5

ఈ యాత్మపూర్వమెట్లుండునో నేడును అట్లేయున్నది. ఇహలోకముననున్నట్లే పరలోకమందునుగలదు. విహితనిషిద్ధ కర్మఫలముల ననుభవించునదైనను సర్వవృత్తులందును సమముగనే వెలయుచున్నది.

ఉద్భవత్యభయో భావం భువనాని తతస్తతః
బ్రహ్మాది తృణపర్యన్తం జగదావర్తయన్స్థితః. 6

పరమార్థమున నియ్యది అభయస్వరూపమైనను తత్తత్కర్మానురూపముగ స్వయముగ నావిర్భవించుచునేయున్నది. మఱియు బ్రహ్మాదితృణపర్యంతముగల భోక్తృభోగ్యసముదాయమంతటిని, వాటికాధారమగు చతుర్దశభువనములను స్వసన్నిధానమాత్రముచే క్రియావంతమొనర్చుచున్నది.

నిత్యస్పన్దమయో నిత్యమపి దేవాత్సదాగతేః
స్థాణోరప్యక్రియో నిత్యమాకాశాదప్యలేపకః. 7

సదా నిష్క్రియమై నెలసినను ఈ యాత్మ స్వసత్తారూపమున వాయుదేవునికంటెను అధిక వేగమున జనునదగును. మఱియునిది స్థాణువుకంటె నధికమగు నిష్క్రియత్వమును, ఆకాశముకంటె నధికమగు నిర్లేపత్వమును గల్గియున్నది.

మనాంసి క్షోభయత్యేష పల్లవానీవ మారుతః
వాహయత్యక్షపఙ్క్తిం స్వామశ్వాలీమివ సారథిః. 8

వాయువు పత్రములఁజలింపజేయునట్లీ యాత్మప్రాణికోట్ల మనంబుల జలింపజేయుచున్నది. మఱియు సారథి గుఱ్ఱముల నడపునట్లియ్యది తనదగు యింద్రియసమూహమును నడుపుచున్నది.

అతిదుర్విధవద్దేహగేహే కర్మరతః సదా
సమ్రాడివాత్మని స్వస్థః సంస్థితో భోగభుగ్విభుః. 9

మిగుల దుర్దశాగ్రస్తమైన దేహమను గృహముననది సదా కర్మనిరతమై యుండును. ఇట్లు భోగానుభవము నొందునట్టి యాపరమాత్మ సమ్రాట్టువలె తన యాత్మయందే తాను నెలకొనియున్నాడు.

ఏషఏవసదాఽన్వేష్యః స్తుత్యోధ్యాతవ్య ఏవతు
జరామరణ సంమోహాదనేనోత్తీర్య గమ్యతే. 10

ఇట్టి పరమాత్మనే సదా యన్వేషింపవలెను. వీనినే స్తుతింపవలెను. వీనినే ధ్యానింపవలెను. ఏలన, వీనినాశ్రయించుటచేతనే మనుజుడు జరామరణముల దాటగల్గును.

సులభశ్చాయమత్యన్తం సుజ్ఞేయశ్చాప్తబన్ధువత్
శరీరపద్మకుహరే సర్వేషామేవ షట్పదః. 11

ఈతడాత్మజ్ఞాన మాత్రముచే నతి సులభముగ పొందబడును. మఱియు స్మరణమాత్రము యుత్తమబంధువగిది వశుఁడగును. ఈతడు సర్వప్రాణికోట్లయొక్క హృదయకమలములం భ్రమరమై చెన్నొందుచున్నాడు.

అనాక్రుష్టోఽప్యనాహూతః స్వదేహాదేవ లభ్యతే
మనాగేవోఽపహూతోఽపి క్షణాద్భవతి సన్ముఖః. 12

ఉచ్చస్వరమున బిలువక కేవలము ప్రణవోచ్చారణముచే స్మరించినంత మాత్రముననే యీ ఆత్మస్వదేహమున ప్రత్యక్షమగుచున్నది.

నాస్య సంసేవ్యమానస్య సర్వసంపత్తిశాలినః
ధనానామీశ్వరస్యేవ స్మయో గర్వో యథా భవేత్. 13

సర్వసంపదలచే తులతూగు నీయాత్మను సేవించినను, ధనికునకు గల్గునట్టి అభిమా గర్వాదు లెవ్వియును మనుజునకు గలుగనేరవు.

ఆమోద ఇవ పుష్పేషు తైలం తిలకణేష్వివ
రసజాతిష్వివాస్వాదో దేవో దేహేషు సంస్థితః. 14

పుష్పములందు సుగంధము, నువ్వులందు నూనె, రసపదార్థములందు రుచియునున్నట్లు ఆత్మయను దేవుడు సర్వదేహములందును వ్యాపించియున్నాడు.

అవిచారవశాదేష హృదయస్థోఽపి చేతనః
నజ్ఞాయతే చిరాదృష్టో దృష్టబన్ధురివాగ్రతః. 15

చాలకాలము క్రిందట జూచిన బంధువు యెదుటనున్నను యెఱుంగబడనట్లు హృదయ మునన్నను చేతనారూపమగు నీయాత్మ అవిచారవశమున తెలియఁబడుటలేదు.

విచారణా పరిజ్ఞాత ఏతస్మిన్పరమేశ్వరే
అభ్యుదేతి పరానన్దో లబ్ధేప్రియజనే యథా. 16

తత్వ విచారముచే పరమేశ్వరుఁడగు నీయాత్మ యెఱుంగబడునపుడు ప్రియజన సందర్శనముచేవలె జీవునకు పరమానందముదయమగును.

అస్మిన్దృష్టే పరే బన్ధావుద్దామానన్దదాయిని
ఆయాన్తి దృష్టయస్తాస్తా యాభిర్భగ్నో విలీయతే. 17

పరమానందజనకమగు యిట్టి బంధుసందర్శనముచే ఆత్మదృష్టి యుదయింప నద్దానిచే జననమరణాదులు విచ్ఛిన్నములగును.

త్రుట్యన్తే సర్వతః పాశాః క్షీయన్తే సర్వశత్రవః
నకృన్తన్తి మనాంస్యాశా గృహాణీవ దురాఖవః. 18

మఱియు నీయాత్మ దర్శనముచే ఆశాపాశములన్నియు ఛిన్నములగును. కామక్రోధాది శత్రుసమూహమంతయు నశించును. గృహమూషకములవలె నిక తృష్ణ మనస్సును ఛేదింపజాల కుండును.



అస్మిన్దృష్టే జగద్దృష్టం శ్రుతేఽస్మిన్సకలం శ్రుతమ్
స్పృష్టే చాస్మిఞ్జగత్స్పృష్టం స్థితేఽస్మిన్సంస్థితం జగత్. 19

ఈ పరమాత్మ దర్శింపబడ జగత్తంతయును దర్శింపబడినదగుచున్నది. శ్రవణమొన ర్పబడ సమస్తమును శ్రవణమొనర్పబడినదగుచున్నది. స్పృశింపబడ బ్రహ్మాండమంతయు స్పృశింపబడినదగుచున్నది. మఱియు నీతడుండుట చేతనే జగత్తంతయును స్థితి గల్గియున్నది.

ఏష జాగర్తి సుప్తానాం ప్రహరత్యవివేకినామ్
హరత్యాపదమార్తానాం వితరత్యమహాత్మనామ్. 20

ఇంద్రియములన్నియుఁ నిదురించునపుడును ఈ యాత్మ మేల్కొనియే యుండును. అవి వేకులపై నిదియే ప్రహారమునల్పును. దుఃఖితుల యాపదల నిదియే బాపును. పరిచ్ఛిన్నాత్మ స్వరూపమగు ఈశ్వరుని యుపాసించువారి వాంఛితముల నీడేర్చునదియు నిదియే.

విచరత్యేష లోకేషు జీవఏవ జగత్స్థితౌ
విలసత్యేవ భోగేషు ప్రస్ఫురత్యేవ వస్తుషు. 21

ఈ యాత్మయే లోకమున జీవరూపమున విహరించుచున్నది; భోగముల ననుభవించునదియు యిదియే. మఱియు వస్త్రాలంకారాదులచే నిదియే శోభిత మొనర్పబడుచున్నది.

ఆత్మనాత్మానమేవాతః శాన్తేనానుభవన్నపి
స్థితః సర్వేషు దేహేషు తీక్ష్ణత్వం మరిచేష్వివ. 22

కాన నీయాత్మయే శాంతరూపమున స్వాత్మనే యనుభవించుచు, మిరెపఫలములందు తీక్ష్ణత్వము వ్యాపించియుండునట్లు సర్వదేహములందును వ్యాపించియున్నది.

చేతనా కలనారూపీ సబాహ్యాభ్యన్తరాశ్రితః
జగత్పదార్థసంభారే సత్తాసామాన్యమాస్థితః. 23

'చేతనా' 'కలనా' (పూర్వోత్తర పదార్థానుసంధానము 'చేతన' వర్తమాన పదార్థ దర్శనము 'కలన') రూపముల ధరించినదై బాహ్యాభ్యంతర చేతనోపాధులందీ యాత్మయే ఆశ్రితమగుచున్నది. మఱియు అధిష్ఠానసత్తాసామాన్యరూపమున సర్వజగత్పదార్థములందు నిదియే వ్యాపించియున్నది.

ఏష శూన్యత్వమాకాశే స్పన్దఏష సదాగతౌ
ప్రకాశశ్చైవ తేజస్తు పయస్స్వేష రసః పరః. 24
కాఠిన్యమవనావేవమౌష్ణ్యమేవ హుతాశనే
శైత్యమేష నిశానాథే సత్తాచైష జగద్గణే 25

ఆకాశమందలి శూన్యత్వము, వాయువందలి నిరంతరచలనము, అగ్నియందలి ప్రకాశము, రసమయపదార్థములందలి రసము, పృథివియందలి కాఠిన్యము, అగ్నియందలి యుష్ణత్వము, చంద్రునియందలి శీతలత్వము, బ్రహ్మాండములందలి సత్తారూపము, నీ యాత్మయే.

మషీపిండే యథా కార్ష్ణ్యం శైత్యం హిమకణే యథా
యథా పుష్పేషు సౌగన్ధ్యం దేహే దేహపతిస్తథా. 26

మషియందు నలుపుదనము, మంచునందు చల్లదనము, పుష్పములందు సుగంధమున్ను యున్నటుల సర్వ దేహములందును దేహియగు ఆత్మవ్యాపించి ప్రకాశించుచున్నాడు.

యథా సర్వగతా సత్తా కాలః సర్వగతో యథా
ప్రభుశక్తిర్మహీ యస్య సర్వదేశగతా యథా. 27
రూపాలోకమనస్కారయుక్తం సత్వం తథాత్మనః
నిత్యః సోఽయం మహాదేవో దేవానామేవ బోధకః. 28

సత్తయు, కాలమున్ను సర్వత్రయెట్లు వ్యాపించియున్నవో, విశాలమగు పృథివి యెట్లంతట అనుగతమైయున్నదో, అట్లనే నేత్రాతీంద్రియవ్యాపారములందును, మనస్సునందును ఆత్మయే వ్యాపించి వాటినన్నింటిని ప్రకాశింపజేయుచున్నది. మహాదేవుఁడగు నీయాత్మ నిత్యమై, బ్రహ్మాది దేవతలకుఁగూడ ప్రకాశమై యొప్పుచున్నది.

అహమేవాస్మి మే నాస్తి కలనాపి కిలేతరా
రేణునేవాణునా వ్యోమ్ని పద్మపత్రమివాంభసా. 29

నేను కేవలశుద్ధస్వరూపుఁడను. ఆకాశమునకు ధూళికణముతోటిన్ని, కమలమునకు జలముతోటిన్ని సంబంధములేనట్లు యితర కల్పనతో నాకెట్టి సంబంధమును లేదు.

సంభ్రమేణేవ పాషాణే సంబన్ధో మయి నేతరైః
సుఖదుఃఖశ్రియో దేహే మా పతన్తు పతన్తువా. 30

భయకంపనాదులతో శిలకేమియు సంబంధములేనట్లు, అన్యపదార్థములతోటి నాకేమియు సంబంధములేదు. సుఖదుఃఖములు దేహమునకుకలుగుగాక కలుగకుండుగాక! వానితో నాకేమిపని?

తుమ్బకోపరి ధారాశ్చ కా నః క్షతిరుపస్థితా
దీపాఙ్గాతిగతో రజ్జ్వా నాలోకో బధ్యతే యథా. 31
తథానాయమహం బద్ధః సర్వభావగణాతిగః
సంబంధః కోస్తునః కామైర్భావాభావై రథేన్ద్రియైః. 32

సొరకాయపై నీటిధార పడినను, లోనున్న యాకాశమునకు హానిలేనట్లు సుఖదుఃఖములచే మాకేమిహానిగల్గును? స్వాంగములగు తైలాదులనతిక్రమించి సర్వత్రవ్యాపింపజనునట్టి దీపప్రకాశము త్రాటిచే నెన్నడుబంధింపబడజాలనట్లు ఆత్మస్వరూపుడనై సర్వపదార్థాతీతుడనైన నేనెద్దాని చేతను బంధితుడనుగానేరను. మఱియు శుద్ధచైతన్యస్వరూపుఁడనగు నాకు భావాభావరూపములైన కాముములలోగాని, యింద్రియములతోగాని సంబంధమేమి ?

కేన సంబధ్యతే వ్యోమ కేన సంబాధ్యతే మనః
శరీరే శతధాయాతే ఖండనా కా శరీరిణః. 33



ఆకాశమునెవరు బంధింపగలరు ? మనస్సునెవరు వధింపగలరు ? దేహము నూఱుప్రక్కలైనను, దేహరహితమగు ఆత్మయెట్లు ఖండింపబడును ?

కుంభే భగ్నే క్షతే క్షీణే కుంభాకాశస్య కా క్షతిః
పిశాచక ఇవాదృశ్యో మనో నామోదితం ముధా. 34

ఘటము పగిలినను, రంధ్రముపడినను, నశించినను ఘటాకాశమున కేమిహాని ? అదృశ్య పిశాచతుల్యమగు మనస్సే సర్వరూపముల వ్యర్థముగ నుదితమగుచున్నది.

జడే తస్మిన్నష్టే బోధాత్మకానః క్షతిరుపస్థితా
సుఖదుఃఖమయీ యస్య వాసనా తన్మనో మమ. 35
అభవత్పూర్వమద్యైకా సంపన్నాఽతనునిర్వృతిః
అన్యో భుఙ్క్తేఽస్య ఆదత్తేఽప్యన్యస్యానర్థసంకటః. 36
అన్యః పశ్యత్యహో మౌర్ఖ్యం కస్యేయం ఖలుచక్రికా
భుఙ్క్తే ప్రకృతిరాదత్తే మనో దేహస్య సంకటః. 37

జడమగు నీమనస్సు ఆత్మజ్ఞానముచే నశింప మనకు హానియేమి ? సుఖదుఃఖమయములగు వాసనలతోగూడినదై నామనస్సు పూర్వమజ్ఞానదశయందుండియుండెను. కాని యిపుడపరిమిత సుఖమున్ను,విశ్రాంతియు నాకులభించినది. ఆహా! వీక్షించునదియు, అనుభవించునదియు, గ్రహించునదియు, అనర్థసంకటము నొందునదియు, మఱియొకటేగాని నేనుకాదు. భోక్తృత్వాదులతోటి యభేదాధ్యాసమను నీయజ్ఞానము ఇంద్రజాలికచక్రతుల్యమగు యెవని చాతుర్యముచే సంభవించినది ? చైతన్యప్రతిబింబితమగు ప్రకృతియేఅనుభవించుచున్నది. మనస్సే గ్రహించుచున్నది, దేహమే దుఃఖమునొందుచున్నది, నేనుకాదు.

దృష్టాత్మా మౌర్ఖ్యమస్తీహ నకించిత్కేవలే క్షతిః
నమే భోగస్థితౌ వాంఛా నచ భోగవివర్జనే. 38
యదాయాతి తదాయాతు యత్ప్రయాతి ప్రయాతు తత్
సుఖేషు మమ నాపేక్షా నాపేక్షా దుఃఖవృత్తిషు. 39
సుఖదుఃఖాన్యుపాయాన్తు యాన్తువాప్యహమేషుకః
వాసనా వివిధా దేహే త్వస్తం చోదయమేవవా. 40
ప్రయాన్తు నాహమేతాసు నచైతా మమ కాశ్చన

ప్రకృతిదోషములచే మలినమైన ఆత్మయందే యిట్టి అజ్ఞానము జనించుచున్నదిగాని శుద్ధాత్మకెట్టి హానియున్నలేదు. భోగములనుభవించుటయందుగాని, వర్జించుటయందుగాని నాకు కోర్కెయేమియును లేదు. ఏదివచ్చునో వచ్చుగాక, పోవునో పోవుగాక! సుఖములందపేక్షగాని, దుఃఖములందు పేక్షగాని నాకులేదు. సుఖదుఃఖములువచ్చుగాక, పోవుగాక నాకు! వాటితో నేమిపని? అట్లనే వివిధవాసనలున్ను దేహమున యుత్పన్నమగుగాక, లేక నశించుగాక! నాకు వాటితోగాని వాటితో నాకుగాని సంబంధమేమియును లేదు.

ఏతావన్తమహం కాలమజ్ఞానరిపుణా హృతః. 41
హృత్వా వివేకసర్వస్వమేకాన్తమవపోథితమ్
వైష్ణవేన ప్రసాదేన స్వసముత్థేన చారుణా. 42
ఇదానీం సంపరిజ్ఞాయ మయైష పరిమోషితః
అహంకారపిశాచోఽయం శరీరతరుకోటరాత్. 43
పరావబోధమన్త్రేణ మమేదానీమపాకృతః
నిరహంకారయక్షోఽయం మచ్ఛరీరమహాద్రుమః. 44
పుణ్యతామలమాయాతః ప్రఫుల్ల ఇవ రాజతే

నేనింతకాలమువఱకును అజ్ఞానమను శత్రువుచే హతుఁడనైతి. ఆతడు నాసర్వస్వమప హరించి నన్ను నాశమున గూలఁద్రోసెను. కాని విష్ణుభగవానుని యనుగ్రహముచే నాయందుదయించిన విచారజ్ఞానముచే నేనిపుడాశత్రువును కనిపెట్టి తొలగించివైచితిని. మఱియు అహంకారమను పిశాచమును శరీరవృక్షకోటరమునుండి పరబ్రహ్మజ్ఞానమను మంత్రసహాయమున వెడలగొట్టితిని, ఇట్లు అహంకారపిశాచరహితమై నాదేహమను మహావృక్షము మిగుల పవిత్రతనొంది విలసిల్లుచున్నది.

ప్రశాన్తమోహదారిద్ర్యో దురాశాదోషసంక్షయే. 45
వివేకధనసంభారాస్థితోఽస్మి పరమేశ్వరః

దురాశాదోషములు శమించునిమిత్తమును, అజ్ఞానదారిద్ర్యోపశమనము కొఱకును వివేకధనసమూహమును బడసినవాడనై నేనిపుడు పరమేశ్వరుడనై వెలయుచున్నాను.

జ్ఞాతం జ్ఞాతవ్యమఖిలం దృష్టా ద్రష్టవ్యదృష్టయః. 46
తత్ప్రాప్తమధునా యేన నాప్రాప్తమవశిష్యతే

తెలిసికొనదగినదంతయు నేనిపుడు తెలిసికొంటిని. చూడదగినదంతయు చూచితిని. మఱియు దేనినిపొందిన నిక పొందదగినదేదియు శేషింపకుండునో, అట్టి యుత్తమ పదార్థము (ఆత్మజ్ఞానము)ను పొందితిని.

దిష్ట్యాదూరోజ్ఝితానర్థా మపేతవిషయోరగామ్. 47
సంశాన్తమోహనీహారాం శాన్తాశామృగతృష్ణికామ్
రజోరహిత సర్వాశాం శీతలోపశమద్రుమామ్. 48
ప్రాప్తోఽస్మి వితతాం భూమిమున్నతాం పారమార్థికీమ్

అనర్థములులేనిదియు, విషయసర్పములు తొలగినదియు, మోహమను మంచు నశించినదియు, ఆశయను మృగతృష్ణ లేనిదియు రజోగుణమను ధూళి దిక్కులంటుచటను గవ్వట్టదియు, ఉపశాంతియను శీతలచ్ఛాయగల వృక్షములుగలదియు, విశాలమును, అత్యున్నతమునునగు యీ పారమార్థిక భూప్రదేశమును నేనిపుడు పొందితిని.



స్తుత్వా ప్రణత్వా విజ్ఞప్త్యా శమేన నియమేనచ. 49
లబ్ధోఽయం భగవానాత్మా దృష్టశ్చాధిగతః స్ఫుటమ్
అహంకారపదాతీతశ్చిరాత్సంస్మృతిమాగతః. 50
స్వభావాద్భగవానాత్మా విష్ణోర్బ్రహ్మ సనాతనమ్

స్తుతి, ప్రణామ, ప్రార్థనలచేతను, నియమముల చేతను, శమముచేతను విష్ణుదేవుని సేవింప, భగవంతుఁడగు నాయాత్మదేవుడు నాకు లభించెను. మఱియు ప్రత్యక్ష రూపమున యాతడు నాచే గాంచబడెను. విష్ణుభగవానుని కృపచేతనే అహంకారమునకు పరమైనట్టి ఈ యాత్మచైతన్యము మునకిపుడు నాస్మృతిపథమునకు వచ్చినది. విష్ణుదేవుని యనుగ్రహముచేతనే, సనాతనబ్రహ్మమును చిరకాల భగవంతుడునగు ఆత్మ యిపుడు నాచే సంస్మరింపబడెను.

ఇన్ద్రియోరగగర్తేషు మరణశ్వభ్రభూమిషు. 51
తృష్ణాకరంజకుంజేషు కామకోలాహలేషుచ
వాసనావనజాలేషు జన్మకూపాన్తరేషు చ. 52
దుఃఖదావాగ్నిదాహేషు దుఃఖదావాగ్నిహారిషు
పాతోత్పాతదశాలక్షైర్మజ్జనోన్మజ్జనభ్రమైః. 53
ఆవిర్భావతిరోభావైరాశాపాశవిచేష్టనైః
అహం చిరమహంకారద్విషా సమవమోషితః. 54
నిశాయామల్పవీర్యాత్మా పిశాచేనేవ జఙ్గలే

ఇంద్రియములను సర్పబిలములును, మరణమను గర్తములును, తృష్ణయను కంటకవృక్షములును, గలదియు, కామమను పక్షుల కోలాహలముతో గూడినదియు, జన్మజన్మాంతరములను బావులుగలదియు, దుఃఖమను దావాగ్ని ప్రజ్వలించుచున్నదియు, మనుజుల ప్రాణ, ధనములహరించు చోరులు గలదియునగు వాసనా వనసమూహములందు, పతనోత్పతనరూపములగు విపధ సంపదలతో గూడి, మునుఁగుచు తేలుచు (ఊర్ధ్వాధోగతులను బడయుచు), జన్మాదుల యావిర్భావతిరోభావములచేతను, ఆశాపాశక్రియలచేతను, ఆత్మనపహరించు నట్టి అహంకారమను శత్రువుచేతను, అల్పసామర్థ్యముగలవాడరణ్యమున పిశాచముచే భాధింపబడునట్లు నేను మిగుల భాధింపబడితిని.

స్వయమేవ త్వథేదానీం క్రియాశక్త్యా స్వయైవహి 55
శౌరిణా వ్యపదేశేన వివేకశ్రీర్విబోధితా
ప్రబుద్ధే భవతీశానే తమహంకార రాక్షసమ్. 56
న పశ్యామి నభోదీపే జ్వలితే తిమిరం యథా

కాని విష్ణుభగవానుని యనుగ్రహముచే నాయందిపుడు వివేక మనువిభవము స్వయముగ నుద్దీప్తమయ్యెను. అట్టి వివేకవిభవముచే ఆత్మ ప్రబుద్ధముకాగా, దీపముచే నంధకారమువలె అహంకారమను రాక్షసుడు అదృశ్యత్వముఁ జెందెను.

తస్యాహంకారయక్షస్య మనోవివరవాసినః. 57
దీపస్యేవ ప్రశాన్తస్య నవేద్మి గతిమీశ్వరః

ఆరిన దీపము గప్పడని చందమున శుద్ధాత్మస్వరూపుడనైన నేనిపుడు మనోబిలమున వసించునట్టి అహంకారమును యక్షుని జాడను గాంచకున్నాను.

దృష్ట ఏవ త్వయీశానే పలాయనపరాయణః. 58
సంపన్నో మదహంకారచోరః సూర్యోదయే యథా

ఆత్మస్వరూపుండవగు నోదేవా ! సూర్యోదయముకాగా చోరుడు పరుగెత్తునట్లు, మీ దర్శన (సాక్షాత్కార) మాత్రముచే నాయహంకారము పలాయనమైనది.

అసదభ్యుత్థితే తస్మిన్నహంకారే పిశాచవత్. 59
గతే తిష్ఠామ్యహం స్వస్థో నిర్ఘనస ఇవ ద్రుమః
శామ్యామి పరినిర్వామి జగత్యస్మిన్ప్రబోధవాన్. 60

పిశాచమువలె మిథ్యారూపమున యావిర్భవించిన ఈయహంకారము తొలగగా, అజగరములేని వృక్షవాటికవలె నేను స్వస్థుండనై యున్నాను. మఱియు ప్రబోధమునుం జెంది శాంతియుతుండనై సుఖముగ నీ జగంబుననున్నాను.

తస్కరేణోజ్ఝితోఽస్మీతి నివృతోఽస్మి చిరోదయమ్
శైత్యమభ్యాగతోఽస్మ్యన్తః శాన్తశామృగతృష్ణికః. 61
ప్రావృడంబుభరస్నాతః శాన్తదావ ఇవాచలః

ఆత్మాపహారియగు అహంకారమునుండి నేనిపుడు విడుదలబొందితిని. కనుకనే యుత్తమశాంతిని బడయుచున్నాను. మఱియు ఆశయను మృగతృష్ణ శమించుటచే, వర్షముచే శమించిన దావాగ్నిగల పర్వతమువలె నాయంతఃకరణము కడుశీతలమై యొప్పుచున్నది.

ప్రమార్జితేహమిత్యస్మిన్పదే స్వార్థవిచారతః. 62
కో మోహః కాని దుఃఖాని కాః కదాశాః క ఆధయః
నరకస్వర్గమోక్షాది భ్రమాః సత్యామహంకృతౌ. 63
భిత్తావేవ ప్రవర్తన్తే చిత్రేహా న నభస్తలే

ఆత్మవిచారముచే అహంకారము తొలగింపబడ నిక మోహమేమి ? దుఃఖమేమి? దురాశలేమి ? మనోవ్యథలేమి ? ఏలన స్వర్గ, నరక, మోక్షాది భ్రాంతిరూపచిత్రములన్నియు అహంకారమను భిత్తి యుండిననే సంభవించునుగాని శూన్యాకాశమున సంభవింపనేరవుగదా !

అహంకారకలాపిత్తే చిత్తే జ్ఞానచమత్కృతిః
నరాజతేంఽశుకే మ్లానే యథా కుంకుమరంజనా. 64

మలిన వస్త్రమందు కుంకుమరంగు శోభించనట్లు, అహంకారమను యున్మాదము చిత్తమునకున్నంతవఱకు జ్ఞానము శోభింపనేరదు.



నిరహంకారజలదే తృష్ణాసారవివర్జితే
భాతి చిత్తశరద్వ్యోమ్ని స్వచ్ఛయా కాన్తిశాలినీ. 65

అహంకారమను మేఘము లేనిదియు, తృష్ణయను మంచుతొలగినదియునగు చిత్తమను శరదాకాశమున ప్రకాశవంతమగు నైర్మల్యమను చంద్రిక భాసించును.

నిరహంకారపఙ్కాయ సంప్రసన్నాన్తరాయచ
మహ్యమానన్దసరసే తుభ్యమాత్మన్నమోనమః. 66

అహంకార పంకరహితమై, అతిప్రసన్నమై, ఆనందసాగరమై, సాక్షిరూపమై బ్రహ్మమై దనరు నోయాత్మ (బ్రహ్మ) స్వరూపమా ! నీకు వందనములు.

శాన్తేన్ద్రియోగ్రగ్రాహాయ క్షీణచిత్తోర్వవహ్నయే
ఆనన్దాంబుధయే తుభ్యం మహ్యమాత్మన్నమోనమః. 67

నశించిన యింద్రియములను క్రూరజలజంతువులు (మొసళ్లు)గలదియు, చిత్తమను బడబాగ్ని శమించినదియునగు, ఆనందసముద్రరూపమునైన ప్రత్యగాత్మస్వరూపమునకు నమస్కారము.

గతాహంకారమేఘాయ శాన్తాశాదావవహ్నయే
మహ్యమానన్దశైలాయ విశ్రాన్తాయ నమోనమః. 68

అహంకార మేఘరహితమును, ఆశాదావాగ్నివివర్జితమును, విశాలమును నగు ఆత్మరూప పర్వతమునకు నమస్కారము.

ప్రఫుల్లానన్దపద్మాయ శాన్తచిన్తామయోర్మయే
మహ్యం సన్మానసాయాత్మంస్తుభ్యమన్తర్నమోనమః. 69

ఆనందమను వికసితకమలసహితమును, చింతారోగరూప తరంగవర్జితమును, సాక్షి రూపమును నగు ఆత్మయను నిర్మల మానస సరోవరమునకు నమస్కారము.

సంవిదాభాసపక్షాయ పద్మకోటరవాసినే
సర్వమానసహంసాయ స్వాత్మనోఽన్తర్నమోనమః. 70

బుద్ధిప్రతిబింబితచైతన్యమను యక్షుండును, హృదయకమలవాసియు, సర్వజీవులయొక్క మానసహంసయు నగు ఆత్మకు నమస్కారము.

కలాకలితరూపాయ నిష్కలాయామృతాత్మనే
సదోదితాయ పూర్ణాత్మన్ శశినే తే నమోనమః. 71

పంచప్రాణ, దశేంద్రియ, మనోబుద్ధులను పదునారు కళలచే కల్పితమయిన రూపము గలదియు, నిరవయవమును, అమృతరూపమును, నిత్యోదితమునునగు ఓపూర్ణాత్మస్వరూపమా ! నీకు వందనములు.

సదోదితాయ శాన్తాయ మహాహృద్ధ్వాన్తహారిణే
సర్వగాయాప్యదృశ్యాయ చిత్సూర్యాయ నమోనమః. 72

సదోదితమై, శాంతమై, హృదయస్థ అజ్ఞానమహాంధకారవినాశకమై, సర్వవ్యాపియై నను అదృశ్యరూపమునను న్నదై యొప్పునట్టి చిద్రూపసూర్యునకు పెక్కువందనములు.

అస్నేహస్నేహదీపాయ వృత్తినిష్క్రాన్తవర్తినే
స్వభావాధారధీరాయ చిద్దీపాయ నమోనమః. 73

తైలరహితమై, పరమప్రేమప్రదీపకమై, వృత్తినిష్క్రమణమను వత్తిగల్గి పదార్థస్వభావములన్నిటికి నాధారమై, బుద్ధిప్రకాశకమై భాసించునట్టి ఆత్మదీపమునకు నమస్కారము.

మదనానలసంతప్తే శీతేన మనసా మనః
భగ్నమన్తర్మయా తప్తమయసేవ బలాదయః. 74

కామాగ్ని సంతప్తమైన మనస్సను తప్తలోహమును శమాది గుణయుక్తమగు మనంబను శీతలలోహముచే నేను ఛేదించివైచితిని.

ఇన్ద్రియేణేన్ద్రియం ఛిత్త్వా ఛిత్త్వాచ మనసా మనః
అహంకృతిమహంకృత్యా ఛిత్త్వా శేషో జయామ్యహమ్. 75

సాక్షిచైతన్యము నైపునకు మఱలు యింద్రియములచే బహిర్ముఖముగ బోవునట్టి యింద్రియములను నిగ్రహించి, అవ్విధముననే శుద్ధమనస్సుచే మలిన మనస్సును జయించి, ఆత్మాహంకారముచే అహంకారమును విచ్ఛిన్నమొనర్చి, శేషించిన చిన్మాత్రస్వరూపమందు స్థితిగల్గి నేనిపుడు సర్వోత్తముఁడనై భాసించుచున్నాను.

భావేనాభావమాచ్ఛిద్య హిత్వా తృష్ణామతృష్ణయా
నిష్పిష్య ప్రజ్ఞయాఽప్రజ్ఞా జ్ఞోఽజ్ఞః సత్యోఽసి తే నమః. 76

ఓ ఆత్మదేవా! శ్రద్ధచే అశ్రద్ధను జయించి, సంతుష్టిచే తృష్ణను వినాశమొనర్చి, విచారముచే అవిచారము నంతమొందించి, జ్ఞాతృత్వాభిమానరహితుఁడనై కేవలము జ్ఞప్తిమాత్రమై వెలుంగు సత్యాత్మస్వరూపమగు నీకు నమస్కారము.

మనసామనసి చ్ఛిన్నే నిరహంకారతాం గతే
భావేన గలితే భావే స్వచ్ఛస్తిష్ఠామి కేవలః. 77

మనస్సు మనస్సు ఛేదింపబడ, అహంకారము రహితముకాగా, బ్రహ్మాహంభావముచే దేహాహంభావము నశింప, యిపుడు నేను కేవలము చిద్రూపుఁడనైయున్నాను.

నిర్భావం నిరహంకారం నిర్మనస్కమనీహితమ్
కేవలం స్పన్దశుద్ధాత్మన్యేవ తిష్ఠతి మేవపుః. 78

భావనారహితమై, అహంకారమనోవర్జితమై, యేకోర్కెయులేక నా శరీరమిపుడు కేవలము ప్రాణక్రియామాత్రముచే శుద్ధాత్మయందు నెలకొనియున్నది.

హేలాను కంపితానన్త విశ్వేశాదతిశాయినీ
పరమోపశమోపేతా జాతేయం మమ నిర్వృతిః. 79



భోగైశ్వర్యాదుల సంప్రదానముచే లీలామాత్రమున తమ భక్తకోటి ననుగ్రహించు విశ్వేశులగు బ్రహ్మవిష్ణుమహేశాదులకంటె నధికమును, పరమశాంతియుతమునగు నిరతిశయానందమందు నాకిపుడు విశ్రాంతి లభించినది.

ప్రశాన్తమోహవేతాలో గతాహంకారరాక్షసః
కదాశారూపికోన్ముక్తో జాతోఽస్మి విగతజ్వరః. 80

మోహమను బేతాళము స్తమింప, అహంకారమను రాక్షసుడు నాశమొంద, దురాశాపిశాచము తొలగగ యిపుడు నేను సంతాపరహితుడనైతిని.

తృష్ణారజ్జుగుణం ఛిత్త్వా మచ్ఛరీరకపంజరాత్
నజానే క్వగతోడ్డీయ దురహంకృతి పక్షిణీ. 81

తృష్ణయను త్రాటిని త్రెంచుకొని నాశరీరమను పంజరమునుండి దురహంకారమను పక్షి యిపుడెచటికో యెగిరిపోయినది.

ఉద్ధూలితే ఘనాజ్ఞానకులాయే కాయపాదపాత్
నజానే గత ఉడ్డీయ క్వాహంభావవిహంగమః. 82

జ్ఞానాభ్యాసమను ధూళిచే యెగురగొట్టబడినదై అహంభావమను పక్షి ఘనమైన అజ్ఞానమను గూటిని వదలి నాదేహమను వృక్షమునుండి యిపుడెటకో పారిపోయినది.

దురాశాదీర్ఘదారాత్మ్య ఘూసరా భోగభస్మనా
భయభోగిహితా దిష్ట్యా భూయస్యో వాసనాః క్షతాః. 83

లిదురాశలచేతను దేహాదులందయాత్మాభిమానముచేతను మలినమై, భయరూపసర్పములకు హితమొనర్చునవైనట్టి అసంఖ్యాకములునగు వాసనలిపుడు సౌభాగ్యవశమున క్షయమొందినవి.

ఏతావన్తమహం కాలం కోఽభూవం చిత్రమీదృశమ్
యేనాహమేష మిథ్యైవ దృఢాహంకారతాం గతః. 84

ఆహా! ఏమి ఆశ్చర్యము! యింతకాలము మిథ్యారూపమగు ఘనాహంకారమునే యాశ్రయించుచుండినట్టి యానే నెవడను?

అద్యాహమస్మి జాతోఽయమహమద్య మహామతిః
అహంకారమహాభ్రేణ యత్కృష్ణేనాలముజ్ఝితః. 85

నేనిపుడు ప్రత్యక్షముగ నిరతిశయానందరూపుఁడనైతి. ఏలన, అపరిఛిన్నబ్రహ్మసాక్షాత్కారవృత్తియుతుఁడనగు నేను అహంకారమను కృష్ణమేఘమునుండి యిపుడు విముక్తుడనైతి.

దృష్టోఽయమాత్మా భగవాంస్తథైవాధిగతో మయా
ఆలబ్ధశ్చాను భూతోఽఙ్గం స్వానుభూతౌ నియోజితః. 86

వాక్యప్రమాణముచే గాంచబడి, మననముచే లెస్సగ పొందబడినదై, సమాధియందు మనస్సు చిరకాలము సంలగ్నమగుటచే లబ్ధమైనట్టి స్వాత్మానుభవమునందు (దేహభావమువలెనే ఆత్మభావమున్ను స్ఫురించేలాగున) భగవంతుడగు నీయాత్మను నేను నియోగించితిని.

గతాస్పదం గతమననం గతైషణం
తిరస్కృతం నిపుణమహంకృతిభ్రమైః
నిరీహితం వ్యపగతరాగరంజనం
వికౌతుకం ప్రశమమిదం గతం మనః. 87

మఱియునిపుడు విషయశూన్యమై మననవివర్జితమై ఈషణారహితమై అహంకారభ్రమలన్ని టిని లెస్సగ పరిత్యజించినదై రాగ రహితమై భోగేచ్ఛావివర్జితమైనట్టి నామనస్సిపుడు ఇంధనము లేని అగ్నివలె శమించినదాయెను.

దురుత్తరాః సమవిషమా మహాపదః
సుదుఃసహాః ప్రభవనదీర్ఘదోషదాః
గతాః క్షయం సమధిగతో మహేశ్వర
శ్చిదద్వయోపగతమచిత్త్వ మన్తరే. 88

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే బ్రహ్మాత్మచిన్తానామ పంచత్రింశః
సర్గః ॥ 35 ॥

తరింప నసాధ్యములును, ఒక్కొక్కప్పుడు చిరకాలమొకేవిధముననుండునవియు, దుస్సహములును, పలువిధ జన్మపరంపరలకు హేతుభూతములును, కామక్రోధాది దీర్ఘదోషముల గల్గజేయునవియునగు గొప్పయాపదలన్నియును యిపుడు క్షయమొందినవి. మఱియు అద్వయ చిత్స్వరూపుఁడగు మహేశ్వరుడు (పూర్ణాత్మ) నాకు సంప్రాప్తమయ్యెను. ఏలన, సాక్షిచైతన్యమున జడత్వమనునది జ్ఞానముచే భాధితమయ్యెనుగదా !

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకణమున
బ్రహ్మాత్మలాభచింతయను పంచత్రింశ
సర్గము ॥ 35 ॥

---

## షట్త్రింశః సర్గః.

---

ప్రహ్లాద ఉవాచ :—

ఆత్మా సర్వపదాతీతశ్చిరా త్సంస్మృతిమాగతః
దిష్ట్యా లబ్ధోఽసి భగవన్నమస్తేస్తు మహాత్మనే. 1

ప్రహ్లాదుఁడు:—చాలదినములు గడచినపిమ్మట నేడు, నిరతిశయానందస్వరూపమగు ఆత్మ స్మృతికి వచ్చినది. భగవంతుడ! అదృష్టవశమున నిన్ను బొందితిని. మహాత్ముడవగు నీకు నమస్కారము.



అభివన్ద్యాథ చాలోక్య చిరమాలిఙ్గ్యసే మయా
కోఽన్యః స్యాత్త్వదృతే బన్ధుర్భగవన్భువనత్రయే. 2

నిన్ను జూచుచు, నమస్కరించి, చిరాలింగన మొనర్చుచున్నాను - ఏకత్వమును, క్షీరో దకన్యాయమున బొందుచున్నాను. భగవన్! నీవు గాక ముల్లోకముల పరమప్రియుడు మరెవ డున్నాడు.

హంసి పాసి దదాసి త్వం స్తౌషి యాసి వివల్గసి
అయంప్రాప్తోసి దృష్టోసి కిం కరోషి క్వ గచ్ఛసి. 3

నిన్ను బొందనంతవఱకు రక్షణ, ధ్వంస, స్తవన, గమనాదిక్రియలు, తదితరవ్యవహారములు సాగుచున్నవి. ఇప్పుడు నిన్ను బొందితిని, కంటిని నీవేమి యొనర్చుచున్నావు? ఎటకరుగుచున్నావు? (అనగా, ఇక నీక్రియలు సంభవములుగావు.)

స్వసత్తాపూరితాశేష విశ్వ విశ్వజనీన భోః
సర్వత్ర లక్ష్యసే నిత్యమధునా క్వ పలాయసే. 4

నీవు నీ సత్తవలన విశ్వమునంతటిని వ్యాపించి, సర్వత్ర అగుపడుచున్నావు. ఇప్పుడు నీ విచ్చటికి పారిపోవుచున్నావు.

ఆవయోరన్తరం భూరి జన్మవ్యవహితాన్తరమ్
అదూరమద్య సంపన్నం దిష్ట్యాదృష్టోఽసి బాన్ధవ. 5

జన్మవలన గలిగిన భేదము పూర్వము మన మధ్యనుండెను. ఇప్పుడది తొలగిపోయినది. ఇప్పుడు, నీవు నాకు సమీపస్థుడవైతివి. హితుఁడా! అదృష్టవశమున నేడు నీ సాక్షాత్కారమును బొందితిని.

నమస్తే కృతకృత్యాయ కర్త్రే భర్త్రే నమోస్తు తే
నమః సంసారవృన్తాయ నిత్యాయ విమలాత్మనే. 6

నమశ్చక్రాబ్జహస్తాయ నమశ్చన్ద్రార్ధధారిణే
నమోవిబుధనాథాయ నమస్తే పద్మజన్మనే. 7

వాచ్యవాచకదృష్ట్యైవ భేదోయోఽయమిహావయోః
అసత్యా కల్పనైవైషా వీచివీచ్యమ్బునోరివ. 8

త్వమేవానన్తయానన్త వస్తువైచిత్ర్యరూపయా
భావాభావవిలాసిన్యా నిత్యమేవ విజృంభసే. 9

నమో ద్రష్ట్రే నమః స్రష్ట్రే నమోఽనన్త వికాసినే
నమః సర్వస్వభావాయ నమస్తే సర్వగాత్మనే. 10

నీవు కృతకృత్యుడవు. నీవు ఈ జగత్కర్తవు, భర్తవు, నీకు నమస్కారము. నీవు ఈ సంసారపత్రమునకు వృంతస్వరూపడవు. నీకు నమస్కారము. నిత్యనిర్మలాత్ముడవగు నీకు నమ -

స్కారము. చక్రాబ్జహస్తా! చంద్రార్కధర! విబుధనాథా! పద్మజా! నమస్కారము. వ్యవహారి దృష్టికి గనబడు మన అంతరము, నీటికిని అలలకునుగల భేదమువలె అసత్యకల్పనయే. నీవు అనంత విచిత్రరూపిణియును, సదసద్రూపిణియును నగు మాయవలన, అనాదికాలమునుండి విజృంభించు చున్నావు. నీవు ద్రష్టవు, స్రష్టవు, సర్వస్వరూపుడవు, సర్వవ్యాపివి. నీకు నమస్కారము.

ప్రతిజన్మ చిరం బహూన్వ్యా దీర్ఘదుఃఖవతా మయా
త్వయా మయోపదిష్టేన దగ్ధే నాపహతౌజసా. 11
ఆలోకితా లోకదృశో దృష్టా దృష్టాన్తదృష్టయః
న ప్రాప్తస్త్వయాఽనేన కించిదాసాదితం భవేత్. 12

నీవింతకాలము మద్భావమును బొంది, నాకామనాదోషానుసారము ప్రేరేపింపబడిన అసత్పథమును ద్రొక్కి, పూర్ణస్వభావమును గోల్పోయి, జన్మజన్మాంతరము బహుదుఃఖము ననుభవించి అనేకములగు వ్యావహారిక నియమములను, వివేకానుకూలములగు దృష్టాంతములను గాంచితి. అందువలన, నేను నిన్ను బొందజాలక పోతిని. వ్యావహారికదృష్టి ఇందులకు తోడ్పడజాలదు.

సర్వంమృత్కాష్ఠపాషాణ వారి మాత్రమిదం జగత్
నేహాస్తి త్వదృతే దేవ యత్ప్రాప్తా నాభివాఞ్ఛతి. 13

దేవా! నీవుగాక, మృత్కాష్ఠపాషాణజలమయమగు ఈ జగత్తంతయు మిథ్యయే నిన్ను బొందిన, సర్వము లభించినట్లే; ఇతరకోర్కెలు మిగులవు.

దేవాయమద్య లబ్ధోఽసి దృష్టోఽస్యధిగతోఽసిచ
సంప్రాప్తోఽసి గృహీతోఽసి నమస్తేస్తు న ముహ్యసి. 14

ప్రభూ! నేను నిన్నుపొందితిని; దర్శించితిని; నీ యథార్థస్వరూపమును గ్రహించితిని. నేను నిన్నుపొంది, గ్రహించుటవలన మోహము దూరమైనది. నీకు నమస్కారము.

యోఽక్ష్ణోః కనీనికారశ్మిజాలప్రోతవపుః స్థితః
దేవ దర్శనరూపేణ కథం సోఽత్ర న దృశ్యతే. 15

దేవా! నేత్రగోళరశ్మిగ్రథిత శరీరుడు అనగా, సాక్షాద్దర్శనుడు మరల కనబడకుండుటేమి?

యస్త్వక్స్పర్శా స్పృశన్సర్వం గన్ధం తైలం తిలేష్వయథా
స్పర్శమన్తః కరోత్యేష స కథం నానుభూయతే. 16

తిలలయందున్న తైలము దానివంటియున్న పువ్వుయొక్క వాసనను గ్రహించునట్లు, త్వక్కును, ఉష్ణాది స్పర్శవృత్తులను వ్యాపించి, అంతరంగమున ఆస్పర్శలను ప్రకాశింపజేయువాడను భూతిగోచరుడవకుండ నుండగలడా?

యః శబ్ద శ్రవణాదన్తః శబ్దశక్తిం పరామృశన్
రోమాఞ్చం జనయత్స్వజ్ఞే స దూరస్థః కథం భవేత్. 17

శబ్దమును వినవంతమాత్రముననే శబ్దశక్తి ప్రకాశింపజేసి, శరీరమును రోమాంచితము నయ్యవాడు దూరస్థుడనబడనగునా?



జిహ్వాపల్లవలగ్నాని స్వదితస్యాగ్రతోఽపిచ
స్వదన్తే యస్య వస్తూని స్వదతే స న కస్య చ. 18

సకలజనప్రియకరములగు మధురామ్లాదిరసములను జిహ్వాగ్రమునుండి ఆస్వాదించు వాడు ఆస్వాదింపబడకుండునా? (అనగా, ప్రత్యక్షమే అని భావము.)

పుష్పగన్ధానుపాదాయ ఘ్రాణహస్తేన దేహకమ్
య ఆలోకయతి ప్రీత్యా కస్యాసౌ న కరే స్థితః. 19

ఆఘ్రాణహస్తమున పుష్పగంధమును గ్రహించి, ప్రీతితో స్వదేహమును గాంచువాడు, ఎల్లరకు (ప్రత్యక్షరూపుడే).

వేదవేదాన్త సిద్ధాన్త తర్కపౌరాణగీతిభిః
యో గీతః స కథం హ్యాత్మా విజ్ఞాతో యాతి విస్మృతిం. 20

వేదవేదాంతముల, తర్కమీమాంసాది శాస్త్రముల, పురాణముల వర్ణింపబడు ఆత్మను ఒకసారి తెలిసికొనిన యిక మఱచుట అనునది ఉండదు.

సైవేహ దేహభోగాలీ సుభగాపీయమద్య మే
అన్తర్న స్వదతే స్వచ్ఛే త్వయి దృష్టే పరావరే. 21

దేవా! ఇంతకుమునుపు రుచికరములగు భోగసమూహములు, స్వచ్ఛుడవగు నిన్ను గాంచిన యిప్పుడు రుచించుటలేదు.

త్వయా విమలదీపేన భానుః ప్రకటతాం గతః
త్వయా శీతతుషారేణ చన్ద్రః శిశిరతాంగతః. 22

నీ నిర్మలప్రభవలననే సూర్యుడు ప్రకాశించుచున్నాడు. నీవే శీతలతుషారమవై చంద్రునకు చల్లదనమొసగినావు.

త్వయైతే గురవః శైలాస్త్వయైతే ద్యుచరా ధృతాః
త్వయైవేయం ధరా ధీరా త్వయైవామ్బరమమ్బరమ్. 23

నీవు ఈ పర్వతములను భారవంతములుగ నొనర్చితివి. ఆకాశమున సంచరించు ఈ వాయువులను ధరించితివి. నీవలననే భూమి సర్వమును ధరించుచున్నది; మఱియు ఆకాశము అవకాశమును బొందినది.

దిష్ట్యామత్తామసిప్రాప్తో దిష్ట్యాత్వత్తామహంగతః
అహంత్వం త్వమహం దేవ దిష్ట్యా భేదోఽస్తినావయోః. 24
అహం త్వమితిశబ్దాభ్యాం పర్యాయాభ్యాంమహాత్మనః
తవవా మమవా శాఖా సంయుక్తాభ్యాంనమోనమః. 25

నేడు నీకును నాకును గలభేదము అదృష్టవశమున తొలగినది. నీవే నేను, నేనే నీవు. మన ఇర్వురకును భేదమొకింతయు లేదు. నీవు, నేను అనుశబ్దములు నీమహత్త్వమునే ప్రకటించుచు, నిన్నే తెలియపరచుచున్నవి. కారణ కార్యోపాధిపరములై, సమానాధికరణ్యములగు ఈ శబ్దద్వయమునకు నమస్కారము.

నమో మహ్యమనన్తాయ నిరహంకారరూపిణే
నమో మహ్యమరూపాయ నమః సమసమాత్మనే.

అనంతుడును, నిరహంకారుడును, రూపవిహీనుడును, అత్యంతసమస్వరూపుడును నాకు నమస్కారము.

మయ్యాత్మని సమే స్వచ్ఛే సాక్షిభూతే నిరాకృతౌ
దిక్కాలాద్యనవచ్ఛిన్నే స్వాత్మన్యేవేహ తిష్ఠసి.

స్వచ్ఛమును, సాక్షిభూతమును, నిరాకారమును, దిక్కాలాద్యనవచ్ఛిన్నమును నాయందు నీవు వెలయుచున్నావు.

మనః ప్రక్షోభమాయాతి స్ఫురన్తీన్ద్రియవృత్తయః
శక్తిరుల్లసతి స్ఫారా ప్రాణాపానప్రవాహినీ.
వహన్తి దేహయన్త్రాణి కృష్టాన్యాశావరత్రయా
చర్మమాంసాస్థిదిగ్ధాని మనఃసారథిమన్తి చ.
అయం సంవిద్వపురహం న కాచిన్న కృతాస్పదః
దేహః పతతు వోదేతు యథాభిమతయేచ్ఛయా. 30

మనస్సు విశేషముగ క్షోభించుచున్నది. ఇంద్రియ వృత్తులు స్ఫురించుచున్నవి. ప్రాణాపానముల ప్రవహింపజేయుశక్తి విజృంభించుచున్నది. ఆశాపాశమున లాగబడిన చర్మమాంసాస్థిమయ శరీరమంత్రము, మనోసారథివలన తోలబడుచున్నది. — వీటితో నాకెట్టిసంబంధములేదు. ఈశరీరముండుగాక కూలుగాక, ఈ కార్యములకు మూలమగు ఆత్మను గ్రహించితిని. ఇక, నా కెట్టి భయములేదు.

చిరాదహమహం జాతః స్వాత్మలాభశ్చిరాదయమ్
చిరాదుపశమం యాతి కల్పస్యాన్తే జగద్యథా. 31

చాలకాలమునకు బిమ్మట నే నాత్మను బొందగల్గితిని. కల్పాంతమున జగత్తు లయమగునట్లు చాలకాలమైన తరువాత నా భ్రాంతి అంతమొందినది.

చిరాత్సంసారగామిత్వాద్దీర్ఘే సంసారవర్త్మని
విశ్రాన్తోఽస్మి చిరం శ్రాన్తః కల్పస్యాన్త ఇవానలః. 32

చాలకాలము సంసారమున దిరుగాడి, ఈ దీర్ఘసంసార పథమున పరిశ్రాంతి నందతిని. ఇప్పుడు కల్పాంతమునందలి అనలమువలె విశ్రాంతిని బొందితిని.

సర్వాతీతాయ సర్వాయ తుభ్యం మహ్యం నమోనమః
తేభ్యోఽపి నమస్తేస్తు యేమాం త్వాం ప్రవదన్తి చ. 33

సర్వాతీతుడవును, సర్వస్వరూపుడవును, మత్స్వరూపుడవును నగు నీకు నమస్కారము. ఈ స్వరూపజ్ఞానమును దెల్పు వేదాది శాస్త్రములకును, గురువులకును నమస్కారము,



అఖిలానన్తసంభోగా నస్పృష్టా దోషవృత్తిభిః
జయత్యకృతసంరంభా సాక్షితా పరమాత్మనః. 34

భోగ్యవస్తువులనన్నింటిని ప్రకాశింపజేయుచు, వాటి దోషములవలన స్పృశింపబడక నిరంతరకూన్యమై ఉదాసీనభావమున నెగడు నీసాక్షిభావము సర్వోత్కృష్టముగ వర్తిల్లుచున్నది.

ఆత్మన్పుష్ప ఇవామోదో భస్త్రాపిండ ఇవానిలః
తిలే తైల మివాస్మింస్త్వం సర్వత్ర వపుషి స్థితః. 35

పరమాత్మా! పుష్పులయందు తావివలె, తోలుతిత్తియందు గాలివలె, నువ్వులయందు నూనెవలె నీవు సర్వశరీరముల వెలుగొందుచున్నావు.

హంసి పాసి దదాసి త్వమవస్ఫూర్జసి వల్గసి
అనహంకృతిరూపోఽపి చిత్రేయం తవ మాయితా. 36

నిరహంకారివయ్యు నీవు హింసించుచున్నావు, రక్షించుచున్నావు, దానమొనర్చుచున్నావు, పోరాడుచున్నావు, పరిగిడుచున్నావు, నీమాయ అత్యంత విచిత్రము.

జయామిశోజ్వలద్దీప్తిః సర్వమున్మీలయఞ్జగత్
జయామ్యుపరమతారంభో జగద్భ్రమో నిమీలయన్. 37

సృష్టికాలమున, నీసహాయ్యము వలననే పదార్థముల నన్నింటిని ప్రకాశింపజేయుచు, స్వస్వరూపమున వాటియందు ప్రవేశించి పరిపాలించుచున్నాను. ప్రళయకాలమున ఉపరతినంది, జగత్తును ఉపసంహరించి జయించుచున్నాడను.

పరమాణో స్త్వైవాన్తరిదం సంసారమండలమ్
వటత్వం వటధానాయాం బభూవాస్తి భవిష్యతి. 38

క్షుద్రమగు వటబీజమున విశాల వటతరువిమిడియున్నట్లు, అత్యంత సూక్ష్మస్వరూపమగు నీయందు ఈసంసారమండలము త్రికాలముల నిమిడియున్నది.

హయద్విపరథాకారైర్యద్వత్తే దృశ్యతేఽమ్బుదః
... లోక్యసే దేవ పదార్థశతవిభ్రమైః. 39

... మేఘములు ఏనుగు, గుఱ్ఱము, రథములమాడ్కి కనంబడునట్లు, నీవు భ్రాంతి కల్పితములగు వివిధపదార్థముల ఆకృతిని వహించి కనంబడుచున్నావు.

భావానాం భూరిభఙ్గానామభవాయ భవాయ చ
భవభావవిముక్తాత్మా భావాభావబహిష్కృతః. 40

బహువిధములును, వికారసంకులములును నగు భావసమూహములను విలోపమందించి, అఖండానంద స్వరూప మావిర్భవింపజేసి, భావాభావములనుండి వెలువడి విముక్తుడవు కమ్ము. నీకు మరల బంధనము కలుగకుండును గాక!

జహి మానం మ... ోపం కాలుష్యం క్రూరతాం తథా.
న మహాన్తో నిమజ్జన్తి ప్రాకృత ... 41

ప్రాక్తనీం దీర్ఘదౌరాత్మ్యదశాం స్మృత్వా పునఃపునః
కోహం కిం తద్బభూవేతి సహస్మ్రక్తాచ్ఛటాసితమ్.

'నే నెవ్వడను, నేనెటునుంటిని' :— అని మాటి మాటికి విచారించి, నీ పూర్వపుదు
దశను స్మరించి, ముత్తెపుసరులవలె స్వచ్ఛముగ హసించి, మానము, క్రోధము, కాపురుషత్వ
క్రూరత్వములను బరిత్యజింపుము. మహాపురుషులు నీచజనోచితమగు గర్హితదశయందు నిమగ్నులగు

తే ప్రయాతాః సమారంభా గతాస్తే దగ్ధవాసరాః
యేషు చిన్తానలజ్వాలా జాలకీర్ణో భవానభూత్.

నీవు పూర్వము చింతానలమునబడి దగ్ధమగు వేళలు, కార్యములు, పీడలు, ఆరంభము
ఇప్పుడు లేవు.

అద్య త్వం దేహనగరే రాజా స్ఫారమనోరథః
న దుఃఖైర్గృహ్యసే నాపి సుఖైర్వ్యోమ కరైరివ. 4

నీ విప్పుడు దేహనగరమునకు రాజువై, పూర్ణమనోరథుడవైతివి. ఆకాశము హస్తగ్ర
ముకానట్లు, నీవు సుఖదుఃఖముల కతీతుడవైతివి.

అద్యేన్ద్రియదురశ్వాంశ్చ జిత్వా జితమనోగజః
భోగారిమభితో భజ్త్వా సామ్రాజ్యమధితిష్ఠసి. 4

నేడు నీ వింద్రియ - అశ్వములను, చిత్త - గజమును, భోగశత్రువును జయించి, (ఆత్మ)
సామ్రాజ్యము నధిష్ఠించితివి.

అపారామ్బరపాన్థస్త్వ మజస్రాస్తమయోదయః
అవభాసకరో నిత్యం బహిరన్తశ్చ భాస్కరః. 46

అనంత గగన పథికుడవగు నీకు ఉదయాస్తమయములు నిత్యమైయున్నవి. (అనగా
జ్ఞానదృష్టికి సర్వదా ప్రకాశితుడు, అవిద్యాదృష్టికి అస్తమితప్రాయుడవు.) బహిరంతరముల భాస్క
రస్వరూపమున బ్రకాశించుచున్నాడవు.

సర్వదైవాసి సంసుప్తః శక్త్యా సంబోధ్యసే విభో
భోగాలోకనలీలార్థం కామిన్యా కాముకో యథా. 47

ప్రసుప్తుడవగు (ప్రశాంతుడవగు) నిన్ను, కామిని కాముకుని సంభోగార్థము లేపునట్లు,
భోగవిలాసములకొరకు శక్తి ప్రబోధించుచున్నది.

దృక్షుద్రాభిరుపానీతం దూరాద్రూపమధు త్వయా
పీయతే స్వీకృతం శక్త్యా నేత్రవాతాయనస్తథా. 48

నేత్ర-వాతాయనములనున్న చితిశక్తిగుండా దృష్టి-మక్షిక వలన తీసికొనిరాబడిన రూప-
మధువును నీవు దూరమున నుండియే పానమొనర్చుచున్నావు.

బ్రహ్మాండకోటరాధ్వాన్తాః ప్రాణాపానపరైస్త్వయా
గతాగతైర్బ్రహ్మపురే సంప్రేక్ష్యన్తే ప్రతిక్షణమ్. 49



నీవు నిరంతరము శరీరమధ్యముననుండి ప్రాణాపానవాయువుల సంచారమున బ్రహ్మ
మార్గమును నిరీక్షించుచున్నావు.

దేహే పుష్పే త్వమామోదో దేహేన్దౌ త్వమృతామృతమ్
రసస్త్వం దేహవిటపే శైత్యం దేహహిమే భవాన్. 50

నీవు దేహపుష్పముయొక్క సౌరభమవు; దేహచంద్రుని అమృతముగూడ నీవే. నీవు శరీర
మను శాఖకు రసస్వరూపుడవు. నీవే దేహ-తుషారశైత్యము గూడనైయుంటివి.

త్వయ్యస్తి విస్మయస్నేహః శరీరక్షీర సర్పిషి
త్వమన్తరస్య దేహస్య దారుణ్యగ్నిరివ స్థితః. 51

సర్వప్రాణుల శరీరమున గర్వకారణమైయున్న స్నేహము, శరీరదుగ్ధ-ఘృతమగు నీయొక్క
రసమే. నీవు శరీమును విడచిన నయ్యది ప్రేమాస్పదము కాజాలదు. నీవు శరీరమను కట్టెయందు
నిప్పువలె నున్నావు.

త్వమేవానుత్తమాస్వాదః ప్రాకాశ్యం తేజసామపి
అవగన్తా త్వమర్థానాం త్వం భాసామవభాసకః. 52
స్పన్దస్త్వం సర్వవాయూనాం త్వం మనోహస్తినో మదః
ప్రజ్ఞానలశిఖాయాస్త్వం ప్రాకాశ్యం తైక్ష్ణ్యమేవచ. 53

నీవు సర్వోత్తమాస్వాదమగు అమృతస్వరూపుడవు. సమస్తతేజః ప్రకాశకుడవు. పదా
ర్థబోద్ధవు. చక్షురాది ఇంద్రియముల కార్యములు నీవలననే జరుగుచున్నది. వాయుచలనమునకును,
చిత్తహస్తి మదమునకును, బుద్ధి - వహ్ని ప్రకాశమునకును, ఉష్ణమునకును గారణము నీవే.

త్వద్వశాదియమాత్మీయా వాచా సంప్రవిలీయతే
దీపవత్పునరన్యత్ర సముదేతి కుతోఽపి సా. 54

మరణమూర్ఛా నిద్రావస్థలయందు నీవు ఉపసంహరించుట వలననే వాక్కు లీనమగుచు
న్నది. ఇతర శరీరముల మరల దీపమువలె ప్రజ్వలించుచున్నది.

త్వయి సంసారవర్తిన్యః పదార్థావలయస్తథా
కటకాఙ్గదకేయూరయుక్తయః కనకే యథా. 55

ఒకే సువర్ణమునుండి కటక కేయూరాంగదాది ఆభరణములు ఉత్పన్నములైనట్లు, సంసార
మునయున్న విభిన్నపదార్థములు నీనుండియే ఉత్పన్నమగుచున్నవి.

భవానయమయం చాహం త్వంశబ్దైరేవ మాదిభిః
స్వయమేవాత్మనాత్మానం లీలార్థం స్తౌషి వక్షి చ. 56

నీకు నీవే విలాసార్థము, ఇతడు, నేను, నీవు, అను మాయికశబ్దముల వలన వ్యవహరింప
బడుచు, స్తుతి నొనర్చుచున్నావు.

మన్దానిల వినున్నోఽబ్దో గజాశ్వనర దృష్టిభిః
యథా సంలక్ష్యతే వ్యోమ్ని తథాత్వం భూతదృష్టిభిః. 57

మందమారుత చాలితమగు మేఘమాల ఆకాశమున గజాద్యాకారముల గనంబడునట్లు, నీవు అసంఖ్య ప్రాణులరూపమున లక్షింపబడుచున్నావు.

యథా హయగజాకారైర్జ్వాలా లసతి వహ్నిషు
తథైవావ్యతిరిక్తైస్త్వం దృశ్యసే భువి సృష్టిషు. 58

వహ్నిశిఖ హయహస్త్యాది ఆకారముల స్ఫురించునట్లు, ఈ సృష్టియందు నీవు నీకంటె అవిభిన్నములగు ఆకారముల నగుపడుచున్నావు.

త్వం బ్రహ్మాండకముక్తానామచ్ఛిన్నస్తన్తురాతతః
క్షేత్రం త్వం భూతసస్యానాం చిద్రసాయనసేవితమ్. 59

అసత్తదనభివ్యక్తం పదార్థానాం ప్రకాశ్యతే
త్వయా తత్త్వం యథా పక్త్యా మాంసానాం స్వాదవేదనమ్. 60

నీవు ఈ బ్రహ్మాండ - ముక్తాఫలమున ప్రేలు దీర్ఘ - అవిచ్ఛిన్న సూత్రమవు. చిద్రసాయనముతో గూడిన భూత - సస్యములకు నీవు క్షేత్రమైయున్నావు. వండిన మాంసాది పదార్థముల రుచి ప్రకాశించునట్లు అనభివ్యక్త పదార్థములు సృష్టిరూపమున నీవలననే ప్రకాశమునందుచున్నవి.

విద్యమానాపి వస్తుశ్రీర్న స్థితా త్వయి న స్థితే
వనితారూపలావణ్యసత్తేవ గత చక్షుషః. 61

అంధునికడ, యువతియొక్క రూపలావణ్యములుండియు ఉండనట్లు, నీవు లేకున్న ఈ వస్తుసంపద ఉండియు ఉండనిదేయగుచున్నది.

సదపీహ న సత్తాయై వస్తునా వర్జితం త్వయా
తృప్తయే నస్వలావణ్యం ముకురాత్ప్రతిబింబితమ్. 62

నీవు కార్యకారిణియగు శక్తిని వస్తువులకొసంగి అనుగ్రహింపకున్న, అవి ఉండియు పనికిరానివగుచున్నవి. అద్దమున ప్రతిబింబించిన ముఖలావణ్యము కామోపశమనమున కుపయోగపడదుకదా.

లుఠతి త్వాం వినాదేహః కాష్ఠలోష్ట సమః క్షితౌ
సన్నప్యసన్నగోచ్ఛ్రాయః శ్యామాస్వివ రవిం వినా. 63

నీవు లేకున్న ఈ శరీరము కాష్ఠలోష్టసమమై పడియుండును. వెలుగు లేకున్న పర్వతముయొక్క ఔన్నత్యము అంధకారమున గప్పబడిపోవునుగదా!

సుఖదుఃఖక్రమః ప్రాప్య భవన్తం పరినశ్యతి
ప్రాకాశ్యమాసాద్య యథా తమ స్తేజోఽథవా హిమమ్. 64

సూర్యకాంతి వచ్చిన అంధకారము, దీపములయొక్కయు నక్షత్రములయొక్కయు కాంతియును, మంచుయు లీనమైపోవునట్లు, సుఖదుఃఖములుగూడ నిన్నుబొందిన నశించిపోవును.

త్వదాలోకనయైవైతే స్థితిం యాన్తి సుఖాదయః
సూర్యాలోకనయా ప్రాతర్వర్ణాః శుక్లాదయో యథా. 65



ప్రాతఃకాలమున సూర్యప్రభవలననే శుక్లకృష్ణాదివర్ణములు స్పష్టముగ ప్రకాశించునట్లు, నీదర్శనమువలననే సుఖదుఃఖములు స్థితిని బొందుచున్నవి.

లబ్ధాత్మానో వినశ్యన్తి సంబన్ధక్షణ ఏవ తే
తే తమాంసీవ దీపస్య దృష్టా ఏవ వ్రజన్త్యలమ్. 66

సుఖదుఃఖములు నీ దర్శనమున స్థితిని బొందుచు, నీవులేకున్నచో నశించుచున్నవి. నీ వలననే అవి ఉత్పన్నములగుచున్నవి. కాని నీ దర్శనానంతరము, దీపమున చీకటి అణగిపోవునట్లు, సంపూర్ణముగ లయమందుచున్నవి. (అనగా, సామాన్య లౌకికసుఖములు నీసత్తవలననే అనుభవయోగ్యములగుచున్నవి; అవి ఆత్మసాక్షాత్కారానంతరము నశించును - అని భావము)

తమస్తా తమసో దీపాసత్తాయాం స్ఫుటతాం గతా
దీపసంబంధసమయే సా చోత్పద్య వినశ్యతి. 67

తదేవం సుఖదుఃఖశ్రీర్దృష్ట్వైవ త్వామనామయమ్
జాయతే జాతమాత్రైవం సర్వనాశేన నశ్యతి. 68

దీపము లేకున్న అంధకారము పరిస్ఫుటమగుచు, దీపమువచ్చిన తోడనే ఉండియు ఉన్నట్లే నశించు తీరున, సుఖదుఃఖములు నిరామయుడవగు నిన్నాశ్రయించియే ఉత్పన్నములగుచు, నీ దర్శనానంతరము వినాశమునందుచున్నవి.

భఙ్గురత్వాదిహ స్థాతుం కాలం నాణుమపి క్షమా
నిమేషలక్షభాగాఖ్యా తన్వీ కాలకలా యథా. 69

నిమేష లక్షభాగమగు సమయము ఎవ్వరివలనను బరికింపబడక నశించునట్లు అత్యంతభంగురములగు ఈసుఖదుఃఖములు పరమానంద స్వరూపుడవగు నీయందు ఒక్కక్షణమైననుండక నశించుచున్నవి.

గాన్ధర్వీ నగరీ తన్వీ సుఖదుఃఖాదిభావనా
స్ఫురతి త్వత్ప్రసాదేన త్వయిదృష్టే విలీయతే. 70

గంధర్వనగరమువలె అత్యంత - మిథ్యలగు సుఖదుఃఖములు నీ అనుగ్రహముననే స్ఫురించుచు, నీదర్శనమైన వెంటనే నశించుచున్నవి.

త్వదాలోకేక్షణోద్భూతా త్వదాలోకేక్షణక్షయా
మృతేవ జాతా జాతేవ మృతా కేనోపలక్ష్యతే. 71

క్షణమప్యస్థిరం వసు కథం కారకకరం భవేత్
తరంగైరుత్పలాకారైర్మాలా కథమివేక్ష్యతే. 72

యదా వా జాతనిర్నష్టం క్రియాం వస్తు కరిష్యతే
తదా రమేత లోకోఽయం మాలాం కృత్వా తడిద్గణైః. 73

ఇవి నీదర్శనక్షణముననే ఉత్పన్నములగుచు, నీ దర్శనమాత్రముననే నశించుచున్నవి. స్వప్నమున మృతించి మరల జన్మించినట్లును, జాగ్రద్దశయందు మృతించినట్లును దోచు వీటితీరు

నెవ్వరు గమనింపగలరు? క్షణమైన ఉండని వస్తువెట్లు పనినొనర్పగలదు? కలువలవలె దోచు తరంగములతో మాలను గట్టగలమా? పుట్టినమాత్రమే గిట్టువస్తువు కార్యకారియగుచో, మెఱుపులతో మాలనుగ్రుచ్చి, జనులాహ్లాదమునుబొంది యుండెడివారు.

ఇమాం సుఖాదికాం లక్ష్మీం వివేకిజనచేతసి
స్థితః సన్నేవ గృహ్ణాసి నజహాసి సమస్థితిమ్ 74
అవివేకిషు యోఽసి త్వం సహజాత్మన్యదృచ్ఛయా
తద్రూపకథనేనాలం మమానల్పపదాస్పద. 75
నిరీహేణ నిరంశేన నిరహంకృతినా త్వయా
సతా వాప్యసతా వాపి కర్తృత్వమురరీకృతమ్. 76

ఇట్టి తుచ్ఛసుఖదుఃఖములను వివేకుల మనంబులగూడ ప్రతిఫలింపజేయుచు, వారి సన్నిధియందు సములుగ నుంచుచున్నావు. సహజాత్మ! అనంత నామరూపాస్పదా! నీవు అవివేకుల కడ తోచు తెఱంగును వర్ణింప నావాక్కు అసమర్థము. నీవు నిరీహుడవు, నిరవయవుడవు, నిరహంకృతివి. నీవు నిరాకారుడవే కమ్ము, సాకారివే కమ్ము, అన్నింటికిని కర్తవు నీవే.

జయ ప్రోడ్డామరాకార జయ శాన్తిపరాయణ
జయ సర్వాగమాతీత జయ సర్వాగమాస్పద. 77
జయ జాత జయాజాత జయ క్షత జయాక్షత
జయ భావ జయాభావ జయ జేయ జయాజయ. 78
ఉల్లాసమ్యుపశామ్యామి తిష్ఠామ్యధిగతోఽస్మి చ
జయీ జయాయ జీవామి నమో మహ్యం నమోఽస్తు తే. 79

ఈశా! నీ ఆకారము బ్రహ్మాండము కంటె విస్తృతము; నీకు జయమగుగాక! శాంతి పరాయణా! జయము! పరమాత్మ! నీవు నిఖిలాగమాతీతుడవు! నీవు నిఖిలాగమాధారుడవు. నీకు జయమగుగాక। జాత! అజాత! క్షత! అక్షత! భావ! అభావ! జయ! అజయ! నీకు జయమగుగాక! నేను ఉల్లసించి, శాంతుడనై వెలయుచున్నాను; యథార్థమును దెలిసికొంటిని. నేను జయించితిని; ఇందులకే జీవించితిని. నాకును, నీకునుగూడ నమస్కారము.

త్వయి స్థితే మయి విగతామయాత్మని
స్వసంస్థితే వ్యపగతరాగరంజనే
క్వ బంధనం క్వచ విపదః క్వ సంపదో
భవాభవౌ క్వ శమముపైమి శాశ్వతమ్. 80

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూత్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే ఆత్మస్తవనం నామ షట్త్రింశః సర్గః ॥ 36 ॥

---



నిరామయమును, స్వసంస్థితమును, రాగరంజనా రహితమును నగు త్వత్స్వరూపమున స్థితుడనగు నాకు బంధనమేమి? విపత్తెక్కడ? సంపద ఎక్కడ? జననమరణము లెక్కడ? నిరామయమగు నిత్యశాంతిలాభమేమి? (దానిని పొందియే యున్నాను.)

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ఆత్మస్తవనమను షట్త్రింశ సర్గము ॥ 36 ॥

---

## సప్తత్రింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇతి సంచిన్తయన్నేవ ప్రహ్లాదః పరవీరహా
నిర్వికల్పపరానన్ద సమాధిం సముపాయయౌ. 1

వసిష్ఠుడు:—శత్రుమర్దనుడగు ప్రహ్లాదుడిట్లు చింతించుచు, పరమానందప్రదమగు నిర్వికల్పసమాధిని ప్రవేశించెను.

నిర్వికల్పసమాధిస్థశ్చిత్రార్పిత ఇవాచలః
శైలాదివ సముత్కీర్ణో బభౌ స్వపదమాస్థితః. 2

నిర్వికల్పసమాధిమగ్నుడగు ప్రహ్లాదుడు స్వరూపసామ్రాజ్యమును అనగా బ్రహ్మపదమును బొంది, చిత్రపటమునందలి బొమ్మవలెను, పాషాణనిర్మితమగు నరమూర్తివలెను నుండెను.

తథానుతిష్ఠతస్తస్య కాలో బహుతరో యయౌ
స్వగృహే భువనస్థస్య మేరోరివ సురద్విషః. 3

ఇట్లు సమాధిదశయందు ప్రహ్లాదుడు చాలకాలము గడపెను. అప్పుడాతడు భూమధ్యముననున్న సుమేరుగిరివలెనుండెను.

బోధితోఽప్యసురాధీశైర్నాబుధ్యత మహామతిః
అకాలే బహుసేకోఽపి బీజకోశాదివాఙ్కురః. 4

మహామతియగు ప్రహ్లాదుని అసురనాయకులు ప్రబోధించినను, అకాలమున నీరుపోసినను బీజమునుండి మొక్కమొలవనట్లు, ప్రబోధితుడవకుండెను.

ఏవం వర్షసహస్రాణి పీనాత్మాఽతిష్ఠదేకదృక్
శాన్త ఏవాసురపురే మార్తండ ఇవ చోపలే. 5

ప్రహ్లాదు డసురపురియందు, రాతియందు చెక్కబడిన సూర్యునివలె నిశ్చలుడై, ప్రశాంతభావమున ఏకదృష్టితో సహస్రవత్సరములు గడపెను.

పరానన్దదశైకాన్త పరిణామితయా తయా
నిరానన్దం పరాభాసమివాభాసపదం గతః. 6

ఇట్లాతడు పరమానందస్వరూపమున బరిణమించుటజేసి, చూపరుల కాతడు నిరానంద స్వరూపమగు మృత్యువును బొందినట్లగపడుచుండెను.

ఏతావతాథ కాలేన తద్రసాతలమండలమ్
బభూవారాజకం తీక్ష్ణం మాత్స్యన్యాయకదర్థితమ్. 7

అప్పుడు పాతాళపురి అరాజకమై మత్స్యన్యాయమున బీడింపబడ దొడగెను. అనగా, బలవంతులు బలహీనులను బీడింపసాగిరి.

హిరణ్యకశిపౌ క్షీణే సమాధౌ తత్సుతే స్థితే
న బభూవాపరః కశ్చిద్రాజా దనుసుతాలయే. 8

హిరణ్యకశిపుడు మరణించుట వలనను, అతని పుత్రుడగు ప్రహ్లాదుడు సమాధిమగ్నుడగుటవలనను, రాజ్యమును బాలించువారు లేకుండిరి.

అసురేశార్థినాం తేషాం దానవానాం సమాధితః
పరేణాపి ప్రయత్నేన ప్రహ్లాదో న వ్యబుధ్యత. 9

అసురనాయకులు ప్రార్థించి, మిక్కుటముగ ప్రయత్నించినను ప్రహ్లాదుడు సమాధినుండి లేవకుండెను.

నప్రాపుర్వికసద్రూపం పతిం తమమరారయః
లసత్పత్రలతాజాలం నిశి పద్మమివాలయః. 10

రాత్రికాలమున భ్రమరములు వికసితపద్మమును బొందజాలనట్లు, అసురులు వృద్ధిత ప్రహ్లాదుని బొందజాలకుండిరి.

సంవిద్వాదో న తస్యాన్తరబోధ్యత విచేతసః
భువశ్చేష్టాక్రమ ఇవ పౌరుషో గతభాస్వతః. 11

సూర్యుడు సమించిన మనుజవ్యాపారము లుండనట్లు ఏకరసస్వరూపమందిన ప్రహ్లాదుని చిత్తమున సెట్టి క్రియయు చోరకుండెను. [illegible] కుండెను.

అథోద్విగ్నేషు దైత్యేషు గతేష్వభిమతాం దిశమ్
విచరత్సు యథాకామమమరాజని పురే పురా. 12
చిరాయ పాతాలమభూదభూపాలతయా తయా
మాత్స్యన్యాయవిపర్యస్త మస్తంగతగుణక్రమమ్. 13
బలిముక్తాబలపురం మర్యాదాక్రమవర్జితమ్
సగారోరాశేష వనితం పరసారహా[illegible]ంబరమ్. 14
ప్రలాపాక్రన్దపురుషం [illegible]స్థానపురో[illegible]న్తంమి
లితదుద్యాననగరం వృద్ధానర్థకదర్థితమ్. 15
చినాపరా సురగణం నిరన్నఫలబాన్ధవమ్
అకాండో[illegible]మండలమ్. 16



సురార్భకపరాభూతం భూతైరాక్రాన్తమన్త్యజైః
భూతరిక్తమలక్ష్మీక ముచ్ఛిన్నప్రాయకోటరమ్. 17
అనియతవనితార్థమన్త్రియుద్ధం
హృతధనదారవిరావితం సమన్తాత్
కలియుగసమయోద్భటోత్కటాభం
తదసురమండలమాకులం బభూవ. 18

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే అసురమండల వ్యాకులీభావనం నామ సప్తత్రింశః సర్గః ॥ 37 ॥

---

అప్పుడు దైత్యులుద్విగ్నులై 'ఇష్టము వచ్చినట్లు' సంచరింపసాగిరి. పాతాళపురి అరాజకమయ్యెను; మత్స్యన్యాయమును బొందెను. గుణవంతులు గుణహీనులగు చండాలురవలె వ్యవహరింపసాగిరి. బలవంతులు బలహీనుల సొత్తును హరించి, భోగింపసాగిరి. జనుల మానమర్యాదలు నశించెను. అబలలు పీడింపబడసాగిరి; పరస్పరము వస్త్రముల నపహరించుకొనసాగిరి. పీడితులు ఉచ్చైస్స్వనమున రోదింపసాగిరి. అంతఃపురము కట్టుబడులను దాటెను. ఉద్యానవనమునందలి చెట్లు విరిగిపోయెను. నాగరికులు ధనమును బోగొట్టుకొని, బంధుజన విచ్ఛేదశోకమున దుఃఖితులై నేలపైబడసాగిరి. ఆత్మీయులు దస్యుపీడితులై, అన్నపానముల గోల్పోయి, బిచ్చకాండ్రవలెనైరి. ఇవ్విధమున అసురులు చింతామగ్నులైరి. హఠాత్తుగ ఇట్లగుటజేసి అందఱును కింకర్తవ్యమూఢులైరి. దిక్కులు ధూళివ్యాప్తములయ్యెను. దేవబాలకులు అరుదెంచి అసురులను పరాభవింపసాగిరి. అంత్యజులు ఆక్రమింపసాగిరి. పాతాళపురి ప్రాణిశూన్యమును, హతభాగ్యమును, విపర్యస్తమును నైపోయెను. ధనవనితాహరణముగాకా పరస్పరము పోరాడసాగిరి; ఓడినవారు రోదింపసాగిరి. కలికాలమునవలె దస్యులు పరస్వము నపహరించి,దానవపురిని ఉద్విగ్నమొనర్చివైచిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
అసురమండలవ్యాకులీభవనము సప్తత్రింశ
సర్గము ॥ 37 ॥

---

అష్టత్రింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అథాఖిల జగజ్జాల క్రమపాలన దేవనః
క్షీరోదనగరే శేషశయ్యాసనగతో హరిః. 1

ప్రావృణ్నిద్రావ్యుపరమే దేవార్థమరిసూదనః
ధియా విలోకయామాస కదాచిజ్జాగతీం గతిమ్. 2

వసిష్ఠుఁడు:—అనంతరము నిఖిలజగత్కార్యక్రీడాకారియును, క్షీరసముద్రవాసియును అనంతశాయియును, శత్రుసూదనుఁడునునగు హరి కార్తికాంతమున నిద్రనుండిలేచి, దేవతల మంగళము కొఱకు, జ్ఞాననేత్రమున జగద్గతిని పరికింపదొడఁగెను.

త్రివిష్టపం స్వమనసా పార్థివం చావలోక్య సః
ఆచారమాజగామాశు పాతాలమరిపాలితమ్. 3

ప్రథమమున మనస్సుచే స్వర్గధామమును బరికించి, పృథివియొక్క రీతిని గమనించి శత్రుజనపాలితమగు పాతాళమును నిరీక్షించెను.

తత్రస్థిరసమాధానే స్థితే ప్రహ్లాదదానవే
దృష్ట్వా సంపదమిన్ద్రస్య పురే ప్రౌఢిముపాగతామ్. 4
వ్యాలతల్పతలస్థస్య క్షీరోదార్ణవశాయినః
శంఖచక్రగదాపాణేర్దేహస్యాన్తరచారిణః. 5
పద్మాసనస్థస్య మనః శరీరేణాతిభాస్వతా
ఇదం సంచిన్తయామాస త్రైలోక్యాబ్జమహాలినా. 6

అచ్చట ప్రహ్లాదుడు స్థిరసమాధిమగ్నుఁడై యుండెను; స్వర్గమున ఇంద్రుడు స్వచ్ఛందముగ భోగముల ననుభవించుచుండెను. ఈ విషయముల నన్నిటినిగాంచి, క్షీరసాగరవాసియును, అనంతశాయియును, నిఖిలాంతర్యామియును, శంఖచక్రగదాపాణియును, పద్మాసనస్థితుఁడును నగు హరియొక్కమనస్సు త్రిలోక - కమల - భ్రమరమై ఇట్లు చింతింపసాగెను.

ప్రహ్లాదే పదవిశ్రాన్తే పాతాలే గతనాయకే
కష్టం సృష్టిరియం ప్రాయో నిర్దైత్యత్వముపాగతా. 7

'ప్రహ్లాదుడు బ్రహ్మపదమున విశ్రమించుటచేసి పాతాళమిప్పుడు నాయకవిహీనమైనది. అహా! నాసృష్టి ఇప్పుడు దైత్యశూన్యమైనది.

దైత్యాభావే సురశ్రేణీ నిర్జిగీషుపదం గతా
శమమేష్యత్యదృష్టాబ్ధపటలేవ సరిద్యథా. 8

రాక్షసులు లేకుండుటవలన దేవతల విజయేచ్ఛ నశించినది. క్రమముగ వీరుగూడ అనావృష్టికాలమునందలి నదివలె శాంతినందెదరు.

మోక్షాఖ్యం నిర్గతద్వంద్వం తతో యాస్యతి తత్పదమ్
క్షీణాభిమాన విరసా లతేవ ప్రవిశుష్కతామ్. 9

వీరు శాంతించి ద్వంద్వరహితమగు బ్రహ్మపదమును బొందెదరు. అభిమానరహితులై, జలసేచనములేని లతవలె స్వర్గసుఖముల విరసతను బొందెదరు.



దేవౌఘే శాన్తిమాయాతే భువి యజ్ఞతపఃక్రియాః
అదేవత్వఫలాః సర్వాః శమమేష్యన్త్యసంశయమ్. 10

దేవతలు శాంతించిన, యజ్ఞయాగాది క్రియలు నశించిపోవును. మనుష్యులు గూడ విఘ్నకారులగు దేవతలు లేకుంటచేసి శమమునందెదరు.

క్రియాస్వథోపశాన్తాసు భూర్లోకోఽస్తముపైష్యతి
అసంసారప్రసంగోఽథ తస్య నాశే భవిష్యతి. 11

క్రియలు నశించిన కర్మభూమియగు భూలోకము నశించిపోవును. భూలోకము నశించిన సంసారము సంపూర్ణముగ ఉచ్ఛేదమునందును.

ఆకల్పాన్తం త్రిభువనం యదిదం కల్పితం మయా
నాశమేష్యత్యకాలేన తాపే హిమకణో యథా. 12

ప్రళయానంతరము నేనొనర్చిన ఈ సృష్టి అకాలమున, వేడికి మంచుకరగిపోవునట్లు నష్టమైపోవును.

కిమేవమస్మిన్నాభోగే విలీయ క్షయమాగతే
కృతం మమేహ భవతి స్వలీలాక్షయకారిణా. 13

నేను కల్పించిన ఈ విశాల జగత్తు నశించుచో, నేను నా లీలను భంగమొనర్చి యొనర్చెడిదేమున్నది?

తతోఽహమపి శూన్యేఽస్మిన్నష్టచన్ద్రార్కతారకే
వపుఃప్రశాన్తిమాధాయ స్థితిమేష్యామి తత్పదే. 14

అట్లగుచో, నేనుగూడ చంద్రసూర్యనక్షత్రశూన్యమగు ఈ శరీరమును లీనమొనర్చి తత్పదమున వెలయుదును.

అకాండ ఏవమేవం హి జగత్యుపశమం గతే
నేహ శ్రేయో నపశ్యామి మన్యే జీవన్తు దానవాః. 15

కాని, ఇట్లనవసరముగా జగత్తు లయమందిన శ్రేయమేమియు నుండదు. (ఏలయన, జీవులు ప్రకృతిలయమందుదురు, వారి మూలాజ్ఞానము నశింపకపోవుటవలన, మరల జన్మింపవలసియుండును.) అందువలన, దానవులు జీవింతురుగాక!

దైత్యోద్యోగేన విబుధాస్తతో యజ్ఞతపఃక్రియాః
తేన సంసారసంస్థానం న సంసారక్రమోఽన్యథా. 16

రాక్షసులు పరాక్రమవంతులైనచో, దేవతలుందురు; తపోయజ్ఞాదిక్రియలు నిలబడియుండును. సంసారమిట్లేయుండును; వ్యతిక్రమమేమియునుండదు.

తస్మాద్రసాతలం గత్వా యథావత్స్థాపయామ్యహమ్
స్వేక్రమే దానవాధీశ మృతుః పునరివ ద్రుమమ్. 17

నేను పాతాళమునకు జేగి ఋతువు వృత్తమును నియమించునట్లు, ప్రహ్లాదుని రాజ్యపాలనాకర్తవ్యమున నియమింతును.

వినా ప్రహ్లాదమథచేదితరం దానవేశ్వరమ్
కరోమి తదసౌ మన్యే దేవానాసాదయిష్యతి. 18

ప్రహ్లాదుని విడచి మఱియొక్కని రాజ్యపాలనమునకు నియమించిన అతడు, దేవతల నాక్రమించును.

ప్రహ్లాదస్య త్వయం దేహః పశ్చిమః పావనో మహాన్
ఆకల్పమిహ వస్తవ్యం దేహే నానేన తేన చ. 19

ప్రహ్లాదుని దేహమత్యంత పవిత్రము; మరల నీతడు జన్మింపడు. కల్పాంతము వఱకు ఇతడు జీవించి యుండును గాక.

ఏవం హి నియతిర్దేవీ నిశ్చితా పారమేశ్వరీ
ప్రహ్లాదేన యథాకల్పం స్థాతవ్యమిహ దేహినా. 20

ఆకల్పము ప్రహ్లాదుడు జీవించియుండునుగాక! ఇయ్యది ఈశ్వరనియతి ఈ నియమమునకు భంగము లేదు.

తస్మాత్తమేవ గత్వాతు దైత్యేన్ద్రం బోధయామ్యహమ్
గర్జన్గిరినదీసుప్తం మయూరమివ వారిదః. 21

కనుక, నేను పాతాళపురి కఱిగి, గిరినదీతటమున నిద్రించు మయూరమును మేఘము గర్జించి ప్రబోధించునట్లు, ప్రహ్లాదుని ప్రబోధింతును.

జీవన్ముక్తసమాధిస్థః కరోత్వసురనాథతామ్
మణిర్ముక్తమనస్కారః ప్రతిబింబక్రియామివ. 22

మనోచేష్టారహితమగు మణి తనయందితర వస్తువులను ప్రతిబింబింప జేసికొనునట్లు, జీవన్ముక్తస్థితియందుండియే ప్రహ్లాదుడు రాజ్యమును పాలించునుగాక!

నహి నశ్యతి సర్గోఽయమేవం సహ సురాసురైః
భవిష్యతి చ తద్ద్వంద్వం తన్మే క్రీడా భవిష్యతి. 23

అగుచో, దేవాసురులు నశింపకుందురు; వెనుకటియట్లే ద్వంద్వములుండును. నా లీల గూడ చెక్కుచెదరకుండును.

సర్గక్షయోదయావేతౌ సుసమౌ మమ యద్యపి
తథాపీదం యథాసంస్థం భవత్వన్యేన కిం మమ. 24

ఈ జగత్తుయొక్క క్షయోదయములు నాకు సమానములు. అనగా దాన నాకు సుఖదుఃఖములు గల్గవు. వెనుకటిరీతి ననుసరించియే ఈ జగత్తు లయమందును గాక!

భావాభావేషు యత్తుల్యం తన్నాశే తత్స్థితౌ చ వా
యః ప్రయత్నస్త్వబుద్ధిత్వాత్తద్యోగగమనం భవేత్. 25



ఇప్పుడు నేనచ్చటకు కఱుగుచున్నాను. నాకెట్టి అభినివేశము లేకుండుటవలన, యోగనిద్రకు గమనము భంగము కాజాలదు.

తస్మాత్ప్రయామి పాతాలం బోధయామ్యసురేశ్వరమ్
స్థైర్యం యామి న సంసారలీలాం సంపాదయామ్యహమ్. 26

అందువలన నేను పాతాళమున కఱిగి అసురపతిని ప్రబోధింతును. ఇది సామాన్య సంసారకర్తవ్యము కాజాలదు.

అసురపురమవాప్య ప్రోద్ధతాచారఘోరం
కమలమివ వివస్వాన్దైత్యముద్బోధయామః
జగదిదమఖిలం స్వస్థైర్యమభ్యానయామో
ఘనవిధిరివ శైలే చంచలం మేఘజాలమ్. 27

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే పరమేశ్వరవితర్కో నామాష్టత్రింశః
సర్గః ॥ 38 ॥

దైత్యపురి ఇప్పుడు మర్యాదావిహీనమై దస్యువ్యవహారమున భయంకరమైయున్నది. నేనచ్చటి కఱిగి, సూర్యుడు పద్మమును ప్రబోధించునట్లు ప్రబోధింతును. వర్షఋతువు చంచలమేఘములను గిరిశృంగమున స్థిరమొనర్చునట్లు, నేనీ జగత్స్థితిని స్థిరమొనర్తును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
పరమేశ్వరవితర్కమను అష్టత్రింశ
సర్గము ॥ 38 ॥

---

## ఏకోన చత్వారింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇతి సంచిన్త్య సర్వాత్మా క్షీరోదాదాత్మకాత్పురాత్
చచాల పరివారేణ సహ సానురివాచలః. 1

వసిష్ఠుడు:—సర్వాత్ముడగు హరి యిట్లు చింతించి క్షీరసాగరాంతర్గతమగు శ్వేతద్వీపము నుండి, కొండలుగల మందరపర్వతమువలె వెలువడెను.

క్షీరోదతలరంధ్రేణ తేనైవ స్తంభితాంభసా
ప్రహ్లాదనగరం ప్రాప శక్రలోకమివాపరమ్. 2

నీరు చొరజాలని పాతాళవివరముగుండ శ్రీహరి ద్వితీయ అమరావతియనదగు ప్రహ్లాదపురిని ప్రవేశించెను.

హేమమన్దిరకోశస్థం దదర్శాత్రాసురం హరిః
అథ శైలగుహాలీనం సమాధిస్థమివాబ్జజమ్. 3

అచ్చట, సువర్ణభవనమధ్యమున ప్రహ్లాదుడు సుమేరుగుహాలీనుడగు బ్రహ్మవలె, సమాధిమగ్నుడైయుండుట గాంచెను.

తత్ర తే తేజసా దైత్యా వైష్ణవేనావఘూలితాః
దూరం యయుర్దినేశాంశువిత్రస్తా ఇవ కౌశికాః. 4

అటనున్న రాక్షసులు వైష్ణవతేజమును దాళజాలక, సూర్యకిరణప్రకాశములకు దాళజాలని గుడ్లగూబలవలె, దూరముగ జనిరి.

ద్విత్రైః సహాసురైర్ముఖ్యైః పరివారయుతో హరిః
ప్రవివేశాసురగృహం తారావానివ ఖం శశీ. 5

పరివారయుతుడగు శ్రీహరి రాక్షసశ్రేష్ఠుల నొకరిద్దరిని వెంటనిడికొని ప్రహ్లాదుని గృహము బ్రవేశించెను. అప్పుడు తారాయుతుడగు చంద్రుడాకాశమున బొడమినట్లుండెను.

వైనతేయాసనస్థోఽసౌ లక్ష్మీవిధుతచామరః
స్వాయుధాది పరీవారో దేవర్షిమునిసంస్తుతః. 6
మహాత్మన్సంప్రబుధ్యస్వేత్యేవం విష్ణురుదాహరన్
పాంచజన్యం ప్రదధ్మౌ చ ధ్వనయన్కకుభాం గణమ్. 7

ఆయన ఆయుధములను ధరించి, పరివారవేష్టితుడైయుండెను. గరుడాసనస్థితుడగు ఆయనకు లక్ష్మి చామరము వీచుచుండెను. దేవర్షులు, మహర్షులు ప్రణమిల్లుచుండిరి. 'మహాత్మా! ప్రబుద్ధుడవుకమ్ము' అనుచు ఆయన పాంచజన్యమును పూరించి, దిక్కులను ప్రతిధ్వనింపజేసెను.

మహతా తేన శబ్దేన వైష్ణవప్రాణజన్మనా
తుల్యకాలపరిక్షుబ్ధ కల్పాభ్రార్ణవ రంహసా. 8
ఆసురీ జనతా భూమౌ పపాతాగతసంభ్రమా
మత్తలీలాభ్రనాదేన రాజహంసావలీ యథా. 9
జహర్ష జనితానన్దా వైష్ణవీ గతసంభ్రమా
జనతా జలదధ్వానే ఫుల్లేవ కుటజావలీ. 10,
బభూవ సంప్రబుద్ధాత్మా దానవేశః శనైః శనైః
మేఘావసర ఉత్ఫుల్లకదంబ ఇవ కాననే. 11

విష్ణుదేవుని ప్రాణవాయువువలన గల్గిన ఆ ధ్వని ప్రళయమేఘములు, ప్రళయసాగరములు కలసి ఒక్కసారిగా బొబ్బరిల్లినట్లుండెను. ఆకస్మికముగ మేఘగర్జనము వినిన రాజహంసలవలె, రాక్షసులు ఆ శంఖధ్వనిని విని మూర్ఛనొందిరి. విష్ణుని అనుచరులు ఆ శబ్దమును విని, మేఘధ్వనిని విన్న కుటజపుష్పములవలె ఆనందింపసాగిరి. వర్షాగమమున వికసించు కదంబపుష్పమువలె దానవాధిపతియగు ప్రహ్లాదుడు, విష్ణుని శంఖధ్వనివిని, మెల్లమెల్లగ బోధనందసాగెను.



బ్రహ్మరంధ్రకృతోత్థానా ప్రాణశక్తిరథాసురమ్
శనైరాక్రమయామాస గఙ్గా సర్వమివార్ణవమ్. 12

అనంతరము ప్రహ్లాదుని ప్రాణశక్తి బ్రహ్మరంధ్రమునుండిలేచి గంగ సముద్రము నాక్రమించునట్లు, అతని శరీరమునంతటిని వ్యాపించెను.

క్షణాదాక్రమయామాస ప్రాణశ్రీః సర్వతోఽసురమ్
ఉదయానన్తరం సౌరీ ప్రభేవ భువనాన్తరమ్. 13

సూర్యోదయానంతరము తత్కాంతి క్షణములో జగత్తునంతటిని వ్యాపించునట్లు, క్షణములో ప్రాణశక్తి ప్రహ్లాదుని అంగప్రత్యంగముల వ్యాపించెను.

ప్రాణేషు రంధ్రనవకే ప్రవృత్తేష్వథ తస్య చిత్
చేత్యోన్ముఖీ బభూవాన్తః ప్రాణదర్పణబింబితా. 14
చేతనీయోన్ముఖీ చేత్యం చిన్మనస్తాముపాయయౌ
ద్విత్వం ముకురసంక్రాన్తా ముఖశ్రీరివ రాఘవ. 15
కించిదఙ్కురితే చిత్తే నేత్రే వికసనోన్ముఖే
శనైర్బభూవతుస్తస్య ప్రాతర్నీలే యథోత్పలే. 16

ఇంద్రియములు నవద్వారములకడకు వచ్చెను. చైతన్యము లింగశరీరమను దర్పణమున ప్రతిఫలించెను. చైతన్యము విషయోన్ముఖమై చిజ్జడరూపమగు మనోభావమును బొందెను. ప్రహ్లాదుని చిత్తమిట్లొకింత ఉద్బుద్ధమవ అతని నేత్రములర్ధనిమీలితములై ఉదయమున అరవిచ్చిన నీలోత్పలములవలెనుండెను.

ప్రాణాపానపరామృష్టా నాడీవివరసంవిదః
వాతార్తస్యేవ పద్మస్య స్పందోఽస్య సమజాయత. 17

నాడీరంధ్రమునందలి జ్ఞానశక్తి ప్రాణాపానవాయువులవలన సుదోభితమవ, ప్రహ్లాదుడు మందవాయుకంపితమగు పద్మమువలె, కదలసాగెను.

నిమేషాన్తరమాత్రేణ మనః పీవరతాం యయౌ
తస్మిన్ప్రాణవశాత్పూర్ణే తరఙ్గ ఇవ వారిణి. 18

ప్రాణములు పూర్ణమైన పిదప, నలువైపులనుండి నీరువచ్చిపడిన చెలువునందు తరంగములు వృద్ధినందునట్లు, అతని మనస్సు పరిపూర్తినందసాగెను.

అథాసౌ వికసన్నేత్ర మనఃప్రాణవపుర్బభౌ
అర్కోదిత ఇవాదిత్యే సరః స్ఫురితపఙ్కజమ్. 19

నేత్రములు, మనస్సు, ప్రాణము వికసింప, ప్రహ్లాదుడు ఫుల్లకమలయుతమగు ప్రాతఃసరోవరమువలె శోభిల్లసాగెను.

అస్మిన్నవసరే యావద్బుధ్యస్వేత్యవదద్విభుః
ప్రబుద్ధస్తావదేషోఽభూద్బర్హీ ఘనరవాదివ. 20

అప్పుడు శ్రీహరి 'ప్రబుద్ధుడవు గమ్ము' అని పల్కిన మాత్రముననే ప్రహ్లాదుడు మేఘ గర్జనము వినిన నెమలివలె, ప్రబుద్ధుడయ్యెను.

ప్రఫుల్లనయనం జాతమననం పీవరస్మృతిమ్
ఉవాచైనం త్రిలోకేశః పురా నాభ్యబ్జజం యథా. 21

కన్నులు విడివడి, మననశక్తి ఉత్పన్నమవ, స్మృతిశక్తి వృద్ధినంద, త్రిలోకపతియగు నారాయణుడు, పూర్వము బ్రహ్మతో బల్కినట్లు ప్రహ్లాదునితో నిట్లు పల్కసాగెను.

సాధోస్మర మహాలక్ష్మీమాత్మీయాం స్మర చాకృతిమ్
అకాండ ఏవ కిం దేహవిరామః క్రియతే త్వయా. 22

హేయోపాదేయసంకల్పవిహీనస్య శరీరగైః
భావాభావైస్తవార్థః కిము తిష్ఠోత్తిష్ఠసంప్రతి. 23

స్థాతవ్యమిహ దేహేన కల్పం యావదనేన తే
వయం హి నియతిం విద్మో యథాభూతామనిందితామ్. 24

జీవన్ముక్తేన భవతా రాజ్య ఏవేహ తిష్ఠతా
క్షేపణీయా గతోద్వేగమాకల్పాన్తమియం తనుః. 25

తన్వాం కల్పాన్తశీర్ణాయాం స్వేమహిమ్ని త్వయానఘ
వస్తవ్యం స్ఫుటితే కుమ్భే కుమ్భాకాశేన ఖే యథా. 26

కల్పాన్తస్థాయినీ శుద్ధా దృష్టలోకపరావరా
ఇయం తవ తనుర్జాతా జీవన్ముక్తవిలాసినీ. 27

నోదితా ద్వాదశాదిత్యా నప్రలీనాః శిలోచ్చయాః
న జగజ్జ్వలితం సాధో తనుం త్యజసి కిం ముధా. 28

వాయుర్వహతి నోన్మత్తస్త్రిలోకీభస్మధూసరః
లోలామరకపాలాఙ్కసనుం త్యజసి కిం ముధా. 29

అశోక ఇవ మఞ్జర్యః పుష్కరావర్తవిద్యుతః
న స్ఫురన్తి జగత్కోశే తనుం త్యజసి కిం ముధా. 30

సాధూ! రాక్షసరాజ్యలక్ష్మీమహత్వమును, నిజస్వరూపమును ఒక్కసారి స్మరించి, నీ వెందులకు శరీరమును బరిత్యజించుచున్నది ఆలోచించుకొనుము. నీ కిప్పుడు హేయములు లేక ఉపాదేయములగు సంకల్పములు లేవు; కనుక, శారీరక సుఖదుఃఖముల వలన నీ కట్టి కీడును పొడమజాలదు. లెమ్ము, నీకాకల్పాంతము ఈశరీరమే యుండును. అవశ్యంభావమును, అనిందితమును నగు ఈ నియతిని నే నెఱుంగుదును. కనుక నే నీకును జెప్పుచున్నాను. రాజ్యపాలన మొనర్చుచు, జీవన్ముక్తుడవగుటవలన నిరుద్వేగభావమున ఆకల్పాంతము మనుము. అనఘా! కల్పావసానమున ఈశరీరము విశీర్ణమైన, భగ్నఘటాకాశము మహాకాశమున లీనమగునట్లు, బ్రహ్మపదమున నెలయుము, ఈ



శరీరము పరావరస్థానమును దర్శించి విశుద్ధమై, కల్పాంతమువఱకు జీవన్ముక్తస్థితిని నెగడఁగలదు. ద్వాదశాదిత్యులింకను నుదయింపలేదు; పర్వతములు భూగర్భమున లీనమవలేదు. జగత్తు ప్రజ్వలితము కాలేదు; అయ్యో, సాధో! నీవు శరీరమును త్యజింప యత్నించుచుంటివేమి? దేవతా కపాలభిన్నుడగు ప్రళయపవనుడు దగ్ధజగద్భస్మమును గొని ఉన్మత్తుడై ప్రవహించుటలేదే; నీవేల శరీరమును త్యజింపనున్నావు. పుష్కలావర్త మేఘములు అశోకమంజరులవలె విద్యుత్తులను జిమ్ముచు జగత్తున స్ఫురించుటలేదే? నీవేల శరీరమును త్యజింపబోవుచున్నావు?

ధరాసారరణచ్చైలాః ప్రజ్వలజ్జ్వలనోజ్జ్వలాః
కకుభో న విశీర్యన్తే తనుం త్యజసి కిం ముధా. 31

న బ్రహ్మ విష్ణురుద్రాఖ్య త్రయీ శేషమిదం స్థితమ్
జగజ్జరఠ జీమూతం తనుం త్యజసి కిం ముధా. 32

న చేహాద్రిదలశ్రేణిమాత్రైకానుమితాన్తరాః
దిశో జర్జరతాం యాతాస్తనుం త్యజసి కిం ముధా. 33

స్ఫుటదద్రీన్ద్రటంకారాః కరాః సౌరా భ్రమన్తి ఖే
కల్పాభ్రాణి న గర్జన్తి తనుం త్యజసి కిం ముధా. 34

అహంభూతావకీర్ణాసు సాలోకాసు ఖగధ్వజః
విహరామి దశాశాసు మా దేహమవధీరయ. 35

ఇమే వయమిమే శైలా భూతానీమాన్యయం భవాన్
ఇదం జగదిదం వ్యోమ మా దేహమవధీరయ. 36

దహింపబడు పృథివియొక్క కంపమున పర్వతములు విరిగి పడుటలేదే? ప్రళయానలము జ్వలితములగు దిఙ్మండలములనున్న బ్రహ్మాండభిత్తులు తుత్తునకలగుటలేదే? నీవేల శరీరమును బరిత్యజింప బోవుచున్నావు? ప్రళయమేఘధారల ఈ జగత్తునశించి త్రిమూర్త్యవశిష్టమగుటలేదే? వ్యర్థముగ శరీరమును త్యజింపబోవుచున్నావేమి? ఇంకను, ద్వాదశాదిత్యుల కాంతివలన భూపద్మకేశమగు లోకాలోక పర్వత శృంగముయొక్కయు, బ్రహ్మాండభిత్తియొక్కయు భేదము అనుమానింప బడుటలేదే? బ్రహ్మాండభిత్తి శిథిలమవలేదే, అగుచో, శరీరమును బరిత్యజింపబోవుచున్నావేమి? ద్వాదశాదిత్యుల ప్రచండకిరణములు మేరువును భేదించి ఆకాశమును వ్యాపింపలేదే; ప్రళయ మేఘములు గర్జించుటలేదే; వ్యర్థముగ శరీరమును త్యజింపనున్నావేమి? నేనును గరుడారూఢుడనై ప్రాణిగణసంకులమును, సూర్యకిరణప్రకాశితమును నగు దశదిఙ్మండలముల పరిభ్రమించుచున్నాను. ఇంకను ప్రళయకాలము సమీపింపలేదు. కనుక, నీవుశరీరమును బరిత్యజింపకుము. మనము, ఈ పర్వతములు, ఈ జీవులు, నీవు, ఈ జగత్తు, ఆకాశము అన్నియు వెలయుచున్నవి; కనుక దేహమును బరిత్యజింపకుము.

పీవరాజ్ఞానయోగేన యస్య పర్యాకులం మనః
దుఃఖాని వినికృన్తన్తి మరణం తస్య రాజతే. 37

కృశోఽతిదుఃఖీ మూఢోఽహమేతాశ్చాన్యాశ్చ భావనాః
మతిం యస్యావలుమ్పన్తి మరణం తస్య రాజతే. 38

ఆశాపాశనిబద్ధోఽన్తరితశ్చేతశ్చ నీయతే
యో విలోలమనోవృత్త్యా మరణం తస్య రాజతే. 39

యస్య తృష్ణాః ప్రభఞ్జన్తి హృదయం హృతభావనాః
ప్రరోహమివ గర్దభ్యో మరణం తస్య రాజతే. 40

చిత్తవృత్తిలతా యస్య తాలోత్తాలమనోవనే
ఫలితా సుఖదుఃఖాభ్యాం మరణం తస్య రాజతే. 41

రోమరాజీలతాజాలం యస్యేమం దేహదుర్ద్రుమమ్
అనర్థౌఘా హరత్యుచ్చైర్మరణం తస్య రాజతే. 42

యస్య స్వదేహవిపినమాధివ్యాధిదవాగ్నయః
దహన్తి లోలాజ్జలతం మరణం తస్య రాజతే. 43

కామకోపాత్మకా యస్య స్ఫూర్జన్త్యజగరాన్తనౌ
అన్తః శుష్కద్రుమస్యేవ మరణం తస్య రాజతే. 44

ఎవ్వని మనస్సు అజ్ఞానయోగమున వ్యాకులమైనదో, అనుదినము దుఃఖసమూహముల భిన్నమగుచున్నదో, అట్టివానికి శరీరత్యాగము తగును. 'నేను కృశుడను, అత్యంత దుఃఖితుడను, మూఢుడను' అను భావనలవలనగాని, తదితర భావనలవలనగాని మతిలోపించినవానికి మృత్యువు తగును. ఆశాపాశాబద్ధాంతఃకరణుడై, చంచల మనోవృత్తులవలన ఇటనటకు గొని పోబడువానికి మృత్యువు తగును. వివేకమును నశింపజేయు తృష్ణ ఎవ్వని హృదయమును ధాన్యాంకురమువలె మర్దించుచున్నదో, అట్టి గర్ధభమునకు మృత్యువు తగును. తాళవృక్షమువలె ఉన్నతమగు చిత్తారణ్యమున వృత్తులను లత సుఖదుఃఖములను ఫలముల నొసగుచున్నది; ఇట్టి చిత్తముగల పురుషునకు మరణము తగును. ఎవ్వని దేహ విష-వృక్షము. (ఇయ్యది రోమములను లతచే చుట్టబడియున్నది) కామాది అనర్థములను ప్రచండవాయువుచే నూపబడుచున్నదో, అట్టివాడు మరణింప నగును. చలించుచున్న అవయవ లతలతో గూడిన దేహారణ్యము ఆధివ్యాధులను దావాగ్నిచే యెవనికి దహింపబడుచున్నచో, వానికి మరణము మేలు. శుష్క-వృక్షకోటరమునుబోలు శరీరమధ్యమమున కామమను సర్పము బుసగొట్టుచున్నవానికి మరణము ఒప్పును.

యోఽయం దేహపరిత్యాగస్తల్లోకే మరణం స్మృతమ్
న సతా నాసతా తేన కారణం వేద్యవేదనమ్. 45

ఈ శరీరపరిత్యాగము లోకమున మరణమని వ్యవహరింపబడుచున్నది. ఈ మరణ మాత్మకుగాదు; ఆత్మనిష్క్రియము. శరీరమునకును గాదు; శరీరము అసత్తు. ఆత్మజ్ఞానము కలుగనంతవఱకు శరీరభ్రమ యుండును,



యస్య నోత్క్రామతి మతిః స్వాత్మతత్త్వావలోకనాత్
యథార్థదర్శినో జ్ఞస్య జీవితం తస్య శోభతే. 46

యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే
యః సమః సర్వభావేషు జీవితం తస్య రాజతే. 47

యోఽన్తః శీతలయా బుద్ధ్యా రాగద్వేషవిముక్తయా
సాక్షివత్పశ్యతీదం హి జీవితం తస్య రాజతే. 48

యేన సమ్యక్పరిజ్ఞాయ హేయోపాదేయముజ్ఝితా
చిత్తస్యాన్తేఽర్పితం చిత్తం జీవితం తస్య శోభతే. 49

అవస్తు సదృశే వస్తున్యసక్తం కలనామలే
యేన లీనం కృతం చేతో జీవితం తస్య శోభతే. 50

సత్యాం దృష్టిమవష్టభ్య లీలయేయం జగత్క్రియా
క్రియతేఽవాసనం యేన జీవితం తస్య రాజతే. 51

నాన్తస్తుష్యతి నోద్వేగమేతి యో విహరన్నపి
హేయోపాదేయ సంప్రాప్తౌ జీవితం తస్య శోభతే. 52

శుద్ధపక్షస్య శుద్ధస్య హంసౌఘః సరసో యథా
యస్మాద్గుణౌఘా నిర్యాతి జీవితం తస్య శోభతే. 53

యస్మిన్ శ్రుతిపథం ప్రాప్తే దృష్టే స్మృతిముపాగతే
ఆనన్దం యాన్తి భూతాని జీవితం తస్య శోభతే. 54

ఆత్మతత్త్వవిలోకనమునుండి విరమింపని బుద్ధిగల యథార్థదర్శియొక్క జీవితము శోభిల్లును. అహంభావరహితుడును, నిర్లిప్తుడును, సమదృష్టియును నగువాని జీవితము శోభిల్లును. శీతలమును, రాగద్వేషాది రహితమునునగు బుద్ధివలన జగత్తును సాక్షివలె దర్శించువాని జీవితమే శ్రేయము. జగత్తుయొక్క అసారతను సంపూర్ణముగ గ్రహించి, హేయోపాదేయములను త్యజించి, సాక్షిస్వరూపమున చిత్తము నర్పించినవాని జీవితము శోభిల్లును. తుచ్ఛమయ్యు వ్యవహారికరూపమున ప్రకాశించు బాహ్యవస్తువుల సక్తముగాని మనస్సును బ్రహ్మమున లీనమొనర్చినవాని జీవితము శోభిల్లును. సత్యదృష్టి నవలంబించి, లీలవలె లౌకికవ్యవహారముల నాచరించు వాసనాశూన్యుని జీవితము శ్లాఘనీయము. ఇష్టానిష్టములు ఘటిల్లునప్పుడు రాగద్వేషముల బొందనివాని జీవితము శోభిల్లును. శుద్ధమగు సరోవరమునుండి శుభ్రపక్షములగు హంసలు వెలువడునట్లు, ఎవ్వనినుండి శాంతిక్షమాది గుణములు వెలువడుచున్నవో, అట్టివాని జీవితము శోభిల్లును. ఎవ్వని నామశ్రవణమున, దర్శనమున, స్మరణమున, జీవులానందమును బొందుదురో, అట్టివాని జీవితమే శోభిల్లును.

యస్యోదయేషు హృదయేన జనామ్బుజాని
జీవాలిమన్తి సకలాని విలాసవన్తి

తస్యైవ భాతి పరిజీవితమక్షయేన్దో
రాపూర్ణతేవ దనుజేశ్వర నేతరస్య. 55

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే ప్రహ్లాదనిర్వాణే నారాయణవచనోపన్యాసో నామైకోన చత్వారింశః సర్గః ॥ 39 ॥

దనుజేశ్వరా! ఎవ్వని ఉదయమున జీవనభ్రమర విశిష్టములగు లోక - కుముదములు వికసించుచున్నవో, అట్టివాని జీవనమే క్షయరోగముక్తుడగు పూర్ణచంద్రుని పూర్ణతవలె ప్రకాశించును. ఇతరుల జీవితము కాదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున నారాయణవచనోపన్యాసమను ఏకోనచత్వారింశ సర్గము ॥ 39 ॥

---

## చత్వారింశః సర్గః.

---

శ్రీ భగవానువాచ:—

స్థైర్యం దేహస్య దృష్టస్య జీవితం ప్రోచ్యతే జనైః
దేహాన్తరార్థం దేహస్య సంత్యాగో మరణం స్మృతమ్. 1

భగవంతుడు:—జనులు, ఈ ప్రత్యక్ష దేహముయొక్క స్థిరత్వమును జీవనమనియు, దేహాంతర ప్రాప్తికొఱకు దీని విసర్జనమును మరణమనియు జెప్పుచున్నారు.

ద్వాభ్యాం చైవాసి పక్షాభ్యామాభ్యాం ముక్తో మహామతే
కింతే మరణ మస్తీహ కిం వా జీవితమస్తి తే. 2

మహామతీ! నీవీ రెండు అవస్థలనుండియు విడివడినావు; నీకీ దేహమున స్థిరబుద్ధి లేదు, నీప్రాణ మింకొక తావున కరుగదు. నీకు మరణము లేదు, జీవితమును లేదు.

నిదర్శనార్థమేతత్తు మయోక్తమరిమర్దన
న త్వం జీవసి సర్వజ్ఞ మ్రియసే న కదాచన. 3

అరిసూదనా! నీవు జీవింప దగుదువు, మరణము నీకు తగదు, అని నీకు నేను జెప్పినది కేవలము దృష్టాంతప్రదర్శనము కొఱకు. సర్వజ్ఞుడవగు నీకు జీవితమును లేదు, మరణమును లేదు.

దేహసంస్థోఽప్యదేహత్వాదదేహోఽసి విదేహదృక్
వ్యోమసంస్థోఽప్యసక్తత్వాదవ్యోమేవహి మారుతః. 4



వాయువాకాశమున స్థిరముగనుండినను ఆకాశమున సంలగ్నమవకుండుటవలన నయ్యది ఆకాశశూన్యమైనట్లు, దేహమునన్నను, నీకు దేహాసక్తి లేనందువలన, నీవు దేహశూన్యుడవేయై యున్నావు. నీ కిప్పుడు దేహబుద్ధి లేదు.

స్పర్శసంబోధకారిత్వాద్దేహ ఏవాస్తి సువ్రత
ఉత్సేధారోధకత్వేన ఖముత్సేధస్య కారణమ్. 5

సువ్రతా! దేహధర్మములగు శీతోష్ణాదిస్పర్శజ్ఞానములు నీకున్నవి గనుక, నీవు దేహమున నుంటివని చెప్పబడినది. వృక్షముయొక్క ఊర్ధ్వోన్నతకి ఆకాశము అవరోధకము కామిచే కారణమని చెప్పబడునట్లు, స్పర్శ జ్ఞానమున కవరోధకము కామిచే ఆత్మ కారణముగ గ్రహింపబడుచున్నది.

ప్రబుద్ధో జ్ఞాతవస్తుత్వాద్దేహః క్వ శమినామిహ
ఇదం త్వేకం పరిచ్ఛిన్నం రూపమజ్ఞేషు దుఃస్థితమ్. 6

నీవిప్పుడు తత్త్వజ్ఞానమునుబొంది ప్రబుద్ధుడవైతివి; ప్రబోధమునందిన, ద్వైత ముపశమించును. ఇట్టి స్థితియందు దేహబుద్ధి యెటనుండి వచ్చును? పరిచ్ఛిన్నమగు దేహబుద్ధి అజ్ఞులకేగాని విజ్ఞులకుగాదు.

సర్వదా సర్వమేవాసి చిత్ప్రకాశః పరైకధీః
కో దేహః కోఽప్యదేహస్తే యం గృహ్ణాసి జహాసి చ. 7

నీవు చిత్ప్రకాశుడవు. నీబుద్ధి పరబ్రహ్మవస్తువునందొక్కదానియందే పరినిష్ఠితమైయున్నది. నీవు సర్వదా సర్వస్వరూపుడవు. నీకు పరిగ్రహణీయముగాని లేక, త్యాజ్యముగాని అయిన దేహాదేహములు లేవు.

సముదేతు వసన్తో వా వాతు వా ప్రలయానిలః
భావాభావవిహీనస్య కిమభ్యాగతమాత్మనః. 8

వసంతకాలమే రానిమ్ము లేక ప్రళయానిలమే ప్రవహించుగాక; భావభావవిహీనమగు ఆత్మకు వచ్చిపోవున దేమియును లేదు.

ప్రలుఠత్స్వపి శైలేషు కల్పాగ్నిషు దహత్స్వపి
వహత్సూత్పాతవాతేషు స్వాత్మన్యేవ హి తిష్ఠతి. 9

కొండలు క్రుళ్లగిలుగాక, ప్రళయానలము జగత్తును భస్మమొనరించునుగాక, ఉత్పాతవాయువులు వీచునుగాక, నీకు వచ్చిన కీడేమియును లేదు. నీవు ఆత్మయందే వెలయుచున్నావు.

సర్వభూతాని తిష్ఠన్తు సర్వమేవ ప్రయాతు వా
నశ్యన్తు వాథ వర్ధన్తామాత్మన్యేవాభితిష్ఠతి. 10

పదార్థములన్నియు ఉండునుగాక ఊడునుగాక, లేక వినష్టములై పోవునుగాక, లేకవర్ధితములగుగాక! నీవు ఆత్మయందే వెలయుచున్నావు.

క్షీయతే న క్షయం ప్రాప్తే వర్ధమానే న వర్ధతే
న స్పన్దతే స్పన్దమానే దేహేఽస్మిన్పరమేశ్వరః. 11

ఈ శరీరము నశించిన ఆత్మ నశింపదు, వర్ధిల్లిన వర్ధిల్లదు. దీనిస్పందమున దానికి స్పందము లేదు.

దేహస్యాహమహం దేహీతి క్షీణే చిత్తవిభ్రమే
త్యజామి న త్యజామీతి కిం ముధా కలనోదితా. 12

నాకు దేహసంబంధమున్నది, నేను దేహిని, అను చిత్తవిభ్రమము నశించిన, యిక త్యజించుచున్నాను, త్యజించుటలేదు అను కల్పన వ్యర్థము.

ఇదం కృత్వా కరోమీదమిదం త్యక్త్వేదమిత్యలమ్
ఇతి తత్త్వవిదాం తాత సంకల్పాః సంక్షయం గతాః. 13

వత్సా! తత్త్వవిదులకు దీనినొనరించి దీనినొనర్తును, దీనిని త్యజించిన పిమ్మట నిద్దాని నొనర్తును అను సంకల్పములు క్షయమునందినవి.

ప్రబుద్ధాః సర్వకర్తారః కరిష్యన్తీహ కించన
న తస్యాకరణే నిత్యమకర్తృత్వపదం గతాః. 14

ముక్త పురుషులు సర్వకర్తలైనను, ఎద్దానిని ఒనర్పకున్నారు. వారి అకరణమే సిద్ధమగుటవలన, వారికి కర్తృత్వము లేదు.

అకర్తృత్వాదభోక్తృత్వమర్థాదేవ సమాగతమ్
సంగృహీతం కిలానుప్తం కేనేహ భువనత్రయే. 15

అకర్తృత్వమువలన వారికి అభోక్తృత్వముగూడ సిద్ధించినది. ఏలన, ముల్లోకముల గింజనువేయక ఏరు ధాన్యమును బొందగల్గిరి?

శాన్తే కర్తృత్వభోక్తృత్వే శాన్తిరేవేహ శిష్యతే
ప్రౌఢిమభ్యాగతా సైవ ముక్తిరిత్యుచ్యతే బుధైః. 16

కర్తృత్వభోక్తృత్వములు నశించిన, మిగులునది శాంతియే; ఇయ్యది స్థిరమైన, దానినే ముక్తియని బుధులనుచున్నారు.

ప్రబుద్ధాశ్చిన్మయాః శుద్ధాః సర్వమాక్రమ్య సంస్థితాః
కిం త్యక్తం పరిగృహ్ణన్తు కిం గృహీతం త్యజన్తు వా. 17

ప్రబుద్ధులును, చిన్మయులును, విశుద్ధులును నగువారు సమస్తము నతిక్రమించి వెలయుచున్నారు. వారు త్యజించిన దేమున్నది గ్రహించుటకు, గ్రహించిన దేమున్నది త్యజించుటకు?

గ్రాహ్యగ్రాహకసంబన్ధప్రమితావయవిభ్రమైః
హీనః ప్రమేయావయవైః కిం గృహ్ణాతు జహాతు కిమ్. 18

వారికి గ్రాహ్యము, గ్రహణకర్త, తత్సంబంధము ప్రమాణము, ప్రమేయము, అవయవము, అవయవి మున్నగు వికారము లెవ్వియును లేవు. వారెద్దానిని గ్రహింతురు? ఎద్దానిని త్యజింతురు?



గ్రాహ్యగ్రాహకసంబన్ధే క్షీణే శాన్తిరుదేత్యలమ్
స్థితిమభ్యాగతా శాన్తిర్మోక్షనామ్నాభిధీయతే. 19

గ్రాహ్యగ్రాహక సంబంధము నశించిన, ఉదయించు శాంతి స్థిరమైన మోక్షమని చెప్పఁబడుచున్నది.

తత్ర స్థితాః సదా శాన్తాస్త్వాదృశాః పురుషోత్తమాః
సుషుప్తావయవస్పన్దసాధర్మ్యేణ చరన్తి హి. 20

నిన్నుబోలు పురుషశ్రేష్ఠులు సర్వదా ఈ ముక్తియందు వెలయుచు శాంతులై యున్నారు వారు సుషుప్తిసమయమున కదలు అవయవములవలె చరించుచున్నారు.

పరావబోధవిశ్రాన్తవాసనో జగతి స్థితిమ్
అర్ధసుప్త ఇవేహేమాం త్వం పశ్యాత్మస్థయా ధియా. 21

పరబ్రహ్మబోధ అగుటవలన నీకు వాసనలు తొలగిపోయినవి. నీ వాత్మసంస్థమగు బుద్ధివలన, అర్ధనిద్రితవ్యక్తివలె, ఈ జగత్ - స్థితి నవలోకింపుము.

న రమన్తే హి రమ్యేషు స్వాత్మన్యేవ గతాశయాః
నోద్విజన్తేఽన్యదుఃఖేషు స్వాత్మన్యేకరసాయనాః. 22

పరబ్రహ్మలీనచిత్తులు, సుందరములని తలఁచి బాహ్యవిషయముల నాసక్తిగొనరు; దుఃఖముల నుద్విగ్నులవరు.

నిత్యప్రబుద్ధా గృహ్ణన్తి కార్యాణీమాన్యసఙ్గినః
ముకురా ఇవ బిమ్బాని యథాప్రాప్తాన్యవాంఛయా. 23

అద్దము పడినవానిని గ్రహించునట్లు, నిత్యముక్తులగువారు అనాసక్తులై, అనిచ్ఛాపూర్వకముగ యథాప్రాప్తకార్యముల నొనర్తురు.

జాగ్రతి స్వాత్మని స్వస్థాః సుప్తాః సంసారసంస్థితౌ
బాలవత్ప్రవివేష్టన్తే సుషుప్తసదృశాశయాః. 24

ఆత్మతత్త్వము స్ఫురించినవారు నిర్మలులై సంసారవిషయముల నిద్రితులైయుందురు. నిద్రితులనుబోలు ఆ పురుషులు బాలకులవలె కార్యముల నాచరింతురు.

త్వమజిత పదవీముపాగతోఽన్తః
కమలజవాసరమేకమేవ భుక్త్వా
గుణగణకలితామిహైవ లక్ష్మీం
వ్రజ పరమాస్పదమచ్యుతం మహాత్మన్. 25

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ప్రహ్లాదబోధనం నామ చత్వారింశః
సర్గః ॥ 40 ॥

మహాత్మా! నీవు అంతరమున బ్రహ్మపదమును బొందినాడవు. అందువలన నీవు ఒక కల్పము ఈ పాతాళమున వివిధగుణశాలియగు రాజ్యలక్ష్మిని భోగించి, అంతమున అచ్యుతమగు పరమపదమును బొందుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రహ్లాదబోధనమను చత్వారింశ
సర్గము ॥ 40 ॥

---

## ఏకచత్వారింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

జగద్రత్నసముద్గేన త్రైలోక్యాద్భుతదర్శినా
ఇత్యుక్తే పద్మనాభేన జ్యోత్స్నా శీతలయా గిరా. 1
ప్రహ్లాదనామా దేహోఽసౌ వికాశినయనామ్బుజః
ముదోవాచ వచో ధీరో గృహీతమననక్రమః. 2

వసిష్ఠుడు:— జగద్రత్నపేటకమును, జగదద్భుతవస్తుదర్శకుడునగు పద్మనాభుడు, వెన్నెలవలె చల్లనగు ఈ పల్కులఁబల్క, ధీరుడగు ప్రహ్లాదుడను దేహి నయనాంబుజముల వికసింపజేసి, మననవ్యాపారము నవలంబించి, హర్షముతో నిట్లు బల్కదొడగెను.

ప్రహ్లాద ఉవాచ:—

హితాహిత విచారేణ రాజకార్యశతేనచ
అత్యహం శ్రమితో దేవ క్షణం విశ్రామతాం గతః. 3

ప్రహ్లాదుడు:- దేవా! నేను హితాహితవిచారము వలనను, రాజకార్యశతము వలనను డస్సి, ఒక్క నిమిషము విశ్రాంతి నందితిని.

భగవంస్త్వత్ప్రసాదేన స్థితిః సమ్యగథాగతా
సమాధావసమాధౌ చ రూపేణాహం సమః సదా. 4

భగవంతుడా! మీ దయవలన నేను స్వరూపస్థితిని బొందితిని. ఇప్పుడు నేను సమాధి, అసమాధి స్థితుల సమబుద్ధిని బొందితిని.

చిరమన్తర్మహాదేవ దృష్టోఽస్యమలయా ధియా
పునర్బహిరయం దృష్ట్యా దిష్ట్యా దేవ ప్రదృశ్యసే. 5

దేవా! చాలకాలము నిర్మల బుద్ధితో మిమ్ము అంతరమున దర్శించితిని; నేడు మరల సౌభాగ్యవశమున బహిర్దృష్టికి గూడ గోచరమగుచున్నాడవు.



అహమాసమనన్తాయామస్యాం దృష్టౌ మహేశ్వర
సర్వసంకల్పముక్తాయాం వ్యోమ వ్యోమ్నీవ నిర్మలే. 6

మహేశ్వరా! ఆకాశము అనంత నిర్మలాకాశమున వెలయునట్లు, నేను స్వతస్సిద్ధమున సర్వవిధ సంకల్పములనుండి ముక్తమగు ఈ పరమార్థిక స్వరూపదృష్టియందు వెలయుచున్నాను.

నశోకేన నమోహేన నచవైరాగ్య చిన్తయా
నదేహత్యాగకార్యేణ నసంసారభయేన చ. 7

నేను శోకమోహముల వలనగాని, వైరాగ్యచింతవలనగాని, సంసారభయమునగాని, శరీరమును త్యజింపగోరి సమాధి నందలేదు.

ఏకస్మిన్విద్యమానేహి కుతః శోకః కుతః క్షతిః.
కుతో దేహః క్వ సంసారః క్వ స్థితిః క్వ భయాభయే. 8

కేవల మొకేవస్తువు వెలయుచున్నచోట శోకమెచ్చట, క్షతి యెచ్చట, దేహమెట, సంసారమేడ? స్థితిగాని భయాభయములు గాని ఎటనుండి వచ్చును?

యథేచ్ఛయైవామలయా కేవలం స్వయముత్థయా
ఏవమేవాహమవసం వితతే పావనే పదే. 9

నాకు దేహత్యాగేచ్ఛ లేదు. స్వతస్సిద్ధముగ జనించిన పవిత్రేచ్ఛతో, ప్రసిద్ధమగు ఈ పావనపదమున నవస్థితుడనైతిని.

హా విరక్తోస్మి సంసారం త్యజామీతీయమీశ్వర
అప్రబుద్ధదృశాం చిన్తా హర్షశోక వికారదా. 10

ఈశ్వరా! అహా, 'నేను సంసారమున విరక్తినందితిని, సంసారమును త్యజింతును,' అను హర్షశోకాకులమగు చింత అజ్ఞులకే కల్గును.

దేహాభావే న దుఃఖాని దేహే దుఃఖాని మే మతిః
ఇతి చిన్తావిషవ్యాలీ మూర్ఖమేవావలుమ్పతి. 11

'దేహబుద్ధిలేనిచో దుఃఖముండదు; శరీరముండిననే దుఃఖము, అని నాకు తోచుచున్నది.' అనునీ చింతా-కాలభుజంగము మూర్ఖులనే అహరహము కఱచుచున్నది.

ఇదం సుఖమిదం దుఃఖమిదం నాస్తీదమస్తి మే
ఇతి దోలాయితం చేతో మూఢమేవ న పణ్డితమ్. 12

'ఇది సుఖము, ఇది దుఃఖము, ఇది నాకులేదు, ఇది నాకున్నది.' ఇట్టిభావముతో నూగులాడు చిత్తమే మూర్ఖులను కలతపెట్టుచున్నది; పండితులను గాదు.

అహమన్యోఽన్య ఏవాయమిత్యజ్ఞానాం తు వాసనా
దూరోదస్తాత్మబుద్ధీనాం జయత్యసుమతామిహ. 13

'నే నొకడను, ఇతడు నాకంటె వేరు', అను వాసన ఆత్మబుద్ధిలేని మూర్ఖులనే జయించుచున్నది.

ఇదం త్యాజ్యమిదం గ్రాహ్యమితి మిథ్యా మనోభ్రమః
నోన్మత్తతాం నయత్యన్తర్మజ్ఞమివ దుర్ధియః. 14

'దీనిని త్యజింపవలెను, దీనిని గ్రహింపనగును' - ఇట్టి మిథ్యా - మనోభ్రాంతి దుర్బుద్ధులగు అజ్ఞుల నేతీరుగ ఉన్మత్తుల నొనర్చునో, ప్రాజ్ఞుల నట్లొనర్పజాలదు.

సర్వస్మిన్నాత్మని తతే త్వయి తామరసేక్షణ
హేయోపాదేయ పక్షస్థా ద్వితీయా కలనా కుతః. 15

కమలలోచనా! సర్వాత్మస్వరూపుడవగు నీవు వెలయుచుండ, హేయోపాదేయాత్మకమగు విషయకల్పన ఎటునుండి రాగలదు?

విజ్ఞానాభాసమఖిలం జగత్సదసదుత్థితమ్
కిం హేయం కిముపాదేయమిహ యత్త్యజ్యతే నవా. 16

సదసద్రూపమున ఉత్పన్నమైన ఈ జగత్తు ఆత్మచైతన్యముయొక్క అభాసమాత్రమే. ఇందు త్యాజ్యగ్రాహ్యములగు హేయోపాదేయము లేమున్నవి?

కేవలం స్వస్వభావేన ద్రష్టృదృశ్యే విచారయన్
క్షణం విశ్రాన్తవానన్తః పరమాత్మాత్మనాత్మని. 17

నేను కేవలము స్వభావమువలననే దృక్-దృశ్యములను విచారించి, పరమాత్మస్వరూపుడనై, క్షణకాల మాత్మయందు విశ్రమించితిని.

భావాభావవినిర్ముక్తో హేయోపాదేయవర్జితః
ఏవమాసమహం పూర్వమధునేత్థం వ్యవస్థితః. 18

నే నింతదనుక భావాభావవిముక్తుడనై హేయోపాదేయ బుద్ధిశూన్యుడనై వెలయుచుంటిని; ఇప్పుడు మీ ఆజ్ఞననుసరించి, ఈస్థితిని బొందితిని.

సమయాత్మ[illegible]మాపన్నం సర్వమాత్మాత్మతాం [illegible]తః
కరో[illegible]హం మహాదేవ తుభ్యం యత్ప్రతిరోచతే. 19

మహాదేవా! నే[illegible] స్వస్వ[illegible]ను బొందితిని. మీ రాజ్ఞాపించిన కార్యములన్నియు నాకు కర్తవ్య[illegible]. [illegible] ఇచ్ఛననుసరించియే యొనర్తును.

త్వమయం పుండరీకాక్ష పూజ్యస్త్రైజగత్త్రితయే
[illegible] ప్రకృతిప్రాప్తాం పూజామాదాతుమర్హసి. 20

పుండరీకాక్షా! నీవు త్రిలోకపూజ్యుడవు. ఇప్పుడు నా కడనుండి శాస్త్రోక్తోచితమగు పూజను [illegible].



ఇత్యుక్త్వా దానవాధీశః పురః క్షీరోదశాయినః
శైవేన్ద్రి ఇవ పూర్ణేన్దుమర్ఘ్యపాత్రముపాదదే. 21

దానవపతి ఇట్లు నుడివి, ఉదయాచలము పూర్ణచంద్రుని గొనివచ్చునట్లు, అర్ఘ్యపాత్రము క్షీరోదశాయియగు నారాయణుని కడకు గొనివచ్చెను.

సాయుధం సాప్సరోవృన్దం ససురం సఖగాధిపమ్
పూజయామాస గోవిన్దం సత్రైలోక్య మథాగ్రగమ్. 22

ఆయుధములతోడను, అప్సరసలతోడను, దేవతలతోడను, గరుడునితోడను, ఉదర త్రిలోకములతోడను గూడిన గోవిందుని ప్రహ్లాదుడు పూజించెను.

సబాహ్యాభ్యన్తరాభ్రాన్త భవనం భువనేశ్వరమ్
పూజయిత్వాథ తిష్ఠన్తమువాచ కమలాపతిః. 23

ఎవ్వని బాహ్యాభ్యంతరముల అసంఖ్యజగత్తులు పరివర్తితములగుచున్నవో, ఆ భువనేశ్వరుని బూజించి ప్రహ్లాదుడు కూర్చుండ, కమలాపతి ఇట్లు పల్కెను.

శ్రీభగవానువాచ.—

ఉత్తిష్ఠ దానవాధీశ సింహాసనముపాశ్రయ
యావదాశ్వభిషేకం తే స్వయమేవ దదామ్యహమ్. 24

"భగవంతుడు:— దానవాధీశ! లెమ్ము! సింహాసన మధిష్ఠింపుము. నేను స్వయముగ సత్వరము నీకభిషేక మొనర్తును.

పాంచజన్యరవం శ్రుత్వా య ఇమే సముపాగతాః
సిద్ధాః సాధ్యాః సురౌఘాస్తే కుర్వన్తు తవమఙ్గలమ్. 25

పాంచజన్య నినాదమును విని అరుదెంచిన ఈ సిద్ధసాధ్యసుర సమూహము నీకు మంగళ మొనర్తురు గాక!"

ఇత్యుక్త్వా పుండరీకాక్షో దానవం సింహవిష్టరే
యోజయామాస యోగ్యం తం మేరుశృఙ్గ ఇవాంబుదమ్. 26

పుండరీకాక్షుడీ పలుకుల బల్కి మేరుశృంగమున మేఘమువలె, దానవపతియగు ప్రహ్లాదుని సింహాసనమున గూర్చుండ జేసెను.

అథైనం హరిరాహూతైః క్షీరోదాద్యైర్మహాబ్ధిభిః
గఙ్గాదిభిః సరిత్పూరైః సర్వతీర్థజలైస్తథా. 27
సర్వవిప్రర్షిసంఘైశ్చ సర్వసిద్ధగణైః సహ
పునర్విద్యాధరయుతో లోకపాలసమన్వితః. 28
అభ్యషిఞ్చదమేయాత్మా దైత్యరాజ్యే మహాసురమ్
మరుద్గణైః స్తూయమానం పూర్వం స్వర్గే హరిం యథా. 29

సురాసురైః స్తూయమానం స్తూయమానః సురాసురైః
అభిషిక్తమువాచేదం ప్రహ్లాదం మధుసూదనః. 30

అనంతరము, క్షీరసముద్రము మున్నగాగల మహాసముద్రములను, గంగాది నదీసమూహములను, తదితర తీర్థములను ఆహ్వానింప, అవి అరుదెంచి ప్రహ్లాదుని పవిత్రసలిలముల నభిషేకించెను. అమేయుడగు హరి మరల లోకపాలురతోడను, విద్యాధరులతోడను, సిద్ధులతోడను, విప్రబుధుల తోడను గూడి ప్రహ్లాదుని మరల నభిషేకించెను. దేవతలు పూర్వ మింద్రుని స్తుతించినట్లు ప్రహ్లాదుని గూడ నుతింపసాగిరి. పిదప, సురాసురగణము ప్రహ్లాదుని, హరిని స్తుతింపదొడగెను. అప్పుడు, మధుసూదనుడు రాజ్యాభిషిక్తుడగు ప్రహ్లాదునితో నిట్లు పల్కసాగెను.

శ్రీ భగవానువాచ :—

యావన్మేరుధరా యావద్యావచ్చన్ద్రార్క మండలే
అఖండిత గుణశ్లాఘీ తావద్రాజా భవానఘ. 31

భగవంతుడు ! అనఘా! మేరుపర్వతముండువంతవఱకు, భూమి, చంద్రసూర్యులుండునంతవఱకు, జనులచే పొగడదగిన గుణములతో నొప్పారుచు రాజ్యమును బాలింపుము.

ఇష్టానిష్ట ఫలం త్యక్త్వా సమదర్శనయా ధియా
వీతరాగభయక్రోధో రాజ్యం సమనుపాలయ. 32

సమదర్శియగు బుద్ధితో ఇష్టానిష్టఫలముల బరిత్యజించి, విషయానురాగమును, భయక్రోధము లను బరిత్యజించి రాజ్యమును బాలింపుము.

రాజ్యేఽస్మిన్భోగసంపూర్ణే దృష్టానుత్తమభూమినా
నగన్తవ్యస్త్వయోద్వేగః స్వర్గే మానవకేఽథవా. 33

నీవు సర్వోత్తమమును, ఆనందమయమును అగుపదమును గాంచినాడవు; భోగపూర్ణమగు ఈ రాజ్యమున నిర్లక్ష్యమును వహింపకుము. కాని నీతంద్రులవలె భూలోకస్వర్గలోకముల నుద్వేగ మును గల్పింపకుము.

దేశకాలక్రియాకారైర్యథాప్రాప్తాసు దృష్టిషు
ప్రకృతం కార్యమాతిష్ఠ త్యక్త్వా మానసమాస్పదమ్. 34

శత్రునిగ్రహము, ప్రజానుగ్రహము మున్నగు ఆవశ్యకర్తవ్య కర్మలు అరుదెంచినప్పుడు దేశకాలక్రియోచితముగ వ్యవహరింపుము. రాగాదులతో గూడిన విషమబుద్ధి దొరలకుండునట్లు చూడుము. సర్వత్ర సమబుద్ధివై మెసలుము.

అతిదేహతయేదన్తా మమతాపరివర్జితమ్
భావాభావే సమం కార్యం కుర్వన్నిహ న బాధ్యసే. 35

నీవిప్పుడు 'అతిదేహుడవు' అయితివి; మమత్వమును బరిత్యజించి సమభావమున కార్య మొనర్చిన [illegible] బంధింపబడవు.



దృష్టసంసారపర్యాయ స్తులితాతులతత్పదః
సర్వం సర్వత్ర జానాసి కిమన్యదుపదిశ్యతే. 36

నీకు సంసారగతి అంతయు తెలిసినది; అతులమగు ఆ బ్రహ్మపదమును బొందితివి; అంతయును గ్రహించితివి. నీకింక ఉపదేశింపతగినదేమున్నది?

వీతరాగభయక్రోధే త్వయిరాజని రాజతి
నేదానీం దుఃఖదుర్గ్రన్థిర్నాసురాన్దలయిష్యతి. 37

[illegible] విషయాసక్తిగాని, భయక్రోధములుగాని లేవు, నీవు రాజువైనచో అసురలనింక [illegible]గ్రంథి వేధింపదు.

బాష్పశ్రీర్నాసురీకర్ణమంజరీః ప్లావయిష్యతి
వనరాజిమివోన్మత్తా సరిత్తారతరఙ్గిణీ. 38

వర్షోన్మత్తమును, వర్ధితజలమును, ఉత్తాలతరంగమునునగు నది తీరవృక్షములను ముంచునట్లు, భాష్పవారి అసురస్త్రీల కర్ణమంజరులను ముంప జాలదు.

అద్యప్రభృత్యసంప్రాప్త దానవామరసంగరమ్
నిర్మన్దరామ్భోనిధివజ్జగత్స్వస్థమివ స్థితమ్. 39

నేటినుండి, దేవదానవ యుద్ధ మాగిపోవుట వలన, జగత్తు నిర్మందరమగు సముద్రమువలె విలయగలదు.

దేవాసుర కుటుంబిన్యో భర్తృష్వన్తః పురేషు చ
స్వేష్వేవ యాన్తు విశ్వాసమపరస్పరమాహృతాః. 40

దేవదానవ రమణీగణము ఇప్పుడు కారాగృహముక్తమై తమతమ అంతఃపురముల భర్తలతో గూడి ఆనందముతో కాలమును గడుపుదుగాక!

భవ బహులనిశానితాన్తనిద్రా
తిమిరమపాస్య సదోదితాశయశ్రీః
దనుసుత వనితావిలాసరమ్యాం
చిర మజితాముపభుఙ్క్ష్వ రాజ్యలక్ష్మీమ్. 41

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ప్రహ్లాదాభిషేకో నామైకచత్వారింశః
సర్గః ॥ 41 ॥

దనుసుతా! నీవిప్పుడు కృష్ణపక్షరజనీ తిమిరమువలె గాఢమగు అజ్ఞానాంధకారమును నాశనమొనర్చి సర్వదా స్వప్రకాశమగు బ్రహ్మాత్మభావమున వెలుగొందుము. శత్రువులకును, కామాదులకును లొంగక అసురకామినీ విలాసములతో గూడిన రాజ్యలక్ష్మిని, శాంత్యాది గుణ విలాసములతో గూడిన స్వారాజ్యలక్ష్మిని అనుభవింపుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రహ్లాదాభిషేకమను ఏకచత్వారింశ
సర్గము ॥ 41 ॥

---

## ద్విచత్వారింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా పుండరీకాక్షః సనరామరకిన్నరః
ద్వితీయ ఇవ సంసారశ్చచాలాసుర మన్దిరాత్. 1

వసిష్ఠుడు:— పుండరీకాక్షు డిట్లుపలికి సుర నర కిన్నరులతో గూడి, ద్వితీయ సంసారమువలె ఆ అసుర మందిరమునుండి వెలువడెను.

ప్రహ్లాదాది వినిర్ముక్తైః పశ్చాత్పుష్పాంజలివ్రజైః
పూర్యమాణో విహంగేశ పాశ్చాత్యాబ్జరుహోత్కరైః. 2
క్రమాత్క్షీరోదమాసాద్య విసృజ్య సురవాహినీమ్
భోగిభోగాసనే తస్థౌ శ్వేతాబ్జ ఇవ షట్పదః. 3

ప్రహ్లాదాది దైత్యవర్గమువలన జల్లబడిన పుష్పములతోడను, విహగపతియగు గరుడుని రెక్కలతోడను గప్పబడిన శరీరముగలవాడై హరి క్రమముగ క్షీరసాగరమును సమీపించెను. అటకరిగి, సురసమూహమును వీడ్కొల్పి, తెలిదామర పూవునందు తుమ్మెదవలె, భోగిభోగాసనమున సమాసీనుడయ్యెను.

భోగిభోగాసనే విష్ణుః శక్రః స్వర్గే సహామరైః
పాతాలే దానవాధీశ ఇతి తస్థుర్గతజ్వరాః. 4

శేషాసనమున విష్ణువు, స్వర్గమున అమరసమూహముతో నింద్రుడును, పాతాళమున దానవపతియగు ప్రహ్లాదుడును సుఖముగ నుండిరి.

ఏషా తే కథితా రామ నిఃశేషమలనాశినీ
ప్రాహ్లాదీ బోధసంప్రాప్తిరైన్దవద్రవశీతలా. 5

రామా! నీకు నిఖిలకల్మషహరమును, అమృతశీతలమునునగు ఈ ప్రహ్లాద బోధప్రాప్తిని జెప్పితిని.

తాంతు యే మానవా లోకే బహుదుష్కృతినోఽపి హి
ధియా విచారయిష్యన్తి తే ప్రాప్స్యన్త్యచిరాత్పదమ్. 6

జగత్తున ప్రహ్లాదుని తత్వజ్ఞానలాభవృత్తాంతమును సద్బుద్ధితో విచారించువారందఱును, అత్యంత పాపులైనను, అచిరము ముక్తి నందుదురు.



సామాన్యేన విచారేణ క్షయమాయాతి దుష్కృతమ్
యోగవాక్యవిచారేణ కో న యాతి పరంపదమ్. 7

సామాన్యవిచారమువలననే పాపమును దాని మూలమగు అజ్ఞానమును నశించుచున్నవి. అగుచో ఈ యోగవాక్యవిచారణ వలన పరమపదము నెవ్వరు బడయకుందురు ?

అజ్ఞానముచ్యతే పాపం తద్విచారేణ నశ్యతి
పాపమూలచ్ఛిదం తస్మాద్విచారం న పరిత్యజేత్. 8

అజ్ఞానమే పాపమని చెప్పబడుచున్నది ; ఈ పాపము విచారబలమున దూరమగుచున్నది. ఆ [illegible]న పాపమూలమును ఛేదించు విచారమును త్యజింపకూడదు.

ఇమాం ప్రహ్లాదసంసిద్ధిం ప్రవిచారయతాం నృణామ్
సప్తజన్మకృతం పాపం క్షయమాయాత్యసంశయమ్. 9

ప్రహ్లాదుని ఈ తత్వజ్ఞానసిద్ధిని విచారించువారి పాపములు, ఏడుజన్మలవి, నిక్కముగ తొలగిపోవును. (జ్ఞానఫలపర్యంతము విచారించిన, సర్వపాపములు నశించును).

శ్రీరామ ఉవాచ:—

పరే పదే పరిణతం పాంచజన్యస్వనైర్మనః
కథం ప్రబుద్ధం భగవన్ప్రహ్లాదస్య మహాత్మనః. 10

శ్రీరాముడు:—పరబ్రహ్మాకారము నందిన ప్రహ్లాదుని మనస్సు పాంచజన్యనాదమున నెట్లు ప్రబుద్ధమైనదో నాకు వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ద్వివిధా ముక్తతా లోకే సంభవత్యనఘాకృతే
సదేహైకా విదేహాన్యా విభాగోఽయం తయోః శృణు. 11

వసిష్ఠుడు:—అనఘాకృతా! ఈ లోకమున ముక్తి సదేహమనియు, విదేహమనియు రెండు తెఱగులు. వీటి వివరమును జెప్పుచున్నాను, వినుము.

అసంసక్తమతేర్యస్య త్యాగాదానేషు కర్మణామ్
నైషణా తత్స్థితిం విద్ధి త్వం జీవన్ముక్తతామిహ. 12

విషయబుద్ధి లేకుండుట, ఇష్టానిష్టముల గ్రహణత్యాగశూన్యత - ఇట్టి స్థితినే జీవన్ముక్తియని గ్రహింపుము.

సైవ దేహక్షయే రామ పునర్జననవర్జితా
విదేహముక్తతా ప్రోక్తా తత్స్థా నాయాన్తి దృశ్యతామ్. 13

రామా! ఆ వ్యక్తియే ప్రారబ్ధభోగానంతరము శరీరమును ద్యజించిన, విదేహముక్తి అనబడుచున్నది. ఇట్టి వారెవరికిని గనబడరు.

భ్రష్టబీజోపమా భూయో జన్మాఙ్కురవివర్జితాః
హృది జీవద్విముక్తానాం శుద్ధా భవతి వాసనా. 14

జీవన్ముక్తుల హృదయమున, దంచబడిన గింజను బోలినదియును, పునర్జన్మాంకురరహితము నగు విశుద్ధవాసన వెలయుచుండును.

పావనీ పరమోదారా శుద్ధసత్త్వానుపాతినీ
ఆత్మధ్యానమయీ నిత్యం సుషుప్తస్యేవ తిష్ఠతి. 15

పవిత్రమును, తృష్ణాకార్పణ్య రహితమును, విశుద్ధ బ్రహ్మధ్యానస్వరూపమును అగు ఆసన సుషుప్తియందలి వాసనలవలె వెలయుచుండును.

అపి వర్షసహస్రాన్తే తయైవాన్తరవస్థయా
సతి దేహే ప్రబుధ్యన్తే జీవన్ముక్తా రఘూద్వహ. 16

రఘూత్తమా! వెయ్యేండ్లవఱకు శరీరమున్నను వారిచిత్తవృత్తివలననే ప్రబుద్ధులగుదురు.

ప్రహ్లాదోఽన్తస్థయా శుద్ధనిత్యవాసనయా స్వయా
బోధమాప మహాబాహో శంఖశబ్దావబుద్ధయా. 17

మహాబాహూ! ప్రహ్లాదుడుగూడ శంఖనినాదమున అవబోధితుడై అంతరమున వెలయుచున్న ఈ విశుద్ధచిత్తవృత్తివలన ప్రబోధమునందెను.

హరిరాత్మాహి భూతానాం తస్య యత్ప్రతిభాసతే
తత్తథైవ భవత్యాశు సర్వమాత్మైవ కారణమ్. 18

మఱియు హరి నిఖిలాంతరాత్మ, నిఖిలకారణుడును, సత్యసంకల్పుడును నగును అతని యందుదయించినది, అశ్లేయగును.

ప్రబోధమేతు ప్రహ్లాదో యదైవేతి విచిన్తితమ్
నిమేషాద్వాసుదేవేన తద్దైవైతదుపస్థితమ్. 19

వాసుదేవుడు 'ప్రహ్లాదుడు బోధనందుగాక' అని చింతించిన వెంటనే అట్లు జరిగెను.

ఆత్మన్యకారణేనైవ భూతానాం కారణేన చ
సృష్ట్యర్థం వపురాత్తం హి వాసుదేవమయాత్మనా. 20

కారణవిహీనుడగు వాసుదేవుడు తనయందు జగత్తుల సృష్టింప శరీరమును గ్రహించెను.

ఆత్మావలోకనేనాశు మాధవః పరిదృశ్యతే
మాధవారాధనేనాశు స్వయమాత్మావలోక్యతే. 21

ఆత్మ - సాక్షాత్కారమైన వెంటనే మాధవుడగుపడును; మాధవ - ఆరాధనమున ఆత్మ గూడ అవలోకింపబడుచున్నది.

ఏతాం దృష్టిమవష్టభ్య రాఘవాత్మావలోకనే
విహరాశు విచారాత్మా పదం ప్రాప్స్యసి శాశ్వతమ్. 22

రాఘవా! నీవీతత్త్వము నవలంబించి ఆత్మదర్శనమునకై యత్నింపుము. విచారబలమున నీ వాత్మపదమున బొందగలవు.



దుఃఖాసారవతీ రామ సంసారప్రావృడాతతా
జాడ్యం దదాతి పరమం విచారార్కమపశ్యతామ్. 23

రామా! ఈ విచారసూర్యుని గాంచకున్న, దుఃఖధారలను వర్షించు సంసార-వర్షాకాలము జనులకు మిక్కుటమగు జడత్వము నొసగును.

ప్రసాదాదాత్మనో విష్ణోర్మాయేయమతిభాసురా
ప్రబాధతే నధీరాంస్తు యక్షో మన్త్రవతో యథా. 24

మంత్రసిద్ధులకు పిశాచబాధయుండనట్లు, విష్ణురూపియగు ఆత్మయొక్క అనుగ్రహమున, విచారపరాయణులగు ధీరులు సంసారమను మహామాయవలన బాధింపబడరు.

ఆత్మేచ్ఛయైవ ఘనతాం సముపాగతాన్త
రాత్మేచ్ఛయైవ తనుతాముపయాతి కాలే
సంసారజాలరచనేయ మనన్తమాయా
జ్వాలేహ వాతవలయాదివ పావకస్య. 25

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ప్రహ్లాదవ్యవస్థానామ ద్విచత్వారింశః
సర్గః ॥ 42 ॥

గాలికి నిప్పుజ్వాల పైకెగయునట్లును, ఆరునట్లును, అనంతమాయామయమగు ఈ సంసారజాలము ఆత్మయొక్క ఇచ్ఛవలనే ఘనీభూతమగుచున్నది, మరొకప్పుడు క్షీణించుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రహ్లాదవ్యవస్థయను ద్విచత్వారింశ
సర్గము ॥ 42 ॥

---

## త్రిచత్వారింశః సర్గః

---

శ్రీరామఉవాచ:—

భగవన్సర్వధర్మజ్ఞ శుద్ధైస్త్వద్వచనాంశుభిః
నిర్వృతాః స్మ శశాఙ్కస్య కరైరోషధయో యథా. 1

శ్రీరాముడు:— భగవానుడా! సర్వధర్మజ్ఞా! చంద్రకిరణముల ఓషధులు తృప్తినందునట్లు, శుద్ధములగు మీ వచనములవలన నేనాహ్లాదితుడనైతిని.

కర్ణాభివాంఛ్యమానాని పవిత్రాణి మృదూనిచ
సుఖయన్తి గృహీతాని పుష్పాణీవ వచాంసి తే. 2

కర్ణాభివాంఛితములును, మృదులములును పవిత్రములును నగు మీ వాక్యముల నలంకారములవలె గ్రహించి, పరమసుఖము నందితిని.

పౌరుషేణ ప్రయత్నేన సర్వమాసాద్యతే యది
ప్రహ్లాదస్తత్కథం బుద్ధో న మాధవవరం వినా. 3

పురుషప్రయత్నమువలననే సర్వము సంపన్నమగునని వెనుక మీరు నుడివియుంటిరి. అగుచో, ప్రహ్లాదుడు విష్ణుని సహాయ్యము లేకుండగనే ప్రబోధము నందలేదేమి?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యద్యద్రాఘవ సంప్రాప్తం ప్రహ్లాదేన మహాత్మనా
తత్తదాసాదితం తేన పౌరుషాదేవ నాన్యతః. 4

వసిష్ఠుడు రాఘవా! మహాత్ముడగు ప్రహ్లాదుడు పొందినదంతయు స్వీయపౌరుషబలము వలననే. వేరొక ఉపాయమువలనగాదు.

ఆత్మా నారాయణశ్చైవ న భిన్నస్తిలతైలవత్
తథైవ శౌక్ల్యపటవత్కుసుమామోదవత్తథా. 5

ఆత్మయును, నారాయణుడును తిలతైలములవలెను, పట శుక్లములవలెను, కుసుమ సౌరభములవలెను అభిన్నులు.

యోహి విష్ణుః సఏవాత్మా యోఽహ్యాత్మాసౌ జనార్దనః
విష్ణ్వాత్మశబ్దౌ పర్యాయౌ యథా విటపి పాదపౌ. 6

విష్ణువే ఆత్మ; ఆత్మయే జనార్దనుడు; విటపి పాదపములవలె ఈరెండును పర్యాయ శబ్దములు.

ప్రహ్లాదనామా ప్రథమమాత్మైవ స్వయమాత్మనా
స్వయైవ పరయా శక్త్యా విష్ణుభక్తౌ నియోజితః. 7

ఈ ఆత్మయే తన పరమశక్తి వలన ప్రహ్లాదుడను ఆత్మను విష్ణుభక్తు నొనరించెను.

ప్రహ్లాదో హ్యాత్మనైవేనం వరమర్జితవాన్స్వయమ్
స్వయం విచారగం కృత్వా స్వయం విదితవాన్మనః. 8

ప్రహ్లాదుడు డాత్మవలననే ప్రబోధ - వరమును బొందెను; అతడే స్వయముగ విచారపరాయణుడై జ్ఞానమును బొందెను.

కదాచిదాత్మనైవాత్మా స్వయం శక్త్యా ప్రబుధ్యతే
కదాచిద్విష్ణుదేహేన భక్తిలభ్యేన బోధ్యతే. 9

ఒకొక్కప్పుడు ఆత్మ తనశక్తివలననే ప్రబుద్ధమగును; మరొకొక్కప్పుడు భక్తిలభ్యుడగు విష్ణునివలన ప్రబోధము నందును.

చిరమారాధితోఽప్యేష పరమప్రీతిమానపి
నావిచారవతో జ్ఞానం దాతుం శక్నోతి మాధవః. 10



ఈ మాధవుడు చిరకాల మారాధితుడైనను, పరమసంతుష్టస్వభావుడైనను, విచారరహితునకు జ్ఞాన మొసగ జాలడు.

ముఖ్యః పురుషయత్నోత్థో విచారః స్వాత్మదర్శనే
గౌణో వరాదికో హేతుర్ముఖ్యహేతుపరో భవ. 11

పురుషప్రయత్నము వలన గల్గు ఆత్మవిచారమే తత్సాక్షాత్కారమునకు ముఖ్యోపాయము. వరప్రదానాదులు గౌణోపాయములు, అందువలన నీవు ముఖ్యోపాయము నవలంబింపుము.

పూర్వమేవ బలాత్తస్మాదాక్రమ్యేన్ద్రియపంచకమ్
అభ్యసన్సర్వయత్నేన చిత్తం కురు విచారవత్. 12

మొట్టమొదట నీవు బలవంతముగ పంచేంద్రియములను వశ మొనర్చుకొని, అభ్యసించుచు, మనస్సును విచారపర మొనర్పుము.

యద్యదాసాద్యతే కించిత్కేన చిత్క్వచిదేవ హి
స్వశక్తిసంప్రవృత్త్యా తల్లభ్యతే నాన్యతః క్వచిత్ 13

జనులు ఎచ్చట దేనిని బొందుచున్నారో, అది వారి శక్తిబలముననే; పురుషప్రయత్నము గాక వేరొక ఉపాయము లేదు.

పౌరుషం యత్నమాశ్రిత్య ప్రోల్లంఘ్యేన్ద్రియ పర్వతమ్
సంసారజలధిం తీర్త్వా పారం గచ్ఛ పరం పదమ్. 14

నీవు పురుషప్రయత్నము నవలంబించి, ఇంద్రియ-పర్వతమును లంఘించి, సంసార-సముద్రమును దాటి, దానికావలనున్న పరమపదమును బొందుము.

వినా పురుషయత్నేన దృశ్యతే చేజ్జనార్దనః
మృగపక్షిగణం కస్మాత్తదాసౌ నోద్ధరత్యజః. 15

పురుషప్రయత్నము లేకుండగనే జనార్దనుడగుపడుచో, పశుపక్ష్యాదులకు గూడ ఆత్మదర్శనము లభించెడిది.

గురుశ్చేదుద్ధరత్యజ్ఞ మాత్మీయాత్పౌరుషాదృతే
ఉష్ట్రం దాన్తం బలీవర్దం తత్కస్మాన్నోద్ధరత్యసౌ. 16

గురువు పౌరుషవిహీనుడగు అజ్ఞునిగూడ ఉద్ధరించుచో, లొట్టెను ఎద్దునుగూడ ఉద్ధారమొనర్పగల్గియుండెడివాడు.

నహరేర్న గురోర్నార్థాత్కించిదాసాద్యతే మహత్
ఆక్రాన్తమనసః స్వస్మాద్యదాసాదిత మాత్మనః. 17

హరివలనగాని, గురువువలనగాని, ధనమువలనగాని మహత్పదము లభింపదు. స్వీయపురుషయత్నమువలన మనస్సును వశమొనర్చుకొనిన, తనయంతట తానే ఆ మహత్పదమును బొందవచ్చును.

అభ్యాసవైరాగ్యయుతాదాక్రాన్తేన్ద్రియ పన్నగాత్
నాత్మనః ప్రాప్యతే యత్తత్ప్రాప్యతే న జగత్త్రియాత్. 18

వైరాగ్యము నవలంబించి, అభ్యాసమువలన నింద్రియభుజంగములను వశమొనర్చుకొనిన, ముల్లోకముల బొందరానిదెద్దియును లేదు.

ఆరాధయాత్మనాత్మాన మాత్మనాత్మానమర్చయ
ఆత్మనాత్మానమాలోక్య సంతిష్ఠ స్వాత్మనాత్మని. 19

నీవు ఆత్మవలన ఆత్మ నారాధింపుము, అర్చింపుము, దర్శింపుము; పిదప నందే వెలయుము.

శాస్త్రప్రయత్నవిచారేభ్యో మూర్ఖాణాం ప్రపలాయినామ్
కల్పితా వైష్ణవీ భక్తిః ప్రవృత్త్యర్థం శుభస్థితౌ. 20

చక్కగ శాస్త్రముల నాలోచించి తగిన యత్నమును, విచారమును నొనర్పజాలని మూర్ఖులను సత్పథమున ప్రవేశపెట్ట విష్ణుభక్తి గల్పింపబడినది.

అభ్యాసయత్నౌ ప్రథమం ముఖ్యో విధిరుదాహృతః
తదభావేతు గౌణః, స్యాత్పూజ్యపూజామయక్రమః. 21

అభ్యాసము, ప్రయత్నములనునవి రెండును ముఖ్యవిధియని చెప్పబడుచున్నవి. వీటి నాశ్రయించు శక్తి లేకున్న పూజ్యపూజక భావము గౌణముగ అంగీకరింపబడినది.

అస్తి చేదిన్ద్రియాక్రాన్తిః కింప్రాప్యం పూజనైః ఫలమ్
నాస్తి చేదిన్ద్రియాక్రాన్తిః కిం ప్రాప్యం పూజనైః ఫలమ్. 22

ఇంద్రియములు వశమునను్న పూజవలన లాభమేమి ? ఇంద్రియములు వశమున లేకున్న పూజవలన కలుగు ఫలమేమి ?

విచారోపశమాభ్యాం హి న వినాసాద్యతే హరిః
విచారోపశమాభ్యాం చ ముక్తస్యాబ్జకరేణ కిమ్. 23

విచారోపశమములు లేకున్న హరిలభింపడు; విచారోపశమరహితుని హరికూడ ఏమియు నొనర్పజాలడు.

విచారోపశమోపేతం చిత్తమారాధయాత్మనః
తస్మిన్సిద్ధే భవాన్సిద్ధో నోచేత్త్వం వనగర్దభః. 24

నీవు చిత్తమును విచారోపశమములతో గలిపి, ఆత్మ నారాధింపుము; నీవు సిద్ధుడవగుదువు. కాకున్న నీవు వన్యగర్దభమవు.

క్రియాతే మాధవాదీనాం ప్రణయప్రార్థనా స్వయమ్
తథైవ క్రియతే కస్మాన్న స్వకస్యైవ చేతసః. 25

మాధవాదులకడ దయను ప్రార్థింపవలసియున్నచో, నీ చిత్తముకడనే ప్రార్థింపరాదా ?

సర్వస్యైవ జనస్యాస్య విష్ణురభ్యన్తరే స్థితః
తం పరిత్యజ్య యే యాన్తి బహిర్విష్ణుం నరాధమాః. 26



విష్ణుడు సర్వజనుల అభ్యంతరమున వెలయుచున్నాడు; ఇతనిని విడచి బహిర్విష్ణుని సేవించువారు నరాధములు.

హృద్గుహావాసి చిత్తత్త్వం ముఖ్యం సానాతనం వపుః
శంఖచక్రగదా హస్తో గౌణ ఆకార ఆత్మనః. 27

హృదయ - గుహయందు వెలయుచున్న సనాతన చైతన్యతత్త్వమే ఆత్మయొక్క ముఖ్య శరీరము శంఖచక్ర గదాధరరూపము మాయాకల్పితము.

యో హి ముఖ్యం పరిత్యజ్య గౌణం సమనుధావతి
త్యక్త్వా రసాయనం సిద్ధం సాధ్యం సంసాధయత్యసౌ. 28

ముఖ్యవిషయమును విడచి గౌణము నాశ్రయించువాడు, అమృతమును విడచి కృష్యాదికముసలన పంట పండింపగోరుచున్నాడు.

యస్తుభోః స్థితిమేవాస్యా మాత్మజ్ఞానచమత్కృతౌ
నాసాదయతి సంమత్తమనాః స రఘునన్దన. 29

అప్రాప్తాత్మ వివేకోఽన్త రజ్ఞచిత్త వశీకృతః
శంఖచక్ర గదాపాణి మర్చయేత్పరమేశ్వరమ్. 30

రఘునందనా ! ఆత్మవివేకమును బొందక, మోహమగ్నమగు చిత్తమునకు వశుండై, సుందరమగు ఈ ఆత్మతత్వమును మనస్సున బాదుకొల్పజాలని చంచలచిత్తుడు శంఖచక్రగదాధారియగు పరమేశ్వరు నర్చించుగాక !

తత్పూజనేన కష్టేన తపసా తస్య రాఘవ
కాలే నిర్మలతామేతి చిత్తం వైరాగ్యకారిణా. 31

రాఘవా ! విష్ణుని బాహ్యమూర్తిపూజయను కష్టకరమగు తపస్సునొనర్చి, వైరాగ్యము నార్జింప, క్రమముగ చిత్తము నిర్మలమగును.

నిత్యాభ్యాస వివేకాభ్యాం చిత్తమాశు ప్రసీదతి
ఆమ్ర ఏవ దశామేతి సాహకారీం శనైః శనైః. 32

నిత్య మీపూజ నొనర్చుచుండ, వివేకముదయించి, చిత్తము తప్పక నిర్మలమగును. ఆమ్ర (బీజ) మే పుష్పఫలాదులతోగూడి సౌరభమును వెదజల్లును కదా!

ఏతదప్యాత్మనైవాత్మా ఫలమాప్నోతి భాషితమ్
హరి పూజాక్రమాఖ్యేన నిమత్తేనారిసూదన. 33

అరిసూదనా! శాస్త్రముల జెప్పబడిన హరిపూజాఫలము ఆత్మ తనయంతటతానే పొందుచున్నది.

వర మాప్నోతి యో వాపి విష్ణోరమితతేజసః
తేన స్వస్యైవ తత్ప్రాప్తం ఫలమభ్యాసశాఖినః. 34

ప్రతిభావంతుడు విష్ణునికడనుండి పొందు వరముకూడ, అతని అభ్యాసవృక్షము యొక్క ఫలమే; ఆకస్మికము కాదు.

సర్వేషాముత్తమస్థానాం సర్వాసాం చిరసంపదామ్
స్వమనోనిగ్రహో భూమిర్భూమిః సస్యశ్రియామివ. 35

భూమి సస్యసంపద కాకరమైనట్లు, మనోనిగ్రహమే సర్వసంపదలకును సర్వస్థానములకును ఆధారము.

అప్యుర్వీఖననోత్కస్య కర్షతోఽపి శిలోచ్చయమ్
స్వమనోనిగ్రహాదన్యో నోపాయోఽస్తీహ కశ్చన. 36

భూమిని ద్రవ్వువారికిని, కొండను గొట్టువారికిని గూడ మనోనిగ్రహమే కార్యసిద్ధి కుపాయమగుచున్నది; వేరొండు ఉపాయము లేదు.

తావజ్జన్మసహస్రాణి భ్రమన్తి భువి మానవాః
యావన్నోపశమం యాతి మనోమత్తమహార్ణవః. 37

మనస్సను మహాసముద్రము ఉపశమింపనంతవఱకు మనుష్యులు వేలకొలది జన్మలనెత్తి ఈ భూమండలమును పరిభ్రమించుచున్నారు.

బ్రహ్మవిష్ణ్విన్ద్రరుద్రాద్యాశ్చిరసంపూజితా అపి
ఉపప్లవాన్మనోవ్యాధేర్న త్రాయన్తేఽపి వత్సలాః. 38

బ్రహ్మవిష్ణు రుద్రాదులు చిరకాలము పూజింపబడినను, వారికి వాత్సల్యమున్నను, మనోవ్యాధియను ఉపద్రవమునుండి వారు రక్షింపజాలరు. (అనగా, మనోవ్యాధికి చికిత్స స్వకర్తవ్యము; ఇతరు లేమియును జేయజాలరు.)

ఆకారభాసురం త్యక్త్వా బాహ్యమాన్తరమప్యజమ్
కురు జన్మక్షయాయాశు సంవిన్మాత్రైకచిన్తనమ్. 39

అందువలన నీవు ఇంద్రియాంతఃకరణగమ్యములగు బహిర్విషయములను విడచి, అంతరీస్థితుడగు చైతన్యస్వరూపు నొక్కనినే చింతింపుము; నీకు పునర్జన్మ యుండదు.

సంవేద్యనిర్ముక్త నిరామయైక
సంవిన్మయాస్వాదమనన్తరూపమ్
సన్మాత్రమాస్వాదయ సర్వసారం
పారం పరం ప్రాప్స్యసి జన్మనద్యాః. 40

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ప్రహ్లాదవిశ్రాన్తిర్నామ త్రిచత్వారింశః
సర్గః ॥ 43 ॥



నివు సంవేద్యములగు బాహ్యాంతర విషయములనుండి విడివడి, నిరామయమును, పరమానందమయమును, అనంతమును, సన్మాత్రమును నగు చైతన్యస్వరూపము నాస్వాదింపుము; అట్టిచో నీవు జన్మనదియొక్క పరమపారమును బొందగలవు. (అనగా, జన్మనదిని దాటి పునరావృత్తి రహితమగు స్థానమును బొందగలవు).

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ప్రహ్లాదవిశ్రాంతియను త్రిచత్వారింశ
సర్గము ॥ 43 ॥

---

## చతుశ్చత్వారింశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

రామ పర్యవసానేయం మాయా సంసృతినామికా
ఆత్మచిత్తజయేనైవ క్షయమాయాతి నాన్యథా. 1

వసిష్ఠుడు:—రామా! స్వకీయ చిత్తజయము వలననే, ఈ సంసారమాయ అంతమునందును; వేరొండు ఉపాయములేదు.

జగన్మాయా ప్రపంచస్య వైచిత్ర్యప్రతిపత్తయే
ఇతిహాస మిమం వక్ష్యే శృణుష్వావహితోఽనఘ. 2

అనఘా! జగత్తను మాయావిస్తారము యొక్క వైచిత్ర్యమును ప్రతిపాదించుటకుగాను నీకొక ఇతిహాసమును జెప్పెదను; వినుము.

అస్త్యస్మిన్వసుధాపీఠే కోసలో నామ మండలః
కల్పవృక్షవనం మేరావివ రత్నగణాకరః. 3

తత్రాభూద్బ్రాహ్మణః కశ్చిద్గుణీ గాధిరితి శ్రుతః
పరమశ్రోత్రియో ధీమాన్ధర్మమూర్తిరివ స్థితః. 4

ఆబాల్యాత్ప్రవిరక్తేన చేతసా స వ్యరాజత
నిష్కలఙ్కావదాతేన భువనం నభసా యథా. 5

ఈ వసుధాపీఠమున కోసలమను దేశముండెను. అయ్యది మేరువు కల్పవృక్షవనమున కాకరమైనట్లు, రత్నగణముల కాకరమై యుండెను. అట, గాధియను గుణశాలియగు బ్రాహ్మణుడు నివసించుచుండెను. వేదవేత్తయును, బుద్ధిమంతుడును నగు ఆ బ్రాహ్మణుడు ధర్మమూర్తివలె వెలయుచుండెను. నిష్కలంకమును స్వచ్ఛమును నగు శరదాకాశమున జగన్మండలము శోభించునట్లు, ఆ బ్రాహ్మణుని చిత్తము బాల్యమునుండి విషయవిరక్తిని బొందుటవలన నాతడు పరమశోభను బొందుచుండెను.

కిమప్యభిమతం కార్యం వినిధాయ స్వచేతసి
బన్ధువృన్దాద్వినిష్క్రమ్య తప స్తప్తుం వనం యయౌ. 6

ఆయన ఒకానొక కార్యమును సాఫల్య మొనర్పదలచి, బంధువర్గమును త్యజించి తప మొనర్ప అరణ్యమున కఱిగెను.

ఉత్ఫుల్ల కమలం ప్రాప సర స్తత్ర స విప్రరాట్
చన్ద్రైః ప్రసన్నవిమలం తారాసార మివాంబరమ్. 7
ఆశౌరిదర్శనం తస్మింస్తపోర్థం సరసి ద్విజః
ఆకంఠమమ్బునిర్మగ్నః ప్రావృట్పద్మ ఇవావిశత్. 8

ఆ విప్రరాజు వికసితపద్మములతో గూడిన ఒక సరోవరమును సమీపించెను. చంద్ర తారకా కుసుమములతో శోభిల్లు ప్రసన్న నిర్మలాంబరతలమువలె ఆ సరోవరము ఒప్పారుచుండెను. ఆ బ్రాహ్మణుడు విష్ణుమూర్తిని దర్శించు నిచ్ఛతో వర్షాకాల పద్మమువలె, ఆకంఠము జలముల మునిగి తపస్సొనర్ప నారంభించెను.

యయౌ మాసాష్టకం తస్య మగ్నస్య సరసోఽమ్బసి
వాసపఙ్కజసంకోచ మనాగ్భగ్నముఖచ్ఛవేః. 9

అట్లా సరోవరజలముల మునిగి గాధి ఎనిమిదిమాసములు తప మొనర్చెను. రాత్రి కాలసహవాసులగు పద్మముల సంకోచముతో బాటు, అతని ముఖకాంతిగూడ ఒకింత వాడువడు చుండెను.

అథైనం తపసా తప్త మాజగామైకదా హరిః
నిదాఘార్తం ఘనః శ్యామః ప్రావృషీవ ధరాతలమ్. 10

అనంతరము, వర్షారంభమున నిదాఘతాపిత ధరాతలమునకు సునీల మేఘ మరుదెంచు నట్లు, శ్రీహరి ఒకానొక సమయమున తపోతప్తుడగు ఆబ్రాహ్మణుని కడ కరుదెంచెను.

శ్రీ భగవానువాచ:—

విప్రోత్తిష్ఠ పయోమధ్యాద్గృహాణాభిమతం వరమ్
అభీప్సిత ఫలోపేతో జాతస్తే నియమద్రుమః. 11

భగవంతుడు! విప్రా! నీటినుండి లెమ్ము! ఇచ్ఛవచ్చిన వరమును గొమ్ము! నీ తపో వృక్షము నేడు ఫలించినది.

బ్రాహ్మణ ఉవాచ :—

అసంఖ్యేయ జగద్భూత హృత్పద్మ కుహరాలినే
జగత్త్రయైకనలినీసరసే విష్ణవే నమః. 12

బ్రాహ్మణుడు! అసంఖ్య జగత్తుల నివసించుచు ప్రాణుల హృత్పద్మమున వెలయు తుమ్మెదవు నీవు! జగత్త్రయ-పద్మమున కాకరమగు సరోవరమవు నీవు! విష్ణో! అట్టి నీకు నమస్కారము.



మాయామిమాం త్వద్రచితాం భగవన్పారమాత్మికీమ్
ద్రష్టు మిచ్ఛామి సంసార నామ్నిమామ్యైక కారణీమ్. 13

భగవంతుడా! పరమాత్మయందు మీవలన కల్పింపబడిన సంసారమాయను దర్శింపగోరుచున్నాను.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇమాం ద్రక్ష్యసి మాయాం త్వం తతస్త్యక్ష్యసి చేత్యజః
ఉక్త్వా యయావదృశ్యత్వం గాన్ధర్వమివ పత్తనమ్. 14

వసిష్ఠుడు! భగవంతుడు 'నీవీమాయను దర్శింపగలవు, పిమ్మట దీనిని త్యజింతువు' అని పల్కి- గంధర్వనగరమువలె అదృశ్యుడయ్యెను.

గతే విష్ణౌ సముత్తస్థౌ జలాత్స బ్రహ్మణేశ్వరః
శీతలామలమూర్తిత్వాదిన్దుః క్షీరోదకాదివ. 15

నారాయణు డరిగిన పిమ్మట గాధి నీటినుండి లేచి శీతలామలమూర్తి యగుటవలన, క్షీరసముద్రమునుండి లేచిన చంద్రునివలె నొప్పారుచుండెను.

బభూవ పరితుష్టాత్మా దర్శనేన జగత్పతేః
దర్శనస్పర్శనైరిన్దోరుత్ఫుల్లమివ కైరవమ్. 16

చంద్రదర్శన స్పర్శనముల కలువలు వికసించునట్లు, ఆబ్రాహ్మణుడు జగత్పతిని దర్శించి పరమప్రీతి నందెను. *

అథాస్య కతిచిత్తస్మిన్దివసా నిర్యయుర్వనే
హరిసందర్శనానన్దవతో బ్రాహ్మణకర్మణా. 17

పిదప, అతడు హరిసందర్శనమున లభించిన ఆనందమున మగ్నుడై బ్రాహ్మణోచితము లగు తపఃస్వాధ్యాయాతిథిపూజాదికముల నాచరించుచు, ఆ యరణ్యముననే కొన్ని దినములు గడపెను.

ఏకదారబ్ధవాన్స్నానం సరస్యుదితపఙ్కజే
చిన్తయన్వైష్ణవం వాక్యం మహర్షిరివ మానసే. 18

ఒకరోజున కమలములతో నొప్పారు ఆ సరోవరమున స్నానమాచరించుచు, మహర్షి మనస్సున యోగబలమున అతీతానాగత విషయముల జింతించునట్లు విష్ణుని వాక్యముల దలపోయ సాగెను.

అథ స్నానవిధావన్తర్జలమేష చకార హ
సకలాఘ విఘాతార్థం పరివర్తమివాత్మనా. 19

---

* ఇచ్చటి దర్శనస్పర్శనశబ్దములవలన స్థావరములకు గూడ చాక్షుషాదిజ్ఞాన మున్నట్లు తేలుచున్నది.

అన్తర్జలవిధౌ తస్మిన్విస్మృతధ్యానమన్త్రధీః
పర్యస్తసంవిత్ప్రసరః సోఽపశ్యజ్జలమధ్యతః. 20

మృతమాత్మానమాత్మీయే సదనే శోచ్యతాం గతమ్
పతితం వాతవేగేన కన్దరాన్తరివ ద్రుమమ్. 21

ప్రాణాపానప్రవాహేణ ముక్తమన్తముపాగతమ్
సంశాన్తావయవస్పన్దం నిర్వాత ఇవ ఖండకమ్. 22

పాండురాననమామ్లానం వృక్షపర్ణమివారసమ్
శవీభూతమివాగ్లానం ఛిన్ననాలమివామ్బుజమ్. 23

విపర్యస్తేక్షణం ప్రాతర్మగ్నతారమివాంబరమ్
సావగ్రహమివ గ్రామం సర్వతః పాంసుధూసరమ్. 24

బాష్పక్లిన్నముఖైర్దీనైః కరుణాక్రన్దకారిభిః
ఆవృతం బన్ధుభిః ఖిన్నైః కురరైరివ పాదపమ్. 25

సేతుభఙ్గగలద్వారి హ్రియమాణముఖాబ్జయా
నలిన్యా సమధర్మిణ్యా భార్యయా పాదయోః శ్రితమ్. 26

తారాక్రన్దరణద్రేఫ ప్రలాపాలాపలుబ్ధయా
మాత్రాగృహీతం చిబుకే నవవ్యంజనలాంఛితే. 27

అన్యైః పార్శ్వగతైర్దీనైః స్రవదశ్రుముఖైర్జనైః
శ్రితం గలదవశ్యాయైః శుష్కపర్ణైరివ ద్రుమమ్. 28

వియోగభీత్యా సంయోగ పరిహారపరైరివ
దూరం విప్రసృతైరఙ్గైరనాత్మీయైరివావృతమ్. 29

పరస్పరమలగ్నాభ్యామోష్ఠాభ్యాం దశనైః సితైః
సవిరాగమివామ్లానైర్హసన్తం స్వాత్మజీవితమ్. 30

మౌనధ్యానమివాపన్నం పఙ్కాదివ వినిర్మితమ్
అప్రబోధాయ సంసుప్తం విశ్రామ్యన్తమివోచ్ఛ్రితైః. 31

బాన్ధవాక్రన్దసంరంభ కోలాహలగతా గిరః
స్నేహభావవిచారార్థం శృణ్వన్తమివ యత్నతః. 32

పిదప, ఆయన స్నానమాచరించి నిఖిలపాపదూరీకరణమునకై జలమును కుశహస్తముతో గలచి, అఘమర్షణసూక్తమును బఠింపసాగెను. అప్పుడు, హఠాత్తుగ అతడు మంత్రమును మఱచెను; మఱియొక మంత్రము స్మృతికి దగులుచుండెను. నీటిమధ్య అతడీ దృశ్యమును గాంచెను. గాధి నిజగృహమున మరణించి, వాయువేగమున, గుహాగర్భమున బడిన పాదపమువలె, భూపతితుడై



శోచనీయదశను బొందెను. అతని మృతదేహము ప్రాణాపానవాయువుల సంచారములేక, అవయవముల కదలికలేక గాలిలేనిచోటనున్న చెట్టువలె పడియుండెను. పాలిపోయిన అతని మోము ఎండుటాకువలె శుష్కమై, కాడలేని తామరపూవువలె వాడువడెను. శవదశను బొందిన ఆశరీరము కన్నులు మూతబడుటవలన, నక్షత్రవిహీనమగు ప్రాతరాకాశమువలె గనబడుచుండెను. భూపతితమగు ఆ శరీరము ధూళిధూసరమై, వర్షావిహీనమును ధూళిమయమునునగు గ్రామమువలె నయ్యెను. కురరపక్షులు కూయుచు చెట్టు నాక్రమించుకొని యుండునట్లు, బాష్పజలార్ద్రవదనులగు ఆత్మీయులు దీనభావమున కరుణాస్వరముతో ఆక్రందనమొనర్చుచు ఆ శవమును జుట్టుముట్టియుండిరి. అతని భార్య, గట్టుతెగి చెఱువునీరు బయటికి పోగా, అకంఠమగ్నమగు నళిని హఠాత్తుగ నీరు తగ్గుటవలన అవనతముఖియగునట్లు, మోమును వంచుకొని అతని పాదమూలమున గూర్చుండెను. తల్లి, నూనూగు మీసములతో గూడిన అతని మోమును ముట్టుచు ఒకప్పుడు పెద్దగను, మరొకప్పుడు తుమ్మెదవలె అస్పష్టముగను ఏడ్చుచుండెను. తక్కినవారు కన్నుల నీరు కార్చుచు, దీనభావమున ప్రక్కన గూర్చుండిరి; వారు మంచుబొట్టులను రాల్చు ఎండుటాకులు చెట్టుప్రక్కన పడినట్లు ఉండిరి. అతని అవయవములన్నియు వియోగభయమున ఒకేతడవ వియోగము నందగోరి, అనాత్మీయులవలె దూరముగనుండి శరీరము నావరించుకొని యుండెను. పెదవులు కలసుకొనకుండుటవలన, స్వచ్ఛములగు దంతములనుండి కిరణములు వెలువడుచుండెను. అందువలన నా మృతదేహము, విరక్తినిబొంది బహిర్గతమగు ఆత్మజీవనమును లక్షించి హాస్యమొనర్చుచున్నట్లుండెను. ఆ నిశ్చలదేహము, మునివలె ధ్యానమగ్నమును, చిరప్రసుప్తమునునై బొమ్మవలె నిశ్చలభావమున బడియున్నట్లుండెను. మఱియు, బంధువులలో నెవ్వరికెంత స్నేహమున్నదియు తెలిసికొనగోరియే, యత్నపూర్వకముగ మౌనము నవలంబించి, వారి విలాప కోలాహలమును వినుచున్నట్లుండెను.

అథ తత్కాలకల్లోల ప్రలాపాకులచేష్టితైః
సోరస్తాడనమూర్ఛోత్థ నేత్రవారివహప్లుతైః. 33

క్రమేణ స్వజనైః క్షుబ్ధైస్తారాక్రన్దాదిఘర్ఘరైః
నిష్కాలితమమఙ్గల్యమపునర్గృహనాయ వై. 34

నీతం శ్మశానం మాంసాన్త్ర వసాపఙ్కకలఙ్కితమ్
శుష్కాశుష్కరసక్లిన్నం కంకాలశతసంకులమ్. 35

గృధ్రాభ్రిచ్ఛన్నసూర్యాంశు చితాజ్వలనవిస్తమః
శివాశివముఖజ్వాలా జాలపల్లవితావని. 36

వహద్రక్తసరిత్స్నాత మగ్నకఙ్కోగ్రవాయసమ్
రక్తార్ద్రితస్నాయుప్రసర జాలాబద్ధజరత్ఖగమ్. 37

బందుగులు అత్యంతశోకమున వ్యాకులురై, మధ్యమధ్య మూర్ఛనందుచు, బాష్పవారిప్రవాహమున మునుగుచు, రొమ్మును గొట్టుకొనుచు చాలాసేపు పెద్దపెట్టుగ నేడ్చుటవలన స్వరభంగమును బొందిరి. తుదకు, వారు చేయునదేమియు లేక అశుభకరమగు ఆ శవదేహమును కన్నుల ముందునుండి తొలగింప ఇంటినుండి బయటపెట్టి, మాంసనాడీవసాకర్దమమయమగు భీషణశ్మ

శ్మశానమునకు గొనిపోయిరి. అట, నొకచోట శుష్కశవములు పడియుండెను, మరియొకచోట అర్ధశవములుండెను. గ్రద్దలు ఆకాశమున విహరించుచు, మేఘములవలె సూర్యకిరణములను కప్పివేయుచుండెను. సర్వదా ప్రజ్వలితమగు చితానలము ఆశ్మశానమును అంధకారరహితమొనర్చుచుండెను. నక్కల వికృతవదనములనుండి వెలువడు వహ్నిశిఖల అచ్చటి భూభాగము పల్లవితమైనట్లుండెను, అటనట రక్తనదులు ప్రవహించుచుండెను; వాటియందు మునిగి కంకవాయసములు స్నానమొనర్చుచుండెను. మరియొకచోట, వృద్ధగృధ్రములు మాంసభోజన మొనర్పబోయి, రక్తార్ద్రశంత్రీజాలముల అబద్ధములై పడియుండెను.

తత్ర తే జ్వలనే దీప్తే చక్రుస్తం భస్మసాచ్ఛవమ్
బాన్ధవాః సలిలాపూరం సముద్రా ఇవ వాడవే. 38

సముద్రము తనజలప్రవాహమును బడబానలమున దగ్ధమొనర్చునటు, బంధుగులు ఆ ఘోర శ్మశానమున ప్రజ్వలిత అనలమున ఆ శవమును దహింపసాగిరి.

చితిశ్చటచటా స్ఫోటైః శవమాశు దదాహ సా
శుష్కేన్ధన బహూచ్ఛాన జ్వాలాజాల జటావలీ. 39

ఎండుకట్టెల ఆ చితి ప్రవర్ధిత శిఖాజటల విస్తరించి చటచట శబ్దమొనర్చుచు క్షణములో ఆ శవదేహమును దగ్ధమొనర్చెను.

అభ్యుల్లసత్కటకటారవ ముక్తగన్ధ
వ్యాప్తామ్బువాహ పటలోఽస్థిచయం హుతాశః.
దన్తీ సరంధ్రమివ వేణువనం సమన్తా
దుద్వాన్తమేదురరసం దలయాంచకార. 40

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే గాధివృత్తాన్తే గాధివినాశోనామ
చతుశ్చత్వారింశః సర్గః ॥ 44 ॥

ఏనుగ కటకట శబ్దముతో వెదురు వనమును జీల్చునట్లు, ఆ చితానలము గగనమును భేదించు కటకట రవమొనర్చుచు పూతిగంధముతో మేఘమార్గమును నింపి, నలువైపుల శవశరీరమున నున్న రసారసమును జల్లుచు, అస్థులనుగూడ చీల్చి, శవశరీరము నంతటిని సంపూర్ణముగ భస్మమొనర్చెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమ ప్రకరణమున
గాధివృత్తాంతమున గాధివినాశమను చతుశ్చత్వారింశ
సర్గము ॥ 44 ॥

---



## పఞ్చచత్వారింశః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అథాపశ్యదసౌ గాధిః స్వాధిపీవరయా ధియా
అన్తర్జలస్థ ఏవాన్తరాత్మనాత్మని నిర్మలే. 1
భూతమండలపర్యన్త గ్రామోపాన్తనివాసినామ్
శ్వపచానాంస్త్రియా గర్భే స్థితిమాత్మాన మాకులమ్. 2
గర్భవాసభరాక్రాన్తం పీడితం పేలవాఙ్గకం
శ్వపచీ హృదయే సుప్తం స్వవిష్ఠాయామివాకులమ్. 3
శనైః పక్వతయా కాలే ప్రసూతం మేచకచ్ఛవిమ్
శ్వపచ్యా ప్రావృషేవాబ్దం శ్యామమావలితం మలైః. 4
సంపన్నం శ్వపచాగారే శిశుం శ్వపచవల్లభమ్
ఇతశ్చేతశ్చ గచ్ఛన్తముత్పీడమివ యామునమ్. 5
ద్వాదశాబ్దదశాం యాతం సంస్థితం షోడశాబ్దికమ్
పీవరాం సముదారాఙ్గం పయోదమివ మేదురమ్. 6
సారమేయ పరీవారం విహరన్తం వనాద్వనమ్
నిఘ్నన్తం మృగలక్షౌణి పౌలిన్దీం స్థితిమాగతమ్. 7
తమాలలతయేవాథ శ్రితం శ్వపచకాన్తయా
స్తనస్తబకశాలిన్యా నవపల్లవహస్తయా. 8
శ్యామయా మలినాకార దశనామల మాలయా
వనపల్లవయా భూరి విలాసవలితాఙ్గయా. 9
విలసన్తం వనాన్తేషు తయా సహ నవేష్టయా
శ్యామలం శ్యామయా భృఙ్గం భృఙ్గ్యేవ కుసుమర్ధిషు. 10

వసిష్ఠుడు:— గాధి అట్లుగాంచి అత్యంత వ్యథితుడై నీటనుండియే, దుఃఖితమనస్కుడై మరల నిట్లు గాంచదొడగెను:— అతని మృత-ఆత్మ భూతమండలగ్రామ శేషమున వసించు చండాలిని గర్భమున ప్రవేశించెను. విష్టాసదృశమగు ఆ చండాల గర్భమున వాసమొనర్చు కోమలమగు ఆ ఆత్మ గర్భవాసవ్యథవలన పీడితమై వ్యాకులమవసాగెను. వర్షఋతువు శ్యామవర్ణ మేఘమును ఉత్పన్నమొనర్చునట్లు, ఆచండాలిని కాలక్రమమున సంపూర్ణగర్భయై మలలిప్తమగు శ్యామవర్ణ సంతానమును ప్రసవించెను. శ్వపచీగర్భమున నిట్లుజన్మించిన గాధియొక్క ఆత్మ, వారికి ప్రియకరమగుశిశువై, యమునాప్రవాహమువలె, ఇటునట విహరింపసాగెను. క్రమముగా ద్వాదశ, షోడశవర్షీయుడై చండాలశిశువు స్థూలస్కంధుడును, మేఘశ్యామ సుందరుడును నయ్యెను. కొన్ని కుక్కలను వెంటనిడుకొని వనవనాంతరముల సంచరించుచు లక్షలకొలది మృగములను వధించుచు కాలమును గడప

సాగెను. పిదప, పుష్పగుచ్ఛస్తనయును, నవపల్లవకరయును, మలినదంతయును, వనపల్లవవిభూషితయును, విలాసవతియును, తమాలశ్యామయునునగు శ్వపచకన్యను వివాహమాడెను. శ్యామవర్ణులగు వారిర్వురును, భ్రమరీభ్రమరములు కుసుమముల విహరించునట్లు, వనముల విహరింపసాగిరి.

వన పర్ణలతాపత్రే వసన్తం వ్యసనాతురమ్
విన్ధ్యకాన్తార మాకార మభ్యాగతమివోద్భటమ్. 11
విశ్రాన్తం వనకుఞ్జేషు సుప్తం గిరిదరీషు చ
నిలీనం పత్రపుఞ్జేషు గుల్మకేషు కృతాలయమ్. 12
కింకిరాతావతంసాఢ్యం యూథికాస్రగ్విభూషితమ్.
కేతకోత్తం స సుభగం సహకారస్రగాకులమ్. 13
లులితం పుష్పశయ్యాసు భ్రాన్తమద్రి తటీషు చ
తజ్జ్ఞం కాననకోశేషు బహుజ్ఞం మృగమారణే. 14
ప్రసూతమథ శైలేషు పుత్రాన్నిజకులాఙ్కురాన్
అత్యన్తవిషమోదన్తానదిరః కంటకానివ. 15
కలత్రవన్తం సంపన్నం స్థితం ప్రక్షీణయౌవనమ్
శనైర్జరఠతాం యాతం వృష్టిహీనమివ స్థలమ్. 16
తత్రో భూతగ్రహాగ్రామ జన్మదేశముపేత్య తమ్
సంస్థితం మఠికాం పత్రైః కృత్వా దూరే మునీన్ద్రవత్. 17

జరా జరఠతాం యాతం స్వదేహసమపుత్రకమ్
జీర్ణప్రాయరసశ్వభ్ర తమాలతరు సంనిభమ్. 18
ప్రౌఢం శ్వపచగార్హస్థ్యం కుర్వాణం బహుబాన్ధవమ్
క్రూరనామార్థ వచనం పరాం వృద్ధిముపాగతమ్. 19

ఆ లతాపత్రముల వాసమొనర్చుచు, వ్యసనముల దగిలి ఆతడు రూపెత్తిన వింధ్యాటవివలె నయ్యెను. వనకుంజముల విశ్రమించుచు, గిరిగుహల శయనించుచు, పత్రిపుంజముల దాగికొనుచు, గుల్మల వసించుచు, కింకిరాతమంజరులను కర్ణముల ధరించుచు, కంఠముల యూథికా కుసుమ మాల్యముల ధరించుచు, మస్తకమున కేతకీ కుసుమభూషణముల ధరించుచు, గాత్రమున సహకార కుసుమమాలల వేసికొనుచు, విలాసముగ విహరించుచుండెను. మృగవధయందు నేర్పును సంపాదించి, అరణ్యప్రదేశములను చక్కగ గ్రహించి, పుష్పశయ్యల శయనించుచు, అద్రితటముల భ్రమించుచు గాధి కాలమును గడపసాగెను. పిదప నతడు, పర్వతమునందలి ఖదిరవృక్షము కంటకముల ప్రసవించునట్లు, విషములును, కులాంకురములునునగు పుత్రులను గొందఱిని గనెను. యౌవనము దాట, వర్షహీనదేశమువలె గాధి జీర్ణుడవసాగెను. పిదప, కుటుంబమును వెంటనిడుకొని జన్మస్థానమగు భూతకుండలమునుజేరి, ఒకింతదూరమున తపస్వివలె పర్ణకుటీరము నిర్మించి వసింపసాగెను. జరాజీర్ణుడను ఆ చండాలుడు చవిటినేల గోతిలో మొలచిన కడిమిచెట్టువలె నయ్యెను. అతని పుత్రులు



గూడ నదేస్థితిని బొందిరి. ప్రౌఢుడగు ఆ చండాలుడు పెక్కురు బంధుగులతోగూడి చండాలునివలె గార్హస్థ్యధర్మమును పాలింపసాగెను. కార్యమునను, వచనములను నతడు క్రూరుడయ్యెను. బుద్ధి పరమకాఠిన్యమును వహించెను.

అథాపశ్యదసౌ గాధిర్యావత్తస్య కలత్రిణః
జరఠః శ్వపచేభ్యశ్చ స్వాత్మనో భ్రమహారిణః. 20
తత్కాలక్రమశేషేణ నీతమావృత్య మృత్యునా
ఆసారసలిలేనాశు వనపర్ణగణో యథా. 21

నీటియందున్న గాధి ఇట్లు తన్ను పెక్కురు బంధుగులతోగూడిన చండాలగృహస్థునిగ దర్శించెను. అచ్చటనున్నవారి అందరిలోను అతడే వయోజ్యేష్ఠుడై యుండెను. ఇట్లు, చండాలభ్రాంతిబొంది గాధి దినముల గడపుచుండ, వర్షజలప్రవాహమున శుష్కపర్ణములు తేలిపోవునట్లు, మృత్యువరుదెంచి అతనిస్త్రీపుత్రులను అపహరించెను.

ప్రలపత్యేక ఏవాసావటవ్యాం దుఃఖకర్శితః
వియూథ ఇవ సారఙ్గో విగతాస్థోఽశ్రులోచనః. 22

గాధి అప్పుడు ఒంటరియై గుంపుతప్పిన లేడివలె దుఃఖాకులుడై, సంసారమున విశ్వాసమును వీడి, సాశ్రునయనుడై శోదింపసాగెను.

దినాని కతిచిత్తత్ర నీత్వా శోకపరీతధీః
జహౌ స్వదేశం సంశుష్కపద్మం సర ఇవాణ్డజః. 23

అతడట శోకాకులచిత్తమున కొన్నిదినములు గడపి, హంసాదిపక్షులు శుష్కమగు పద్మసరోవరమును వీడునట్లు, ఆస్థానమును పరిత్యజించెను.

విజహార బహూన్దేశాననాస్థశ్చిన్తయాన్వితః
ప్రేర్యమాణ ఇవాన్యేన వాతనున్న ఇవాంబుదః. 24
ఏకదా ప్రాప కీరాణాం మండలే శ్రీమతాం పురీమ్
ఖేచరే విహరత్యూర్ధ్వే సద్విమాన మివాంబరే. 25
నృత్యద్రత్నాంశుకచ్ఛన్న మార్గవృక్షలతాజనమ్
ఆగుల్ఫాకీర్ణకుసుమం చన్దనాగురుసున్దరమ్. 26
సామన్తైర్లలనాభిశ్చ నాగరైశ్చ నిరన్తరమ్
స్వర్గమార్గోపమం రాజమార్గమధ్య మవాప సః. 27
మణిరత్నకృతాగారం తత్ర మఙ్గలహస్తినమ్
దదర్శామరశైలేన్ద్రమివ సంచారచఞ్చలమ్. 28
మృతేరాజని రాజార్థం విహరన్తమితస్తతః
రత్నజ్ఞమివ రత్నార్థం చింతామణిదిదృక్షయా. 29

చింతాన్వితుడును, అస్థారహితుడునునై పరాధీనునివలె, గాలిచేగొట్టబడిన మేఘమువలె

నానాదేశముల పరిభ్రమింపసాగెను. శూన్యపథమున సంచరించు ఖేచరుడు హఠాత్తుగ విమానమును బొందునట్లు, అతడు భ్రమించుచు కీరదేశమున కఱిగి సంపన్నమగు పురి నొకదానిని గాంచెను. అచ్చటి రాజపథము స్వర్గపథమువలెనుండెను. వృక్షలతలు సర్వదా నృత్యమొనర్చు నర్తకుల రత్నవస్త్ర సమూహములతో గప్పబడియుండెను. అటపడియున్న పుష్పరాశుల మడుములు శష్పావడిపోవుచుండెను. అగరు చందనముల సుగంధము వచ్చుచుండెను. సామంతులు, నగరవాసులు, అంగనలు నిరంతర మా పథమున సంచరించుటవలన నయ్యది ఇరుకుపడుచుండెను. అట నానావిధమణిరత్నములతో నలంకరింపబడిన మంగళహస్తి ఒకటి సంచరించుచుండెను. అయ్యది తిరుగాడు పర్వతరాజువలె నుండెను. ఆ దేశపురాజు మరణించుటవలన, ఆ మంగళహస్తి మఱియొక అదృష్టవంతుని, రత్నజ్ఞుడు చింతామణికొఱకు నానారత్నముల పరీక్షించునట్లు, రాజపదవియందుంప అన్వేషించుచుండెను.

తమసా శ్వపచో నాగం కౌతకోద్ధురయా దృశా
చిరమాలోకయామాస స్పన్దయుక్తాచలోపమమ్. 30
ఆలోకయన్తమాదాయ తం కరేణ స వారణః
స్వకటేఽయోజయన్మేరుస్తటేఽర్కమివ సాదరమ్. 31

అప్పుడు చండాలరూపియగు గాధి భ్రమించు శైలమువలెనున్న ఆహస్తిని ఆశ్చర్యముతో విస్ఫారనేత్రములతో చాలసేపు చూడసాగెను. సమేరుపర్వతము తటదేశమున సూర్యుని ఆదరముతో ఆరోపించుకొనునట్లు ఆ హస్తి తొండముతో గాధిని మూపుపై నెత్తుకొనెను.

తస్మిన్కటగతే నేదుర్జయదుందుభయోఽభితః
కల్పాంబుద ఇవాకాశమధిరూఢే మహార్ణవాః. 32

అప్పుడు నలువైపుల, ఆకాశమున ప్రళయ మేఘములు ఉదయింప మహాసాగరములు గర్జించునట్లు, విజయ దుందుభులు మోయసాగెను.

పూరితాశో బభౌ రాజా జయతీతి జనస్వనః
ఉదభూత్సంప్రబుద్ధానాం విహగానా మివారవః. 33

అప్పుడు పూర్ణమనోరథులగు ప్రజలు దిక్కుల నింపుచు, ప్రభాత విహగధ్వనులవలె, ‘రాజునకు జయమగు గాక!’ అని ధ్వనుల నొనర్పసాగిరి.

ఉదభూద్బన్దివృన్దానాం ఘనకోలాహలస్తతః
వేలావిలులితాంబూనా మంబుధీనామివ ధ్వనిః. 34

చెలియలికట్టను దాటు సముద్రగర్జనమువలె నలువైపులనుండి వందిమాగధుల కోలాహలము వినబడసాగెను.

తం తత్రావరయామాసుర్మండనార్థం వరాఙ్గనాః
క్షీరోదగతవిభ్రాన్తా లహర్య ఇవ మన్దరమ్. 35
మానిన్యస్తం గుణప్రోతైర్నానారత్నైరపూరయన్
నానాప్రభా ప్రభాతార్కా వేలా ఇవ తటాచలమ్. 36



తుషారశిశిరస్పర్శైస్తాం హారైరభూషయన్
శ్యామావననదీపూరైర్వర్షాః శృఙ్గమివోత్తమమ్. 37
విచిత్రవర్ణసౌగంధ్యైః పుష్పైరావలయన్స్త్రియః
వనం మధుశ్రియ ఇవ తం లోలకరపల్లవాః. 38
నానావర్ణరసామోదైస్తాస్తమాశు విలేపనైః
అలేపయన్నృభాజాలైర్నగోఽభ్రమివ ధాతుభిః. 39
రత్నకాంచన కాన్త్యోఽసావాదదే చిత్తమాతతమ్
సంధ్యాభ్రతారేన్దునదీవ్యాప్తం మేరురివాంబరమ్. 40
భూషితః సవిలాసాభిర్బాలవల్లీభిరావృతః
రత్నపుష్పాంశుకాకీర్ణః కల్పవృక్ష ఇవాబభౌ. 41
తాదృశం తముపాజగ్ముః పరివారసమన్వితాః
సర్వాః ప్రకృతయః ఫుల్లం మార్గద్రుమమివాధ్వగాః. 42
తా ఏనమాసనే సైంహే తత్రాభిషిషిచుః క్రమాత్
తస్మిన్నేవ గజే శక్రమైరావత ఇవామరాః. 43
ఏవం స శ్వపచో రాజ్యం ప్రాప కీరపురాన్తరే
ఆగణ్యం హారిణం పుష్టమప్రాణమివ వాయసః. 44

శ్రేష్ఠాంగనలు కొందరతని నలంకరింప అరుదెంచి చుట్టుముట్టిరి. వారు పాలసముద్రమును మథించు మందర పర్వతమును తాకు అలలవలె నుండిరి. వారు నానావిధములగు రత్నమాలలతో అతని నలంకరించిరి; అప్పుడు పూర్వసాగరము తన రత్నమయవేలాభూమియందు ప్రతిఫలించిన సూర్యకిరణ సమూహములతో, సమీపముననున్న పర్వతతటము నలంకరించి నట్లుండెను వర్షము వన్యనదీప్రవాహపాతమున ఉన్నతగిరి శిఖరమునకు శోభను కల్పించునట్లు, ఆ యువతు లాతని శీతస్పర్శములగు హారగుచ్ఛములతో నలంకరించిరి. చంచలకరకిసలయగు వసంతలక్ష్మి వివిధ కుసుమజాతులతో వనస్థలము నలంకరించునట్లు, వివిధములును, విచిత్రములును, సురభిళములునునగు కుసుమములతో నతని నలంకరించిరి. సుగంధలేపముల నాతనికిఁ బూసిరి; శైలమాల తనపైనున్న మేఘరాజిని నానావిధ ధాతురాగములతో నలంకరించి నట్లుండెను. సంధ్యాసమయమున సుమేరుగిరి సాంధ్యరాగరంజితమగు మేఘమాలలతోడను, చంద్రతారాగణముతోడను పరిశోభితమగు గగనతలమును గ్రహించునట్లు, గాధి నానారత్నవిరాజితుడై జనులచిత్తమును హరింపసాగెను. నవలతికలవలె విలాసవతులగు యువతు లాతని వివిధ ఆభరణములతో నలంకరించిరి. అతడు రత్నకుసుమములతో శోభిల్లు కల్పతరువువలె నుండెను. పథముననున్న కుసుమిత వృక్షముకడకు పాంథులరుదెంచునట్లు, ప్రజాసమూహము సపరివారముగ నూతన నరపతికడ కరుదెంచిరి. దేవత లింద్రుని ఐరావత మెక్కించి స్వర్గరాజ్యమున కభిషేక మొనర్చునట్లు ప్రజలాతని నా మంగళహస్తిపైనుంచి, సిం

బోసిన ముక్కలించి రాజ్యాభిషేక మొనర్చిరి. కాకి ఒకానొకప్పుడు అడవికేగి బలసిన మృగశవమును బొందునట్లు, గాధి విప్రుడు చండాలత్వమును బడసియు అదృష్టవశమున కీరపుర రాజ్యమును బొందెను.

కీరీకరతలామ్భోజ ప్రమృష్టచరణామ్బుజః
సర్వాఙ్గే కుఙ్కుమాలేపైః సంధ్యామ్బుధరశోభనః. 45
జజ్వాల కీరనగరే నాగరీగణవాససా
సింహీగణయుతః సింహో యథా కుసుమితే వనే. 46

కీరపుర కామినులు కరకమలములతో అతని పాదముల నొత్తసాగిరి. కుంకమలిప్తశరీరుడై అతడు సాంధ్యమేఘమువలె శోభిల్లసాగెను. సింహము సింహసమూహముతోగూడి పుష్పిత అరణ్యమున శోభించునట్లు, అతడు కీరస్త్రీలతోగూడి విరాజిల్లుచుండెను.

హరిహత కరికుమ్భోన్ముక్త ముక్తాకలాప
ప్రవిరచితశరీరః శాన్తచిన్తావిషాదః
అరమత సహ సద్భిస్తత్ర భోగైః సరస్యాం
రవికరమదతప్తో వారిపూరైరివేభః. 47

సింహహత కరికుంభముక్తామాలలతో నతని శరీర మలంకరింపబడెను. చింతా, విషాదరహితుడై, మంత్రితోడను ప్రజలతోడను గూడి రాజ్యమును భోగించుచు, మిక్కుటముగ ఆనందింపసాగెను. అప్పుడాతడు, సూర్యకిరణముల వలనను, నిజమదమునను తపించి జలప్రవాహమున మునిగి సుఖమందు ఏనుగవలె నుండెను.

పరివిసృతనృపాజ్ఞః సర్వదిక్సంస్థితాజ్ఞః
కతిపయదివసైరాసిద్ధదేశవ్యవస్థః
ప్రకృతిభిరలమూఢాశేష రాజన్యభారః
స గవల ఇతి నామ్నా తత్ర రాజా బభూవ. 48

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే గాధివృత్తాన్తే శ్వపచరాజ్యలాభో నామ
పఞ్చచత్వారింశః సర్గః ॥ 45 ॥

కొన్ని దినములలో నాతడు ఇచ్ఛానుసారముగ రాజ్యశాసనమును ఏర్పరచెను. అతని రాజశక్తి అంతట ప్రతిష్ఠింపబడెను. ఎల్లయెడల అతని ఆజ్ఞ ఆదరింపబడసాగెను. కార్యదక్షులగు ప్రతినిధులు రాజ్యకార్యముల నేర్పుతో నొనర్పసాగిరి. అతడట గవల నామమున విఖ్యాతినందెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
గాధివృత్తాంతమున శ్వపచరాజ్యలాభమను పంచచత్వారింశ
సర్గము. ॥ 45 ॥

---



## షట్చత్వారింశః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

విలాసినీభిర్వలితో మన్త్రిమణ్డలపూజితః
స్థితః సర్వసామన్తైశ్ఛత్త్రచామరలాలితః. 1
సిద్ధానుశాసనః కాన్తో జ్ఞాతరాజ్యగుణక్రమః
వీతశోకభయాయాస ప్రజ్ఞః ప్రాప్తమహాదశః. 2
విస్మృతాత్మస్వభావోఽభూదనిశం స్తవమఙ్గలైః
ఆనన్దపూర్ణయా వృత్త్యా భృశం క్షీబ ఇవాసవైః. 3
కీరేషు శ్వపచో రాజ్యం వర్షాణ్యష్టౌ చకార హ
ఆర్యవృత్తమశేషేణ తావత్కాలం బభార హ. 4

వసిష్ఠుడు:—రామా! ఇట్లు గాధి-చండాలుడు రాజ్యమును బొంది స్త్రీలతోగూడుకొని యుండెను. మంత్రులాతనికి యథోచిత సన్మానమును జూపసాగిరి. సామంతరాజులు అనుగతులైరి. అతడు ఛత్రచామరచిహ్నముల శోభితుడయ్యెను. అతని శాసనము సర్వత్ర ప్రతిష్ఠితమయ్యెను. అతడంతటికిని ప్రియదర్శనుడయ్యెను. రాజ్యపాలనా రీతినీతుల నాతడు చక్కగ గ్రహించెను. అతడు మహత్త్వమును బొందెను. అతని పాలనమున ప్రజలు శోకభయక్లేశ రహితులై సుఖముగ కాలమును గడపసాగిరి. రాజపదవిని పొంది అతడు తన చండాలత్వమును సంపూర్ణముగ విస్మరించెను. నిరంతరము స్తవమంగళగీతముల ఆనందితుడై మదమత్తునివలె ఎనిమిదియేండ్లు కీరరాజ్యమును పాలించెను. దయాదాక్షిణ్యాది ఆర్యగుణములు అతని నాశ్రయించెను.

యదృచ్ఛయైకదాథాసావతిష్ఠత్త్యక్తభూషణః
అతమస్తారకేన్ద్వర్క- తేజోఽమ్భోదమివామ్బరమ్. 5

అప్పుడొకదినమున ఆరాజు శరీరమునుండి అలంకారముల నూడదీసి రవిశశితారకా తిమిరమేఘరహితమగు ఆకాశమువలె శూన్యదేహుడై రాజిల్లజొచ్చెను.

బహ్వమన్యత నో హారకేయూరవలయాన్యసౌ
ప్రభుతాబృంహితం చేతో నాహార్యమభినన్దతి. 6

హారకేయూరవలయాది అలంకారముల యెడ అతనికి పూర్వప్రీతి తొలగిపోయెను. అతని చిత్తము ఔదార్యగుణమున నిండియుండుటవలన ఆ కృత్రిమ సౌందర్యమును అభినందింపజాలక పోయెను.

ఏక ఏవాజిరం బాహ్యం తాదృగ్వేషః స నిర్యయౌ
ముఖ్యాఙ్గణాన్నభోభాగాదస్తం గచ్ఛన్నివాంశుమాన్. 7

సూర్యుడాకాశమునువీడి అస్తాచలమున కఱుగునట్లు, ఆ రాజట్లు ఏకాకియై రాజపురి ప్రధానప్రాంగణమునువీడి బహిఃప్రాంగణమున కఱుదెంచి నిలఁబడెను,

తత్రాపశ్యద్ఘనం శ్యామం పీనం శ్వపచపేటకమ్
గాయన్మృదువసన్తోత్థం కోకిలానామివ వ్రజమ్. 8
ధునానం వల్లకీతన్త్రీం కరపల్లవలీలయా
మృదురేఫం రణద్రేఫామలిశ్రేణిమివ ద్రుమమ్. 9

అట, కారు నలుపువారును, మోటువారును నగు చండాలురు వసంత కోకిలలవలె మధురస్వరముతో బాడుచు, కరకిసలయములతో నవలీలగ వీణాతంత్రులను మీటుచు మృదుమధురధ్వనుల నొనర్చుచుండిరి; తరువు తన కరపల్లవముల తుమ్మెదల రెక్కలను గదల్చి, ఝంకెనోట మృదుస్వరమును వెలువరించుచున్నట్లుండెను.

ఏకస్తస్మాత్సముత్తస్థౌ జరావాన్రక్తలోచనః
కాచశృఙ్గం హిమాపూర్ణమివ శ్వపచనాయకః. 10
భోః కటంజేతి సహసా వదన్కీరమహీపతిమ్
ఇహ రాజా భవన్తం వా కచ్చిద్గేయక్రియావిదమ్. 11
రక్తకణ్ఠం మానయతి రాగవానివ కోకిలమ్
ఆపూరయతి వా కచ్చిద్గృహవస్త్రాసనార్పణైః. 12
మధూ రసాలవిటపం ఫలపుష్పభరైరివ
దర్శనేన తవాద్యాహం పరాం నిర్వృతిమాగతః. 13
పద్మం సూర్యోదయేనేవ చన్ద్రోదయ ఇవౌషధీ
ఆనన్దానామశేషాణాం లాభానాం మహతామపి. 14
విశ్రామాణామనన్తానాం సీమాన్తో బన్ధుదర్శనమ్
శ్వపచే ప్రవదత్యేవం రాజా యావత్తయా తయా
చకార తత్కాలజయా చేష్టయైవావధీరణమ్. 15
తావద్వాతాయనగతాః కాన్తాః ప్రకృతయస్తథా
శ్వపచోఽయమితి జ్ఞాత్వా మానతామలమాయయుః. 16

అంత, జరాజీర్ణుడును, ఆరక్తనేత్రుడును నగు చండాలనాయకు డొకడు, తుషారపూర్ణమగు కాచగిరిశృంగమువలె లేచి ఇట్లు పల్కెను:- 'హే కటంజా ? స్వరాభిజ్ఞుడు కలకంఠమగు కోకిలల నాదరించునట్లు, ఇచ్చటి రాజు నిన్ను సంగీత శాస్త్రాభిజ్ఞునిగ సమ్మానించునా ? వసంతము చూతవృక్ష శాఖను ఫలపుష్పములచే పూరించునట్లు, నిన్ను వసనభూషణాదులతో నాదరించుచున్నాడా ? సూర్యోదయమున పద్మములు ప్రఫుల్లములగునట్లు, చంద్రోదయమున ఓషధులు సంతసించునట్లు, నిన్నుగాంచి మేము పరమానందము నందితిమి. బంధుజనుల దర్శనము అశేష ఆనందముయొక్కయు, లాభముయొక్కయు, విశ్రాంతి యొక్కయు అవధి. ఇట్లా చండాలనాయకు డెన్నిమార్లు పల్కినను రాజు లెక్కగొనకుండెను. అప్పుడు వాతాయనములనుండి గమనించుచున్న అంతఃపుర స్త్రీలును, ప్రజలును దీనివలన రాజును చండాలుడని గ్రహించి మిక్కుటముగ విషాదము నందిరి,



పద్మాస్తుషారప్రావృష్ట్యా గ్రామాః సావగ్రహా ఇవ
దావవన్త ఇవాద్రీన్ద్రా నాగరా న విరేజిరే. 17

నగరవాసులు రాజును చండాలునిగ గ్రహించి, హిమహతములగు కమలదళములవలెను, వర్షహతములగు గ్రామములవలెను, దావాగ్నిదగ్ధములగు పర్వతతటములవలెను మ్లానముఖులై చింతింపసాగిరి.

నృపోఽవధీరయామాస తాంతాం శ్వపచసంకథామ్
వృక్షాగ్రగతమార్జారఫేత్కారం మృగరాడివ. 18

ఇట రాజు చండాలుర వచనములను, సింహము చెట్టుపైనున్న పిల్లికూతలను సరకుగొననట్లు, లెక్కగొనకుండెను.

సత్వరం ప్రవివేశాన్తః పురమామ్లానమానవమ్
రాజహంస ఇవావర్షే సీదత్సరసిజం సరః. 19

పిదప రాజు అటు నాగక వెంటనే విషణ్ణజన బహుళమగు రాజపురిని ప్రవేశించెను. అప్పుడు, వానలేకుండుటవలన ఎండుపడిన తామరకొలనును హంస ప్రవేశించుచున్నట్లుండెను.

సర్వావయవవిశ్రాన్తాం మ్లానతామయమాయయా
జానుస్తంభాన్తరమహారన్ధ్రాగ్నిరివ దుర్ద్రుమః. 20

మూలదేశముననున్న కోటరమున నిప్పంటింప బూరుగు మున్నగు చెట్లు శుష్కములగునట్లు, అంతఃపురమున ప్రవేశించిన మాత్రముననే అతని అవయవములన్నియు శుష్కింపసాగెను.

తత్రాపశ్యదసౌ సర్వం విషణ్ణవదనం జనమ్
జాలం కుఙ్కుమపుష్పాణాం భుక్తమూలమివాఖునా. 21

అట కతిగి ఆతడు, ఎలుక మొదలు త్రెంప వాడువడిన కుంకుమపుష్పమువలె, జనులందరు ఉండుటను గాంచెను.

మన్త్రిణో నాగరా నార్యస్తత స్తేతం మహీపతిమ్
నాస్ప్రాక్షురపి తిష్ఠన్తం గృహ ఏవ శవం యథా. 22

మంత్రులు, రాజస్త్రీలు, నగరవాసులు రాజు అటనున్నను, శవమువలె ముట్టుకొనకుండిరి.

భృత్యాశ్చాకృతసత్కారం దూర ఏనమథాత్యజన్
దుఃఖయుక్తా ఘనస్నేహా అపి బాలాః శవం యథా. 23

బాలకులు శవదేహ మాత్మీయమైనను దూరముననుండునట్లు, సేవకులు పరమ భక్తులయ్యును సమీపింపకుండిరి.

అనానన్దముఖం శ్యామం శరీరం శ్రీవివర్జితమ్
దగ్ధం స్థలమివైనం తే బహ్వామన్యన్త నాకులాః. 24

రాజు చండాలుడని దుఃఖించుచు ఎవ్వరును ఆదరగౌరవములను జూపకుండిరి. కనుక నాతడు నిరానందవదనుడును, మలినవర్ణుడును, శోభారహితుడును నయ్యెను.

ధూమాయమానదేహస్య పరితాపదశావతీ
నాథాకతాస్య జనతా పార్శ్వమగ్నిర్గిరేరివ. 25

శోకానలమున పురవాసుల చిత్తము తప్తమై, శరీరము ధూమాయితమయ్యెను. అగ్నిపర్వత శిలాభాగమును జనులు సమీపింపనట్లు, పురవాసులెవ్వరును అతనిని సమీపింపకుండిరి.

మన్దోత్సాహాః సముద్భూతాః సభ్యసంఘాతవర్జితాః
న తదాజ్ఞాః పదం ప్రాపుర్భస్మనీవాम्बువిప్రుషః 26

సభాసదులు అతని ఆజ్ఞను తృణీకరింపసాగిరి. ప్రభారహితుడగు ఆతని ఆజ్ఞ భస్మపతితమగు నీటిబొట్టువలె ఎచ్చటను నిలువజాలకపోయెను.

క్రూరకర్మకరాకారాత్సంగతా శుభదాయినః
తస్మాద్విశేషేణ జనా రాక్షసాదివ దుద్రువుః. 27.

అతని ఆకృతి అందరికిని క్రూరకర్మల నాచరించుదానివలె నగుపడెను. అతని సహవాసము మంగళకరముగ తోచసాగెను. అతనిని గాంచి ప్రజలు రాక్షసుని గాంచినవారివలె పరుగిడసాగిరి.

ఏక ఏవ బభూవాసౌ జనమధ్యగతోఽపిసన్
అర్థాదిగుణనిర్ముక్తః పరదేశ ఇవాధ్వగః. 28

అప్పుడాతడు జనుల మధ్యనున్నను, అర్థహీనుడును, గుణరహితుడును, విదేశియును నగు పాంథునివలె ఆపదయందు పడెను.

భృశమాలపతేఽప్యస్మై నాలాపం నాగరా దదుః
ముక్తాజాలయుతాయాపి కీచకాయాధ్వగా ఇవ. 29

లోనముత్యములున్నను గాలికి ధ్వనించు వెదురుతో బాటసారులు పల్కనట్లు, అతడు పలుమాటలు మాట్లాడినను నగరవాసు లతనితో మాటలాడకుండిరి.

అథసర్వే వయం దీర్ఘకాలం శ్వపచదూషితాః
ప్రాయశ్చిత్తైర్న శుద్ధ్యామః ప్రవిశామో హుతాశనమ్. 30
ఇతి నిర్ణీయ నగరే నాగరా మన్త్రిణస్తథా
అభితో జ్వాలయామాసుశ్చితాః శుష్కేన్ధనైధితాః. 31

పిదప, నగరవాసులును, మంత్రులును మనము చాలకాలము చండాలునితో నుంటిమి; ప్రాయశ్చిత్తమువలన శుద్ధులము కాజాలము, అగ్నిప్రవేశ మొనర్తుము గాక! అని పల్కి చితులను చేర్చసాగిరి,



జ్వలితాస్వభితస్తాసు తారకాస్వివ ఖే తదా
బభూవ నగరం సర్వమాక్రన్దపరమానవమ్. 32
కరుణారావముఖరైః కలత్రైర్బాష్పవర్షిభిః
అవష్టబ్ధం జ్వలత్కుణ్డోపాన్త మన్దరుదత్ప్రజమ్. 33
అగ్నికుణ్డ ప్రవిష్టానాం మన్త్రిణాం భృత్యరోదనైః
రుదత్క్రన్ద ద్దృఢతరమరణ్యమివమారుతైః 34
చితాదీపితవిప్రేన్ద్ర మాంస మాంసల గన్ధయా
జాతనీహారముత్పాత వాత్యయావకరోద్ధతైః. 35
వాతదీర్ఘ వసాగన్ధ దూరానీతఖగోర్జితైః
చక్రైర్వ్యోమాభవచ్ఛన్న భాస్కరం జలదైరివ. 36
వాతోద్ధూత చితావహ్ని ప్రజ్వలద్వ్యోమమణ్డలమ్
ఉడ్డీనాగ్నికణవ్రాత తారాసారదిగన్తరమ్. 37
ప్రమత్తతస్కరక్రన్దద్వేల్లద్బాలకుమారకమ్
సంత్రస్త నాగరాప్రాస్త జీవితాఖ్యమసంస్థితి. 38
అలక్షితగృహం చౌరలుంఠితాఖిల సంచయమ్
త్యక్తపుత్రకలత్రం తన్మరణవ్యగ్రనాగరమ్. 39
తస్మింస్తథా వర్తమానే కష్టే విధివిపర్యయే
అశేష జనతాశేష కల్పాన్త సదృశస్థితౌ. 40
రాజ్యసజ్జనసంపర్క పవిత్రీకృత ధీరధీః
గవలశ్చిన్తయామాస శోకేనాకులచేతనః. 41

అప్పుడు నలువైపుల చితులు, ఆకాశమునందలి తారలవలె వెల్గ, నగరవాసులు ఉచ్చైస్స్వరమున నేడ్వసాగిరి. స్త్రీలు అశ్రుధారల వర్షించుచు, కరుణాస్వరమున విలపించుచు, నేలగూలిరి. ప్రజలు జ్వలించుచున్న అగ్నికుండముల కడ కరుడెంచి బుద్ధిని గోల్పోయిరి. మంత్రులు అగ్నిప్రవేశ మొనర్ప, వారి భృత్యులు రోదింపసాగిరి; వారి అశ్రుధారల అభిషిక్తమై ఆ నగరముకూడ రోదించుచున్నట్లుండెను. అప్పుడు ప్రబలవాయువు వీచి, ప్రధానబ్రాహ్మణుల మాంసగ్రంధమును గొని, ధూళిని లేవదీయ, ఆ పురి తుషారకణములగొని పెనుగాలి వీచుచున్న అడవివలె నుండెను. మాంసవసాగంధమును గొని గాలి చాలదూరమునకు పోసాగెను; మాంసాశులగు పక్షులు లయదెంచి, మేఘములవలె సూర్యుని గప్పుచుండెను. వాయువేగమువలన చితానలములు పైకెగయ ఆకాశమండలము జ్వలించుచున్నట్లుండెను. నిప్పురవ్వలు లేచి ఇటనట పడ నక్షత్రములు నలువైపుల నుండి రాలుచున్నట్లుండెను. నగలను దొంగలించు ఆశతో దొంగలు బాలురనుగొట్ట, వారు భయముతో వణకుచు నేడ్వసాగిరి. నగరవాసులు తొట్రుపడుచు ప్రాణముల త్యజింపసాగిరి. నగరమంతయు నాశనమైపోయెను. అంతయు తగులబడుట వలన ఎచ్చట ఎవ్వరి ఇల్లుండినది గుర్తింప వీలులేకుండెను. చోరులు అందరి సంపత్తిని తమపర మొనర్చుకొనసాగిరి. భార్యాపుత్రుల వదలి,

అందఱు మరణింప తొందరపడుచుండిరి. ఇట్లు అట లోకక్షయమునుగూర్చు కల్పాంతకాలమున అరుదెంచు శోచనీయదశ రాగా, రాజ్యప్రాప్తిని, సజ్జనసంగతిని బొంది పవిత్రుడును ధీరుడును అయిన గవలుడు శోకాతుల చిత్తమున యిట్లు చింతింపసాగెను.

మదర్థేహి కదర్థోఽయం దేశేఽస్మిన్స్థితిమాగతః
అకాలకల్పాన్తమయః సర్వనాయకనాశనః. 42
కింమే జీవితదుఃఖేన మరణం మే మహోత్సవః
లోకనిన్ద్యస్య దుర్జీర్జీవితాన్మరణం వరం. 43
ఇతినిశ్చిత్య గవలో జ్వలితే జ్వలనే పునః
పతఙ్గవదనుద్వేగ మకరోదాహుతిం వపుః. 44

'నా వలననే ఈ దేశమున కకాలప్రళయమును బోలు అనర్థము దాపురిల్లినది; లోక దుఃఖప్రదమగు ఈ జీవనముతో నాకిక ప్రయోజనమేమి? మృత్యువే నాకు పరమశ్రేయము. లోకనిందను గొని జీవించుటకన్న మరణమే మేలు.' అని నిశ్చయించుకొని గవలుడు తన శరీరమును పతంగమువలె అగ్నికాహుతి మొనర్చెను.

తస్మిన్బలాద్గవలనామ్ని హుతాశరాశౌ
దేహే పతత్యవయవాకులతాం ప్రియాతే
స్వాఙ్గావదాహదహనస్ఫురణానురోధా
దన్తర్జలే ఝటితి బోధమవాప గాధిః. 45

గవలుని శరీరమిట్లు అగ్నికాహుతియై దహింపబడుచుండ, జలమధ్యమున అఘమర్షణ సూక్తమును బఠించుచున్న గాధి గాత్రదాహము ననుభవించుచు, తెలివినందెను.

శ్రీ వాల్మీకిరువాచ:—

ఇత్యుక్తవత్యథ మునౌ దివసో జగామ
సాయంతనాయ విధయేఽస్తమినో జగామ,
స్నాతుం సభా కృతనమస్కరణా జగామ
శ్యామాక్షయే రవికరైశ్చ సహ జగామ. 46

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే గాధివృత్తాన్తే రాజ్యభ్రంశోనామ
షట్చత్వారింశః సర్గః ॥ 46 ॥
ద్వాదశో దివసః

వాల్మీకి:—మునిశ్రేష్ఠుడగు వసిష్ఠుడిట్లు పల్కుచుండ సంధ్యయయ్యెను; దివాకరుడు సాయంకృత్య మొనర్ప అస్తాద్రికఱుగ, సభికులు పరస్పర అభివాదన మొనర్చుకొనుచు సంధ్యాస్నాన మొనర్పనరిగిరి. మఱునాడు, సూర్యకిరణములతోగూడ వారు సభకరుదెంచిరి.



ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున గాధివృత్తాంతమున గాధివినాశమను షట్చత్వారింశ సర్గము ॥ 46 ॥
పండ్రెండవ రోజు ॥ 12 ॥

---

## సప్తచత్వారింశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ముహూర్తద్వితయేనాథ గాధిరాధిభవభ్రమాత్
ప్రశశామాకులీభావో వేలావర్త ఇవాంబుధేః. 1

వసిష్ఠుడు:— అనంతరము గాధియొక్క కష్టకరమగు ఆ భ్రాంతి, చెలియలికట్టను దాకు సముద్రతరంగములవలె నిముషములో శాంతిల్లెను.

మనోనిర్మాణసంమోహాత్తస్మాత్స విరరామహ
కల్పాన్తసమయే బ్రహ్మా జగద్విరచనాదివ. 2

ప్రళయకాలము సమీపించిన, సృష్టికార్యమును విరమించు బ్రహ్మవలె గాధి మనోసంకల్పరూపమగు సమ్మోహమునుండి విరతినందెను.

బోధమాప శనైః శాన్తః స్వమేవోన్నిద్రధీరివ
క్షీబతాయాం ప్రశాన్తాయాం యథా పరిణతాశయః. 3

మదమత్తుడగు వ్యక్తి కైపుతగ్గ భ్రమనుండి విడివడునట్లు, గాధి క్రమముగ శాంతుడై నిద్రనుండి మేల్కొనినవానివలె, తన్ను గాధిగ గ్రహించెను. చండాలభ్రాంతి, రాజభ్రాంతి తొలగిపోయెను.

అయం సోహమిదం కార్య మిదం నేతి దదర్శహ
నిశావ్యపగమే లోకో యథా క్షీణే తమఃపటే. 4

నిశావసానమున తిమిరవసనము తొలగ జనులు పదార్థములను చక్కగ గ్రహించునట్లు, గాధి చండాల, రాజకార్యముల భ్రాంతినుండి విడువడి, తన్ను అఘమర్షణ సూక్తమును జపించుచున్న గాధిగ గ్రహించెను.

స్మృతస్వరూపోఽథ పదముద్దధే స జలాన్తరాత్
శిశిరాన్తే ప్రవృత్తాస్యం సరోజమివ మాధవః. 5

శిశిర - ఋతువు గడప, వసంత-ఋతువు ముకుళిత కమలవనమున అడుగిడునట్లు, గాధి నిజస్వరూపమును స్మరించుకొని జలమధ్యమునుండి తీరాభిముఖుడయ్యెను.

ఏతద్వారికకుబ్జోర్వీమవతీం వసుమతీమిమామ్
అన్యామివ పునః పశ్యన్విస్మయం పరమం యయౌ. 6

అప్పుడతడు జల, దిగాకాశమండలములతో బరిదృశ్యమానమగు పృథివిని అన్యరూపముగ దర్శించి విశేషముగా ఆశ్చర్యము నందెను.

కోఽహం కిమివ పశ్యామి కిమకార్షమహం కిల
ఏవం విచారయంశ్చిత్రం సభ్రూభఙ్గమభూత్క్షణమ్. 7

'నేనెవడను? ఏమిగాంచుచున్నాను? ఇంతవఱకేమి యొనర్చితిని?!' అని ఆశ్చర్యముతో కనుబొమ్మలు విరచుచు క్షణకాలము విచారమొనర్పదొడగెను.

భ్రాన్తస్తత్క్షణమాత్రేణ సంభ్రమం దృష్టవానహమ్
ఇతి విజ్ఞాయ సలిలాదుదస్థాదుదయార్కవత్. 8

తుదకు, 'డస్సియుండుటవలన ఈభ్రమనుగాంచితిని' అని స్థిరమొనర్చుకొని, ఉదయాద్రినున్న సూర్యునివలె నీటినుండి లేచెను.

చిన్తయామాస స తతః క్వ సా మాతా క్వ సా ప్రియా
యదాహం మృతిమాయాతో మధ్యే మాతృమహేలయోః. 9

గట్టెక్కి ఇట్లు తలపోయసాగెను. - 'నేను మాతా - మహిళల సమ్ముఖమున మృతినందినప్పుడు వారెక్కడ నుండిరి?

బాలస్య మాతాపితరౌ నష్టౌ కిల మమామతేః
వాతనీతస్య పత్రస్య వల్లీవృక్షమివాసినా. 10

గాలికి గొట్టుకొనిపోయిన ఆకుకు తల్లితండ్రులగు కొమ్మచెట్లు కత్తికిగొట్టబడినట్లు, అజ్ఞానదశయగు శైశవముననే నా తల్లిదండ్రులు మరణించియుండిరి.

అవివాహోఽస్మి జానామి న స్వరూపమపి స్త్రియః
దుష్టాయాః క్షోభకారిణ్యా మదిరాయా ఇవ ద్విజః 11

నేను అవివాహితుడను. బ్రాహ్మణుడు దుష్టమును, క్షోభకరమునునగు సురయొక్క స్వరూపము నెఱుగనట్లు, నేను స్త్రీయొక్క స్వరూపము నే నెఱుగను.

అతిదూరతరీభూతాః స్వదేశస్య స్వబాన్ధవాః
కే నామ మమ యేషాం తే మధ్యే జీవన్త్యజామ్యహమ్. 12

నా బంధువులో, స్వదేశమున చాలదూరముననున్నారు. ఎవరిముందట నేను దేహత్యాగమొనర్చితినో వారెవరు.

తస్మాదేతత్సముద్భూతమహం కిం నామ దృష్టవాన్
వివిధారమ్భ సంరమ్భం గన్ధర్వనగరం యథా. 13

అగుచో, గంధర్వనగరమును బోలు ఈ ఘటనల నేల గాంచితిని?



తదాస్తామేతదేషా హి బన్ధుమధ్యే మృతస్థితిః
మాయామోహే మనాగస్మిన్న సత్యముపలభ్యతే. 14

ఇయ్యది నాభ్రమయై యుండనోపును. బంధువుల నడుమ నామృతి మాయయైయుండును; దీన నేమైన తథ్యమున్నదియు లేనిదియు గ్రహింపజాలకున్నాను.

నిత్యమేవ మనన్తాసు భ్రాన్తిదృష్టిషు దేహినామ్
చేతో భ్రమతి శార్దూలో వనరాజిష్వివోన్మదః. 15

ఉన్మత్తశార్దూలము గంభీరారణ్యమున భ్రమించునట్లు, దేహుల చిత్తముగూడ భ్రాంతిదృష్టుల పరిభ్రమించుచున్నది.

అవధార్యేతి తం చిత్తే మోహం గాధిర్నినాయ సః
దినాని కతిచిత్తస్మిన్నన్వక ఏవాశ్రమే తదా. 16
ఏకదా గాధిమగమత్కశ్చిత్తత్ర ప్రియోఽతిథిః
బ్రహ్మాణమివ దుర్వాసాః స విశశ్రామ సశ్రమః. 17

గాధి ఇట్లా విషయమును చిత్త-మోహముగ పరిగణించి, ఆ ఆశ్రమముననే కొన్నిదినములు గడపెను. అప్పుడు, బ్రహ్మకడకు దూర్వాసునివలె, అతిథియొక్కడాతని కడ కరుదెంచెను. ఆతడు డస్సియుండుట వలన అచ్చట విశ్రాంతిని గొనెను.

పరమాం తుష్టిమానీతః ఫలపుష్పరసాశనైః
సోఽతిథిర్గాధినా తేన వసన్తేనేవ పాదపః. 18

వసంతము ఫలపుష్పరసాదుల నర్పించి వృక్షమునకు దృప్తిని గలిగించునట్లు, గాధి ఫలపుష్పరసముల నొసగి ఆయతిథికి సంతోషమును గూర్చెను.

మిథో వన్దితసంధ్యౌ తౌ కృతజాప్యావుభావపి
క్రమాచ్ఛయనమాసాద్య తస్థతుర్మృదుపల్లవమ్. 19

వారిర్వురు యథావిధి సంధ్యోపాసనా, జపాద్యనుష్ఠానముల నొనర్చి, కోమలపల్లవశయ్యయందుపవిష్టులైరి.

తతః ప్రావర్తతే శాన్తా తయోస్తాపసయోః కథా
స్వవ్యాపారోచితా పుష్పశ్రీరివర్తుత్వమాశయోః. 20

వసంతకాలమున తదనురూప పుష్పలక్ష్మి ఉదయించునట్లు, ఉపవిష్టులగు వారిర్వురకు తపోసంబంధమును, శాంతరసమయమును నగు సంభాషణ జరుగసాగెను.

తం పప్రచ్ఛాతిథిం గాధిః ప్రసఙ్గపతితం వచః
కిం బ్రహ్మన్నుకృశాఙ్గస్త్వం కిమితి శ్రమవానసి. 21

ప్రసంగక్రమమున గాధి అతిథి నిట్లు ప్రశ్నించెను:—'బ్రాహ్మణుడా! మీరింతగ నేల కృశించిరి? మీరింత శ్రమనందితి రేల?'

అతిథి రువాచ:—

మమాతికార్శ్యశ్రమయోర్భగవన్ శృణు కారణమ్
కథయామి తథాభూతం వయం నాసత్యవాదినః. 22

అతిథి:— నా కృశత్వమునకును, శ్రాంతికిని గారణమును వినుము. ఉన్నదున్నట్లు చెప్పుచున్నాను. మే మసత్యవాదులము కాము.

అస్త్యస్మిన్వసుధాపీఠే ఉత్తరాశానికుఞ్జకే
కీరో నామాతివిఖ్యాతః శ్రీమాఞ్జనపదో మహాన్. 23

ఈ భూమండలమున ఉత్తరదిక్కున కీరమని ప్రసిద్ధిగన్న దేశమున్నది.

తత్రాహమవసం మాసం పూజ్యమానః పురే జనైః
నానాత్మస్వాదలోలాత్మా చిత్తవేతాలమోహితః. 24

నేనట, చిత్తబేతాళ మోహితుడనై, తత్పురజన పూజితుడనై, నానావిధ రసద్రవ్య లోభమున ఒకమాస మటనుంటిని.

ఏకదైకేన తత్రోక్తం కథాప్రస్తావతః క్వచిత్
ఇహాభూచ్ఛ్వపచో రాజా వర్షాణ్యష్టౌ ద్విజేతి మే. 25

'ద్విజా! ఈదేశమును ఎనిమిది యేండ్లనుండి ఒక చండాలుడు పాలించుచున్నాడు' అని ఒకదినమున ఒకానొకడు నాకు ప్రసంగక్రమమున జెప్పెను.

తతో గ్రామేషు తత్పృష్టైః ప్రోక్తం సకలజన్తుభిః
రాజా బభూవ శ్వపచో వర్షాణ్యష్టావిహేతి తైః. 26

ఆ మాటవిని నేను తద్గ్రామవాసులగు ఇతరులనడుగ, వారుకూడ 'ఎనిమిది ఏండ్లనుండి చండాలుడు రాజుగనున్నాడు' అని చెప్పిరి.

సోయమస్తే పరిజ్ఞాతః ప్రవిష్టో జ్వలనం జవాత్
తతో ద్విజశతానీహ ప్రవిష్టాని హుతాశనమ్. 27

ఇతి తేషాం ముఖాచ్ఛ్రుత్వా తస్మాన్నిర్గత్య మణ్డలాత్
ప్రయాగేఽకరవం శుద్ధ్యై ప్రాయశ్చిత్తమహం ద్విజ. 28

కృత్వా చాన్ద్రాయణస్యాన్తే తృతీయస్యాద్య పారణమ్
ఇహాహమాగతస్తేన శ్రాన్తోస్మ్యతికృశోస్మి చ. 29

పిదప, రాజీ మాటల విని, అగ్నిప్రవేశ మొనర్చి ప్రాణముల త్యజించినాడనియు, వందల కొలది బ్రాహ్మణులుగూడ అగ్నిప్రవేశ మొనర్చిరనియు వింటిని. విని, అటనుండి ప్రయాగ కరిగి పాపశుద్ధికై, ప్రాయశ్చిత్త మొనర్చుకొంటిని. తృతీయచాంద్రాయణ మొనర్చి నేను పారణ మొనర్చి మీ కడకరుదెంచితిని. అందువలన నేను కృశించి, పరిశ్రాంతుడనైతి'



శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇతి శ్రుతవతా తేన గాధినా స తదా ద్విజః
భూయః పృష్టోఽప్యేతదేవ కథయామాస నాన్యథా. 30

వసిష్ఠుడు:— గాధి ఇట్లు విని, మరల మరల ప్రశ్నించినను బ్రాహ్మణుడు మరల నట్లే పలుకఁ దొడగెను.

అథ విస్మయవాన్గాధిస్తాం నీత్వా తత్ర శర్వరీమ్
జగద్గేహమహాదీపే రవావుదయమాగతే. 31
కృతప్రాతః స్నానవిధావాపృచ్ఛ్య స్వాతిథౌ గతే
ఇదం సంచిన్తయామాస విస్మయోద్ధురయా ధియా. 32

అనంతరము గాధి విస్మయావిష్టుడై అటనా రాత్రి గడపెను. మరునాడు, జగద్గృహ దీపమగు సూర్యుడుదయింప, ఆ అతిథి ప్రాతఃస్నాన మొనరించి, సెలవు పుచ్చుకొనిన పిమ్మట గాధి ఇట్లు చింతింపదొడగెను,

యన్మయా సంభ్రమే దృష్టం సత్యభూతం ద్విజేన తత్
ఉక్తం మమేతి కిం నామ స్యాన్మాయాశంబరక్రమః. 33

'నేను' భ్రాంతిదశయందు గాంచిన దానినే అతిథి సత్యముగ చెప్పినాడు, ఇది గూడ మాయయేనా ?

యద్బన్ధుమధ్యే మరణం మయా తద్దృష్టమాత్మనః
సా మాయైవ న సందేహః శేషం పశ్యామి తస్య తమ్. 34

'నేను' బంధుజన మధ్యమున గాంచిన నామృతి మాయయగుటకు సంశయము లేదు; చండాల మరణానంతరవృత్తాంతమును పరిశీలింతును.

తదాత్మశ్వపచోదన్తం ద్రష్టుం తావదఖిన్నధీః
భూతమణ్డల పర్యన్తగ్రామం గచ్ఛామి సత్వరమ్. 35

నా చండాలత్వప్రాప్తి విషయమును బరికింప, అఖిన్నుడనై భూతమండల గ్రామమునకు సత్వర మేగెదను.'

ఇతి సంచిన్తయన్గన్తుం మండలాన్తరమాదరాత్
ఉత్తస్థౌ భాస్కరః పార్శ్వం మేరోర్ద్రిష్టు మివోద్యతః. 36

ఇట్లు చింతించి, గాధి, సూర్యుడు సుమేరు పర్వత పార్శ్వమును గాంచ బోవునట్లు, లేచెను.

మనోరాజ్యమపి ప్రాజ్ఞా లభన్తే వ్యవసాయినః
గాధినా స్వప్నసందృష్టం గత్వా లబ్ధమఖండితమ్. 37

బుద్ధిమంతులు ప్రయత్నబలమున మనోరాజ్యమును బొందగలిగినట్లు గాధి స్వప్నదృష్ట విషయమును బరికింపుటలో నాశ్చర్య మేమున్నది ?

సర్వమధ్యవసాయేన దుష్ప్రాపమపి లభ్యతే
పశ్యన్గాధిర్జగన్మాయాం ప్రమేయాం కర్తుముద్యతః. 38

ప్రయత్నమువలన బొందజాలని వస్తువెద్దియును లేదు. అందువలన గాధి జగన్మాయను గాంచి, దానిని సంపూర్ణముగ వీక్షింప యత్నింపసాగెను.

వినిర్గత్యాభవన్మార్గే ప్రావృడోఘజవేన సః
దేశానుల్లంఘయామాస బహూన్వాతతురంగవత్. 39
తచ్ఛేద్భృశ నిజాచారం భూతమణ్డలమాగతః
కరభః కణ్టకార్థ్యైకః కారఞ్జమివ కాననమ్. 40

అతడటనుండి వెలువడి వర్షాజల ప్రవాహమువలె అతివేగమున నడువసాగెను. వాతతురంగమగు మేఘమువలె, తొందరగ చాల దేశముల దాటి, కంటకములగోరు ఉష్ట్రము కరంజ వనమును జేరునట్లు, తానుపూర్వము వ్యవహరించిన భూతమండలమును చేరుకొనెను.

తత్ర సంవిత్తిసంతే నైవ సంనివేశేన వై పునః
అపశ్యద్గ్రామకం కంచిద్గన్ధర్వ ఇవ పత్తనమ్. 41

పూర్వమాతని బుద్ధియందగుపడిన గ్రామమును స్మరించుకొని, అతడట్టి గ్రామమునే గాంచెను.

దదర్శ తస్య పర్యన్తే తమేవ శ్వపచాలయమ్
అధస్తాద్భువనస్యేవ పాతాలే నరకవ్రజమ్. 42

ఆ గ్రామశేషమున, భూతలాధోభాగముననున్న పాతాళముననున్న నరకముల బోలు చండాలపల్లిని గాంచెను.

చిత్తచిస్తితవిస్తారం తన్నివేశమయం పరమ్
గన్ధర్వవదసావాత్మ శ్వపచత్వంచ దృష్టవాన్. 43

చండాలజన్మ, తత్స్థానవాసము మున్నగు పూర్వదృష్టఘటనలను స్మరించుకొని, ఆ చిహ్నములన్నియు అచ్చట నుండుట గాంచెను.

తేనైవ సంనివేశేన ప్రాగ్దృష్టం శ్వపచాస్పదమ్
తస్యకామపి వైరాగ్యపదవీమనయన్మనః. 44

చండాలుడై జన్మించి వాసమొనర్చుచున్న స్థానమును గాంచి, అతని మనస్సున వైరాగ్యము పొడమెను.

ప్రావృడాసారలులితం భిత్తిజాతయవాఙ్కురమ్
పర్యస్తచ్ఛాదనార్ధాఙ్గం కించిదాదృష్టతల్పకమ్. 45
దారిద్ర్యం తద్దృఢమివ దౌర్భాగ్యమివ కుడ్యమత్
భగ్నాం[illegible] [illegible]స్థిత్యమి[illegible] ఖణ్డితమ్. 46



గాధిర్దన్తావదలితైర్గవాశ్వమహిషాస్థిభిః
ధవలైర్వ్యాప్తపర్యన్తం సాక్ష్యం కర్తుమివ స్థితైః. 47
భుక్తం పీతం పురా తేన యేషు ఖర్పరకేషు వై
తైరస్పన్దాభ్రసలిలైః పానపూర్ణైరివావృతమ్. 48
తాభిరేవాన్త్రితన్త్రీభిః సంశుష్కాభిర్లతావృతైః
తృష్ణాభిరివ దీర్ఘాభిః పరితః పరివేష్టితమ్. 49
చిరమాలోకయామాస సతదాత్మగృహం జవాత్
ప్రాక్తనం శుష్కశవతాం యాతం దేహమివాత్మవాన్. 50
అతివిస్మయమాతస్థౌ గ్రామకం సముపాయయౌ
ఉల్లంఘ్య మ్లేచ్ఛనగరమార్యదేశమివాధ్వగః. 51

అతని నివాసగృహము వర్షజలమున భగ్నమై నేల గూలి యుండెను. గోడల యవాంకురములు లేచుచుండెను. ఇంటి కప్పు సగము పడిపోయెను. అతడు పరుండు చాపయొక్క ముక్కయొకటి గూడ అతని కనులబడెను. భగ్నావశేషమగు ఆ వాసగృహము, సుదృఢ దరిద్రమువలెను, దౌర్భాగ్యమువలెను, అంగబలరహితుడును, దుష్టుడునునగు చోరుని వలెను, ఖండింపబడిన దుఃస్థితి వలెను నుండెను. గవాశ్వమహిషములు అస్థిపంజరముల దంతములతోడను, పుర్రెల తోడను గూడి, పడియుండెను. అవి అతనిని గాంచుటకొఱకే అట్లు పడియున్నవా అనిపించుచుండెను. అతడు భోజనపానాదుల నొనర్చిన ఖర్పరములు (=చిప్పలు) వాన నీటితో నుండి, పానీయములతో నిండి నలువైపుల పడియున్నట్లుండెను. గవాశ్వాది ప్రాణిసమూహముల నాడులు లతలవలె, ఇంటిని నలువైపుల ఆవరించుకొని యుండెను; అవి చండాలుని తృష్ణ ఆకారమును దాల్చినట్లుండెను. గాధి, శుష్కశవమును, ఆ గృహమును చాలసేపు చూడసాగెను. పాంథుడు మ్లేచ్ఛదేశమును దాటి ఆర్యదేశమున కఱుగునట్లు, గాధి ఆస్థానమును వీడి ఆశ్చర్యముతో గ్రామమును జేరుకొనెను.

తత్రాపృచ్ఛజ్జనం సాధో కచ్చిత్స్మరతి భో భవాన్
ప్రాగ్వృత్తమస్య గ్రామస్య పర్యన్తే శ్వపచక్రమమ్. 52
సర్వాపవహీ ధీమన్తశ్చిరవృత్తమపి స్ఫుటమ్
కరస్థమివ పశ్యన్తి మయేతి సుజనాచ్ఛ్రుతమ్. 53
అత్రశ్వపచమేకాన్తే వాసినం వృద్ధముత్తమమ్
స్మరస్యేనం కిముత భో దుఃఖానామివ దేహకమ్. 54
యది జానాసి భోః సాధో తన్మే కథయ తత్త్వతః
పాన్థసంశయవిచ్ఛేదే మహత్పుణ్యఫలం స్మృతమ్. 55
భూయోభూయ ఇతిగ్రామ్యాః పృష్టా గాధిద్విజన్మనా
అనల్పస్మయ సంరంభ మాఽర్తేనేవ చికిత్సకాః. 56

అటుకేగి ఒకని నిట్లు ప్రశ్నించెను: సాధూ ! ఈ గ్రామపార్శ్వమున నొక చండాలు

దుండెడువాడు. అతని సంగతి నీకు గుర్తున్నదా? బుద్ధిమంతుడు పూర్వప్రసంగతిని కరతలామలకమునగా గాంచునని నేను సాధుజనులకడ వినియుంటిని. రూపెత్తిన దుఃఖమునుబోలు వృద్ధచండాలుడొకడట నుండెడువాడు, ఇదినీకు గుర్తున్నదా? సాధూ! నీకు దెలిసియున్న, నాకతని వృత్తాంతమును యథార్థముగ చెప్పుము. సాంఘుని సంశయము తొలగించిన మహాత్ముణ్యము లభించును. రోగార్తుడు వైద్యుని పట్టుదలతో ప్రశ్నించునట్లు, గాధి గ్రామవాసులను ఇట్లు మాటిమాటికి ప్రశ్నింపసాగెను.

గ్రామ్యా ఊచుః:—

యథా కథయసి బ్రహ్మంస్తత్తథా న తదన్యథా
కటంజనామా శ్వపచ ఇహాభూద్దారుణాకృతిః. 57
పుత్రపౌత్ర సహృద్భృత్య బంధుస్వజన పేటకమ్
యస్యాతివిస్తీర్ణమభూత్పత్రవృందం తరోరివ. 58
యస్య వృద్ధస్య తత్సర్వం కలత్రం మృత్యురాచ్ఛినత్
అద్రేః పుష్పఫలోపేతం దావో వనమివానలః. 59
యస్తతో దేశముత్సృజ్య యయౌ కీరపురాంతరమ్
వర్షాణ్యష్టావనుద్వేగం తత్ర రాజా బభూవ సః. 60
యస్తత్రార్థం పరిజ్ఞాయ జనైర్దూరే నిరాకృతః
యథా రాశిరనర్థస్య యథా గ్రామే విషద్రుమః. 61
తతో జనేఽగ్నిం ప్రవిశత్యాత్మనా యో హుతాశనమ్
ఆర్యతామార్య సంసర్గాదాగతః ప్రవివేశ హ. 62

గ్రామ్యులు: బ్రాహ్మణుడా! నీవు చెప్పునది యథార్థమే. ఇటు కటంజుడను చండాలుడొకడుండెడువాడు. అతని ఆకృతి భయంకరమైయుండెను. వృక్షమున పత్రములవలె, పుత్రపౌత్రసుహృద్బంధు భృత్యులతో గూడిన పెద్ద సంసార మతనికుండెను. పుష్పఫలశోభితమగు పర్వతారణ్యము దావానలదగ్ధ మగునట్లు, వృద్ధాప్యమున అతనికుటుంబము మృత్యుకబళిత మయ్యెను. పిదప నతడు కీరపురమునకరిగి రాజై ఎనిమిదేండ్లు నిరాతంకముగ పాలించెను. అనంతర మచ్చటివారతనిని చండాలునిగ గ్రహించి, గ్రామస్థమగు విషవృక్షమును, అనర్థరాశిని, పరిత్యజించునట్లు పరిత్యజించి, అగ్నిప్రవేశ మొనర్చి ప్రాణములను త్యజించిరి. ఆర్యసంగమున ఆర్యభావమును బొందిన ఆ చండాలుడుగూడ అట్లే ప్రాణములను త్యజించెను.

కింత్వమేవ ప్రయత్నేన శ్వపచం పృచ్ఛసి ప్రభో
కిం తే బంధురసౌ కచ్చిదభవత్త్వం స్వతోఽథవా. 63
ఏవం కథయతో గ్రామ్యాన్గాధిః పృచ్ఛన్పునః పునః
సర్వేషు తత్ర ప్రాంతేషు మాసమేకమువాస సః. 64
యథా తేనానుభూతం తచ్ఛ్వాపచం తత్తథైవ తైః
గ్రామీణైస్సర్వం కథితం పర్యైరేవావఖండితమ్. 65



ప్రభూ! మీరింత కుతూహలముతో ఆ చండాలుని గురించి ప్రశ్నించుచుంటిరేల? అతడు మీకేమగును? మీకేమైన చుట్టరికమున్నదా? అతడు మీవాడా? అని గ్రామస్థులు ప్రశ్నింపసాగిరి. గాధియును అదే విషయమును మాటిమాటికి ప్రశ్నించుచు, గ్రామమున నలువైపుల తిరుగాడుచు అట నొకమాసము గడపెను. అతడు చండాలభావమునందు అనుభవించిన విషయములనే గ్రామస్థులు సరిగ చెప్పుచుండిరి.

అవ్యాహతం సకల భూతముఖాదశేష
దాకర్ణ్య సమ్యగవలోక్య యథానుభూతమ్
గాధిః శశాంకమలవద్ధృదయేఽధిరూఢం
గూఢాకృతిః పరమవిస్మయమాజగామ. 66

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే గాధివృత్తాంతే ప్రత్యక్షావలోకనం నామ సప్తచత్వారింశః సర్గః ॥ 47 ॥

గాధి తానుగాంచిన విషయములనే గ్రామీణుల నోటినుండి విని మిక్కుటమగు ఆశ్చర్యమునందె, చంద్రునియందలి మచ్చవలె ప్రచ్ఛన్నముగ నటనుండెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
గాధివృత్తాంతమున ప్రత్యక్షావలోకనమను
సప్తచత్వారింశ సర్గము ॥ 47 ॥

---

## అష్టచత్వారింశః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

లుఠితం శ్వపచాగారే పునర్విస్మయమాయయా
గాధిర్మనో హి నాయాతి తృప్తిమాశ్చర్యదర్శనే. 1

వసిష్ఠుడు:— గాధి అత్యంతవిస్మయముతో నట తిరుగాడసాగెను. అతని చిత్తమా ఆశ్చర్యమును గాంచియు పరిపూర్ణముగ తృప్తిని గాంచజాలకపోయెను.

తత్రావలోకయామాస స్థానాని సదనాని చ
కల్పక్షోభవివృత్తాని జగన్తీవాంబుజోద్భవః. 2

కమలజుడగు బ్రహ్మ ప్రళయభగ్నములగు జగత్తులను గాంచునట్లు, గాధి అటనుండి వివిధ స్థానములను, భగ్నగృహములను గాంచెను.

ఉవాచ స్వాత్మనైవేదమరణ్యే లుఠితాలయే
శుష్కాస్థిమాలావలితే పిశాచక ఇవ ద్రుమే. 3

శుష్కములగు అస్థిపంజరములతో గూడినదియును, పిశాచములతో నిండినదియును నగు శ్మశానవృక్షమును బోలు ఆస్థానము భగ్నగృహములతో నిండియుండెను. గాధి అటు వాసమొనర్చుచు, ఇట్లు తలపోయసాగెను.

ఇమాస్తా మృత మాతఙ్గదన్తమాలావృతౌ కృతాః
అద్యాపి సంస్థితాః కల్పం ప్రతిమేరుశిఖా ఇవ. 4

గోడనుప్రేలు ఈ గజదంతమాల కల్పాంతమువఱకుండు సుమేరుపర్వతమువలె, నేటికిని నిలచియున్నది.

ఇహ తద్వానరీమాంసం పక్వవంశాఙ్కురైః సహ
భుక్తం పరాసవోన్మత్తైః సహ శ్వపచబన్ధుభిః 5

నేను సురాపానమత్తులగు బంధువులతోగూడి వంశాంకురములతో వానరమాంసమును వండి తినెడివాడను.

ఆలింగ్య శ్వపచశ్యామా మిహ కేసరిచర్మణి
సుప్తమాపీయ మైరేయం తిక్తం గజమదేన చ. 6

ఇచ్చట గజమదము కలపబడిన కల్లునుద్రావి శ్వపచకాంత నాలింగన మొనర్చుకొని సింహచర్మమున శయనించెడువాడను.

కౌలేయక కుటుంబిన్యః పిణ్యాకపలవర్ధితాః
ఇహ బద్ధా వరత్రాభిర్మృతేభ రదకాష్ఠకే. 7

తెలికపిండిని, మాంసమునుదిని బలిసిన కుక్కలజంటలీ గజదంతస్తంభమున చర్మరజ్జువున బంధింపబడెడివి.

ఇహ వారణముక్తానాం తదాసీత్పిఠరత్రయమ్
పినద్ధం మాహిషేణోగ్ర చర్మణాంబుద శోభినా. 8

ఇట పిఠరత్రయప్రమాణమును, గజదంత నిర్మితమును, మేఘవర్ణమహిషచర్మావృతమును నగు గజముక్తాపేటిక యుండెడిది.

స్థలీష్వేతాసు తాస్వత్ర సహ శ్వపచబాలకైః
చిరం విలుఠితం చూతపత్రపుంజే పికైరివ. 9

రసాలపత్రపుంజముల కోకిలలు క్రీడించునట్లు, చండాలబాలురతోగూడి ఈ వనమున ప్రొర్లెడువాడను.

అత్ర తద్బాలనిఃశ్వాస రణద్వంశ ప్రవృత్తవత్
గీతం పీతం శునీరక్తం సాధితా శవభూషితః. 10

నే నిట గానమొనర్ప, తోటి బాలురు పిల్లనగ్రోవి నూదెడువారు; నే నిట శునకరక్తమును ద్రావి, శ్మశాన మాల్యచందనములతో వారి నలంకరించెడువాడను.



అత్ర సార్ధం కుటుమ్బేన జన్యత్రేషు కుటుమ్బినా
నృత్తం తత్కృతమున్నాదం కల్లోలైర్జలధావివ. 11

ఇట వివాహమహోత్సవముల బంధువులతోగూడి నృత్యమొనర్చుచు, సాగరతరంగములవలె గంభీరధ్వనుల నొనర్చెడువాడను.

అత్రోడ్డయనలోలానాం కాకభాసపతత్త్రిణామ్
ధృతానామన్యదాశార్థం గ్రథితం వంశపఞ్జరమ్. 12

ఎగిరిపోయెడు కాకభాసాది పక్షులను బట్టుకొని సాయంభోజనార్థమై, ఇట ప్రేలు పంజరముల నుంచెడువాడను.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఏవం ప్రాయాఃస్మరన్గాధిః ప్రాక్తనీః శ్వపచక్రియాః
విస్మయోత్కమ్పితశిరా ధాతుశ్చేష్టాం పరామృశత్ 13

వసిష్ఠుడు: గాధి ఇట్లు ప్రాక్తనచండాల క్రియలను స్మరించుకొని విస్మయముతో తలనూచుచు, విధాతయొక్క చెయిదముల నాలోచింపదొడగెను.

చచాల తస్మాద్దీర్ఘేణ దేశాత్కాలేన కార్యవిత్
భూతమణ్డలముత్సృజ్య ప్రాపదేశాన్తరం క్రమాత్. 14

చాలదినముల నటుగడపి కార్యవేత్తయగు గాధి, ఆ దేశమును వీడెను; భూతమండలమును వీడి అన్యదేశమున కఱిగెను.

సముల్లంఘ్య నదీశైల మణ్డలారణ్య సంతతిమ్
ఆససాద తుషారాద్రిరత్నం కిలజనాస్పదమ్. 15

నదీశైలరాష్ట్రవనభూములదాటి హిమాలయమునమున్న నొక దేశమున కఱిగెను.

తత్ర ప్రాప మహీపాల నగరం నగసంనిభమ్
జగద్భ్రమణఖిన్నాత్మా స్వర్లోకమివ నారదః. 16

నారదుడు సమస్తజగముల దిరిగి సురపురిని జేరునట్లు, అతడు పర్వతమువలె ఉన్నతములగు ప్రాసాదములతో శోభిల్లు రాజధానిని జేరెను.

అథాత్మనానుభూతాని దృష్టాన్యాసేవితాని చ
స్థానాని నగరే పశ్యన్నప్రచ్ఛ జనమాదృతః. 17

అనంతరమాతడు అనుభవించినవియును, గాంచినవియును, సేవించినవియును నగు స్థానములగాంచి, కుతూహలముతో నటనున్నవారి నిట్లు ప్రశ్నించెను:—

సాధోస్మరసి కించిత్త్వమిహ శ్వపచమీశ్వరమ్
యది జానాసి తత్త్వంమే వర్ణయాశు యథావిధి. 18

'ఇటు చండాలరాజున్న విషయము మీకు జ్ఞాపకమున్నదా? గుర్తున్న నాకద్దానిని ఉన్నదున్నట్లు చెప్పుము.

నాగరా ఊచుః :—

అభూదిహాష్టౌ వర్షాణి శ్వపచో భూమిపో ద్విజ
రాజత్వమర్పితం యస్య నామ మఙ్గలహస్తినా. 19

నగరవాసులు. బ్రాహ్మణుడా! ఇటు చండాలుడొకడు ఎనిమిదేండ్లు రాజ్యమును పాలించెను. మంగళహస్తి అతనికి రాజ్య మొసగెను.

అన్తేచ సంపరిజ్ఞాతః సంప్రవిష్టో హుతాశనమ్
అద్య ద్వాదశ వర్షాణి సమతీతాని తాపస. 20

తాపసీ! చండాలునిగ గ్రహించిన పిమ్మట నాతడు నిప్పునబడి అసువుల వీడెను. ఈ విషయము జరిగి నేటికి పండ్రెండేండ్లు గడచినవి.

యంయం పృచ్ఛత్యసౌ గాధిర్జనం జాతకుతూహలః
తస్యతస్య ముఖాదేవ శృణోత్యాస్వాదయత్యపి. 21

గాధి కుతూహలముతో ప్రశ్నించిన, వారందరును ఇదేవిషయమును జెప్పసాగిరి. అతడును అట్లే జ్ఞప్తికి దెచ్చుకొనసాగెను.

అథాపశ్యత్పురే తస్మిన్నృపం సబలవాహనమ్
దేవం చక్రధరం విష్ణుం మన్దిరాన్నిర్గతం బహిః. 22

చక్రధరుడగు విష్ణువు బలవాహన సమన్వితుడగు రాజై, భవనమునుండి వెలువడుటను గూడ గాంచెను.

స దృష్ట్వా స్థగితాకాశం చలరేణుపయోధరైః
ప్రాక్తనీం రాజతాం స్మృత్వా సమువాచాతివిస్మయః. 23

ధూళిపుంజములను మేఘములతో నాకాశమును గప్పు అతని సైన్యమును గాంచి, తన పూర్వపురాచరికమును జ్ఞప్తికి దెచ్చుకొని, ఆశ్చర్యముతో నిట్లు తలపోయసాగెను:—

ఇమాస్తాః కీరకామిన్యః పద్మగర్భోపమత్వచః
కనకద్రవవర్ణిన్యో లోలనీలోత్పలేక్షణాః. 24

చామరౌఘా ఇమే చన్ద్రకిరసంపిణ్డపాణ్డురాః
స్థిర నిర్ఝర సంకాశాః కాశపుష్పచయా ఇవ. 25

కాన్తాభిరవధూయన్తే బాలవ్యజనరాజయః
ఇమాస్తా వనవల్లీభిర్ధీప్యమానా ఇవర్ధయః. 26

ఇమాస్తా మత్తమాతఙ్గఘటా ఘటితదిక్తటాః
సంకల్పపాదపా మేరోరివ శృఙ్గపరంపరాః. 27



ఏతే తే యమవారీశ కుబేరప్రతిమౌజసః
సామన్తా వాసవస్యేవ లోకపాలా మహీభృతః. 28

ఇమాస్తాః సర్వవస్త్వోఘాః సర్వాభిమతదాస్తతాః
కల్పవృక్షలతాకుఞ్జ సున్దర్యో గృహపఙ్క్తయః. 29

ఇదం తత్కీరజనతా రాజ్యం ప్రాగ్భుక్తమద్య మే
ఆత్మజస్మార్తరాచార ఇవ ప్రత్యక్షతాం గతమ్. 30

'ఇదుగో వీరే, తప్తకాంచన కాంతులగు కీరనృపకామినులు. వీరి శరీరచర్మము కమల మధ్యదళమువలె అత్యంతకోమలము. వీరి నీలోత్పలనయనములు సర్వదా క్రీగంటిచూపులం గదలుచున్నవి. ముద్దగొనునట్టుబడిన చంద్రకిరణములవలె ధవళములగు చామరములు స్థిరభావమందిన నిర్ఝరజలములవలెను, రెల్లుపూవులవలెను ఉన్నవి. వనలత గాలికిగదల పుష్పమంజరుల గుమ్మరించునట్లు, ఈకామినులు క్రొత్తవీవనల వీచుచున్నారు. దీనిని నేను గాంచియుంటిని. దంతాగ్రముల దిక్తటముల భేదింపజాలు ఈ ఏనుగులు, కల్పవృక్షములతో నిండిన మేరుశిఖరములవలె నొప్పుచున్నవి. వీరు, ఇంద్రుని సామంతులగు యమవరుణాదులవలె తేజశ్శాలురగు కీరనృపతి సామంతులు. సర్వవిధములగు ధనధాన్యములతో గూడినవియును, అభిమతవస్తువుల నొసగగల్గినవియును, కల్పలతాకుంజములవలె రమణీయములునగు సౌధపంక్తులు. వీటిని నేను గాంచితిని. వీరు కీరదేశప్రజనులు. ఇయ్యది పూర్వభుక్తమగు నా రాజ్యము. నా పూర్వవృత్తాంతము నేడు ప్రత్యక్షమగుచున్నట్లున్నది.

సత్యం స్వప్న ఇవాయం మే జాగ్రద్భూతః పునః స్థితః
న జానే కింకృతోత్తానా మాయేయం ప్రవిజృమ్భతే. 31

అహోను ఖలు దీర్ఘేణ మనోమోహేన వల్గతా
వైవశ్యముపనీతోఽహం జాలేనేవ శకున్తకః. 32

హా ధిక్కష్టమబద్ధం మే మనో వాసనయా హతమ్
పశ్యతి భ్రమజాలాని వితతాని శిశోరివ. 33

ఏషా హి మాయా మహతీ తేన మే చక్రధారిణా
దర్శితేత్యధునా సాధు మయా స్మృతమఖణ్డితమ్. 34

తదిదానీం తథా యత్నం కరిష్యే గిరికన్దరే
యథా కుసంభ్రమస్యాస్య జానే జన్మ తథా స్థితిమ్. 35

'ఈ విషయములన్నియు నా కడకు జాగ్రద్రూపమున అరుదెంచినవి. ఇయ్యది స్వప్నమువలె అలీకమగుట సత్యము. కాని, ఈ మాయ ఎటునుండి అరుదెంచినదో నే నెఱుగను. ఆశ్చర్యము! ఈ మనోమోహమునబడి, వలలోబడిన పక్షివలె అలసితిని. అహో! ఎంత కష్టము! నా మనస్సు వాసనాహతమై, బోధశూన్యమై, బాలునివలె వివిధకలకల విస్తరించిన మాయను గాంచుచున్నది. చక్రధరుడగు విష్ణువీ మహామాయను నాకు జూపించినాడు. నా కిప్పుడియ్యది సంపూర్ణముగ గుర్తునకు వచ్చుచున్నది. నేనిక గిరిగుహయందుండి, ఈ మాయయొక్క జన్మస్థితుల నెఱుంగ యత్నించెదను.'

ఇతి సంచిన్త్య నగరాద్గాధిస్తస్మాజ్జగామ హ
కన్దరం ప్రాప్య శైలస్య తస్థౌ విశ్రాన్తసింహవత్ 36
తత్ర సంవత్సరం సార్ధం పయశ్చులుక భోజనమ్
తపశ్చక్రే మహాతేజాస్తుష్టయే శార్ఙ్గధన్వనః. 37

అథాస్య పుండరీకాక్షః పయోముూర్తిరుపాయయౌ
ప్రసాదముత్పలశ్యామః శరదీవ మహాహ్రదః. 38
తమాజగామ శైలేన్ద్రకన్దరం ద్విజమన్దిరమ్
పయోధరవదచ్ఛాచ్ఛ చ్ఛవిర్వ్యోమన్యథావసత్ 39

ఇట్లు నిశ్చయ మొనర్చుకొని గాధి ఆ నగరమును వీడి, ఒక గిరిగుహను జేరి విశ్రమించు సింహమువలె నిశ్చలభావమున నుండెను. అట, విష్ణుప్రీత్యర్థము దినమునకొక చేరెడు నీటినిద్రావుచు, ఒక వత్సరము తప మాచరించెను. అనంతరము, ప్రసన్నమూర్తియును, ఉత్పలశ్యాముడును, పుండరీకాక్షుడును నగు భగవంతుడు శరత్కాల సరోవరమువలె గాధికి ప్రసన్నుడయ్యెను. మేఘనిర్మల కాంతియగు భగవానుడా కందరమున, గాధియొక్క వాసస్థానమున కరుదెంచెను.

శ్రీ భగవానువాచ:—

గాధే కచ్చిత్త్వయా దృష్టా మాయా మమ గరీయసీ
దృష్టం త్వయా జగజ్జాలచేష్టితం దైష్టికాత్మకమ్. 40
చిత్తాభిగత ఏతస్మిన్ప్రాప్తే సమ్యగసిద్ధితః
తపో గిరితటే కుర్వన్కిమన్యదభివాఞ్ఛసి. 41

భగవంతుడు:—గాధీ! నీవు నా మహా-మాయను గాంచితివా? దైవికమగు ఈ జగజ్జాలమును నీవు కాంచితివి. వాంఛితమగు మాయను గాంచితివి. మరల, తపమున శుద్ధినంది, ఏమి గోరుచున్నావు?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఏవం వదన్తమాలోక్య హరిం గాధిర్ద్విజోత్తమః
అర్చాం కుసుమపూరేణ పాదయోః పర్యపూరయత్. 42
దత్త్వార్ఘ్యం కీర్ణకుసుమః ప్రణమ్యాశు ప్రదక్షిణైః
విష్ణుమాహ ద్విజో వాక్యమమ్భోదమివ చాతకః. 43

వసిష్ఠుడు; హరి ఇట్లుపల్క, గాధి ఆయనను వీక్షించి పాదములను కుసుమములతో బూజించెను. బ్రాహ్మణుడిట్లు అర్ఘ్య మొసగి, పువ్వులనుజల్లి, చాతకము మేఘమును ప్రార్థించునట్లు విష్ణుని ప్రార్థింపసాగెను.

గాధిరువాచ:—

దేవ మైషా త్వయా మాయా దర్శితాఽతితమోమయీ
మహీం ప్రాతరివాదిత్యస్తాం మే ప్రకటతాం నయ. 44



గాధి: దేవా! సూర్యుడు ప్రాతఃకాలమున పృథివినంతటిని ప్రకాశింపజేయునట్లు, ఈ మాయను గురించి నాకు వివరముగ జెప్పుడు.

భ్రమం యం పశ్యతి మనో వాసనామలమాలితమ్
స్వప్నవత్స కథం దేవ జాగ్రత్యపి హి దృశ్యతే. 45

ప్రభూ! వాసనామలావృతమగు నా మనస్సు దర్శించిన స్వప్నసమభ్రమ జాగ్రదవస్థ యందుగూడ కనుబడుచున్న దేల?

ముహూర్తముపలబ్ధశ్చ జలాన్తః స్వప్నవిభ్రమః
కథం ప్రత్యక్షతాం ప్రాప్తో మమామలపదాస్పద. 46

అమలపదాస్పదా! నీట క్షణకాల మనుభవించిన భ్రమ, మరల ఎట్లు ప్రత్యక్షమైనది?

దైర్ఘ్యాదైర్ఘ్యేఽస్య కాలస్య శరీరస్య భవాభవాః
కథమ న్తస్థితా న స్యుర్మదీయైః శ్వపచభ్రమైః. 47

చండాలభ్రమకలిగిన కాలముయొక్క దీర్ఘతా దీర్ఘతలును, చండాలశరీరముయొక్క ఉత్పత్తివినాశములును నామనస్సుననే ఉండక, మరల బయట కనబడిన వేల?

శ్రీ భగవానువాచ:—

గాధే స్వాధివిఘూతస్య స్వరూపస్యైతదాత్మకమ్
చేతసోఽదృష్టతత్త్వస్య యత్పశ్యత్యురు విభ్రమమ్. 48

భగవంతుడు: గాధీ! నీవు కాంచిన జగద్రూపమహాభ్రమ, వాసనాక్రాంతమును తత్త్వదర్శనాసమర్థమును, చిత్తభావాపన్నమునునగు ఆత్మస్వరూపముయొక్క రూపమని గ్రహింపుము.

బహిర్న కించిదప్యస్తి ఖాద్ర్యబ్ధ్యుర్వీదిగాదికమ్
ఏతత్స్వచిత్త ఏవాస్తి పత్రపుఞ్జమివాఙ్కురే. 49

ఆకాశము, పర్వతములు పృథివి, దిక్కులు మున్నగునవి బయటలేవు. అంకురమునందలి పత్రపుంజములవలె చిత్తముననేయున్నవి.

ఫలాది స్ఫారతామేతి యథైవ బహిరఙ్కురాత్
బహిః ప్రకటతాం యాతి తథా పృథ్వ్యాది చేతసః. 50

అంకురమునుండి వెలువడి వృక్షపత్రాదులు బయట తమరూపమును దాల్చునట్లు పృథ్వ్యాది పదార్థములు చిత్తమునుండి వెలువడి బయట ప్రకాశించుచున్నవి.

సత్యం పృథ్వ్యాది చిత్తస్థం న బహిస్థం కదాచన
అఙ్కురస్థః పల్లవస్తు తస్మాద్యస్మాత్ఫలశ్రియః. 51

వాస్తవమునకు పృథ్వ్యాదులు చిత్తముననే యున్నవి; బయట నెన్నడును లేవు. అంకురమునసున్న పల్లవమే వృక్షపత్రఫలగంధదుల రూపును గొనుచున్నది.

రూపాలోకమనస్కార తత్తాకాలక్రియాత్మకమ్
కుమ్భకారో ఘటమివ చేతో హ స్తి కరోతిచ. 52

చక్షురాది ఇంద్రియముల దర్శనస్పర్శనాది క్రియలును, మనస్సుయొక్క భవిష్యచ్చింత, త్రికాలములు, తిత్ప్రకాశకులగు సూర్యచంద్రాదుల క్రియలు మున్నగునవి, కుంభకారుని ఘటనిర్మాణమువలె చిత్తనిర్మితములు. మరల చిత్తమే నీటి నుపసంహరించుచున్నది.

ఆబాల మేతత్పురుషైః సర్వైరేవానుభూయతే
స్వప్నభ్రమమదావేగ రాగరోగాదదృష్టిషు. 53

స్వప్న, భ్రాంతి, మద, ఆవేగ, అనురాగ, రోగాది సమయముల, ఆబాలవృద్ధుల కీవిషయము అనుభూతమగుచున్నది.

చిత్తే వృత్తాన్తలక్షాణి సంస్థితాన్యాత్తవాసనే
పాదపే ఫలపుష్పాణి మూలాక్రాన్తావనావివ. 54

మూలదేశమున భూమి నాక్రమించియున్న వృక్షమున లెక్కకుమించిన ఫలపుష్పములుండునట్లు, అధిష్ఠానమును, సత్పదార్థమును నగు బ్రహ్మము నవలంబించియున్న వాసనామయ చిత్తమున నే లక్షలకొలదిగ ఘటనలు వెలయుచున్నవి.

త్యక్త్వావనేర్విటపినో భూయ పత్రాణినో యథా
నిర్వాసనస్య జీవస్య పునర్జన్మాదినో తథా. 55

భూతలమునుండి పెకలింపబడిన వృక్షమున పత్రాదులు పొడమునట్లు, వాసనావిముక్తుడగు జీవునకు జన్మాదులు కలుగవు.

యత్రానన్త జగజ్జాలం సంస్థితం తేన తేజసా
శ్వపచత్వం ప్రకటితం యదితద్విస్మయోఽత్ర కిమ్. 56

అనంతజగజ్జాలము లిమిడియున్న ఈ వాసనామయ ప్రపంచముననే చండాలభావము ప్రకటితమైనది. దీన నాశ్చర్యమేమున్నది.

అవబద్ధా శ్వపచతా ప్రతిభాసవశాత్త్వయా
యథైవానల్పసంరమ్భా విచిత్రాధివికారదా. 57
తథైవాతిథిరాయాతో భుక్తవాన్పృష్టవాన్ద్విజః
కథాం కథితవాంశ్చేతి దృష్టవానసి సంభ్రమమ్. 58

నీవు ఈ వాసనాప్రతిభాసవలన మనోవ్యథాప్రదమును, అనల్పసంరంభమునునగు విచిత్రచండాలభావమును అనుభవించినట్లే, అతిథివచ్చుట, భుజించుట, మాట్లాడుట మున్నగునవికూడ అనుభవించితివి. ఈ రెండును గూడ భ్రాంతులే.

తథైవోత్థాయ గచ్ఛామి ప్రాప్తోఽహం భూతమణ్డలమ్
ఇమేభూత ఇమేగ్రామ దృష్టవానసి సంభ్రమమ్. 59



అట్లే, 'లేచి ఆటకతిగెదను, ఈ దేశమును సమీపించితిని, ఈ గ్రామములు' మున్నగువానిని గూడ అనుభవించితివి.

తథైవేదం కటంజస్య ప్రాక్తనం లుఠితం గృహమ్
జనైరుక్తం కటంజస్య దృష్టవానసి సంభ్రమమ్. 60

జనులు, నీ 'కియ్యది కటంజుని పురాతన భగ్నగృహము' అని నుడువుట గూడ భ్రమయే.

తథైవ కీరనగరం ప్రాప్తోఽస్మి కథితంచ మే
కీరైః శ్వపచరాజత్వం దృష్టవానసి సంభ్రమమ్. 61

'కీరనగరమున కటిగితిని, తద్దేశీయులు నాకు చండాలరాజు సంగతిని జెప్పిరి' అను విషయము గూడ నీ మనోభ్రమయే.

ఏవం సర్వం త్వయా దృష్టం మోహజాలం ద్విజోత్తమ
యత్సత్యమితి జానాసి యచ్చాసత్యమవైషి చ. 62

ద్విజోత్తమా ! నీ వెద్దానిని సత్యమని తలపోయుచుంటివో, నీ వెద్దానిని అసత్యమని ఎంచుచుంటివో, నీ వెద్దానిని గాంచితివో అదంతయు మోహసమూహమని గ్రహింపుము

వాసనావలితం చేతః కిం నామాన్తర్న పశ్యతి
సాధితం దృశ్యతే స్వప్నే వర్షసాధ్యం ప్రయోజనం. 63

వాసనాక్రాంతమగు చిత్త మంతరమున దర్శింపని దేమున్నది ? అసాధ్యమగు విషయము గూడ స్వప్నమున సాధింపబడుచున్నది.

నాతిథిర్న చ భూతాస్తే న కీరాస్తేన తత్పురం
సర్వమేతన్మహాబుద్ధే వ్యామోహాద్దృష్టవానసి. 64

ఆ అతిథి, ఆ చండాలురు, ఆ కీరదేశీయులు, రాజధాని —— మిథ్యలు. మహాబుద్ధీ ! నీవు మోహవశమున దీనినంతటిని గాంచితివి.

గచ్ఛతా భవతా భూతదేశం పాన్థేన కన్దరే
కస్మింశ్చిద్విప్ర విశ్రాన్తం కురఙ్గేణేవ కాననే. 65
తత్రైవశ్రమమూర్ఛత్వాదిదం తద్భూత మణ్డలమ్
ఇదం తచ్ఛ్వపచాగారమితి దృష్టం న సత్యతః. 66

విప్రా ! నీవు పథికుడవై భూతమండలమున కరుగుచు అరణ్యమధ్యమున కురంగమువలె పోకానొక గుహయందు విశ్రమించి, డస్సియుండుటవలన భూతమండల, చండాల, భవనాదులను గాంచియుంటివి. అవి సత్యములు కావు.

తథైవ కీరనగరం దృష్టవానసి తత్తథా
తథైవ చాన్యదా వాపిమాయార్థం హి భవాన్ద్విజ. 67
సర్వదైవ సమగ్రాసు విహరన్నసి దృష్టవాన్
దిక్షుస్రోన్మత్తక ఇవ విభ్రమం మనసా మునే 68

తదుత్తిష్ఠ నిజం కర్మ కుర్వంస్తిష్ఠోపశాన్తధీః
న స్వకర్మ వినా శ్రేయః ప్రాప్నువన్తీహ మానవాః. 69

ద్విజా, నీవు దర్శించిన కీరనగరముకూడ మాయామయమే. మునీ! నీవు నాలుగు నైపుల పరిభ్రమింతువు, మనస్సుననే పిచ్చివానివలె ఈ భ్రమను గాంచితివి. లెమ్ము! శాంతుడవై ఆశ్రమోచితములగు స్వాధ్యాయాగ్నిహోత్రాది కర్మల నాచరింపుము. ఇహలోకమున కర్మశూన్యులై మనుష్యులు శ్రేయము నందజాలరు.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇతిగదితవాన్స పద్మనాభో
భువనగతాపసవృన్దపూజ్యమానః
విబుధమునిగణైః పవిత్రహస్తై
ర్వృత ఉదధిం నిజమాస్పదం జగామ. 70

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
గాధివృత్తాన్తే మాయామహత్త్వకథనం నామాష్టచత్వారింశః
సర్గః ॥ 48 ॥

వసిష్ఠుడు: తాపసుల కందఱికిని పూజ్యుడగు ఆ పద్మనాభుడిట్లు ఉపదేశించి, (భగవచ్చరణ సేవాస్పర్శాదుల) పవిత్రహస్తులగు దేవతలతోడను, మునులతోడను గూడి నిజవాస భూమియగు క్షీరసాగరమునకు బయనమయ్యెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
గాధివృత్తాంతమున మాయామహత్త్వకథనమను అష్టచత్వారింశ
సర్గము ॥ 48 ॥

---

## ఏకోనపఞ్చాశః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అథ గాధిర్గతే విష్ణౌ పునర్భూతాదికం క్రమాత్
స్వయం మోహవిచారార్థం బభ్రామాభ్రమివామ్బరే. 1

శ్రీ వసిష్ఠుడు:- విష్ణువంతర్ధానమైన పిదప గాధి తనను గల్గిన మహామోహమును విచారించుటకై (అనగా అతిథి, భూతమండలాదులు యథార్థముగ గలవో, లేవో పరీక్షించుటకు) ఆత్మసాక్షాత్కారము బొందకయే భూతమండలాది దేశములందు, ఆకాశమునందు మేఘమువలె, సంచరించెను.



ఉపలభ్య తథైవాత్మవృత్తాన్తం జనతస్తతః
హరిమారాధయామాస పునరద్రిగుహాం గతః. 2

అచ్చోటను తన చండాలత్వాది వృత్తాంతమంతయును జనులవలన గ్రహించినవాడై గిరిగుహయందు ప్రవేశించి మరల విష్ణుభగవానుని యారాధింప దొడగెను.

ఆజగామైన మల్పేన కాలేనాథ జనార్దనః
సకృదారాధనేనైవ మాధవో యాతి బన్ధుతామ్. 3

అటు పిమ్మట యల్పకాలముననే భగవంతుడగు జనార్దనుడు వాని చెంతకు వచ్చెను. ఏలన, ఒక్కపర్యాయము నారాధించుటచేతనే విష్ణుదేవుడు బంధువగును.

ఉవాచ గాధిం భగవాన్మయూరమివ వారిదః.
కిం త్వం ప్రార్థయసే భూయస్తపసేతి ప్రసాదవాన్. 4

విష్ణుభగవానుడంత ప్రసన్నుడై, మయూరముతో మేఘము బల్కువిధమున, 'మరల యీ తపంబుచే నేమి వాంఛించుచుంటివి'ని గాధితో ననెను.

గాధిరువాచ :—

భ్రాన్తోఽస్మి దేవ షణ్మాసాన్భూత కీరజనాస్పదమ్
తత్ర వ్యభిచరత్యస్మద్వృత్తాన్తో న కథాస్వపి. 5
మాయయా భూతభర్తృప్తా త్వయేత్యుక్తోఽస్మి కిం ప్రభో
మోహనాశాయ మహతాం వచో నో మోహవృద్ధయే. 6

గాధిః — దేవా! ఆఱునెలలవఱకు నేను కీరభూతమండల దేశములందు సంచరించితిని; కాని నన్నుగూర్చిన కథాసమాచారములందేలాటి మార్పును లేకుండెను. ప్రభూ! భూతమండలదేశమును మాయచే నీవు గాంచితివని తాము సెలవిచ్చిరి. అట్లైన నో దేవా! మాయాసేకమున గన్పట్టు పదార్థము తప్పక దేశకాలాంతరములందు మార్పును బొందునుగదా! కాని ఇయ్యది ఎప్పటియట్లే యుండినందున నా మోహము మఱింత యధికమయ్యెను. మహాత్ముల వచనములు మోహమును నశింప జేయునేగాని వృద్ధినొందింపవుగదా!

శ్రీ భగవానువాచ :—

కాకతాలీయయోగేన చేతసి శ్వపచస్థితిః
సర్వేషాం భూతకీరాణాం తవేవ ప్రతిబిమ్బతి. 7
తేనాజ్ఞం తవ వృత్తాన్తం యథావత్కథయన్తి తే
ప్రతిభాసోహి నాయాతి పునరప్రతిభాసతామ్. 8

శ్రీభగవానుడు:— ఓ బ్రహ్మణోత్తమా! కాకతాలీయన్యాయముచే భూతమండల కీరదేశవాసులందఱి చిత్తమునను కటంజాని చండాలత్వస్థితి నీయందువలెనే భాసించెను. అం [illegible] వారు నీవృత్తాంతమును యథారూపమున వచింపగల్గిరి. సమూహమునకుగాని, లేక వ్యక్తికిగా

ని ఎయ్యది మిథ్యారూపమున ప్రతిభాసించునో, అజ్ఞాని అప్రభాసత్వము బాధింపబడిన వప్పు పుటల యొన్నటికిని గలుగనేరదు.

కేనచిచ్ఛ్వపచేనాస్తే గ్రామస్య రచితం గృహమ్
తత్త్వయా దృష్టమావిష్టమిష్టకాఖణ్డతాం గతమ్. 9

గ్రామసమీపమున ఒకానొక చాండాలుడు గృహము నిర్మించుకొనెను. శిథిలమైనట్టి యాగృహమునుజూచి దానిని నేనేనిర్మించితినని నీవనుకొంటివి.

కదాచిత్ప్రతిభైకైవ బహూనామపి జాయతే
కాకోల తాలస్థితివద్విచిత్రా హి మనోగతిః. 10

పక్వతాళఫలములపై కాకోల (ద్రోణ) మను కాకసమూహముండియు నుండునట్లు ఒకొక్కప్పుడు పలువుర కొకేవిధమగు భ్రాంతియు గలుగవచ్చును. ఏలన, మనోగతి అతివిచిత్రమైనదిగదా!

తథాహి బహవః స్వప్నమేకం పశ్యన్తి మానవాః
స్వాపభ్రమదమైరేయ మదమన్థర చిత్తవత్. 11

నిద్రా, భ్రమ, మద్యపానాదులందు దిక్కులన్నియు తిరుగునట్లు గాంచబడువిధమున, పలువురొకే స్వప్నమున్ను గాంచగల్గుదురు.

ఏకస్యామేవ లీలాయాం రమన్తే బహుబాలకాః
ఏకస్యామేవ నీలాయాం వనస్థల్యామివైణకాః. 12

తృణయుక్తమగు యొకే వనస్థలమున పెక్కు హరిణపోతంబులు చరించుచున్నవిగదా! అట్లనే యొకే ఆటయందు పలువురు బాలురున్ను క్రీడించుచున్నారుగదా!

బహవస్తుల్యకాలం చ ప్రతిభాసేన కర్మణామ్
జనా యతన్తే స్వఫలపాకేఽతి బహులాకృతౌ. 13

తమతమ ప్రారబ్ధమునననుసరించి వధ, బంధన, పరాజయ, పలాయనాది వివిధకార్యములు సైనికులకు ప్రాప్తించినను, ఒకేకాలమందు జయలాభానుభవమును తుల్యకర్మ భ్రాంతితో ప్రతిభాసించుటచే, అట్టి జయలాభమునకై యుద్ధాదులచే వారు యత్నిమొనర్చుట [illegible]

ప్రతిబన్ధాభ్యనుజ్ఞానాం కాలో దాతేతి యా శ్రుతిః
విప్ర సంకల్పమాత్రోఽసౌ కాలో హ్యాత్మని తిష్ఠతి. 14

ఓ బ్రాహ్మణోత్తమా! హేమంతకాలము వ్రీహ్యాదిధాన్యము లంకురించుటకు ప్రతిబంధకమనియు గోధూమాది ధాన్యములకు అనుకూలమనియు ఇట్లు వచించుట కేవలము సంకల్పమాత్రమే యగును. అఖండ పరమాత్మరూపమగు కాలము తన యాత్మయందే స్థితిగల్గియున్నది. అది దేనికిని ప్రతిబంధకముగాని, ఉత్పాదకముగాని కానేరదు.

అమూర్తో భగవాన్కాలో బ్రహ్మైవ తమజం విదుః
న జహాతి న చాదత్తే కించిత్కస్య కదేతి చ. 15



కాలస్వరూపుడగు భగవంతుడు రూపరహితుడు; అఖండుడు. వానినే యజుడగు బ్రహ్మమని పెద్దలు వక్కాణింతురు.

లౌకికో యత్స్వయం కాలో వర్షకల్పయుగాత్మకః
సంకల్ప్యతే పదార్థౌఘైః పదార్థౌఘశ్చ తేన తు. 16

సంవత్సర, యుగ, కల్పాదిరూపమగు కాలము సూర్యచంద్రాదులచే కల్పితమైనది. మఱియు నిట్టి ప్రతిబంధక, ఉత్పాదకరూపమగు కాలముచే పదార్థజాతమంతయును ప్రకల్పితమైనది.

సమానప్రతిభాసోత్థ సంభ్రమం భ్రాన్తచేతసః
తథాతం దృష్టవన్తస్తే భూతకీరజనోచ్ఛ్రయాః. 17

భ్రాంతచిత్తులగు జీవులు, సమానప్రతిభాసముచే నుదయించు యొకే సంభ్రమమును గాంచువిధమున, కీరదేశీయులు చండాలుడు రాజగుటనున్ను గాంచిరి.

సవ్యాపారపరో భూత్వా ధియాత్మానం విచారయ
సాధో గతమనోమోహ మిహైవాస్స్వ వ్రజామ్యహమ్. 18

ఓ సాధూ! స్వవర్ణాశ్రమాచార పరాయణుఁడవై, మనోమోహ రహితుఁడవై, స్వబుద్ధిచే ఆత్మవిచారణ గావించుచు నీవిచటనే యుండుము; నేను వెడలుచున్నాను.

ఇత్యుక్త్వా భగవాన్విష్ణుర్జగామాన్తర్ధిమీశ్వరః
అతిష్ఠత్కన్దరే గాధిరాధిపీవరయా ధియా. 19

ఇట్లు వచించి విష్ణుభగవానుఁడంతర్ధానమయ్యెను. గాధియు మోహమను మానసికవ్యాధిచే, ఇంకను స్థూలమైనట్టి బుద్ధితో గూడి ఆగుహయందే యుండెను.

తతః కతిపయేష్వత్ర మాసేష్వతిగతేషు సః
పునరారాధయామాస పుణ్డరీకకరం ద్విజః. 20

పిదప కొన్నిమాసములు గడచినవెనుక యాపర్వతముపైననే కమలహస్తుఁడగు విష్ణుభగవానుని మఱల యాతడారాధింపదొడఁగెను.

దదర్శ చైకదా నాథమాగతం ప్రణనామ తమ్
పూజయామాస మనసా చోక్తేనోవాచ చేశ్వరమ్. 21

ఒకపుడు తనచెంతకు ప్రభువరుదెంచుటఁగాంచి ప్రణామమాచరించి మనోవాక్కాయములచే వానిని లెస్సగ బూజించి, అనుజ్ఞవడసి యిట్లనెను.

గాధిరువాచ:—

భగవన్సంస్మరంశ్చిత్తామాత్మనః శ్వపచస్థితిమ్
ఇమాం సంసారమాయాం చ పరిముహ్యామి చేతసా. 22
తదుక్త్వాస్వ యథావస్తు మహామోహనివృత్తయే
ఏకస్మిన్నేవ విమలే మాం నియోజయ కర్మణి. 23

గాధి!—దేవా! నా యీ చండాలస్థితిని, జననమరణాద్యనేక యనర్థములచే పూర్ణమైనట్టి ఈసాంసారిక మాయను, స్మరించుటచే నేను నాచిత్తమున విమోహితుఁడనగుచుంటి. ఇక్కారణమున నో దేవా! ఏతన్మహామోహనివృత్త్యర్థ ముపాయము మాత్రము వచించి నెడలక మోహనివృత్తిపర్యంత మిట నేయుండి నన్నే దైనయొక పవిత్రకార్యమున నియోగింపవేడెద.

శ్రీ భగవానువాచ :—

బ్రహ్మన్ జగదిదం మాయా మహాశమ్బరడమ్బరమ్
సర్వా ఆశ్చర్యకలనాః సంభవన్తీహ విస్మృతేః. 24

శ్రీభగవానుడు:—ఓ విప్రవర్యా! మహాశంబరాసురుని యాడంబరమువలె ఈ జగత్తు మాయామయమైనది. మఱియు ఆత్మతత్త్వవిస్మరణముచే ఆశ్చర్యమయమగు కల్పనయంతయు నుద్భవించుచున్నది.

భూత కీరపురే మోహాద్దృష్టవాంస్తత్తథాభవాన్
ఇత్యేతత్సంభవత్యేవ దృశ్యతే హి జనైర్భ్రమః. 25

భూతమండల, కీరదేశములందు నీవు మోహవశమున గాంచిన చండాలాదుల వృత్తాంత మజ్ఞానముచే సంభవమేయగును. ఏలన, అసంభవమైనను స్వప్నాదులందు భ్రమ మనుజులకు గన్పట్టుచున్నది గదా!

భూతాస్త్వమివ కీరాచ్చ దృష్టవన్తస్తథా భ్రమమ్
ముధైవేత్యపి సత్యాభం సమకాలాది సంభవాత్. 26

భూత, కీరదేశీయులు నీవలెనే భ్రమను గాంచిరి. అట్టి భ్రమమిథ్యయైనను ఏకకాలమున సంభవించుటచే సత్యముగ గన్పట్టినది.

ఇదంతు శృణు వక్ష్యామి యథాభూతమనిన్దితమ్
యథైతి తనుతాం చిన్తా మార్గశీర్షలతేవ తే. 27

యథార్థమును, అనిందితమునగు నీవృత్తాంతమంతయు నిపుడు చెప్పబోవుచున్నాను, వినుము. దీనిని వినిన, మార్గశీర్షమందలి లతవలె నీచింత వినాశమొందగలదు.

యోఽసౌ కటంజకో నామ శ్వపచో భూతమణ్డలే
తేనైన సంనివేశేన స తథైవాభవత్పురా. 28
తథైవ వికలత్రత్వం ప్రాప్య దేశాన్తరం గతః
బభూవ కీరనృపతిః ప్రవివేశానలం తతః. 29
భవతః కేవలం చిత్తే జలాన్తర్వర్తినస్తదా
ప్రతిభాతా తథాభూతా కటంజాచారసంస్థితిః. 30

ఈ కటంజుడను చండాలుడు, యిపుడు నీచే గాంచబడిన శరీర, గ్రామ, గృహాదులతో గూడియే పూర్వము భూతమండలమున [illegible]ంచియుండెను. అతడట్లనే కుటుంబరహితుడై మఱి



యొక దేశమునకుబోయి కీరదేశమునకు ప్రభువయ్యెను. అనంతరము చండాలుడని తెలిసికొనబడుటచే యాతడగ్నిప్రవేశము గావించెను. జలమందు నీవఘమర్షణము జపించుచుండ మత్సంకల్పవశమున కటంజ చండాలుని స్థితి నీ యంతఃకరణమున భాసింప, 'అతడే నేనని భ్రాంతిచే నీవు తలంచితివి.'

ద్రష్టానుభూతమప్యర్థం కదాచిద్విస్మరత్యలమ్
కదాచిదప్యదృష్టం తు చేతః పశ్యతి దృష్టవత్. 31

తాను చూచినది, అనుభవించినది కూడ చిత్తమొకపుడు మఱచునట్లు చూడనిదికూడ …కపుడది గాంచగలదు.

యథా స్వప్నమనోరాజ్యధాతు సంస్థితి విభ్రమాః
జాగ్రత్యపి తథైవాజ్ఞ దృశ్యన్తే మనసా స్వయమ్. 32

స్వప్న, మనోరాజ్య సన్నిపాతాదులందు భ్రమలఁగాంచు విధమున, జాగ్రత్తునందును యీ మనస్సు స్వయముగ భ్రమను వీక్షింపగలదు.

భవిష్యద్భూతకాలస్థం యథా త్రైకాల్యదర్శినః
ప్రతి భామేతి గాధే యత్కటంజాచరితం తథా. 33

ఓ గాధీ! త్రికాలజ్ఞుడగు యోగియొక్క దృష్టియందు భవిష్యత్కాలమందలి సమస్తమును భూతకాలస్థమే యగునట్లు, గడచినదైనను కటంజుని చారిత్రము వర్తమానకాలిక బుద్ధియందు గన్పట్టుచున్నది.

అయం సోఽహమిదం తన్మ ఇతి మజ్జతి నాత్మవాన్
అయం సోఽహమిదం తన్మ ఇతి మజ్జత్యనాత్మవాన్. 34

'ఈశరీరాదులు నేను' 'ఈకుటుంబాదులు నావి' మన్నగు భ్రమలందు జ్ఞాని మగ్నుఁడు గాకయుండును; అజ్ఞానివానియందే నిమగ్నుఁడగును.

సర్వమేవాహమేవేతి తత్త్వజ్ఞో నావసీదతి
న గృహ్ణాతి పదార్థేషు విభాగానర్థ భావనమ్. 35

సర్వాహంభావము (సమస్తమును ఆత్మరూపముగ గాంచుట) గల్గియు తత్త్వజ్ఞాని పదార్థములందు మగ్నుఁడుగాకయుండును. పదార్థవిభాగముచే గల్గు అనర్థభావనాతిదెన్నఁటికి గ్రహింపకయుండును. ఏలన, పరిచ్ఛిన్న పదార్థములందలి అహంభావనయే బంధమునకు కారణమగును.

తేనాసౌ భ్రమయోగేషు సుఖదుఃఖవిలాసిషు
న నిమజ్జతి మగ్నోఽపి తుమ్బీపాత్రమివామ్భసి. 36

ఇక్కారణముననే భ్రమలందును, సుఖదుఃఖవిలాసములందును తగుల్కొనియున్నను తుంబీపాత్ర (సొరకాయబుఱ్ఱ) నీటియందు మునుగనిచందమున, తత్త్వజ్ఞుడందు నిమగ్నుడుగాక యుండును.

త్వం తావద్వాసనాజాలగ్రస్తచిత్తో విచేతనః
కించిచ్ఛేషమహావ్యాధిరివ న స్వస్థమాగతః. 37

వాసనాజాలగ్రస్తుఁడవును, విచేతసుడవును నైనందున అజ్ఞానమను మహావ్యాధి నీయందింకను కొంచెము శేషించియున్నది. అందుచే ఆత్మస్వరూపమును నీవు పూర్ణముగ పొందకయున్నావు.

జ్ఞానస్యాపరిపూర్ణత్వాన్న శక్నోషి మనోభ్రమమ్
వినివారయితుం మేఘమసమ్యగ్యత్నవానివ. 38

స్వగృహనిర్మాణమున గాని అన్యగృహప్రవేశమందు గాని యత్నశీలుడు కానివాడు వృష్టిబాధనుండి తప్పించుకొనజాలని విధమున, పూర్ణజ్ఞానములేని నీవు చిత్తభ్రమను నివారింపజాలకున్నావు.

యదేవ తే మనోమాత్రే సహసా ప్రతిభాసతే
తరురుచ్ఛ్రజనేనేవ తేనైవాక్రమ్యసే క్షణాత్. 39

ఎత్తగు మనుజునిచే వృక్షము వశీకృతమగునట్లు నీ చిత్తమున ఏయ్యది భాసించునో అద్దానియందలి యభిమానముచే, వెంటనే దానికి వశీభూతుఁడవగుచున్నావు.

చిత్తం నాభిః కిలాస్యేహ మాయాచక్రస్య సర్వతః
స్థీయతే చేత్తదాక్రమ్య తన్న కించిత్ప్రబాధతే. 40

నలువైపుల విస్తరించియున్న ఈ మాయాచక్రముయొక్క నాభిస్థానము చిత్తమే. అట్టి చిత్తము నెవరు యెదుర్కొని ఆత్మయందు లయింపజేసి రహితమొనర్చుదురో, వారి నిక ఆ మాయాచక్రమేమియు బాధింపకుండును.

త్వముత్తిష్ఠ గిరేః కుఞ్జే దశవర్షాణ్యఖిన్నధీః
తపః కురు తతో జ్ఞానమనన్తం సమవాప్స్యసి. 41

ఓ గాధీ! నీవిక లెమ్ము. ఈ పర్వత నికుంజమున మనోనిరోధరూపమగు తపంబును పదివత్సరములాచరింపుము. అపుడు నీవనంత జ్ఞానమును పొందెదవు.

ఇత్యుక్త్వా పుణ్డరీకాక్షస్తత్రైవాన్తరధీయత
వాతాభ్రవద్దీపకవద్యమునోర్మిడవత్క్షణాత్. 42

ఇట్లని విష్ణుభగవానుడచ్చోటనే, వాయువునందు లీనమైన మేఘమువలెను, ఆరిన దీపమువలెను, యమునానదీతరంగమువలెను క్షణములో నంతర్ధాన మొందెను.

గాధిర్వివేకవశజం వైరాగ్యపదమాగతః
శరత్సమయపర్యన్తే వైరస్యమివ పాదపః. 43

శరదృత్వంతమున వృక్షము నీరసత్వము నొందునట్లు వివేకవశమున గాధి వైరాగ్యము నొందెను.



విచిత్రం చేష్టితం ధాతురసమజ్ఞ సమాగతమ్
భ్రమద్భ్రమభరోన్ముక్తమతిర్గ్లస్త మగర్హయత్. 44

భ్రమవినిర్ముక్తచేతసుఁడగు గాధి యంత తన పూర్వకాలాయోగ్యమగు చండాలాది భావప్రదర్శనరూపమైన విచిత్ర దైవగతిని మెల్లగ నిందించెను.

జగామ కరుణార్ద్రాత్మా నియమాయోత్తమశ్రియే
విశ్రాన్త్యై ఋష్యమూకం తు పయోధర ఇవాచలమ్. 45

విశ్రమించు నిమిత్తము మేఘము పర్వతముపైకి జనునట్లు, ఉత్తమ జ్ఞానలక్ష్మీసంపాదనార్థమై, చిత్తనిరోధార్థమై కరుణార్ద్రచిత్తుడగు గాధి ఋష్యమూక పర్వతముపైకి జనెను.

నిరస్తాశేషసంకల్పస్తపస్తత్ర చకార హ
దశ వర్షాణి తేనాసావాత్మజ్ఞానమవాప హ. 46

సంకల్పములన్నింటిని త్యజించి పది వత్సరములటు గాధి తపంబొనర్చె. అత్తపోమహిమచే యాతఁడాత్మజ్ఞానమును బొందెను.

అరమత తదను స్వాం ప్రాప్య సత్తాం మహాత్మా
హ్యపగతభయశోకో భోగభూమావనీహ
సతతముదిత జీవన్ముక్తరూపః ప్రశాన్తః
సకల ఇవ శశాఙ్కః ఘూర్ణితాపూర్ణచేతాః. 47

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే గాధివృత్తాన్తే గాధేర్జ్ఞానప్రాప్తిర్నామైకోన

చత్వారింశః సర్గః ॥ 49 ॥

గాధ్యుపాఖ్యానం సంపూర్ణమ్.

---

బ్రహ్మజ్ఞానప్రాప్త్యనంతరము మహాత్ముఁడగు గాధి తన పారమార్థిక సత్తను బొందినవాడై, భయ, శోకవివర్జితుఁడై సంతతజీవన్ముక్తస్వరూపుడై, అపరిచ్ఛిన్న బ్రహ్మానందనిమగ్నుఁడై పరిపూర్ణచిత్తుడై, పూర్ణచంద్రునివలెనిది అనంత బ్రహ్మాకాశమున విహరింపసాగెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు ఉపశమప్రకరణమున
గాధివృత్తాంతమున గాధిజ్ఞాన ప్రాప్తియను ఏకోనపంచా
శత్తమ సర్గము. ॥ 49 ॥

---

గాధ్యుపాఖ్యానము సమాప్తము.

—: o :—

## పఞ్చాశః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఏవమేషాతివితతా దుర్జ్ఞానా రఘునన్దన
మహామోహమయీ మాయా విషమా పారమాత్మికీ. 1
క్వ ముహూర్తద్వయ స్వప్న సంభ్రమాలోక దృష్టతా
క్వానేక వర్ష సంభుక్త శ్వపచావనిపభ్రమః. 2
క్వ సంభ్రమోపలబ్ధత్వం క్వ ప్రత్యక్షనిదర్శనమ్
క్వాసత్యత్వమసందిగ్ధం క్వ సత్యపరిణామితా. 3

శ్రీ వసిష్ఠుడు:-ఓ రఘునందనా! ఇవ్విధమున ఈమాయ అతివిశాలమును, అచింత్యమును, భయంకరమును, కేవలము పరమాత్మాశ్రితమును, మహామోహమయమును నైయున్నది. ముహూర్తద్వయమందలి సంభ్రమ మెచట, పెక్కు వర్షములు చండాలుడు రాజత్వ మనుభవించునట్టి భ్రమ యెచట! సంభ్రమమెచట, ప్రత్యక్ష నిదర్శన మెచట! అసత్య మెచట, అసందిగ్ధమగు సత్య మెచట!

అతో వచ్మి మహాబాహో మాయేయం విషమాన్వహమ్
అసావధానమనసం సంయోజయతి సంకటే. 4

మహాబాహుడవగు నో రామచంద్రా! కనుక నే ఈమాయ మిగుల భయంకరమైనదనియు అసావధానచిత్తుని యొక్క క్షణములో సంకటమున బడద్రోయుననియు నేను ప్రతిదినము వచించుచు నేయున్నాను.

శ్రీ రామ ఉవాచ :—

ఏవమస్య కథం బ్రహ్మన్మాయాచక్రస్య రోధనమ్
కుర్యుః ప్రవహతో వేగాత్సర్వాఙ్గ చ్ఛేదకారిణః. 5

శ్రీ రాముడు:—మునీంద్రా! ఇట్లు సర్వాంగముల ఛేదించునదియు, వేగమున బరువిడు నదియునగు ఈ మాయాచక్రమును అధికారిజనులెట్లు నిరోధించెదరు?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అస్య సంసారరూపస్య మాయాచక్రస్య రాఘవ
చిత్తం విద్ధి మహానాభిం భ్రమతో భ్రమదాయినః. 6

శ్రీ వసిష్ఠుడు:—ఓరామచంద్రా! నలుపైపుల విస్తరించునదియు, భ్రమదాయకమునగు ఈ సంసారరూప మాయాచక్రముయొక్క మధ్యభాగము చిత్తమనియే నీవెఱుంగుము.

తస్మిన్నిరుద్ధితమవష్టబ్ధే ధియా పురుషయత్నతః
గృహీతనాభివహనాన్మాయాచక్రం నిరుధ్యతే. 7

పురుషప్రయత్నముచేతను, ధీరబుద్ధిచేతను యిట్టి చిత్తము నిరోధింపబడ, మధ్యభాగ నిరోధకారణమున మాయాచక్రభ్రమణమున్ను నిలచిపోవును.



అవష్టబ్ధమనోనాభిమోహాచక్రం న గచ్ఛతి
యథా రజ్జ్వాం నిరుద్ధాయాం కీలకం రజ్జువేష్టితమ్. 8

త్రాడుచేఁ జుట్టబడిన బాలుర క్రీడాచక్రము, ఆత్రాటిని బట్టుకొనిన ఆగిపోవు చందమున, మనస్సను మధ్యభాగమును నిరోధించుటచే మాయా (మోహ) చక్రమిఁక నడువజాలకుండును.

చక్ర యుద్ధైక తజ్జ్ఞోఽసి కస్మాజ్జానాసి నానఘ
చక్రం నాభావవష్టబ్ధం వశమాయాతి నాన్యథా. 9

పాపరహితుఁడవగు నోరామా! చక్రయుద్ధమున నీవు కుశలుఁడవయ్యు ఏల యీ మాయా చక్రమును నిరోధించుటకు యత్నింపకుంటివి? ఏలనిన, నాభిస్థానమును పట్టుకొనిననే చక్రము వశమగును గాని మఱియొక విధముగ కాదు.

చిత్తం నాభిమవష్టభ్య తస్మాద్యత్నేన రాఘవ
సంసారచక్రం వహానాదాత్మనః పరిరోధయ. 10

కాన నో రాఘవా! యత్నముచే చిత్తమను నాభిస్థానమును నిరోధించి, జనన మరణాది ప్రాపకమగు సంసార చక్రముయొక్క పరిభ్రమణమునుండి ఆత్మను మల్లింపుము.

ఏతాం యుక్తిం వినా దుఃఖ మన న్తమితమాత్మనః
అస్యాం దృష్టౌ క్షణాదన్తం గతమేవావలోకయ. 11

చిత్తనిరోధమను ఈయుపాయము లేమిచే ఆత్మ పూర్వమనేక దుఃఖములను బొంది యుండెను. కాని యిద్దానిచే నిక ఆత్మయొక్క దుఃఖ మంతమొందిననియే తెలిసికొనుము.

చిత్తాక్రమణమాత్రాత్తు పరమాదౌషధాదృతే
ప్రయత్నేనాపి సంసారమహారోగో న శామ్యతి. 12

చిత్తజయమను పరమౌషధముచేదప్ప యత్నశతములచేగూడ ఈ సంసారమహారోగము శమింప నేరదు.

తస్మాద్రాఘవ సంత్యజ్య తీర్థదానతపః క్రియాః
శ్రేయసే పరమాయాన్తశ్చిత్తమేవ వశం కురు. 13

కాననో రాఘవా! తప, దాన, తీర్థాది క్రియలఁద్యజించి పరమశ్రేయమగు ముక్తికై నీవు చిత్తమును వశమొనర్పుము.

చిత్తాన్తరేవ సంసారః కుమ్భాన్తః కుమ్భఖం యథా
చిత్తనాశే న సంసారః కుమ్భనాశే న కుమ్భఖమ్. 14

ఘటమందు ఘటకాశమున్నట్లు, చిత్తమందీ సంసారమున్ను కలదు. మఱియు ఘట నాశముచే ఘటాకాశము నశించునట్లు చిత్తనాశముచే సంసారవినాశమున్ను ఘటిల్లును.

చిరం సంసరణాకాశ కోటరం చిత్తకుమ్భఖమ్
వినాశ్యాతులితాకాశస్వరూపం రూప మావిశ. 15

ఓరామా! ఘటాకాశమందు తగుల్కొనిన మశకాదులు, దైవేచ్ఛచే ఘటము విదీర్ణమవ, తమ దుఃఖసంసృతిని గోల్పోయి అనంతకాశమున సుఖమొందునట్లు నీవున్ను, చిత్తమను ఘటమును నాశమొనర్చి అత్యుత్తమమగు బ్రహ్మాకాశమునఁ బ్రవేశింపుము.

వర్తమాన మనాయాసం భజద్బాహ్యధియా క్షణమ్
భూతం భవిష్యదభజద్యాతి చిత్తమచిత్తతామ్. 16

ప్రాప్తించిన వర్తమాన విషయములఁ బాహ్యబుద్ధిచే సేవించుచు, భూత భవిష్యద్విషయముల ననుసంధింపకయున్నచో చిత్తమచిత్తత్వదశనొందును.

సంకల్పాంశానుసంధాన వర్జనం చేత్ప్రతిక్షణమ్
కరోషి తదచిత్తత్వం ప్రాప్త ఏవాసి పావనమ్. 17

భవిష్యద్విషయ సంకల్పములను, తదంశభూతమగు పదార్థములను ప్రతినిత్యము నీవు త్యజించుచు వచ్చుచున్న, పరమపావనమగు అచిత్తత్వదశను పొందినట్లే యెంచుము.

యావత్సంకల్పకలనా తావచ్చిత్తవిభూతయః
యావజ్జలద విస్తారస్తావత్తజ్జల బిన్దవః. 18

మేఘములున్నంతవఱకు ఆకసమునుండి వర్షబిందువులు పడుచునేయుండునట్లు, సంకల్పమున్నంతవఱకు చిత్తవిభూతులుండియే యుండును.

సచిత్తం చేతనం యావత్తావత్సంకల్పకల్పనమ్
సచన్ద్రాంశు జగద్యావత్తావత్ప్రాలేయ లేశకః. 19

చంద్ర కిరణములుండునంతవఱకు జగత్తున మంచుబిందువులుండియే యుండునట్లు ఆత్మ చిత్తసహితమైయున్నంతవఱకు సంకల్పకల్పన లుండియేయుండును.

చేతనం చిత్తరిక్తం చేద్భావితం తత్స్వసంసృతేః
ఆమూలమేవ దగ్ధాని విద్ధి మూలాని సిద్ధవత్. 20

ఆత్మ చిత్తరహితమై కూటస్థరూపమున నుండుచో, సంసారమునకు మూలభూతమగు కామ, కర్మ, వాసనాదులిక మూలాజ్ఞానసహితముగ భస్మీభూతమై పోవును. దీనిని నీవు మహాసిద్ధమంత్రముగ తెలియుము.

చేతనం చిత్తరిక్తం హి ప్రత్యక్చేతనముచ్యతే
నిర్మనస్క స్వభావం తన్న తత్ర కలనామలః. 21

చిత్తరహితమగు ఆత్మను ప్రత్యక్-చేతనమని నుడువుదురు. మనోరహితమును, స్వస్వభావయుతమునగు ఆత్మయందు కల్పనారూప మాలిన్యముండ నేరదు.

సా సత్యతా సా శివతా సావస్థా పారమాత్మికీ
సర్వజ్ఞతా సా సా దృష్టిర్నతు యత్ర మనః క్షతమ్. 22



దుష్టమగు నీ మానసంబు లేనిస్థితియే ఆత్మయొక్క పరమార్థసత్యమగును. మఱియు నదియే నిరతిశయానందస్వరూపమును, పరమాత్మస్వభావమును, సర్వజ్ఞత్వమును, సమ్యక్-దృష్టియునగును.

మనో యత్రతు తత్రాశా స్తత్ర దుఃఖసుఖాని చ
సదా సంనిధిమాయాన్తి శ్మశాన ఇవ వాయసాః. 23

ఎచట మనస్సుండునో అచటనే, శ్మశానమందు కాకులవలె పలువిధములగు ఆశలు, సుఖదుఃఖములు వచ్చిచేరుచుండును.

వస్తుతత్త్వావబోధేన సర్వభావవ్యవస్థితేః
సంసృతివ్రతతేర్బీజం సంకల్పేనోపజాయతే. 24

ఆశాది సర్వభావములకు కారణమగు సంసార లతయొక్క బీజము (వస్తుతత్త్వావబోధముచే క్షయమొందినందున) తత్వజ్ఞానుల మనంబున నుత్పన్నమవదు.

శాస్త్ర సజ్జన సంపర్క సంతతాభ్యాసయోగతః
జాగతానామవస్తుత్వం భావానామవగమ్యతే. 25

శాస్త్రసజ్జన సాంగత్యముల చేతను, మనోనిరోధమును నిరంతరమభ్యసించుటచేతను, జగత్తునందలి పదార్థములందవస్తుత్వము (మిథ్యాత్వము) నిశ్చయింపబడును.

అవివేకాదుపాహృత్య చేతస్సోద్యమనిశ్చయైః
బలాత్కారేణ సంయోజ్య శాస్త్రసత్పురుషక్రమైః. 26

దృఢప్రయత్న, సునిశ్చయములచే శాస్త్ర సత్సాంగత్యాదులద్వారా క్రమముగ చిత్తము నవివేకమునుండి తొలగించి బలవంతముగ ఆత్మయందు ప్రవేశపెట్టవలెను.

ముఖ్యం కారణమాత్మైవ పరమాత్మావలోకనే
అగాధే పతితం రత్నం రత్నేనైవావలోక్యతే. 27

అగాధజలమున పడిన రత్నము ప్రకాశవంతమగు మఱియొక రత్నముచేతనే గాంచబడు విధమున పరమాత్మసందర్శనమున ఆత్మయే ముఖ్యకారణమగును.

స్వానుభూతాని దుఃఖాని స్వాత్మైవ త్యక్తుమిచ్ఛతి
తేనాత్మైవాత్మవిజ్ఞానే హేతురేకః పరః స్మృతః. 28

స్వానుభూతములగు సుఖదుఃఖముల నాత్మయే త్యజింప నిచ్ఛగించుచున్నది. కాన ఆత్మజ్ఞానమున కాత్మయే ముఖ్యహేతువగును.

ప్రలపన్విసృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి
నిరస్తమననానన్తసంవిన్మాత్రపరో భవ. 29

మాట్లాడుచున్నను, యిచ్చుచున్నను, గ్రహించుచున్నను, కనుమూయుచున్నను, కనుతెరచుచున్నను, మనోమననరహితుడవై కేవలచైతన్యమాత్రపరాయణుఁడవే గమ్ము.

జాయమానస్తథా జీవన్మ్రియమాణః క్రియారతః
స్వాత్మన్యమలతాం ప్రాప్తే సంవిదంశే స్థిరో భవ. 30

నిరంతరాత్మచింతనచే స్వాత్మనైర్మల్యము సంప్రాప్తింప, జన్మించుచున్నను, జీవించుచున్నను, మరణించుచున్నను, లేక, తదితర దుర్దశలందు తగుల్కొనినను, క్రియాతత్పరుఁడవై యున్నను, కేవలము చేతనాంశముననే స్థిరుఁడవు గమ్ము.

మమేదం తదయం సోఽహమితి సంత్యజ్య వాసనాః
ఏకనిష్ఠతయా స్వస్థః సంవిన్మాత్రపరో భవ. 31

'ఈ సమీపమునయున్నదియు, ఆ దూరమునయున్నదియు నాదే; ఈ దేహాదులు నేను'; ఈ మున్నగు వాసనలఁద్యజించి తదేకనిష్ఠగల్గి చైతన్యమాత్రతత్పరుఁడవై యుండుము.

వర్తమానభవిష్యన్త్యోః స్థిత్యోరాదేహమేకధీః
స్వసంవిత్త్యనుసంధాన సమాధానపరో భవ. 32

వర్తమానమగు యీ బాల్యావస్థయందును, రాబోవు యౌవనావస్థయందును, రాజ్యాది స్థితులందును వెయ్యేల, దేహముండునంతవఱకెల్లెడలను చైతన్యమాత్రముననందే యేకనిష్ఠగల్గి అద్దానినే యనుసంధించుచు సమాధితత్పరుఁడవు గమ్ము.

బాల్యయౌవన వృద్ధేషు దుఃఖేషు చ సుఖేషు చ
జాగ్రత్స్వప్నసుషుప్తేషు స్వసంవిత్తిపరో భవ. 33

బాల్యయౌవన వార్ధక్యములందును, సుఖదుఃఖములందును, జాగ్రత్స్వప్నసుషుప్తులందును స్వస్వరూపమగు కేవలచైతన్యమాత్రమున నిష్ఠగల్గియుండుము.

మలం సంవేద్యముత్సృజ్య మనో నిర్గలయన్పరమ్
ఆశాపాశమలం ఛిత్త్వా స్వసంవిత్తిపరో భవ. 34

బాహ్యవిషయములను మాలిన్యమును త్యజించి, మనస్సు నాత్మయందు విలయమొనర్చుచు, ఆశాపాశమును పూర్ణముగ విచ్ఛేదముగావించి కేవల నిజజ్ఞానస్వరూపమున స్థితుఁడవు గమ్ము.

శుభాశుభస్వసంకేత సంశాన్తాశావిషూచికః
నష్టేష్టానిష్టదృష్టిస్త్వం సంవిత్సారపరో భవ. 35

శుభాశుభ లక్షణములును, ఆశయను మహామారియు శమించినవాఁడవును, ఇష్టానిష్ట విచారరహితుఁడవునగు నీవు కేవలము చైతన్యమునే యాశ్రయింపుము.

సకర్తృకర్మకరణాన్స్వస్వర్శాన న్తరాస్పృశన్
నిర్వికల్పనిరాలమ్బః స్వచిన్మాత్రపరో భవ. 36

కర్తృకర్మకరణ సహితుఁడవై, విజ్ఞానమయమను బుద్ధి, బాహ్యవిషయములు, ఇంద్రియములు వీనితోఁగూడి, నిన్ను స్పృశింపనేరని సంసారమును స్వాంతర్గతమున ప్రతిబింబముమాత్రమే స్పృశించుచు, అనగా సాక్షిరూపమున సర్వవ్యవహారముల గాంచుచు నిర్వికల్పమును, నిరాలంబమును కేవల నిజరూపమును నగు చిన్మాత్రమందు నిష్ఠ గల్గియుండుము.



జాగ్రత్యేవ హి సంసుప్తః భావయన్సుస్థిరాం స్థితిమ్
సర్వమస్తీతి సంచిన్త్య సత్తైకాత్మవపుర్భవ. 37

అతిస్థిరమును, నిర్వికల్పమునగు సుషుప్తియందలి స్థితిని జాగ్రదవస్థయందే భావించుచు 'ప్రపంచమందంతట చైతన్యస్వరూపుఁడగు నేనేగలన'ని నిశ్చయించి కేవలము చిత్-సత్తామాత్ర శరీరుఁడవుగమ్ము.

నానానానాదశాముక్తో యుక్తో ముక్తతయా సమే
సమగ్రకలనాదీపః స్వచిన్మాత్రపరో భవ. 38

జాగ్రత్స్వప్నసుషుప్తి (సృష్టిస్థితిప్రళయ) దశావిముక్తుఁడవై, ముక్తరూపమున పరబ్రహ్మమునఁగూడి, సర్వదృశ్యమాత్రప్రదీపకుఁడవై బుద్ధివృత్తుల నన్నింటిని ప్రకాశింపజేయుచు నిజచిన్మాత్రస్వరూపమున స్థిరముగ నుండుము.

ఆత్మతా పరతే త్యక్త్వా నిర్విభాగో జగత్స్థితౌ
వజ్రస్తమ్భవదాత్మానమవలంబ్య స్థిరో భవ. 39

స్వపరత్వములఁద్యజించి జగత్స్థియందు, విభాగరహితమగు వజ్రస్తంభముఁ బోలిన ఆత్మనాశ్రయించి స్థిరముగ నుండుము.

స్థిత్వాన్తర్మానసాన్పాశానాశారూపానుదారయా
ధియా ధైర్యైకధర్మిణ్యా నిర్ధర్మాధర్మతాం వ్రజ. 40

సంకల్పమయములగు ఆశాపాశముల మధ్యనున్న ధీరత్వధార్మికబుద్ధులు గల్గియుండి, ధర్మాధర్మరహితస్థితిని పొందుము.

సమాస్వాదయతస్తత్త్వం స్వసంవేదనధర్మిణః
విషం హాలాహలమపి యాస్యత్యమృతతామథ. 41

జ్ఞానమాత్రమును, సాక్షిరూపమునగు తన యాత్మతత్త్వము ననుభూతమొనర్చుకొను వానికి హాలాహల విషమున్ను అమృతతుల్యమగును.

తదోదేతి మహామోహః సంసృతిభ్రమకారణమ్
నిర్మలాయా నిరంశాయాః సంవిత్తేశ్చ్యుతిర్యదా. 42

నిర్మలమును, నిరవయవమునునగు చైతన్యముయొక్క విస్మరణ మెపుడు సంభవించునో (అజ్ఞానము గల్గునో) అపుడే సంసారభయమును గూర్చిన మహామోహ ముదయమగును.

తదా సంక్షీయతే మోహః సంసారభ్రమకారణమ్
నిర్మలాయాం నిరంశాయాం స్వసంవిత్తౌ స్థితిర్యదా. 43

నిర్మలమును, నిరవయవమునునగు నిజచైతన్యమున స్థితి గలుగగనే సంసారభ్రమకారణమగు మహామోహము క్షయించును.

స్వరూపమనుయాతస్య తీర్ణస్యాశామహార్ణవమ్
ప్రసరిష్యతి తే సంవిత్సూర్యాంశురివ సర్వతః. 44

ఎపుడు నీవు స్వస్వరూపమును పొంది, ఆశయను సముద్రమును దాటుదువో, అపుడే జ్ఞాన భాస్కరుని కిరణములు నీ వలుపై పుల ప్రసరించును.

స్వభావమాలోకయత ఆనన్దాద్వయసంస్థితేః
రసాయనమివ స్వాదు రామ ప్రతివిషాయతే. 45

ఓ రామచంద్రా! స్వాత్మభావము నవలోకించుచు, అద్వైతబ్రహ్మానందమున స్థితుఁడగు మనుజునకు మిగుల స్వాదిష్టమగు అమృతము కూడ విషతుల్యముగ గోచరించును.

త్తైర్నో భజామహే పుంభిర్యే స్వభావముపాగతాః
శేషాః పురుషనామానో గర్దభా దీర్ఘబాహవః. 46

ఎవరు ప్రత్యగాత్మభావమునొంది జీవన్ముక్తులైరో, అట్టివారితోనే మేమెల్లపుడు మైత్రి గల్గియుందుము. తక్కినవారు మనుజనామకులగు దీర్ఘభుజములుగల గార్దభములే యగుదురు.

పర్వతాత్పర్వతం యాన్తి పురోద్రేరివ దన్తినః
పరాం కోటిం ప్రయాతస్య స్వసంవిత్త్యున్నతస్థితేః. 47

స్వజ్ఞానకారణమున సర్వోచ్చ స్థితినొందిన తత్వజ్ఞుని సమీపమునకు, జ్ఞానార్థమేతెంచు అన్యులగు ఉపాసకులును యోగులును, మేరుపర్వము యెదుట ఒకపర్వతమునుండి మఱియొక పర్వతమునకు జనుచుండు యేనుగుల పగిది నుందురు.

అదృష్టాదృశ్య సీమ్నోఽన్తః సూర్యాదీన్యఖిలాన్యపి
న తేజాంస్యుపకుర్వన్తి స్వసంవిద్దివ్యచక్షుషః. 48

తత్వవేత్తలుగాని వారెవరిచేతను యింతదనుక గాంచబడనిదియు, వర్తమాన భవిష్యత్కాలములందును అట్టివారెవరిచేతను గాంచనశక్యమునగు దివ్యజ్ఞాన నేత్రయుక్తుడగు తత్వవేత్త యొక్క అంతఃకరణమునకు కల్పితములగు సూర్యాదుల ప్రకాశమంతయును గూడ ఉపకారక మేమియు గాజాలదు. ఏలన స్వజ్ఞానవశమున నే యాతడు సర్వోన్నత స్థితిని బొందియుండెను.

అవస్తుతాం వ్రజన్త్యేతే మాధ్యాహ్న ఇవ దీపకాః
అర్కాదయో మహాలోకా విద్యయాధిగతాత్మనః. 49

బ్రహ్మవిద్యచే యెవడు తన యాత్మ నెఱుంగునో వానియెదుట సూర్యాది మహాలోకము లున్న, మధ్యాహ్నకాలమందలి దీపమువలె అపస్తుత్వ మొందును.

తేజోంశుషు ప్రభావేషు బలిష్వపి మహత్స్వపి
సర్వేషూన్నతియుక్తేషు తత్త్వజ్ఞః పరమోన్నతః. 50

తేజఃకార్యమగు ప్రకాశనమందును, యోగ, వశిత్వాది సిద్ధుల ప్రభావములలోను, బలవంతులలోను, ఆయురైశ్వర్యాదులచే శ్రేష్ఠులగు జనులలోను, విద్వత్త, వక్తృత్వాదులగల యున్నతమనుజులలోను తత్వజ్ఞానియే సర్వోన్నతుఁడగును.

భాన్తీహ భాసా యస్యార్కవహ్నీన్దుమణితారకాః
తథా జగతి రాజన్తే జ్ఞాతజ్ఞేయా నరోత్తమాః. 51



ఆత్మరూపుఁడగు జగదీశ్వరుని ప్రకాశముచే సూర్య, అగ్ని, చంద్ర, మణి, తారాగణంబులు ప్రకాశితములగునట్లు జ్ఞాతజ్ఞేయులగు (తత్వజ్ఞానులగు) మహాపురుషుల కృపచేతనే ఈజగత్తున సమస్తమున్ను ప్రకాశించుచున్నది.

ధరావివర కీటేభ్యో గర్దభేభ్యోఽపి మానవః
తిర్యగ్భ్యశ్చాప్యతత్త్వజ్ఞా రామ తుచ్ఛతరాః స్మృతాః. 52

ఓ రామచంద్రా! భూబిలములందలి కీటములకంటెను, గార్దభములకంటెను, పశుకీటపతంగాదులకంటెను ఆత్మజ్ఞానరహితులగు మానవు లతితుచ్ఛులు.

తావత్సంమోహా వేతాలో దేహీ యావదనాత్మవాన్
ఆత్మజ్ఞ ఏవ సంయుక్తశ్చేతనేనేతి తద్విదః. 53

ఆత్మజ్ఞుడవనంతవఱకు మోహమను పిశాచము విజృభించుచునేయుండును. ఆత్మజ్ఞానియే సచేతనుడనియు, అనాత్మజ్ఞుఁడచేతనుడనియు తత్వవేత్తలు బల్కుదురు.

అనాత్మజ్ఞోహి దుఃఖేహః ప్రస్ఫురన్నపి భూతలే
శవఏవ భ్రమత్యుచ్చైరాత్మజ్ఞస్తు సచేతనః 54

దుఃఖార్థమే చేష్టలకొనునట్టి అజ్ఞాని ఈ ప్రపంచమున జరించుచున్నను మృతుడే యగును. ఆత్మజ్ఞానియే జీవితుడనఁబడును.

దూరాదాత్మజ్ఞతా యాతి చిత్తే పీవరతాం గతే.
ఆలోకలక్ష్మీరభితో మహామోఘ ఇవోత్థితే. 55

గొప్పమేఘము విస్తరింప ప్రకాశము నలువైపుల సన్నగిల్లునట్లు, చిత్తము స్థూలమవ ఆత్మజ్ఞానము పలాయనమగును.

భోగాభోగతిరస్కారైః కార్యం నేయం శనైర్మనః
రసాపహారైస్తజ్జ్ఞేన కాలేనాజీర్ణపర్ణవత్. 56

విషయభోగముల సేవింపకుండుటచేతను, ప్రాప్తింపని విషయముల నభిలషింపకుండుటచేతను జ్ఞాని తనమనంబును, శుష్కింపని పత్రమును కాలము కృశింపజేయు చందమున కృశింపజేయవలెను.

అన్యాత్మన్యాత్మభావేన దేహమాత్రాస్థయానయా
పుత్రదారకుటుమ్బైశ్చ చేతో గచ్ఛతి పీనతామ్. 57

అనాత్మయందలి యాత్మభావముచేతను, దేహమందలి యాశచేతను, పుత్రదారకుటుంబముల వలనను చిత్తము స్థూలత్వము నొందును.

అహంకార వికారేణ మమతామలహేలయా
ఇదం మమేతి భావేన చేతో గచ్ఛతి పీనతామ్. 58

అహంకార వికారముచేతను మమత్వమను మనమందలి యాసక్తిచేతను, శరీరమే ఆత్మయను భావనచేతను, చిత్తము స్థూలదశ నొందును.

జరామరణ దుఃఖేన వ్యర్థమున్నతిమీయుషా
దోషాశీవిషకోశేన చేతో గచ్ఛతి పీనతామ్. 59

జరామరణ దుఃఖములచేతను, వ్యర్థమున్నతి నిచ్ఛగించుటచేతను, దోషసర్పనిలయము చేతను, చిత్తము స్థూలత్వము బడయును.

ఆధివ్యాధివిలాసేన సమాశ్వాసేన సంసృతేః
హేయాదేయప్రయత్నేన చేతో గచ్ఛతి పీనతామ్. 60

శారీరిక మానసిక వ్యాధులచేతను, సంసారము రమణీయమనియు, చిరస్థాయియనియు విశ్వసించుటచేతను, త్యాజ్యగ్రాహ్యములఁ గూర్చిన యత్నములచేతను చిత్తము స్థూలత్వముఁ జెందును.

స్నేహేన ధనలోభేన లాభేన మణియోషితామ్.
ఆపాతరమణీయేన చేతో గచ్ఛతి పీనతామ్. 61

స్నేహముచేతను, ధనలోభముచేతను, మణి, స్త్రీ లాభముచేతను, అవిచారముచే ఆరంభమున రమణీయముగ గన్పట్టు విషయములచేతను చిత్తము స్థూలమగును.

దురాశాక్షీరపానేన భోగానిలబలేన చ
ఆస్థాదానేన చారేణ చిత్తాహిర్యాతి పీనతామ్. 62

దుష్టాశాక్షీరపానముచేతను, భోగవాయుబలముచేతను, సాంసారిక పదార్థములు సత్యములని విశ్వసించుటచేతను, పలువిధవిషయములందు జరించుటవలనను చిత్తము స్థూలదశఁ జెందును.

ఆగమాపాయవపుషా విషవైషమ్యశంసినా
భోగాభోగేన భీమేన చేతో గచ్ఛతి పీనతామ్. 63

ఉత్పత్తివినాశస్వభావయుక్తమును, విషరూపమగు వైషమ్యమును ప్రతిపాదించునదియు, భయంకరములగు విషయభోగముల సేవించునదియునగు చిత్తము స్థూలాకృతి వడయును.

శరీరదుఃశ్వభ్రచిరప్రరూఢం చిన్తాచయోచ్చాకృతిమఞ్జరీకమ్
జరామృతివ్యాధి ఫలాఘనమ్రం కామోపభోగౌఘవికాసపుష్పమ్. 64
విచారసారక్రకచేన చిత్తవిషద్రుమం త్వద్భుతమద్రికల్పః
ఆశామహాశాఖమశఙ్కమేనం ఛిన్ధి ప్రసహ్యాత్ర వికల్పపత్రమ్. 65

శరీరమను తుచ్ఛగర్తమున చిరకాలము బాగుగ నెలకొనియున్నదియు, చింతాసమూహమను దీర్ఘలతలచే పరివేష్టితమును, జరామరణరోగములను ఫలములచే వంగియున్నదియు, కామోపభోగములను వికసిత పుష్పములు గలదియు, పర్వతముగూడ్క అత్యున్నతమును, ఆశలను పొడవైన కొమ్మలును, వికల్పములను పత్రములును గలదియునగు ఈ చిత్తమను విషవృక్షమును నీ వే మాత్రము శంకింపక బలాత్కారముగ ఉత్తమ (ఆత్మ) విచారమను రంపముచే తెగనఱకుము.

మత్తేక్షణం చైకతటోపవేశం విశ్రాన్తిసౌఖ్యేష్వసమర్థముగ్రమ్
ఆలోకనోత్కం సుజనక్రమాబ్జఖణ్డస్య చణ్డం సుఖదుఃఖగణ్డమ్. 66



చేతోగజం కాయకుకాననస్థం సుతీక్ష్ణయా ధీకర జాగ్రపఙ్క్త్యా
విదారయాదీర్ఘ వికారదన్తం క్రియాకరం రాఘవ రాజసింహ. 67

రాజశ్రేష్ఠుఁడవగు నో రామా ! వివేకవిషయమున ప్రమాదముగలదియు, మదించియున్నదియు, ఆగమాసుమాన నేత్రసహితమును, బహిర్ముఖత్వమను సంసారరూప పర్వతతటముపై గూర్చున్నదియు, అన్తర్ముఖత్వమొంది విశ్రాంతిసౌఖ్యమనుభవించుట యందసమర్థమును, ద్వేషాదులచే భయంకరమును, శమ దమ తితీక్షాది సత్పురుషక్రమమను కమలవనమును గాంచ నుత్కంఠేచ్ఛగలదియు, మిగుల క్రోధియు, సుఖదుఃఖములను గండస్థలములు గలదియు, శరీరమను బీకరారణ్యమున వసించునదియు, కామాది వికారములను దీర్ఘదంతములు గలదియు, ధైర్యాదుల నశింపజేయునదియునగు ఈచిత్తమను గజమును అతిసూక్ష్మబుద్ధియను సింహముయొక్క నఖాగ్రముచే విదీర్ణమొనర్పుము.

రతిం గతం నిత్యమసత్ప్రదేశే శరీరమాంస గ్రసనేన పుష్టమ్
దుష్టక్రియా కర్కశ చఞ్చు దణ్డమేకేక్షణం పుష్టతమోంశుకృష్ణమ్. 68
మారే సముత్సారయ భారభూతం దుశ్చేష్టితం కర్కశమారటన్తమ్
గన్ధోద్గతం కాయకులాయకోశాద్దోషోపశాన్త్యై నిజచిత్తకాకమ్. 69

ఓ రామా ! వనితాది భోగ్యపదార్థము రూపమగు శ్మశానభూమియందాసక్తిగలదియు, శరీరమను మాంసమును భక్షించుటచే పుష్టమైనదియు, దుష్టక్రియలొనర్చుటచే కర్కశమైనట్టి చంచువు గలదియు, స్వార్థమను యేక నేత్రధారియు, వృద్ధినొందిన తమోగుణప్రవృత్తియను అంధకారముచే కృష్ణవర్ణయుతమును, ఆత్మయను వృక్షమునకు భారభూతమును, దుర్వాసనా దౌర్గంధ్యముచే సువ్యక్తమును, దుష్టక్రియా కారకమును, కర్కశస్వరయుక్తమునునగు ఈ చిత్తమను కాకమును దోషోపశమనార్థము శరీరమను గూటినుండి దూరముగ పారద్రోలుము.

తృష్ణా పిశాచ్యా పరిచర్యమాణం విశ్రాన్తమజ్ఞానమహావటేషు
భ్రాన్తం చిరం దేహశతేష్వటవ్యాం స్వసంసృతౌ చేతనవర్జితేషు. 70
వివేకవైరాగ్యగురుప్రయత్నమన్త్రైః స్వతన్త్రైః స్వచిదాత్మగేహాత్
నోత్సాదయేచ్చిత్త పిశాచమేనం యావత్కుతస్తావదిహాత్మసిద్ధిః. 71

తృష్ణయను పిశాచముచే సేవింపబడునదియును, అజ్ఞానమను వటవృక్షముక్రింద విశ్రమించునదియు, అనంతకోటిదేహములను మహారణ్యమున చిరకాలము సంచరించునదియు, చిత్తచాంచల్యకారణమున అజ్ఞానులందు ప్రత్యక్షముగ గోచరించునదియునగు ఈచిత్తమను పిశాచమును వివేకవైరాగ్యాది మహాప్రయత్నములను మంత్రతంత్రములచే స్వాత్మగేహమునుండి దూరీకృతమొనర్పనంతవఱకు ఆత్మకు ముక్తియెచట ?

శుభాశుభాస్యం హతమానవౌఘం చిన్తావిషం కాయకుకఞ్చుకం చ
అజస్రమచ్ఛశ్వసనాశనం చ సర్వస్వ నానాభయనాశదం చ. 72
హృద్బద్ధదుఃశాల్మలికోటరస్థమమోఘయా చిత్తగమన్త్రశక్త్యా
నీత్వా శమం రామ మనోమహాహిం భయం భృశం ప్రోజ్ఝ్య
భవాభయాత్మా 73

ఓ రామా! శుభాశుభకర్మలను రెండు కోరలుగలదియు, మనుజుల హత మొనర్చునదియు, చింతయను విషముగలదియు, దేహమను దుష్టకుబుసమును ధరించునదియు, ఎల్లప్పుడు శ్రమలేనిదియు, ప్రాణవాయువును భక్షించునదియు, పలువిధ భయములను, మృత్యువును యొసంగునదియు, హృదయకమలమను దుష్టశాల్మలీవృక్షపు తొఱ్ఱయందు వసించునదియునగు ఈ మనస్సను గొప్పసర్పమును శమాఖ్యచిద్రూపమను గారుడమంత్ర శక్తిచే సమూలముగ నాశ మొనర్చి భయమును పూర్ణముగ త్యజించి అభయాత్ముడవు గమ్ము.

అమజలాకారధరః శరీరశవావలీ సంతతసేవనేన
దిగావలీ సంభ్రమణశ్రమార్తః శ్మశానసేవీ వపుషాక్షతేన. 74
భోగామిషో దిక్ష్వభిధావమాన ఉత్కంధరో ధీరవివృద్ధగర్ధః
ఉడ్డీయ వై గచ్ఛతి చిత్తగృధ్రో దేహద్రుమాత్తన్నిపుణం జయస్తే. 75

ఓ రామా! దేహరూప శవముల సదా భక్షించునదగుటచే అమంగళస్వరూపమును, దిక్కులంతటను సంచరించుటచే శ్రమవలన పీడితమును, అవమాన, ధనవ్యయ, శోక, భయాదులను కాకులముక్కులచే పొడువబడి ఖండింపబడిన దేహముగలదై, శ్మశానభూమిని సేవించునదియు, విషయభోగములను మాంసమును భక్షించునదియు, దిక్కులందంతటను కంఠ మెత్తుకొని యెగురునదియు, భీరువును తృష్ణాధారియునగు చిత్తమను గృధ్రము దేహవృక్షమునుండి యెపుడు యెగిరి పోవునో, అపుడే నీకు సర్వవిధముల జయముగల్గును.

భ్రాన్తం వనాన్తేషు దిగన్తరేషు ఫలార్థినం చఞ్చలమాకులాఙ్గమ్
జన్మావనేర్జన్మమహీం ప్రయాతం సంసారబన్ధం జనతాం హసన్తమ్. 76
ద్రుమేక్షినాసా కుసుమే భుజాదిశాఖే విలోలాఙ్గులి జాలపత్రే
సముల్లసన్తం పరిమారయాన్తర్మనోమహామర్కటమఙ్గ సిద్ధ్యై. 77

ఓరామా! దిగంతములు జరించునదియు, భక్ష్యార్థియు, చపల వ్యాకుల శరీరముగలదియు ఒక జన్మయను భూప్రదేశమునుండి మఱొక జన్మయను భూప్రదేశమును పొందునదియు, జనసమూహమును, వారి సంసారబంధమును గాంచి స్వచేష్టలచే పరిహసించునదియు, నేత్ర, నాసికలను పుష్పములును, భుజాదులును శాఖలును, వ్రేళ్లను పత్రములును గల్గిన వృక్షముపై శోభిల్లునదియునగు ఈ మనస్సను గొప్పవానరమును నలువైపుల బంధించి ఆత్మసిద్ధికొఱకై, వధింపుము.

అభ్యుత్థితం సత్ఫలసంక్షయాయ లసన్ముఖాసజ్జితడిత్ప్రకాశమ్
వర్షన్తమాసారమనర్థసార్థమాన్దోలితం వాసనవాత్యయాన్తః. 78
సంకల్ప సంకల్పనవర్జనోగ్ర మన్త్రప్రభావా ద్ధృదయామ్బరస్థమ్
సోత్సాహముత్సాదయ చిత్తమేఘం బృహత్ఫలం ప్రాప్య భవాలమాద్యః.

ఓ రామచంద్రా! పరమార్థసుఖమను పక్వఫలమును నశింపజేయుటకై అకాలమున యుదయించినదియు, బహిర్ముఖవృత్తియందాసక్తమును, మెఱుపువంటి చిదాభాసప్రకాశము గలదియు, అనర్థజాలమను వర్షధారల కురియునదియు, వాసనలను మహావాయువులచే అంతఃకరణమున ప్రకంపిత మొనర్చునదియు, హృదయాకాశమున నున్నదియునగు చిత్తమను మేఘమును, ఉత్సా



హయుతుడవై సంకల్పకల్పనా యభావమను ప్రచండమంత్రప్రభావంబున తొలగింపుము అద్దానిచే జీవన్ముక్తియను మహాఫలంబును బొంది నీ పూర్వసిద్ధస్వభావమును పరిపూర్ణముగా వడసి నిత్యముక్తాత్ముడవు గమ్ము.

గ్రన్థీకృతం కర్మభిరాత్మ సృష్టైర్మన్త్రైరభేద్యం జ్వలనైరదగ్ధమ్
పీడాం పరామాత్మని కల్పయన్తం సమస్త జాత్యన్తరదీర్ఘదామ. 80
అంతఃప్రోతసుసంఖ్య శరీరమాలం బలాదసంకల్పనమాత్ర శస్త్రైః
ఛిత్త్వా స్వయం రాఘవ చిత్తపాశం యథాసుఖం త్వం విహరాస్తశఙ్కః.

ఓరామా! సృష్ట్యాది నేటివరకు సుకృత దుష్కృతకర్మములచే నిరంతరము దృఢమొనర్పబడినదియు, మంత్రములచే ఛేదింపబడనిదియు, అగ్నిచే దహింపబడనిదియు, ఆత్మకు మిగుల బాధనుగల్గజేయునదియు, నానాజాతిజన్మభేద, బంధనమున దీర్ఘరజ్జువు వంటిదియు, అసంఖ్యాకములగు దేహములు తనయందు గ్రుచ్చబడినదియునగు చిత్తమను పాశమును, శంకారహితుడవై బలాత్కారముగ అసంకల్పమను మహాశస్త్రములచే స్వయముగ ఛేదించి సుఖముగ నీ ప్రపంచమున విహరింపుము.

ఫూత్కారదగ్ధాఖిలపార్శ్వలోక మత్యన్త దుష్ప్రాప పరప్రబోధమ్
ఆశీవిషం శోషితలోకఖణ్డం వ్యాత్త్యామిషోద్ధూతశరీరదణ్డమ్. 82
ఆమన్థరం దేహగుహాసు గుప్తం సంకల్పఘోరాజగరం జవేన
అకామనానామ మహానలేన బలేన దగ్ధ్వా విభవో భవ త్వమ్. 83

ఓరామా! క్రోధాదులను ఫూత్కారములచే జీవులను పాంథులందఱిని విదగ్ధమొనర్చునదియు, మిగుల దుష్ప్రాపమగు పరబ్రహ్మరూప ప్రబోధజ్ఞానము లేనిదియు, విషయరూప విషధారియు లోకములన్నింటిని సంతాపిత మొనర్చునదియు, తృష్ణయను నోటిని తెఱచి విషయములను మాంసముకొఱకు చతుర్విధశరీరరూపమగు తన దేహదండమును కదలించునదియు, మోక్షప్రయత్నమున అలసించునదగుటచే మందగతి కలదియు, దేహమను గుహయందు శయనించునదియునగు సంకల్పమను భయంకరమైన అజగరమును వైరాగ్యమను మహాగ్నిచే బలపూర్వకముగ విదగ్ధమొనర్చి పూర్ణానందైశ్వర్యయుతుడవు గమ్ము.

చిత్తేన చేతః శమమాశు నీత్వా శుద్ధేన ఘోరాస్త్రమివాస్త్రయుక్త్యా
చిరాయ సాధో త్యజ చఞ్చలత్వం విమర్కటో వృక్ష ఇవాక్షతశ్రీః. 84

సాధువగు నోరామా! అస్త్రమునస్త్రముచేవలె శుద్ధచిత్తముచే మలిన చిత్తమును పూర్ణముగ శమింపజేసి, చంచలత్వమును సర్వదా విడనాడి, వానరములేని వృక్షమువలె అఖండశోభాయుతుడవు గమ్ము.

అమలమితి చ కృత్వా చేతసా వీతశఙ్క
ముపశమిత మనోఽన్తః సర్వమాదేహమేవ

తృణలవలఘు పశ్యఁల్లీలయా హేయదృష్ట్యా
పిబ విహర రమస్వ ప్రాప్తసంసారపారః. 85

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే రాఘవాశయ వినియోగో నామ
పఞ్చాశః సర్గః ॥ 50 ॥

ఓ రామా! పైనదెల్పిన విధమున తత్త్వజ్ఞానముచే ప్రత్యగాత్మయందు మనస్సును మఱచిపి తమొనర్చి, స్థూలసూక్ష్మకారణ శరీరసహితమగు సమస్తజగత్తును తృణముకంటెను తుచ్ఛముగ అనాదర దృష్టితో గాంచుచు, సంసారమును తరించి, శాస్త్రావిరుద్ధముగ మెలంగుచు, లోకసంగ్రహార్థము లీలాపూర్వకముగ నీ ప్రపంచమున విహరింపుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమ ప్రకరణమున
రాఘవాశయ వినియోగమను పంచాశత్తమ
సర్గము ॥ 50 ॥

---

ఏకపఞ్చాశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

పరిదీర్ఘాసు తన్వీషు సుతీక్ష్ణాసు సితాసు చ
క్షురధారోపమానాసు చిత్తవృత్తిషు తిష్ఠ మా 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామచంద్రా! ఇహపరలోక విషయములందలి యాసక్తిచే నతిదీర్ఘమును, వాసనామయమగుటచే సూక్ష్మమును, సమాధిసుఖమును శీఘ్రముగ విచ్ఛేద మొనర్చుటచే నతితీక్ష్ణమును, ఆత్మప్రతిబింబగ్రహణముచే నిర్మలమునునగు క్షురధారవంటి చిత్తవృత్తులందెన్నటికిని నీవు విశ్వాసముంచకుము.

కాలేన మహతా క్షేత్రే జాతేయం బుద్ధివల్లరీ
వృద్ధిం వివేకసేకేన నయతాం నయకోవిద. 2

నీతినిపుణుడవగు నోరామా! సత్కులమున జనించిన నీదేహమను లత చిత్తశుద్ధి, శ్రవణాది దోహదోపాయములచే పరమాత్మపరిచయ మొనర్చు బుద్ధియను పూతీగ గలదాయెను. అద్దానిని బాహ్యదృశ్యనివృత్తిరూపమగు వివేకముచే సేచన మొనర్చి వృద్ధిజేయుము.



యావన్న్లాయతి నో కాయలతికా కాలభాస్వతా
భూతలేఽపతితాం తావదేనాముద్ధృత్య ధారయ. 3

కాలుడను సూర్యునిచే శరీరమను లత శుష్కింపజేయబడినదై భూతలమున బడనంతవఱకు, గురుశుశ్రూషాశ్రవణాదులచే యద్దాని నుద్ధరించి సద్బుద్ధియను పూతీగెను కాపాడుము.

మద్వాక్యార్థైకతత్త్వజ్ఞ మద్వాక్యార్థైకభావనాత్
సుఖమాప్నోషి సర్పారిర్యథాభ్రరసభావనాత్. 4

మద్వాక్యార్థమందలి ముఖ్యతత్త్వమెఱుంగునట్టి ఓ రామా! మద్వాక్యార్థ మందలి దృఢభావనచే మేఘశబ్దభావనచే మయూరమువలె నీవు సుఖమును బొందగలవు.

ఉద్దాలకవదాలూనం విశీర్ణం భూతపఞ్చకమ్
కృత్వా కృత్వాధియాధీర ధీరయా న్తర్విచారయ. 5

ఓ రామా! ఉద్దాలకుఁడెట్లు పదార్థశోధనము సల్పి, పంచభూత తత్త్వములను ఆయా కారణములందు లయపఱచి అధిష్ఠానమగు సన్మాత్రవస్తువు నన్వేషించెనో, అట్లనే నీవును, అతిధీర బుద్ధిచే నీయంతఃకరణమున మాటిమాటికి విచారణసల్పి ఆత్మ నన్వేషింపుము.

శ్రీరామ ఉవాచ:—

కేనక్రమేణ భగవన్మునినోద్దాలకేన తత్
భూతపఞ్చకమాలూనం కృత్వాన్తః ప్రవిచారితమ్. 6

శ్రీ రాముడు:— ఓ మునీంద్రా! ఉద్దాలకముని యెవ్విధమున పంచభూతములను కారణమందులయపఱచి తన యంతఃకరణమున విచారణసల్పెనో యాక్రమమును తెలుపవేడెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

శృణు రామ యథాపూర్వం భూతవృన్దవిచారణాత్
ఉద్దాలకేన సంప్రాప్తా పరమా దృష్టిరక్షతా. 7

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామచంద్రా! పంచభూతముల విచారణచే ఉద్దాలకముని పూర్వమెట్లు పరమజ్ఞానమయదృష్టిని బడసెనో, యావృత్తాంతమును తెలిపెద, వినుము.

జగజ్జీర్ణగృహస్యాస్య కోణే కస్మింశ్చితాతతే
భూమేరనిలదిగ్భాగ్మిన్ భూభృద్భాణ్డసమాకులే. 8
గన్ధమాదనశైలేన్ద్రనామ్ని కాచిత్కలస్థలీ
విద్యతే కీర్ణకుసుమా ద్రుమకర్పూరకేసరా. 9

ఈ జగత్తను పురాతన గృహముయొక్క విశాలమగు నొక కోణమున నిమ్నోన్నత పర్వతములచే పరివ్యాప్తమగు వాయువ్యభాగమున గంధమాదనమను పర్వతముపై, పుష్పములచే వ్యాప్తమును, పుష్పవృక్షములను కర్పూరపరాగసదృశ కేసరములు గలదియునగు వన ప్రదేశ మొండు గలదు.

విచిత్రవర్ణవిహగా నానావల్లీవిలాసినీ
వనేచరవ్యాప్తతటీ పుష్పకేసరభాసినీ. 10

క్వచిత్స్నిగ్ధమహారత్నా క్వచిల్లోలామ్బుజోత్పలా
క్వచిన్నీహారకబరీ సరసీదర్పణా క్వచిత్. 11

అయ్యద్రి యొకచోట విచిత్రములైన పక్షులతో కూడినదై, మఱియొకచోట పలువిధ లతలచే విలాసయుక్తమై, వనచర జంతువులచే వ్యాప్తమగు తటములగలదై, పుష్పకేసరములచే ప్రకాశవంతమై, నిర్మల మహారత్నములచే ప్రపూర్ణమై, చంచల కమల సహితమై, నీహారమను కేశముల ధరించినదై, నిర్మల విశాల తటాకములను దర్పణములు గలదై యొప్పుచుండె.

తత్రకస్మింశ్చిదుదితే సానౌ సరలపాదపే
ఆగుల్ఫాకీర్ణకుసుమే స్నిగ్ధచ్ఛాయమహాద్రుమే. 12

ఉద్దాలకో నామ మునిర్మానీ మానీ మహామతిః
అప్రాప్తయౌవనః పూర్వమువాసోద్దామతాపసః. 13

అందు, సరళవృక్షసహితమును, గుల్ఫములవఱకు పుష్పములచే పూర్ణమును, ఘనచ్ఛాయాయుక్త వృక్షసహితమును, మిగుల యున్నతమును నగు నొక శిఖరప్రదేశమున, తన ప్రయత్నములచే అవశ్యము పురుషార్థమును సాధించెదనను నిశ్చయముగలవాఁడును, ఉదారబుద్ధియు, యౌవనదశ నింకను బొందనివాడును, ఉత్తమ తపంబాచరించువాడునగు ఉద్దాలకుఁడను మునీంద్రుడు పూర్వము వసించుచుండె.

ప్రథమంతు బభూవాసావల్పప్రజ్ఞో విచారవాన్
అప్రాప్తపదవిశ్రాన్తిరప్రబుద్ధః శుభాశుభః. 14

మొట్టమొదట యాతఁడల్పబుద్ధియు, విచారశీలుడును, పరమపదమున విశ్రాంతి నొందనివాడును, అప్రబుద్ధుడును, జ్ఞానప్రాప్తికి యోగ్యమగు శుద్ధాంతఃకరణము గలవాఁడునునై యుండెను.

తతః క్రమేణతపసా శాస్త్రార్థనియమైః క్రమైః
వివేక ఆజగామైనం నవర్తురివ భూతలమ్. 15

కాని, పిదప క్రమముగ తపస్సుచేతను, శాస్త్రనియమములచేతను, భూమండలమున వసంతకాలము ప్రవేశించునట్లు, వానియందు వివేక ముదయమాయెను.

అథేమం చిన్తయామాస సంసారామయభీరుధీః
ఏకాన్తఏవ నివసన్కదాచిత్కాన్తమానసః. 16

తదనంతరము, సంసారరోగముయెడ భీతిల్లిన బుద్ధిగలవాడును, శుద్ధచిత్తుడునునగు ఉద్దాలకుఁడు ఏకాంతమున వసించుచు, ఈ చెప్పబోవురీతి చింతన జేసెను.

కింతత్ప్రాప్తం ప్రధానం స్యాద్యద్విశ్రాన్తౌ నశోచ్యతే
యత్ప్రాప్య జన్మనా భూయః సంబన్ధో నోపజాయతే. 17



ఎద్దానియందు విశ్రాంతిగొనిన, మనుజుడు మఱల దుఃఖింపఁడో, దేనిని బొందిన మఱల నిఁకను జన్మసంబంధముండదో అట్టి ముఖ్యమగు ప్రాప్యవస్తువెయ్యది ?

కదాహం త్యక్తమననే పదే పరమపావనే
చిరం విశ్రాన్తిమేష్యామి మేరుశృఙ్గ ఇవామ్బుదః. 18

మేరుపర్వత శిఖరముపై మేఘమువలె, నే నతిపవిత్రమై మనోవ్యాపారరహితమైనట్టి యుత్తమపదమున చిరకాలమెపుడు విశ్రమింతునో !

కదా శమముపైష్యన్తి మమాన్తర్భోగసంవిదః
ఆలోలకల్లోలరవా ఊర్మయోఽమ్బునిధావివ. 19

చంచలములును, శబ్దసహితములును, కల్లోలయుతములునగు తరంగములు క్రమముగ సముద్రమున శాంతి నొందునట్లు భోగతృష్ణ నాయందెపుడు శమించునో!

ఇదం కృత్వేదమప్యన్యత్కర్తవ్యమితి కల్పనామ్
కదాన్తర్విహసిష్యామి పదవిశ్రాన్తయా ధియా. 20

‘ఈ కార్యమొనర్చి అన్యమగు ఈ కార్యమునుగూడ చేయవలెనను’ కల్పనను జూచి ఆత్మపదమున విశ్రమించిన బుద్ధిగల నేను నాయందెపుడు మిగుల విహసింతునో!

కదా వికల్పజాలం మే న లగిష్యతి చేతసి
స్థితమప్యుజ్ఝితాసఙ్గం పయః పద్మదలే యథా. 21

కమలపత్రముపై జలమున్నను, అయ్యదద్దానినంటనట్లు ఆభాసమాత్రముననుండినను వికల్పజాలము నా చిత్తమున యెపుడు సంలగ్నముగాకయుండునో !

కదా బహులకల్లోలాం నావా పరమయా ధియా
పరితీర్ణో భవిష్యామి మత్తాం తృష్ణా తరఙ్గిణీమ్. 22

అతి కల్లోలయుతమై, అజ్ఞానముచే ప్రవర్ధితమైనట్టి తృష్ణానదిని, మిగులయుత్తమబుద్ధియను నౌకచే నేనెపుడు తరింతునో?

కదేమాం జాగతైర్యాతైః క్రియమాణామసన్మయీమ్
క్రియామపహసిష్యామి బాలలీలామివాకులామ్. 23

లోకమందలి ప్రాణికోట్లొనర్చు ఈ యసత్క్రియను చపలబాలకుని లీలవలె గాంచి నేనెప్పుడు విహసించెదనో.

కదావికల్పపర్యస్తం మనో దోలావదోలనమ్
శమమేష్యతి మే శాన్తవాతౌజస ఇవభ్రమః. 24

వికల్పములచే విక్షిప్తమును, ఊయెలవలె చంచలమునునగు నా మనంబు, శమించిన ఉన్మాదవాతరోగియొక్క భ్రమవలె యెపుడు ప్రశమన మొందునో.

కదోదిత వపుర్భాసా విహసజ్ఞాగతీర్గతీః
అన్తః సంతోషమేష్యామి విరాడాత్మేవ పూర్ణధీః. 25

ఆత్మస్వరూపప్రకాశముచే ప్రాపంచికగతిని జూచి నవ్వుచు పూర్ణబుద్ధిగల్గి బ్రహ్మాండ శరీరధారియగు విరాట్పురుషునివలె నాయంతఃకరణమున యెపుడు సంతుష్టినడయుదునో!

అన్తః సమసమాకారః సౌమ్యః సర్వార్థనిస్పృహః
కదోపశమమేష్యామి మన్థముక్తామృతాబ్ధివత్. 26

అంతఃకరణమున సమరూపముగల్గి, పరమాత్మతోటి యేకత్వమునొంది, శాంతుడనై, ధర్మార్థకామములందును, అమృతకౌస్తుభాదులందును నిస్స్పృహత్వముగల్గి, మందరాచలములేని క్షీర సముద్రమువలె యెపుడు శాంతినొందెదనో!

కదేమామచలాం దృశ్యశ్రియమాశాశతాత్మికామ్
సర్వాం సుషుప్తవత్పశ్యన్భవిష్యామ్యన్తరాతతః. 27

పలువిధయాశలచే పూర్ణమగు అచంచలమైన ఈ దృశ్యశోభయంతను సుషుప్తునివలె సన్మాత్రరూపమున గాంచుచు యెపుడు శాంతిని బొందెదనో!

సబాహ్యాభ్యన్తరం సర్వం శాన్తకల్పనయా ధియా
పశ్యంశ్చిన్మాత్రమఖిలం భావయిష్యామ్యహం కదా. 28

కల్పనలన్నియు శమించినట్టి బుద్ధిచే బాహ్యాభ్యంతర జగత్తునంతయు చిన్మాత్రముగ వీక్షించుచు, అట్టి చిన్మాత్రభావనచే సుస్థిరుడ నెపుడగుదునో!

కదోపశాన్తచిత్తాత్మా చిత్తాముపగతః పరామ్
పరమాలోకమేష్యామి జాత్యన్ధవిగమాదివ. 29

శాంతచిత్తుడనై, చిదేకరసత్వమునొంది, జన్మాంధున కంధత్వము నశించిన పరికాశము గల్గులాగున పరమప్రకాశమునెపుడు బడయుదునో!

కదాభ్యాసోపలభ్యేన చిత్ప్రకాశేన చారుణా
దూరాదాలోకయిష్యామి తన్వీం కాలకలామిమామ్. 30

అభ్యాసలభ్యమగు ఉత్తమచిత్ప్రకాశముచే, శేషించిన తుచ్ఛమగు కాల-కళను దూరముగ నేనెపుడు గాంచుదునో!

ఈహితానీహితైర్ముక్తో హేయోపాదేయవర్జితః
కదాన్తస్తోషమేష్యామి స్వప్రకాశపదే స్థితః. 31

ఇష్టానిష్ట హేయోపాదేయ వర్జితుడనై, స్వప్రకాశపదమున స్థితిగల్గి, యెపుడంతఃకరణమున నే ముదమొందుదునో!

కదాశా కౌశికీకీర్ణా జాడ్యజీర్ణహృదమ్బుజా
క్షయమేష్యతి కృష్ణేయం కదా మే దోషయామినీ. 32

దురాశలను గుడ్లగూబలచే వ్యాప్తమై, జడత్వమను మంచుచే హృదయకమలమును నశింపజేయునదై, అవిద్యాజనితమగు అంధకారమయమై, దోషపూర్ణమైనట్టి ఈ కృష్ణపక్షపురాత్రి యెపుడు శమించునో!



కదోపశాన్తమననో ధరణీధరకన్దరే
సమేష్యామి శిలాసామ్యం నిర్వికల్పసమాధినా. 33

మనోవ్యాపారరహితుడనై పర్వతగుహయందు నిర్వికల్పసమాధిచే శిలాసాదృశ్యము నేనెపుడొందుదునో!

కదా మే మానమాతఙ్గః స్వాభిమానమహామదః
సత్త్వావబోధహరిణా హతో నాశముపైష్యతి. 34

స్వాభిమానమను మహామదముగల నా యహంకారమను గజము పరమార్థసన్మాత్ర జ్ఞానమను సింహముచే వధింపబడి యెపుడు వినాశమొందునో!

నిరంశధ్యానవిశ్రాన్తేర్మూకస్య మమ మూర్ధని
కదా తార్ణం కరిష్యన్తి కులాయం వనపూర్ణికాః. 35

నిర్వికల్పధ్యానమున విశ్రాంతినొంది, మౌనవ్రతావలంబినైయున్న నా శిరముపై వనవిహంగములెపుడు తృణములచే గూటిని నిర్మించుకొనునో!

కదా నిఃశఙ్కమురసి ధ్యానధీరధియః ఖగాః
మమ విశ్రాన్తిమేష్యన్తి శైలస్థాణ్వచలస్థితేః. 36

ధ్యానమున స్థిరబుద్ధిగల్గి, పర్వతమువలెను, లేక స్థాణువువలెను నిశ్చలముగనున్నట్టి నా యొక్క వక్షస్థలముపై వ్రేలాడుచున్న జడలచే నిర్మింపబడిన గూటియందు పక్షులెపుడు విశ్రాంతినొందునో!

తృష్ణాకరఞ్జజటిలాం జన్మజర్జరగుల్మికాం
సంసారారణ్యసరసీం త్యక్త్వా యాస్యామ్యహం కదా. 37

తృష్ణయను కంటకవృక్షసహితమై, కామాది మృగముల సంచారముచే శిథిలీభూతమైన వివిధ జన్మలను లతాగుల్మయుక్తమైన ఈసంసారారణ్య మహాతటాకమును నేనెపుడు విడచిపోవుదునో!

ఇతి చిన్తాపరవశో వన ఉద్దాలకో ద్విజః
పునః పునస్తూపవిశన్ధ్యానాభ్యాసం చకార హ. 38

ఇట్లావనమున చింతాపరవశుడై ఉద్దాలక బ్రాహ్మణుడు మరల మరల యాసీనుడై ధ్యానమభ్యసింప సాగెను.

విషయైర్నీయమానే తు చిత్తే మర్కటచఞ్చలే
న స లేభే సమాధానప్రతిష్ఠాం ప్రీతిదాయినీం. 39

మర్కటమువలె చపలమగు చిత్తమును విషయములు తమవైపునకు లాగుచున్నందున సంతోషదాయకమగు స్థిరప్రతిష్ఠను సమాధియందాతడు పొందజాలక పోయెను.

కదాచిద్బాహ్యసంస్పర్శపరిత్యాగాదనన్తరం
తస్యాగచ్ఛచ్చిత్తకపిః ప్రోద్వేగం సత్త్వసంస్థితౌ. 40

ఒక్కొక్కప్పుడు బాహ్యవిషత్యాగముచే సత్వగుణప్రధానమగు సమాధియందు స్థితి సంభవింప, వెంటనే రజోగుణముచే విక్షుబ్ధమగు వాని చిత్తవాసనము భయాలస్యాదియుక్తమై యుద్వేగము నొందుచుండెను.

కదాచిదాన్తరస్పర్శాన్పరిత్యజ్య మునేః కపిః
లోలత్వాత్తస్య సంయాతో విషయం విషదగ్ధవత్. 41

ఒక్కొక్కప్పుడు సమాధిసుఖమును త్యజించి వాని మనోమర్కటము, విషముచే మృతి నొందినవాడు లోకాంతరమేగునట్లు విషయములనైపున కేగుచుండెను.

కదాచిదుదితార్కాభం తేజో దృష్ట్వాన్తరే మనః
విషయోన్ముఖతాం యాతం తస్య తామరసేక్షణ. 42

కమలనేత్రుఁడవగు నోరామా! మఱియొకపుడు బ్రహ్మస్వరూపమగు హృదయాకాశమున నుదితమైన సూర్యునివంటి జ్యోతినిజూచి యాతని మనస్సు విషయోన్ముఖమగుచుండెను.

ఆన్తరాన్ధ్య తమస్త్యాగం కృత్వా విషయలమ్పటమ్
తస్యోడ్డీయ మనో యాతి కదాచిత్త్రస్తపక్షివత్. 43

ఒకపుడు బ్రహ్మస్వరూపమును దర్శించుటచే వాని మనంబు అంతఃకరణమందలి అజ్ఞానాంధకారమును త్యజించి కొంచెముపశమించినను మఱల విషయానుసంధానముచే వెంటనే విషయాసక్తమై పీడితవిహంగమువలె యెగిరిపోవుచుండెను.

బాహ్యానాభ్యన్తరాన్సర్వాంస్త్యక్త్వా నిద్రాంచ తన్మనః
తమస్తేజోన్తికే లేభే కదాచిచ్ఛాశ్వతీం స్థితిమ్. 44

మఱియొకప్పుడు వాని మనస్సు విషయసుఖమును, సమాధిసుఖమును గూడ త్యజించి అజ్ఞానాత్మజ్యోతుల రెంటి మధ్యను అయించి చిరకాలాభ్యస్తమగు సన్నిద్రాస్థితినే బొందుచుండెను.

ఇతి పర్యాకులస్యాన్తః స ఖలు ధ్యానవృత్తిషు
దరీష్వన్వహముగ్రాసు వాతమగ్న ఇవ ద్రుమః. 45
అతిష్ఠద్ధ్యానసంరూఢమననః సంకటే యథా
దోలాయితవపుస్తుచ్ఛ తృష్ణాతీరతరఙ్గకైః. 46

ఇట్లు భయంకర పర్వత కందరప్రదేశములందు ప్రతిదినము ధ్యానతత్పరుఁడగు ఉద్దాలకుఁడు ధ్యానవృత్తులందు వ్యాకులత్వము నొందుచు, తృష్ణాతరంగములచే చలింపబడునట్టి దేహముగల్గి, వాయుకంపితమైన తీరస్థవృక్షమువలె సంకటమున బడియుండెను.

అథ పర్యాకులమనా విజహార మునిర్గిరౌ
ప్రత్యహం దివసాధీశో మహామేరావివైకకః. 47

అంత, మహామేరుపర్వతముపై సూర్యుఁడేకాకియై చరించునట్లు, వ్యాకులచిత్తుడగు నాయుద్దాలకుఁడా పర్వతముపై సంచరింపసాగెను.



సమస్తభూతదుష్ప్రాపా మేకదా ప్రాప కన్దరామ్
సంశాన్తసర్వసంచారాం మునిర్మోక్షదశామివ. 48

అట్లు సంచరించుచుండ నొక సమయమున, సర్వప్రాణులకును దుష్ప్రాపమై జీవసంచారరహితమైన గుహనొకదానిని, ఒకానొక ముని మోక్షస్థితినొందినట్లాతడు పొందగల్గెను.

అపర్యాకులితాం వాతైరప్రాప్త మృగపక్షిణీమ్
అదృష్టాం దేవగన్ధర్వైః పరమాకాశశోభనామ్. 49
పుష్పప్రకరసంఛన్నాం మృదుశాద్వల కోమలామ్
జ్యోతీరసాశ్మసంప్రోతైః కృతాం మరకతైరివ. 50
సుస్నిగ్ధశీతలచ్ఛాయాం ప్రకటాం రత్నదీపకైః
సుగుప్తాం వనదేవీనామన్తఃపురకుటీమివ. 51
కులమ్బునా హిమాలోకాం నాత్యుష్ణాం నాతిశీతలామ్
శారదస్యోదితార్కస్య హేమగౌరీం ప్రభామివ. 52
బాలాలోక పరిమ్లానాం కోమలాశబ్దమారుతామ్
మఞ్జరీ జటిలోపేతాం బాలాం మాలావతీమివ. 53
ఉపశమ పదవీమివానురూపాం
కమలజవిశ్రమణాయ యోగ్యరూపామ్
కుసుమనికర కోమలాభిరామాం
సరసిజ కోటరకోమలాం సమన్తాత్.

ఇత్యార్షే వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ఉద్దాలకమనోరథో నామైకపఞ్చాశః
సర్గః ॥ 51 ॥

---

అధికవాయుసంచార రహితమును, పక్షులచే నప్రాప్తమును, దేవగంధర్వాదులచే గూడ నదృష్టమును, బ్రహ్మదేవునివలె శోభించునదియు, పుష్పసమూహములచే నాచ్ఛాదితమును, నూతన తృణములచే కోమలమును, చంద్రకాంతమణులచే కూర్పబడినదగుటచే మరకతమణులచే నిర్మితమైనట్లు తోచుచున్నదియు, ద్వారప్రదేశమున ఘనీభూతమైన శీతలచ్ఛాయ గలదియు, రత్నదీపములచే ప్రకటితమును, వనదేవతల సురక్షితమైన యంతఃపురము వంటిదియు, ద్వారమున అత్యుష్ణము అతిశీతలమున్ను గాని ప్రకాశముచే వ్యాపింపబడినదియు, శరత్కాలోదిత బాలసూర్యుని గౌరవర్ణకాంతివలె యొప్పుచున్నదియు, ప్రాతఃకాల సూర్యతేజముచే పరిమ్లానమై, మందగతిగల్గి శబ్దరహితమైనట్టి వాయువు గలదియు, లతారూప జటలచే శోభించు వృక్షములచే పూర్ణమైనట్టి సమీపప్రదేశము గలదియు, పుష్పమాలగ్గైకొని స్వయంవరమున నుద్యుక్తమైన రాజకన్యవలె గన్ప

ట్టుచున్నదియు, కమలమధ్యభాగమువలె కోమలమును, కనుకనే బ్రహ్మదేవునకు నివాసయోగ్యమైనదియు, నలువైపుల పుష్పసమూహములుగల్గి కోమలమై రమణీయమై యలరుచున్నదియు, ఉపశమపదమువలె నిరంతర మాశ్రయింపయోగ్యమునునగు యా గుహ నుద్దాలకుఁడు పొందెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ఉద్దాలకమనోరథమను ఏకపంచాశ
సర్గము ॥ 51 ॥

---

## ద్విపఞ్చాశః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సతాం వివేశ ధర్మాత్మా గన్ధమాదన కన్దరామ్
చిత్రభ్రమణ సంప్రాప్తామలిః పద్మకుటీమివ. 1

శ్రీవసిష్ఠుడు:—బహుకాల పరిభ్రమణముచే లభించినట్టి కమలకోటరమున తుమ్మెద ప్రవేశించునట్లు ధర్మాత్ముఁడగు నాయుద్దాలకుఁడా గంధమాదన పర్వతకందరమునఁ బ్రవేశించెను.

సమాధానోన్ముఖతయా ప్రవిశన్స వ్యరాజత
సర్గవ్యాపార విరతావాత్మపుర్యామివాబ్జజః. 2

సమాధ్యున్ముఖుఁడై యాతఁడందు ప్రవేశించుట జూడ సృష్టివ్యాపారమునుండి విరక్తుడై బ్రహ్మదేవుడు సత్యలోకమందలి తన యపరాజితపురమును బ్రవేశించుచున్నట్లుండెను.

చకారాసనమమ్లానైః పత్రైరన్తస్స్వగుచ్ఛకమ్
మృదుమేఘవిధిర్వృన్దమమ్భోదమివ తత్ర సః. 3

నూతన పత్రములచే కోమలమై పుష్పగుచ్ఛసహితమైనట్టి ఆసనమును, ఇంద్రుడు మేఘసమూహముల నిర్మించునట్లాతడు నిర్మించెను.

స తత్ప్రస్తారయామాస పృష్ఠే చారు మృగాజినమ్
నీలరత్న తటే మేరుస్తారాసారమివామ్బరమ్. 4

మేరుపర్వతము తన రత్నమయ తటముపై తారాగణంబను బహుమూల్య రత్నములతో గూడినట్టి యాకాశమును విస్తరించునట్లు, ఆతడు తనయాసనముపై మృగచర్మమును బఱచెను.

స తత్రోపావిశద్వృత్తీశ్చేతసస్తనుతాం నయన్
అన్తః శుద్ధవపుః శృఙ్గే వృష్య మూక ఇవామ్బుదః. 5

అచ్చోటు, విషయత్యాగముచే తన చిత్తవృత్తులను సూక్ష్మపఱచుచు శుద్ధాంతఃకరణుడై తత్స్థానంతరము పర్వతముపై మేఘమువలె, నిశ్చలముగ నుండెను.



బుద్ధవత్సువృథం బద్ధపద్మాసన ఉదఙ్ముఖః
పార్ష్ణిభ్యాం వృషణౌ ధృత్వా చకార బ్రాహ్మమఞ్జలిమ్. 6

ఉత్తరాభిముఖుఁడై ప్రబుద్ధులగు కపిలాదులవలె, పద్మాసనము వైచుకొని, కాలిమడమలచే వృషణముల నొక్కిబట్టి బ్రహ్మాది గురుపరంపరాప్రాప్తమగు ప్రణామాంజలిని సమర్పించెను.

వాసనాభ్యః సమాహృత్య మనోమృగముపప్లుతమ్
నిర్వికల్పసమాధ్యర్థం చకారేమాం విచారణామ్. 7

విషయముల వైపునకు బరువిడుచున్న మనోమృగమును వాసనలనుండి తప్పించి నిర్వికల్పసమాధినిమిత్త మాతడిట్లు చింతనజేసెను.

అయి మూర్ఖ మనః కోఽర్థస్తవ సంసారవృత్తిభిః
ధీమన్తో న సషేవన్తే పర్యన్తే దుఃఖదాం క్రియామ్. 8

ఓమూర్ఖమానసమా! సాంసారిక వృత్తులచే నీకేమి ప్రయోజనము? అంతమున దుఃఖములనే గల్గించునట్టి క్రియలను బుద్ధిమంతు లాచరింపరు గదా!

అనుధావతి యో భోగాం స్త్యక్త్వా శమరసాయనమ్
సంత్యజ్య మన్దారవనం స యాతి విషజఙ్గలమ్. 9

శాంతియను అమృతమును వదలి విషయభోగముల వైపునకు బరువిడువాడు కల్పవృక్షసహితమగు వనమును త్యజించి విషవృక్షములుగల యరణ్యమునకు బోవుచందమున నుండును.

యది యాసి మహీరన్ధ్రం బ్రహ్మలోకమథాపి వా
తన్న నిర్వాణమాయాసి వినోపశమనామృతమ్. 10

ఓ మనసా! నీవు పాతాళమునకు బోయినను లేక బ్రహ్మలోకమున కేగినను సరే శాంతియను అమృతములేనిచో నిర్వాణమందు, అనగా నిత్యనిరతిశయానందమున నీకెన్నటికి విశ్రాంతి లభింపదు.

ఆశాశతావపూర్ణత్వే త్వమేవం సర్వదుఃఖదమ్
త్యజ్య యాహి పరం శ్రేయః పరమేకాన్తసున్దరమ్. 11

ఆశలన్నియు పూర్ణములుగానిచో నీవందఱకును దుఃఖప్రదమేయగుదువు. కాన, భోగములందలి యాశలఁద్యజించి, దుఃఖరహితమై, నిరతిశయానందరూపమై, అత్యంత సుందరమై, పరమశ్రేయమైనట్టి మోక్షమును పొందుము.

ఇమా విచిత్రాః కలనా భావాభావమయాత్మికాః
దుఃఖాయైవ తవోగ్రాయ న సుఖాయ కదాచన. 12

ఇష్టసంపత్తి, అనిష్టనివారణములతో గూడిన ఈ పలువిధ విషయములన్నియు నీకు మిక్కిలి దుఃఖమునే కలుగజేయును గాని సుఖమెన్నటికిని కాదు.

శబ్దాదికాభిరేతాభిః కిం మూర్ఖ హతవృత్తిభిః
భ్రమస్యవిరతం వ్యర్థం మేఘే మణ్డూకికా యథా. 13

మనోమణ్డూకికే వ్యర్థమియన్తం కాలమన్ధయా
భ్రమన్త్యా భువనం క్షిప్రం కిం సమాసాదితం త్వయా. 14

ఓ మూర్ఖమనసా! మేఘమందు కప్పవలె ఈ శబ్దాది వృత్తులందేల నిరంతరము వ్యర్థముగ సంచరించుచుంటివి? ఓ మనోమండూకమా! ఇంతకాలము జగత్తంతటను వ్యర్థముగ దిరుగుచు నీవేమి పొందగల్గితివి?

యస్మాత్కించిదవాప్నోషి యస్మిన్నవ్యాహసి నిర్వృతిమ్
తస్మింశ్చేతః శమే మూర్ఖ నానుబధ్నాసి కిం పదమ్. 15

మూర్ఖచిత్తమా! దేనిచే మనోవాగతీతమగు నిదేహకైవల్యసుఖమును పొందెదవో, మఱియు దేనియందు జీవన్ముక్తి సుఖమును సంప్రాప్తినొందెదవో అట్టి సర్వవృత్త్యుపరమరూపమగు సమాధికై నీవేల యత్నించుటలేదు?

ఆగత్య శ్రోత్రతాం మూర్ఖ వ్యర్థోత్థానోపబృంహితామ్
ధియా శబ్దానుసారిణ్యా మృగవన్మా క్షయం వ్రజ. 16

ఓ. మూర్ఖచిత్తమా! బహిర్ముఖత్వముచే వ్యర్థముగ వృద్ధినొందిన శ్రోత్రేంద్రియముతో యభేదమువడసి శబ్దానుసారిణియగు బుద్ధిచే, లుబ్ధకుని గీతమును, లేక ఘంటానాదమునననుసరించిన మృగమువలె క్షయము నొందకుము.

త్వక్తామాగత్య దుఃఖాయ స్పర్శోన్ముఖతయా ధియా
మూర్ఖ మా బద్ధతామేహి గజీలుబ్ధగజేన్ద్రవత్. 17

మూర్ఖచిత్తమా! బాహ్యస్పర్శోన్ముఖమగు బుద్ధిచే త్వగింద్రియముతో నభేదముఁజెంది, కరిణిలోభముచే కరిరాజు పగిది బంధమున తగుల్కొనుము.

రసనాభావమాగత్య గర్ధేనాన్ధ దురన్ధసామ్
మా నాశమేహి బడిశపిణ్డీలమ్పటమత్స్యవత్. 18

దుష్టాన్నలోభముచే రసనేంద్రియ దశనొంది, గాలమునకు కట్టబడిన ఎరయందాసక్తిగల మత్స్యమువలె నశింపకుము.

చాక్షుషీం వృత్తిమాశ్రిత్య ప్రభారూపచయోన్ముఖీమ్
మా గచ్ఛ దగ్ధతాం ముగ్ధ కాన్తిలుబ్ధపతఙ్గవత్. 19

అట్లనే, పలువిధరూపములవైపునకు పరువిడుచు నేత్రవృత్తినొంది, రూపలోభముచే మిడుతవలె దగ్ధముగాకుము.

ఘ్రాణమార్గముపాశ్రిత్య శరీరామ్భోజకోటరే
గన్ధోన్ముఖతయా బన్ధం మా త్వం సంశ్రయ భృఙ్గవత్. 20



గంధోన్ముఖమై శరీరమను కమలకోటరమున నాసికారూపత్వము నొంది, తుమ్మెదవలె బంధనము నాశ్రయింపకుము.

కురఙ్గాలిపతఙ్గేభమీనాస్త్వేకైకశో హతాః
సర్వైర్యుక్తైరనర్థైస్తు వ్యాప్తస్యాజ్ఞ కుతః సుఖమ్. 21

అజ్ఞమానసమా! మృగ, భ్రమర, పతంగ, గజ, మత్స్యములు ఒక్కొక్క ఇంద్రియానర్థముచే వధింపబడినవి. అట్టిచో పంచేంద్రియానర్థములతో కూడిన వానికిక సుఖమెచట?

హే చిత్త వాసనాజాలం బన్ధాయ భవతోఽహితమ్
స్వాత్మనః సహజః ఫేనస్తతః కుకృమిణా యథా. 22

ఓ చిత్తమా! దుష్టకృమియైన పట్టుపురుగు తననుండి సహజముగ వెలువడు చొంగను తన్నుఁ దానుబంధించుకొనుటకే విస్తరింపజేయుచున్నట్లు, ఈ వాసనాజాలమును స్వబంధనార్థమే నీవు రచించితివి.

శరదభ్రవదాగత్య శుద్ధిం త్యక్తభవామయామ్
యది శామ్యసి నిర్మూలం తదనన్తో జయస్తవ. 23

జననమరణాదిరూపమగు సంసారరోగరహితమై, కర్మోపాసనాదులద్వారా శరత్కాల మేఘమువలె శుద్ధివడయు, శ్రవణాదులపరిపాకముచే జ్ఞానప్రాప్తికాగా, అజ్ఞానముసమూలముగ నశించ నీకపుడనంత జయము సంప్రాప్తమగును.

క్షయోదయదశాధాత్రీం పర్యన్తపరితాపినీమ్
జానన్నపి జగత్సృష్టిం న త్యక్ష్యసి వినంక్ష్యసి. 24

ఓ చిత్తమా! జననమరణ బాల్యయౌవన వార్ధక్యాది దశలుగలదియు, మరణానంతరమును నరక, స్థావరాదిగతిరూపమగు తాపము గల్గజేయునదియునగు ఈ జగత్ప్రవృత్తి నెఱింగియు, నీవద్దానిని త్యజింపక యందే లీనమై నశించుచుంటివేమి?

కరోమ్యథ కిమర్థం వా తవైతదనుశాసనమ్
విచారణవతః పుంసశ్చిత్తమస్తి హి నానఘ. 25

నీవు హితము లేనిదానవు కాన నీకీ హితోపదేశము వ్యర్థమగును. విచారవంతుడగువాడు చిత్తమును పూర్ణముగ నాశమే యొనర్పవలెను.

యావదజ్ఞానఘనతా తావత్ప్రఘనచిత్తతా
యావత్ప్రావృడ్ జలదతా తావన్నీహారభూరితా. 26

యావదజ్ఞానతనుతా తావచ్చిత్తస్య తానవమ్
ప్రావృట్ పరిక్షయో యావత్తావన్నీహార సంక్షయః. 27

వర్షర్తునందు మేఘములధికముగ నుండునంతవఱకు, మంచుకూడ నధికముగనే యుండునట్లు, అజ్ఞానాధిక్యత యుండునంతవఱకు చిత్తాధిక్యతయు నుండును. మఱియు ఆ వర్షాకాలమేఘ

మెంతవఱకు సన్నగిల్లునో, అంతవఱకు నీహారమున్ను క్షయించునట్లు, అజ్ఞానమెంతవఱకు న్యూనత్వము నొందునో అంతవఱకు చిత్తమున్ను న్యూనత వహించును.

యావత్తానవమాయాతం శుద్ధం చిత్తం విచారతః
తావత్తత్క్షీణమేవాహం మన్యే శారదమేఘవత్. 28

(తత్వ) విచారణద్వారా వాసనాక్షయముకాగా చిత్తమెంతవఱకు శుద్ధత్వమునొందునో, అంతవఱకయ్యది శరత్కాలమేఘమువలె క్షయమొందెననియే నేనెంచుచున్నాను.

అనుశాసనమేతద్యదసతో నశ్యతోఽథవా
క్రియతే తన్నభోవారి పవనాహననైః సమమ్. 29

అవివేకియొక్క అసద్రూపచిత్తమునకును, వివేకియొక్క నాశశీలమగు చిత్తమునకును గావించునట్టి ఉపదేశము ఆకాశ, జల, వాయు తాడనమువలె వ్యర్థమగును ఏలన, అవివేకిచిత్తము మార్పునొందదు; వివేకిచిత్తము నశించియేతీరును.

తస్మాత్సంక్షీయమాణత్వాత్త్యజామి త్వామసన్మయమ్
మౌర్ఖ్యం పరమమేవాహుః పరిత్యాజ్యానుశాసనమ్. 30

కాన నోచిత్తమా! నాశశీలమగుటచే అసద్రూపమగు నిన్ను నేను త్యజించుచున్నాను. ఏలన, త్యజింపయోగ్యమగుదాని కుపదేశించుట పరమమూర్ఖత్వమని యెన్నబడినది.

నిర్వికల్పోఽస్మి చిద్దీపో నిరహంకారవాసనః
త్వయాఽహంకారబీజేన న సంబద్ధోఽస్మ్యసన్మయ. 31

నేను నిర్వికల్పుడను; చిద్రూపదీపకుడను; అహంకారవాసనారహితుడను. అసద్రూపమగు నో చిత్తమా! అహంకారమునకు బీజభూతమైన నీతోటి యిక నాకెట్టి సంబంధమును లేదు.

అయం సోఽహమితి వ్యర్థం దుర్దృష్టిరవలమ్బితా
త్వయా మూఢ వినాశాయ శఙ్కావిషవిషూచికా. 32

ఈ శరీరము నేను, ఆ యాత్మ నేను- అనునీ దుర్దృష్టిని మిథ్యావిషవిషూచికవలె, అజ్ఞుల వినాశార్థము నీవవలంబించితివి.

అనన్తస్యాత్మతత్త్వస్య తతస్త్వతి మనసి స్థితిః
న సంభవతి బిల్వాన్తర్వాసితా దన్తినో యథా. 33

బిల్వఫలమున ఏనుగ వసింపజాలనట్లు, అనంతమగు ఆత్మతత్వము పరిచ్ఛిన్న స్థితిగల మనంబున యుండనేరదు.

మహాశ్వభ్రీవ గమ్భీరా దుఃఖదా వాసనాశ్రితా
త్వయైషా బత చిత్తేతి నైనామనుసరామ్యహమ్. 34

ఓ చిత్తమా! కామక్రోధాది పిశాచములకు స్థానభూతమగు పురాతనగర్తమును, మిగుల దుఃఖప్రదమునునగు వాసనను నీవు నీకాశ్రయమొనర్చుకొంటివి. ఇక యీ వాసనను నేననుసరించుట లేదు. కాని నీవిద్దాని నింకను యనుసరించుచున్నందున అట్టి నిన్ను కూడ నేను త్యజించుచున్నాను.



కః కిలాయం ముధా మోహో బాలస్యేవావిచారిణః
అయం సోఽహమితి భ్రాన్తిస్త్వయాహన్తా పరికల్పితా. 35

'ఈ దేహము నేను, ఆ యాత్మ నేన'ను యహంభావముచే నీవు కల్పించిన ఈ మిథ్యాభ్రాంతి విచారశూన్యుడగు బాలునివలె మహామోహరూపమే యగును. విచారవంతుడగు నాకిద్దానితో నేమి సంబంధము ?

పాదాఙ్గుష్ఠాచ్ఛిరో యావత్కణశః ప్రవిచారితమ్
న లబ్ధోఽసావహం నామ కః స్యాదహమితి స్థితః. 36

కాలి బొటనవ్రేలునుండి శిరస్సువఱకు గల ఈ శరీరముయొక్క అణు అణువును నేను లెస్సగ విచారించితిని; కాని యిందహంపదయోగ్యమగు వస్తువెయ్యదియు గన్పట్టలేదు.

భరితాశేష దిక్కుఞ్జం యత్సామ్యమేకం జగత్త్రయే
సంవేదన మసంవేద్యం సర్వత్ర విగతాత్మకమ్. 37

దిక్కులన్నిటిని పరిపూర్ణమొనర్చునదియు, ముల్లోకములందును యేకరూపమై వెలుంగునదియు, దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమును, సర్వత్ర అన్యపదార్థరహితమును నగు కేవల జ్ఞానమాత్రమే నేనగుదును

దృశ్యతే యస్య నేయత్తా న నామ పరికల్పనా
నైకతా నాన్యతైవేహ న మహత్తా నచాణుతా. 38

పరిచ్ఛిన్నరూపము, నామవికల్పన, ఏకత్వము, అనేకత్వము, మహత్వము, అణుత్వమున్ను దేనికి లేవో అట్టి జ్ఞానస్వరూపుడనే నేను.

వేదతత్త్వాం స్వసంవేద్య మాతతం దుఃఖకారణమ్
వివేకజేన బోధేన తదిదం హన్యసే మయా. 39

జ్ఞానస్వరూపుడనుగాన సాక్షిరూపముచే, సంవేద్యమును దుఃఖకారణమును నైన చిత్తరూపమగు నిన్ను నే గాంచుచున్నాను. ఇట్లు వివేకజనితమగు జ్ఞానముచే నిన్ను నేను వధించుచున్నాను.

ఇదం మాంసమిదం రక్తమిమాన్యస్థీని దేహకే
ఇమే తే శ్వాసమరుతః కోఽసావహమితి స్థితః. 40

ఇది మాంసము, ఇది రక్తము, ఇవి యెముకలు, ఇవి ప్రాణవాయువులు - ఇక యీ దేహమున అహంభావరూపమున నున్నదెద్ది?

స్పన్దో హి వాతశక్తీనామవబోధో మహాచితః
జరామృతిశ్చ కాయేఽస్మిన్కోఽసావహమితి స్థితః. 41

ఈ దేహమునగల సంచలనశక్తి ప్రాణవాయువులది; ఇందుగల జ్ఞానము మహాచైతన్యమునకు సంబంధించినది; జరామరణాద్యవస్థలు శరీరమునకు జెందినవి. ఇక యిందహంభావరూపమున నుండగలదు?

మాంసమన్యదసృక్చాన్యదస్థీన్యన్యాని చిత్త హే
బోధోఽన్యః స్పన్దనం చాన్యత్కోఽసావహమితి స్థితః. 42

మాంసము, రక్తము, యెముకలు, జ్ఞానము, చలనశీలములగు యింద్రియములు, అన్నియు అహంపదమునకు భిన్నములేయగును. అట్టిచో యిందహంభావరూపమున నున్న దెద్ది?

ఇదం ఘ్రాణమియం జిహ్వా త్వగియం శ్రవణే ఇమే
ఇదం చక్షురసౌ స్పర్శః కోఽసావహమితి స్థితః. 43

ఇది నాసిక, ఇది జిహ్వ, ఇది త్వక్కు, ఇది కర్ణద్వయము, ఇది నేత్రద్వయము, ఇది స్పర్శ - ఇక యిందహంభావరూపమున యేదిగలదు?

యథా భూతతయా నాహం మనో న త్వం న వాసనా
ఆత్మా శుద్ధచిదాభాసః కేవలోఽయం విజృమ్భతే. 44

యథార్థముగ విచారించిన మనస్సు అహంపదవాచ్యము కానేరదు. ఇక నో చిత్తమా! నీవుగాని, వాసనగాని అహంపదవాచ్యులు కారు చిన్మాత్రప్రకాశమగు ఆత్మయే అహంభావరూపమున ప్రకాశించుచున్నది.

అహమేవేహ సర్వత్ర నాహం కించిదపీహ వా
ఇత్యేవ సన్మయీ దృష్టిర్నేతరో విద్యతే క్రమః. 45

ఆరోపదృష్టిచే అంతయు నేనే; అపవాదదృష్టిచే యేమియు నేనుగాను; ఇదియే సత్యమైన దృష్టికాని అన్యమగు దేహాహంభావదృష్టి కాదు.

చిరమజ్ఞాన ధూర్తేన పోథితోఽస్మి త్వహం స్వయం
వృకేణ దృప్తేనాటవ్యాం లబ్ధేన పశుపోతకః. 46

భయంకరమగు తోడేటిచే గోవబాలకుం డరణ్యమున బాధితుడగునట్లు అజ్ఞానమను ధూర్తునిచే చిరకాలము నేను బాధింపబడితిని.

దిష్ట్యేదానీం పరిజ్ఞాతో మయైవాజ్ఞానతస్కరః
పునర్న సంశ్రయామ్యేనం స్వయమాత్మార్థాపహారిణమ్ 47

కాని సౌభాగ్యవశమున యిపుడీ యజ్ఞానమను చోరుని నేను గనుగొంటిని. పరమార్థమగు ఆత్మధనము నపహరించునట్టి వీని నేనిక యాశ్రయింపను.

నిర్దుఃఖో దుఃఖయోగ్యస్య నాహం తస్య న చైష మే
కశ్చిద్భవతి శైలస్య తత్స్థ ఏవ యథామ్బుదః. 48

దుఃఖరహితుడనగు నేను దుఃఖయోగ్యుడనెన్నటికిని గానేరను. పర్వతముపైనున్న మేఘము పర్వతముతోటి సంబంధములేకయున్నట్లు, అట్టిదుఃఖముతో నాకెట్టి సంబంధమునులేదు.

భూత్వా త్వహమిదం వచ్మి వేద్మి తిష్ఠామి యామి చ
ఆత్మానలోకనేనాహ మనహంకారతాం గతః. 49



నటునివలె అహంకారరూపముధరించి నేను నీకుపదేశాదుల నొసర్చుచున్నాను. శరీరమును ధరించిమాత్రమే నేను తెలిసికొనుచు, ఉండుచు, వచ్చుచు, పోవుచు నున్నాను. ఏలన, ఆత్మసందర్శనమున నేనిక అహంకారవిషయుడను కానుగదా!

నూనమేవాహమేవైతే మన్యే జ్ఞాశ్చక్షురాదయః
యాన్తు తిష్ఠన్తు వా దేహే మమైతే తు న కించన. 50

నేత్రాది యింద్రియములన్నియు నిక్కముగ నేనే అయియున్నాను. నాకంటె వేఱుగ నున్నచో జడరూపములేయగును. అట్టివి దేహమున నుండినను, పోయినను సరే. నాకు వాటితో సంబంధమేమియును లేదు.

కష్టం కోఽయమహం నామ కథం కేనోపకల్పితః
జగద్బాలకవేతాలస్తాలోత్తాలాతులాకృతిః. 51

హా! కష్టము! ఈ 'నేన'నునది యెవడు? ఈతడెట్లు యెవనిచే కల్పింపబడెను? తాళవృక్షముకంటెను పొడవైన యాకృతిగల్గి జగత్తను బాలకునకిది బేతాలుని పగిదినున్నది.

ఏతావన్తం చిరం కాలం వ్యర్థమాలుఠితోఽవటే
అహమత్ర తృణోన్ముక్తే దురద్రౌ హరిణో యథా. 52

ఇంతకాలమువఱకు గోతివంటి దీనియందు, తృణరహితపర్వతముపై హరిణమువలె నేను పొరలుచున్నాను.

స్వార్థమాలోకనే చక్షుర్యది తూన్ముఖతాం గతమ్
తదహం నామ కోఽసౌ స్యాద్యోఽస్మిన్దుఃఖేన మోహితః. 53

స్పర్శనాయ నిజే తత్త్వే యది జాతా త్వగున్ముఖీ
తత్కోఽయం స్యాదహం నామ కుపిశాచ ఇవోదితః. 54

రసేష్వభినిషణ్ణేఽస్మిన్స్వక్రమే రసనేన్ద్రియే
అహం మృష్టభుగిత్యేష కుతస్త్యః కుత్సితో భ్రమః. 55

శబ్దశక్తిం గతే శ్రోత్రే వరాకే స్వార్థపీడితే
తదహంకారదుఃఖస్య నిర్బీజస్య క ఆగమః. 56

ఆత్మంభరిత్వేన నిజే ఘ్రాణే స్వం గన్ధమాగతే
అహం ఘ్రాతేతి యో మాతా తం చోరం నైవ వేద్మ్యహమ్. 57

నేత్రేంద్రియము తన విషయమగు రూపమును గాంచుటయందే మగ్నమైయుండిన, ఇక దుఃఖముచే విమోహితుడగునట్టి అహంపదవాచ్యుడీ దేహమున యెవడైయుండును? అట్లనే త్వగింద్రియము స్పర్శనమాత్రోన్ముఖమేయగుచో, దుష్టపిశాచమువలె జనించు, అహంభావరూపమున ఈ దేహమున నున్నదెవడు? జిహ్వేంద్రియము రసమెఱుంగుటయందే సంలగ్నమైయుండిన, 'నేను స్వాదిష్ట పదార్థములను భుజించువాడనను' దుష్టభ్రమ యెటునుండి వచ్చినది? శబ్దశక్తియుక్తమగు, అతిదీనమగు కర్ణేంద్రియమువలన శబ్దగ్రహణశక్తియుండ,

నిర్మూలమగు అహంకారదుఃఖప్రసంగ మెచట? స్వోదరపోషణాసక్తి (గంధమాత్రమున లోభము) గల ఘ్రాణేంద్రియము స్వవిషయమగు గంధమున జనుచుండ, 'నేనాఘ్రాణించువాడన'ను యభిమానము గల్గియుండు ఆ చోరు డెవడో నే నెఱుంగకున్నాను.

మృగతృష్ణాక్రమేణైషా భావనా వ్యర్థభావినీ
భావస్తస్యామసత్యాయాం యః సోఽయమితి సంభ్రమః. 58

ఇట్లింద్రియాదులందు అహంకారకల్పన మృగతృష్ణవలె మిథ్యయేయని తేలినది. అత్తరి యొక 'దేహేంద్రియాదులు నేన'ను భావన కేవలము భ్రాంతిమాత్రమే యగును. కాన దేహాదులంది యాత్మభావము పరిత్యజింపదగినది.

వాసనాహీనమప్యేతచ్చక్షురాదీన్ద్రియైః స్వతః
ప్రవర్తతే బహిః స్వార్థే వాసనా నాత్ర కారణమ్. 59

వాసనారహితమైనను ఈశరీరము తనజీవనహేతువగు కర్మయందు ప్రవృత్తిగలిగియే యుండును. కాన శరీరవ్యాపారమున వాసన కారణముగా నేరదు.

వాసనారహితం కర్మ క్రియతే నను చిత్త హే
కేవలం నానుభూయన్తే సుఖదుఃఖదృశోఽగ్రగాః. 60

ఓ చిత్తమా! వాసనారహితమగు కర్మయందు 'నేనుదుఃఖిని'ను యనుభవముకలుగదు. ఇక సావిశేషసుఖదుఃఖానుభవము ఉండనేయుండదు. ఇదియే వాసనాత్యాగమువలని గుణము.

తస్మాన్మూర్ఖాణీన్ద్రియాణి త్యక్త్వా సర్వాసనాం నిజామ్
కురుధ్వం కర్మ హే సర్వం న దుఃఖం సమవాప్స్యథ. 61

కాన మూర్ఖులగునో యింద్రియములారా! మీరు మీమీ వాసనలనుబరిత్యజించి కర్మ ములనొనర్చుచో దుఃఖమునొందక యుందురు.

భవద్భిరేవదుఃఖాయ వాసనా వాసితా ముధా
బాలైః పఙ్కక్రీడనకం వినాశేనేవ భిన్నతా. 62

మొదట మృత్తికచే బొమ్మలఁజేసి, అపిదప వానివినాశముచే దుఃఖమునొందునట్టి బాలురవలె మీరును విషయోపార్జనమందును, విషయవినాశమందును కేవలము దుఃఖార్థమే మీయందు వాసనను కల్పించుకొనిరి.

వాసనాద్యాదృశః సర్వా వ్యతిరిక్తాస్తు నాత్మనః
జలాదివ తరఙ్గాద్యా జ్ఞస్యైవాన్యస్య నానఘ. 63

పాపరహితమగునో శుద్ధచిత్తమా! తరంగములు జలముకంటె వేఱుగానట్లు ఈవాసనాది దృష్టులన్నియు జ్ఞానికి ఆత్మకంటె భిన్నములుకావు.

తృష్ణయైవ వినష్టాః స్థ వ్యర్థమిన్ద్రియబాలకాః
కోశకారకృమయస్తన్తునేవ స్వయంభువా. 64



ఓ యింద్రియబాలకులారా! పట్టుపురుగు తననుండి తీసినదారముచే తానునశించునట్లు మీరున్ను మీచేకల్పింపబడిన తృష్ణచే వ్యర్థముగ నాశమొందకుడు.

తృష్ణయైవేహ లుఠథ జరామరణసంకటే
భ్రమదృష్ట్యేవ శిఖరి పథికాః శ్వభ్రభూమిషు. 65

ఓ యింద్రియములారా! పర్వతశిఖరముపై బోవుచున్న బాటసారి పిత్తవశమున కలతపుగ, క్రిందబడి పొరలునట్లు మీరున్ను ఈసంసారమను కంటకశిలావృతభూమిపైబడి క్రిందపొరలుచున్నారు.

వాసనైవేహ భవతాం హేతురేకత్ర బన్ధనే
రజ్జుః శూన్యాశయప్రోతా ముక్తానామాతతా యథా. 66

రంధ్రములగుండా గ్రుచ్చబడిన దారము ముత్యముల బంధనమున కెట్లు కారణమగునో, అట్లే మీ బంధమునకును వాసనయే కారణమగును.

కల్పనామాత్రకలితా సత్యైషా హి న వస్తుతః
అసంకల్పనమాత్రేణ దాత్రేణేవ విలూయతే. 67

ఈ వాసన భ్రాంతిమాత్రమున కల్పింపబడినదికాని యథార్థముకాదు, కాననది యసంకల్పనమాత్రమను శస్త్రముచే ఛేదింపబడుచున్నది.

ఏషా హి భవతామేవ విమోహాయ క్షయాయ చ
వాతలేఖేవ దీపానాం స్ఫురతామపి తేజసామ్. 68

దీపము, కొఱవి, విద్యుత్తున్నగువాని వినాశమునకు వాయువు కారణమగు చందమున ఈ వాసన మీ యజ్ఞానమునకును, మీ వినాశమునకును హేతువగుచున్నది.

హే చిత్త సర్వేన్ద్రియకోశ తస్మాత్సర్వేన్ద్రియైరైక్యముపేత్య నూనమ్
ఆలోక్య చాత్మానమసత్స్వరూపం నిర్వాణమేవామలబోధమాస్స్వ. 69

సర్వేంద్రియముల కాధారభూతమగు నో చిత్తమా! పై కారణములచే, ఇంద్రియము లన్నింటితోడ నీ వేకత్వమునొంది, నీ స్వరూపము నసత్తుగనిశ్చయించి, సాక్షిరూపమగు నిర్మల బోధమాత్రమై యుండుము.

విషయవిషవిషూచికామనన్తాం
నిపుణమహం స్థితివాసనామపాస్య
అభిమతపరిహారమన్త్రయుక్త్యా
భవ విభవో భగ వాస్మియామ భూమిః. 70

ఇత్యార్షే వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ఉద్దాలకవిచారో నామ ద్విపఞ్చాశః
సర్గః ॥ 52 ॥

ఓ చిత్తమా! సర్వశాస్త్రజ్ఞుల యభిమతమైన ద్వైతరాహిత్యమను మంత్ర-యుక్తిచే, అసంఖ్యదుఃఖాదాయకమును, అహంకారవాసనామయమును, విషయసంబంధ విష (అజ్ఞాన) ప్రేరితమునునగు విషూచికను అతినిపుణతతో త్యజించి, సంసారరహితుడవై, జననమరణాది సర్వవిధభయముల కనాస్పదమైనట్టి పూర్ణానందాత్మస్వరూపుడవు గమ్ము.

ఇది శ్రీవాసిష్ఠ-తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ఉద్దాలకవిచారమను ద్విపంచాశ
సర్గము. ॥ 52 ॥

---

త్రిపఞ్చాశః సర్గః

---

ఉద్దాలక ఉవాచ:—

అపారపర్యన్తవపుః పరమాణ్వణురేవ చ
చిదచేత్యా తదాక్రాన్తా న శక్తా వాసనాదయః. 1

ఉద్దాలకుడు:—అనంతాకారయుతమును, అత్యంత సూక్ష్మమును, విషయరహితమునునగు చిత్తును స్పృశింప వాసనాదులు కొంచెమైనను సమర్థములుగావు.

మనఃశేముష్యహంకార ప్రతిబిమ్బైర్జడేన్ద్రియైః
వాసనావితతాః శూన్యా వేతాలత్రాసనోద్యతాః. 2

బుద్ధ్యహంకారములందు, బేతాళునివలె భయార్థము విస్తరింప జేయబడిన సూక్ష్మ వాసనలను, చిత్ప్రతిబింబితములై జడరూపములైన, ఇంద్రియములచే మనస్సనుభవించుచున్నది.

తత్కృతేభ్యో విచారేభ్యోఽనుభూతేభ్యోఽపి భూరిశః
భూయోఽప్యనుభవత్యన్తరహం హి చిదలేపికాః. 3

జాగ్రదవస్థయందు గావింపబడిన విషయవిచారములచేతను, అనుభవించిన విషయములచేతను, స్వప్నమున నాడీఛిద్రాంతర్గతమున వాసనామయములగు విషయములను మరల ఈ మనస్సే యనుభవించుచున్నది. కాని చిత్స్వరూపుడనగు నేను నిర్లిప్తుడనై యున్నాను.

స్వదుర్భావోపరచితాం దేహః సంసారసంస్థితమ్
గృహ్ణాత్వథ త్యజతు వాస్యహం హి చిదలేపికా. 4

ఈ స్థూలదేహము తన దుష్క్రియలచే రచించిన ఈ సంసారస్థితిని తాను గ్రహించుగాక, త్యజించుగాక, చిద్రూపుడనగు నేను మాత్రము నిర్లిప్తుడనైయే యున్నాను.

చితో న జన్మమరణే సర్వగాయాశ్చితః కిల
కింనామ మ్రియతే జన్తుర్మార్యతే కేన వాపి కిమ్. 5



చిత్తునకు జననమరణములులేవు. ఏలన సర్వవ్యాపియు, నిరాకారమునునగు చైతన్యమున నశించునదేది? కాన జీవుడు దేనిచే నశింపబడును? వానియందు నశించునదెద్ది?

చితో న జీవితేనార్థః సర్వాత్మా సర్వజీవితమ్
కిం ప్రాప్స్యతి కదాత్మైషా ప్రాయతా యది జీవితమ్. 6

చిత్తునకు జీవితముతో టిన్ని ప్రయోజనమేమియులేదు. ఏలన సర్వాత్మయగు చైతన్యమే అందఱి జీవితమున్ను యగును. మఱియు, సమస్తదేశకాల వస్తువులందును చిత్స్వరూపమే వ్యాపించియుండ, యిక నద్దానికి జీవితమందేకాలమున యే పదార్థమభిలషితమై యుండును?

జీవ్యతే మ్రియతే చేతి కువికల్పకమాలినీ
కలనా మనసామేవ నాత్మనో విమలాత్మనః. 7

ఇది మరణించుచున్నది, ఇది జీవించుచున్నది - ఈ మున్నగుకువికల్పకల్పనలన్నియు మనస్సునకే గాని నిర్మలమగు ఆత్మకు గావు.

యో హ్యహంభావతాం ప్రాప్తో భావాభావైః స్వగృహ్యతే
ఆత్మనో నాస్త్యహంభావో భావాభావాః కుతోఽస్య తే. 8

దేహాదులందహంభావముగలదే జనన మరణాదులకు గుఱియగుచున్నది; ఆత్మయందట్టి యహంభావము లేనందున యిక దానికి జనన మరణము లెచట?

అహంభావో ముధా మోహో మనశ్చ మృగతృష్ణికా
జడః పదార్థసంభారః కస్యాహంకారభావనా. 9

దేహమందలి యహంభావము కేవలము మిథ్యామోహరూపమే యగును. అహంకారమనంబులును మృగతృష్ణవలె మిథ్యయగుటచే వానియందలి యహంభావమున్ను సత్యమైనది కాదు. పదార్థసమూహము జడమైనదికాన అయ్యది అభిమానయోగ్యము కానేరదు. కాన యిక దేహమందహంభావము గల్గుట యెవరికి?

రక్తమాంసమయో దేహో మనో నష్టం విచారణాత్
జడాశ్చిత్తాదయః సర్వే కుతోఽహంభావభావనా. 10

ఈ దేహము రక్తమాంసాదిమయమై యున్నది. మనస్సు విచారముచే నశించుచున్నది. చిత్తాదులన్నియు జడములు. ఇక వీనియందహంభావమునకు తావెచట!

ఆత్మాభరితయా నిత్యమిన్ద్రియాణి స్థితాన్యలమ్
పదార్థాశ్చ పదార్థత్వే కుతోఽహం భావభావనా. 11

ఇంద్రియములన్నియు తమతమ రూపాది విషయముల సాక్షాత్కరించుటయందే మగ్నమైయున్నవి. పదార్థములన్నియు తమతమ పదార్థత్వమును వ్యక్తమొనర్చుటయందే స్థితిగల్గియున్నవి. ఇక దీని కహంభావన యెచట?

గుణో గుణార్థే వర్తన్తే ప్రకృతౌ ప్రకృతిః స్థితా
సదేవ సతి విశ్రాన్తం కుతోఽహంభావభావనా. 12

సత్వరజస్తమోగుణములు, ప్రకాశప్రవృత్తి మోహరూపములగు తమ వ్యాపారములందు సంలగ్నమైయున్నవి. త్రిగుణముల సామ్యావస్థయందు ప్రకృతి, లేక ప్రధానమనునట్టి మాయగలదు. సుప్తబ్రహ్మ తన స్వాత్మభావమున నెలకొనియుండును. ఇక వీని యందహంభావమునకు చోటెద్ది ?

సర్వగం సర్వదేహస్థం సర్వకాలమయం మహత్
కేవలం పరమాత్మానాం చిదాత్మైవేహ సంస్థితః. 13

ఇక యీ దేహమునగల చిదాభాసుడు సర్వవ్యాపియు, సర్వకాలమయుఁడును, మహత్తరరూపుఁడునునగు కేవల పరమానంద చిదాత్మయే గాన, దేహమందహంభావన వానికిన్ని గలుగనేరదు.

ఏవం కిమాకృతిః కోవా కిమాదేశశ్చ కింకృతః
కింరూపః కింమయః కోహం కింగృహ్ణామి త్యజామి కిమ్. 14

ఇట్లుండ నిక యీ దేహమున అహంభావముగల వాడెవఁడు ? వాని యాకారమెద్ది ? అతడెట్లు నిరూపింపబడును ? అతని వర్ణమెద్ది ? అతడెద్దాని మయుఁడైయుండును ? అట్టి యహంభావముచే నే నెవఁడను ? దేనిని గ్రహించుచున్నాను, దేనిని త్యజించుచున్నాను ?

తేనాహం నామ నేహాస్తి భావాభావోపపత్తిమాన్
అనహంకారరూపస్య సంబన్ధః కేన మే కథమ్. 15

ఇవ్విధమున భావాభావములచే యుక్తియుక్తము గానందున, ఈ ప్రపంచమున అహంభావాభిమాని యథార్థముగ నెవరును లేరని నిశ్చితమగుచున్నది. మఱియు అహంకారరహిత చిదాత్మస్వరూపుఁడనగు నాకెద్దానిచే నేమి సంబంధము ?

అసత్యలమహంకారే సంబన్ధః కస్య కేన కః
సంబన్ధాభావసంసిద్ధౌ విలీనాద్వైత్వకల్పనా. 16

అహంకారము పూర్ణముగ అసత్తేయని నిశ్చయింపబడ నిక యెవనికి దేనితో నేమి సంబంధము ? అట్లు సంబంధాభావము సిద్ధింప నిక ద్వైతకల్పన నశించినట్లే యగును.

ఏవం బ్రహ్మాత్మకమిదం యత్కించిజ్జగతిస్థితమ్
సదేవాస్మి తదేవాస్మి పరిశోచామి కిం ముధా. 17

ఇట్లే జగత్తంతయును బ్రహ్మాత్మకమే అయియున్నది. అట్టి సత్స్వరూపుఁడనే యగు నే నేల వ్యర్థముగ శోకింపవలెను ? ఏలన, యిపుడు నేనద్వైతసామ్రాజ్యమున స్థితుఁడనై యుంటి.

ఏకస్మిన్నేవ విమలే పదే సర్వగతే స్థితే
అహంకారకలఙ్కస్య కథం నామోదయః కుతః. 18

ఏకమై, నిర్మలమై, సర్వవ్యాపకమై, శుద్ధమై ఆత్మపదము వెలయుచుండ యిక అహంకారము కళంక మెటనుండి యెట్లు సంభవించును.

నాస్త్యేవ హి పదార్థశ్రీరాత్మైవాస్తేహ సర్వగః
పదార్థలక్ష్మ్యాం సత్యాం చ సంబన్ధోస్తి న కస్యచిత్. 19



యథార్థముగ పదార్థజాల మెద్దియును లేదు. సర్వవ్యాపియగు ఆత్మమాత్రమే కలదు. కాని ఆభాసమాత్రమున నెపుడైన పదార్థముల సత్తసంభవించిన, ఆత్మతోటి దానికట్టి సంబంధమును యుండనేరదు.

ఇన్ద్రియైరిన్ద్రియైరర్థైర్మనో మనసి వల్గతి
చిదలిప్తవపుః కేన సంబన్ధః కస్య కిం కథమ్. 20

స్వప్నవపురూపమున కల్పింపబడిన ఇంద్రియములతోడ మనస్సు మనస్సునందే స్వప్నమువలె విజృంభించుచున్నది కాగాని బాహ్యపదార్థములను సాక్షాత్కరించుటయందది సమర్థమైనది కాదు. చిత్-శరీరము నిర్లిప్తమైనది. కాన ఇంద్రియ, బాహ్యార్థములతో సక్తముగాక యుండును. ఇక దేనితోటి దేనికి సంబంధమెట్లు పొసగును ?

ఉపలాయః శలాకానాం సంబన్ధో న యథా మిథః
తథైకత్రాపి దృష్టానాం దేహేన్ద్రియమనశ్చితామ్. 21

పాషాణ, మణి, లోహ శలాకలకు పరస్పర సంబంధము లేనట్లు, ఒక చోనున్నట్లు కాన్పించినను ఇంద్రియ, మన, చేతనంబులకు సంబంధమేమియును లేదు.

అసదభ్యుత్థితే వ్యర్థమహంకారమహాభ్రమే
మమేదమిదమస్యేతి విపర్యస్తమిదం జగత్. 22

అజ్ఞానముచే నీ యహంకారమను మహాభ్రమ యుదయింప ‘ఇది నాది, ఇది వానిది’ అను నీ వ్యవహారములచే జగత్తు భ్రాంతి నొందుచున్నది.

అతత్త్వాలోకజాతేయ మహంకారచమత్కృతిః
తాపేన హిమలేఖేవ తత్త్వాలోకే విలీయతే. 23

ఆత్మతత్త్వమును గాంచమిచే నీ యహంకార చమత్కృతి యుదయించుచున్నది. ఆత్మదర్శనముచే నయ్యది, వేడిమిచే మంచువలె నశించును.

ఆత్మనో వ్యతిరేకేణ న కించిదపి విద్యతే
సర్వం బ్రహ్మేతి మే తత్త్వమేతత్తద్భావయామ్యహమ్. 24

ఆత్మకు భిన్నముగ నెద్దియును లేదు. అంతయు బ్రహ్మమే యనునది నాకనుభవసిద్ధము గాన నేనట్టి బ్రహ్మమునే భావించెదను.

అహంకారభ్రమస్యాస్య జాతస్యాకాశవర్ణవత్
అపునః స్మరణం మన్యే నూనం విస్మరణం వరమ్. 25

ఆకాశవర్ణమువలె మిథ్యారూపమున నుత్పన్నమైన ఈ యహంకారభ్రమను, మరల స్మృతిపథమునకు రాకుండునట్లు పూర్ణముగ విస్మరించుటయే యుత్తమమని నేను నిశ్చయముగ నెంచుచున్నాను.

సమూలం సంపరిత్యజ్య చిరాయాహంకృతిభ్రమమ్
తిష్ఠామ్యాత్మని శాన్తాత్మా శరత్థం శరదీవ ఖే. 26

మూలావిద్యాసహితముగ ఈ యహంకారభ్రమను సర్వదా త్యజించి శాంతాత్ముడనై, శరదాకాశము తన నిర్మలస్వభావరూపమగు యాకాశమున వలె నేను నా యాత్మయందు స్థితుండనై యున్నాను.

దదాత్యనర్థనిచయం విస్తారయతి దుష్కృతమ్
విస్తారయతి సంతాప మహంభావోఽనుసంహితః. 27

వృద్ధినొందినట్టి ఈ దేహాదులందలి యహంభావము పెక్కు యనర్థములం గల్గజేయును. మఱియు, పాప సంతాపముల వృద్ధిబఱచును.

స్ఫురత్యహంకారఘనే హృద్వ్యోమ్ని సలిలాత్మని
వికసత్యభితః కాయకదమ్బే దోషమఞ్జరీ. 28

హృదయాకాశమున అహంకారమను మేఘము స్ఫురింప, దుర్వాసనలను జలము చే, తడుపబడి దేహమను కదంబవృక్షమున దోషజాలమను లత నలువైపుల వికాసమునొందుచున్నది.

మరణం జీవితోపాన్తం జీవితం మరణాన్తగమ్
భావో భావాద్వ్యవచ్ఛిన్నః కష్టేయం దుఃఖవేదనా 29

పరలోక దుఃఖములు పునర్జన్మము వఱకు గలుగుచునేయుండును. ఇహలోక దుఃఖములు, ఆ మరణాంతమును సంభవించుచునేయుండును. భోగ్యపదార్థములన్నియు నాశవంతములు. అహో! ఈ దుఃఖవేదన యెంతకష్టతరమైనది!

ఇదం లబ్ధమిదం ప్రాప్స్యమీత్యార్తిర్దాహకారిణీ
న శామ్యత్యర్కరత్నానాం గ్రీష్మేఽగ్నిరివ దుర్ధియామ్. 30

'దీనిని పొందితిని, దీనిని పొందుదున'ను నీ యంతఃకరణమును విదగ్ధమొనర్చునట్టి యజ్ఞుల దుఃఖవేదన గ్రీష్మర్తువందలి సూర్యకాంతమణుల అగ్నివలె యెన్నటికిని శాంతింపనేరదు.

నాస్తీదమిదమస్తీతి చిన్తా ధావత్యహంకృతిమ్
జడాశయా జడామభ్రమాలా శైలావలీమివ. 31

'ఇది కలదు, ఇది లేద'ను నీ యజ్ఞుల చింత, జలాశ్రయమగు మేఘపంక్తి పర్వతముల వైపునకు బరువిడునట్లు, అహంకారము వైపునకు బరువిడుచున్నది.

అహంభావే పరిక్షీణే శుష్కః సంసారపాదపః
భూయః ప్రయచ్ఛత్యరసో న పాషాణవదఙ్కురమ్. 32

దేహాదులందలి యహంభావము సంక్షయింప, సంసారవృక్షము యెండి నీరసమగును. కాన శిలయందంకురములు మొలవనట్లు రాగద్వేషాది యంకురములందు మొలవవు.

స్వతృష్ణా కృష్ణభోగిన్యో దేహద్రుమకృతాలయాః
క్వాపి యాన్తి విచారాత్మన్యాగతే వినతాసుతే. 33

ఈ దేహ-వృక్షమున నెలవేర్పఱచుకొనిన తృష్ణయను కాలసర్పము ఆత్మజ్ఞానమను గరుడుని యాగమనముచే యెచటికో పాఱిపోవుచున్నది.



అసదభ్యుత్థితే విశ్వే తజ్జాతే భ్రమసన్మయే
అసన్మయపరిస్పన్దే త్వహం త్వం చేతి కః క్రమః. 34

ఈ ప్రపంచ మజ్ఞానముచే నుత్పన్నమైనదనియు, అజ్ఞానకారణమునే సత్యముగ భాసించుచున్నదనియు, అయ్యది అసద్వ్యవహారయుక్తమనియు తెలియబడ, 'నీవు' 'నేను' యనునీ భేదభావములకిక తానెచట?

ఇదం జగదుదేత్యాదావకారణమకారణాత్
యదకారణముద్భూతం తత్సదిత్యుచ్యతే కథమ్. 35

కారణత్వమున కయోగ్యమగు అజ్ఞానమునుండి అకారణముగ నీ ప్రపంచ మావిర్భవించినది. కారణములేకయే జనించినది సత్యమెట్లనంబడును?

అపర్యన్తపురాకాలే మృది కుమ్భ ఇవాకృతిః
దేహో భవదిదానీం తు తథైవాస్తి భవిష్యతి. 36

మృత్తికయందు ఘటమువలె ఈ దేహము తన యుత్పత్తికి పూర్వము, అనాది కాలమునుండి చిద్రూపముననే యుండియుండెను. ఇపుడును అట్లనే యున్నది. భావికాలముననను అట్లనే యుండును.

మధ్యేతరపయోమాత్రం కంచిత్కాలం చలాచలమ్
ఆద్యన్తసౌమ్యతే త్యక్త్వా వారి వీచితయా యథా. 37

తన యుత్పత్తికి పూర్వమును, ఉత్తరకాలమందును తరంగము జలమాత్రమే యగుచు, మధ్య కొంతకాలము మాత్రము, చంచలతరంగరూపముననున్నను, అపుడుకూడ జలముకంటె వేఱుగా లేనట్లు, ఈ దేహాదులున్ను త్రికాలములందు బ్రహ్మరూపముగనే యున్నవి.

అస్మిన్క్షణపరిస్పన్దే దేహే విసరణోన్ముఖే
తరఙ్గేచ నిబద్ధాస్థా యే హతాస్తే కుబుద్ధయః. 38

క్షణకాలము మాత్రము చేష్టాసహితమై మఱల నాశోన్ముఖమగునట్టి ఈ దేహ, తరంగములందు విశ్వాసముగల దుష్టమానవులు నశించినవారే యగుదురు.

ప్రాక్పురస్తాచ్చ సర్వాణి సన్తి వస్తూని నాభితః
మధ్యే స్ఫుటత్వమేతేషాం కైవాస్థా హతరూపిణీ. 39

ఉత్పత్తికి పూర్వమును, ఉత్తరకాలమందు యెచటను యే పదార్థమున్నలేదు. కాని మధ్యకాలమున మాత్రము పరిచ్ఛిన్నరూపమున భాసించుచున్నవి. అట్టి నశ్వర పదార్థములందిక విశ్వాసమేల?

చిత్తం పూర్వం పురస్తాచ్చ చిద్దేహం శాన్తమిత్యపి
సదసద్వా ఖసంలీనం మధ్యేఽస్మిన్కిం తవోదితమ్. 40

అట్లే, చిత్తము (లింగశరీరము)న్ను తన యుత్పత్తికి పూర్వము చిన్మాత్ర స్వభావమే గలదగుచు ఉత్తరకాలముననను, అట్టి శాంతరూపమేగలదై, ఆకాశమున లీనమైనట్లుండి, సదసద్రూప

ముచే అనిర్వచనీయమై యొప్పుచున్నది. అట్టిచో మధ్యకాలమునను బ్రహ్మమునకది భిన్నముగాకయే యున్నదగును.

యథాస్వప్న వికారేషు యథాసంభ్రమదృష్టిషు
యథావా మదలీలాసు యథా నౌయానసంభ్రమే. 41
యథా ధాతువికారేషు యథా చేన్ద్రియవిక్లవే
యథాతి సంభ్రమానన్దే దోషావేశదశాసుచ. 42
దృశ్యతే క్షీయతే చైవ రూపం సదసతోశ్చలమ్
తథైవేయమిహా త్వేషా కాలే న్యూనాతిరిక్తతా. 43
సాచ త్వయా కృతా నిత్యం చిత్తదుఃఖసుఖోదయే
యథావియోగయామిన్యో మతయో హా స్తి రాగిణామ్. 44

స్వప్నవికారములందును, వ్యాఘ్రాదులఁగూర్చిన సంభ్రమదృష్టులందును, మదలీలలందును, నౌకాయాత్రాసంభ్రమమందును, పిత్తాది వికారములందును, నేత్రాది యింద్రియములు కలుషితములుకాఁగా గన్పట్టు ద్విచంద్రాది భ్రమలందును, ప్రియతమలాభజనిత హర్షమందును, కాముకుల కామాదిదశలందును, భావాభావప్రతీతి క్షణకాలముమాత్రముండి, మఱల వెంటనే భాధింపబడుటచే యెట్లు నశించునో, అట్లనే ఈ సంసారభ్రాంతిని గూర్చియు నెఱుంగవలెను. కాని ఈ రెంటియందును విశేషమేమన, సంసారభ్రాంతి అధికకాల (మోక్షపర్యంత) ముండును; స్వప్నాదుల భ్రాంతి అల్పకాలముండును. మఱియు వ్యావహారికవస్తువులందలి సత్యత్వభ్రాంతిచే సంయోగవియోగముల ద్వారా గల్గు నిత్యసుఖదుఃఖోదయముచే, కాలముయొక్క యీ న్యూనత్వాధికత్వములు (చిత్తము) నీచేతనే కల్పింపబడినవై, స్త్రీపుత్రాదులు మరణించకున్నను, దుష్టప్రతారకుని వాక్యములచే జనించిన మరణబుద్ధిచే, దారాదులందనురాగముగల పురుషుని కల్పితవియోగరాత్రి బాధించు చందమున, నిన్నును బాధించుచున్నవి.

మయైవేహా సదభ్యాసాన్మిథ్యా సదివ లక్ష్యసే
మృగతృష్ణేవ తేనైత త్త్వత్కృతం మత్కృతం భవేత్. 45

ఓ చిత్తమా! ఇందు నీయపరాధ మేమియు లేదు. కాని నీయందహంభావముగల్గియుండుట యభ్యాసమైనందున మృగతృష్ణవలె అసత్తైనను నీవు నాకు సత్తువలెనే గన్పట్టుచున్నావు. ఇక్కారణమున నీవొనర్చినది నేనొనర్చినట్లె యగుచున్నది.

యదిదం కించితాభోగి తత్సర్వం దృశ్యమణ్డలమ్
అవస్త్వితి వినిర్ణీయ మనోయాత్యమనఃపదమ్. 46

ఈ విశాల దృశ్యమండలమంతయు అవస్తువని నిశ్చయించుటచే మనస్సు అమనస్కపదము (బ్రహ్మరూపత్వము) నొందును.

అవస్త్విదమితి స్ఫారే రూఢే మనసి నిశ్చయే
హేమన్త ఇవ మఞ్జర్యః క్షీయన్తే భోగవాసనాః 47



ఈ ప్రపంచము మిథ్యయను యున్నతి నిశ్చయము మనమున దృఢపడ, హేమంతఋతువందు పుష్పమంజరులవోలె భోగవాసనలు సంక్షయించును.

చిత్త్వాద్దృష్టాత్మనా నూనం సంత్యక్తమనసౌజసా
మనసా వీతరాగేణ స్వయం స్వస్థేన భూయతే. 48

చిత్ప్రతిబింబగ్రహణముచే చిత్తరూపమై వెలయునదియు ఆత్మదర్శియు, సంకల్పవికల్పములఁ ద్యజించునదియు, రాగరహితమునునగు శుద్ధమనస్సు స్వయముగనే స్వస్థతనొందును.

పరమాత్మానలే క్షిప్తం సంవృత్త్యావయవం స్వయమ్
దగ్ధ్వాత్మానమలం చిత్తం శుద్ధతామేతి శాశ్వతీమ్. 49

చిత్తము తన అవయవరూపములగు ఇంద్రియాదులను బహిర్ముఖత్వమునుండి మఱలించి తత్త్వజ్ఞానముచే పరమాత్మయను అగ్నియందు బడద్రోయుటద్వారా తనచిత్తరూపమును విదగ్ధమొనర్చి అత్యంత నిత్యనైర్మల్యత్వము నొందుచున్నది.

దేహమన్యతయా దృష్ట్వా త్యక్త్వా విషయవాసనామ్
వినాశమురరీకృత్య మనో జయతి వీరవత్. 50

ఈ చిత్తము దేహమును తనకంటె భిన్నముగ గాంచి, విషయవాసనను త్యజించి, స్వవినాశమును గూడ యంగీకరించి, యుద్ధమున వీరునివలె బ్రహ్మలోకమును జయించుచున్నది.

మనః శత్రుః శరీరస్య శరీరం మనసోరిపుః
ఏకభావేన నశ్యేతే ఆధారాధేయకార్యవత్. 51

మనస్సు దేహసంతాపకరమును, దేహము మనస్సంతాపకరమునగును. మఱియు, ఆధారాధేయములగు ఘటజలముల సంయోగము, ఆరెంటియందేది నశించినను నశించునట్లు, దేహమనంబుల రెంటియందును ఒకదాని వాసనోచ్ఛేదముచే రెండును నశించుచున్నవి.

రాగద్వేషవతోర్నిత్యమన్యోన్యాతివిరుద్ధయోః
ఏతయోర్మూలకాషేణ వినాశః పరమం సుఖమ్. 52

ఇట్లు పరస్పర సహాయకులగుటచే రాగవంతులును, పరస్పర సంతాపకరులగుటచే ద్వేషవంతులును శరీరమనంబులు మూలావిద్యాసహితముగ వినాశమగుటచేతనే, వ్యాఘ్రనాశముచే వనస్థ హరిణములకువలె జీవునకు పరమసుఖము లభించును.

ఏతయోరేకసంస్థానే మృతిరిత్యేవ యా కథా
సా వ్యోమ్నయా స్త్రియా భుక్తాధరేతి కథయా సమా. 53

ఈ రెంటిలో నొకటియున్నను దుఃఖమంతయు శమించునన్నమాట, ఆకాశమున బోవుచున్న స్త్రీ భూమిని మ్రింగివైచెననుటవంటిదే యగును.

అకృత్రిమవిరోధస్థౌ యత్ర సంఘటితావుభౌ
ధారా ఇవ పతన్త్యేవ తత్రానర్థ పరమ్పరాః. 54

యుద్ధమొనర్చు వారి మధ్యనున్న మనుజునిపై ఖడ్గ, బాణపరంపరలు పడునట్లు, స్వభావ విరుద్ధములైన ఈ దేహమనంబులెచట చేరియుండునో, యచట అనర్థపరంపరలు గురియుచుండును.

మిథో విరుద్ధసంసర్గే రతిమేత్యధమో హి యః
త్యక్తన్యః స పతద్వారావగ్నిరాశావలేపనే. 55

పరస్పర విరుద్ధస్వభావముగల ఈ దేహమనంబులు రెండును సంబంధపడియుండునట్టి విషయసుఖానుభవమందును ఆసక్తిగలవానిని, అగ్నిసంతప్తజలధారలు నిరంతరము గురియుచుండు బడబాగ్నియందు పడద్రోయుట మంచిది.

సంకల్పేన మనః దృష్ట్వా శరీరం బాలయక్షవత్
ఆయురేవాశనాన్యస్మై స్వదుఃఖాని ప్రయచ్ఛతి. 56

బాలుడు పిశాచమును కల్పనజేయునట్లు మనస్సు తన సంకల్పముచే దేహమును కల్పించి, జీవితపర్యంత మద్దానిని భోజనముచే పుష్టినొనర్చి తన దుఃఖములను గూడ దానికొసంగుచున్నది.

తైర్దుఃఖైస్తాపితో దేహో మనో హన్తుమథేచ్ఛతి
పుత్రోఽపి హన్తి పితరమాతతాయిపదం గతమ్. 57

అట్లు మనస్సుచే నొసంగబడిన దుఃఖములచే శరీరము దుర్వ్యసనముల సేవించుచు రాగ ద్వేష, శోక, మోహ, పాపాదుల మనంబున నుత్పన్నమొనర్చుచు, తద్ద్వారా దానిని బాధింపజూచుచున్నది. శరీరము మనస్సునుండి యుత్పన్నమగుటచే పుత్రరూపమైనను, బాధాజనకమై ఆతతాయిపదమునొందిన తండ్రిని పుత్రుడుకూడ వధించును గదా!

నాస్తి శత్రుః ప్రకృత్యైవ నచ మిత్రం కదాచన
సుఖదం మిత్ర మిత్యుక్తం దుఃఖదా శత్రవః స్మృతాః. 58

స్వతః యొకండొకనికి శత్రువుగాని, మిత్రుడుగాని కానేరడు. కాని, సుఖమును గలుగజేయువానిని మిత్రుడనియు, దుఃఖమును గలుగజేయువానిని శత్రువనియు నందురు.

దేహో దుఃఖాన్యనుభవన్స్వమనో హన్తుమిచ్ఛతి
దేహం మనః స్వదుఃఖానాం సంకేతం కురుతే క్షణాత్. 59

శరీరము దుఃఖముల ననుభవించుచు తన మనంబును వధింపనెంచుచున్నది. మనస్సున్ను సంకల్పముచే క్షణములో దేహమును తన దుఃఖానుభవస్థానముగ నొనర్చుచున్నది.

ఏవం మిథో దుఃఖదయోః శ్లిష్టయోః కః సుఖాగమః
ఏతయోర్దేహమనసోర్జాత్యైవాతి విరుద్ధయోః. 60

ఇట్లు పరస్పరదుఃఖదాయకమై, సమ్మిళితమై, స్వభావవిరుద్ధమైనట్టి ఈ దేహమనంబులుండ నిక మనుజునకు సుఖమెచట?

మనస్యేవ పరిక్షీణే న దేహో దుఃఖభాజనమ్
తత్క్షయోత్కటతయా సత్యం దేహోఽపి పరిభావతి. 61



మనస్సు నశింప నిక శరీరము దుఃఖభాజనము కానేరదు. అందుచేనది యుత్కటాభిలాషచే మనోనాశార్థము జ్ఞాన, శత్సాధనంబులకై బరుపడుచున్నది.

నష్టానష్టమనర్థాయ శరీరం పదమాపదామ్
అలబ్ధాత్మవివేకేన మనసా సుప్రజాయతే. 62

మనస్సున కాత్మజ్ఞానము కలుగునంతవఱకు, దేహమును నశింపజేసినను, నశింపజేయకున్నను అయ్యది (దేహము) ఆపదలకు స్థానభూతమై యనర్థమునే గల్గజేయుచుండును.

ఏతే మనః శరీరే హి మిథః పీవరతాం గతే
జడరూపే హి వపుషా పయోదసరసీ యథా. 63

జడరూపములగు ఈదేహమనంబులు రెండును మేఘ, తటాకములవలె పరస్పర మొకదానిచే నొకటి వృద్ధినొందుచున్నవి.

మిథో దుఃఖాయ సంపన్నే ఏకరూపే ద్విధా స్థితే
వ్యవహారపరే సార్ధం లోకే వార్యనలావివ. 64

ఈదేహమనంబులు పరస్పరవిరుద్ధములై రెండుగనున్నను, అభేదాధ్యాసముచే యేకరూపమై, పచనక్రియయందు అగ్నిజలంబులవలె, భోగమోక్షోపాయవ్యవహారసాధనమందు తత్పరములగుచున్నవి.

చిత్తే క్షయిణి సంక్షీణే దేహో హ్యమూలితో భవేత్
వర్ధమానే తరురివ శతశాఖః ప్రవర్తతే 65

నశ్వరమగు యీ చిత్తము సంక్షయమునొంద దేహము సమూలముగ నుచ్ఛిన్నమగును. మనస్సు వృద్ధినొంద నదియు వృక్షమువలె శతశాఖాయుతమైవర్ధిల్లును.

క్షీయతే మనసి క్షీణే దేహః ప్రక్షీణవాసనః
మనో న క్షీయతే క్షీణే దేహే తత్క్షపయేన్మనః. 66

మనస్సు నశింప దేహమున్ను వాసనారహితమై క్షయించును. కాని దేహము నశింప మనస్సు నశింపదు. అందుచే వివేకాదులచే మనస్సునే నాశమొనర్పవలెను.

సంకల్పపాదపం తృష్ణాలతం ఛిత్త్వా మనోవనమ్
వితతాం భువమాసాద్య విహరామి యథాసుఖమ్. 67

ఇక్కారణమున, సంకల్పవృక్షసహితమై, తృష్ణాలతాసంయుతమైనట్టి మనస్సను యరణ్యమును ఛేదించి పరమాత్మయను విశాలభూప్రదేశమును బడసి నేను సుఖముగ విహరింతును.

ప్రక్షీయమాణమేవేదం న మనో మనసి స్థితమ్
ప్రశామ్యద్వాసనాజాలం ప్రావృడన్త ఇవామ్బుదః. 68

క్షయించుచున్నట్టి మనస్సు యిక తన మనస్స్వభావమున నిలకొనియుండదు. వాసనాజాలము నశించుటచే వర్షాంతమందలి మేఘమువలె నది వినాశము నొందును.

ధాతూనాం సంనివేశోఽయం దేహనామా రిపుర్మమ
ప్రక్షీయమాణే మనసి గలత్వేషోఽవతిష్ఠతు 69

చర్మ, రక్త, మాంస, అస్థి, మేద, మజ్జా, వీర్యాది ధాతువుల రచనావిశేషమేయగు ఈ శరీరము నాకు శత్రువు. మనస్సునశించినమీదట అదియుండినను, లేకున్నను సరే, దానితో నాకెట్టి సంబంధమును లేదు.

యదర్థం కిల భోగశ్రీర్వాఞ్ఛ్యతే స్వకలేవరమ్
తస్మై నాపి న తస్యాహం కోఽర్థః సుఖలవేన మే 70

ఎద్దానికై భోగలక్ష్మి స్వశరీమును గాంక్షించుచున్నచో, దానితో నాకును నాకద్దానితోను సంబంధమేమియును లేదు. కాన సుఖలేశముతోనైన నాకు ప్రయోజనమేమియు లేదు.

నాహం దేహ ఇతి త్వస్మిన్యుక్తిమాకర్ణయ క్రమే
సర్వాఙ్గేష్వపి సత్స్వేవ శవః కస్మాన్న వల్గతి. 71

నేను దేహమును కాను. ఇందులకై యుక్తిని వినుము. హస్తపాదాద్యవయవములన్నియు నున్నను మృతదేహ మేల దర్శనశ్రవణాది వ్యాపారముల నొనర్పుటలేదు?

తస్మాద్దేహాదతీతోఽహం నిత్యోఽనస్తమితద్యుతిః
యః సఙ్గం భాస్వతా ప్రాప్య వేద్మి వ్యోమని భాస్కరమ్. 72

కాన నేను దేహాతీతుడను, నిత్యుడను, నిరంతరప్రకాశశీలుండను నగుదును. మఱియు, వ్యాపకస్వరూపమగుటచే సూర్యమండలమందలి సూర్యునితోగూడ సాంగత్యమొంది అట్టి ఆకాశస్థ సూర్యునిగూడ వెలుంగు చిద్రూపుడనే నేను.

నాజ్ఞోఽహం నచ మే దుఃఖం నానర్థో నచ దుఃఖితా
శరీరమస్తు మావాస్తు స్థితోఽస్మి విగతజ్వరః. 73

నేనజ్ఞుడను గాను; నాకు దుఃఖము గాని, అనర్థము గాని, దుఃఖిత్వము గాని లేవు. ఈ శరీరముండుగాక, పోవుగాక, నేను మాత్రము సంతాపరహితుడనైయున్నాను.

యత్రాత్మా తత్ర న మనో నేన్ద్రియాణి న వాసనాః
పామరాః పరితిష్ఠన్తి నికటే న మహీభృతః. 74

ఆత్మయున్నచోట మనస్సుగాని, ఇంద్రియములుగాని, వాసనలుగాని యుండనేరవు. రాజులుండుచోట పామరులుందురా?

పదం తదనుయాతోఽస్మి కేవలోఽస్మిఽయామ్యహమ్
నిర్వాణోఽస్మి నిరంశోఽస్మి నిరీహోఽస్మి నిరీప్సితః. 75

నేనా బ్రహ్మపదమును బొందితిని; నేను కేవలుండను; సర్వాలతై నే విజయమును నొందితిని. నేను నిరంశుడను; నిరపాయుడను; ఇచ్ఛారహితుడను.



ఇదానీమస్మ్యసంబద్ధో మనోదేహేన్ద్రియాదిభిః
పృథక్కృతస్య తైలస్య తిలైర్విగలనైరివ. 76

నువ్వులనుండి వేఱుబఱచిన నూనె నువ్వులతోటి సంబంధములేక యుండునట్లు, ఇత్తఱి నేను దేహేంద్రియమానసాదులతో సంబంధములేకయున్నాను.

స్వస్మాత్పదవరాదస్మాల్లీలయా చలితస్య మే
పృథక్కృతమతేః కించ పరివారో హ్యయం శుభః. 77

శేషించిన ప్రారబ్ధకర్మ ననుభవించుటయను లీలచే ఉత్తమమగు ఆత్మపదమునుండి ఆభాసరూపమున చలింపబడినట్టియు, పూర్వవాసనలనుండి వేఱుగావింపబడిన బుద్ధిగల్గినట్టియు నాకీదేహేంద్రియాదులను సుపరివారము వినోదార్థమే యగును.

స్వచ్ఛతోర్జితతా సత్తా హృద్యతా సత్యతా జ్ఞతా
ఆనన్దితోపశమితా సదా చ మృదుభాషితా. 78
పూర్ణతోదారతా సత్యా కాన్తిమత్త్వైకతానతా
సత్త్వైకతా నిర్భయతా క్షీణద్విత్వవికల్పితా. 79
నిత్యోదితాః సమాః స్వస్థాః సున్దర్యః సుభగోదయాః
మమైకాత్మమతేర్నిత్యం కాన్తాహృదయవల్లభాః. 80

స్వచ్ఛత్వము, పూర్ణకామత్వము, ఆత్మసత్త, రమణీయత్వము, ఆత్మజ్ఞానము, ఆనందము, ఉపశమము, సదాచారము, మృదుభాషిత్వము, పూర్ణత్వము, నిర్లోభత్వము, అబాధితస్వభావము, ప్రకాశత్వము, నిరంతర బ్రహ్మాత్మైకత్వము, సర్వాత్మైకత్వము, నిర్భయత్వము, ద్వైతరాహిత్యము, వికల్పశూన్యత్వము - ఇవన్నియు నిరంతరాత్మోదయముగల్గి, సమమై, స్వస్థమై, సౌభాగ్యయుతమై, అత్యుత్తమమగు ఏకాత్మబుద్ధిచే దనరు నాకు ప్రాణప్రియులగుదురు.

సర్వథా సర్వదా సర్వం సర్వస్మిన్సంభవత్యతః
సర్వం ప్రతి మమ క్షీణే వాఞ్ఛావాఞ్ఛే సుఖాసుఖే. 81

సర్వదా సర్వవిధముల సమస్తమునను సర్వము కల్పనచే సంభవమగుటచే, రాగద్వేషములు తత్ఫలరూపములగు సుఖదుఃఖములు నాకెల్లెడల సంక్షయమొందినవి.

విగతమోహతయా విమనస్తయా
గతవికల్పన చిత్తతయా స్ఫుటమ్
ఉపరమామ్యహమాత్మని శీతలే
ఘనలవః శరదీవ నభస్తలే. 82

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే ఉద్దాలకవిచారవిలాసో నామ త్రిపఞ్చాశః

సర్గః ॥ 53 ॥

అజ్ఞానమనంబులు రహితమగుటచేతను, వికల్పయుక్తమగు చిత్తము నశించుటచేతను నేనిపుడు ప్రత్యక్షముగ దృశ్యజాతమంతయు త్యజించి శరత్కాలమందు శీతలాకాశమునందు మేఘమువలె ఆత్మయందు విశ్రాంతిగొనుచున్నాను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ఉద్దాలక విచారవిలాసమను త్రిపంచాశ
సర్గము ॥ 53 ॥

---

## చతుఃపఞ్చాశః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇతి నిర్ణీయ తతయా ధియా ధవలయా మునిః
బద్ధపద్మాసనస్తస్థా వర్ధోన్మీలితలోచనః. 1

శ్రీవసిష్ఠుడు:—నిర్మల, ఉదారబుద్ధిచే ఉద్దాలకముని పైవిధమున నిర్ణయించి పద్మాసనము వైచికొని అర్ధోన్మీలితనేత్రుడైయుండెను.

ఓమిత్యేతత్పరం బ్రహ్మ నిర్ణీయ స మునిస్తదా
ఓంకారోచ్చారితో యేన తేనాప్తం పరమం పదమ్. 2
ఓంకారమకరోత్తార స్వరమూర్ధ్వగతధ్వనిమ్
సమ్యగాహతలాఙ్గూలం ఘణ్టాకుణ్డమివారవమ్. 3
ఓముచ్చారయత స్తస్య సంవిత్తత్వే తదున్ముఖే
యావదోంకారమూర్ధస్థే వితతే విమలాత్మని. 4

ఓంకారమే పరబ్రహ్మము. కాన, అట్టి ఓంకారమునుచ్చరించువాడు ఉత్తమమగు బ్రహ్మపదమునొందునని నిశ్చయించుకొని ఆ యుద్దాలకముని దీర్ఘఘంటానినాదమువలె ఉచ్చస్వరమున ప్రణవము నుచ్చరింపసాగెను. సుషుమ్నా నాడియందు, ప్రణవశిరమగు అర్ధమాత్రరూపముయొక్క యుపరమమున నభివ్యక్తమగు వ్యాపక నిర్మల ఆత్మరూప పరబ్రహ్మమున ఓంకారవ్యుత్పత్తి...త చైతన్యము, కూటస్థజీవచైతన్యము యెంతవఱకభిముఖములు గాకయుండెనో అంతవఱకాతడు ఓంకారము నుచ్చరించుచునే యుండెను.

సార్ధత్ర్యంశాత్మమాత్రస్య ప్రథమేంఽశే స్ఫుటారవే
ప్రణవస్య సమాక్షుబ్ధప్రాణారణితదేహకే. 5
రేచకాఖ్యోఽఖిలం కాయం ప్రాణనిష్క్రమణక్రమః
రిక్తీచకార పీతామ్బురగస్త్య ఇవ సాగరమ్. 6
అతిష్ఠత్ప్రాణపవనశ్ఛిద్రసాపూరితామ్బరే
త్యక్తదేహః పరిత్యక్తనీడః ఖగ ఇవామ్బరే. 7



హృదయాగ్నిర్జ్వలజ్జ్వాలో దదాహ నిఖిలం వపుః
ఉత్పాతపవనోద్భూతో దావః శుష్కమివ ద్రుమమ్. 8

అకార, ఉకార, మకార, అర్ధమాత్రలతో గూడిన ప్రణవముయొక్క ప్రథమాంశమగు అకారము నుచ్చస్వరమున నుచ్చరించుటచే సంక్షుబ్ధమైనవియు, బాహ్యప్రదేశమునకు జననుద్యుక్తములైనవియునగు వాయువులచే వాని దేహము శబ్దసహితమొనర్పబడ రేచకమను ప్రసిద్ధప్రాణనిష్క్రమణక్రియ శరీరమంతను, అగస్త్యఋషి సముద్రమునువలె, రిక్తమొనర్చెను. అట్లు దేహము ...విడిన వాయువు ఛిద్రసపూరితమై, గూటినివదలిన పక్షివలె బాహ్యాకాశముననుండెను. ..., ఉత్పాతవాయుజనితమగు దావాగ్ని శుష్క వృక్షమును దహించులాగున, జాజ్వల్యమాన ... వాని హృదయమందలి అగ్ని దేహమంతను భస్మీభూతమొనర్చెను.

యావదిత్థమవస్థైషా ప్రణవప్రథమక్రమే
బభూవ న హఠాదేవ హఠయోగో హి దుఃఖదః. 9

ఇట్టి స్థితియంతయు ప్రణవముయొక్క ప్రథమక్రమ భావనచే కలిగినది గాని హఠయోగముచే గాదు. ఏలన, హఠయోగము మిగుల దుఃఖప్రదమైనది.

అథేతరాంశావసరే ప్రణవస్య సమస్థితౌ
నిష్కమ్పకుమ్భకో నామ ప్రాణానామభవత్క్రమః. 10
న బహిర్నాన్తరే నాధో నోర్ధ్వే నాశాసు తత్ర తే
సంక్షోభమగమన్ప్రాణా ఆపః సంస్తమ్భితా ఇవ. 11
దగ్ధదేహాపురో వహ్నిః శశామాశనివర్తనాత్
అదృశ్యత సితం భస్మ శరీరం హిమపాణ్డురమ్. 12
యత్ర పూరకశయ్యాయాం సుప్తానీవ సుఖోచితమ్
శరీరాస్థీని లక్ష్యన్తే నిష్పన్దాని సితాని చ. 13
తద్భస్మ పవనానీతం సాస్థి వాయురయోజయత్
స్వదేహే భృశముత్పన్నే త్రినేత్రవ్రతవానివ. 14
తచ్ఛృణ్ణపవనోద్ధూతమావృత్య గగనం క్షణాత్
శరదీవాభ్రమిహికా క్వాపి భస్మాస్థిమద్యయా. 15
యావదిత్థమవస్థైషా ప్రణవస్యాపరే క్రమే
బభూవ న హఠాదేవ హఠయోగో హి దుఃఖదః. 16

పిదప ప్రణవముయొక్క ఉకారోచ్చారణ సందర్భమున ప్రాణముల సమస్థితియందు నిశ్చలకుంభకమను ప్రసిద్ధప్రాణక్రియ జరిగెను. అత్తఱి నాసికారంధ్రమునందు వాయువు నిరోధింపబడిన జలమువలె, బయటకుగాని, లోపలికిగాని, క్రిందకుగాని, పైకిగాని పోజాలక సంక్షుభితమయ్యె. శరీరనగరమును భస్మమొనర్చునట్టి అగ్ని మెఱుపువలె క్షణములో శాంతింప, మంచువంటి గౌరశరీర

భస్మముగాన్పించె. అపుడు శ్వేతవర్ణశరీరపు అస్థులు సుఖదాయకమగు కర్పూరపరాగనిర్మిత శయ్యపై చేష్టారహితములై పడియున్నట్లు గోచరించుచుండెను. మహావాయువుచే యూర్ధ్వభాగము నకు గొంపోబడిన ఆ అస్థిసహితమగు భస్మమును శివునివలె భస్మవ్రతధారియైన ప్రచండపవనము తాపసునివలె మిగుల కృశించిన తన దేహముపై ధరించెను. అట్లు ప్రచండపవనోద్భూతమగు యాభస్మము క్షణములో నాకసమును వ్యాపించి, శరత్కాలమున మేఘజనిత హిమమువలె యెటనో అదృశ్యమయ్యెను. ఈ స్థితియంతయు ప్రణవముయొక్క ద్వితీయక్రమమున, భావనచే యేర్పడి నదిగాని హఠయోగముచేకాదు. ఏలన, హఠయోగము మిగుల దుఃఖప్రదమైనది.

తత స్తృతీయావసరే ప్రణవస్యోపశాన్తిదే
పూరణాత్పూరకో నామ ప్రాణానామభవత్క్రమః. 17
అస్మిన్నవసరే ప్రాణాశ్శ్వేతనామృతమధ్యగాః
వ్యోమ్ని శీతలతామీయుర్హిమసంస్పర్శసున్దరీమ్. 18
క్రమాద్గగనమధ్యస్థాశ్చన్ద్రమణ్డలతాం యయుః
ధూమా గగనకోశస్థాః శీతలామ్బుదతామివ. 19
కలాకలాపసంపూర్ణే తే తస్మింశ్చన్ద్రమణ్డలే.
పుణ్యరాశావివాపూర్ణే రసాయన మహార్ణవే. 20
రసాయనమయా ధారాః సంపన్నాః ప్రాణవాయవః
మణియష్టిసమాకారా జాలేష్విన్దోరివాంశవః. 21
సా పపాతామ్బరాద్ధారా శేషే శారీరభస్మని
రసాయనీ హరశిరఃపతితేవ సురాపగా. 22
ఉదభూదిన్దుబిమ్బాభం చతుర్బాహువపుస్తయా
ప్రస్ఫురన్మన్దరాదబ్ధేః పారిజాత ఇవ ద్రుమః. 23
ఉద్దాలకశరీరం తన్నారాయణతయోదితమ్
ప్రఫుల్ల నేత్రవక్త్రాబ్జమాబభౌ దీప్తిసున్దరమ్. 24
రసాయనమయాః ప్రాణాస్తచ్ఛరీరమపూరయన్
సలిలౌఘా ఇవ సరో వృక్షం మధురసా ఇవ. 25
అన్తః కుణ్డలినీం ప్రాణాః పూరయామాసురాదృతాః
చక్రానువర్తప్రసృతాం పయాంసీవ సరిద్వరామ్. 26
ప్రకృతస్థం బభూవాస్య తచ్ఛరీరం ద్విజన్మనః
ప్రావృట్ శరీరవిగమే ధౌతం తలమివావనేః. 27

పిమ్మట శాంతిదాయకమైన ప్రణవముయొక్క తృతీయక్రమమునందు వాయువును పూరించుటచే, పూరకమను క్రియజరిగెను. అత్తఱి జీవచైతన్యామృతమధ్యమందలి ప్రాణసమూహము హిమసస్పర్శచేవలె బాహ్యాకాశమున శీతలత్వమునొంది, ఆకాశమందలి ధూమము శీతలస్వభావముగల



మేఘరూపము బడయునట్లు, క్రమముగ గగనమధ్యముననున్న చంద్రమండలత్వమునొందెను. అమృతకళాప్రపూర్ణమును, పుణ్యరాశిసదృశమును, అమృతమయ మహాసముద్రమునునగు ఆ చంద్రమండలమున, గృహోపరిభాగమందలి రంధ్రముగుండ ప్రసరించు చంద్రకిరణము స్ఫటికమణియుక్తదండాకారమగునట్లు, ఆ ప్రాణవాయువులు అమృతమయ కిరణములయ్యెను. వాయువుచే గొంపోబడ మిగిలిన దేహభస్మముపై, మహాదేవుని శిరంబుపై గంగానదివలె, అమృతధార కురిసెను. అపుడు, దేదీప్యమానమగు మందరపర్వతసహితసముద్రమునుండి పారిజాతవృక్షమావిర్భవించినట్లు, చంద్ర [illegible] శోభాయమానమగు చతుర్భుజధారి (విష్ణు) శరీరము ప్రకటితమయ్యె. విష్ణుభగవానుని [illegible] వలె నుదయించినదై, వికసిత నేత్ర, ముఖకమలములచే శోభితమై, దీప్తిచే నతిసుందరమై ప్రకాశించు నాయుద్దాలకుని దేహము మిగుల శోభను వడసెను. జలప్రవాహము తటాకమునువలెను, వసంతరసము వృక్షమునువలెను, ఆ యమృతమయప్రాణము లాయుద్దాలకుని శరీరమును నింపెను. సుడులుగలిగి ప్రవహించు గంగానదిని జలప్రవాహము పూరించునట్లు, లోనున్న కుండలిని అత్యాదరమున నాయమృతమయప్రాణములు నింపెను. శరదృతువందలి అంతిమవృష్టిచే కడుగబడినదై, శీఘ్రముగ యెండి వర్షాకాలమందలి తన కలుషితాకారము నశించుటచే భూమి ప్రసన్నమును, నిర్మలమునునై యాత్రోపయుక్తమగు చందమున, దహన, ప్లవనాది (అమృతమయాది దశల) భావనలచే, శుద్ధమైన ఆయుద్దాలక బ్రాహ్మణుని శరీరము పాపరహితమగుటచే, ప్రస్తుతమొనర్చు సమాధిక్రియకు తగినదాయెను.

అథపద్మాసనగతః కృత్వా దేహే స్థితిం దృఢమ్
ఆలాన ఇవ మాతఙ్గం నిబద్ధ్యేన్ద్రియ పఞ్చకమ్. 28
నిర్వికల్పసమాధ్యర్థం వ్యవసాయముపాదదే
స్వభావం స్వచ్ఛతాం నేతుం శరత్కాల ఇవామలమ్. 29

పిదప, పద్మాసనమున గూర్చొని శరీరమును సుదృఢమొనర్చి, కట్టుకంబమున గజమును వలె పంచేంద్రియములను బంధించెను. తదనంతరము నిర్వికల్పసమాధినిమిత్తము తన స్వభావము (మనము)ను శరత్కాలమువలె వినిర్మలమొనర్చుటకై ఆయుద్దాలకముని యత్నించెను.

ప్రశాన్తవాతహరిణమాశాదిగణగామినమ్
చిన్తయా హృదయం నిన్యే దూరాద్రజ్జ్వేవ కీలకమ్. 30

ఆశ, తృష్ణ, లోభాదులవైపునకుజనునట్టి తన స్వభావమును, ప్రశాంతప్రాణమును హరిణయుక్తమగు తనచిత్తమును శుద్ధమొనర్చుటకై ఆతడు ప్రయత్నించెను. కాని, దృఢముగ నాటబడని అశ్వబంధన కీలకాదులు వాటికి తగిల్చియుండు త్రాళ్లచే యీడ్వబడులాగున, పుత్రదారాగృహాదుల చింత వానిచిత్తమును దూరముగ లాగివైచెను.

ధావమానమధో మత్తం చిత్తం విమలమాకులమ్
బలాత్సంరోధయామాస సేతుర్జలమివ ద్రుతమ్. 31

అట్లు విషయములవైపునకు పరుగిడు మదించిన వ్యాకుల చిత్తమును సునిర్మలమొనర్చి, ప్రవాహోన్ముఖ జలమును సేతువువలె, బలపూర్వకముగ యాతడు నిరోధించెను.

నిమిమీల దృశావర్ధం పరిపక్ష్మలపక్ష్మకే
నిస్పన్దతారామధురే సంధ్యాకాల ఇవామ్బుజే. 32
సౌమ్యతామనయన్మౌనీ ప్రాణాపానజవం ముఖే
శ్వసనం శ్రేయసే దేశే ప్రశస్తః సమయో యథా. 33

పక్షములవలె ఇరువైపుల రెప్పలుగల్గి, చలింపని కనుబొమ్మలతో గూడినవై సంధ్యాకాలమువలె సుందరముగనున్నట్టి తన రెండు నేత్రముల నాతడంత యర్థనిమీలితమొనర్చెను. చక్రవర్తుల జన్మాదులకు నిమిత్తభూతమగు ప్రశస్తసమయములందు గగ్రచ్ఛేయమునకై, శుభసూచకముగ ఆ దేశపువాయువు శీతల, సుగంధితమొనర్పబడునట్లు, మౌనవ్రతధారియగు ఉద్దాలకుడు ప్రాణాపానవేగముచే ముఖమందు ప్రశాంతతను బడసెను.

తిలేభ్య ఇవ తైలాని పృథక్ చక్రే ప్రయత్నతః
ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః కూర్మోఽఙ్గానీవ గోపయన్. 34

నువ్వులనుండి నూనె వేఱుగావింపబడునట్లు యింద్రియములను విషయములనుండి వేఱుబఱచి తాబేలు తన యంగములనువలె వాటిని తన యందిమిడ్చుకొనెను.

బాహ్యస్పర్శానశేషేణ జహౌ దూరే స ధీరధీః
సహసా కుణ్డకచ్ఛన్నో మణిర్దూరత్విషో యథా. 35
విలీనానాన్తరాంశ్చక్రే స్పర్శాను జ్ఝిత దర్శనాత్
రసాన్విటపకోశస్థాన్మార్గశీర్ష ఇవ ద్రుమః. 36

చిన్నకుండయందుంచి మూయబడిన మణి, దూరమున ప్రసరించు తన దీప్తికిరణముల త్యజించునట్లు ధీరబుద్ధియగు నాతడు బాహ్యవిషయములను దూరమునుండియే లెస్సగ త్యజించివైచెను. మార్గశీర్షమందు వృక్షము రసముల తనయందు లీనమొనర్చుకొనునట్లు ఆత్మతత్త్వదర్శనముచే మనోవాసనారూపములగు విషయముల నాతడు తనయందు అయపఱచుకొనెను.

రురోధ గుదసంకోచాన్నవద్వారానిలానథ
ముఖసంస్థగితః కుమ్భో రన్ధ్రకోశానివేతరాన్. 37

ముఖము బాగుగ బిగియగట్టిన జలపూరిత ఘటము వాయుప్రవేశములేమి అన్యఛిద్రముల నిరోధించునట్లు కాలిమడమచే గుదస్తంభనమొనర్చి నవద్వారములందలి వాయువుల నాతడు నిరోధించెను.

స్వాత్మరత్నప్రకాశాఢ్యాం స్పష్టాం కుసుమలాఞ్ఛితామ్
దధార కంధరాం ధీరో మేరుః శృఙ్గశిఖామివ. 38

ఆత్మరత్నప్రపూర్ణమై రజోగుణతమోగుణాభావముచే స్వచ్ఛమై ప్రసన్నమై ముఖకమలచిహ్నితమైనట్టి కంఠమును సుమేరుపర్వతము తన శిఖరమును దరించునట్లు యాతడు ధరించెను.

బభార హృదయాకాశే మనః సంయమమాగతమ్
విన్ధ్యఖాత ఇవోన్మత్తం గజం యుక్తివశీకృతమ్. 39



శరన్నభోవదాసాద్య నిర్మలామతిసౌమ్యతామ్
జహార పరిపూర్ణాబ్ధేర్నిర్వాతస్యాచలాం శ్రియమ్. 40

సమాధ్యభిముఖమును, ధారణాదియుక్తులచే వశీకృతమునునగు తన మనస్సును, వింధ్యాద్రికందకము మదపుటేనుగనువలె తనహృదయాకాశమున ధరించెను. మఱియు శరదాకాశనైర్మల్యమువలె సౌమ్యత్వమును బొంది, వాయురహిత పూర్ణసముద్రముయొక్క నిశ్చల శోభను గూడ హరించెను.

దుధావాతి వికల్పౌఘాన్ప్రతిభాసముపేయుషః
పురః పరిస్ఫురద్ధూమాన్మశకానివ మారుతః. 41
ఆగచ్ఛతో యథాకామం ప్రతిభాసాన్పునః పునః
అచ్ఛినన్మనసా శూరః ఖడ్గేనేవ రణే రిపూన్. 42

సమ్ముఖమున నున్న మశకములను వాయువు యెగురగొట్టునట్లు భ్రహ్మాకారవృత్తులను మధ్య మధ్య విచ్ఛేదనమొనర్చు విపరీతభావనగూర్చిన వికల్పసమూహముల నాతడు తొలగించివైచెను. మఱియు వీరుడు తనఖడ్గముచే రణరంగమున శత్రువుల దునుమాడునట్లు మఱల మఱల యంకురించు వికల్పముల నాతడు విచ్ఛిన్నమొనర్చెను.

వికల్పౌఘే పరాలూనే సోఽపశ్యద్ధృదయామ్బరే
తమశ్ఛన్నవివేకార్కం లోలకజ్జలమేచకమ్. 43
తమప్యున్మార్జయామాస సమ్యక్ప్రాప్తవివస్వతా
సమ్యగ్జ్ఞానోదితేనాశు పవనేనేవ కజ్జలమ్. 44
తమస్యుపరతే కాన్తం తేజఃపుఞ్జం దదర్శ సః
శార్వరే తిమిరే శాన్తే ప్రాతఃసంధ్యామివామ్బుజమ్. 45
తల్లులావ స్థలాబ్జానాం వనం బాల ఇవ ద్విపః
అపిబచ్చాప్యసృక్పూరం వేతాల ఇవ వేగతః. 46

వికల్పజాలము నశింప యాతడు హృదయాకాశమున, కాటుకవలె నల్లనై తమోగుణప్రేరితమగు అంధకారముచే నాచ్ఛాదితమైనట్టి వివేకసూర్యుని గాంచెను. కాని సత్త్వగుణాభివృద్ధిసంజనితమగు ఉత్తమజ్ఞానముచే నుదయించిన విశుద్ధమనస్సను సూర్యునిచే, ప్రకాశముమాడ్కి అన్యాంధకారమునుగూడ నశింపజేసెను. రాత్రియందలి చీకటి నశింప ప్రాతస్సంధ్యను కమలను వీక్షించుపగిది తమోగుణరూప యంధకారము నశింప నాతడు రమణీయ తేజఃపుంజమును దర్శించెను. ఆ తేజఃపుంజము స్థలకమలవనము (రజోగుణవృత్తిసమూహము)ను గజకిశోరమువలె ఛేదించి, బేతాలునివలె రక్తప్రవాహము (రజోగుణధార)ను వేగముగ మ్రింగివైచెను.

తేజస్యుపరతే తస్య ఘూర్ణమానం మనో మునేః
నిశాబ్జవదగాన్నిద్రాం లోలం క్షీబవదేవ వా. 47

మేఘమాలామివ మరుద్వ్యాలో నీలాబ్జినీమివ
యామినీమివ తీక్ష్ణాంశుస్తామప్యాశు లులావ సః. 48

ఆ తేజస్సు యుపశమింప, నిద్రాతరంగములచే చంచలమై భ్రమణశీలమై యొప్పు ఆమునీంద్రుని మనంబు, నిశాకాలపు కమలమువలెను, మద్యపానముచే మత్తెక్కిన మనుజునివలెను నిద్రను బొందెను. కాని యానిద్రను కూడ, వివేకప్రబోధముచే నాతడు, మేఘపంక్తిని వాయువువలెను, నీలకమలసరస్సును గజమువలెను, రాత్రిని సూర్యునివలెను, శీఘ్రముగ వినష్టము జేసెను.

నిద్రావ్యపగమే తస్య భావయామాస తన్మనః
వ్యోమశ్యామలదృగ్వస్తుర్నభసీవ శిఖణ్డికాన్. 49
పయోద ఇవ తాపిచ్ఛం నీహారమివ మారుతః
దీపస్తమ ఇవాచ్ఛాత్మా తదప్యాశు మమార్జ సః. 50
వ్యోమసంవిది నష్టాయాం మోఘం తస్యాభవన్మనః
నిద్రాయాంతు విలీనాయాం మైరేయ మదవానివ. 51
మోహమప్యేష మనసస్తం మమార్జ మహాశయః
యామినీజనితం జాడ్యం భువనాదివ భాస్కరః. 52
తతస్తేజస్తమోనిద్రామోహాది పరివర్జితమ్
కామప్యవస్థామాసాద్య విశశ్రామ మనః క్షణమ్. 53
విశ్రమ్యాశు పసాతాజ్గం సంవిదం విశ్వరూపిణీమ్
సేతురుద్ధం సరోవారి ప్రతీపం స్వమివాస్పదమ్. 54

అట్లు నిద్రను నశింపజేసిన వెనుక వానిమనస్సు, సూర్యాతపమందు నీలాకాశమును జూచువాడు నెమలికన్నులవంటి కల్పితపదార్థముల గాంచునట్లు, వివిధవాసనలచే పరికల్పితంబైన రూపముగల యాకసమును భావించెను. కాని మేఘము మాలతీపుష్పమును, వాయువు మంచును, దీపమంధకారమును నశింపజేయునట్లు, ఆతడాయాకాశమునున్ను తొలగించివైచెను. అట్లాయాకాశజ్ఞానము నశించినపిదప, నిద్రాంతమందలి మదిరోన్మత్తునిభంగి విమూఢుడయ్యె. ఉదారచిత్తుడగు నాయుద్దాలకుడంత, రాత్రియందలి యంధకారమును సూర్యుడు బ్రహ్మాండమునుండి తొలగించు విధమున, యామనోమోహంబును గూడ తొలగద్రోచె. తదుపరి తేజ, తమ, నిద్రామోహాది రహితమై వాని మనస్సు వాగగోచరమగుస్థితి (నిర్వికల్పసమాధి)ని బొంది క్షణకాలము విశ్రమించె. అట్లువిశ్రమించి మఱల వెంటనే, కాలువద్వారా ప్రవహించు తటాకజలము నిరోధింపబడ మఱల స్వస్థానమగు తటాకమునే జేరునట్లు వాని మనస్సు బాహ్యప్రపంచవృత్తికి మరలెను.

చిరానుసంధానవశాత్స్వదనాచ్ఛ స్వసంవిదః
తతశ్చిన్మయతామాగాద్ధేమ నూపురతామివ. 55

తదనంతరము, సువర్ణము నూపురత్వము జెందునట్లు చిరకాలానుసంధానముచేతను, సమాధియందలి ఆత్మానంద రసాస్వాదనముచేతను యాతడు చిద్రూపత్వమును బడసెను.



చిత్తత్వమథ సంత్యజ్య చిత్తం చిత్తత్వతాం గతమ్
అన్యదేవ బభూవాశు పఙ్కః కుమ్భస్థితో యథా. 56
చేత్యం సంత్యజ్య చిచ్ఛుద్ధా చిత్సామాన్యమథాయయౌ
త్యక్తవీచ్యాది భేదోఽబ్ధిర్వాః సామాన్యమివైక ధీః. 57

పిదప వానిచిత్తము తన చిత్తత్వమును వదలి, చిద్రూపత్వము నొంది నీరెండిన పిదప అందలి బురద ఘటమునకంటుకొని ఘటరూపత్వమునొందునట్లు, శీఘ్రముగ అన్యాకారము బడసెను. ఆపిమ్మట, వృత్తిగతచైతన్యము తన విషయాకారమును త్యజించి, తరంగాది భేదముల వీడి సముద్రము జలసామాన్యస్థితి నొందునట్లు, సర్వవృత్తులకును సాక్షియైనట్టి చిద్రూపత్వము నొందెను.

త్యక్త భూతౌఘమననం తతో విశ్వంభరం మహత్
చిదాకాశం తతః శుద్ధం సోఽభవద్బోధమాగతః 58
తత్ర ప్రాపదథానన్దం దృశ్యదర్శనవర్జితమ్
అనన్తముత్తమాస్వాదం రసాయనమివార్ణవమ్. 59

అనంతరము, ఉద్దాలకుడా సమాధిద్వారా తత్వసాక్షాత్కారరూపమగు ప్రబోధము వడసి, సర్వప్రపంచాధిష్ఠానమును, ద్వైతరహితమును, శుద్ధమును, మహత్తరమునునగు చిదాకాశరూపమునొందెను. మఱియు నట్టి స్థితియందు దృశ్యదర్శన వర్జితమును, బ్రహ్మాదులచే నాస్వాదితమును, సర్వవిషయసుఖలేశముల కాధారభూతమును, సముద్రతుల్యమును నగు ఆనందముం బొందెను.

శరీరాత్మసమవేతోఽసౌ కామప్యవనిమాగతః
సత్తాసామాన్యరూపాత్మా బభూవానన్దసాగరః. 60

లెస్సగ పరిశుద్ధమైన శరీరముగల్గి, పృథివీరూపమువడసిన యానందసాగరుని పగిది చెన్నొందుచు యుద్దాలకుడంత పరమాత్మయొక్క సత్తాసామాన్యరూపత్వము నొందెను.

ద్విజచేతన హంసోఽసావానన్దసరసి స్థితః
అతిష్ఠచ్ఛరదచ్ఛే ఖే కలాపూర్ణ ఇవోడుపః. 61
బభూవావాతదీపాభో లిపికర్మార్పితోపమః
వీతవీత్యమ్బుధిప్రఖ్యో వృష్టమూకామ్బుద స్థితిః. 62

ఆబ్రాహ్మణుని జీవచైతన్యమను హంస ఆనందసరోవరమున స్థితిగల్గి శరత్కాల నిర్మలాకాశమున పూర్ణచంద్రునివోలె శోభించెను. అత్తఱి యాతడు గాలిలేని స్థలమందలి దీపమువలెను, భిత్తిపై లిఖించిన చిత్రమువలెను, తరంగరహిత సముద్రమువలెను, అంతిమవృష్టిగావించి యూరకుండు శరత్కాలమేఘమువలెను నిశ్చలముగ నుండెను.

అథైతస్మిన్మహాలోకే తిష్ఠన్నుద్దాలకశ్చిరమ్
అపశ్యద్వ్యోమగాన్సిద్ధానమరానపి భూరిశః. 63

ఆగతాని విచిత్రాణి సిద్ధిజాలాని చాభితః
శక్రార్కపదదాత్రాణి నీరన్ధ్రాణ్యప్సరోగణైః. 64
తాని నాదరయాంచక్రే సిద్ధివృన్దాని స ద్విజః
గమ్భీరమతిరక్షుబ్ధో విలాసానివ శైశవాన్. 65

పిమ్మట యామహాప్రకాశమున ఉద్దాలకుడు చిరకాలము ఆకాశచారులగు సిద్ధులను, అనేక దేవతలను గాంచెను. అప్సరాదిగణములచే పరివేష్టితుడగు ఇంద్రునియొక్కయు, సూర్యునియొక్కయు పదవులనిచ్చునట్టి విచిత్రములగు పెక్కుసిద్ధులు వానికడకపుడేతెంచెను. కాని, గంభీరచేతస్కుడును, ఉదారచిత్తుడునగు మనుజుడు బాలురక్రీడనాదరించనట్లు, ఆబ్రాహ్మణుడా సిద్ధుల నాదరింపకుండె.

సిద్ధిసార్థమనాదృత్య తస్మిన్నానన్దమన్దిరే
అతిష్ఠదథ షణ్మాసాన్దిక్తటేఽర్క ఇవోత్తరే. 66
జీవన్ముక్తపదం తత్తద్యావత్సంప్రాప్తవాన్ద్విజః
తత్ర సిద్ధాః సురాః సాధ్యాః స్థితా బ్రహ్మహరాదయః. 67
ఆనన్దే పరిణామిత్వాదనానన్దపదం గతః
నానన్దే న నిరానన్దే తత స్తత్సంవిదాబభౌ. 68

అట్లు సిద్ధుల నిరాకరించి యాబ్రాహ్మణుడు సమాధియను ఆనందమందిరమున ఉత్తరాయణ దిక్తటమున సూర్యునివలె ఆఱునెలల పర్యంతముండెను. అపుడు సిద్ధసాధ్యబ్రహ్మాదులు వసించునట్టి సర్వోత్కృష్టమగు జీవన్ముక్తిపదమున (సప్తమభూమికయందు) యాతడు ప్రతిష్ఠితుడయ్యెను. మఱియు పూర్ణానందయుతమగు ఆత్మానందయుపద నాతడు పొందెను. కాన వాని ఆత్మచైతన్యము క్షుద్రవిషయానందమునగాని, దుఃఖమునగాని లేనిదై స్వప్రకాశమగు తన పూర్ణస్వరూపమునందే యుండినదై శోభించెను.

క్షణం వర్షసహస్రం వా తత్ర లబ్ధ్వా స్థితిం మనః
రతిమేతి న భోగౌఘే దృష్టస్వర్గ ఇవావనౌ. 69

క్షణకాలమైనను లేక వేయిసంవత్సరములైనను, అట్టి సమాధియందలి ఆనందస్థితిని బొందినవాని మనస్సు, స్వర్గవిభవము గాంచినవాడు భూలోకసుఖమున ప్రీతిగల్గియుండనట్లు, యిక విషయభోగములందు ప్రీతిలేనిదై యుండును.

తత్పదం సా గతిః శాన్తా తచ్ఛ్రేయః శాశ్వతం శివమ్
తత్ర విశ్రాన్తిమాప్తస్య భూయో నో బాధతే భ్రమః. 70

అట్టి నిర్వికల్పసమాధియందలి బ్రహ్మానందసుఖమే పరమపదము. అదియే శాంతగతి. అదియే నిత్యశ్రేయము. ఏలన, అచ్చోట విశ్రమించినవాని నిక భ్రమయెన్నటికిని బాధింపదు.

తత్పదం సాధవః ప్రాప్య దృశ్యదృష్టిమిమాం పునః
నాయాన్తి ఖదిరోద్యానం లబ్ధచైత్రరథా ఇవ. 71



సాధువులట్టి యున్నతపదమునొంది, నందనవనమున కేగినవాడు కంటకవృక్షములుగల ఖదిరోద్యానవనమునకు రానట్లు మఱల దృశ్యదృష్టియందు ప్రవేశింపక యుందురు.

తాం మహానన్దపదవీం చిత్తాదాసాద్య దేహినః
దృశ్యం న బహు మన్యన్తే రాజానో దీనతామివ. 72

శ్రవణ, మనన, సమాధులద్వారా శుద్ధచిత్తులై, ఆమ్మహానంద పదవినిబొంది, రాజులు దీనత్వము నధికముగ దలంపనట్లు, జీవులీదృశ్యప్రపంచము నధికముగ యెంచకుదురు.

చేతస్తత్పదవిశ్రాన్తం బుద్ధం దృశ్యదశాం ప్రతి
కదాచిద్వ్యుత్థమాయాతి నాయాత్యేవాథవానఘ. 73

పాపరహితుడవగు నోరామా! అట్టి ఆత్మపదమున విశ్రాంతినొందిన ప్రబుద్ధచేతస్కుడు, యితరులెంతో ప్రయత్నించిననే సమాధినుండి వ్యుత్థానదశకు వచ్చును. (ఇది ఆఱవభూమికయందున్నవాని స్థితి.) కాని అట్లు ప్రయత్నించినను యేడవ భూమికయందున్నవాడు వ్యుత్థానదశకు రాకయేయుండును

ఉద్దాలకోఽత్రషణ్మాసాన్స్థిత్వోత్సారిత సిద్ధిభూః
ఉషిత్వా్ఽస్మిన్సమాధావభ్రకోశాదర్క మధావివ. 74

ఉద్దాలకుడు సిద్ధులన్నిటిని దూరముగా పారద్రోలి ఆఱునెలలవఱకట్టి సమాధిస్థితియందేయుండి, చైత్రమాసమున మేఘమధ్యమునుండి సూర్యుడు వినిర్గతుడగు చందమున వ్యుత్థానమును బడసెను.

దదర్శ సంప్రబుద్ధాత్మా పునః పరమతేజసః
ప్రణామలాలసాః స్నిగ్ధాశ్చన్ద్రబిమ్బవపుర్ధరాః. 75
రమణీర్గౌరమన్దారరేణుభ్రమగచామరాః.
స్ఫురత్పతాకాపటలా ద్యువిమానపరమ్పరాః. 76
అస్మదాదీన్మునీన్దర్భపవిత్రాఙ్కకరామ్బుజాన్
విద్యాధరీభిర్వలితాన్విద్యాధరపతీనపి. 77

ప్రబుద్ధుడగు నాయుద్దాలకుడంత పరమతేజసంపన్నులును, ప్రణామేచ్ఛచే స్నేహయుతులైయున్నవారును, చంద్రబింబసమాన దేహులునునగు దేవతలను, శ్వేత మందారపుష్పరేణువులచే గప్పబడిన భ్రమర, చామరయుతులును నగు దేవతాస్త్రీలను, పతాకములుగల విమానములను దర్భలచే పవిత్రములైన కరకమలములుగల అస్మదాది మునులను, విద్యాధరీగణంబుచే నావృతమగు విద్యాధరులను మఱల గాంచెను.

తే తమూచుర్మహాత్మానముద్దాలకమునిం తథా
ప్రసాదేన ప్రణామాన్నో భగవన్నవలోకయ. 78
ఆరుహ్యేదం విమానం త్వమేహి త్రైవిష్టపం పురమ్
స్వర్గ ఏవహి సీమాన్తో జగత్సంభోగసంపదామ్. 79

ఆకల్ప ముచితాన్భుఙ్క్ష్వ భోగానభిమతాన్విభో
స్వర్గాదిఫలభోగార్థమేవాశేషతపఃక్రియాః. 80
హారచామరధారిణ్యో విద్యాధరవరాఙ్గనాః
పశ్యేమాస్త్వాముపాసీనాః కరిణ్యః కరిణం యథా. 81
కామో ధర్మార్థయోః సారః కామసారాః సుయోషితః
వసన్త ఇవ మఞ్జర్యః స్వర్గ ఏవ భవన్తి తాః. 82

ఆ దేవతలున్ను, మునులున్ను మహాత్ముఁడైన నాయుద్దాలకునితో నిట్లనిరి 'ఓదేవా! అనుగ్రహించి ప్రణామమాచరించు యీ మమ్ముల నవలోకింపుము. ఈ విమానముపైనెక్కి దేవ నగరమునకు రమ్ము. ఏలన, ప్రాపంచిక భోగ, సంపదలకు స్వర్గమే యవధిగదా! ప్రభూ! తామ భిలషించు భోగములన్నిటిని కల్పాంతము వఱకిట యనుభవింపుము. స్వర్గఫలముల ననుభవించుట కొఱకేగదా తపోయజ్ఞాది క్రియలన్నియును. చూడుము, హారచామరములగైకొనిన యీ విద్యాధ రాంగనలు, గజను నాడుగజముపాసించునట్లు మిమ్ముల నుపాసించుచున్నారు. దేవా! ధర్మార్థ ములకు ముఖ్యఫలము కామమే. మఱియు, వసంతమున లతవలె ఆకామమున ప్రధానతత్వము ఉత్తమ స్త్రీగణమే. అట్టియుత్తమస్త్రీలు స్వర్గముననే యుందురు.'

ఏవం కథయతః సర్వానతిథీనిత్యసౌ మునిః
పరిపూజ్య యథాన్యాయమతిష్ఠద్గతసంభ్రమమ్. 83
నాభ్యనన్దన్న తత్యాజ తాం విభూతిం స ధీరధీః
భో సిద్ధా వ్రజతేత్యుక్త్వా స్వవ్యాపారపరోఽభవత్ 84
అథ స్వధర్మనిరతం భోగేష్వరతిమాగతమ్
తముపాస్య యయుః సిద్ధా దినైః కతిపయైః స్వయమ్. 85

ఇట్లు వచించుచున్న యీదేవతలందఱను యుద్దాలకముని అతిథిసన్మానయోగ్యమగురీతి బూజించి భ్రమరహితుడై యుండెను. ధీరబుద్ధియగు నాతఁడా దేవవిభూతి నభినందించుటగాని, త్యజించుటగాని యొనర్పక 'ఓ సిద్ధులారా! మీరు పొండ'ని మాత్రము వచించి స్వవ్యాపార (సమాధి) పరాయణుఁడయ్యె. అట్లు సమాధితత్పరుడును, విషయభోగ విరక్తుడునగు నాఋషీశ్వరుని స్తుతిప్రణామాదులచే నుపాసించుచు కొన్నిదినముల వఱకాసిద్ధులట వేచియుండి పిదప స్వయముగ వెడలిపోయిరి.

జీవన్ముక్తః స చ మునిర్విజహార యథాసుఖమ్
యావదిచ్ఛం వనాన్తేషు మునీనామాశ్రమేషు చ. 86
మేరుమన్దరకైలాసహిమవద్విన్ధ్యసానుషు
ద్వీపోపవనదిక్కుఞ్జ జఙ్గలారణ్యభూమిషు. 87
తతః ప్రభృతి సంప్రాప్తపదముద్దాలకో ద్విజః
గుహాసు గిరికుక్షీణామవసద్ధ్యానలీలయా. 88



జీవన్ముక్తిపదమునొందిన నాయుద్దాలకముని అది మొదలు తన యిచ్ఛాపూర్వకముగ వనములందును, మునుల ఆశ్రమములందును సంచరించుచు మేరు, మందర, కైలాస, హిమాలయ, వింధ్య పర్వతశిఖరములపైనను, ద్వీప, ఉపవన, దిక్కుంజ, అరణ్య, మహావనప్రదేశములందును, పర్వతగుహాలయందును ధ్యానలీలతోగూడి వసించుచునుండెను.

కదాచిదహ్నా మాసేన కదాచిద్వత్సరేణ చ
కదాచిద్వత్సరౌఘేణ ధ్యానాసక్తో వ్యబుధ్యత. 89

ఆరూఢుడగు నాతఁడొకప్పుడొక మాసమువఱకుగాని ఒకప్పుడొక సంవత్సరమువఱకు గాని మఱియొకప్పుడు పెక్కుసంవత్సరములవఱకుగాని సమాధియందుండి ఆపిదప మేల్కాంచును.

ఉద్దాలకస్తదారభ్య వ్యవహారపరోఽపి సన్
సుసమాహిత ఏవాసౌ చిత్తత్త్వైకత్వమాగతః. 90

చైతన్యముతో నైక్యమొందిన ఆయుద్దాలకముని అదిమొదలు వ్యవహారతత్పరుడైనను సమాధినిష్ఠుడుగనే యుండెనుగాని అజ్ఞానివలె విక్షేపయుతుడు కాలేదు.

చిత్తత్త్వైక ఘనాభ్యాసాన్మహాచిత్త్వముపేత్య సః
బభూవ సర్వత్ర సమస్తేజః సౌరమివావనౌ. 91

అంతఃకరణమును, తద్వృత్తిసాక్షియగు చైతన్యమును వేఱుబఱచి శీలించుటయను సమా ధ్యభ్యాసముచే అపరిచ్ఛిన్నచిద్భావమునొంది, రాగద్వేషాదులులేమి, భూమిపై సమరూపమున వ్యాపించు సూర్యకాంతివలె సర్వభూతములందును సమరూపుడై యాతడు వర్తించెను. (అంతటను బ్రహ్మరూపమునే గాంచుటచే ఆఱవభూమికయందు ప్రవేశించెనని భావము.)

చిత్సామాన్య చిరాభ్యాసాత్సత్తాసామాన్యమేత్య సః
దృశ్యేఽస్మింశ్చిత్రరవివన్నాస్తమాయాన్న చోదయమ్. 92

సాక్షిచైతన్యమును సమాధియందు చిరకాలము భావించుచు నభ్యసించుటచే స్వప్రకాశ మును నిరతిశయానందమును నగు చిద్రూపత్వమునొంది ఆయుద్దాలకుడంత చిత్రస్థసూర్యునివలె యీదృశ్యమునం దుదయింపకయు, అస్తమింపకయునుండెను. (ఇచ్చోట వాని సప్తమభూమికా విశ్రాంతి చూపబడినది.)

శమపరపదలాభప్రాప్తిసంశాన్తచేతా
గలితజననపాశః క్షీణసందేహదోలః
శరది ఖమివ శాన్తం వ్యాతతం చోర్జితం చ
స్ఫుటమమలమచేతస్తద్వపుః సంబభార. 93

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ఉద్దాలకవిశ్రాన్తిర్నామ
చతుఃపఞ్చాశః సర్గః ॥ 54 ॥

సర్వత్ర శాంతిమయుడును నిరతిశయానంద పదప్రాప్తిచే మిగుల శాంతచిత్తుడును, కర్మబీజములన్నియు క్షయించుటచే జననమరణపాశ వివర్జితుడును నగు నాయుద్దాలకుడు శరదాకాశము వలె శాంతమును, అపరిచ్ఛిన్నమును, నిరతిశయ సత్తాస్ఫూర్తిసుఖోత్కర్షతచే సదా బలయుతమును, ప్రత్యక్షరూపమును, నిర్మలమును, పూర్వదశావిస్మరణముచే చిత్తరహితమును, బ్రహ్మస్వభావము నొందినదియునగు నూతనదేహమునే ధరించెను గాని పూర్వపు ముద్దాలకశరీరమును గాదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ఉద్దాలక విశ్రాంతియను చతుఃపంచాశ
సర్గము ॥ 54 ॥

---

పఞ్చపఞ్చాశః సర్గః

శ్రీరామ ఉవాచః—

ఆత్మజ్ఞానదినైకార్క మత్సంశయతృణానల
అజ్ఞానదాహశీతాంశో సత్తాసామాన్యమీశ కిమ్. 1

శ్రీరాముడు:—ఆత్మజ్ఞానమను పగటికి సూర్యుండవును, మత్సంశయంబును తృణమునకు అగ్నివియు, అజ్ఞానప్రేరితములగు తాపత్రయంబుల దాహోపశమనమునకు చంద్రుడవును, ఈశ్వరస్వరూపుడవునగు నోదేవా! సత్తాసామాన్యమన నేమియో వచింపవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచః—

యదా సంక్షీయతే చిత్తమభావాత్యన్తభావనాత్
చిత్సామాన్యస్వరూపస్య సత్తాసామాన్యతా తదా. 2

శ్రీవసిష్ఠుడు:—ఓరామా! విషయసంస్కారములన్నియు పూర్ణముగ రహితముకాగా చిత్తమెపుడు నశించునో అపుడే చిత్సామాన్యస్వరూపమునకు సత్తాసామాన్యత్వము వచింపబడినది.

నూనం చేత్యాంశరహితా చిద్యదాత్మని లీయతే
అసద్రూపవదత్యచ్ఛా సత్తాసామాన్యతా తదా. 3

విషయస్ఫూర్తిరహితమై చిత్తు యెపుడు తన బింబరూపమగు చైతన్యమున లీనమగునో, అపుడు బింబముయొక్క ఆకాశసదృశమగు నిర్మల సత్తయే నిక్కముగ సత్తాసామాన్యమనంబడు.

యదా సర్వమిదం కించిత్సబాహ్యాభ్యన్తరాత్మకమ్
అపలప్య వసేచ్చేతః సత్తాసామాన్యతా తదా. 4

చిత్తవృత్తియందభివ్యక్తమగు చైతన్యము బాహ్యాభ్యంతర జగత్తునంతయు నిరాకరించి కేవలము స్వస్వరూపమున యెపుడుండునో అపుడే సత్తాసామాన్యత్వము సిద్ధించును.



యదా సర్వాణి దృశ్యాని సత్తాసామాన్యవేదనమ్
స్వరూపేణ స్వరూపాభం సత్తాసామాన్యతా తదా. 5

సర్వభూతములకు పారమార్థికరూపమున స్వస్వరూప చిన్మాత్రానుభవము యెపుడు కలుగునో, అపుడే సత్తాసామాన్యత్వము సంభవించును.

కూర్మోఽఙ్గానీవ దృశ్యాని లీయన్తే స్వాత్మనాత్మని
అభావితాన్యేవ యదా సత్తాసామాన్యతా తదా. 6

తాబేలు తనయంగములను తనయందు లీనమొనర్చుకొనునట్లు సమస్త భూతములున్ను సహజముగ (భావనాయత్నములేకయే) తమ ఆత్మయందెపుడు లయించునో అపుడే చిత్తుయొక్క సామాన్యసత్త సంభవించును.

దృష్టిరేషా హి పరమా సదేహాదేహయోః సదా
ముక్తయోః సంభవత్యేవ తుర్యాతీతపదోపమా, 7

ఇదియే సప్తమభూమికకుం జెందిన ప్రరూఢ దృష్టి. ఇదియే తురీయాతీతపదతుల్యము నగును. సదేహవిదేహముక్తులకీస్థితి సమానమే. స్వరూపస్థితియందు వారిరువురకేమియు భేదములేదు.

వ్యుత్థితస్య భవత్యేషా సమాధిస్థస్య చానఘ
జ్ఞస్య కేవలమజ్ఞస్య న భవత్యేవ బోధజా. 8

పాపరహితుండవగు నోరామా! ఇట్టి దృష్టి పంచమాది భూమికలందలి సమాధిస్థునకు గూడ కలుగును. కాని సప్తమ భూమికయందు రూఢిజెందిన వానికీ దృష్టి వ్యుత్థానదశయందును యుండును. బోధచే యిట్టిదృష్టి జ్ఞానికే కలుగును గాని అజ్ఞానికి కాదు.

అస్యాం దృశిస్థితాః సర్వే జీవన్ముక్తా మహాశయాః
సిద్ధా రసా ఇవ భువి వ్యోమవీథ్యామివానిలాః. 9

జీవన్ముక్తులగు మహాత్ములందఱును యీదృష్టియందేయుండి, భూమిపై పాదరసము వలెను, ఆకాశమున వాయువువలెను నిర్లిప్తులై యుందురు.

అస్మత్ప్రభృతయః సర్వే నారదాద్యాశ్చ రాఘవ
బ్రహ్మవిష్ణ్వీశ్వరాద్యాశ్చ దృష్టావస్యాం వ్యవస్థితాః. 10

ఓరాఘవా! ఇట్టి దృష్టి నవలంబించియే అస్మదాది ఋషిమునులందఱును భూతలము పైనను, నారదాదులాకాశమునను, బ్రహ్మవిష్ణుమహేశ్వరులింకను యూర్ధ్వమగులోకములందును స్థితి గల్గియున్నారు.

ఏతామాలమ్బ్య పదవీం సమస్తభయనాశనీమ్
ఉద్దాలకోఽసావవసద్యావదిచ్ఛం జగద్గృహే. 11

సర్వభయ వినాశకరమగు యిట్టి పదవినాశ్రయించియే ఆయుద్దాలకుడు ప్రారబ్ధక్షయపర్యంతము జగద్రూపగృహమున వసించెను.

అథ కాలేన బహునా బుద్ధిస్తస్య బభూవ హ
విదేహముక్తస్తిష్ఠామి దేహం త్యక్త్వేతి నిశ్చలా. 12

పిదప, చాలకాలమున కాతనికి దేహమును త్యజించి విదేహముక్తుడనై యుండవలెనను దృఢబుద్ధి కలిగెను.

ఏవం చిన్తితవానద్రేర్గుహాయాం పల్లవాసనే
బద్ధపద్మాసనస్తత్రావర్ధోన్మీలితలోచనః. 13
సంయమ్య గుదసంరోధాద్ద్వారాణి నవ చేతసః
మాత్రాస్పర్శాన్స్వచిన్త్వానో భావితస్వాన్తచిద్ఘనః. 14
సంరుద్ధప్రాణపవనః సమసంస్థానకంధరః
తాలుమూలతలాలగ్నజిహ్వామూలో లసన్ముఖః 15
న బహిర్నాన్తరే నాధో నోర్ధ్వే నార్ధే న శూన్యకే
సంయోజితమనోదృష్టిర్దన్తైర్దన్తానసంస్పృశన్. 16

ఇట్లు దృఢనిశ్చయయుక్తుడగు నా యుద్దాలకుఁడా పర్వతకందరమున పల్లవాసనముపై పద్మాసనాసీనుఁడై అర్ధోన్మీలితనేత్రుడై యుండెను. కాలిమడమచే గుదమును నిరోధించి తొమ్మిది యింద్రియద్వారములను సంయమనముచేసి, శబ్దస్పర్శాదుల చిత్తముచే నేకమొనర్చి హృదయమున జేర్చుచు, అట్టి హృదయగతవృత్తులను స్వస్వరూపచైతన్యముతో నేకమొనర్చుచు చిద్ఘనరూపుడై యుండెను. సమముగనున్నట్టి కంఠముచే శోభితుడును, తాలువుయొక్క మొదటి భాగమున (కంఠప్రదేశమున) కవాటముపగిది జిహ్వను స్థాపించుటచే ప్రసన్నముఖుడునునై, ప్రాణవాయువును నిరోధించుచు దంతములచేదంతముల స్పృశింపక ఆ యుద్దాలకుడు బాహ్యాభ్యంతరములందుగాని, ఊర్ధ్వాధోభాగములగాని, రూపాది విషయములగాని, శూన్యమునగాని తన మనోదృష్టి నుంచక కేవలము చిన్మాత్రమందే స్థితుఁడైయుండెను.

ప్రాణప్రవాహసంరోధసమః స్వచ్ఛాననచ్ఛవిః
అఙ్గచిత్సంవిదుత్తానరోమకణ్టకితాఙ్గభూః. 17
అఙ్గచిత్సంవిదాభ్యాసాచ్చిత్సామాన్యముపాదదే
తదభ్యాసాదవాపాన్తరానన్దస్పన్దముత్తమమ్. 18

ప్రాణప్రవాహనిరోధముచే, దేహమానసాదుల చంచలత్వముడుగుటచే సమరూపుడై ప్రసన్నముఖుడై, చిద్రూపుడై, బ్రహ్మానందానుభవముచే గగుర్పాటుజెంద, కంటకయుక్త భూప్రదేశమువలె గన్పట్టు శరీరముగలవాడై, ఆ యుద్దాలకుడు అంతఃకరణవృత్తివిలయాభ్యాసముచే తన చిత్సామాన్యరూపమున ప్రవేశించి, బింబభూతమగు చిన్మాత్రాభ్యాసముచే హృదయమున సర్వోత్తమమగు బ్రహ్మానందము ననుభవించెను.

తదాస్వాదనతో లీనచిత్సామాన్యదశాక్రమమ్
విశ్వంభరమనన్తాత్మ సత్తాసామాన్యసూయయా. 19



తస్థౌ సమసమాభోగః పరాం విశ్రాంతిమాగతః
అనానన్దసమానన్దముగ్ధముగ్ధముఖద్యుతిః. 20
సంశాన్తానన్దపులకః పదం ప్రాప్యామలం గతః
చిరకాలపరిక్షీణమననాదిభవభ్రమః. 21
బభూవ స మహాసత్త్వో లిపికర్మార్పితోపమః
సమః కలావపూర్ణేన శరదచ్ఛామ్బరేన్దునా. 22

అట్లు చిత్-సత్త (బ్రహ్మానందము) ననుభవించుటచే తనరూపమును మఱచి, స్వానుగతమగు నిత్యప్రకాశరూపమైన చిత్సామాన్యరూపత్వమొంది, జగత్తునకాశ్రయభూతమును, అపరిచ్ఛిన్నమునగు ఆత్మసత్తను యాతడు బొందెను. మిగుల సమరూపుడగు (విక్షేపము సంపూర్ణముగ నశించిన) నాయుద్దాలకుడు సర్వోత్తమానందప్రాప్తిచే నతిసుందరమగు ముఖకాంతి గల్గి పరమవిశ్రాంతిని బొందెను. జీవించియున్నపుడే సర్వోత్కృష్ట పదమునుబొంది, రోమాంచాదులు లేక ప్రారబ్ధముల వినాశముచే నిర్మలపదమొంది, చిరకాలానుగతమగు సంకల్పాది సంసార భ్రమరహితుడై యుండెను. అమ్మహాత్ముడపుడు లిఖితచిత్రమువోలెను, శరదాకాశమందలి సర్వ కళాపరిపూర్ణమగు చంద్రునివలెను శోభించెను.

ఉపశశామ శనైర్దివసైరసౌ కతిపయైః స్వపదే విమలాత్మని
తరురసః శరదన్త ఇవామలే రవికరాజసి జన్మదశాతిగః. 23

ఓ రామా! హేమంతకాలమున వృక్షరసము సూర్యకిరణములందు లయించి శమనమొందునట్లు, కొన్ని దినములలోనే ఆ యుద్దాలకుడు తప్తజలముయొక్క జ్యోత్స్నయమువలె స్వనిర్మలపదమున ప్రశమనమొందెను.

గతసకలవికల్పో నిర్వికారోఽభిరామః
సకలమలవిలాసోపాధినిర్ముక్తమూర్తిః
విగలితసుఖమాద్యం తత్సుఖం ప్రాప యస్మిం
స్తృణమివ జలరాశావూహ్యతే శక్రలక్ష్మీః. 24

సర్వవికల్పరహితుడును, నిర్వికారుడును, అతిసౌందర్యయుతుడును, సర్వమలోపాధివినిర్ముక్తుడును నగు నా యుద్దాలకుడు బ్రహ్మలోకపర్యంత సుఖమునుగూడ త్యజించి, ఎద్దానియందు ఇంద్రైశ్వర్యము కూడ సముద్రజలమందలి తృణమువలె తొలగింపబడునో అట్టి వాగగోచరమును, సర్వప్రథమమునునగు పరమానందము నొందెను.

అపరిమితనభోన్తర్వ్యాపి దిగ్వ్యాపిపూర్ణం
భువనభరణశీలం భూరిభవ్యోపసేవ్యమ్
కథనగుణమతీతం సత్యమానన్దమాద్యం
పరమసుఖమనన్తం బ్రహ్మణోఽసౌ బభూవ. 25

వివిధ బ్రహ్మాండభేదములచే నపరిమితమును, అనంతాకాశమునుగూడ తన యుదరమున వ్యాప్తమొనర్చునదియు దిక్కులందంతట వ్యాపించినదియు, సర్వదా సర్వవస్తువులందును పూర్ణమైయుండునదియు, సర్వాధారభూతమును, సర్వలోక పరిపోషకమును, బహుభాగ్యంబున ఉత్తమ జీవులచే సేవింపయోగ్యమును, వాక్ప్రవృత్తినిమిత్త ధర్మముల కతీతమును, సత్యజ్ఞానానంతస్వరూపమును, సర్వులకు సుఖకారకమును, అనాదియునగు యేబ్రహ్మానందము గలదో, అద్దానిరూపమునే ఆ యుద్దాలక బ్రాహ్మణుడు పొందెను.

గతవతి పదమాద్యం చేతసి స్వచ్ఛభావం
ద్విజతనురథ మాసైః సోపవిష్టైవ షడ్భిః
రవికరపరితప్తా వాతభాంకారరమ్యా
తనుతరుభుజతన్త్రీ శైలవీణా బభూవ. 26

అటు పిదప యాబ్రాహ్మణుని జీవము నిర్మలమై, అనాదియైన బ్రహ్మభావము నొందిన మీదట, అచ్చోటనే యున్నదై ఆఱునెలల వఱకు సూర్యకిరణములచే తపింపబడినదై వీచుచున్న వాయువుల భాంకార ధ్వనులచే రమణీయముగ నున్నదైన వాని శరీరము, ఆపర్వతమున, అల్ప వృక్షములంబోలిన భుజములచే వాయింప యోగ్యమై, నాడులను తంతులుగల్గినట్టి వీణవలె నొప్పుచుండెను.

అథ బహుతరకాలేనైతదద్రేర్భువం తా
ముపయయురగకన్యాసంయుతా మాతరః ఖాత్
అభిమతఫలసిద్ధ్యై సంయుతా ఏవ సర్వా
అనలమివ శిఖానాం పఙ్క్తయః పిఙ్గకేశ్యః. 27

పిమ్మట, చాలాకాలమునకు పరస్పరము సదా కూడియుండునట్టి పర్వతకన్యకలతో సహా గౌరవర్ణకేశయుతులగు బ్రాహ్మ్యాది మాతృగణము ఒకానొక భక్తుని మనోరథమీడేర్చుటకై, అగ్నిజ్వాల లగ్నివై పునరుజ్జనునట్లు, ఆకాశతలమునుండి యా పర్వతప్రదేశమున [illegible]

దినకరకరశుష్కం విప్రకంకాలకం త-
జ్ఝటితి ముకుటకోటౌ ఖడ్గఖట్వాఙ్గమధ్యే
సకలవిబుధవన్ద్యా ఖింఖినీ దేవదేవీ
నిశి నవతరవృత్తా కాన్తకాన్తిం చకార. 28

ఆ మాతృగణమధ్యమున, రాత్రిసమయమున నూతనాభరణ సంయుక్తమై, నవీనక్రీడాసాధన సహితమై, బ్రహ్మాది దేవతలందఱకునుగూడ వందనీయమైనట్టి ఖింఖిణి యను దేవిఉద్దాలకుని శుష్కశరీరమును శీఘ్రముగ తన ఖడ్గ ఖట్వాంగ మధ్యముననున్న కిరీటముయొక్క అగ్రభాగమున భూషణముగ జేసెను.



ఇత్యుద్దాలకదేహకం సువిలసన్మాయూరబర్హ వ్రజ
వ్యాలోలాబ్దలవే నవైర్నవలితే మన్దారమాలాగణైః
శేతే ఖింఖిసికా మహాభగవతీ లీలాలలామే లతా
జాలే భృఙ్గ ఇవాన్తపుష్పపటలే పశ్చాదుపాగచ్ఛతి. 29

లెస్సగ శోభించునదియు, మయూరపంఖములను చంచలమేఘఖండములచే రమణీయముగ [illegible], నూతనమందారమాలలచే పరివేష్టితమును, అగ్రభాగమున పుష్పసమూహయుక్త [illegible] ఖింఖిణియొక్క లీలార్థము నిర్మితమును, జడవలె పృష్ఠభాగమువఱకు వ్రే[illegible]చున్నదియునగు శిరోమాలయందు, రక్తమాంసమయమగు నాయుద్దాలకుని దేహమున్ను, లతాసమూహమున భృంగమువలె శయనించుచున్నది.

ఏషోద్దాలకచిత్తవృత్తికలనావల్లీ వివేకస్ఫుర
త్స్వానన్దప్రవికాసభాసికుసుమా హృత్కాననే విస్తృతా
రూఢా యస్య కదాచిదేవ విహరన్న ప్యేవ సచ్ఛాయయా
నాసావేతి వియోగమేతి సహ లేనోచ్చైస్తరాం సంగమమ్. 30

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయేషూపశమప్రకరణే ఉద్దాలకనిర్వాణం నామ
పఞ్చపఞ్చాశః సర్గః ॥ 55 ॥

ఓ రామా! దృశ్యమంతటిని గూర్చిన వివేకముదయమువ, స్ఫురించు ఆత్మానందమే ఉత్తమ వికాసములచే శోభించుపుష్పములుగా గల్గినదై, ఆరంభమునుండి విదేహకైవల్యప్రాప్తిపర్యంతము గల ఉద్దాలకుని చరిత్రమను కల్పవృక్షలత యెవని హృదయవనమున నుత్పన్నమై ఉత్తరోత్తర భూమికాధిరోహణముచే విస్తరించునో, ఆతడు త్రివిధతాపములను సూర్యునిచే తపింపబడు వ్యవహారమను వనమున విహరించుచున్నను, సత్యశాంత్యాదిగుణములను సుగంధముచే శీతలమైనట్టి సహజసంతోషమను ఛాయనెన్నటికి వీడక సర్వోత్తమమగు మోక్షమునొందును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ఉద్దాలకనిర్వాణమను పంచపంచాశ
సర్గము ॥ 55 ॥

---

షట్పఞ్చాశః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

క్రమేణానేన విహరన్విచార్యాత్మానమాత్మనా
విశ్రాన్తిమేహి వితతే పదే పద్మదలేక్షణ. 1

శ్రీ వసిష్ఠుడు:—కమలనేత్రుఁడవగు నో రామచంద్రా! ఈపైన దెల్పిన విధమున విచార వైరాగ్య సమాధ్యభ్యాసక్రమమునుతోఁగూడి విహరించుచు, ఆత్మచే నాత్మను లెస్సగ విచారించి వ్యాపక పరబ్రహ్మమున విశ్రాంతి నొందుము.

శాస్త్రార్థగురుచేతోభిస్తావత్తావద్విచార్యతే
సర్వదృశ్యక్షయాభ్యాసాద్యావదాసాద్యతే పదమ్. 2

శాస్త్రశ్రవణముచేతను, ఆత్మతత్త్వపరీక్షచేతను, గురువాక్యమందలి విశ్వాసముచేతను, చిత్తశోధనముచేతను, దృశ్యమంతయు శమించి ఆత్మపదమెంతవఱకు సంప్రాప్తింపదో అంతవఱకు (తత్త్వ) విచారమవశ్యము గావింపవలెను.

వైరాగ్యాభ్యాసశాస్త్రార్థప్రజ్ఞాగురుమయక్రమైః
పదమాసాద్యతే పుణ్యం ప్రజ్ఞయైవైకయాథవా. 3

వైరాగ్య, ఆత్మచింతనాభ్యాస, వేదాంతశాస్త్ర శ్రవణ, ఆత్మపరీక్షా, గురువాక్య విశ్వాస, ఇంద్రియనిగ్రహ, ప్రజ్ఞాది క్రమములచే పవిత్రమగు బ్రహ్మపదము చేకూరును. లేక, కేవల మొక ప్రజ్ఞచేనైనను కలుగును.

సంప్రబోధవతీ తీక్ష్ణా కలఙ్కరహితా మతిః
సర్వసామగ్ర్యహీనాపి పదం ప్రాప్నోతి శాశ్వతమ్. 4

జ్ఞానయుక్తమును, అతితీక్ష్ణమును, అవిద్యాకళంకరహితమునునగు బుద్ధి వైరాగ్యాది సర్వసామగ్రి రహితమైనను, నిత్యమగు బ్రహ్మపదము నొందింపజేయును.

శ్రీరామ ఉవాచ:—

భగవన్భూతభవ్యేశ కశ్చిజ్జాతసమాధికః
ప్రబుద్ధ ఇవ విశ్రాన్తో వ్యవహారపరోఽపి సన్. 5
కశ్చిదేకాన్తమాశ్రిత్య సమాధినియతః స్థితః
తయోస్తు కతరః శ్రేయానితి మే భగవన్వద. 6

శ్రీరాముడు:—భూతభవిష్యద్వర్తమానముల కీశుఁడవగు నో దేవా! వ్యవహారతత్పరుఁడైనను సమాధిస్థునివలె విశ్రాంతి నొందునట్టి జ్ఞాని యెవఁడైన గలఁడా? ఏకాంతస్థలము నాశ్రయించి సమాధి నియమమనుష్ఠించువానిలోను వ్యవహారపరుఁడైయున్నను సమాధిస్థుఁడైయుండు వానిలోను యెవఁడు శ్రేష్ఠుఁడో వచింపుము!

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇమం గుణసమాహారమనాత్మత్వేన పశ్యతః
అన్తఃశీతలతా యాసౌ సమాధిరితి కథ్యతే. 7

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! గుణసముదాయరూపమగు యీ దృశ్యప్రపంచము ననాత్మగా బరికించుటచే మనుజునకు గల్గు అంతశ్శీతలత్వమే (పూర్ణకామత్వమే) సమాధియనబడును.



దృశ్యైర్మనసిసంబద్ధ ఇతి నిశ్చిత్యశీతలః
కశ్చిత్సంవ్యవహారస్థః కశ్చిద్ధ్యానే వ్యవస్థితః. 8

మనస్సుండుటచేతనే దృశ్యములతోటి సంబంధము గలుగుచున్నది. అట్టి సంబంధము ఆత్మయగు నాకులేదు. అని యిట్లు నిశ్చయించి (పూర్ణకాముడై) యొకానొకడు వ్యవహారపరుడుగను, మఱియొకడు సమాధిస్థుడుగను నుండును.

ద్వావేతౌ రామ సుఖితావన్తశ్చేత్పరిశీతలౌ
అన్తఃశీతలతా యా స్యాత్తదనన్తతపఃఫలమ్. 9

ఓ రామా! వీరిరువురును అంతఃకరణమున పూర్ణకాములై యుండుచో సుఖవంతులే. ఏలన అంతఃశీతలత్వమే అనంతతపము యొక్క ఫలమగును.

సమాధిస్థానకస్థస్య చేతశ్చేద్వృత్తిచఞ్చలమ్
తత్తస్య తత్సమాధానం సమమున్మత్తతాణ్డవైః. 10

సమాధిస్థుని అంతఃకరణవృత్తి చంచలమైయుండుచో వాని యీ సమాధి ఉన్మత్తుని తాండవనృత్యమువంటిదే యగును.

ఉన్మత్తతాణ్డవస్థస్య చేతశ్చేత్క్షీణవాసనమ్
తదస్యోన్మత్తవృత్తం తత్సమం బుద్ధసమాధినా. 11

మఱియు, తాండవనృత్యమందున్న ఉన్మత్తుని చిత్తమైనను వాసనారహితమగుచో, వాని యున్మత్తవృత్తాంతమున్ను ప్రబుద్ధుని సమాధితో సమమగును.

వ్యవహారీ ప్రబుద్ధో యః ప్రబుద్ధో యో వనే స్థితః
ద్వావేతౌ సుసమా నూనమసందేహం పదం గతౌ. 12

వ్యవహారతత్పరుడగు జ్ఞానియు, వనమందున్న జ్ఞానియు యిరువురు సములే. నిక్కముగ వారిర్వురు సంశయరహితమగు (బ్రహ్మ) పదమును బొందినవారే.

అకర్తృ కుర్వదప్యేతచ్చేతః ప్రతనువాసనమ్
దూరం గతమనా జన్తుః కథాసంశ్రవణే యథా. 13

కథాశ్రవణమున, ఎవని చిత్తము అన్యస్థానగతమగునో, ఆతడా కథను సంబంధించిన రాగద్వేషాదులచే బంధింపబడనట్లు, వాసనలు నశించినచో క్రియలొనర్చుచున్నను చిత్తమకర్తయే యగును.

అకుర్వదపి కర్త్రేవ చేతః ప్రఘనవాసనమ్
నిస్పన్దాఙ్గమపి స్వప్నే శ్వభ్రపాతస్థితావివ. 14

అంగములు చలింపక చేష్టారహితమైయున్నను చిత్తము స్వప్నమున తాను గోతియందు బడినట్లు భావించుటచే కర్తృత్వము గలదేయగునట్లు, ఘనవాసనాయుత చిత్తము కర్త గాకున్నను కర్తయే యగును.

చేతసో యదకర్తృత్వం తత్సమాధానముత్తమమ్
తం విద్ధి కేవలీభావం సా శుభా నిర్వృతిః పరా. 15

ఓ రామా! చిత్తముయొక్క అకర్తృత్వమే ఉత్తమ సమాధి యగును. దానినే నీవు కేవలీభావమని యెఱుంగుము. అదియే పరమసుఖమువ విశ్రాంతియు నగును.

చేతశ్చలాచలత్వేన పరమం కారణం స్మృతమ్
ధ్యానాధ్యానదృశోస్తేన తదేవానఙ్కురం కురు. 16

ధ్యానాధ్యానము (సమాధ్యసమాధు) లందు చిత్తముయొక్క అచంచలత్వ చంచలత్వములే ముఖ్యకారణమని చెప్పబడినది. కాన వాసనారాహిత్యముచే అట్టి చిత్తమును అంకురరహితమొనర్పుము.

అవాసనం స్థిరం ప్రోక్తం మనోధ్యానం తదేవ తు
స ఏవ కేవలీభావః శాంతతైవ చ సా సదా. 17

వాసనారహితమగు మనస్సే స్థిరమని యెన్నబడినది. అదియే ధ్యానము; అదియే కేవలీభావము; అదియే శాంతత్వము.

తనువాసనమత్యుచ్చైః పాదయోద్యతముచ్యతే
అవాసనం మనోఽకర్తృపదం తస్మాదవాప్యతే. 18

వాసనారహితమగు మనస్సు అత్యున్నత (బ్రహ్మ) పదమును పొందింపజేయును. అట్టి వాసనారహితమగు మనస్సు కర్తకానేరదు. అద్దానిచేతనే బ్రహ్మపదము లభించును.

ఘనవాసనమేతత్తు చేతః కర్తృత్వభాజనమ్
సర్వదుఃఖప్రదం తస్మాద్వాసనాం తనుతాం నయేత్. 19

ఘనవాసనాయుతమగు చిత్తము కర్తృత్వము గలదగును. అదియే సర్వదుఃఖములఁగల్గజేయును. కాన వాసనల సూక్ష్మమొనర్పవలెను.

ప్రశాన్తజగదాస్థోఽన్తర్వీతశోకభయైషణః
స్వస్థో భవతి యేనాత్మా స సమాధిరితి స్మృతః. 20

జగద్దేహాది దృశ్యమందు అహంకార మమత్వాభిమానములు నశించినవాడును భయశోకేచ్ఛారహితుఁడును నగుటచే యెవని ఆత్మ ప్రశాంతమగునో (స్వస్వరూపమున ప్రతిష్ఠితమై యుండునో) వాని యట్టి ప్రశాంత స్థితియే సమాధియనఁబడును.

చేతసా సంపరిత్యజ్య సర్వభావాత్మభావనామ్
యథా తిష్ఠసి తిష్ఠ త్వం తథా శైలేగృహేఽథవా. 21

సమస్త పదార్థములందును అహంమమత్వాభిమానముల ద్యజించి నీ యిచ్చవచ్చినచందమున నుండుము. పర్వతముపైనుండి సమాధి శీలించుము, లేక గృహముననుండి వ్యవహారము సల్పుము.



గృహమేవ గృహస్థానాం సుసమాహితచేతసామ్
శాన్తాహంకృతిదోషాణాం విజనా వనభూమయః. 22

సమాహిత చిత్తులును, అహంకారాది దోషములు నశించినవారును నగు గృహస్థుల గృహమే నిర్జన వనప్రదేశములగును.

అరణ్యసదనే తుల్యే సమాహితమనోదృశామ్
భవతామిహ భూతానాం భూతానాం మహతామివ. 23

సమాహిత మనోదృష్టులు గల్గి నిత్యాపరోక్షాత్మయందు స్థితిఁబొందిన నీవంటి మహాత్ములకు ఆకాశాది భూతములకువలె గృహారణ్యములు సమములే యగును.

శాన్తచిత్తమహాభ్రస్య జనజ్వాలోజ్జ్వలానపి
నగరాణ్యపి శూన్యాని వనాన్యవనిపాత్మజ. 24

రాజసుతుఁడవగు నోరామా! చిత్తమను మహాకాశము (శరదాకాశమువలె) శాంతమై యుండువానికి జనసమూహముచే వ్యాప్తములైన నగరములున్ను నిర్జనవనములే యగును.

వృత్తిమచ్చిత్తమత్తస్య విజనాని వనాన్యపి
నగరాణి మహాలోకపూర్ణాని పరవీరహన్. 25

శత్రుసంహారకుఁడవగు నోరామా! రాగాది వృత్తులచే విక్షేపము నొందిన చిత్తముగల మనుజులకు నిర్జన వనములున్ను బహుజనపూరిత నగరములే యగును.

వ్యుత్థితం చిత్తమభ్యేతి భ్రమస్యాన్తః సుషుప్తతామ్
నిర్వాణమేతి నిర్వాణం యథేచ్ఛసి తథా కురు. 26

రాగాదులచే విక్షిప్తములగు పలువిధవిషయభ్రమ లంతఃకరణమున లయింప, చిత్తము వాసనాబీజయుక్తమై సుషుప్తిదశనొందును. అట్టి వాసనాబీజములున్ను నశించిన శాంత చిత్తమే మోక్షము బడయును. ఇక నీవెట్లు తలంతువో అట్లనే యాచరింపుము.

సర్వభావపదాతీతం సర్వభావాత్మకం చ వా
యః పశ్యతి సదాత్మానం స సమాహిత ఉచ్యతే. 27

సమాధియందు సమస్త పదార్థముల కతీతముగను, వ్యవహారమున సమస్తపదార్థరూపముగను ఆత్మను సదా పరికించువాడే సమాధిస్థుడనఁబడును.

ఈహితానీహితే క్షీణే యస్యాన్తర్వీతతాకృతేః
సర్వే భావాః సమా యస్య స సమాహిత ఉచ్యతే. 28

ఎవనికి రాగద్వేషములు నశించునో, యెవనికి పదార్థములన్నియు సమ (బ్రహ్మ) రూపమున గన్పించునో, అట్టి విశాలాకారయుతుడే సమాధిస్థుడనఁబడును.

సదాత్మనా। సదేవేదం జగత్పశ్యతి నో మనః
యథా స్వప్నే తథైవాస్మిఞ్జాగ్రత్యపి జనేశ్వర. 29

మనుజేశ్వరుఁడవగు నోరామా! సమాహితుని చిత్తము స్వప్నమునందువలె జాగ్రత్తునందును యీ దృశ్యజగత్తును బ్రహ్మరూపముగనే సదా వీక్షించుచుండును. అనగా వాని మనంబీ జగత్తును ఆత్మేతరముగ గాంచకుండును.

యథా విపణికాలోకా విహరన్తోప్యసత్సమాః
అసంబన్ధాత్తథా జ్ఞస్య గ్రామోపి విపినోపమః. 30

బజారునందు జనులు తమ తమ వ్యవహారముల సల్పుచున్నను, సంబంధములేమి ఉదాసీనునకు వారసత్తుల్యులే యగునట్లు, సంబంధాభావముచే జ్ఞానిదృష్టియందు గ్రామమున్ను వనమే యగును.

అన్తర్ముఖమనా నిత్యం సుప్తో బుద్ధో వ్రజన్నపి
పురం జనపదం గ్రామమరణ్యమివ పశ్యతి. 31

నిరంతర మంతర్ముఖమైన మనస్సుగలవాడు నిద్రించుచున్నను, మేల్కొనియున్నను, నడచుచున్నను, నగర, రాజ్య, గ్రామములఁగూడ అరణ్యమువలెనే గాంచును.

సర్వమాకాశతామేతి నిత్యమన్తర్ముఖస్థితేః
సర్వథానుపయోగ్యత్వాద్భూతాకులమిదం జగత్. 32

ప్రాణికోట్లచేతను, పృథ్వ్యాది భూతములచేతను పూర్ణమగు ఈజగత్తు అంతర్ముఖవృత్తిగలవానికేమియు నుపకరించనందుచే, సదా శూన్యరూపమునే పొందుచున్నది.

అన్తఃశీతలతాయాం తు లబ్ధాయాం శీతలం జగత్
విజ్వరాణామివ నృణాం భవత్యాజీవితస్థితేః 33

అంతఃకరణమందు శీతలత్వము లభించుటచే మనుజుల కాజీవితమున్ను ఈజగత్తు నీరోగికివలె శీతలముగ భాసించును.

అన్తస్తృష్ణోపతప్తానాం దావదాహమయం జగత్
భవత్యఖిలజన్తూనాం యదన్తస్తద్బహిః స్థితమ్. 34

అంతఃకరణమున తృష్ణయను అగ్నిజ్వాలచే సంతప్తులగు జీవులకీ జగత్తంతయు దావాగ్నిదాహమయమైయుండును. ఏలన, అంతఃకరణమున ఈ జగత్తేవిధముననుండునో అట్లనే బాహ్యమునను గన్పట్టును.

ద్యౌః క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
అన్తఃకరణతత్త్వస్య భాగా బహిరివ స్థితాః. 35

అంతరిక్షము, పృథివి, వాయువు, ఆకాశము, పర్వతములు, నదులు, దిక్కులు ఇవన్నియు అంతఃకరణముయొక్క విభాగములేయగుచు బాహ్యమున నున్నట్లు తోచుచున్నవి.

వటధానా వటఇవ యదన్తస్థం సదాత్మనః
తద్బహిర్భాసతే భాస్వద్వికాసే పుష్పగన్ధవత్. 36

వటవృక్షమున వటబీజములున్నట్లు సత్స్వరూపమగు ఆత్మయందుగల జగత్తు వికసితపుష్పగంధమువలె బాహ్యమున గోచరించుచున్నది.

న బహిస్థం న చాన్తస్థం క్వచిత్కించన విద్యతే
యద్యథా కచితం చిత్త్వాత్తత్తథా తత్త్వముత్థితమ్. 37

యథార్థముగ నేదియు బాహ్యమున గాని, అంతరమునగాని లేదు. ఏది పూర్వవాసనాబలముచే యెట్లు భాసించునో, అయ్యది ఆరూపముననే ప్రకటితమగును.

ఆత్మతత్త్వాన్తరం భాతి బహిష్ట్వేన జగత్తయా
కర్పూరమివ గన్ధేన సంకోచే ప్రవికాసి చ. 38

చిన్నడబ్బియందుంచబడిన కర్పూరము గంధవ్యాప్తిచే బాహ్యమున అధికప్రదేశమందు వ్యాపించునట్లు లోనగల ఆత్మతత్వమే బాహ్యమునందు జగదాకారముగ భాసించుచున్నది.

ఆత్మైవ స్ఫురతి స్ఫారం జగత్త్వేనాప్యహన్తయా
బాహ్యత్వేనాన్తరత్వేన సచ శాసన్న సన్విభుః. 39

ఆత్మయే విశాలత్వముచే బాహ్యజగద్రూపముగను, అంతరమున అహంకార రూపమునను స్ఫురించుచున్నది. యథార్థముగ అయ్యది నేత్రాదులచే నదృశ్యమగు అహంకారాది రూపముకాదు, స్థూలమగు బాహ్యరూపమున్ను కాదు. కాని రెంటియందును అనుస్యూతమైన విభుస్వరూపమగు సన్మాత్రమే యగును.

బహిస్థేనాన్తరం బాహ్యమన్తఃస్థేనాన్తరస్థితమ్
యథా విదితమాత్మాయం స్వచిత్తమనుపశ్యతి. 40

ఇక్కారణమున నీ యాత్మ, తన యాంతరికమగు చిత్తము పూర్వవాసనానుసార మెవ్విధముగ నెఱుంగుచున్నదో, తదనుసారము బహిర్ముఖముగ నేత్రాదులచే బాహ్యజగదాకారమును గాంచుచున్నది. మఱియు అంతఃకరణముననున్నదై, జాగ్రద్వాసనాదులచే హృదయస్థిత స్వప్నమనోరాజ్యాదుల వీక్షించుచున్నది.

సబాహ్యాభ్యన్తరం శాన్తమాత్మనో భేదితం జగత్
అహన్త్వాదిస్థితే భేదే భూరిభఙ్గభయం తు తత్. 41

బాహ్యాభ్యంతరములం దనుస్యూతమగు సద్రూపాత్మనుండి జగత్తు వేఱుగావింపబడినచో అయ్యది మృతప్రాయమే యగును. అట్లు వేఱుగావింపబడక పోయినచో బాహ్యాభ్యంతర భేదము తొలగమిచే అహంకార మమత్వాధ్యాసముచే పదార్థములందలి అధిక భేదమును గూర్చిన భయము కలుగును.

ద్యౌః క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
కల్పాదిరేవ జ్వలితం సర్వమాధిహతాత్మనః. 42

మనోవ్యాధిచే హతుడగువానికి అంతరిక్ష, పృథివీ, ఆకాశ, పర్వత, నదీ, దిశాదులన్నియు త్రివిధతాప జ్వాలచే ప్రజ్వలితమై ప్రళయారంభము పగిది నుండును.

యస్యాత్మరతిరేవాన్తః కుర్వతః కర్మేన్ద్రియైః క్రియాః
న వశో హర్షశోకాభ్యాం స సమాహిత ఉచ్యతే. 43

ఎవ్వఁడంతరమున కేవలమాత్మయందే ప్రీతిగల్గియుండునో, అనగా అహంకార మమత్వములఁ ద్యజించి యంతటను సన్మాత్రమగు ఆత్మనే వీక్షించునో, ఆతడు కర్మేంద్రియములచే క్రియలొనర్చుచున్నను హర్షశోకములకు వశుడుగాకయుండును. కావ నాతడుసమాధిస్థుడేయనఁబడును.

యః సర్వగతమాత్మానం పశ్యన్నుపశాన్తధీః
న శోచతి ధ్యాయతి వా స సమాహిత ఉచ్యతే. 44

సర్వవ్యాపియగు ఆత్మను అంతటను గాంచుచు, ప్రశాంత బుద్ధిగల్గి, ప్రాపంచిక పదార్థములఁగూర్చి శోకింపకయు, వాటిని తలంపకయు నుండునో ఆతడే సమాధిస్థుడనఁబడును.

స పూర్వాపరపర్యన్తాం యః పశ్యఞ్జాగతీం గతిమ్
దృష్టిష్వేతాసు హసతి స సమాహిత ఉచ్యతే. 45

ఉత్పత్తివినాశయుక్తమగు జగత్తుయొక్క గతిని వీక్షించుచు, అజ్ఞులందు ప్రసిద్ధమైయుండు అహంమమత్వాది దృష్టులఁగాంచి హసించుచునుండువాడే సమాధిస్థుడనఁబడును.

సమే పరేఽపి నాహన్తా న జగజ్జన్మనో మయి
వీచివృన్దేష్వివాతప్తా నాకాశే ఫలధాతవః. 46

శరదాతపమున దూరమున గన్పట్టు రజతకాంతి తరంగములయందుండనట్లు, ప్రత్యగాత్మస్వరూపుఁడనగు నాయందును, అసంగ, అద్వైత, కూటస్థ, సమరూప పరబ్రహ్మమునందును అంహంకారమమత్వములును, జననమరణాది జగద్వికారములును సంభవింపనేరవు.

యస్యాన్తరస్థితాహన్త్వం న విభాగాది నో మనః
న చేతనాచేతనత్వే సోఽస్తి నాస్తీతరో జనః. 47

ఎవనికి భిన్నప్రత్యగాత్మస్థితియు, అహంకారమున్ను, దృశ్యజగద్విభాగాదులును, మనస్సున్ను తదీనమగు చేతనాచేతనవ్యవహారమున్ను లేవో, సర్వాత్మస్వరూపుఁడగు అట్టి జ్ఞానియొకడే యున్నవాడగును గాని తక్కినవారు లేనివారే యగుదురు.

వ్యోమస్వచ్ఛో బహిష్ఠేహాం సమ్యగాచరతీహ యః
హర్షామర్షవికారేషు కాష్ఠలోష్టసమః శమః. 48

ఆకాశమువలె స్వచ్ఛమై, శాస్త్ర, శిష్టాచారముల కవిరుద్ధముగ బాహ్యక్రియల నొనర్చుచు, హర్షక్రోధాది వికారములందు శిలాకాష్ఠములపగిది చలింపక శాంతస్వభావుడై యెవడుండునో ఆతడే సమదర్శియగును.



ఆత్మవత్సర్వభూతాని పరద్రవ్యాణి లోష్టవత్
స్వభావాదేవ న భయాద్యః పశ్యతి స పశ్యతి. 49

సర్వజీవులను తనవలెను, పరుల ద్రవ్యమును మంటిగడ్డవలెను, భయముచేగాక స్వభావముగనే యెవఁడు గాంచునో ఆతడే నిజముగ గాంచువాడగును.

అర్థోఽతనుస్తనుర్వాపి నాసద్రూపేణ చేత్యతే
సద్రూపో నానుభూతోఽజ్ఞైర్జ్ఞైర్నైవ న తత్తయా. 50

అజ్ఞాని బ్రహ్మైశ్వర్యాది మహత్పదార్థములఁగాని, సువర్ణాది యల్పవస్తువులఁగాని మిథ్యారూపముననుగాంచడు మఱియు సద్రూపానుభవములేమి సద్రూపముననుగాంచడు. జ్ఞానియొకడే పదార్థములను మిథ్యారూపముగను సద్రూపముగను వీక్షించును.

ఈదృశాశయ సంపన్నో మహాసత్త్వపదం గతః
తిష్ఠతూదేతు వా యాతు మృతిమేతు న తత్స్థితిమ్. 51

ఇట్టి యుత్తమాశయముగల్గి బ్రహ్మపదమును బొందినవాడు ధనహీనుడైనను, ఐశ్వర్యయుతుఁడైనను, పుత్రబాంధవాదులు మరణించినను, అభ్యుదయస్థితి బొందకున్నను, సమరూపుడై సర్వావస్థలయందును హర్షశోకాదులచే నేమియు నంటకుండును.

వసతూత్తమభోగాఢ్యే స్వగృహే వా జనాకులే
సర్వభోగోజ్ఝితాభోగే సుమహత్యథవా వనే. 52
ఉద్దామమన్మథం పానతత్పరో వాపి నృత్యతు
సర్వసఙ్గపరిత్యాగీ సమమాయాతు వా గిరౌ. 53
చన్దనాగురుకర్పూరైర్వపుర్వా పరిలిమ్పతు
జ్వాలాజటిల విస్తారే నిపతత్యథవాఽనిలే. 54
పాపం కరోతు సుమహద్బహులం పుణ్యమేవ చ
అద్య వా మృతిమాయాతు కల్పాన్తనిచయేన వా. 55
నాసౌ కించిన్న తత్కించిత్కృతం తేన మహాత్మనా
నాసౌ కలఙ్కమాప్నోతి హేమ పఙ్కగతం యథా. 56

ఉత్తమ భోగములచే పరిపూర్ణమై, జనులచే వ్యాప్తమైనట్టి స్వగృహమున వసించుగాక; లేక సర్వభోగవిరహితమగు మహారణ్యమున వసించుగాక; మన్మథుని తీవ్రవేగముచే మద్యపానరతుడై యుండుగాక; లేక నృత్యము సల్పుగాక; సర్వసంగ పరిత్యాగముజేసి పర్వతముపై తపమొనర్చుగాక; చందనాగరు కర్పూరములచే శరీరమును లేపనమొనర్చుగాక; లేక జాజ్వల్యమానమై వెలుంగు విశాల అగ్నిహోత్రమందు దుముకుగాక; పాప మొనర్చుగాక; అధికపుణ్యమాచరించుగాక; నేడు మరణించుగాక, లేక అనేక కల్పములైన తరువాత మరణించుగాక, సమదర్శియగు జ్ఞాని మరణ దుఃఖాది వికారములకును, మనోదేహాదులందలి అహంకారమునకును ఆశ్రయభూ

ఱు జెన్నటికిని కానేరడు. అతడేమియు నొనర్చినవాడున్ను గాకయుండును. బురదయందు పడిన బంగారునకట్లాని మాలిన్యమంటనివిధమున అట్టివానికి దోషరూప కళంకమేమియు సంప్రాప్తింపదు.

సంవిత్పురుషశబ్దార్థైః స కలఙ్కైః కలఙ్క్యతే
అహంత్వంవాసనారూపైః శుక్తికారజతోపమైః. 57

విషయసేవనముచే కళంకితమైన వాసనలచేతను, ఇంద్రియ సంబంధ జ్ఞానములచేతను, వానికాశ్రయభూతమగు దేహముచేతను, వాని భోగ్యములగు శబ్దార్థరూప విషయములచేతను, అజ్ఞానులందు అహంకారప్రధానమగు లింగాత్మ, రజత సదృశపదార్థములచే శుక్తివలె మాలిన్యమునొందును.

సమస్తవస్తుప్రశమాత్సమ్యగ్జ్ఞానాద్యథాస్థితేః
స్వభావస్యోపశాన్తోన్తః కలఙ్కోఽసత్తయా స్వతః. 58

వస్తువులఁగూర్చిన యథార్థజ్ఞానముచే సర్వవస్తువు లుపశమింప సత్తాఽభావముచే చిత్తమందలి కళంకమున్ను స్వయముగ నశించును.

అహంత్వవాసనార్థప్రసూతేః సంవిదాత్మనః
పురుషస్య విచిత్రాణి సుఖదుఃఖాని జన్మని. 59

అహంకార, మమత్వముల యధ్యాసముచే వాసనారూప యనర్థము లుదయింప, మనుజుని జీవితమున పలువిధదుఃఖములు జనించుచున్నవి.

రజ్జ్వాం సర్పభ్రమే శాన్తేఽహిర్నేతి నిర్వృతిర్యథా
అహంత్వభావసంశాన్తౌ తథాన్తః సమతా మతా. 60

రజ్జువునందలి సర్పభ్రమ నశించుటచే సర్పములేదను జ్ఞానముచే శాంతి గల్గునట్లు, అహంభావము నశింప అంతఃకరణమున సమత్వముదయించును.

యత్కరోతి యదశ్నాతి యద్దదాతి జుహోతి వా
నతజ్జ్ఞస్య న తత్ర జ్ఞో మా కరోతు కరోతు వా. 61

ఏది చేయుచున్నను, ఏది భుజించుచున్నను, ఏది యిచ్చుచున్నను, ఏది హోమము చేయుచున్నను, జ్ఞానికి వాటితోగాని వాటితో జ్ఞానికిగాని సంబంధమేమియును లేదు. అతఁడా కర్మల జేసినను చేయకున్నను నొకటే.

కర్మణాస్తి న తస్యార్థో నార్థస్తస్యాస్త్యకర్మణా
యథాస్వభావావగమాత్స ఆత్మన్యేవ సంస్థితః. 62

అట్టిజ్ఞానికి కర్మచేగాని, కర్మాభావముచేగాని ప్రయోజనమేమియు లేదు. యథార్థమగు ఆత్మజ్ఞానముచే నాతడు ఆత్మయందే సదా స్థితిగల్గియుండును.

ఇచ్ఛాస్తతః సముద్యన్తి న మఞ్జర్య ఇవోపలాత్
యాశ్చోద్యన్తి చ తాః సర్వాః స ఏవాప్స్వివ వీచయః. 63



శిలనుండి లత జనింపనట్లు, జ్ఞానియొక్క అంతఃకరణమునుండి కోర్కె జనింపదు. మఱియు నేది జనించునో అయ్యది జలమందలి తరంగమువలె తనరూపమేయగును.

సకలమిదమసావసౌ చ సర్వం
జగదఖిలం న విభాగితాత్ర కాచిత్
పరమపురుషపావనైకరూపీ
స సదితి తత్సదకించిదేవ నాసౌ. 64

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే ధ్యానవిచారో నామ
షట్పఞ్చాశః సర్గః ॥ 56 ॥

ఈ బ్రహ్మాండమంతయు వాని (జ్ఞాని) స్వరూపమే; అతడున్ను బ్రహ్మాండరూపమేయగును. ఏలన, యథార్థముగ యీజగత్తున దేశకాలవస్తుకృతమగు విభాగమేమియును లేదుగదా. కాన నాయుత్తమపురుషుఁ డతిపావనమును, ఏకరూపమును, సర్వద్వైతబంధ వినిర్ముక్తమునునగు సన్మాత్ర స్వరూపుడేయగును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ధ్యానవిచారమను షట్పంచాశ
సర్గము ॥ 56 ॥

---

## సప్తపఞ్చాశః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ.—

యదాత్మమరిచస్యాన్తశ్చిత్త్వాత్తీక్ష్ణత్వవేదనమ్
తదహంతాది భేదాది దేశకాలాది చేత్యతః. 1
యదాత్మలవణస్యాన్తశ్చిత్త్వాల్లవణవేదనమ్
తదహంతాది భేదాది దేశకాలాదిమత్థితమ్. 2
స్వతో యదన్తరాత్మేక్షోశ్చిత్త్వాన్మాధుర్యవేదనమ్
తదహంతాది భేదాది జగత్తత్త్వాది జృమ్భితమ్. 3
స్వతో యదాత్మదృషదశ్చిత్త్వాత్కాఠిన్యవేదనమ్
తదహంతాది భేదాది దేశకాలాదితాం గతమ్. 4
స్వతో యథాత్మశైలస్య జ్ఞతయా జాడ్యవేదనమ్
తదహంతాది భేదాది భువనాదీతి సంస్థితమ్. 5

స్వతో యదాత్మనో యస్య చిద్ద్రవత్వాదివ ర్తనమ్
తదావర్తాద్యహంతాది భేదాద్యాకారితా ఇవ. 6

స్వతో యదాత్మవృక్షస్య శాఖాదిస్తస్య వేదనమ్
తదాహంతాది భేదాది భువనాదీవ సత్స్ఫురత్. 7

యదాత్మగగనస్యాన్తశ్చిత్త్వాచ్ఛూన్యత్వవేదనమ్
తదహంతాది భేదాది భువనాదీతి భావనమ్. 8

యదాత్మగగనస్యాన్తశ్చిత్త్వాత్సౌషిర్యవేదనమ్
తదహంతాది భేదాది శరీరాది చ దీపితమ్. 9

శ్రీవసిష్ఠుడు:—ఓ రామచంద్రా! ఆత్మయను మిరెపయొక్క స్వప్రకాశమను తీక్ష్ణత్వమే అజ్ఞానకారణమున, అహంకారాది రూపముగను, ఘటభిత్త్యాదుల రూపముగను, తదాధారమగు దేశకాలాదిసహిత జగద్రూపముగను నగుచున్నది. అట్లనే ఆత్మయను లవణముయొక్క లవణత్వానుభవమును, ఆత్మయను చెఱకుయొక్క మాధుర్యానుభవమును, ఆత్మయను శిలయొక్క కాఠిన్యానుభవమును, ఆత్మయను పర్వతముయొక్క గురుత్వానుభవమును, ఆత్మయను జలముయొక్క ద్రవత్వానుభవమును, ఆత్మయను వృక్షముయొక్క శాఖిత్వానుభవమును, ఆత్మయను ఆకాశమునందలి శూన్యత్వానుభవమును, అవకాశదాతృత్వానుభవమును, అహంకారాది రూపములుగను, ఘటపటకుడ్యశరీరావర్తాదుల రూపమునను, తదాధారమగు దేశకాలాది సహిత జగద్రూపముగను భాసించుచున్నది. ఇవ్విధమున చిద్బ్రహ్మతోటి సర్వపదార్థములయొక్క అభేదమే సిద్ధించుచున్నది.

స్వతో యదాత్మకుడ్యస్య నైరన్తర్యం నిరన్తరమ్
తదహంతాది భేదేన చిత్తాద్బహిరివ స్థితమ్. 10

ఆత్మయను భిత్తియొక్క ఘనత్వానుభవమే స్వయముగ హంకారాదుల రూపముగను ఘటాదిరూపభేదములుగను, చిత్తమునకు బాహ్యమున, చిత్తునకు భిన్నముగనున్నదానివలె దృశ్యరూపమున గోచరించుచున్నది.

స్వతో యదాత్మసత్తాయాశ్చిత్త్వాత్సత్త్వైకవేదనమ్
తదహంతాది భేదాది చేతనానీతివత్స్థితమ్. 11

ఆత్మసత్తయొక్క చైతన్యము ద్వారాగల్గు సత్తారూపానుభవమే స్వయముగ అహంకారాది రూపములుగను, చిదాభాసుని రూపముగను నున్నది.

అన్తరాత్మప్రకాశస్య స్వతో యదవభాసనమ్
తదహంతాది చిత్త్వాది జీవ ఇత్యేవ వేద సః. 12

స్వప్రకాశముయొక్క అనుభవమునే అంతరాత్మ, వృత్తి భేదముచే భిన్నభిన్న చిదాభాసులందనుగతమగు సామాన్యజీవరూపమున స్వయముగ నెఱుంగుచున్నది.



అన్తరస్తి యదాత్మేన్దోశ్చిద్రూపం చిద్రసాయనమ్
స్వత అస్వాదితం తేన తదహంతాదినోదితమ్. 13

ఆత్మయను చంద్రునియందు స్వయముగ ననుభూతమగు చిద్రూపామృతమే అహంకారాది రూపముల యావిర్భవించినది.

పరమాత్మగుడస్యాన్తర్యచ్చిత్స్వాదూదయాత్మకమ్
తదేవాస్వాద్యతే తేన స్వతోఽహంతాది నాన్తరే. 14

పరమాత్మయను గుడమందలి స్వాదిష్ఠమగు చిద్రూపముయొక్క ఆస్వాదము నా పరమాత్మయే స్వయముగ తనయందు అహంకారాదుల రూపమున బొందుచున్నది.

పరమాత్మమణేశ్చిత్త్వాద్యదన్తః కచనం స్వయమ్
చేతనాత్మపదే చాన్తరహమిత్యాది వేత్త్యసౌ 15

పరమాత్మయను మణియందలి చిద్రూప స్వయంప్రకాశమే తన యంతఃకరణమున అహంకారరూపమున యనుభవము నొందుచున్నది.

నచ కించన వేత్త్యన్తర్వేద్యస్యాసంభవాదిహ
న చాస్వాదయతి స్వాదు స్వాద్యస్యాసంభవాదయమ్. 16

యాథార్థముగ ఆత్మ పరమార్థరూపమున నేమియు నెఱుంగుటలేదు. ఏలన, ఆత్మకంటె భిన్నముగ జ్ఞేయమగు మఱొక పదార్థమే సంభవింపదు. మఱియు నయ్యది దేనిని ఆస్వాదించుటయు లేదు. ఏలన, చైతన్యమునకు వేఱుగ అస్వాదింపతగిన వస్తువు మఱొకటి యెన్నటికిని సంభవముకాదు.

న చ కించిచ్ఛినోత్యన్తశ్ఛేత్యస్యాసంభవే సతి
విన్దతే న చ వా కించిద్వేద్యస్యాసంభవాదసౌ. 17

వికారమునొందు పదార్థమే లేనందున మఱియొక చైతన్యముచే ఆత్మ వికారమును పొందదు. మఱియు పొందదగిన దెద్దియులేనందున నది దేనిని పొందుటయు లేదు.

అసదాభాస ఏవాత్మా అనన్తో భరితాకృతిః
స్థితః సద్వైవైకఘనో మహాశైల ఇవాత్మని. 18

అసత్తగు జగదాకార మెద్దానియందు భాసించుచున్నదో అట్టి అనంతపరిపూర్ణ, సదా జ్ఞానస్వరూప, ఏకరూప పరమాత్మ మహాపర్వతమువలె ఆత్మయందు స్థితిగల్గియున్నది.

అనయా తు వచోభఙ్గ్యా మయా తే రఘునన్దన
నాహంతాది జగత్తాదిభేదోఽస్తీతి నిదర్శితమ్. 19

ఓ రాఘవా! ఈ పూర్వోక్త వచనముల ద్వారా అహంకార, జగత్తులందు భేదమేమియు లేదని వ్యక్తమొనర్చితిని.

న చిత్తమస్తి నో చేతా న జగత్తాదివిభ్రమః
వృష్టమూకామ్బుదసితం శాన్తం శామ్యతి కేవలమ్. 20

యథార్థముగ చిత్తముగాని, చిత్తముగలవాడుకాని, జగదాదుల విభ్రమముగాని లేవు. ప్రథమమున వర్షించి యాపిదప నిశ్శబ్దముగనుండు శరత్కాలమేఘమువలె, శుద్ధసన్మాత్రముచే బాధితమగు యీ జగత్తు ప్రశమన మొందుచున్నది.

యథావర్తాదితామేతి ద్రవత్వాద్వారి వారిణి
తదాహంతాదితామేతి జ్ఞప్తౌ జ్ఞప్త్యా జ్ఞ ఆత్మని. 21

ద్రవస్వభావము గలదగుటచే జలము తనయందావర్తరూపమును బొందునట్లు, మాయావియగు ఈశ్వరుడు స్వమాయచే నావృతమగు జ్ఞప్తిరూప నిజాత్మయందు జగజ్జీవదశల నొందుచున్నాడు.

యథా ద్రవత్వం పయసి యదా స్పన్దః సదాగతౌ
అహంతా దేశకాలాది తథా జ్ఞే జ్ఞప్తిమాత్రకే. 22

జలమందు ద్రవత్వము, వాయువునందు చంచలత్వము యెట్లుగలవో, అట్లనే జ్ఞప్తిమాత్రుఁడగు ఈశ్వరునియందు అహంకార, దేశకాలాదులున్ను గలవు.

జ్ఞో జ్ఞతాయాం శివజ్ఞానం జానాతి జ్ఞానబృంహయా
జ్ఞాయతేఽహంతది జ్ఞేన జీవాదీత్యభిజీవనైః. 23

ఈశ్వరుడు తన ఈశ్వరభావమున ఆవరణ పరిచ్ఛేదరహితమగు జ్ఞానాభివృద్ధిచే, నిత్యనిరతిశయానందరూపమగు జ్ఞానమును సదా యెఱుంగుచున్నాడు. మఱియు అహంకారవశమున, జీవనహేతువులగు భూత ప్రాణేంద్రియాదుల విషయసంబంధాధ్యాసముచే జీవాదిరూపములే ఆత్మయని చైతన్యముచే యెఱుంగబడుచున్నవిగాని యథార్థముగాదు.

యథోదేతి యయా జ్ఞస్య తృప్తిర్జ్ఞానేన యాదృశీ
అనన్యైవాన్యతా బుద్ధా స తథా జృమ్భతే తయా 24

ఏయే కామ కర్మవాసనలచేతను, ఎట్టి విషయజ్ఞానముచేతను ఏ దర్శ లాభాది భోగవైచిత్ర్యముచేతను అజ్ఞానికి ప్రియమోద ప్రమోదాదుల రూపమున తృప్తిగలుగుచున్నదో, ఆ వైచిత్ర్యమంతయు అభిన్నరూపమగు పరమాత్మచేతనే యెఱుంగబడుచున్నది. మఱియు నా యీశ్వరుఁడు ఆయాజీవుల కామనాది వాసనలఁబట్టి తత్తద్రూపములుగ తన యంగముల పరిణతి మొనర్చును.

జీవనం జ్ఞాతతా జ్ఞాతా జీవనం జీవజీవనమ్
అత్యన్తమస్తి నో భేదశ్చిద్రూపత్వే జ్ఞజీవయోః. 25

జగదధిష్ఠానమగు పరమాత్మయొక్క జ్ఞానమే పరమార్థస్థితియనియు, సర్వజీవుల జీవనమెద్దాని యధీనమైయున్నదో అట్టి పరమానందరూపమే జీవుని జీవనసారమనియు సచ్ఛాస్త్ర



గురూపదేశాదులచే యెప్పుడెఱుంగబడునో, అపుడు భోక్తృభోగ్యముల రెంటియధిష్ఠానమున్ను చిద్రూపమే యైనందున జీవేశ్వర భేదమేమియు లేకుండును.

యథా జ్ఞజీవయోర్నాస్తి భేదో నామ తథైతయోః
భేదోఽస్తి న జ్ఞశివయోర్విద్ధి శాన్తమఖణ్డితమ్. 26

జీవేశ్వరులకు భేదమెట్లులేదో అట్లనే ఈశ్వర, బ్రహ్మములకును జీవబ్రహ్మములకును భేదములేదు. కాన శాంతమై, అఖండమై, పరిపూర్ణమైన బ్రహ్మముమాత్రమే శేషించుచున్నది.

సర్వం ప్రశాన్తమజమేకమనాదిమధ్య
మాభాస్వరం స్వదనమాత్రమచేత్యచిహ్నమ్,
సర్వం ప్రశాన్తమితి శబ్దమయీ తు దృష్టి
ర్బోధార్థమేవ హి ముధైవ తదోమితీదమ్. 27

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే భేదనిరాసో నామ సప్తపఞ్చాశః
సర్గః ॥ 57 ॥

ఓ రామా! కాన జగత్తంతయును ప్రశాంతమై, జననరహితమై, ఏకమై అనాదియై, పూర్ణస్వప్రకాశస్వరూపమై, ఆనందైకరసమై, విషయచిహ్నరహితమైన బ్రహ్మమే యగును. కాని సర్వము ప్రశాంతరూపమైనదను నీతాత్కాలిక శబ్దమయ భేదదృష్టి బోధనార్థమేయగును. సాక్షాత్ప్రయోజనశూన్యత్వకారణమున అయ్యది మిథ్యయేయగుచున్నది. భాగత్యాగలక్షణములద్వారా యెఱుంగబడు అఖండార్థరూపమగు ఓంకారముయొక్క లక్ష్యార్థమైన నిత్యాపరోక్ష చిన్మాత్రస్వరూపమే సత్యమైనది. అదియే సమస్తమున్ను యగును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
భేదనిరాసమను సప్తపంచాశ
సర్గము ॥ 57 ॥

---

## అష్టపఞ్చాశః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అత్రైవోదాహరన్తీమమితిహాసం పురాతనమ్
కిరాతేశస్య సురఘోరవృత్తాన్తం విస్మయాస్పదమ్. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! శబ్దమయదృష్టి కేవలము బోధనార్థమే యగునను యివ్విషయమున కిరాతప్రభువగు సురఘుని గూర్చిన ఆశ్చర్యజనకమగు పురాతన యితిహాసము నుదాహరింతురు.

ఉత్తరస్యా దిశో మేదః కర్పూరపటలం భువః
సంభూతం వాసనం శార్వం శుక్లో వా చాన్ద్ర ఆతపః. 2

హిమాద్రేః శృఙ్గమస్తీహ కైలాసో నామ పర్వతః
శైలకుఞ్జరనిర్ముక్తకలాపస్యేవ నాయకః. 3

ఉత్తరదిక్సారమును, పృథివీవినిర్గత కర్పూరరాశి సదృశమును, ఈశ్వరుని హాస్యతుల్యమును, శుక్లపక్షచంద్రప్రకాశ సదృశమును, పర్వతశ్రేష్ఠమగు హిమాలయముచే ధరింపబడిన శిఖరపంక్తియను ముత్తెపుమాలయందు ప్రధానమణి వంటిదియునగు కైలాసమను సుప్రసిద్ధ హిమాలయ శిఖర మొకండు కలదు.

విష్ణోః క్షీరోదక ఇవ స్వర్గః సురపతేరివ
అబ్జజస్యేవ నాభ్యబ్జం గృహం యః శశిమాలినః. 4

విష్ణువునకు క్షీరసాగరమున్ను, ఇంద్రునకు స్వర్గమున్ను, బ్రహ్మదేవునకు విష్ణునాభికమలమున్ను గృహమైనట్లు, ఆ శిఖరము శంకరభగవానునకు గృహమై యొప్పుచుండెను.

రుద్రాక్షవృక్షదోలాభిః సాప్సరోభిర్విభాతి యః
లోలరత్నశలాకాభిర్లహరీభిరివార్ణవః. 5

గణాఙ్గనానామనిశం మత్తానాం చరణైర్హతాః
అశోకా ఇవ రాజన్తే యత్రాశోకా విలాసినః. 6

సంచరఞ్శంకరో దిక్షు భృగుష్విన్దుమణిద్రవైః
నివర్తన్తే ప్రవర్తన్తే యత్రాజస్రం చ నిర్ఝరాః. 7

యో లతావృక్షగుల్మౌఘవాపీహ్రదనదీనదైః
మృగైర్మృగగణైర్భూతైర్బ్రహ్మాణ్డవదివావృతః. 8

రుద్రాక్షవృక్షములందలి అప్సరసలుగన్న ఊయలలచే నయ్యది చంచలరత్నశలాకలు గల తరంగములచే సముద్రమువలె శోభించుచుండెను. మన్మథవేగముచే నుదికిన ప్రమథస్త్రీగణ చరణములచే కొట్టబడిన శోకరహితులగు విలాసులట అశోకవృక్షములచే నున్నందుచుండిరి. ఆ శిఖరముపై ఏయేదిక్కులందు శంకరభగవానుడు సంచరించునో, ఆయాదిక్కులందు చంద్రకాంతమణుల ద్రవముతో కూడిన సెలయేళ్లు నిరంతరము ప్రవహించును. తక్కిన దిశలందవి నివృత్తమగును. మఱియు నయ్యది లతావృక్షగుల్మవాపీహ్రదనదీనదమృగగణంబులచే, ప్రాణికోట్లచే బ్రహ్మాండమువలె నావృతమైయుండెను.

తస్య హేమజటా నామ కిరాతాః సంస్థితాః స్థలే
పిపీలికా వటతరోర్మూలకోశగతా ఇవ. 9

వటవృక్షమూలమునగల తొఱ్ఱయందు చీమలు వసించునట్లు, ఆ హిమాలయపర్వత మూలభాగమున హేమజటయను కిరాతుడు, వసించుచుండెను.



కైలాసపాదారణ్యానాం రుద్రాక్షైస్తరుగుల్మకైః
వసన్తి ఘూకవత్క్షుద్రాస్తే వై నికటజీవినః. 10

ఆ కైలాసపర్వతతలమునగల అరణ్యములందుండు రుద్రాక్షలచేతను ఇంధనఫలమూలాదులచేతను కిరాతులు తమజీవితము గడపుకొనుచు తత్సమీపముననే వసించుచుండిరి.

ఆసీత్తేషాముదారాత్మా రాజా పరపురంజయః
జయలక్ష్మ్యా భుజ ఇవ యః ప్రజాయాశ్చ దక్షిణః. 11

సురఘుర్నామ బలవాన్సురఘోరారిదర్పహా
అర్కః పరాక్రమ ఇవ మూర్తిమానివ మారుతః. 12

జిత్రో వై రాజ్యవిభవైర్ధనైర్గుహ్యకనాయకః
శతక్రతుగురుర్బోధైః కావ్యైరసురదేశికః. 13

స చక్రే రాజకార్యాణి నిగ్రహానుగ్రహక్రమైః
యథాప్రాప్తాన్యఖిన్నాఙ్గో దినానీవ దివాకరః. 14

ఉదారచిత్తుడును, శత్రునగరముల జయించువాడును, జయలక్ష్మీభుజసదృశుడును, ప్రజల పాలనపోషణయందు కుడిభుజమువంటివాడును సుప్రసిద్ధుడునగు సురఘు యనువాతడు ఆ కిరాతులకు రాజైయుండెను. అతడు బలశాలియు, దేవతలమాడ్కి భీకరశత్రువుల గర్వమడంచువాడును, పరాక్రమమున సూర్యసముడును, వేగమున మూర్తివంతమగు వాయువుంబోలిన వాడును, రాజ్యవిభవములందును ధనమందును కుబేరుని జయించువాడును, జ్ఞానమందు బృహస్పతిని, కావ్యసాహిత్య రచనయందు శుక్రాచార్యుని పరాజితమొనర్చువాడునునైయుండెను. గ్రహానుగ్రహక్రమములచే, ప్రాప్తించిన రాజకార్యముల నాతడఖిన్నుడై, సూర్యభగవానుడు దినక్రియ యొనర్చునట్లొనర్చుచుండెను.

తజ్జాభ్యాం సుఖదుఃఖాభ్యామథ తస్యాభ్యభూయత
స్వగతిర్వాగురాబద్ధైః శ్లిష్టాఙ్గస్యేవ పక్షిణః. 15

పిదప, నిగ్రహానుగ్రహక్రియాజనితమగు సుఖదుఃఖములచే నాతని గతి వలయందు బంధింపబడిన పక్షిగతివలె కుంఠితమయ్యెను.

కిమార్తం పీడయామ్యేనం తిలాన్యన్త్రమివౌజసా
సర్వేషామేవ భూతానాం మమేవార్తిః ప్రజాయతే. 16

ధనమస్మై ప్రయచ్ఛామి ధనే నానన్దవాఞ్ఛనః
భవత్యహమివాశేషస్తదలం మేఽతినిగ్రహైః. 17

అథవా నిగ్రహం ప్రాప్తం కరోమ్యేతేన వై వినా
వర్తతే న ప్రజైవేయం వినా వారిసరిద్యథా 18

హా కష్టమేష నిగ్రాహ్యో నిత్యానుగ్రాహ్య ఏష మే
దిష్ట్యాద్య సుఖవానస్మి కష్టమద్యాస్మి దుఃఖవాన్. 19

ఇతి లోలాయితం చేతో న విశశ్రామ భూపతేః
ఏకత్రామ్బు మహావర్తే చిరతృష్ణమివ భ్రమత్. 20

'యంత్రమందు నువ్వులవలె, దుఃఖుల నేనేల నాపరాక్రమముచే పీడితమొనర్చుచుంటిని? సర్వప్రాణులదుఃఖము నావంటిదేగదా. కాన, ఈప్రజలందఱకును ధనమొసంగెదను; దానిచే నావలె వారున్ను పూర్ణముగ ఆనందమును బొందగలరు. దండనచే నేమి ప్రయోజనమున్న లేదు. లేక, ప్రాప్తించినరీతి దండనకూడ యొనర్చెద. లేనిచో ప్రజలు వారివారి ధర్మమందు, నిర్జలనదివోలె ప్రవృత్తి లేకయుందురు హా! కష్టతరము! వధబంధనాదులచే నొకటి దండనయోగ్యమును మఱి యొకటి నిత్య మనుగ్రాహ్యమును యగుచున్నది. ప్రారబ్ధముచే నేడు సుఖినిగను, రేపు దుఃఖినిగను నగుచుంటి,' ఇవ్విధమున సంశయరూప దోలాభ్రమణముచే నారాజుచిత్తము, దాహముగొని నిద్రించినవాని చిరకాలదాహయుక్తమనంబు మహాజలయావర్తమున పరిభ్రమించునట్లు, విశ్రాంతి నొందకుండెను.

అథైకదా గృహం తస్య మాణ్డవ్యో మునిరాయయౌ
భ్రాన్తాశేషకకుప్కుఞ్జో వాసవస్యేవ నారదః. 21
తమసౌ పూజయామాస పప్రచ్ఛ చ మహామునిమ్
సందేహాదుర్ద్రిమస్తమ్భపరశుం సర్వకోవిదమ్. 22

తదనంతర మొకసమయమున దిక్కులందంతట సంచరించి మాండవ్యఋషి యారాజు చెంతకు, ఇంద్రునిగృహమునకు నారదునివలె యేతెంచెను. అత్తఱి సంశయరూప దుష్టవృక్షస్తంభమును ఛేదించుటయందు గండ్రగొడ్డలివంటివాడును, సర్వశాస్త్రకోవిదుడునునగు ఆ ఋషిని రాజు పూజించి యిట్లడిగెను.

సురఘురువాచ:—

భవదాగమనేనాస్మి మునే నిర్వృతిమాగతః
పరమాం వసుధాపీఠం సంప్రాప్త ఇవ మాధవే. 23
అద్య తిష్ఠామ్యహం నాథ ధన్యానాం ధురి ధర్మతః
వికాసి రవిణేవాబ్జం యత్త్వయాస్మ్యవలోకితః. 24
భగవన్సర్వధర్మజ్ఞ చిరం విశ్రాన్తవానసి
తదముం సంశయం ఛిన్ధి మమార్కస్తిమిరం యథా. 25

సురఘు:—దేవా! భూమిపై వసంతకాలము (లేక విష్ణుభగవానుడు) యేతెంచుటచే జనలందఱు సంతోషభరితులగునట్లు తమయాగమనముచే నేను పరమశాంతిని బొందితిని. సూర్యకిరణములచే ప్రఫుల్లితమగు కమలమువలె నేనిపుడు ధన్యాత్ములందు ధర్మదృష్టిచే ప్రథముడనై యొప్పుచున్నాను. ఏలన తాము నాపై కృపాదృష్టిని బ్రసరించితిరి. దేవా! సర్వధర్మజ్ఞా! తమకు శ్రమలేకున్న ఈ నాసంశయమును, సూర్యుడంధకారము నడంచునట్లు విచ్ఛిన్న మొనర్పుము.

మహతాం సంగమేనార్తిః కస్య నామ న నశ్యతి
సందేహం తు పరామార్తిమాహురార్తివిదో జనాః. 26



మన్నిగ్రహానుగ్రహజా మద్భృత్యవపుషి స్థితాః
కషన్తి మామలం చిన్తా గజం హరినఖా ఇవ. 27
తద్యథా సమతోదేతి సూర్యాంశురివ సర్వదా
మతౌ మమ మునే నాన్యా తథా కరుణయా కురు. 28

దేవా! మహాత్ముల సంసర్గముచే యెవని దుఃఖముపశమింపదు; మఱియు దుఃఖతత్త్వమెఱింగినవారు సంశయమే మహాదుఃఖమని వచించిరి. శత్రుమిత్రాదులయెడ నొనర్చు దండనానుగ్రహములచే జనించిన చింతలే, సింహమేనుగను బాధించునట్లు నన్ను బాధించుచున్నవి. కాన నో మునీంద్రా! విషమదృష్టిగాక సూర్యకిరణముల భంగి సదా సమదృష్టియే నాబుద్ధియందయించురీతి యనుగ్రహింపుము.

మాణ్డవ్య ఉవాచ.—

స్వయత్నేన స్వసంసేన స్వేనోపాయేన భూపతే
ఏషా మనఃపేలవతా హిమవత్ప్రవిలీయతే. 29

మాండవ్యుడు:-ఓరాజా! వైరాగ్యత్యాగాది స్వప్రయత్నములచేతను, ఆత్మజ్ఞానపర్యంతము శ్రవణమననాది యుపాయముల ననుకరించుటచేతను మనస్సుయొక్క అల్పత్వము, ఆతపముచే హిమమువలె నశించును.

స్వవిచారణయైవాశు శామ్యత్యన్తర్మనోజ్వరః
శరదాగమమాత్రేణ మిహికా మహతీ యథా. 30

శరత్కాలాగమనమాత్రముచే గొప్పమేఘపటలమంతయు శమించునట్లు, మనస్సంతాపము స్వవిచారముచేతనే శీఘ్రముపశమించును.

స్వేనైవ మనసా స్వాని స్వశరీరగతాని చ
విచారయేన్ద్రియాణ్యన్తః కీదృశాన్యథ కాని చ. 31

ఓరాజా! నీవు నీ పుత్రస్త్రీధనాదుల గూర్చియు, స్వాంతర్గతములగు ఇంద్రియములఁ గూర్చియు, తదితర బుద్ధ్యాదులఁగూర్చియు - ఇవి యేవి? ఏవిధముననున్నవి? - అని స్వమనంబుచేతనే విచారణగావింపుము.

కోఽహం కథమిదం కింవా కథం మరణజన్మనీ
విచారయాన్తరేవం త్వం మహత్తామలమేష్యసి. 32

మఱియు నీచిత్తమున — మనమెవరు? ఈ ప్రపంచమెట్టిది? జననమరణము లెట్లు గల్గుచున్నవి? — అనియును విచారింపుము అపుడే నీవు పూర్ణమహత్వము నొందెదవు.

విచారణా పరిజ్ఞాత స్వభావస్య సతస్తవ
హర్షామర్షదశాశ్చేతస్తోలయిష్యన్తి నాచలమ్. 33

విచారణచే యెపుడు నీవు నీ సత్స్వభావము నెఱుంగుదువో, అపుడిక సుఖదుఃఖాది దశలు, పర్వతమువలె నిశ్చలమగు నీ చిత్తమును దోలాయితమొనర్పజాలవు.

మనః స్వరూపముత్సృజ్య శమమేష్యతి విజ్వరమ్
భూతపూర్వవపుర్భూత్వా తరఙ్గః పయసీవ తే. 34

అత్తఱి నీ మనస్సు తన పూర్వస్వరూపమును విడచి, దుఃఖరహితమగు పూర్వసిద్ధ బ్రహ్మస్వరూపమునొంది, జలమందు తరంగమువలె శమనమొందును.

తిష్ఠదేవ మనోరూపం పరిత్యక్ష్యతి తేఽనఘ
కలఙ్కవికలం కాలం మన్వన్తరగతావివ. 35

పాపరహితుఁడవగు నోరాజా! పూర్వమన్వంతరమున కలికాలము ప్రాప్తించినపుడు పాపములచే కళంకితమగు నీ ప్రపంచము మఱల యింకొక మన్వంతరము రాగా కళంకయుక్తమగు తనపూర్వస్వరూపమును త్యజించునట్లు, నీ మనస్సున్ను జీవన్ముక్తవ్యవహారసమర్థ మగుటతోడనే తన పూర్వమలినరూపమును త్యజించును.

అనుకమ్ప్యా భవిష్యన్తి శ్రీమన్తః సర్వ ఏవ తే
దృష్టతత్త్వస్య తుష్టస్య జనాః పితురివావనౌ. 36

మఱియు నీవెపుడాత్మతత్వమును సందర్శించెదవో అపుడు సర్వైశ్వర్యయుతులగు బ్రహ్మాదులున్ను, లోకమున సంతుష్టిగల్గి పాలనయొనర్చుతండ్రియెడ వానిప్రజలవలె, నీ కృపాపాత్రులగుదురు.

వివేకదీప దృష్టాత్మా మేర్వబ్ధినభసామపి
అథో కరిష్యసి నృప మహత్తాముత్తమార్థదామ్. 37

వివేకజనిత జ్ఞానదీపముచే నీవెపుడాత్మ నవలోకించెదవో, అపుడు సుమేరు, సముద్ర, ఆకాశాది మహత్తర పదార్థములకున్ను మిగుల యర్థదాయకమగు మహత్వమును యొసంగువాడవగుదువు. ఏలన, వాని మహత్తంతయు నీయాత్మసత్తాధీనమైయే యున్నది గదా.

మహత్తామాగతే చేతస్తవ సంసారవృత్తిషు
న నిమజ్జతి హే సాధో గోష్పదేష్వివ వారణః. 38

సాధువగు నోరాజా! గోష్పాదజలమున యేనుగ మునుంగనట్లు, ఆత్మజ్ఞానముచే మహత్వము నొందినమీదట, నీచిత్తమిక సాంసారిక వృత్తులందు మునుంగకుండును.

కృపణం తు మనో రాజన్నేలవేఽపి నిమజ్జతి
కార్యే గోష్పదతోయేఽపి జీర్ణాఙ్గో మశకో యథా. 39

గోష్పాదజలమునకైన శిథిలాంగములుగల మశకము మునుంగునట్లు, కామాదుల కృపణత్వముచే దూషితమగు మనస్సు నీచకార్యములందు నిమగ్నమగును.

చేతో వాసనయా పఙ్కే కీటవత్పరిమజ్జసి
దృశ్యమాత్రావలమ్బిన్యా స్వయా దీనతయా తయా. 40

చిత్తము వాసనలచేతను, దృశ్యమాత్రావలంబన మొనర్చు తన దీనత్వముచేతను, కీటమువలె దృశ్యపంకమున మునుంగుచున్నది.



తావత్తావన్మహాబాహో స్వయం సంత్యజ్యతేఽఖిలమ్
యావద్యావత్పరాలోకః పరమాత్మైవ శిష్యతే. 41

మహాబాహుఁడవగు నోరాజా! స్వయంజ్యోతిస్వరూపమగు ఆత్మమాత్రానుభవము శేషింపనంతవఱకు అంతయును త్యజింపవలసినదే.

తావత్ప్రవిఘ్ల్యతే ధాతుర్యావద్ధేమైవ శిష్యతే
తావదాలోక్యతే సర్వం యావదాత్మైవ లభ్యతే. 42

సువర్ణమాత్రము శేషించునంతవఱకు సువర్ణగని పరిశోధింపబడునట్లు ఆత్మలాభమగునంతవఱకు అధ్యాత్మశాస్త్రములన్నియు విచారింపబడును.

సర్వః సార్వికయా బుద్ధ్యా సర్వం సర్వత్ర సర్వదా
సర్వథా సంపరిత్యజ్య స్వాత్మనాత్మోపలభ్యతే. 43

వస్తురూపబుద్ధిచే సర్వదా యెల్లెడల దృశ్యమంతటిని పరిత్యజించినచో తన యాత్మచేతనే పూర్ణాత్మలాభము చేకూరును. కాని ఏదోయొకచోట కొన్నివిషయములను మాత్రము త్యజించుటచే ఆత్మలాభ మెన్నటికిని చేకూరదు.

యావత్సర్వం న సంత్యక్తం తావదాత్మా న లభ్యతే
సర్వావస్థాపరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే. 44

సమస్త పదార్థములు త్యజింపబడనంతవఱకు ఆత్మప్రాప్తి కలుగదు. సర్వావస్థలు బరిత్యజించుటచే శేషించునదే ఆత్మయనఁబడును.

యావదన్యన్న సంత్యక్తం తావత్సామాన్యమేవ హి
వస్తు నాసాద్యతే సాధో స్వాత్మలాభే తు కా కథా. 45

అన్యవస్తువు త్యజింపబడనంతవఱకు సామాన్యవస్తువే లభింపనపుడు యిక ఆత్మలాభమును గూర్చి వేఱుగ చెప్పవలెనా? (సర్వత్యాగములేక ఆత్మలాభము కలుగదనుట.)

యత్ర సర్వాత్మనైవాత్మ లాభాయ యతతి స్వయమ్
త్యక్త్వాన్యకార్యం ప్రాప్నోతి తన్నామ నృప నేతరత్. 46

ఓ రాజా! అన్యకార్యముల బరిత్యజించి సర్వప్రయత్నములచే ఆత్మలాభమును గూర్చియే స్వయముగ యత్నించునపుడు, మనుజుడద్దానినే పొందునుగాని తదితరమునుగాదు

స్వాత్మావలోకనార్థం తు తస్మాత్సర్వం పరిత్యజేత్
సర్వం కించిత్పరిత్యజ్య యద్దృష్టం తత్పరం పదమ్. 47

ఇక్కారణమున స్వాత్మావలోకనమునకై సమస్తమును పరిత్యజింపవలెను. సర్వమును త్యజించిన పిదప యిక త్యజించుటకేది సర్వథా యశక్యమగునో అదియే పరమపదము.

సకలకారణకార్యపరమ్పరా
మయజగద్గతవస్తు విజృమ్భితమ్,

అలమపాస్య మనః స్వవపుస్తతః
పరివిలాప్య యదేతి తదేతి తత్. 48

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే సురఘువృత్తాన్తే మాణ్డవ్యోపదేశో
నామాష్టపఞ్చాశః సర్గః ॥ 58 ॥.

కార్యకారణ పరంపరామయమగు ఈ జగత్తునందంతటు, మణులందు గ్రుచ్చబడిన దారమువలెనున్న సన్మాత్రాత్మయందు, స్వకల్పనచే సత్తునకు భిన్నముగ కల్పింపబడిన దృశ్యమంతను పూర్ణముగ త్యజించివైచి, అనంత మూలాజ్ఞాననాశముచే, తన మనోరూపమునుకూడ లయమొనర్చి మనస్సు సచ్చిద్రూపమును పొందుచున్నది. అదియే ఏకరస పరబ్రహ్మమగును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సురఘువృత్తాంతమున మాండవ్యోపదేశమను అష్టపంచాశ
సర్గము ॥ 53 ॥

---

## ఏకోనషష్టితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్త్వా భగవానేనం సురఘుం రఘునన్దన
యయౌ స్వమేవ రుచిరం మాణ్డవ్యో, మానమణ్డలమ్ 1

శ్రీవసిష్ఠుడు;—ఓ రాఘవా! రాజుతో నిట్లు బల్కి భగవంతుడగు మాండవ్యమహాముని యంత మునుల నివాసభూతమగు అతిసుందరమైన తన ఆశ్రమమునకుఁజనెను.

గతే వరమునౌ రాజా గత్వైకాన్తమనిన్దితమ్
ధియా సంచిన్తయామాస కో నామాహామితి స్వయమ్. 2

ముని వెడలిన పిదప యారాజు ఉత్తమమగు యేకాన్తస్థలమునకుఁ బోయి స్వబుద్ధిచే 'నేనెవడన'ని విచారించెను.

నాహం మేరుర్న మే మేరుర్జగన్నాహం న మే జగత్
నాహం శైలా న మే శైలా ధరా నాహం న మే ధరా. 3
కిరాతమణ్డలం నేదం మమ నాహం చ మణ్డలమ్
నిజసంకేతమాత్రేణ కేవలం దేశ ఏవ మే. 4

నేను మేరువు కాను, మేరువు నాదికాదు. నేను జగత్తుకాను, జగత్తు నాదికాదు. నేను పర్వతములుకాను, పర్వతములు నావికావు; నేను పృథివికాను, పృథివి నాదికాదు; నేను కిరాతమండలముకాను, కిరాతమండలము నాదికాదు; సర్వజన సమ్మతిచే రాజ్యాభిషేకమగుట బట్టి యే నేను నేసల మీ దేశమునకు రాజైతిని;. కాన కల్పనామాత్రముననే ఇది నాదేశమగును.



త్యక్తో మయైష సంకేతో నాహం దేశో న చైష మే
ఇదానీం నగరం శిష్టమేష ఏవాత్ర నిశ్చయః. 5
పతాకావనపజ్క్త్యాఢ్యా భృత్యోపవనసంకులా
గజాశ్వసామన్తయుతా పురీ నాహం న మే పురీ. 6
వ్యర్థసంకేతసంబన్ధం సంకేతవిగమే క్షతమ్
భోగవృన్దం కలత్రం చ నాహం నైతన్మమాఖిలమ్. 7
ఏవం సభృత్యం సబలం సవాహనపురాన్తరమ్
నాహం రాజ్యం న మే రాజ్యం సంకేతో హ్యయమాకులః. 8

రాజను సంకేతమును త్యజించినచో, యిక నేనీదేశమును కాను, ఈదేశము నాది కాదు. కాని యికను ఈనగరము శేషించియున్నది. కాన దీనియందును సంకేతమును త్యజించి అట్టి నిశ్చయమునే పొందెదను. పతాక వనవాటికలచే పూర్ణమై, అనేక భృత్యులతోను, ఉపవనములతోను పరివ్యాప్తమై, గజాశ్వసామంత సంయుతమైనట్టి ఈనగరము నేనుకాను, నా కద్దానితో సంబంధమునులేదు. సంకేతత్యాగముచే, వ్యర్థముగ కల్పింపబడిన సంకేతసంబధమిపుడు నశించినది. కాన రాజ్య, నగరములు నేనుకాను, అవి నావిన్ని కావు. అట్లనే భోగజాలమున్ను, కుటుంబమున్ను నేను కాను, అవన్నియు నావిని కావు. ఇవ్విధమున, భృత్య, సేనా, వాహన పురసహితమగు ఈ రాజ్యము నేను కాను, అది నాదియుఁగాదు. ఏలన యీ సంబంధము కేవల మంధపరంపరచే కల్పింపబడినది.

దేహమాత్రమహం మన్యే హస్తపాదాదిసంయుతమ్
తదిదం తావదాశ్వన్తరలమాలోకయామ్యహమ్. 9

ఇక హస్తపాదాది సహితమగు ఈ దేహము నేనని యెంచబడుచున్నది. కాన శీఘ్రముగ యిప్పుడాభ్యంతరమును గూర్చియు విచారణసల్పెద.

తదత్ర తావన్మాంసాస్థి నాహమేతదచేతనమ్
న చైతన్మమ సంశ్లేషమేత్యబ్జస్య యథా జలమ్. 10
మాంసం జడం న తదహం నైవాహం రక్తమప్యలమ్
జడాన్యస్థీని నైవాహం న చైతాని మమ క్వచిత్. 11
కర్మేన్ద్రియాణి నైవాహం నచ కర్మేన్ద్రియాణి మే
జడం యత్కిల దేహేఽస్మింస్తదహం నైవ చేతనః. 12
నాహం భోగా న మే భోగా న మే బుద్ధీన్ద్రియాణి చ
జడాన్యసత్స్వరూపాణి న చ బుద్ధీన్ద్రియాణ్యహమ్. 13

ఈ శరీరమందు జడములైన మాంసము, ఎముకలు నేనుకాను. మఱియు కమలజలములకువలె జడమగు ఈశరీరమునకు చైతన్యమగు నాకును సంబంధమే కలుగదు. జడములగు రక్తమాంసాస్థులు నేను కాను. అవియెన్నటికిన్ని నావి కావు. కర్మేంద్రియములు నేనుకాను, అవి నావిని

కావు. ఏలన, ఈశరీరమున జడమైనది చైతన్యమగు నేనెట్లగుదును? నేను భోగములకాను, భోగములు నావిన్నికావు. జడములై మిథ్యారూపములైన బుద్ధీంద్రియములు నేను కాను, అవి నావిన్నికావు.

మూలం సంసృతిదోషస్య మనో నాహం జడం హి తత్
అథ బుద్ధిరహంకార ఇతి దృష్టిర్మనోమయీ. 14

సాంసారిక దోషములకు మూలమైనట్టి మనస్సున్ను నేను కాను. ఏలన, అది జడమైనది. బుద్ధ్యహంకారములున్ను నేనుకాను. ఏలన, అవి మనోమయమగు అంతఃకరణముయొక్క భేదరూపములే యగును.

మనో బుద్ధీన్ద్రియాద్యన్తో భూతకోశశ్చలద్వపుః
నాహమేవం శరీరాది శిష్టమాలోకయామ్యహమ్. 15

ఇట్లు దేహము మొదలుకొని మనోబుద్ధీంద్రియాదుల వఱకు గల యేవియు నేను కానని నిశ్చయింపబడినది. ఇక మిగిలినదానిని గూర్చి విచారించెద.

శేషస్తు చేతనో జీవః స చేచ్చేత్యేన చేతతి
అన్యేన బోధ్యమానోఽసౌ నాత్మతత్త్వవపుర్భవేత్. 16

మిగిలినది ప్రమేయముతో కూడి వ్యవహరించు చేతనమగు ప్రమాత (జీవుడు). త్రిపుటీసాక్షియను మఱొకదానిచే యెఱుంగబడుటచే ఈ ప్రమాత ఆత్మతత్త్వముయొక్క యథార్థ స్వరూపము కానేరదు.

ఏవం త్యజామి సంవేద్యం చేత్యం నాహం హి తత్కిల
శేషో వికల్పరహితో విశుద్ధచిదహం స్థితః. 17

ఇట్లు సాక్షిచే నెఱుంగదగు ప్రమాత ప్రమేయముల నేను త్యజించుచున్నాను. ఏలన అవి నేనుకాను. శేషించిన వికల్పరహితమగు విశుద్ధసాక్షిచైతన్యమే నేను. ఇది నిక్కము.

చిత్రమేషోఽస్మి లబ్ధాత్మా జాతః కాలేన కార్యవాన్
ఏష సోఽహమనన్తాత్మా నాన్తోఽస్య పరమాత్మనః. 18

ఆహా! ఎట్టి యాశ్చర్యము! చిరకాలమునుండి నేనాత్మను పొందియున్నను నేడు మాత్రమే పరమపురుషార్థలాభయుతుఁడనైతి. ఈ నేననంతరూపుఁడగు ఆత్మ నేనైయున్నాను. ఈ పరమాత్మ కంతమే లేదు.

బ్రహ్మణీన్ద్రే యమే వాయో సర్వభూతగణే తథా
స ఏష భగవానాత్మా తన్తుర్ముక్తాస్వివ స్థితః. 19

బ్రహ్మదేవునియందు, ఇంద్రునియందు, యమునియందు, వాయువునందు, సర్వభూతగణంబులందును భగవంతుఁడగు ఈ యాత్మ, ముత్తెపుమాలయందు దారమువలె యనుగతమై యున్నాడు.



చిచ్ఛక్తిరమలా సైషా చేత్యామయవివర్జితా
భరితాశేషదిక్కుఞ్జా భైరవాకారధారిణీ. 20
సర్వభావగతా సూక్ష్మా భావాభావవివర్జితా
ఆబ్రహ్మభువనాన్తఃస్థా సర్వశక్తిసముద్గికా 21
సర్వసౌన్దర్యసుభగా సర్వప్రాకాశ్యదీపికా
సర్వసంసారముక్తానాం తన్తురాతతరూపిణీ 22
సర్వాకారవికారాఢ్యా సర్వాకారవివర్జితా
సర్వభూతౌఘతాం యాతా సర్వదా సర్వతాం గతా. 23
చతుర్దశ విధాన్యేషా భూతాని భువనోదరే
ఏతన్మయీయం కలనా జాగతీ వేదనాత్మికా. 24

ఈ చిత్-శక్తి నిర్మలమును, విషయరోగ వివర్జితమును, సర్వదిశల పూర్ణమైనట్టిదియు, అజ్ఞానులయెడ భయంకరాకృతిని దాల్చునదియు, సర్వపదార్థములందు వ్యాపించినదియు, సూక్ష్మమును, ఉత్పత్తినాశరహితమును, పాతాళమునుండి బ్రహ్మలోకమువఱకుఁగల సమస్త భువనములందును స్థితిగల్గియున్నదియు, సర్వశక్తినిలయమును, నిరతిశయానంద ప్రపూర్ణమును, ప్రకాశింపజేయు వస్తువులనన్నిటినిగూడ ప్రకాశింపజేయునదియు, సర్వ బ్రహ్మాండములను ముత్యపుమాలయందలి విశాలమగు సూత్రమునునైయున్నది. మఱియు సర్వాకార వికారయుక్తమై, సర్వాకార వివర్జితమై భూతకోట్లన్నింటి రూపముఁజెంది, సదా సర్వరూపత్వము గల్గియున్నది. పదునాల్గు లోకములందలి పదునాల్గు విధములగు జీవరాసులన్నింటినిది తన యుదరమున ధరించుచున్నది. మఱియు ఈ జగత్తుయొక్క అనుభవరూప కల్పన దీని యొక్క స్వరూపమే.

మిథ్యావభాసమాత్రం తు సుఖదుఃఖదశాగతిః
నానాకారమయాభాసః సర్వమాత్మైవ చిత్పరా. 25

సుఖదుఃఖమయ దశలన్నియు మిథ్యారూపములే. పలువిధయాకారములచే ఆభాసమానమగు ఈ ఆత్మయే సమస్తమున్నయగును. ఇదియే పరాచైతన్యము.

సోఽయమాత్మా మమ వ్యాపీ సేయం యదవబోధనమ్
సేయమాకలితాజ్ఞాభా కరోతి నృపవిభ్రమమ్. 26

అట్టి చైతన్యరూపమేయగు నా యాత్మ, జగత్తంతటను వ్యాపించియున్నది. అదియే నా బుద్ధికి సాక్షియై వెలుంగుచున్నది. ద్రష్టృదృశ్యభేదములచే కల్పితమగు రూపము ధరించిన ఈ చైతన్యమే 'నేను రాజున'నను భ్రమగల్గించుచున్నది.

అస్యా ఏవ ప్రసాదేన మనో దేహరథే స్థితమ్
సంసారజాలలీలాసు యాతి వల్గతి నృత్యతి. 27

ఈ చైతన్యప్రభావముచేతనే మనస్సు దేహమను రథమున గూర్చుండి సంసారజాలలీలలందు జనుచు, వ్యవహరించుచు, నాట్యమునల్పుచు నున్నది.

ఇదం మనఃశరీరాది న కించి దపివస్తుతః
నష్టే న కించిదప్యస్మిన్పరినశ్యతి పేలవే. 28

యథార్థముగ ఈ మనోదేహాదు లేవియును లేవు. మఱియు తుచ్ఛమగు యీ శరీరాదులు నశింప, ఆత్మ రేణుమాత్రమును నశించుటలేదు.

జగజ్జాలమయం నృత్తమిదం చిత్తనటైస్తతమ్
ఏతస్మై నైకయా బుద్ధ్యా దృశ్యతే దీపలేఖయా. 29

ఈ జగజ్జాల నాటకమును చిత్తరూప నటులే యొనర్చిరి. మఱియు నీ చైతన్యము సాక్షిరూపమగు బుద్ధి యొకదాని చేతనే, దీపప్రకాశముచేవలె స్పష్టముగ గన్పట్టును.

కష్టం ముధైవ మే చిన్తా నిగ్రహానుగ్రహస్థితౌ
బభూవ దేహనిష్ఠేహ న కించిదపి దేహకమ్. 30

అహో! కష్టతరము! నిగ్రహానుగ్రహస్థితులందు దేహబుద్ధి నాకు వ్యర్థముగ కలిగినది. యథార్థముగ దేహమేమియు లేదుకదా!

అహో త్వహం ప్రబుద్ధోఽస్మి గతం దుర్దర్శనం మమ
దృష్టంద్రష్టవ్యమఖిలం ప్రాప్తం ప్రాప్యమిదం మయా. 31

అహో! ఇపుడు నేను జ్ఞానవంతుడనైతి. నాదుర్దృష్టి (శరీరాదులం దాత్మదృష్టి) తొలగినది. చూడదగిన దంతయు నే జూచితిని. పొందదగిన దంతయు పొందితిని.

సర్వం కిచిదిదం దృశ్యం దృశ్యతే యజ్జగద్గతమ్
చిన్నిష్పన్దాంశమాత్రాంశాన్నాన్యత్కించన శాశ్వతమ్. 32

ఈ కాన్పించునట్టి జగద్గతమగు దృశ్యపదార్థమంతయు చిత్తునుండి మాయచే సంభవించినదే కాని యిందన్యమగు శాశ్వతవస్తు వెద్దియును లేదు.

క్వ తౌ కీదృగ్విధౌ వాపి కింనిష్ఠౌ వా కిమాత్మకౌ
నిగ్రహానుగ్రహౌ లోకే హర్షామర్ష క్రమౌ తథా. 33

ఆ నిగ్రహానుగ్రహములురెండు యిపుడెటనున్నవి? యెట్లున్నవి? ఏరూపమున నున్నవి? వానిచేగల్గు హర్షామర్షము లెయ్యవి? (శరీరాదులు మిథ్యయగుటచే యవన్నియు నిరాశ్రయములనియే సిద్ధించినది).

కిం సుఖం కిం ను వా దుఃఖం సర్వం బ్రహ్మేదమాతతమ్
అహమాసం ముధా మూఢో దిష్ట్యా మూఢోఽస్మ్యహం స్థితః. 34

సుఖదుఃఖము లేమి? ఇదంతయు వ్యాపకబ్రహ్మమేయగును. నేను వ్యర్థముగ మూఢుడనై యుంటి. ఇపుడు సౌభాగ్యవశమున జ్ఞానవంతుడనైతి.

కిమస్మిన్నేవమాలోకే శోచ్యతే కిం విముహ్యతే
కిం ప్రేక్ష్యతే కిం క్రియతే స్థీయతే వాథ గమ్యతే. 35



ఆనందస్వరూపమును పరిపూర్ణమునగు ఈ ఆత్మయొక్క అనుభవము కలిగినమీదట యిక దేనికై శోకింపవలెను? దేనికై విమోహితుడవవలెను? దేనిని చూడవలెను? ఏమి చేయవలెను? ఎచటికేగవలెను?

కిం చిదేవమిదం నామ చిదాకాశం విరాజతే
నమో నమస్తే నిస్తత్త్వ దిష్ట్యా దృష్టోఽసి సున్దర. 36

అలౌకిక చమత్కారమగు చిదాకాశ మొకటియే విద్యమానమైయున్నది. భౌతికత్వరహితుడవగు నోపరమాత్మా! నీకు నమస్కారము. మహద్భాగ్యంబున నీ విపుడు గన్పట్టితివి.

అహో ను సంప్రబుద్ధోఽస్మి సమ్యగ్జ్ఞాతమలం మయా
నమో మహ్యమనన్తాయ సమ్యగ్జ్ఞానోదయాయ చ. 37

అహో! నేను ప్రబుద్ధుడనైతి. సర్వము లెస్సగ నెఱింగితి. ఇట్లు సమ్యక్-జ్ఞానముదయించిన అనంతరూపమగు నాయాత్మకు నమస్కారము.

విగతరఞ్జన నిర్విషయస్థితి
ర్గతభవభ్రమరఞ్జితవర్జితే,
స్థిరసుషుప్తకలాభిగతిస్తతః
సమసమం నివసామ్యహమాత్మని. 38

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే సురఘువిశ్రాన్తిర్నామైకోనషష్టితమః
సర్గః ॥ 59 ॥

రాగద్వేషాభావముచే జాగ్రత్స్వప్నసుషుప్తవిషయ స్థితి నశించినవాడను, స్థిరసుషుప్తికళను అనగా ఉపాధినాశముచే బ్రహ్మమం దేకీభావమును పొందినవాడనునగు నేను, సంసారభ్రమరహితమును, రాగద్వేష వివర్జితమును, సాక్షిభూతమును ఆత్మస్వరూపమునగు బ్రహ్మమున సర్వథా భేదరహితమై సమరూపమున వసించుచున్నాను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సురఘువిశ్రాంతి యను ఏకోన షష్టితమ
సర్గము ॥ 59 ॥

---

## షష్టితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఇతి హేమజటాధీశో లేభే పదమనుత్తమమ్
వివేకాధ్యవసాయేన బ్రాహ్మణ్యమివ గాధిజః. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామచంద్రా! విశ్వామిత్రుడు బ్రాహ్మణత్వము నొందినట్లు, ఇట్లు వివేకముఁగూర్చిన నిశ్చయముచే హేమజటుఁడను కిరాతప్రభువు పరమోత్తమ (బ్రహ్మ)పదమును, బొందగల్గెను.

అనర్థాకారకార్యాసు నాసీచ్చేష్టాసు ఖేదవాన్
భూయో భూయః ప్రయుక్తాసు దినమాలాస్వివేశ్వరః. 2

మఱల మఱల యనుష్ఠింపబడిన ధర్మార్థప్రాప్త్యుపాయక్రియలందు, దైవగతిచే సంప్రాప్తమైన అనర్థకారకములును, దుఃఖప్రదములునైన క్రియలందు దినక్రియలందు సూర్యునివలె ఆ సురఘు ఖేదము నొందకుండెను.

తతః ప్రభృతి సోఽతిష్ఠత్సర్వదా విగతజ్వరః
సమాసమే స్వకే కార్యే జలౌఘాగ్ర ఇవాచలః. 3

అప్పటినుండి నిగ్రహానుగ్రహరూపములగు తనరాజ్యోచితకార్యములందు, జలప్రవాహమున కెదుటనున్న పర్వతమువలె అచంచలుడై సదా దుఃఖరహితుడై యుండెను.

హర్షామర్షవినిర్ముక్తః ప్రత్యహం కార్యమాహరన్
ఉదారగమ్భీరవపుర్జహారామ్బునిధేః శ్రియమ్. 4

హర్షామర్ష వివర్జితుఁడై దైనికవ్యవహారముల సల్పుచు నా యుదార గంభీరదేహుడు సముద్రముయొక్క శోభనుగూడ నిర్జించెను.

సుషుప్తపదధర్మిణ్యా చిత్తవృత్త్యా వ్యరాజత
నిష్కమ్పయా ప్రకాశిన్యా దీపః స్వశిఖయేవ సః. 5

సుషుప్తివలె నిశ్చలమును, చైతన్యముచే ప్రకాశవంతమునునగు చిత్తవృత్తిచే, నిశ్చల ప్రకాశముగల అగ్నిశిఖచే దీపమువలె యాతడు శోభించుచుండె.

న నిర్ఘృణో దయావాన్నో న ద్వన్ద్వీ నాథ మత్సరీ
న సుధీర్నాసుధీర్నార్థీ నానర్థీ స బభూవ హ. 6

అతడు నిర్దయుడుగాని దయావంతుడుగాని, ద్వంద్వయుతుడుగాని మత్సరుడుగాని, అతి బుద్ధిమంతుడుగాని అర్థిగాని, అనర్థిగాని గాకయుండి యథారీతి ప్రాప్తించిన కార్యములాచరించుచు సమదర్శియై యొప్పుచుండె.

సమదర్శనయా నిత్యం వృత్త్యా చాపలధీరయా
అన్తఃశీతలయా రేజే పరిపూర్ణార్ణవేన్దువత్. 7

సమదర్శనశీలమును, చపలతారహితమును, ధీరమును, అంతఃకరణమున నిత్యశీతల స్వభావయుక్తమునగు చిత్తవృత్తిచే పూర్ణసముద్ర, చంద్రులవలె యాతడు శోభించుచుండెను.

సర్వం చిత్తత్త్వకలనం జగదిత్యవలోక్య సః.
ప్రశాన్తసుఖదుఃఖశ్రీస్తస్య పూర్ణా మతిర్బభౌ. 8



ఈ జగత్తంతయు చిత్తముయొక్క కల్పనామాత్రమే యని నిశ్చయించిన వానియొక్క పూర్ణబుద్ధి భౌతిక సుఖదుఃఖములు లేనిదై యుండెను.

ఉల్లసన్వికసన్పూర్ణ స్తిష్ఠన్గచ్ఛన్విశన్స్వపన్
అభూత్సమసమాధిస్థః ప్రబుద్ధశ్చిల్లయం గతః. 9

శరీరముచే నుల్లాసమొందుచు, చిత్తముచే వికాసము నొందుచు, పూర్ణుడై, కూర్చున్నను, నడచుచున్నను, చలించుచున్నను, నిదురించుచున్నను చైతన్యమున లయమొందియేయుండు ప్రబుద్ధుడే నిరంతర సమాధిస్థుడగును.

స కుర్వన్విగతాసఙ్గం రాజ్యం రాజీవలోచనః
అతిష్ఠదత్సఖాకారో భూరివర్షశతాన్యథ. 10

కమలనేత్రుఁడగు నారాజు ఆసక్తిరహితుడై రాజ్యపాలనము చేయుచు అఖండాకారయుతుడై పెక్కు వర్షశతంబు లట్లనే రాజ్యము సల్పె.

సంనివేశమిమం దేహనామకం తదను స్వయమ్
స జహౌ తేజసాక్రాన్తో రూపం హిమకణో యథా. 11

అపిదప సూర్యకిరణసంయోగముచే మంచుబిందువు తన యాకృతిని వీడునట్లు యారాజు తన పాంచభౌతిక శరీరమును త్యజించెను.

వివేశ పరమాద్యన్త కారణం కారణేశ్వరమ్
ప్రజ్ఞయా సరితాం వారిపరిపూర్ణమివామ్బుధిమ్. 12

అపుడాతడు, నదీజలము పూర్ణసముద్రమున గలయునట్లు సాక్షిరూపమున సకల బ్రహ్మాండముల యుత్పత్తి లయములకు కారణభూతమును, బ్రహ్మాదులకుగూడ నియంతయునగు పరబ్రహ్మమున బ్రవేశించెను.

అధిగత విమలైకరూపతేజా
విజనదశాం సముపేత్య శాన్తశోకః,
అలమభవదసౌ పరస్వరూపం
ఘటఖమివామ్బరసంయుతం మహాత్మా. 13

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే సురఘువృత్తాన్తే సురఘునిర్వాణం నామ
షష్టితమః సర్గః ॥ 60 ॥

మహాత్ముడగు యా సురఘు స్వబుద్ధిచే, నిర్మలమును, దుఃఖరహితమును, ఆనందపరిపూర్ణమును నగు ఆత్మను పొంది, దానిచే జన్మాదిదశలను వీడి, ఘటము నశింప ఘటాకాశము మహాకాశమున గలయునట్లు, పూర్ణముగ పరబ్రహ్మస్వరూపుఁడయ్యెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సురఘువృత్తాంతమున సురఘునిర్వాణమను షష్టితమ
సర్గము ॥ 60 ॥

---

## ఏకషష్టితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవముత్పలపత్రాక్ష రాఘవాఘవిపర్యయే
పదమాసాదయాద్వన్ద్వం విశోకో భవ భూతయే. 1

శ్రీ వసిష్ఠుడు:—కమలనేత్రుఁడవగు నో రామా! హర్షశోకాదులకు కారణమగు పాపమునశింప, ద్వంద్వరహితమును, పరమశ్రేయోదాయకమునగు మోక్షపదమునొంది దుఃఖరహితుఁడవుగమ్ము.

ఏతాం దృష్టిమవష్టభ్య న మనః పరితప్యతే
ఘోరే తమసి నిర్మగ్నం లబ్ధదీపం శిశుర్యథా. 2

సురఘుని యీ జ్ఞానదృష్టి నవలంబించుటచే దీపమును పొందిన బాలునివలె, ఘోరమగు అజ్ఞానాంధకారమున మనస్సు గూలకుండును.

వివేకావస్థయా చేతస్తథైవాయాతి నిర్వృతిమ్
పతచ్ఛ్వభ్రే దృఢతృణప్రచయాలమ్బనాదివ. 3

గోతియందు పడినవాడు ఒడ్డునగల తృణములఁ బట్టుకొనుటచే పైకెక్కఁగల్గి శాంతిని బొందునట్లు వివేకదశచే చిత్తము శాంతినొందును.

అథైతాం పావనీం దృష్టిం భావయిత్వాప్యుదాహరన్
నిత్యమేకసమాధానో భవ భూషితభూతలః. 4

ఓరామా! సురఘుని యీ పరమపవిత్ర దృష్టిని మాటిమాటికభ్యసించి, యితరులకు కూడ యద్దాని నుపదేశించుచు ప్రపంచమును విభూషితమొనర్చి నిత్యమై, యేకమైనట్టి బ్రహ్మమున సమాధితత్పరుఁడవుగమ్ము.

శ్రీరామ ఉవాచ:—

కథమేకసమాధానం కీదృశం వా మునీశ్వర
వాతాహత మయూరాజ్గరుహాలోలం మనో భవేత్. 5

శ్రీరాముడు:— ఓ మునీంద్రా! గాలిచేగొట్టబడిన నెమలిపింఛమువలె చంచలమైనట్టి మనస్సు బ్రహ్మపదమున నెట్లు యేకాగ్రనిష్ఠను బొందగలదు?



శ్రీవసిష్ఠ ఉవాచ.—

శృణు తస్యైవ సురఘోః ప్రబుద్ధస్య సతస్తదా
పర్ణాదస్య చ రాజర్షేః సంవాదమిమమద్భుతమ్. 6

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామచంద్రా! ఇవ్విషయమున జ్ఞానియగు నా సురఘునియొక్కయు పర్ణాదుడను (లేక, పరిఘుఁడను) రాజర్షియొక్కయు అద్భుతమైనట్టి సంవాదమును వినుము.

రాఘవైకసమాధాన బోధితా యోజితాత్మనోః
పరస్పరం సమాలాపమిమం ప్రకథయామి తే. 7

ఏకరూప సమాధియందు చిత్తమును సంలగ్నమొనర్చి, చిత్తేంద్రియాదుల జయించి, ప్రబుద్ధులైనట్టి ఆ యిరువురు రాజులయొక్క పరస్పరసంవాదమును నీకు వచించుచున్నాను, వినుము.

బభూవ పారసీకానాం పార్థివః పరవీరహా
పరిఘో నామ విఖ్యాతః పరిఘః స్యన్దనే యథా. 8
స బభూవ పరం మిత్రం సురఘో రఘునన్దన
నన్దనోద్యానసంస్థస్య మదనస్యేవ మాధవః. 9
కదాచిత్పరిఘస్యాభూదవర్షం మణ్డలే మహత్
కల్పాన్త ఇవ సంసారే ప్రజాదుష్కృతదోషజమ్. 10
వినేశుర్జనతాస్తత్ర బహ్వ్యః క్షుత్క్షామజీవితాః
జ్వలితే విపినే వహ్నౌ యథా భూతపరమ్పరాః. 11
తద్దుఃఖం పరిఘో దృష్ట్వా విషాదమతులం యయౌ
తత్యాజాశ్వఖిలం రాజ్యం దగ్ధం గ్రామమివాధ్వగః. 12

రథమునకు అక్షదండము(పరిఘ)వలె ప్రజలకాధారభూతుడును, శత్రువుల నశింపచేయువాడును పారసీకదేశాధిపతియునగు పరిఘుఁడను సుప్రసిద్ధుడగు రాజుండెను. నందనోద్యానముననున్న మన్మథునకు వసంతునివలె, ఆపరిఘు సురఘునకు పరమమిత్రుఁడైయుండెను. ప్రజల పాపదోషముచే లోకమున ప్రళయము సంభవించునట్లు, ఒకానొకపుడు పరిఘుని రాజ్యమండలమున అనావృష్టి సంభవించెను. ప్రళయాగ్ని ప్రజ్వలింప జీవసమూహము నశించునట్లు, దానిచే నచట యనేకులు ఆకటిబాధచే నశించిరి. రాజగు పరిఘు ప్రజల యాదుఃఖముఁగాంచి మిగుల ఖిన్నుఁడై, కాలుచున్న గ్రామమును బాటసారి వీడునట్లు, శ్రీఘ్రముగ తనరాజ్యమునంతయు విడచి జనెను.

ప్రజానాశప్రతీకారేష్వసమర్థో విరాగవాన్
జగామ విపినే కర్తుం తపోఽజినమునీంద్రవత్. 13
పౌరాణామపరిజ్ఞాతే కస్మింశ్చిద్దూరకాననే
సమువాస విరక్తాత్మా లోకాన్తర ఇవాపరే. 14

ప్రజానాశ పరికట్టుటకసమర్థుఁడై, వైరాగ్యయుతుడై, వల్కలములఁ ధరించి యారాజు మునీంద్రుల చందమున తపంబొనర్చుటకు యడవికిఁబోయెను. నగరనివాసులకు దెలియని దూరమున

నున్న యొకానొక అరణ్యమున లోకాంతరమునందువోలె, విరక్తచిత్తుఁడగు నారాజు వసించుచుండెను.

తతశ్చరఞ్ఛాన్తమతిర్ద్రాన్తకన్దరమన్దిరే
స్వయం శీర్ణాని శుష్కాణి తత్ర పర్ణాన్యభక్షయత్. 15
చిరం హుతాశవచ్ఛుష్కపర్ణాన్యేవాథ భక్షయన్
పర్ణాద ఇతి నామాఽసౌ ప్రాప మధ్యే తపస్వినామ్. 16
తతఃప్రభృతి పర్ణాదనామాఽ రాజర్షిసత్తమః
జమ్బూద్వీపే బభూవాఽసౌ విఖ్యాతో మునిసద్మసు. 17

శాంతమతియు, ఇంద్రియముల దమన మొనర్చువాడునగు యారాజు పర్వతకందరగృహమున తపంబాచరించుచు, తమంతటతాము రాలినట్టి యెండుటాకులను భక్షించుచునుండెను. చిరకాలమట్లు యగ్నివలె శుష్కపత్రంబులనే భక్షించుచు తపంబొనర్చుచుచే యాతనికి తాపసులందు పర్ణాదుఁడను నామముగలిగెను. అప్పటినుండియు, రాజర్షులందు శ్రేష్ఠుడగు యాతడు జంబూద్వీపమున మునుల యాశ్రమములందు పర్ణాదుఁడను పేరుచే ప్రసిద్ధికెక్కెను.

తతో వర్షసహస్రేణ తపసా దారుణాత్మనా
ప్రాపదభ్యాసవశతో జ్ఞానమాత్మప్రసాదజమ్. 18

పిమ్మట వేయిసంవత్సరముల తీవ్రతపముచేతను, సమాధ్యభ్యాసముచేతను చిత్తశుద్ధి, ఈశ్వరానుగ్రహము కలుగుగా, తద్ద్వారా యారాజర్షి ఆత్మజ్ఞానమును పొందెను.

బభూవ విగతద్వన్ద్వో నిరాశః శాన్తమానసః
నీరాగో నిరనుక్రోశో జీవన్ముక్తః ప్రబుద్ధధీః. 19

ఆతడు జీవన్ముక్తుడును, జ్ఞానయుక్తుడును, సద్బుద్ధియుతుడును, శీతోష్ణాది ద్వంద్వరహితుడును, ఆశావివర్జితుడును, శాంతచిత్తుడును, రాగద్వేషరహితుడును, క్రోధవర్జితుడునై యుండెను.

విజహార యథాకామం త్రిలోకీమకికామిమామ్
సిద్ధసాధ్యైః సమం సాధో సహంసాలిరివాబ్జినీమ్. 20

సాధువగు నోరామా! అంతనాతడు, కమలసరమున హంసలతోగూడి భ్రమరము సంచరించునట్లు, సిద్ధసాధ్యులతోగూడి ఈ త్రిలోకమును మతమున సంచరించెను.

ఏకదాఽతస్య సదనం హేమచూడమహీపతేః
ప్రాప రత్నవినిర్మాణం మేరోః శృఙ్గమివాపరమ్. 21

ఒకానొక సమయమున కిరాతుల ప్రభువగు సురఘుయొక్క రత్ననిర్మిత గృహమునకు మేరువుయొక్క మఱియొక శిఖరమునకువలె, పర్ణాదుఁడువచ్చిచేరెను.

తే తత్ర ప్రాక్తనే మిత్రే పూజామకురుతాం మిథః
పూర్ణౌ విజ్ఞాతవిజ్ఞేయౌ మార్జ్యగర్భాద్వినిర్గతౌ. 22



అహోఽను బత కల్యాణైః ఫలితం మమ పావనైః
సంప్రాప్తవానహం యత్త్వామిత్యన్యోన్యమథోచతుః. 23
ఆలిఙ్గితశరీరౌ తావన్యోన్యానన్దితాకృతీ
ఏకాసనే వివశతుశ్చన్ద్రార్కావివ భూధరే. 24

పూర్ణకాములును, జ్ఞేయము (బ్రహ్మము) నెఱింగినవారును, జీవన్ముక్తులునగు ఆ ప్రాచీన [illegible] పరస్పరమొకరినొకరు పూజించుకొని — 'ఆహా! పరమపవిత్రమగు సుకృతము [illegible]చేతనే మిమ్ముల గలిసికొంటిని' — అని యనుకొనిరి. మఱియు ఒకరినొకరు [illegible]గన మొనర్చుకొని ప్రసన్నాకృతిగలవారై, ఒకేపర్వతముపై చంద్రసూర్యులవలె, ఒకే [illegible]నమున నుపవిష్టులైరి.

పరిఘ ఉవాచ:—

పరమానన్దమాయాతం చేత స్త్వద్దర్శనేన మే
ఇన్దుబిమ్బ ఇవోన్మగ్నం మనః శీతలతాం గతమ్. 25
అకృత్రిమసుఖం ప్రేమ వియోగే శతశాఖతామ్
ప్రయాతి ప్రజ్వలతటేఽచ్ఛిన్నమూల ఇవ ద్రుమః. 26
విశ్రబ్ధాస్తాన్కథాలాపాంస్తా లీలాస్తచ్చ చేష్టితమ్
సంస్మృత్య ప్రాక్తనం సాధో హృష్యామి చ పునః పునః. 27
జ్ఞానమేతన్మయా ప్రాప్తం త్వయా జ్ఞాతం యథాఽనఘ
మాణ్డవ్యస్య ప్రసాదేన పరమాత్మప్రసాదజమ్. 28
అద్య కచ్చిదదుఃఖస్త్వం కచ్చిద్విశ్రాన్తవానసి
పరమే కారణే మేరావివ భూమణ్డలాధిపః. 29

పరిఘు:—మిత్రమా! నేడు మీదర్శనముచే నాచిత్తము పరమానందభరితమైనది. మఱియు చంద్రబింబమున మగ్నమైనట్లు నామనంబతిశీతలత్వముఁజెందినది. భిన్నశాఖయగు తటాకతీరస్థవృక్షమువలె, వియోగమున సహజప్రేమ శతశాఖాయుతమగును. సాధూ! విశ్వాసగర్భితములగు ఆ పూర్వపు సంభాషణలను, లీలలను, చేష్టలను స్మరించి మఱల మఱల నే ప్రసన్నుడనగుచుంటి. మిత్రమా! మాండవ్యమహర్షి కృపచే నీ వాత్మజ్ఞానము బొందినట్లు నేనున్ను తపముచే యారాధితుఁడగు ఈశ్వరుని యనుగ్రహముచే జ్ఞానప్రాప్తినొందితిని. ఇపుడు నీవు దుఃఖరహితుడవై, మేరువుపై భూమండలాధిపునివలె, పరమకారణ బ్రహ్మమున విశ్రాంతి నొందితివి.

కచ్చిత్పరమకల్యాణ ఆత్మారామతయా తవ
ప్రసాదో జాయతే చిత్తే శరదీవ సరోమ్భసి. 30
కచ్చిత్కరోషి సమతయా సుప్రసన్నగంభీరయా
దృష్ట్వా సుభగ కార్యాణి కార్యాణ్యేవ నరాధిప. 31

నిరాధివ్యాధయో ధీరాః కచ్చిత్సంపన్నశాలయః
జనతాస్తవ దేశేషు తిష్ఠన్తి విగతజ్వరమ్. 32
కచ్చిదుద్దామఫలినీ ఫలినీవ ఫలానతా
ధరా తవ ఫలాపూరైర్భృశం ధారయతి ప్రజాః. 33
కచ్చిత్తవ దిగన్తేషు చన్ద్రస్యేవాంశుపఞ్జరమ్
తుషారనికరాకారం ప్రసృతం పావనం యశః. 34
కచ్చిద్గుణగణైరేతా దిశో నిర్వివరీకృతాః
త్వయా సరోమ్భసా బాహ్యా బిసానామివ భూమయః. 35
కచ్చిత్కలమకేదారకోణస్థానేషు వ్యాప్నుతీః
ప్రతిగ్రామం కుమార్యస్తే గాయన్త్యానన్దనం యశః. 36
కుశలం ధాతవ న్యేషు ధనేషు విభవేషు చ
భృత్యేషు చ కలత్రేషు పుత్రేషు నగరేషు చ. 37
ఆధివ్యాధివిహీనేయం కచ్చిత్కాయలతా తవ
ఫలం ఫలతి పుణ్యాఖ్యం యదిహాముత్ర చోదితమ్. 38
ఆపాతరమణీయేషు వర్తేతాత్యన్తవైరిషు
కచ్చిద్విషయసర్పేషు సవిరాగం మనస్తవ. 39

పరమ మంగళస్వరూపుఁడవగు నోరాజా! ఆత్మారాముఁడ వగుటచే నీ చిత్తమున, శరదృతువున తటాకజలమునందువలె ప్రసన్నత్వముదయించుచున్నదా? నీవతిప్రసన్న, గంభీర, సమదృష్టిచే సర్వజనులకు హితముగ అవశ్యకర్తవ్యకార్యముల నాచరించుచుంటివా? నీప్రజలు శారీరక మానసిక వ్యథారహితులై, ధనధాన్యసంపన్నులై, సంతాపవర్జితులై, తమతమ దేశములందు సుఖముగ నున్నారా? నీదేశమందు భూమి ఉత్తమఫలయుక్తమై ఫలసహిత కల్పలతవోలె వాంఛితఫలములచే ప్రజలను పోషించుచున్నదా? చంద్రకిరణ సమూహమువలె, దిగంతములందు తుషారము మాడ్కి నీయశస్సు విస్తరించినదా? తటాకజలము తనయందలి కమలనాళప్రదేశములఁ బూర్ణ మొనర్చునట్లు స్వగుణగణంబులచే నీవు దిశలఁబరిపూర్ణ మొనర్చితివా? పొలములందలి ధాన్యపుకళ్లములందున్న ప్రసన్నకుమారీగణము ప్రతిగ్రామమునందును ఆనందదాయకమగు నీయశస్సును బాడుచున్నారా? నీ ధన, ధాన్య, ఐశ్వర్య, భృత్య, కుటుంబ, పుత్ర, నగరాదులు క్షేమముగనున్నవా? శారీరిక మానసిక వ్యథారహితమై ఈ నీదేహలత ఇహపరలోకములందును ఫలమిచ్చునదగు పుణ్యరూప ఫలమును ఫలించుచున్నవా? పరమశత్రువులును, అవిచారముచే రమణీయముగ గన్పట్టునవియు, నగు విషయసర్పములయెడ నీ మనస్సు వైరాగ్యయుక్తమై యుంటున్నదా?

అహో బత చిరం కాలమావాం విశ్లేషమాగతౌ
కాలేన శ్లేషితౌ భూయో వసన్తాద్రితటావివ. 40
న తా జగతి విద్యన్తే సుఖదుఃఖదశాః సఖే
జీవద్భిరా[illegible] సంయోగజ వియోగజాః. 41



తథైతాస్వతిదీర్ఘాసు దశాస్వన్యత్వమాగతాః
భూయో వయమపి శ్లిష్టాశ్చిత్రో హి నియతేర్విధిః. 42

ఆహా! మనమిద్దఱము బహుకాలము వియోగమునొందితిమి; కాని కాలవశమున వసంత, పర్వతతటములవలె మఱల యిపుడు కలిసికొంటిమి. మిత్రమా! జీవధారులగు ప్రాణుకోట్లు గాంచని ఇష్టానిష్ట, సంయోగ వియోగజనితములగు సుఖదుఃఖదశ లెవ్వియును లేవు. అట్లనే మనము ఈ దీర్ఘజీవదశలందింతకాలము వియోగముననుండి మఱల యిపుడు కూడితిమి. ఆహా! [illegible] సాగము నడచు ఈశ్వరేచ్ఛయొక్క విలాస మతివిచిత్రమైనది.

సు. [illegible]రువాచ:—

భగవన్నియతేరస్యా గతిం సర్వగతేరివ
దైవిక్యాః కో హి జానాతి గమ్భీరాం విస్మయప్రదామ్. 43
త్వమహం చ వ్యపోహ్యేతి దూరే దూరదశాసు చ
అద్య సంఘటితౌ భూయః కిమసాధ్యమహో విధేః. 44

సురఘు:— దేవా! సర్వగతినివలె ఈశ్వరేచ్ఛారూపమగు నియతియొక్క ఆశ్చర్యకరమైన గతిని, యెవరెఱుంగగలరు? చూడుము, మిమ్ములను నన్నును యింతకాలము దూరదేశముల వియోగమందుంచి యిపుడు మఱల యొకచో జేర్చెను! ఆహా! ఈశ్వరేచ్ఛ కసాధ్యమెద్ది?

వయంత్వద్య మహాసత్వ భృశం కుశలినః స్థితాః
త్వదాగమనపుణ్యేన పరాం పావనతాం గతాః. 45
పశ్య త్వదాగమక్షీణపాపానాం పుణ్యపాదపైః
తథా ఫలితమస్మాకం న యథా వయమాకులాః. 46
సర్వాః సంపత్తయోఽస్మాకం రాజర్షే సంస్థితాః పురే
భవదాగమనేనాద్య ప్రయాతాః శతశాఖతామ్. 47
వికిరతి పరితో రసాయనానా
మివ నికరం మధురం మహానుభావ,
తవ వచనమవేక్షణం చ పుణ్యం
పరమపదప్రతిమో హి సాధుసఙ్గః. 48

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే సురఘుపరిఘసమాగమో నామైకషష్టితమః
సర్గః ॥ 61 ॥

మహాత్మా! మేమిపుడత్యానందమున స్థితిగల్గియున్నాము. మఱియు మీ యాగమనమను పుణ్యముచే పరమ పవిత్రతజెందితిమి. మిత్రమా! చూడుము, మీయాగమనముచే పాపములు క్షయింప మా పుణ్యరూపవృక్షములు ఫలించుటచే మేము వ్యాకులతారహితులమై కృతకృత్యులమైతిమి. ఓ రాజర్షీ! మా నగరమున సకల సంపదలు గూడియున్నవి. మఱియు మీరాకచే నయ్యవి

యింకను శతశాఖలుగ వృద్ధినొందినవి. ఓ మహానుభావా! అతిపవిత్రములగు మీ వచనదర్శనములు నల్గడల అమృతవృష్టి గురియుచున్నట్లున్నవి. ఏలన, మహాత్ముల సమాగమము పరమపద (మోక్ష) తుల్యమని పెద్దలు వచించిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సురఘుపరిఘుసమాగమమను ఏకషష్టితమ
సర్గము ॥ 61 ॥

---

## ద్విషష్టితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అథైవంప్రాయయా తత్ర విశ్రమ్భకథయా చిరమ్
ప్రాక్తనస్నేహగర్భిణ్యా స్థితో వాచాయుధాభిధః. 1

శ్రీవసిష్ఠుడు:—ఓరామచంద్రా! ఇట్లు మిత్రుని విశ్వసనీయవృత్తాంతమును విని ప్రాచీనస్నేహపరిపూర్ణుండై చాలసేపుండిన పిదప పరిఘు యిట్లనియె.

పరిఘ ఉవాచ :—

యద్యత్సంసారజాలేఽస్మిన్క్రియతే కర్మ భూమిప
తత్సమాహితచిత్తస్య సుఖాయాన్యస్య నానఘ. 2

పరిఘు:—పాపరహితుండవగు నోరాజా! ఈ సంసారజాలమం దేయే క్రియలొనర్పబడుచున్నవో అవన్నియు సమాహితచిత్తునకే సుఖప్రదములగును గాని యన్యునకు గావు.

కచ్చిత్సంకల్పరహితం పరం విశ్రమణాస్పదమ్
పరమోపశమం శ్రేయః సమాధిమనుతిష్ఠసి. 3

సంకల్పవర్జితమును, ఉత్తమ విశ్రాంతి స్థానమును పరమశాంతిమయమును, సాంసారిక సుఖముకంటె అత్యుత్కృష్టమునునగు సమాధిని మీరనుష్ఠించుచుంటిరా?

సురఘురువాచ :—

ఏతన్మే బ్రూహి భగవన్సర్వసంకల్పవర్జితమ్
పరమోపశమం శ్రేయః సమాధిర్హి కిముచ్యతే. 4

సురఘు:—దేవా! సర్వసంకల్పవర్జితమును, పరమశాంతియుతమును, సంసారిక సుఖముకంటె అతిశ్రేష్ఠమును, శ్రేయోదాయకమునగు పరమానంద మనుభవించుచుంటిరాయని ప్రశ్నింపవలసియున్నది. అట్లుగాక సమాధిననుష్ఠించుచుంటిరా యని యేల అడిగితిరి?

యో జ్ఞో మహాత్మన్సతతం తిష్ఠన్వ్యవహరంశ్చ వా
అసమాహితచిత్తోఽసౌ కదా భవతి కః కిల. 5



మహాత్మా! జ్ఞాని వ్యవహారమొనర్చుచున్నను, యొనర్పకున్నను అసమాహితచిత్తుడై యుండునా? జ్ఞానియగువాడట్లెవండైన నుండునా?

నిత్యం ప్రబుద్ధచిత్తాస్తు కుర్వన్తోఽపి జగత్క్రియాః
ఆత్మైకతత్త్వసంనిష్ఠాః సదైవ సుసమాధయః. 6

నిత్యప్రబుద్ధ (జ్ఞానసహిత) చిత్తులు ప్రపంచక్రియలనొనర్చుచున్నను సదా ఏకతత్వ (ఆత్మ) నిష్ఠులై ఉత్తమ సమాధియుతులైయే యుందురు.

బద్ధపద్మాసనస్యాపి కృతబ్రహ్మాఞ్జలేరపి
అవిశ్రాన్తస్వభావస్య కః సమాధిః కథం చ వా. 7

పద్మాసనమువైచికొనినను, బ్రహ్మాంజలి యర్పించినను, ఆత్మస్వభావమున చిత్తము విశ్రాంతి నొందనిచో యికవాని యా సమాధియెట్టిది? వానియాస్థితి సమాధియెట్లగును?

తత్త్వావబోధో భగవన్సర్వాశాతృణపావకః
ప్రోక్తః సమాధిశబ్దేన నతు తూష్ణీమవస్థితిః. 8

దేవా! సమస్తయాశలను తృణమునకు అగ్నివంటిదగు ఆత్మతత్వావబోధమే సమాధియనంబడును గాని తూష్ణీంస్థితి కాదు.

సమాహితా నిత్యతృప్తా యథాభూతార్థదర్శినీ
సాధో సమాధిశబ్దేన పరాప్రజ్ఞోచ్యతే బుధైః. 9

ఓసాధూ! ఏకాగ్రమును, నిత్యతృప్తమును, సత్యవస్తువు నవలోకించునదియు, అబాధితమగు ఆత్మతత్వమును దర్శించునదియునగు పరాప్రజ్ఞయే సమాధియని పేర్కొనబడును.

అక్షుబ్ధా నిరహంకారా ద్వంద్వేష్వననుపాతినీ
ప్రోక్తా సమాధిశబ్దేన మేరోః స్థిరతరాకృతిః. 10

క్షోభాహంకార రహితమును, ద్వంద్వములందు తగుల్కొననిదియు, మేరుపర్వతముకంటె స్థిరమైన యాకృతిగలదియునగు స్థితియే సమాధియని వచింపబడినది.

నిశ్చిన్తాధిగతాభీష్టా హేయోపాదేయవర్జితా
ప్రోక్తా సమాధిశబ్దేన పరిపూర్ణా మనోగతిః. 11

నిశ్చింతతోగూడినదియు, అభీష్టప్రాప్తినొందినదియు, హేయోపాదేయవర్జితమును, పరిపూర్ణమునగు మనోగతియే సమాధియనంబడినది.

యతఃప్రభృతి బోధేన యుక్తమాత్యన్తికం మనః
తదారభ్య సమాధానమవ్యుచ్ఛిన్నం మహాత్మనః. 12

ఎప్పటినుండి మనస్సు సదా జ్ఞానయుక్తమై యుండునో అప్పటినుండియే అమ్మహాత్మునకు నిరంతర సమాధి సిద్ధించినదగును.

నహి ప్రబుద్ధమనసో భూత్వా విచ్ఛిద్యతే పునః
సమాధిర్ధారమాకృష్టో బిసతన్తుః శిరోరివ. 13

క్రీడించు బాలకుని హస్తముననున్న కమలసూత్రము దూరముగ లాగబడిన తెగిపోవు నట్లు, జ్ఞానికి సమాధి సిద్ధించి మఱల యెన్నటికి విచ్ఛిన్నముకానేరదు.

సమగ్రం దినమాలోకాద్విరమత్యర్కతో యథా
ఆజీవితాన్తం నో ప్రజ్ఞా తథా తత్త్వావలోకనాత్. 14

సూర్యుడు దినమంతయు లోకమును ప్రకాశింపజేయుచు విరామమునొందనట్లు విదేహకైవల్యపర్యంతము జ్ఞానియొక్క బుద్ధి దృఢసంస్కారబలముచే ఆత్మతత్త్వావలోకనమునకై యత్నించుచు విరామము నొందకుండును.

అజస్రమమ్బువహనాద్యథా నద్యా న రుధ్యతే
తథా విజ్ఞానదృగ్బోధాత్క్షణమాత్రం న రుధ్యతే. 15

జలము ప్రవహించుచుండ నది క్షణకాలమైనను నిలువనట్లు, ఆవరణనాశముచే విజ్ఞానదృష్టి బోధ (ఆత్మజ్ఞానము) నొందక క్షణమైనను నిలువజాలదు.

న విస్మరత్యవిరతం యథా కాలః కలాగతిమ్
న విస్మరత్యవిరతం స్వాత్మానం ప్రాజ్ఞధీస్తథా. 16

కాలము తన కళా - గతిని క్షణమైనను మఱువనట్లు జ్ఞానియొక్క బుద్ధి పరమప్రేమాస్పదమగు తన యాత్మ నెన్నటికిని మఱువదు.

న విస్మరతి సర్వత్ర యథా సతతగో గతిమ్.
న విస్మరతి నిశ్చయం చిన్మాత్రం ప్రాజ్ఞధీస్తథా. 17

నిరంతరము నడచువాడు తన గతిని విస్మరింపనట్లు, తత్త్వజ్ఞానియొక్క బుద్ధి, నిశ్చయింపదగిన చిన్మాత్రమగు ఆత్మను యెన్నటికి విస్మరింపదు.

గతిం కాలకలా యద్వచ్ఛిన్వానా సమవస్థితా
చిచ్ఛితిశ్చేత్త్యరహితా చిన్వానా గతయస్తథా. 18

మిత్రమా! కాల - కళ తన గతిని సదా కొనసాగించుచుండునట్లు, ఆవరణము నశింప విషయరహితమగు చైతన్యస్ఫూర్తియు ఆత్మాకారవృత్తిపరంపరనే యావజ్జీవము గల్గజేయుచునుండును.

యథా సత్తావిహీనాత్మా పదార్థో నోపలభ్యతే
తథాత్మజ్ఞానహీనాత్మా కాలో జ్ఞస్య న లభ్యతే. 19

సత్తలేక యేపదార్థమున్ను సంప్రాప్తింపదటు. ఆత్మజ్ఞానవర్జితమగు సమయమెద్దియు జ్ఞానికి లభింపదు.

న సంభవతి సంసారే గుణహీనో గుణీ యథా
న సంభవత్యాత్మసంవిద్వర్జితో హ్యాత్మవాంస్తథా. 20

లోకమున గుణవంతుడు గుణహీనుడగుట యెన్నటికి సంభవింపనట్లు, ఆత్మజ్ఞాని ఆత్మజ్ఞానరహితుడగుట యెన్నటికిని సంభవింపదు.



సర్వదైవాస్మి సంబుద్ధః సర్వదైవాస్మి నిర్మలః
సర్వదైవాస్మి శాన్తాత్మా సర్వదాస్మి సమాహితః. 21

నేను సదా జ్ఞానవంతుడను, సదా నిర్మలుడను, సదా శాంతాత్ముడను, సదా సమాధినిష్ఠుడనునై యున్నాను.

భేదః కేన సమాధేర్మే జన్యతే కథమేన వా
ఆత్మనోఽవ్యతిరేకేణ నిత్యమేవ సదాత్మతా. 22

సమాధితో నాకెట్లు, యెద్దానిచే భేదము సంభవించును? ఏలన, ఆత్మకభిన్నముగనే సదా నాయొక్క సత్త సిద్ధించుచున్నది.

తస్మాత్కదాచిదపి మే నాసమాధిమయం మనః
న వా సమాహితం నిత్యమాత్మతత్త్వైకసంభవాత్. 23

ఇక్కారణమున నామనస్సు యేకాలమునను సమాధిరహితమై యుండదు. మఱియు మనస్సే లేనందున అదెన్నడును సమాధినిష్ఠకలదియేకాదు. ఏలన, నిత్యమగు ఆత్మతత్త్వమొకటియే గలదు.

సర్వగః సర్వదైవాత్మా సర్వమేవ చ సర్వథా
అసమాధిర్హి కోఽసౌ స్యాత్సమాధిరపి కః స్మృతః. 24

సర్వదా సర్వవిధముల ఆత్మయొకటియే సర్వవ్యాపియు, సర్వస్వరూపమునై యుండ నిక సమాధ్యసమాధులేమి ?

నిత్యం సమాహితధియః సుసమా మహాన్త
స్తిష్ఠన్తి కార్యపరిణామవిభాగముక్తాః,
తేనాసమాహితసమాహితభేదభఙ్గ్యా
నిత్యోదితః క్వ ను స ఉత్తమవాక్ప్రపఞ్చః. 25

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే సమాధినిశ్చయో నామ ద్విషష్టితమః
సర్గః ॥ 62 ॥

భేదము తొలగినందున కార్యపరిణామ, విభాగరహితులగు మహాత్ములు నిత్యము సమాహిత బుద్ధిగలవారై యే యుందురు. అట్టిచో సమాహిత, అసమాహిత భేదములఁగల్పించు నీయుత్తమవాక్యసముదాయ మిపుడేచట ?

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సమాధినిశ్చయమను ద్విషష్టితమ
సర్గము ॥ 62 ॥

---

## త్రిషష్టితమః సర్గః

వసిష్ఠ ఉవాచ:—

రాజన్నూనం ప్రబుద్ధోఽసి ప్రాప్తవానసి తత్పదమ్
సంశీతలాన్తఃకరణః పూర్ణేన్దురివ రాజసే. 1
ఆనన్దమధుసంపూర్ణలక్ష్మ్యా చ పరమాశ్రితః
శీతలః స్నిగ్ధమధురో రాజీవమివ రాజసే. 2
నిర్మలో వితతః పూర్ణో గమ్భీరః ప్రకటాశయః
వేలానిలవిలాసేన ముక్తోఽబ్ధిరివ రాజసే. 3
స్వచ్ఛ ఆనన్దసంపూర్ణో నష్టాహంకారవారిదః
స్ఫుటో విస్తీర్ణగమ్భీరః శరత్ఖమివ రాజసే. 4

వసిష్ఠు:—ఓ రాజా! నీవు నిక్కముగ జ్ఞానవంతుడవే; నీవా పరమ(బ్రహ్మ)పదమును బొందితివి. అందుచే మిగుల శీతలాంతఃకరణముగల్గి పూర్ణచంద్రుని పగిది వెలుగుచుంటివి. మఱియు ఆనందమను మధురరసముచే పూర్ణమైన సర్వోత్తమ సంపదచే సేవితుడవై, శీతల, స్నిగ్ధ, సుందర కమలమువోలె విరాజిల్లుచుంటివి. నిర్మల, విశాల, పూర్ణ, గంభీర, ప్రకటాశయయుక్తమగు అంతఃకరణముగల్గి, తీరమందలి వాయువిలాసముతోగూడిన ముత్తెపు సముద్రమువలె చెన్నొందుచుంటివి. స్వచ్ఛమును, ఆనందపూర్ణమును, అహంకార మేఘరహితమును, ప్రత్యక్షమును, విశాలమును, గంభీరమునగు శరదాకాశము భంగి నీవు శోభించుచుంటివి.

సర్వత్ర లక్ష్యసే స్వస్థః సర్వత్ర పరితుష్యసి
సర్వత్ర వీతరాగోఽసి రాజన్సర్వత్ర రాజసే. 5

ఓరాజా! ఇష్టానిష్టాది సర్వవిషయములందు నీవు సమరూపుడవై గన్పట్టుచున్నావు. మఱియు, ఎల్లెడల సంతుష్టుఁడవై, వీతరాగుఁడవై యొప్పుచుంటివి.

సారాసార పరిచ్ఛేద పారగస్త్వం మహాధియా
జానాసి సర్వమేవేదం యథాస్థిత మఖణ్డితమ్. 6

మిత్రమా! నీవు నీయుత్తమబుద్ధిచే సారాసారముల నిర్ణయించి పారంగతుడవైతివి. మఱియు, యీదృశ్యజగత్తంతయు అఖండరూపమై బ్రహ్మముగనే యథారీతియున్నదని నీవెఱింగితివి.

భావాభావ పరిచ్ఛేద తత్త్వజ్ఞముదితాశయమ్
గమాగమదశాలౌల్యముక్తం తవ వపుః స్థితమ్. 7

ఉత్పత్తివినాశముల నిర్ణయము నెఱింగిన నోతత్త్వజ్ఞా! ప్రసన్నచిత్తముగల్గి, ఆరోహావరోహములచే ప్రేరితమగు చంచల రాగదశానిర్ముక్తమై నీ శరీర మిపుడు భాసించుచున్నది.

వస్తునా వస్తునేవాన్తరమ్భృతేనేవ సాగరః
అపునః ప్రత్యయాయైవ పరే తృప్తోఽసి సున్దర. 8



సుందరా! దేనికంటె యుత్తమమైనవస్తు వీప్రపంచమున మఱియొకటిలేదో, అట్టి నిజాత్మవస్తువుచే, అమృతముచే సముద్రమువలె స్వమహిమయందు నీవు పరితృప్తుఁడవైతి.

రఘురువాచ:—

న తదస్తి మునే వస్తు యత్రోపాదేయతాస్తి నః
యావత్కించిదిదం దృశ్యం తావదేతన్న కించన. 9
ఉపాదేయస్య చాభావాద్ధేయమప్యస్తి కిం కిల
ప్రతియోగి వ్యవచ్ఛేద్యం వినా హేయం కిముచ్యతే. 10

రఘు:—ఓ మునీంద్రా! దృశ్యప్రపంచమంతయు మిథ్యగాన, మాకిట గ్రాహ్యమగు పదార్థమెద్దియును లేదు. గ్రాహ్యాభావముచే నిక త్యాజ్యమెచట?

తుచ్ఛత్వాత్సర్వభావానామతుచ్ఛత్వాచ్చ కాలతః
చిరం మమ పరిక్షీణే తుచ్ఛాతుచ్ఛే మనస్థితీ. 11

కేవలము దేశకాలములవలననే పదార్థములన్నింటియొక్క తుచ్ఛాతుచ్ఛత్వములు సంభవించుచున్నందున, అట్టి తుచ్ఛాతుచ్ఛత్వస్థితి నామనస్సున చిరకాలముననే క్షయించినది.

దేశకాలవశాదేవ తుచ్ఛస్యాతుచ్ఛతామిహ
అతుచ్ఛస్యతు తుచ్ఛత్వం వర్జ్యే నిన్దాస్తుతీ బుధైః. 12

దేశకాలవశముననే తుచ్ఛపదార్థముయొక్క అతుచ్ఛత్వము, అతుచ్ఛపదార్థముయొక్క తుచ్ఛత్వము సంభవమగును. కాన తుచ్ఛాతుచ్ఛములఁగూర్చిన నిందాస్తుతు లొనర్పరాదని విజ్ఞులమతము.

రాగాన్నిన్దాస్తుతీ లోకే రాగశ్చ పరివాఞ్ఛితమ్
వాఞ్ఛతే చ మహోదారం వస్తు శోభనబుద్ధినా. 13

లోకమున, నిందాస్తుతులు రాగముచే గల్గును. రాగ మిచ్ఛచే ప్రాదుర్భవించును. కాన ఉత్తమ బుద్ధిమంతుడు మహోదారమగు పదార్థము (బ్రహ్మ)నే యిచ్ఛగించును.

త్రైలోక్యే చ స్త్రియః శైలాః సముద్రవనరాజయః
భూతాని వస్తుశూన్యాని సారో నాస్త్యత్ర వస్తుతః 14

ఈ ముల్లోకమున గల స్త్రీ, పర్వత, సముద్ర, వనసమూహములును, సమస్త ప్రాణులును పృథ్వ్యాది పంచభూతములును, అన్నియు సత్యవస్తురహితమైయున్నవి. వీనియందు సారమేమియును లేదు.

మాంసాస్థిదారుమృద్రత్నమయే జగతి జర్జరే
వాఞ్ఛనీయ విహీనేఽస్మిన్శూన్యే కిమివ వాఞ్ఛ్యతే 15

మాంసాస్థి, కాష్ఠ, మృత్తికారత్న (శిలా) దిమయమై యిచ్ఛగింప నయోగ్యమైనట్టి యీ పురాతన శూన్య జగత్తునందు వాంఛనీయమగు పదార్థమెద్ది?

వాఞ్ఛాయాం వినివృత్తాయాం సంక్షయే ద్వేషరాగయోః
దినలక్ష్మ్యాం వ్యపేతాయామాలోకాతపయోరివ. 16

దినలక్ష్మి తొలఁగ, ప్రకాశాతపములు క్షయించునట్లు, పదార్థములఁగూర్చిన యిచ్ఛ నివృత్తికాఁగా రాగద్వేషములు సంక్షయించును.

అలమతివితతైర్వచఃప్రపఞ్చై
రియముచితేహ సుఖాయ దృష్టిరేకా,
ఉపశమితరసం సమం మనోఽన్త
ర్యది ముదితం తదనుత్తమా ప్రతిష్ఠా. 17

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే సురఘుపరిఘనిశ్చయో నామ
త్రిషష్టితమః సర్గః ॥ 63 ॥

మిత్రమా! ఇక యధికవాగ్జాలము వ్యర్థమే. సర్వత్ర రాగద్వేషరహితమై, శాంతమై, ఆత్మైకరసమై, మనస్సు తన ఆత్మయందే కేవలము పరితృప్తిఁబొందుచో నదియే ఉత్తమప్రతిష్ఠ (సర్వోత్తమ విశ్రాంతి) యగును. ఇట్టిదృష్టియొకటియే సేవింపఁదగినది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సురఘుపరిఘునిశ్చయమను త్రిషష్టితమ
సర్గము ॥ 63 ॥

---

## చతుఃషష్టితమః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

సురఘుః పరిఘశ్చైవ విచార్యేతి జగద్భ్రమమ్
మిథః ప్రపూజితౌ తుష్టౌ స్వవ్యాపారపరౌ గతౌ. 1

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! సురఘు, పరిఘు లిర్వురును యిట్లు జగద్భ్రమను గూర్చి విచారించి, పరస్పరము పూజించుకొని, సంతుష్టులై స్వవ్యాపారపరాయణులైరి.

తదేవ రాఘవ శ్రుత్వా పరమం బోధకారణమ్
అనేనైవ విబోధేన భవ లబ్ధాస్పదః స్ఫుటమ్. 2

ఓ రాఘవా! వారి యా చరిత్రమును విని నిశ్చయమునొందుటచే పరమబోధ జనించును. సురఘు పరిఘుల యాజ్ఞానముచే నీవున్ను పరమపదలాభమును ప్రత్యక్షరీతి బొందుము.

పరయా ప్రజ్ఞయా ధీరవిచారగతతీక్ష్ణయా
గలత్యలమహంకారకాలమేఘే హృదమ్బరే. 3



సమస్తలోకానుమతే సఫలే హ్లాదకారిణి
నిర్మలే వితతే చేతః శరత్కాల ఉపస్థితే. 4

ధ్యేయే శరణ్యే సుగమే సకలానన్దసంపది
సుప్రసన్నే చిదాకాశే స్థీయతే పరమాత్మని. 5

యో నిత్యమధ్యాత్మమయో నిత్యమన్తర్ముఖః సుఖీ
నిత్యం చిదనుసంధానో మనఃశోకైర్న బాధ్యతే. 6

ధీరులగు విజ్ఞులతోఁగలసి విచారించుటచే, ఉత్తమ తీక్ష్ణబుద్ధిచే అహంకారమను కాలమేఘము హృదయాకాశమున లెస్సగ నశింప, సర్వలోకవ్యాప్తమును, ఫలసహితమును, ఆనందకరమునగు నిర్మలచిత్తమను శరత్కాలము ప్రవేశింప, ధ్యానయోగ్యమును, శరణ్యమును, ఆత్మరూపమగుటచే సుగమమును, సర్వానందసంపత్తిస్వరూపమును, సుప్రసన్నమును, చిదాకాశరూపమునగు పరమాత్మయందెవఁడు స్థితినొందునో, మఱియు నెవఁడు నిత్యమాత్మవిచారతత్పరుడై, యంతర్ముఖుఁడై, సుఖరూపుడై, చిదాస్వాదనపరుడై యుండునో, యాతని చిత్తముదుఃఖముచే పీడింపబడదు.

వ్యవహారపరోఽత్యుచ్చై రాగద్వేషమయోఽపి సన్
నాన్తఃకలఙ్కమాయాతి పద్మో జలగతో యథా. 7

అతఁడెల్లపుడు వ్యవహారతత్పరుఁడైయున్నను, రాగద్వేషమయుఁడైయున్నను, జలమందుంచబడిన కమలమువలె, అంతఃకరణమున కళంకయుతుడెన్నటికిని కానేరడు.

సమ్యగ్విజ్ఞానవాన్బుద్ధో యోఽన్తఃశాన్తమనా మునిః
న బాధ్యతే స మనసా కరిణేవ మృగాధిపః. 8

ఉత్తమజ్ఞానియు, అంతఃకరణమున శుద్ధుడును, శాంతచిత్తుడునునగు ముని యేనుగుచే సింహము బాధింపబడనట్లు మనస్సుచే నెన్నడు బాధింపబడకుండును.

భోగైకశరణం దీనం న చిత్తం జ్ఞస్య విద్యతే
నన్దనే దుర్ద్రుమ ఇవ జ్ఞచిత్తం హి మహావపుః. 9

నందనవనమున కంటకవృక్షములుండనట్లు, జ్ఞానియొక్క చిత్తము భోగలంపటమై దీనయుక్తముగాక యుండి, విశాలరూపమునే బడయును. అనగా, క్షుద్రమగు విషయసుఖమును గాక్షింపక యుండును.

విరక్తో జన్మమరణే యథా దుఃఖీ న మానవః
పరిజ్ఞాతాఖిలావిద్యం తథా చిత్తం న దుఃఖితమ్. 10

విరక్తుడు జననమరణములఁగాంచి దుఃఖమునొందనట్లు, సమస్తము విచారించి, విషయేంద్రియ శరీరాదులును, తదితర దృశ్యమంతయును అవిద్య (మిథ్యాభ్రాంతి) యని యే చిత్తమెఱుంగునో, అదియే దుఃఖము నొందకుండును.

పరిజ్ఞాతమనో మోహో జగద్భావోద్భవాత్మనా
స్పృశ్యతే నైనసా సాధో రజసేవ నభస్తలమ్. 11

సాధువగునో రామా! ధూళి యాకసమునంటునట్లు, స్వ మనోమోహము (భ్రమ) నెఱింగిన వానిని లోకమున కర్తృత్వాభిమానముచే జనించు పాపమెన్నటికి స్పృశింపనేరదు.

అవిద్యాసం పరిజ్ఞాతమిదమేవ మహౌషధమ్
అవిద్యావితతవ్యాధేస్తిమిరస్యేవ దీపకమ్. 12

అవిద్యయను మహారోగమునకు, ఈ జగత్తు అవిద్యామాత్రమను విచారముచే జనించు ఉత్తమజ్ఞానము, అంధకారమునకు దీపమువలె మహౌషధమగును.

అవిద్యా సంపరిజ్ఞాతా యదైవ హి తదైవ హి
సా పరిక్షీయతే భూయఃస్వప్నే నేవ హి భోగభూః. 13

'ఇదిస్వప్న'మని యెఱుంగుటచే స్వప్నానుభవప్రదేశము నశించునట్లు, అవిద్యయు అవిద్యారూపమున నెపుడెఱుంగబడునో, అపుడే నశించును.

వ్యవహారపరోఽప్యన్తరసక్తమతిరేకధీః
స్పృశ్యతే నైనసా సాధుర్మత్స్యేక్షణమివామ్భసా. 14

వ్యవహారపరుడైనను, అంతరమున సంసారమందు సక్తముగాక కేవలము బ్రహ్మమందే నిమగ్నమైనబుద్ధి గలవానిని, మత్స్యనేత్రములను జలమంటునట్లు, పాపములు స్పృశింపనేరవు.

ప్రాప్తే చిద్భాసురాలోకే ప్రక్షీణాఽజ్ఞానయామినీ
శేముషీ పరమానన్దమాగతా జ్ఞస్య రాజతే. 15

ప్రదీప్తమగు చైతన్యమయప్రకాశము సంప్రాప్తింప అజ్ఞానరాత్రి క్షయించును. మఱియు పరమానందమును పొందినదై తత్త్వజ్ఞానిబుద్ధి ప్రకాశించును.

అజ్ఞాననిద్రోపశమే జనో జ్ఞానార్కబోధితః
తత్ప్రబోధమవాప్నోతి పునర్యేన న ముహ్యతి. 16

అజ్ఞాననిద్ర యంతమొంద, జ్ఞానసూర్యునిచే ప్రబోధితుడు కాగా, జీవుడట్టి ప్రబోధమునుబడసి, దానిచే మఱల మోహము నొందకుండును.

దినాని జీవ్యతే తాని సానన్దాస్తే క్రియాక్రమాః
ఆత్మచన్ద్రోదితా యేషు చిజ్జ్యోత్స్నా హృద్యయామ్బరే. 17

ఏ దినములందు ఆత్మయను చంద్రునినుండి యుదయించిన చిత్-చంద్రిక హృదయాకాశమున విస్తరించునో, ఆ దినములే జీవనసహితములును, ఆ క్రియలే ఆనందయుక్తములునగును.

నరో మోహా సముత్తీర్ణః సతతం స్వాత్మచిన్తయా
అన్తఃశీతలతామేతి స్వామృతేనేవ చన్ద్రమాః. 18

చంద్రుడు తనయందలి అమృతముచే శీతలత్వమునొందునట్లు మోహసముద్రమును లెస్సగ దాటిన మనుజుడు నిరంతరాత్మచింతనచే తన యంతఃకరణమున శీతలత్వము నొందును.

తాని మిత్రాణి శాస్త్రాణి తాని తాని దినాని చ
విరాగోల్లాసవాన్యేభ్య ఆత్మచిత్తోదయః స్ఫుటమ్. 19



వైరాగ్యోల్లాసయుతమై, ఆత్మాకారవృత్తిరూపమై చిత్తముయొక్క అభ్యుదయము స్పష్టరీతి యేరిచే సంభవించునో, ఆ మిత్రులే మిత్రులు, ఆ శాస్త్రములే శాస్త్రములు, ఆ దినములే దినములు.

చిరం శోచన్తి తే దీనా జన్మజఙ్గలవీరుధః
ఆత్మావలోకనే హేలా యేషామవిగతైనసామ్. 20

ఏపాపులు ఆత్మదర్శనమున యనాదరము గల్గియుందురో వారు దీనులు. జన్మారణ్యమందలి వృక్షముభంగి బహుకాలము వారు దుఃఖమునొందుదురు.

ఆశాపాశశతైర్బద్ధం భోగోలపసులాలసమ్
జరాజర్జరితాకారం శోకోచ్ఛ్వాసకదర్థితమ్. 21
వ్యాధదుఃఖమహాభారం జన్మజఙ్గలజీవితమ్
కుకర్మకర్దమాలిప్తం మోహపల్వలశాయినమ్. 22
రాగదంశావలీదష్టం కృష్టం తృష్ణావరత్రయా
మనోవణిజ్నికేతస్థం బన్ధుబన్ధననిశ్చలమ్. 23
పుత్రదారజరాజీర్ణే మగ్నోన్మగ్నం కుకర్దమే
శ్రాన్తం విగత విశ్రాన్తం భగ్న మాదీర్ఘవర్త్మని. 24
గమాగమపరిక్షీణం సంసారారణ్యచారిణమ్
అలబ్ధశీతలచ్ఛాయం తీవ్రతాపోపతాపితమ్. 25
ఆకారభాసురం దీనం బాహ్యైరాక్రాన్తమిన్ద్రియైః
కర్మఘణ్టారవాక్రాన్తం క్రాన్తం దుష్కృత తాడనైః. 26
ఆవిర్భావతిరోభావ చక్రావర్తధురోద్వహమ్
అజ్ఞాన వికటాటవ్యాం లుఠితం సన్నగాత్రకమ్. 27
నిజానర్థ సదా మగ్నం సీదమాన మకించనమ్
సన్నాఙ్గం కర్మభారేణ కరుణాక్రన్దకారిణమ్. 28
రామ జీవబలీవర్దమిమం సంసారపల్వలాత్
పరమం యత్నమాస్థాయ చిరముత్తారయేద్బలాత్. 29

పలువిధ యాశాపాశములచే బంధింపబడినదియు, భోగములను తృణము, నపేక్షించునదియు వార్ధక్యముచే జర్జరితమైన యాకృతిగలదియు, శోకమను ఉచ్ఛ్వాసముచే నిందితమైనదియు, దుఃఖమను మహాభారమును వహించునదియు, జన్మయను యరణ్యమున జీవించునదియు, దుష్కర్మయను బురదను పులుముకొనునదియు, మోహమను చిన్నమడుగున పరుండునదియు, రాగమను దోమలచే కఱువబడినదియు, తృష్ణయను చర్మరజ్జువుచే యీడ్వబడునదియు, మనస్సను గృహమున వసించునదియు, బంధువులను బంధనమువలన నడువనశక్యమైనదియు, పుత్ర, స్త్రీ, వార్ధక్యములచే జీర్ణీభూతమును, దుష్కర్మయను గోమయమున సదా నిమగ్నమైనదియు,అలసినదియు

విశ్రాంతి లేనిదియు, దూరమార్గ (ఇహపరలోక) చలనముచే భగ్నమైన యంగములు కలదియు, గమనాగమనముచే క్షీణించినదియు, సంసారారణ్యమునఁజరించునదియు, శీతలచ్ఛాయారహితమును, అతితీవ్రమనస్సంతాపముచే తప్తమును, బాహ్యమున ఆకారమాత్రముచే శోభించుచు అంతఃకరణమున దీనమైనదియు, నేత్రాది బాహ్యేంద్రియములచే పరాజితమును, కామ్యకర్మయను ఘంటానాదముచే భ్రమణశీలమును, పాపతాడనచే పరిపీడితమును, ఆవిర్భావతిరోభావములను చక్రములు గల్గిన శకటముయొక్క భారమును వహించునదియు, అజ్ఞాన మహారణ్యమున దేహము విఱుగుటచే పడి పొరలునదియు, తన యనర్థముననే సదా మగ్నమైయుండునదియు, సదా దుఃఖదారిద్ర్యయుతమును, శిథిలశరీర సంయుతమును, కర్మభారముచే దీనముగ యాక్రందన మొనర్చునదియునగు యీ జీవుడను బలీవర్దము (ఎద్దు)ను అతిప్రయత్నముచే జ్ఞానబలమున, సంసార పంకమునుండి శాశ్వతముగ సముద్ధరింపవలెను,

తత్త్వావలోకనా క్షీణే చిత్తే నో జాయతే పునః
జీవః కదాచన తదా భవేత్తీర్ణ భవార్ణవః. 30

ఆత్మతత్త్వదర్శనముచే చిత్తము క్షయింప, మఱల యెన్నటికి భ్రమ జనింపకుండును. ఆ జీవుడిక సంసారసాగరమును తప్పక దాటును.

మహానుభావసంపర్కాత్సంసారార్ణవలఙ్ఘనే
యుక్తిః సంప్రాప్యతే రామ స్ఫుటా నౌరివ నావికాత్. 31

నావికునివలన నౌక లభించునట్లు, మహానుభావుఁడగు జ్ఞానియొక్క సాంగత్యముచే సంసారసాగరమును తరించుటకు వలయు శ్రేష్ఠయుక్తి లభించును.

యస్మిన్దేశమరౌ తజ్జ్ఞో నాస్తి సజ్జనపాదపః
సఫలః శీతలచ్ఛాయో న తత్ర నివసేద్బుధః. 32

ఫలసంయుక్త, శీతలచ్ఛాయాయుతమగు జ్ఞానియను వృక్షములేనట్టి మరుభూమితుల్యప్రదేశము బుద్ధిమంతునకు నివాసయోగ్యము కానేరదు.

స్నిగ్ధశీతవచఃపత్రే సచ్ఛాయే స్మితపుష్పకే
క్షణాద్విశ్రమ్యతే రామ భృశం సుజనచమ్పకే. 33

ఓ రామా! స్నిగ్ధ, శీతల వచనములను పత్రములను, ఉత్తమస్వభావమను ఛాయయు, చిరునగవను పుష్పములును గల సజ్జనులను చంపకవృక్షముక్రింద క్షణకాలముననే విశ్రాంతి లభించును.

తదభావే మహామోహతాపసంపత్తిదాయిని
కించిజ్జాతవివేకేన స్వప్తవ్యం నేహ ధీమతా. 34

ఆత్మలాభమను విశ్రాంతికలుగనప్పుడు మహామోహ, సంతాపదాయకమగు యీ ప్రపంచమున కొంచెము వివేకమావిర్భవించినట్టి ధీమంతుడిక నిదురపోరాదు. (నిరంతరము యత్నశీలుడై యుండవలెను.)



ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మనాత్మానముద్ధరేత్
నాత్మానమవలేపేన జన్మపఙ్కార్ణవే క్షిపేత్. 35

తనకు తానే బంధువు, కాన, తన్ను తానే యుద్ధరించుకొనవలెనుఁగాని వ్యర్థముగ దేహాభిమాన, గర్వములచే ఆత్మను జన్మయను పంకార్ణవమున బడద్రోయరాదు.

కిమిదం కథమాయాతం కింమూలమితి కింక్షయమ్
దేహదుఃఖమితి ప్రాజ్ఞైః ప్రేక్షణీయం ప్రయత్నతః. 36

దేహసంబంధమగు యీ దుఃఖమేమి? యెట్లు కలిగినది? దీనికి మూలమెద్ది? ఇయ్యదెట్లు నశించును? ఇవ్విధమున బుద్ధిమంతులు ప్రయత్నముచే విచారణ గావింపవలెను.

న ధనాని న మిత్రాణి న శాస్త్రాణి న బాన్ధవాః
నరాణాముపకుర్వన్తి మగ్నస్యాత్మసముద్ధృతౌ. 37

ధనముగాని, మిత్రులుగాని, అన్యశాస్త్రములుగాని, అజ్ఞానసాగరమున నిమగ్నమగు తన యాత్మనుద్ధరించుటయందు మనుజుని కుపకారములు కానేరవు.

మనోమాత్రేణ సుహృదా సదైవ సహవాసినా
సహ కించిత్పరామృశ్య భవత్యాత్మా సముద్ధృతః. 38

నిరంతర సహవాసియగు శుద్ధమానసమను మిత్రునితో కొంచెము పరామర్శించినమాత్రమున ఆత్మోద్ధారము సంభవమగును.

వైరాగ్యాభ్యాసయత్నాభ్యాం స్వపరామర్శజన్మనా
తత్త్వావలోకనపోతేన తీర్యతే భవసాగరః. 39

అభ్యాస, వైరాగ్యములను యత్నముచేతను, విచారముచేతను జనించు తత్త్వజ్ఞానమను మహానౌకచే సంసారసాగరము దాటబడును.

శోచ్యమానం జనైర్నిత్యం దహ్యమానం దురాశయా
నాత్మానమవమన్యేత ప్రోద్ధరేదేన మాదరాత్. 40

మనుజులచే నిరంతరము శోకింపబడునదియు, దురాశాపీడితమునగు, ఆత్మ నుపేక్షించరాదు; కాని, యాదరముననద్దాని నుద్ధరింపవలెను.

అహంకారమహాలానం తృష్ణారజ్జుం మనోమదమ్
జన్మజమ్బాలనిర్మగ్నం జీవదన్తినముద్ధరేత్. 41

అహంకారమను కట్టుకంబమును, తృష్ణయను రజ్జువును, మనస్సను మదస్రావమును గల్గి జన్మపంకమున నిమగ్నమైనట్టి జీవుడను గజమును సముద్ధరింపవలెను.

అయమేతావతైవాత్మా త్రాతో భవతి రాఘవ
యదపాస్య విమూఢత్వమహంకారః ప్రమార్జ్యతే. 42

ఓ రాఘవా! అజ్ఞానాహంకారములు దూరీకృతమొనర్పబడ స్వాత్మరక్షణ సిద్ధించును.

ఏతావతైవ సన్మార్గే యాతి ప్రకటతామలమ్
యదపాస్య మనోజాలమహంభావో విలీయతే. 43

మనస్సుచే బాహ్యాభ్యంతర జగత్తులందలి యాసక్తిని పూర్ణముగ తొలగించి, అహంకారమును నశింపచేసిన మాత్రముచే సన్మార్గమున బోధపర్యంత విచారము సువ్యక్తమగును.

ఏతావతైవ దేవేశః పరమాత్మావగమ్యతే
కాష్ఠలోష్ఠసమత్వేన దేహో యదవలోక్యతే. 44

ఈ దేహము కాష్ఠ, శిలాసదృశముగ గాంచబడినంత మాత్రముననే సర్వదేవేశుఁడగు పరమాత్మఁగూర్చిన జ్ఞానము లభ్యమగును.

అహంకారామ్బుదే క్షీణే దృశ్యతే చిద్దివాకరః
తతస్తత్పరిణామేన తత్పదం సమవాప్యతే. 45

అహంకారమను మేఘము నశింప చిద్రూపమను సూర్యుడు గన్పట్టును. మఱియు, ఆత్మదర్శనభూమికాపరిపాకముచే పరమపదము లభించును.

యథా ధ్వాన్తసముచ్ఛేదే స్వయమాలోకవేదనమ్
తథాహంకారవిచ్ఛేదే స్వయమాత్మావలోకనమ్. 46

అంధకారము నశింప ప్రకాశజ్ఞానము స్వయముగ గల్గునట్లు, అహంకారము నశింప ఆత్మదర్శనము స్వయముగ సిద్ధించును.

అహంకారే పరిక్షీణే యావస్థా సుఖమోదజా
సావస్థా భరితాకారా సా సేవ్యా సంప్రయత్నతః. 47

అహంకారము క్షయింప, నిరతిశయానందమందలి విశ్రాంతిచే జనించిన నిర్వికల్పస్థితి పరిపూర్ణమైనదగును. కాన యత్నముచే నద్దానినే సేవింపవలెను.

పరిపూర్ణార్ణవప్రఖ్యా న వా గోచరమేతి నః
నోపమానముపాదత్తే నానుధావతి రఞ్జనమ్. 48

పరిపూర్ణ సముద్రమువంటి అట్టి మాస్థితి మానసాదుల విషయత్వము నెన్నటికి నొందదు. మఱియు నద్దానికెద్దియు సాటియును లేదు. అయ్యది దృశ్యరాగముచే రంజితమగునది కాదు.

కేవలం చిత్ప్రకాశాంశకలికా స్థిరతాం గతా
తుర్యా చేత్ప్రోచ్యతే దృష్టిస్తత్తయా సోపమీయతే. 49

కేవలము చిత్ప్రకాశ కలిక మాత్రము స్థిరత్వమునొందును. తుర్య (నిర్వికల్ప సమాధి) దృష్టియైనచో, యికనద్దాని సాదృశ్యము దానితోనే నొనర్పనగును; దానికి మఱియొక ఉపమానమే లేదు.

అదూరగతసాదృశ్యాత్సుషుప్తస్యోపలక్ష్యతే
సావస్థా భరితాకారా గగనశ్రీరివాతతా. 50

నిర్విక్షేపకారణమున, సమీపసాదృశ్యము గలదగుటచే నట్టిస్థితి సుషుప్తికి గోచరించును. మఱియు నయ్యవస్థ ఆకాశమువలె వ్యాపకమైనది.



మనోహంకారవిలయే సర్వభావాంతరస్థితా
సముదేతి పరానన్దా యా తనుః పారమేశ్వరీ. 51

ఘటము నశింప ఘటాకాశము మహాకాశమున గలయునట్లు, మనోహంకారరూపమగు యుపాధి నశింప, సర్వపదార్థముల యాంతరముననున్న తత్, త్వంపద లక్ష్యరూపమగు పరమేశ్వరుని పరానంద ముదయమగును.

సా స్వయం యోగసంసిద్ధా సుషుప్తా దూరభావినీ
న గమ్యా వచసాం రామ హృద్యేవేహానుభూయతే. 52

రామా! అట్టిస్థితి స్వయముగ యోగముచే సిద్ధించును. మఱియు నది సుషుప్తికి దూరమును, కన్నదియు కాదు. అట్టియవస్థ వాక్కుల కతీతమైనది. మఱియు హృదయముననే యనుభూతమగునది.

అనుభూతిం వినా తత్త్వం ఖణ్డాదేర్నానుభూయతే
అనుభూతిం వినా రూపం నాత్మనశ్చానుభూయతే. 53

అనుభవములేనిచో సామాన్యమగు ఖండశర్కరాదుల తత్వముగూడ యెట్లు గోచరము కాదో, అట్లనే అనుభవములేమి ఆత్మస్వరూపమున్ను గోచరింపదు.

అఖిలమిదమనన్తమాత్మతత్త్వం
దృఢపరిణామిని చేతసి స్థితేఽన్తః,
బహిరుపశమితే చరాచరాత్మా
స్వయమనుభూయత ఏవ దేవదేవః. 54

ఈ జగత్తంతయు కేవలమనంతాత్మస్వరూపమే. దృశ్యములును, పరిణామస్వభావయుతములునగు చిత్తముయొక్క బాహ్యవిషయములు శమింప, సర్వత్ర వ్యాప్తమై బ్రహ్మాది దేవతలకు గూడ దేవుడై వెలయు ఆత్మ స్వయముగ ననుభూతమగును.

తదను విషయవాసనా వినాశ
స్తదను శుభః పరమః స్ఫుటప్రకాశః,
తదను చ సమతావశాత్స్వరూపే
పరిణమనం మహతామచిన్త్యరూపమ్. 55

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే ఉపదేశో నామ
చతుఃషష్టితమః సర్గః ॥ 64 ॥

---

ఈ చతుర్థభూమికయైనపిదప, పంచమభూమికయందు విషయవాసన నశించును. షష్ఠభూమికయందు పరమపురుషార్థరూపమగు ఆత్మప్రకాశ ముదయించును. ఆపిమ్మట సప్తమభూమిక

యందు సహ్యాద్రిసమున్నతముల సమష్టికారణముచే బ్రహ్మాదులకు గూడ సచ్చిన్మయమైనట్టి కేవలానందైకఘనస్వరూపమై ఆత్మ పరిణమించును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ఉపదేశమను చతుష్షష్టితమ
సర్గము ॥ 64 ॥

---

పఞ్చషష్టితమః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

మనసైవ మనశ్ఛిత్వా యదాత్మా నావలోక్యతే
మమేత్యహమితి త్యక్త్వా తత్త్వామరసలోచన. 1
నాస్తమేతి జగద్దుఃఖం యథా చిత్రగతో రవిః
అయాత్యాపదనన్తత్వం మహార్ణవవదాతతా. 2
పునఃపునరుపాయాతి జలకల్లోలకారణమ్
మేఘనీలతమఃశ్యామా సంసృతిప్రావృడాకులా. 3

శ్రీ వసిష్ఠుడు:—కమలనేత్రుఁడవగు ఓ రామచంద్రా! 'ఈ ధనాదులు నావి ఈ శరీరాదులు నేను' అను యభిమానమును త్యజించి మనస్సుచే మనస్సు నుచ్ఛిన్నమొనర్చి ఆత్మదర్శనము గావింపనిచో, చిత్రస్థసూర్యునివలె యీజగద్దుఃఖ మస్తమింపదు; మహాసముద్రమువలె అపరిమితమగు యాపత్తి సంభవించును; జలకల్లోలకారణమును, మేఘనీలకాంతిచేతను అంధకారముచేతను శ్యామవర్ణయుతమైనదియు, వ్యాకులమైనదియు నగు సంసారమను వర్షర్తువు మఱల మఱల యేతెంచును.

అత్రైవోదాహరన్తీమమితిహాసం పురాతనమ్
సంవాదం సుహృదోః సహ్యసానౌ భాసవిలాసయోః. 4

ఇవ్విషయమున, సహ్యపర్వత శిఖరముపై వసించు భాస, విలాసులను యిర్వురు మిత్రుల సంవాదరూపమగు ప్రాచీనేతిహాసము నుదాహరింతురు.

అస్త్యుత్సేధజితాకాశః పీఠేన జితభూతలః
తలేన జితపాతాలస్త్రిలోకవిజయో గిరిః. 5

ఎత్తునందాకాశమును, సమప్రదేశమున భూతలమును, నిమ్నభాగమున పాతాళమును జయించునట్టి, త్రిలోకవిజయినాగు పర్వతమొండు గలదు.

అసంఖ్యకుసుమాపూరోఽసంఖ్యనిర్మలనిర్ఝరః
గుహ్యకాగతశీతనిధిః సహ్యనామాఽవిషహ్యభాః. 6



ముక్తాపటలసంపూర్ణై ర్భానుభాసురభిత్తిభిః
భాసురః కాఞ్చనతటైః కటైరివ సురద్విపః. 7
క్వచిత్పుష్పభరాసారో ధాతుసారాతతః క్వచిత్
క్వచిత్ఫుల్లసరఃసారో రత్నశాలిశిలః క్వచిత్. 8
ఇతో రటన్నిర్ఝరవానితః క్వణితకీచకః
ఇతో రటద్గుహావాత ఇతః షట్పదఘుంఘుమః. 9
సానౌ గీతోఽప్సరోవృన్దైర్వనే మృగఖగారవః
అధిత్యకాయాం మత్తాభో గగనేషు ఖగారవః. 10

అసంఖ్య పుష్పములచే పరిపూర్ణమును, అసంఖ్యాకములగు సెలయేళ్లుగలదియు, గుహ్యులచే సంరక్షింపబడినదియు, రత్నాదుల దీప్తిచే దృష్టిని ప్రతిబంధించునదియునై సహ్యమను పేరుగల్గియా పర్వతము రాజిల్లుచుండె. ఆయ్యది ముత్తెపు సమూహములచే పూర్ణమై, చంద్రకాంతమణుల కుడ్యములచే ప్రకాశవంతమై, గండభాగములచే నైరావతమువలె సువర్ణమయ తటములచే దీపిల్లుచునుండెను. ఒకచో పుష్పసమూహములచే ప్రవాహమయమై, ఒకచో హరితాళ, మనఃశిలాది ధాతువులచే వ్యాప్తమై, ఇంకొకచోట వికసిత పుష్పయుత సరోవరములచే రమణీయమై, రత్నములచే శోభాయమానమగు శిలామయమై, కొన్నిచోట్ల సెలయేళ్ల శబ్దములతోను, కొన్నిచోట్ల వేణునాదంబులతోను పూర్ణమై యలరుచు గుహలందలి సీత్కారవాయు శబ్దంబులచే శోభితమై, భ్రమర గుంజారవంబులచే వ్యాప్తమై యుండెను. మఱియు నొక్కొకచోట శిఖరముపైని అప్సరల గానముచే మనోహరమై, వనస్థ మృగ, పక్షుల శబ్దములచే పూర్ణమై ఉపరిభాగములందు ఘనమేఘ గర్జనంబులచే రమణీయమై, ఆకాశమున పక్షులనాదములతో గూడి శోభిల్లుచునుండె.

విద్యాధరాశ్రితగుహో భృఙ్గగీతామ్బుజాకరః
కిరాతగీతపర్యన్తః ఖగగీతవనద్రుమః. 11
స్కన్దేషు దేవైర్వలితః పాదేషు వలితో నరైః
పాతాలే వలితో నాగైర్జగద్గృహమివాపరమ్. 12
కన్దరేషు శ్రితః సిద్ధైర్నిధానైరన్తరాశ్రితః
చన్దనేషు శ్రితో నాగైః సింహైః శృఙ్గశిఖాసు చ. 13
పుష్పాభ్రసంవీతవపుః పుష్పరేణ్వభ్రపాంసులః
పుష్పవాత్యాభ్రమహ్రాద్భ్రాన్తః పుష్పపాదపపాణ్డురః. 14
ధాతుధూల్యభ్రకపిలో రత్నోపలతలస్థితైః
మన్దారగైరివ పురస్త్రీగణై రలమాశ్రితః. 15
అభ్రనీలాంశుకచ్ఛన్నా మూకరత్నవిభూషణాః
శిలాః కనకసున్దర్యో యత్ర శృఙ్గాభిసారికాః. 16

తత్రోత్తరతటే సానౌ వినమ్రఫలపాదపే
రత్నపుష్కరిణీజాలవహన్నిర్ఝరవారిణి. 17
చూతద్రుమలతోన్ముక్తపుష్పస్తబకదన్తురే
విఫుల్లాఙ్కోలపున్నాగనీలనీరజదిక్తటే. 18

ఆ పర్వతగుహలందు విద్యాధరులుండిరి. దానిపైగల కమలములందు తుమ్మెదలు ఝుంకారము సల్పుచుండె; దాని యధోభాగమున కిరాతులు గానమొనర్చుచుండిరి. దానియందలి వనవృక్షములపై పక్షులు గానముచేయుచుండెను. మధ్యభాగములు దేవతలచేతను, పాదప్రదేశములు మనుజులచేతను, పాతాళదేశము నాగులచేతను సేవింపబడినదై రెండవ బ్రహ్మాండగృహమువలె యొప్పుచుండె. కందరప్రదేశములు సిద్ధులచే సేవితమై, లోనిస్థానము లనేక నిధులకాశ్రయభూతమై దనరుచుండె. అందలి చందనములు సర్పములచేతను, శిఖరములు సింహములచేతను యాశ్రయింపబడియుండెను. రాలిన పుష్పములచే గప్పబడినదై, పుష్పరేణువులచే ధూళీమయమై, ఎగురుచున్న పుష్పములను మహావాయువుతోగూడినదై మేఘములచే భ్రమణశీలమై యొప్పుచు, పుష్పమయ వృక్షములచేతను, అనేక ధాతుకణములచేతను మేఘమువలె గౌరవర్ణయుతమైయుండెను. అందలి రత్నమయశిలాభాగములందలి మందార (కల్ప) వృక్షములు పురస్త్రీలచే లెస్సగ సేవితమైయుండెను. మేఘములను నీలవస్త్రములచే నాచ్ఛాదితమై, శబ్దరహితములగు రత్నములచే విభూషితమై బంగారువర్ణముగల్గిన యా శిలలను సుందరులు శిఖరములను పురుషుల కభిసారికలై యొప్పుచుండె. మఱియు నాపర్వతముపై ఫలభారముచే నమ్రములగు వృక్షములుండెను. రత్నమయ సరోవరములనుండి సెలయేళ్లధారలు ప్రవహించుచుండెను. ఆమ్రవృక్షశాఖలనుండి రాలిన పుష్పములచే దట్టమై దిక్తటములందు వికసించిన అంకోల, పున్నాగ, నీలకమల పుష్పములుగల్గి యా పర్వతము శోభించుచుండె.

లతావితానఛన్నార్కే రత్నాంశుభరభాస్వరే
స్రవజ్జమ్బూరసస్యూతే స్వర్లోకాహ్లాదకారిణి. 19
బ్రహ్మలోకసమః స్వర్గరమ్యః శివపురోపమః
అత్రేరస్త్యాశ్రమః శ్రీమాన్సిద్ధశ్రమహరో మహాన్. 20

అచ్చోటగల లతాజాలంబులచే సూర్యుడు గప్పవడె. రత్నకిరణములచే ప్రకాశవంతమై, ప్రవహించుచున్న జంబూఫలరసముచే వ్యాప్తమై, స్వర్గలోకమువలె యానందప్రదమైనట్టి ఆపర్వతయుత్తర శిఖరమున బ్రహ్మలోకసదృశమును స్వర్గమువలె సుందరమును, కైలాసతుల్యమును, ధనధాన్యప్రపూర్ణమును, సిద్ధుల శ్రమాపహారకమును, విశాలమునునగు అత్రిమహాముని ఆశ్రమముగలదు.

మహత్యత్రాశ్రమే తస్మింస్తాపసౌ ద్వౌ బభూవతుః
కోవిదౌ తు నభోమార్గ ఇవ శుక్రబృహస్పతీ. 21

మహత్తరమగునా యాశ్రమమున, విద్వాంసులును, ఆకాశమార్గముననున్న శుక్ర బృహస్పతులవలె చెన్నొందువారునగు యిరువురు తాపసులు వసించుచుండిరి,



తయోరథైకాస్పదయోస్తత్రాభూతాం సుతావుభౌ
ఫుల్లాఙ్కురౌ శుద్ధతనూ సరస్యమ్బుజయోరివ. 22

ఆపిమ్మట, ఒకే యాశ్రమమున వసించునా యిర్వురు తాపసులకును, కమలద్వయంబుల కంకురములవలె యిర్వురు పుత్రులు జనించిరి.

విలాసభాసనామానౌ వృద్ధిమాయయతుః క్రమాత్
తౌ పిత్రోః పల్లవే దీర్ఘే లతాపాదపయోరివ. 23

లతాపల్లవములు వృద్ధిఁబొందునట్లు విలాస, భాసులను ఆయిరువురు పుత్రులును తమతమ తండ్రి నెలవులందు వృద్ధిఁబొందిరి.

ఆస్తామన్యోన్యసుస్నిగ్ధౌ సుహృదౌ వల్లభౌ మిథః
తిలతైలవదాశ్లిష్టౌ తౌ పుష్పామోదవత్స్థితౌ. 24

వారిద్దరును తిలతైలములవలెను, పుష్పసుగంధములవలెను పరస్పరము కూడియేయుండి ఒకరికొకరు ప్రియమిత్రులై యుండిరి.

నాఽయుక్తౌ పుత్రయుక్తౌ తు సురక్తావివ దంపతీ
ఏకం ద్విత్వమివాపన్నం సమమాసీత్తయోర్మనః. 25

ఆ యిర్వురు పుత్రులును సదా కూడియే వర్తించుచు పుత్రునియెడ తల్లిదండ్రులవలె, పరస్పరము ప్రేమగల్గియుండిరి. మఱియు నొకటియే రెండు రూపముల బొందినదాయనునట్లు వారిద్దఱి మనంబులును సమముగ నుండెను.

తౌ తథాన్యోన్యముదితౌ మనోహరతరాకృతీ
తస్థతుః స్వాశ్రమే మానే సరోజ ఇవ షట్పదౌ 26

వారిరువురు పరస్పరము సంతోషముగల్గి, మనోహరాకృతి ధరించి కమలమున భ్రమరద్వయమువలె ఆమునియాశ్రమమున నుండిరి.

ప్రాపతుర్యౌవనం బాల్యముత్సృజ్య నవవల్లభౌ
కాలేనాల్పతరేణైవ చన్ద్రసూర్యావివోదితౌ. 27

వారల్పకాలముననే బాల్యావస్థను వీడి, ఉదయించిన చంద్రసూర్యులవలె యౌవనావస్థను బొందిరి.

జగ్మతుర్దేహముత్సృజ్య తతస్తౌ పితరౌ తయోః
స్వర్గం జరార్తావుడ్డీయ నీడాదివ విహంగమౌ. 28

ఆపిమ్మట వార్ధక్యముచే పీడితులైన వారిర్వురి తండ్రులును, గూటిని వదలి పక్షి యెగిరిపోవు చందమున దేహమును త్యజించి స్వర్గమునకు జనిరి.

పఞ్చత్వం గతయోః పిత్రోర్దీనవక్త్రౌ బభూవతుః
తత్ప్రాజ్ఞౌ విగతోత్సాహౌ పద్మావివ జలోద్ధృతౌ. 29

అట్లు తమ తండ్రులు మరణింప, జలమునుండి పెరికివేయబడిన కమలమువలె వారిద్దఱును సంతప్తశరీరులును, ఉత్సాహరహితులును దీనముఖులును నైరి.

త్రత్రౌర్ధ్వదైహికం కృత్వా చక్రాతే పరిదేవనమ్
లోకస్థితిరలఙ్ఘ్యా హి మహతామపి మానద. 30

మాననీయుఁడవగు నోరామా! అచ్చోట తమతండ్రుల దహనక్రియాదులసల్పి వారిర్వురును విలపించిరి. ఏలన, లోకరీతిని మహాత్ములుకూడ యుల్లంఘింపరాదు గదా!

కృత్వౌర్ధ్వదైహికమథో వ్యథయాభిభూతౌ
శోకోత్థయా కరుణయార్తగిరా విలప్య,
చిత్రార్పితావివ నిరస్తసమస్తచేష్టౌ
తౌ సంస్థితౌ సుఖమశూన్యహృదౌ వివృత్తౌ. 31

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే భాసవిలాసవృత్తాన్తే సహ్యగిరివర్ణనం
నామ పఞ్చషష్టితమః సర్గః ॥ 65 ॥.

ఓరామా! ఆట్లౌర్ధ్వదైహిక్రియలను సల్పి, చింతాగ్రస్తులై, దుఃఖజనితమగు దీనత్వముచే పెద్దపెట్టునయేడ్చి, సర్వచేష్టారహితులై, లిఖితచిత్తరువులవోలె మూర్ఛితులై, జీవనసహితులై యుండిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
భాసవిలాసవృత్తాంతమున సహ్యగిరివర్ణమను పంచషష్టితమ
సర్గము ॥ 65 ॥

## షట్షష్టితమః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ .—

అతిశోకపరాభూతౌ తస్థతుర్దృఢతాపసౌ
తాపసంశుష్కసర్వాఙ్గౌ తావరణ్యద్రుమావివ. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! మిగుల శోకాన్వితులును, తపస్సుచే శుష్కించిన అవయవములు గలవారును, మహాతాపసులునగు వారిరువురును అరణ్యమందలి వృక్షములవోలె చలనములేకయుండిరి.

విరక్తౌ విపినే కాలం క్షేపయామాసతుర్ద్విజౌ
వియూథావివ సారఙ్గౌ వనాస్థామాగతౌ పరామ్. 2

పిదప యా బ్రాహ్మణు లిర్వురును వేఱై, ధనగృహాదులయెడ విరాగము నొంది సమూహమునుండి వేఱుపడిన మృగద్వయమువలె కాలమును గడపిరి.



జగ్ముర్దినాని మాసాశ్చ వర్షాణ్యథ తయోస్తదా
క్రమాద్ద్వావపి సంయాతౌ జరాం శ్వభ్రద్రుమావివ. 3

ఆ పిమ్మట వారిరువురకు దినములు, మాసములు, వత్సరములు పెక్కుగడచెను. తుదకు గర్తమందలి వృక్షమువలె వారు వార్ధక్యము నొందిరి.

అప్రాప్తవిమలజ్ఞానౌ చిరాజ్జర్జరతాపసౌ
తావేకదా సంఘటితావిదమన్యోన్యమూచతుః. 4

విమల జ్ఞానము నొందని యా వృద్ధతపస్వులిర్వురును చాలకాలమునకు మరల కలసికొని పరస్పర మిట్లు సంభాషించుకొనిరి.

విలాస ఉవాచ :—

జీవితాగ్ర్యద్రుమఫల హృదావాసామృతామ్బుధే
జగత్యస్మిన్మహాబన్ధో భాస స్వాగతమస్తు తే. 5

ఏతావత్యో దినావల్యో మద్వియోగవతా త్వయా
వద క్వ క్షపితాః సాధో కచ్చిత్తే సఫలం తపః. 6

కచ్చిత్తే విజ్వరా బుద్ధిః కచ్చిజ్జాతస్త్వమాత్మవాన్
కచ్చిత్ఫలితవిద్యస్త్వం కచ్చిత్కుశలవానసి. 7

విలాసుడు:—ఉత్కృష్టజీవితమను వృక్షముయొక్క ఫలస్వరూపుడవును, హృదయనివాసివగు చంద్రుడవును, ఈ జగత్తున యుత్తమ బంధువునగు మీకు స్వాగతమగు గాక! ఓ సాధూ! నావియోగమున యింతకాలము మీరెట్లు గడపిరి? మీ తపస్సు ఫలించినదా? మీ బుద్ధి సంతాపరహితమైనదా? మీరాత్మజ్ఞానులైతిరా? మీ విద్య ఫలీభూతమైనదా? మీరు క్షేమముగనున్నారా?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇత్యుక్తవన్తం సంసారసముద్విగ్నమలం తథా
ప్రాహాప్రాప్తమహాజ్ఞానం సుహృత్సుహృదమాదరాత్. 8

శ్రీ వసిష్ఠుడు:— సంసారముయెడ యుద్విగ్నుడును, ఆత్మజ్ఞానమును పొందనివాడును, యువ్విధమున వచించుచున్నవాడునగు విలాసునితో యాతని మిత్రుడగు భాసుడు స్పష్టరీతి యాదరమున నిట్లు బల్కెను.

భాస ఉవాచ :—

సాధోస్వాగతతాద్యైవ దిష్ట్యా దృష్టోఽసి మానద
కుశలం తు కుతోఽస్మాకం సంసారే తిష్ఠతామిహ. 9

భాసుడు:— మాననీయుఁడవగునో సాధూ! మీకు స్వాగతమగుగాక! సౌభాగ్యవశమున నేడు మీదర్శన మబ్బె. సంసారమున నున్న మాకిక క్షేమమెచట.

యావన్నాధిగతం జ్ఞేయం యావత్క్షీణా న చిత్తభూః
యావత్తీర్ణో న సంసారస్తావన్మే కుశలం కుతః. 10

జ్ఞేయము (బ్రహ్మము) తెలియంగనంత వఱకు, కామ సంకల్పాదులు నశింపనంతవఱకు, సంసారసముద్రమును దాటనంతవఱకు నాకు క్షేమమెచట ?

ఆశా యావదశేషేణ న లూనాశ్చిత్తసంభవాః
వీరుధో దాత్రకేణేవ తావన్నః కుశలం కుతః. 11

గొడ్డలిచే వృక్షము నఱుకబడునట్లు చిత్తమునుండి జనించు ఆశలన్నియు ఛేదింపబడనంతవఱకు మాకు సౌఖ్యమెచట ?

యావన్నాధిగతం జ్ఞానం యావన్న సమతోదితా
యావన్నాభ్యుదితో బోధస్తావన్నః కుశలం కుతః. 12

జ్ఞానము కలుగనంతవఱకు, సమత్వ ముదయింపనంతవఱకు, ఆత్మబోధము ప్రాప్తింపనంతవఱకు మాకు సౌఖ్యమనునదెచట ?

ఆత్మలాభం వినా సాధో వినా జ్ఞానమహౌషధమ్
ఉదేతి పునరేవేయం దుఃసంసృతివిషూచికా. 13

ఓ సాధూ! ఆత్మలాభమున్ను, జ్ఞానమను మహౌషధమున్ను లేనిచో యీ సంసారమను మహామారి మఱల మఱల యుదయించుచునేయుండును.

శైశవాఙ్కురితోజ్జృమ్భాచ్ఛన్నవయౌవనపల్లవః
జరాకుసుమితోఽభ్యేతి పునః సంసారదుర్ద్రుమః. 14

మిత్రమా ! బాల్యమను యంకురము నతిక్రమించి, నవయౌవనమను పల్లవసహితమై, వార్ధక్యమను పుష్పములుగల్గి, ఈ సంసారవృక్షము మఱల జనించుచున్నది.

కాయజీర్ణతరోరస్మాద్బాన్ధవాక్రన్దషట్పదా
జరాకుసుమితోదేతి పునర్మరణమఞ్జరీ. 15

బాంధవరోదనమను తుమ్మెదలును, వార్ధక్యమను పుష్పములును గల మరణమను లత యీ శరీరమను శిథిలవృక్షమునుండి మఱల యుద్భవించుచున్నది.

భుక్తకర్మర్తువిరసా పురాణదివసోజ్ఝితా
నీయతే నీరసప్రాయా పునః సంవత్సరావలీ. 16

మరణానంతరము పశ్వాది నీచయోనులందు జనించి పాపకర్మ ననుభవించుటచే విరసమై, స్వర్గాదులఁ బొంది పూర్వసంచిత పుణ్యకర్మల యనుభవమాత్రముచే నీరసప్రాయమై మఱల యనేక వత్సరములు వ్యర్థముగ గడుపబడుచున్నవి.

మహాదరీషు దేహాద్రేస్తృష్ణాకణ్టకితాస్వపి
ఫలవ్యాలాసు చ పునః క్రియాసు పరిలుఠ్యతే. 17



విషయభోగఫలములను సర్పములను, తృష్ణయను ముళ్ళ-కంటకములును గల యీ దేహమను పర్వతముయొక్క, ఐహిక పారలౌకిక విషయభోగసాధకక్రియలను గుహలందు జీవులు మఱల మఱల పొరలుచున్నారు.

దుఃఖైః సుఖలవాకారైర్దీర్ఘాదీర్ఘైః శుభాశుభైః
అపర్యాప్తాగమాపాయాః ప్రయాన్త్యాయాన్తి రాత్రయః. 18

సుఖలేశము భాసించు న్యూనాధిక దుఃఖములచేతను, శుభాశుభ (పుణ్యపాప) ములచేతను, సదా యుత్పత్తివినాశయుతమగు రాత్రులు (కాలము) గడచుచు, మఱల వచ్చుచునున్నవి.

అయథార్థక్రియారమ్భైః కదాశావేశపల్లవైః
క్షీయతే కర్మభిస్తుచ్ఛైరాయురాహతకర్మభిః. 19

మిథ్యాక్రియలను ఫలములును, దురాశలను పత్రములును గల కర్మలచే, మిథ్యాక్రియాకారకులగు జీవులు తమ ఆయువును నశింపజేసికొనుచున్నారు.

ఉన్మీలితాశ్రయాలానో మనోమత్తమతఙ్గజః
తృష్ణాకరేణుకోన్నిద్రో దూరం విపరిధావతి. 20

పరమాత్మయను ఆశ్రయస్థానమందలి వివేకమను కట్టుకంబమును పెకలించునదియు, తృష్ణయను కరిణియెడ ఆసక్తి గలదగుటచే నిద్రాశూన్యమును నగు మనస్సను మదపుటేనుగ దూరముగ పరిగిడుచున్నది.

జిహ్వాచపలతాలగ్నః కాయద్రుమమహాలయే
పతచ్ఛిన్నాత్మమణౌ వృద్ధో గర్ధగృధ్రో వివర్ధతే. 21

పరమపురుషార్థోపాయంబుల వ్యర్థముగ పడగొట్టునదియు, శరీరమను వృక్షమున హృదయమను గూటియందున్నదియు, జిహ్వాచాపల్యతత్పరయునగు అభిలాషయను గృధ్రము వృద్ధినొందుచున్నది.

నీరసా నిఃసుఖా లఘ్వీ పతత్పేలవగాత్రికా
జీర్ణపర్ణసవర్ణేయం క్షీయతే దివసావలీ. 22

నిష్ఫలక్రియలచే నీరసమును, సుఖరహితమును, అల్పమును, శ్రమ, దౌర్బల్య, రోగాదులచే క్షీణించిన పత్రములు గలదియునగు దినసమూహము (దేహలత) నశించుచునేయున్నది.

అవమానరజోధ్వస్తమస్తంగతవపుఃశ్రియమ్
ముఖం ధూసరతామేతి హిమైః పద్మమివాహతమ్. 23

పుత్రాదుల యవమానమను రజోగుణముచే గొట్టబడి, నశించిన కాంతిగలదై, మంచుచే క్షయింపబడిన కమలమువలె ముఖము ధూసరితమగుచున్నది.

శుష్యతః కాయసరసః ప్రగలద్యౌవనామ్భసః
రాజహంసః క్షణాదాయురనివర్తి పలాయతే. 24

యౌవనమను జలము నశింప శుష్కదేహమను తటాకమునుండి ఆయువను రాజహంసములు తిరిగిరాక యెచటికో పారిపోవుచున్నది.

కాలానిలబలోద్ధూతాజ్జర్జరాజ్జీవితద్రుమాత్
భోగపుష్పాణి దివసపర్ణాని నిపతన్త్యధః. 25

కాలమను వాయువుచే కంపితమును, శుష్కించినదియునగు జీవనవృక్షమునుండి భోగములను పుష్పములును, దివసములను పత్రములును రాలిపోవుచున్నవి.

భోగభోగిశ్రితేష్వన్తర్దుఃఖదర్దురధారిషు
మనో మోహాన్ధకూపేషు పూరేషు వినిమజ్జతి. 26

భోగములను సర్పములచే పూర్ణమై, అంతర్దుఃఖములను మండూకములచే వ్యాప్తమైనట్టి మోహాంధకూపప్రవాహములందీ మనస్సు నిమగ్నమగుచున్నది.

నానానురఞ్జనాస్పృష్టా తృష్ణాతరలపేలవా
చైత్యమగ్రపతాకేవ దూరం సమధిరోహతి. 27

పలువిధ యనురాగములచే పూర్ణమును, చంచలమును, తుచ్ఛమునగు తృష్ణ దేవాలయాగ్రభాగమునందలి పతాకమువలె పైకెగయుచున్నది.

అస్య సంసారతన్తోస్య బృహత్కాలబిలాస్పదః
జీవితాశామయం తన్తుమన్తకాఖుర్నికృన్తతి. 28

ఈ సంసారమను మగ్గముయొక్క జీవితాశయను దారమును మహాకాలమను బిలమున నున్న మృత్యువను యెలుక కొఱికివేయుచున్నది.

యౌవనోత్కటకల్లోలా వహల్లోలాసిఫేనిలా
పరావర్తమహావర్తా యాతి జీవితదుర్నదీ. 29

యౌవనోత్సాహతరంగసహితమును, ప్రవాహిత చంచలఖడ్గసమూహసదృశమును, కామక్రోధాది ఫేనసంయుక్తమును, తృష్ణాలోభాది భ్రమణయుక్తయావర్తసహితమునగు జీవితమను దుష్టనది ప్రవహించుచు నేయున్నది.

కలాకులజగత్కార్యకల్లోలాకులసంకులా
క్రియాసరిదపర్యన్తా వహత్యాకులకోటరా. 30

శిల్ప, నృత్యాది కళాసమూహము, జగద్వ్యవహారము అను తరంగములచే పూర్ణమై కల్లోలయుతమైనట్టి ప్రవృత్తియను గొప్పనది ప్రవహించుచున్నది.

అనన్తా బన్ధుజనతా నద్యో గమ్భీరకోటరే
అజస్రం నిపతన్త్యేతా వితతే కాలసాగరే. 31

అసంఖ్య బంధుజనసమూహములను నదులు గంభీరమై, విశాలమైనట్టి కాలసాగరమువైపునకు నిరంతరము ప్రవహించుచున్నవి.

దేహరత్నశలాకేయం నాశపఙ్కార్ణవోదరే
న జ్ఞాయతే క్వ మగ్నేతి తాత జన్మని జన్మని. 32



ఈ దేహమను రత్నశలాక నాశమను పంకసముద్రమున యెటనో ప్రతిజన్మయందును మునుంగుచు నున్నది.

చిన్తాచక్రే చిరం బద్ధం కుక్రియాచారచఞ్చురమ్
చేతో భ్రమతి సాముద్రే గర్తావర్తే తృణం యథా. 33

చింతాచక్రమున చిరకాలము బంధింపబడినదియు, దుష్టక్రియాచారంబులచే ప్రసిద్ధమునగు చిత్తము గర్తమందలి యావర్తమునగల తృణమువలె పరిభ్రమించుచున్నది.

ఉహ్యమానమనన్తేషు చేతః కార్యమహోర్మిషు
క్షణమేతి న విశ్రాన్తిం చిన్తాతాణ్డవితాశయమ్. 34

అనంతకార్యసముదాయమను మహాతరంగములందు, చింతయను తాండవనృత్యసహితమై ప్రవహించుచు చిత్తము క్షణకాలమైనను విశ్రాంతినొందుటలేదు.

ఇదం కృతం కరోమీదం కరిష్యామీదమిత్యలమ్
కలనాజాలవలితా మూర్ఛితా మతిపక్షిణీ. 35

'దీనిని చేసితిని, ఇది చేయుచున్నాను, దీనిని లెస్సగ చేయుదును' ఇట్టి చింతాసమూహమును వలయందు బంధింపబడి బుద్ధియను పక్షి మూర్ఛనొందుచున్నది.

అయం సుహృదయం శత్రురితి ద్వన్ద్వమహాద్విపః
వినికృన్తతి మర్మాణి యథా నీలోత్పలాని మే. 36

'ఈతడు మిత్రుడు, ఈతడు శత్రువు' అనునీ ద్వంద్వరూప మహాగజము నీలకమలమును వోలె నామర్మస్థానములను ఛేదించుచున్నది.

చిన్తానద్యా మహావర్తే వీచికానిచయే చిరమ్
క్షణాదుహ్యానతామేతి మనోమీనః క్షణాద్గతిః. 37

చింతానదీతరంగజాలమను మహావర్తమున, అతిచపలమగు మనస్సను మత్స్యము క్షణములో వృద్ధినొందుచున్నది.

అనాత్మీయాని దుఃఖాని బహూన్యేవంవిధాన్యయమ్
ఆత్మబుద్ధ్యా విచిన్వానో జనో గచ్ఛతి దీనతామ్. 38

ఇవ్విధమున, దేహాదులందలి యాత్మబుద్ధిచే అనాత్మరూపములగు పెక్కు దుఃఖముల నేకరించుచు జీవుడు దీనత్వము నొందుచున్నాడు.

బహువిధసుఖదుఃఖమధ్యపాతీ
వితతజరామరణప్రవాతభగ్నః
జగదుదరగిరౌ లుఠజ్జనోఽయం
గతరసపర్ణవదేతి జర్జరత్వమ్. 39

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే భాసవిలాసవృత్తాన్తే అనిత్యతాప్రతిపాదనం నామ షట్షష్టితమః సర్గః ॥ 66 ॥

పలువిధ సుఖదుఃఖములందు పడి, జరామరణములను వాయువుచే గొట్టబడి, జగత్తను పర్వతముపై పొర్లుచు యీ జనులు రసశూన్యమగు శుష్కపత్రమువలె శైథిల్యము నొందుచున్నారు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
భాసవిలాసవృత్తాంతమున అనిత్యతాప్రతిపాదనమను
షట్షష్టితమ సర్గము ॥ 66 ॥

---

## సప్తషష్టితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవం తౌ కుశలప్రశ్నం కృతవన్తౌ పరస్పరమ్
కాలేనాసాద్య విమలం జ్ఞానం మోక్షం తతో గతౌ. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! ఇట్లు వారిద్దరు పరస్పరము కుశలప్రశ్నలొనర్చుకొని, కాలక్రమమున నిర్మలజ్ఞానమునొంది ముక్తిఁబడసిరి.

తతో వచ్మి మహాబాహో యథా జ్ఞానేతరా గతిః
నాస్తి సంసారతరణే పాశబద్ధస్య చేతసః. 2

మహాబాహుఁడవగు నోరామా! ఇక్కారణమున పాశమువలె బంధనహేతువగు చిత్తము, సంసారసాగరమును దాటవలెనన్న జ్ఞానముతప్ప మఱిగతియును లేదు.

ఇదం భవ్యమతేర్దుఃఖమనన్తమపి పేలవమ్
సుఖగస్యేతరోఽమ్భోధిః సర్పారేర్గోష్పదాయతే. 3

సముద్రము చిన్నపక్షిచే దాటుటకశక్యమైనను, గరుడపక్షికయ్యది గోష్పదతుల్యమేయగు నట్లు, ఈ సంసారదుఃఖము అనంతమైనను వివేకికి అత్యల్పమే యగును.

దేహాతీతా మహాత్మానశ్చిన్మాత్రస్వాత్మని స్థితాః
దూరాద్దేహం సమీక్షన్తే ప్రేక్షకో జనతామివ. 4

ప్రేక్షకుడు జనసమూహమును వీక్షించునట్లు దేహాతీతులును, చిన్మాత్రమందు స్థితి గలవారునునగు మహాత్ములు, దూరమునుండియే యీ శరీరమును గాంచుదురు.

దేహే దుఃఖాతిసంక్షుబ్ధే కా నః క్షతిరుపస్థితా
రథే విధురితే భగ్నే సారథేః కేవ ఖణ్డనా. 5

దేహ మత్యంతసంక్షోభముఁజెందినను చిన్మాత్రస్వరూపులగు మనకేమి నాశము? రథము విరిగిన, సారథికేమి హాని?

మనసి క్షుభ్ధతాం యాతే చిత్త్వస్యాఙ్గం కిమాగతమ్
తరఙ్గజాలసంతానే వైపరీత్యం కిమమ్బుధేః. 6



మనస్సు సంక్షుభితమైన, చైతన్యమునకేమి నష్టము? తరంగరూపమున జలము విస్తరింప, సముద్రముయొక్క పూర్ణత్వమునకేమి హాని?

కేఽభవన్పయసాం హంసాః పయసాముపలాశ్చ కే
కాః శిలాః కిల దారూణాం కే భోగాః పరమాత్మనః. 7

హంస, శిలలతో జలమునకేమి సంబంధము? లేక, కాష్ఠమునకు శిలతోనేమి సంబంధము? అట్లనే పరమాత్మకు భోగములతోనేమి సంబంధము?

సంబన్ధః క ఇవ శ్రీమాన్ శైలాపరసముద్రయోః
అన్తరే గిరిసంబాధే కశ్చ చిత్తత్వ బన్ధయోః. 8

శ్రీమంతుడవగు నోరామా! మధ్య మధ్య పర్వతములచే వ్యాప్తమైనను సముద్రమునకాపర్వతములతోనేమి సంబంధము? అట్లనే చైతన్యమునకును బంధనహేతువగు సంసారమునకును సంబంధమేమి?

అప్యుత్సఙ్గోహ్యమానాని పద్మాని సరిదమ్భసామ్
కాని నామ భవన్తీహ శరీరాణి తథాత్మనః. 9

తనయందు ధరించియున్నను జలమునకు కమలములతోనేమియు సంబంధములేనట్లు ఆత్మకున్న దేహములతోనేమియు సంబంధములేదు.

సంఘట్టాత్కాష్ఠపయసోర్యథోత్తుఙ్గాః కణాదయః
దేహాత్మనోః సమాయోగాత్తథైతాశ్చిత్తవృత్తయః. 10

కాష్ఠ, జల సంయోగముచే కాష్ఠకణము లున్నతములగునట్లు దేహాత్మల పరస్పర అభేద బుద్ధిచే సుఖదుఃఖాది చిత్తవృత్తులు వృద్ధియగును.

సంబన్ధాద్దారుపయసాం ప్రతిబిమ్బాని దారుణః
యథా పయసి లక్ష్యన్తే శరీరాణి తథాత్మని. 11

కాష్ఠజల సంబంధముచే, జలమున కాష్ఠప్రతిబింబములు గోచరించునట్లు ఆత్మయందు దేహములున్న గన్పట్టుచున్నవి.

యథా దర్పణవీచ్యాదౌ ప్రతిబిమ్బాని వస్తుతః
నాసత్యాని చ సత్యాని శరీరాణి తథాత్మనః. 12

దర్పణ, తరంగాదులందు గన్పట్టు ప్రతిబింబములు సత్యములుగాని, అసత్యములుగాని గాక అనిర్వచనీయములేయగునట్లు ఆత్మయందు శరీరములున్న అనిర్వచనీయరూపమున గలవు.

దారువార్యుపలాఃస్ఫోటే దుఃఖితా న యథా క్వచిత్
సంయుక్తేషు వియుక్తేషు న తథా పఞ్చసు క్షతిః. 13

ఛేదింపబడినను కాష్ఠ, శిలా, జలములు దుఃఖమునొందనట్లు, పృథివ్యాది పంచభూతములు దేహాదులరూపమున పరిణతములుగాగా నట్టివానికి చందనాదుల సంయోగముగల్గినను, పుత్రాదుల వియోగము గల్గినను హానిగలుగదు.

దారు సంశ్లేషితాత్తోయాత్కస్పశబ్దాదయో యథా
ప్రజాయన్తే తథైవాస్మాద్దేహాచ్చిత్పరిబోధితాత్. 14

కాష్ఠసంబంధముచే జలమున చలనత్వ, శబ్దాదులు గల్గునట్లు, చేతనసంబంధమాత్రముచే జ్ఞానమయమైనట్టి దేహమునుండి శబ్ద చలనాదిక్రియలు సంభవించుచున్నవి.

న శుద్ధజడయోరేతాః సంవిదశ్చిచ్ఛరీరయోః
ఏతా హ్యజ్ఞానమాత్రస్య తస్మిన్నష్టే చిదేవ నః. 15

సుఖదుఃఖాదివృత్తులు శుద్ధాత్మకు గాని, జడశరీరమునకుగాని కలుగవు. అజ్ఞానమువలో గల్గును. అయ్యజ్ఞానము నశింప మనము చిన్మాత్రులముగనే శేషింతుము.

యథా న కస్యచిద్వారిదారుశ్లేషేఽనుభూతయః
తథా న కస్యచిద్దేహదేహిసఙ్గేఽనుభూతయః. 16

కాష్ఠ, జలముల సంయోగమందు యెద్దానికిని సుఖదుఃఖానుభవము లేనట్లు దేహ, దేహాభిమానుల సంయోగమున యేరికిని యథార్థముగ సుఖదుఃఖానుభవము లేదు.

అజ్ఞస్యాయం యథా దృష్టః సంసారః సత్యతాం గతః
న జ్ఞస్యాయం యథాభూతః సంసారః సత్యతాం గతః. 17

అజ్ఞుని దృష్టియందీ ప్రపంచము సత్యముగాను, జ్ఞానిదృష్టియం దసత్యముగాను నుండును.

అన్తఃసఙ్గవిహీనాస్తు యథాస్నేహా దృషజ్జలే
తథాసక్తమనోవృత్తౌ బాహ్యభోగానుభూతయః. 18

శిలా, జలములకు అభ్యంతరసంయోగము కలుగక బాహ్యసంయోగము మాత్రము కలుగునట్లు, ఆసక్తిరహితమై అభిమానశూన్యమైనట్టి మనోవృత్తిచే జ్ఞానికి బాహ్యవిషయములం గూర్చిన సుఖదుఃఖానుభవము కలుగును.

అన్తఃసఙ్గేన రహితో యద్వత్సలిలకాష్ఠయోః
సంబన్ధస్తద్వదేవాన్తరసఙ్గో దేహదేహినోః. 19
అన్తఃసఙ్గేన రహితః సంబన్ధో జలకాష్ఠయోః
స దేహదేహినోశ్చైవం ప్రతిబిమ్బామ్బసోస్తథా. 20

జల, కాష్ఠములకు అభ్యంతర సంయోగములేనట్లు దేహాత్మలకును లేదు. మఱియు జల, ప్రతిబింబములకువలె దేహాత్మలకు తాదాత్మ్యసంబంధమును లేదు.

స్థితా సర్వత్ర సంవిత్తిః శుద్ధా సంవేద్యవర్జితా
ద్వితోవ్పలాఞ్ఛితా త్వన్యా దుఃసంవిత్తిర్న విద్యతే. 21

విషయవర్జితమగు శుద్ధజ్ఞాన మంతటనుగలదు. ద్వైతభావముచే కళంకితమగు తదితర జ్ఞానము సత్యమైనది కాదు.

అదుఃఖమేతి దుఃఖత్వమన్తః సంవేదనాస్ఫుటమ్
స్ఫారో భవతి వేతాలో వేతాలత్వేన భావితః. 22



బేతాలరూపమున భావించుటచే విశాలమగు బేతాలమేయగునట్లు దుఃఖరహితమగు ఆత్మ అంతఃకరణమున దుఃఖభావన యొనర్చుటచే దుఃఖమునే పొందుచున్నది.

అసంబన్ధోఽపి సంబన్ధో భవత్యన్తర్వినిశ్చయాత్
స్వప్నాఙ్గనాసురతవత్స్థాణువేతాలసఙ్గవత్. 23

స్వప్నస్త్రీసురత, స్థాణుబేతాలసంగమములవలె, సంబంధములేకున్నను అంతఃకరణము యొక్క నిశ్చయముచే సంబంధ మేర్పడుచున్నది.

అసత్ప్రాయో హి సంబన్ధో యథా సలిలకాష్ఠయోః
తథైవ మిథ్యాసంబన్ధః శరీరపరమాత్మనోః. 24

జల, కాష్ఠముల సంబంధ మసత్ప్రాయమే యగునట్లు దేహాత్మల సంబంధమున్ను మిథ్యయే యగును.

అన్తఃసఙ్గం వినా నామ్బు కాష్ఠపాతైః ప్రగృహ్యతే
ఆత్మాఽఙ్గసఙ్గరహితో దేహదుఃఖైర్న దహ్యతే. 25

అభ్యంతర సంబంధము లేనందున కాష్ఠము జలమందు పడినను జలమునకు బాధలేనట్లు, దేహాధ్యాసము లేని ఆత్మయు దుఃఖములచే బాధింపబడదు.

దేహభావనయైవాత్మా దేహదుఃఖవశే స్థితః
తత్త్యాగేన తతో ముక్తో భవతీతి విదుర్బుధాః. 26

దేహభావన చేతనే ఆత్మ దేహదుఃఖమును పొందుచున్నదనియు దానిని త్యజించిన నయ్యది ముక్తినొందుననియు విజ్ఞుల మతము.

అన్తఃసఙ్గవిహీనత్వాద్దుఃఖవన్త్యఙ్గనో యథా
పత్రామ్బుమలదారూణి శ్లిష్టాన్యపి పరస్పరమ్. 27
అన్తఃసఙ్గేన రహితా యాన్తి నిర్దుఃఖతాం పరామ్
శ్లిష్టాన్యపి తథైవాత్మదేహేన్ద్రియమనాంస్యలమ్. 28

తటాకమున పడినట్టి పత్ర, జల, మల, కాష్ఠాదులు పరస్పరము కూడియున్నను అంతఃకరణ సంబంధము లేనందున దుఃఖరహితమై యున్నట్లు, పరస్పరము కలసియున్నను అంతఃకరణ సంబంధాభావముచే దేహేంద్రియాత్మమనంబులును దుఃఖరాహిత్యము నొందుచున్నవి.

అన్తఃసఙ్గో హి సంసారే సర్వేషాం రామ దేహినామ్
జరామరణమోహానాం తరూణాం బీజకారణమ్. 29

ఓ రామా! వృక్షములకు కారణము బీజమేయగునట్లు, ఈ ప్రపంచమున సర్వప్రాణులకును అంతఃకరణసంగమే జరామరణమోహంబులకు కారణమగుచున్నది.

అన్తఃసంసఙ్గవాఞ్జన్తుర్మగ్నః సంసారసాగరే
అన్తఃసంసక్తిముక్తస్తు తీర్ణః సంసారసాగరాత్. 30

అంతఃసంగము గల జీవుఁడీ సంసారసాగరమున మగ్నుఁడును, అంతఃసంగరహితుఁడు సంసారసాగరమును దాటినవాఁడును నగును.

అన్తఃసంసజ్గవచ్చిత్తం శతశాఖమివోచ్యతే
అన్తఃసంసజ్గరహితం విలీనం చిత్తముచ్యతే. 31

అంతఃసంగము గల చిత్తము అనన్తశాఖాయుతమనియు, అంతఃసంగరహితమగునది వినష్టమనియు వచింపబడును.

భగ్నస్ఫటికవద్విద్ధి మనః సక్తమపావనమ్
అభగ్నస్ఫటికాభాసమసక్తంవిద్ధి మే మనః. 32

ఓ రామా! విషయాసక్తమగు చిత్తమును భగ్నమైనస్ఫటికమణిలింగమువలె యపవిత్రముగను విషయాసక్తముకాని చిత్తమును భగ్నముకాని స్ఫటికమణిలింగమువలె పవిత్రముగను యెఱుంగుము.

అసక్తం నిర్మలం చిత్తం ముక్తం సంసార్యపి స్ఫుటమ్
సక్తం తు దీర్ఘతపసా యుక్తమప్యతిబన్ధవత్. 33

ఓ రామా! విషయాసక్తముకాని చిత్తము సంసారముననున్నను నిర్మలమైనదిగను, విముక్తముగను నెంచుము. అట్లనే విషయాసక్తమగు చిత్తము దీర్ఘతపస్సంయుతమైనను దృఢబంధనయుతమనియే యెఱుంగుము.

అన్తఃసక్తం మనో బద్ధం ముక్తం సక్తివివర్జితమ్
అన్తఃసంసక్తిరేవైకం కారణం బన్ధమోక్షయోః. 34

అంతఃసంసక్తియుతమగు మనస్సు బద్ధమును, అంతఃసంసక్తిరహితమగు మనస్సుముక్తమును యగును గాన అంతస్సంగమే బంధమోక్షములకు కారణమగును.

అన్తఃసంసక్తిముక్తస్య కుర్వతోఽపి న కర్తృతా
గుణదోషవతీ తోయే దారువాహననౌర్యథా. 35

కాష్ఠముల గొంపోవు నౌక యా కాష్ఠముల ఛేదన, భేదనాది గుణదోషములచే గాని, జలముయొక్క చలన, పరివర్తన, నిర్మలత్వాది గుణదోషములచేగాని కూడియుండనట్లు అంతఃసంగము లేనివానికి, కార్యము లాచరించుచున్నను కర్తృత్వముండదు.

అన్తఃసంసక్తితో జన్తోరకర్తురపి కర్తృతా
సుఖదుఃఖవతి స్వప్నే సంభ్రమోన్ముఖతా యథా. 36

సుఖదుఃఖాత్మకమగు స్వప్నమున వ్యాఘ్రాదుల భయముచే పరుగిడుట మున్నగు క్రియ లందు జీవుడు తత్పరుఁడగునట్లు, దేమియు నొనర్పకున్నను అంతఃసంగకారణమున జీవునకు కర్తృత్వము కలుగుచునేయున్నది.

చిత్తే కర్తరి కర్తృత్వమదేహస్యాపి విద్యతే
స్వప్నాదావివ విక్షుబ్ధసుఖదుఃఖదృశోపమమ్. 37

విక్షోభము నొందిన పురుషునకు స్వప్నాదులందువలె జాగ్రత్తునందును సుఖదుఃఖాదుల



యనుభవము గల్గునట్లు, చిత్తము కర్తయగుచో, దేహము తానేమియు యొనర్పకున్నను కర్తృత్వము గలదేయగును.

అకర్తరి మనస్యన్తరకర్తృత్వం స్ఫుటం భవేత్
శూన్యచిత్తో హి పురుషః కుర్వన్నపి న చేతతి. 38

మనస్సు కర్తగానిచో అకర్తృత్వము స్పష్టరీతి సంభవమగును. ఏలన, చిత్తరహితుడు క్రియలొనర్చుచున్నను అభిమానములేకయుండునుగదా!

చేతసా కృతమాప్నోషి చేతసా న కృతం తు న
న క్వచిత్కారణం దేహో న చ చిత్తేన కర్తృతా. 39

ఓ రామా! నీవు చిత్తముచే దేనిని జేసితివో దానినే పొందెదవుగాని చిత్తముచే చేయని దానిని పొందవు. ఏలయన, కర్తృత్వమున దేహము కారణముకాదు. మఱియు చిత్తమునకు కర్తృత్వము లేదనుటయు లేదు.

అసంసక్తమకర్తేవ కుర్వదేవ మనో విదుః
న కర్మఫలభోక్తృత్వమసక్తం ప్రతివిద్యతే. 40

సక్తముకాని మనస్సు క్రియలాచరించినను అకర్తయే యగును. అట్టి మనస్సు కర్మఫల భోక్తయు కానేరదు.

బ్రహ్మహత్యాశ్వమేధాభ్యామసంసక్తో న లిప్యతే
దూరస్థకాన్తసంలీనమనాః కార్యైరివాగ్రగైః. 41

దూరముననున్న స్త్రీయందు లగ్నమైన చిత్తముగలవాడు సమ్ముఖముననున్న శీతోష్ణానుభవాది కార్యములచే లిప్తుడు గానట్లు, అసంసక్తుడు బ్రహ్మహత్యాశ్వమేధముల పాపపుణ్యములచేతను లిప్తుడు గానేరడు.

అన్తఃసంసక్తినిర్ముక్తో జీవో మధురవృత్తిమాన్
బహిఃకుర్వన్నకుర్వన్వా కర్తా భోక్తా నహి క్వచిత్. 42

అంతఃకరణసంసక్తి లేని జీవుడు విక్షేపరహితమగు సుఖము నొందును. అతడు బాహ్యమున క్రియలాచరించినను, ఆచరింపకున్నను కర్తృత్వభోక్తృత్వము లెవ్వియు వానియందుండవు.

అన్తఃసంసక్తిముక్తం యన్మనః స్యాత్తదకర్తృకమ్
తద్విముక్తం ప్రశాన్తం తత్తద్యుక్తం తదలేపకమ్. 43

అంతఃసంగములేని మనస్సే అకర్తయగును. అదియే ముక్తమును, శాంతమును, యుక్తమును, నిర్లిప్తమునగును.

తస్మాత్సర్వపదార్థానాం శ్లిష్టానాం నిశ్చితం బహిః
సర్వదుఃఖకరీం క్రూరామన్తఃసక్తిం వివర్జయేత్. 44

ఇక్కారణమున సర్వపదార్థముల యాంతరముననున్న ఆత్మకు బాహ్యభూతమై, పరస్పరసమ్మిళితమైనట్టి పంచకోశ, భోగ్యవర్గాది బంధనహేతువులగు సమస్త పదార్థములను

నిరసించుటకొక యుపాయము గలదు. అది సర్వదుఃఖప్రదమగు అంతఃసంగమును త్యజించుటయే యగును.

విరహితమలమన్తః సఙ్గదోషేణ చేతః
శమముపగతమాద్యం వ్యోమవన్నిర్మలాభమ్,
సకలమలవిముక్తేనాత్మనైకత్వమేతి
స్థిరమణినిభమమ్భోవారిణీ వారినీలే. 45

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే అన్తఃసంసఙ్గవిచారో నామ సప్తషష్టితమః
సర్గః ॥ 67 ॥

స్ఫటికమణివలె స్వచ్ఛమైన శ్వేతజలము ఖడ్గమువలె, నీలమైన యమునానదీజలముచ మిళితమై యేకత్వము నొందునట్లు, అంతఃసంగదోషమేమియు లేనిదియు, సాంసారికదశనుండి తన పూర్వశాంతరూపమును బడసినదియు, ఆకాశమువలె సునిర్మలమునునగు చిత్తము, సదా ముక్తరూపమగు ఆత్మతోటి యైక్యమొందుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
అంతఃసంసఙ్గవిచారమను సప్తషష్టితమ
సర్గము ॥ 67 ॥

---

## అష్టషష్టితమః సర్గః

---

శ్రీరామ ఉవాచ:—

కీదృశో భగవన్సఙ్గః కథం బన్ధాయ వా నృణామ్
కశ్చ మోక్షాయ కథితః కథం వైష చికిత్స్యతే. 1

శ్రీరాముడు:—ఓ మహాత్మా! మనుజులకు సంగము బంధమెట్లు కలుగజేయును? మోక్షమెట్లు కలుగజేయును? మఱియు నది యెట్లు నివారింపబడును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

దేహదేహివిభాగైకపరిత్యాగేన భావనాత్
దేహమాత్రే తువిశ్వాసః సఙ్గో బన్ధార్హ ఉచ్యతే. 2

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! దేహదేహి (క్షేత్రక్షేత్రజ్ఞ) విభాగము నేమియు విచారింపనందున పరస్పరధర్మములఁ గూర్చిన విపరీతభావనచే దేహమాత్రముననే విశ్వాసము గల్గియుండుటయను సంసక్తి బంధార్హమని వచింపబడినది.

అనన్తస్యాత్మతత్త్వస్య స పర్యన్తత్వనిశ్చయే
యుక్తో [illegible] బన్ధార్హ ఉచ్యతే. 3



అనంతాత్మతత్త్వమును దేశకాల వస్తుపరిచ్ఛేదముచే నిశ్చయించి, అపరిచ్ఛిన్నసుఖస్వరూపమగు ఆత్మను విస్మరించి విషయ సుఖము కొఱకొనర్పబడు అభ్యంతరసంసక్తి బంధార్హమని యెన్నబడినది.

సర్వమాత్మేదమఖిలం కిం వాఞ్ఛామి త్యజామి కిమ్
ఇత్యసఙ్గస్థితిం విద్ధి జీవన్ముక్తతనుస్థితిమ్. 4

'ఇదంతయు ఆత్మయే కాన దేనిని కోరుదును? దేనిని త్యజింతు'నను యసంగస్థితియే జీవన్ముక్తుని శరీరస్థితియగును.

నాహమస్మి నచాన్యోఽస్తి మా భవన్తు భవన్తు వా
సుఖాన్యసక్త ఇత్యన్తః కథ్యతే ముక్తిభాఙ్నరః. 5

'పరిచ్ఛిన్నమగు అహంకారమునకు నేను విషయుఁడను కాను; నాకు భిన్నముగ యెద్దియును లేదు. కాన మిథ్యారూపములగు దేహాదులందు విషయసుఖములు కలుగుగాక, కలుగకుండును గాక, నేనుమాత్రము అసంగుడన'ను దృఢనిశ్చయమేమనుజుని యంతఃకరణమున గలుగునో అతడే ముక్తిభాజుఁడగును.

నాభినన్దతి నైష్కర్మ్యం న కర్మస్వనుషజ్జతే
సుసమో యః ఫలత్యాగీ సోఽసంసక్త ఇతి స్మృతః. 6

కర్మత్యాగమిచ్ఛగింపకయు, ఫలేచ్ఛచే కర్మలందు ప్రవేశింపకయు, ఫలము సిద్ధించినను, సిద్ధింపకున్నను సమభావము గల్గియుండువాడును, ఫలత్యాగియు అసంసక్తుఁడనబడును.

ఆత్మతత్త్వైకనిష్ఠస్య హర్షామర్షవశం మనః
యస్య నాయాత్యసక్తోఽసౌ జీవన్ముక్తః స కథ్యతే. 7

ఆత్మతత్వమాత్రమున నిష్ఠగల్గి, హర్ష శోకంబులకు వశముగాని మనస్సుగల యసంసక్తుడు జీవన్ముక్తుడని పేర్కొనబడును.

సర్వకర్మఫలాదీనాం మనసైవ న కర్మణా
నిపుణం యః పరిత్యాగీ సోఽసంసక్త ఇతి స్మృతః. 8

నేర్పుతో యెవఁడు సర్వకర్మఫలాదులను క్రియచేగాక మనంబుచేతనే త్యజించునో అతడసంసక్తుఁడని చెప్పబడును.

అసంసఙ్గేన సకలాశ్చేష్టా నానా విజృమ్భితాః
చికిత్సితా భవన్తీహ శ్రేయః సంపాదయన్తి చ. 9

అసంసక్తివలననే వివిధచేష్టలున్ను యడంగును. మఱియు శ్రవణ, మననాది సత్క్రియలున్ను నిర్విఘ్నముగ శ్రేయమొనగూర్చును.

సంసక్తివశతః సర్వే వితతా దుఃఖరాశయః
ప్రయాన్తి శతశాఖత్వం శ్వభ్రకణ్టకవృక్షవత్. 10

గర్తమందలి కంటకవృక్షమువలె సంసక్తివలననే దుఃఖరాశియంతయు విస్తరించి శతశాఖాయుతంబగును.

రజ్జుకృష్టఘనఘ్రాణో యద్గత్వా పథి గర్దభః
భారం వహతి భీతాత్మా తత్సంసక్తివిజృమ్భితమ్. 11

త్రాడుచే లాగఁబడుచు, ఘనమైన నాసికగల్గి, భారమును వహించునట్టి గార్దభము సంసక్తియొక్క ఫలమేయగును.

శీతవాతాతపక్లేశమేకదేశనిషణ్ణయా
తరుర్వ్యయతి యత్తన్వా తత్సంసక్తివిజృమ్భితమ్. 12

ఒకే ప్రదేశమునందుండి శీతవాతాతపంబుల సహించుచుండునట్టి వృక్షమున్ను సంసక్తియొక్క ఫలమేయగును.

ధరావివరనిర్మగ్నో యత్కీటః పీడితాఙ్గకః
క్షిణోతి వికలః కాలం తత్సంసక్తివిజృమ్భితమ్. 13

భూరంధ్రమునందున్నదై బాధిత శరీరముగల్గి వికలమై కాలము గడపునట్టి కీటమున్ను సంసక్తియొక్క ఫలవిస్తృతియేయగును.

క్షుత్క్షామకుక్షిః క్షపయత్యాయుర్వ్యాఘాతభీరుధీః
పక్షీ వృక్షశిఖాశాయీ తత్సంసక్తివిజృమ్భితమ్. 14

ఆకటిచే కృశించిన దేహముగల్గి బాణశిలాదుల ప్రహారముచే భయభీతమై వృక్షశాఖపై నిదురించుచు ఆయువును గడపుచుండునట్టి పక్షియు సంసక్తియొక్క ఫలస్వరూపమేయగును.

దూర్వాఙ్కురతృణాహారః కిరాతశరపీడయా
జహాతి యన్మృగో దేహం తత్సంసక్తివిజృమ్భితమ్. 15

తృణాంకురముల భక్షించుచు, కిరాతుని బాణవ్యథచే తనదేహమును త్యజించునట్టి లేడియు సంసక్తియొక్క ఫలమే యగును.

కృమికీటత్వమాయాన్తి జాయమానాః పునఃపునః
యదిమా జనతా జీర్ణాస్తత్సంసక్తివిజృమ్భితమ్. 16

పుణ్యపాపాధికారులగు జనులు, జీర్ణాంగులై మఱల మఱల జన్మించుచు, కృమికీటత్వాదుల నొందుటయు సంసక్తియొక్క ఫలవిస్తారమే యగును.

ఉత్పత్యోత్పత్య లీయన్తే తరఙ్గిణి తరఙ్గవత్
భూతాని యదనన్తాని తత్సంసక్తివిజృమ్భితమ్. 17

జలాశయమున తరంగమువలె అనంతప్రాణిసముదాయము మఱల మఱల యుత్పన్నమై నశించుచుండుటయు సంసక్తియొక్క ఫలమేయగును.

వీరుత్తృణదశాం యాతా మ్రియన్తే యత్పునఃపునః
నరా [illegible] సంసక్తివిజృమ్భితమ్. 18



తృణలతాది స్థావరరూపములఁ బొంది మఱల మఱల మృతినొందుచునున్న మనుజుల దుఃస్థితియు సంసక్తియొక్క ఫలవిస్తృతియే.

రసాతలరసాయోగాత్తృణగుల్మలతాదయః
జనయన్తి యదాకారం తత్సంసక్తివిజృమ్భితమ్. 19

భూతలమందలి జలమునుత్రావి యాకృతిని బడయునట్టి తృణగుల్మలతాదులున్ను సంసక్తియొక్క ఫలరూపములేయగును.

స్వానర్థాన్తరసంకాశపదార్థశతసంకులా
యత్సంసారనదీ మత్తా తత్సంసక్తివిజృమ్భితమ్. 20

పెక్కుయనర్థములతో కూడినదియు, బాహ్యాభ్యంతరపదార్థములచే వ్యాప్తమును, ప్రవర్ధమానంబునునగు యీ సంసారనది సంసక్తియొక్క ఫలరూపమేయగును.

సంసక్తిర్ద్వివిధా ప్రోక్తా వన్ద్యా వన్ధ్యా చ రాఘవ
వన్ధ్యా సర్వత్ర మూఢానాం వన్ద్యా తత్త్వవిదాం నిజా. 21

ఓ రామా! ఈ సంసక్తి రెండువిధములు. ఒకటి 'వంద్య' (ప్రశంసింపతగినది.) రెండవది 'వంధ్య' (పరమపురుషార్థఫలరహితమైనది). ఇందు వంధ్యసంసక్తి యజ్ఞులకున్ను వంద్య సంసక్తి ఆత్మజ్ఞానులకున్ను యంతటను గల్గియుండును.

ఆత్మతత్త్వావబోధేన హీనా దేహాదివస్తుజా
భూయః సంసారసక్తిర్యా దృఢా వన్ధ్యేతి కథ్యతే. 22
ఆత్మతత్త్వావబోధేన సత్యభూతవివేకజా
వన్ద్యా హి కథ్యతే సక్తిర్భూయః సంసారవర్జితా. 23

ఆత్మతత్వజ్ఞానరహితమును, దేహాదిజనితమునునగు సంసారదృఢాసక్తియే వంధ్యయనియు, ఆత్మతత్వావబోధముచేతను వివేకముచేతను జనించినదై సంసారవర్జితమైనది వంద్యయనియు పేర్కొనబడును.

శఙ్ఖచక్రగదాహస్తో దేవో వివిధయేహయా
వన్ద్యసంసక్తివశతః పరిపాతి జగత్త్రయమ్. 24
అనారతనిరాలమ్బం వ్యోమవర్త్మని పాన్థతామ్
వన్ద్యసంసక్తివశతః కరోతి రవిరన్వహమ్. 25
మహాకల్పసమాధాన చిరకల్పితకల్పనమ్
వన్ద్యసంసక్తివశతో బ్రాహ్మం స్ఫురతి వై వపుః. 26
లీలయా లలనాలానలీనం భూతివిభూషితమ్
వన్ద్యసంసక్తివశతః శరీరం శాంకరం స్థితమ్. 27
విజ్ఞానగతయః సిద్ధా లోకపాలాస్తథేతరే
వన్ద్యసంసక్తివశత స్తిష్ఠన్తి జగతోఽఙ్గణే. 28

ధత్తే శారీరయన్త్రౌఘమన్యా భువనసంతతిః
వన్ధ్యాసంసక్తివశతో జరామృతివివర్జితమ్. 29

వంధ్యాసంసక్తిప్రభావమువలననే శంఖచక్రగదాధరుఁడగు విష్ణువు వివిధక్రియలచే ముల్లోకంబుల పాలించుచున్నాఁడు. మఱియు నిరాలంబుఁడగు సూర్యభగవానుఁడును ప్రతిదిన మాకాశ మార్గమున నిరంతరము యాత్రయసల్పుచున్నాఁడు. ఈ వంధ్యాసంసక్తివశముననే మహాకల్పమున విదేహకైవల్యమున విశ్రాంతినొందునిమిత్తము ద్విపరార్ధాంతమువఱకు చిరకాలము సృష్టికల్పన యొనర్చిన బ్రహ్మశరీరము స్ఫురించుచున్నది. దీనిప్రతాపముచేతనే లీలామాత్రమున గౌరియను బంధమున యాసక్తుఁడును, విభూతిభూషితుఁడునగు యీశ్వరుని శరీరము స్థితిగల్గియున్నది. ఇద్దాని ప్రభావముననే బ్రహ్మమున దృఢప్రతిష్ఠగల సిద్ధలోకములున్ను, తదితర పాతాళాదిలోకములున్ను బ్రహ్మాండప్రాంగణమున సుస్థితములైయున్నవి. మఱియు, మహర్జనతపోలోకాదులు జరామరణ వర్జితంబులగు దేహయంత్రంబుల ధరించియున్నవి.

మనః పతతి భోగేషు గృధ్రో మాంసలవేష్వివ
వన్ధ్యాసంసక్తివశతో వ్యర్థయా రమ్యశఙ్కయా. 30

గ్రద్ధ మాంసకణములపై బడునట్లు వంధ్యాసంసక్తివశమున వ్యర్థ సౌందర్యభిలాషగల్గి మనస్సు భోగములందు పడుచున్నది.

సంసక్తివశతో వాతి వాయుర్భువనకోటరే
పఞ్చభూతాని తిష్ఠన్తి వహతీయం జగత్స్థితిః. 31
దివిదేవా భువి నరాః పాతాలే భోగినోఽసురాః
బ్రహ్మాణ్డోదుమ్బరఫలే స్ఫురన్మశకవత్స్థితాః. 32
జాయన్తే చ మ్రియన్తే చ నిపతన్త్యుత్పతన్తి చ
భూతాని యదనన్తాని తరఙ్గిణి తరఙ్గవత్. 33
ఉత్పత్యోత్పత్య లీయన్తే తత్సంసక్తివిజృమ్భితమ్
భూతాని విరసం భూయో నిర్ఝరామ్బుకణా ఇవ. 34
పరస్పరనిగీర్ణాఙ్గా జనతా జాడ్యజర్జరా
సంభ్రాన్తా ప్రభ్రమత్యఙ్గ శీర్ణపర్ణమివామ్బరే. 35
నక్షత్రచక్రం గగనే ద్రుమే మశకసంతతిః
స్ఫురత్యావర్తవృత్త్యైవ పాతాలేఽఙ్గ జలౌఘవత్ 36
పాతోత్పాతదశాజీర్ణం కాలబాలకకన్దుకమ్
అద్యాపి న జహాతీన్దుర్జలమామలినం వపుః. 37
నానాపారయుగావర్తదుఃఖాలోకనకర్కశమ్
న లునాతి మనఃఖణ్డం దుఃఖిగీర్వాణమణ్డలమ్. 38



సంసక్తివశముననే ప్రపంచమున వాయువు వీచుచున్నది; పంచభూతములు స్థితినొంది యున్నవి; జగత్తు ప్రవృత్తమగుచున్నది. సంసక్తిప్రభావముననే స్వర్గమున దేవతలు, భూమిపై మనుజులు, పాతాళమున సర్పములు, అసురులును యీ బ్రహ్మాండమను మేడిపండునందు దోమలవలె నసించుచున్నారు. ఈసంసక్తి విలాసముననే, జలాశయమున తరంగములవలె అనంతప్రాణికోట్లు యుత్పన్నమై, మరణించుచు, పడుచును, లేచుచునుయున్నవి. మఱియు విరసత్వముగల్గి, సెలయేటి కణములవలె విజృంభించి నశించుచున్నవి. ఈ సంసక్తివశముననే, మాత్స్యన్యాయప్రకార మొకరి నొకరు హింసించుకొనుచు జడత్వముచే జర్జరితమైన జనసమూహము ఆకాశమున శుష్కపత్రమువోలె పరిభ్రమించుచున్నది. మఱియు, వృక్షమున మశకసమూహమువలెను, పాతాళమున జలప్రవాహము వలెను, ఆవర్తరూపమున ఆకాశమందు నక్షత్రచక్రము, తిరుగాడుచున్నది. ఉదయాస్తమయ వృద్ధిక్షయాది దశలచే శిథిలమై, కాలమను బాలునకు బంతియగుచు, జడత్వమను కళంకముచే దూషితమైనను, ఇయ్యాసక్తిప్రభావముననే చంద్రుడు తనశరీరమును నేటికిని వీడకున్నాఁడు అనేక యుగపరివర్తనములందలి దుఃఖమునుగాంచుటచే కఠినమును, ఛేదింపయోగ్యమునునగు తన మనస్సను వ్రణమును ఇంద్రాదిదేవసమూహము తద్వ్రణ దుఃఖముచే దుఃఖితమైనను సంసక్తివశమున ఛేదింపకయే యున్నది.

వాసనామాత్రవశతః పరే వ్యోమని కేనచిత్
ఇదమారచితం చిత్రం విచిత్రం పశ్య రాఘవ. 39

ఓరామా! విచిత్ర చిత్రమువంటి యీ జగత్తును వాసనావశముననే చిదాకాశమున యెవరో లిఖించిరి.

మనఃసఙ్గైకరఙ్గేణ శూన్యే వ్యోమ్ని జగన్మయమ్
యదిదం రచితం చిత్రం తత్సత్యం న కదాచన. 40

మనఃసంసక్తియను రంగుచే శూన్యాకాశమున లిఖింపబడిన యీ జగచ్చిత్రము సత్యమెన్నటికిని కాదు.

సంసక్తమనసామస్మిన్సంసారే వ్యవహారిణామ్
అత్తి తృష్ణా శరీరాణి తృణాన్యగ్నిశిఖా యథా. 41

తృణముల నగ్నిశిఖ భక్షించునట్లు, ఈ సంసారమున యాసక్తచిత్తులై వ్యవహరించు జీవుల శరీరములను తృష్ణయు భక్షించుచున్నది.

పరిసక్తమతేర్దేహాన్సికతాః పత్యురమ్భసామ్
కః శక్తః పరిసంఖ్యాతుం త్రసరేణుగణం యథా. 42

సముద్రజలకణములనుగాని, త్రసరేణుసమూహమునుగాని లెక్కింపజాలనట్లు, విషయములందు లెస్సగ యాసక్తమైన బుద్ధిగలవానికి గల్గు దేహపరంపరల నెవరును లెక్కింపజాలరు.

ముక్తాలతాయా గఙ్గాయా మేరోరాపాదమస్తకమ్
తరఙ్గముక్తా గణ్యన్తే న దేహాః సక్తచేతసామ్. 43

మేరుపర్వత శిఖరమునుండి తత్పాదపర్యంతము ప్రవహించు గంగానది యను లతయొక్క తరంగములను, ముత్తెములను యెపుడైన లెక్కింప వీలగునుగాని, అసక్తచిత్తులకు గల్గు దేహముల లెక్కింప వీలుకాదు.

సంసక్తమనసామేతా రమ్యాన్తః పురపఙ్క్తయః
రచితా రౌరవా వీచికాలసూత్రాదినామికాః. 44

ఎవరి మనస్సు సంసారాసక్తమగునో, వారలకు అగ్ని, శస్త్రాదుల ప్రదీప్తిచే రమ్యము లగు రౌరవ, అవీచీ, కాలసూత్రాదినరకములను యంతఃపురములు నిర్మింపబడినవి.

సక్తచిత్తం జనం దుఃఖశుష్కమిన్ధనసంచయమ్
జ్వలతాం నరకాగ్నీనాం విద్ధి తేన జ్వలన్తి తే. 45

ఓ రామా! దుఃఖములచే శుష్కించు యాసక్తచిత్తుడు జ్వలించు నరకాగ్నులకు యెండు కట్టెలవంటివాడగును. వానిచే యా నరకాగ్నులు జ్వలించునని యెఱుంగుము.

దుఃఖజాలమిదం నామ యత్కించిజ్జగతీగతమ్
సంసక్తమనసామర్థే తత్సర్వం పరికల్పితమ్. 46

ఈ ప్రపంచమునగల దుఃఖజాలమంతయు ఆసక్తచిత్తులకొఱకే కల్పింపబడినది.

సంసక్తచిత్తమాయాన్తి సర్వా దుఃఖపరమ్పరాః
జలకల్లోలవలితా మహానద్య ఇవామ్బుధిమ్. 47

తరంగయుక్తములగు నదులు సముద్రము చెంతకు వచ్చునట్లు, ఆసక్తచిత్తుని యొద్దకు దుఃఖపరంపరలు వచ్చును.

మనః సంసర్గరూపిణ్యా భారభూతశరీరయా
క్షయోదయదశార్థిన్యా సర్వం తతమవిద్యయా. 48

మనఃసంగరూపమును, భారభూతమగు దేహమును ధరించునదియు, జీవునకు జనన మరణాదుల గల్గజేయునదియు నగు అవిద్య యీ దుఃఖసమూహమునంతయు విస్తరించెను.

అసంసఙ్గేన భోగానాం సర్వా రామ విభూతయః
పరం విస్తారమాయాన్తి ప్రావృషీవ మహాపగాః. 49

ఓ రామా! వర్షాకాలముచే మహానదులు విస్తీర్ణములగునట్లు, సంగాభావముచే విభూతు లన్నియు బాగుగ విస్తరించును.

అన్తఃసంసఙ్గమఙ్గానామఙ్గారం విద్ధి రాఘవ
అనన్తఃసఙ్గమఙ్గానాం విద్ధి రామ రసాయనమ్. 50

ఓ రామా! అంతఃసంసక్తియే అంగారమనియు అంతఃసంగపరిత్యాగమే అమృతమనియు యెఱుంగుము.

సంసఙ్గేనాన్తరస్థేన దహ్యతే ప్రకృతిః స్వయమ్
స్వకోటరోత్థే నైరకాఙ్క్షీ పావకేన యథౌషధిః 51



ఆలంబనము కొఱకు ఏిర (తృణవిశేష) వృక్షము నభిలషించు యోషధి తత్తృణంబులచే నావిర్భవించు యగ్నిచే దగ్ధమగునట్లు, అంతఃసంగముచే ప్రకృతిభూతుఁడగు జీవుడున్ను స్వయముగ దగ్ధుడగుచున్నాడు.

సర్వత్రాసక్తమాకాశాన్తమనస్తమివ సంస్థితమ్
అసత్కల్పం సదాభాసం సుఖాయైవ మనో భవేత్. 52

ఆసక్తి రహితమగు మనస్సు యెల్లెడల ప్రశాంతమై అనంతాకాశమువలె నుండును. అట్టిది లేనిదే యగుచు, ఉన్నదానివలె భాసించుచు సదా సుఖమునే గల్గించుచుండును.

విద్యాదృశి ప్రోదయమాగతేన
క్షయం త్వవిద్యావిషయే గతేన,
సర్వత్ర సంసక్తివివర్జితేన
స్వచేతసా తిష్ఠతి యః స ముక్తః. 53

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే సఙ్గవిచారయోగోపదేశో నామాష్టషష్టితమః
సర్గః ॥ 68 ॥

లెస్సగ నుదయించిన జ్ఞానదృష్టి గలదియు, విషయ వినాశముచే నశించిన యవిద్య గల దియు సంసక్తిరహితమును నగు చిత్తము గల్గియుండువాడే ముక్తుఁడనబడును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సంగవిచారయోగోపదేశమను అష్టషష్టితమ
సర్గము ॥ 68 ॥

---

## ఏకోనసప్తతితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సర్వదా సర్వసంస్థేన సర్వేణ సహ తిష్ఠతా
సర్వాకర్మ్తరతేనాపి మనః కార్యం విజానతా. 1

శ్రీ వసిష్ఠుడు:-ఓ రామా! సర్వదా సర్వవ్యవహారము లాచరించుచున్నను సర్వులలోఁ గూడియున్నను, అనిషిద్ధములైన లౌకిక, శాస్త్రీయ కర్మలందు తత్పరమైయున్నను, వివేక వంతుడు తన మనంబుని చెప్పబోవురీతి నియమన మొనర్పవలెను.

న సక్తమిహ చేష్టాసు న చిన్తాసు న వస్తుషు
నాకాశే నాప్యధో నాగ్రే న దిక్షు న లతాసు చ. 2
న బహిర్విపులాభోగే న చైవేన్ద్రియవృత్తిషు
నాభ్యన్తరే న చ ప్రాణే న మూర్ధని న తాలుని. 3

న భ్రూమధ్యే న నాసాన్తే న ముఖే న చ తారకే
నాన్ధకారే న చాభాసే న చాస్మిన్హృదయామ్బరే. 4
న జాగ్రతి న చ స్వప్నే న సుషుప్తే న నిర్మలే
నాసితే న చ వా పీతరక్తాదౌ శబలే న చ. 5
న చలే న స్థిరే నాదౌ న మధ్యే నేతరత్ర చ
న దూరే నాన్తికే నాగ్రే న పదార్థే న చాత్మని. 6
న శబ్దస్పర్శరూపేషు న మోహానన్దవృత్తిషు
న గమాగమచేష్టాసు న కాలకలనాసు చ. 7

సాధ్యవిషయంబులఁ గూర్చిన క్రియలందును, గతించినవాటి చింతనలయందును, వర్తమాన కాలిక పదార్థములందును, ఆకాశమందును, అధోభాగమునను, మధ్యభాగమునను, దిక్కులందును, లతలందును, బాహ్యములగు ఆధిభౌతిక పదార్థములందును, స్త్రీపుత్రాదులందును, ఇంద్రియవృత్తులందును, ఆధ్యాత్మికవస్తుసముదాయమునను, ప్రాణమందును, శిరమందును, తాలువునను, భ్రూమధ్యమునను, నాసికాగ్రమందును, ముఖమందును, కంటియందును, అంధకారమందును, ప్రకాశమందును, హృదయాకాశమునను, జాగ్రత్స్వప్నసుషుప్తులందును, సత్వరజస్తమోగుణములందును, గుణసమ్మేళనమందును, కార్యవర్గమునందును, కారణమగు అవ్యక్తమునను, సృష్టియొక్క ఆదిమధ్యాన్తములందును, దూరసమీపాగ్రభాగములందును, నామరూపాత్మక పదార్థసముదాయమునను, జీవునియందును, శబ్దస్పర్శరూపరసగంధములందును, ఆనందమోహాది వృత్తులందును, గమనాగమన, భూతభవిష్యజ్జ్ఞాన, చిరంజీవనాది సిద్ధులందును మనస్సు నాసక్తమొనర్పరాదు.

కేవలం చితి విశ్రమ్య కించిచ్చేత్యావలమ్బిని
సర్వత్ర నీరసమివ తిష్ఠత్వాత్మరసం మనః. 8

బుద్ధికి సాక్షియగు చిన్మాత్రమున విశ్రమించి, మనస్సు సర్వవిషయానందరహితమగు కేవల సచ్చిత్స్వరూపబ్రహ్మానందమున తత్పరమై యుండవలెను.

తత్రస్థో విగతాసఙ్గో జీవోఽజీవత్వమాగతః
వ్యవహారమిమం సర్వం మా కరోతు కరోతు వా. 9

బ్రహ్మమున స్థితుడై, సంగరహితమగు బ్రహ్మభావమును పొందిన జీవుడిక ప్రాపంచిక వ్యవహారములఁ జేయుగాక, లేక చేయకుండుగాక.

అకుర్వన్నపి కుర్వాణో జీవః స్వాత్మరతిః క్రియాః
క్రియాఫలైర్న సంబన్ధమాయాతి ఖమివామ్బుదైః. 10

జలబిందువులతో నాకసమునకు సంబంధములేనట్లు, ఆత్మరతుఁడగు జీవుడు క్రియలొనర్చుచున్నను, యొనర్పకున్నను తత్ఫలంబులతోటి సంబంధమేమియు లేకుండును.

అథవా తమపి త్యక్త్వా చేత్యాంశం శాన్తచిద్ఘనః
జీవస్తిష్ఠతు సంశాన్తో జ్వలన్మణిరివాత్మని. 11



లేక, బుద్ధియొక్క సాక్షిత్వమునుకూడ వదలి శాంతుడై, చిద్ఘనరూపుడై దేదీప్యమానమగుమణివలె జీవుడు స్వాత్మయందు స్థితుఁడగుగాక!

నిర్వాణమాత్మని గతః సతతోదితాత్మా
జీవోఽరుచిర్వ్యవహరన్నపి రామభద్ర,
నో సఙ్గమేతి గతసఙ్గతయా ఫలేన
కర్మోద్భవేన సహతీవ చ దేహభారమ్. 12

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే శాన్తిసమాయాతయోగోపదేశో నామైకోన
సప్తతితమః సర్గః ॥ 69 ॥

ప్రియుఁడవగు నో రామచంద్రా! క్రియాఫలేచ్ఛారహితుడును, ఆత్మయందు శాంతినొందినవాడును, నిరంతరాత్మోదయముగలవాడునునగు జీవుడు సంసక్తికారణమగు అవిద్యాకామవాసనాదులులేనందున క్రియలొనర్చుచున్నను తత్క్రియాఫలంబునొందక ప్రారబ్ధక్షయపర్యంతము దేహభారమును మాత్రము సహించుచుండును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు ఉపశమప్రకరణమున
శాంతిసమాయాతయోగోపదేశమను ఏకోనసప్తతితమ
సర్గము ॥ 69 ॥

---

సప్తతితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అసంసఙ్గసుఖాభ్యాససంస్థితైర్వీతతాత్మభిః
వ్యవహారిభిరప్యన్తర్వీతశోకభయైః స్థితమ్. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓరామా! నిత్యమసంసక్తిసుఖానుభవమగ్నులును, విశాలాంతఃకరణయుతులునునగు జీవులు వ్యవహరించుచున్నను భయశోకవర్జితులై యుందురు.

ప్రత్యబ్ధాక్షుబ్ధదేహస్యావిసంవాదేన సంవిదః
అన్తఃపూర్ణస్య వదనే శ్రీరిన్దోరివ లక్ష్యతే. 2

ప్రక్షోభకారణములగు ధననాశ, అవమానాదులందుకూడ క్షోభరహితుడును, పరమార్థసుఖముచే అంతఃకరణమున పూర్ణుడును నగువాని ముఖమున పూర్ణచంద్రుని శోభలక్షితమగుచుండును.

చేత్యహీనం చిదాలమ్బం మనో యస్య గతజ్వరమ్
తేనామ్బు కతకేనేవ జనతా సంప్రసీదతి. 3

• కతకరేణువు (చిల్లగింజ) చే జలము నిర్మలమగునట్లు విషయాసక్తిరహితమును, సంతాపవర్జితమునగు మనంబు గలవానిచే జనులందరును ప్రసన్నులగుదురు.

నిత్యమాత్మదృశా లీనో జ్ఞః స్వస్థశ్చఞ్చలోఽపి సన్
క్షుబ్ధో దృశ్యత ఏవాసౌ ప్రతిబిమ్బార్కవన్మృధా. 4

నిత్య మాత్మదృష్టియందు లీనమగుటంబట్టి చలించుచున్నను జ్ఞాని స్వస్థుఁడేయగును. ప్రతిబింబిత సూర్యునివలె మిథ్యారూపముననే యాతడు క్షుభితమైనట్లు గన్పట్టును.

ఆత్మారామా మహాత్మానః ప్రబుద్ధాః పరమోదయాః
బహిః పిచ్ఛాగ్రతరలా అన్తర్మేరురివాచలాః. 5

ప్రబుద్ధులును, అత్యోన్నదయము గలవారును, ఆత్మయందే రమించువారును, జ్ఞానులునగు మహాత్ములు బాహ్యమున నెమలిపింఛముయొక్క చివరభాగమువలె చంచలముగ గన్పట్టుదురు కాని యాంతరమున మేరుపర్వతమువలె అచంచలురై యుందురు.

చిత్తమాత్మత్వమాయాతం సుఖదుఃఖానురఞ్జనమ్
నోపైతి రఙ్గసంయుక్తో మసృణః స్ఫటికో యథా. 6

స్నిగ్ధస్ఫటికమణి జపాకుసుమముయొక్క రంగుచే రంజితముగా నట్లు, ఆత్మదశనొందిన చిత్తము సుఖదుఃఖములచే రంజితము కాదు.

సంసారదృష్టిరుదితం జ్ఞాతలోకపరావరమ్
న రఞ్జయతి సచ్చిత్తం జలలేఖా యథామ్బుజమ్. 7

కమలమును జలమంటునట్లు, నిరతిశయానందము నొందినవాఁడును, జీవేశ్వరతత్వంబుల నెఱింగినవాఁడును, సచ్చిదానందమగు పరమాత్మయందు సంలగ్నమైన చిత్తముగలవాఁడునునగు జీవుని సంసారదృష్టి కలుషీకృతి మొనర్పజాలదు.

ఆత్మధ్యానమయోఽధ్యానే ప్రబోధం పరమాత్మనః
కలనామలనిర్ముక్తః స్వసక్త ఇతి కథ్యతే. 8

జీవుడెపుడు పరమాత్మజ్ఞానమొంది, సర్వకల్పనావర్జితుఁడై, ధ్యానాభావమందును ఆత్మధ్యాన (సుఖ) మగ్నుఁడగునో, అపుడాతడు స్వసక్తుఁ (ఆత్మారాముఁ) డనఁబడును.

ఆత్మారామతయా జీవో యాత్యసంసక్తతామిహ
ఆత్మజ్ఞానేన సంసక్తస్తనుతామేతి నాన్యథా. 9

ఆత్మారాముఁడగుట చేతనే జీవుడీప్రపంచమున నసంగత్వము నొందుచున్నాడు. ఆత్మజ్ఞానోత్కర్షముచేతనే సంసక్తి నశించునుగాని మఱియొకవిధముగ కాదు.

జాగ్రత్యేవ సుషుప్తస్థో జీవో భవతి రాఘవ
అస్యాం దృశి గతోఽద్వన్ద్వో నిత్యానన్తమయోదయః. 10

ఓ రామా! జాగ్రత్తుననే సుషుప్తియందున్నదైన నయ్యవస్థయందు జీవుడు నిత్యుడై, ద్వంద్వరహితుడై, అత్యోన్నదయాన్వితుడై యుండును.

అత్ర ప్రౌఢిముపాయాతః సూర్యతామేతి పావనీమ్
పరిణామవశాదిన్దురమావాస్యార్కతామివ. 11

కళాక్షయమగుటచే చంద్రబింబము క్రమముగ అమావాస్యయందు తన బింబభూతమగు సూర్యునిఁగలిసి తద్రూపము బడయునట్లు; జాగ్రత్తునందు సుషుప్తియను పై స్థితియందు దృఢత్వము నొందిన జీవుడు పరమపవిత్రమగు సూర్య (ఆత్మప్రకాశ) రూపత్వముఁ జెందును.

చిత్తే చిత్తిదశాహీనే యా స్థితిః క్షీణచేతసామ్
సోచ్యతే శాన్తకలనా జాగ్రత్యేవ సుషుప్తతా. 12

చిత్తము చిత్తదశను వీడ, క్షీణచిత్తుల యట్టి కల్పనారహితమగు ప్రశాంతస్థితియే జాగ్రత్తునందు సుషుప్తియనంబడును.

తాం సుషుప్తదశామేత్య జీవన్వ్యవహరన్నరః
సుఖదుఃఖవరత్రాభిర్న కదాచన కృష్యతే. 13

అట్టి సుషుప్తిదశ నొందిన మనుజుడు జీవనవ్యవహారము లాచరించుచున్నను సుఖదుఃఖములను త్రాటిచే యెన్నటికిని యీడ్వబడడు.

జాగ్రత్యేవ సుషుప్తస్థో యః కరోతి జగత్క్రియామ్
తం యన్త్రపుత్రకమివ నాయాతి సుఖదుఃఖదృక్. 14

జాగ్రత్తుననే సుషుప్తిదశనొంది లోకకార్యములఁ జేయుచు నర్తకప్రతిమవలె దోచు జీవునకిక సుఖదుఃఖదృష్టి సంప్రాప్తింపదు.

చిత్తస్య బాధికా సక్తిర్భావాభావోపతాపదా
ఆత్మతామాగతే చిత్తే తస్య కిం బాధతే కథమ్. 15

ఇష్టానిష్టంబులఁ గూర్చిన లాభాలాభములచే అహంకారశక్తి చిత్తమునకు సంతాపము గల్గించును. కాని చిత్త మాత్మదశనొంద యిక నద్దాని నెయ్యది యెట్లు బాధించును?

సుషుప్తబుద్ధిః కర్మాణి పూర్వమేవావహేలయా
కుర్వన్న బధ్యతే జీవో జీవన్ముక్తతయా స్థితః. 16

సుషుప్తిబుద్ధిగల జీవుడు పూర్వసాధనదశనుండియే నిరహంకృతచిత్తముచే కర్మలఁ గావించుచు వాటిచే బంధింపబడక జీవన్ముక్తుని చందమున నుండును.

సౌషుప్తీం వృత్తిమాశ్రిత్య కురు మా కురు వానఘ
కర్మ ప్రకృతిజం పాకవశాదుపగతం స్థితమ్. 17

పాపరహితుఁడవగు నోరామా! సుషుప్తివృత్తి నవలంబించి ప్రారబ్ధపరిపాకముచే సంప్రాప్తించిన వర్ణాశ్రమోచిత కర్మల నాచరింపుము, లేక యాచరింపక యుండుము.

నాదానం న పరిత్యాగః కర్మణోఽజ్ఞాయ రోచతే
తిష్ఠన్త్యవగతాత్మానో యథాప్రాప్తానువర్తినః. 18

జ్ఞానికి కర్మగ్రహణముగాని, కర్మత్యాగముగాని రుచింపదు. కాని వారాత్మజ్ఞులై ప్రారబ్ధానుసారము వర్తించుచుందురు.

కుర్వన్నపి న కర్తాసి సుషుప్త్యైకస్థయాధియా
అకర్తాపి చ కర్తాసి యథేచ్ఛసి తథా కురు. 19

ఓ రామా! కేవలము సుషుప్తి బుద్ధిగల్గి నీవు కార్యము లాచరించినను కర్తవు కానేరవు. కాని యాసక్తచిత్తుఁడవైనచో కార్యము లాచరింపకున్నను కర్తవే యగుదువు ఇట్లెఱింగి యిక నీ యిచ్చవచ్చినట్లొనర్పుము.

యథా న కించిత్కలయన్మఞ్చకే స్పన్దతే శిశుః
తథా ఫలాన్యకలయన్కురు కర్మాణి రాఘవ. 20

ఓ రాఘవా! సంకల్పమేమియు నొనర్పకయే బాలుఁడు మంచముపై వివిధచేష్టల సల్పు విధమున, నీవున్ను ఫలముల జింతింపకయే క్రియలాచరింపుము.

అచేత్యచిత్పదస్వస్థో జాగ్రత్యపి సుషుప్తధీః
యద్యత్కరోతి లబ్ధాత్మా తస్మింస్తస్య న కర్తృతా. 21

విషయవర్జితుడును, చైతన్య (బ్రహ్మ) పదమున స్థితుఁడును, జాగ్రత్తునగూడ సుషుప్తి బుద్ధిగలవాడును, ఆత్మజ్ఞానము నొందినవాడునునగు జీవుఁ డేయే కర్మలఁజేయునో నాటియందు కర్తృత్వము లేక యుండును.

దశామాసాద్య సౌషుప్తీం స్వచిత్తే చ వివాసనః
అన్తః శీతలతామేతి జ్ఞో రసేన యథా శశీ. 22

ఇట్టి సుషుప్తిదశనొంది, చిత్తమున వాసనలెవ్వియు లేక, అమృతముచే చంద్రునివలె, జ్ఞాని తన యంతఃకరణమున శీతలత్వము నొందును.

సుషుప్తస్థో మహాతేజాః పూర్ణః పూర్ణేన్దుబిమ్బవత్
సమః సర్వాస్వవస్థాసు భవత్యద్రిర్యథర్తుషు. 23

ఇట్లు సుషుప్తిదశయందు స్థితినొందు జీవుడు మహాతేజస్వియై, పూర్ణచంద్రబింబము వలె పరిపూర్ణుడై, ఋతువులన్నిటియందును పర్వతమెట్లేరీతి యుండునట్లు సర్వావస్థలయందును సమరూపుడై వర్తించును.

సుషుప్తసంస్థో ధీరాత్మా బహిరాయాతి లోలతామ్
క్రియాసు నో భవన్కమ్పః ప్రస్పన్దిత ఇవాచలః. 24

వృక్షతృణాదిసహితమగు పర్వతము పైకి వాయువుచే చలించినట్లు తోచినను, యథార్థముగ చలింపనట్లు సుషుప్తియందున్న ధీరాత్ముడు లౌకిక, వైదికక్రియలందు బాహ్యమున చంచలత్వము నొందినను, అంతరమున నచంచలుడై యుండును.

సుషుప్తావస్థితో భూత్వా దేహం విగతకల్మషః
పాతయాశ్వథ వా దీర్ఘం కాలం ధారయ శైలవత్. 25

ఓ రామా! సుషుప్త్యవస్థయందు స్థితినొంది పాపరహితుడవై శరీరమును శీఘ్రముగ త్యజింపుము. లేక పర్వతమువలె దీర్ఘకాలము ధరింపుము.



ఏషైవ రామ సౌషుప్తీ స్థితిరభ్యాసయోగతః
ప్రౌఢా సతీ తుర్యమితి కథితా తత్త్వకోవిదైః. 26

ఓ రామా! ఇట్టి సుషుప్త్యవస్థ అభ్యాసముచే యెపుడు దృఢపడునో, అపుడద్దానిని తత్వజ్ఞులగు మహాత్ములు తురీయావస్థ యందురు.

ఆనన్దమయ ఏవాన్తః ప్రక్షీణసకలామయః
అత్యన్తాస్తం గతమనా భవతి జ్ఞో మహోదయః. 27

ఇట్టి (తురీయస్థితియందు జ్ఞాని ఆనందమయుఁడై, యే విఘ్నములును లేక, సర్వథా మనోరహితుడై, మహాభ్యుదయము నొందియుండును.

తత్రస్థో జ్ఞః ప్రముదితః పరమానన్దఘూర్ణితః
లీలామిమామిమాం రచనాం సదా సమనుపశ్యతి. 28

మఱియు నట్టి తురీయమున స్థితినొందిన జ్ఞాని మిగుల ప్రసన్నుడై, పరమానందమయుడై యీ జగద్రచనను సదా లీలవలె గాంచుచుండును.

వీతశోకభయాయాసో గతసంసారసంభ్రమః
తుర్యావస్థాముపారూఢో భూయః పతతి నాత్మవాన్. 29

భయ, శోకాయాసంబులులేనివాడును, సంసారభ్రమరహితుడును, తురీయావస్థయందు స్థిరత్వమునొందినవాడునగు జ్ఞాని మఱల సంసారమున యెన్నటికి పడనేరడు.

ప్రాప్య స్వాం పదవీం పుణ్యాం యథేదం భ్రమితం జగత్
శైలసంస్థ ఇవాధఃస్థం హసన్పశ్యతి ధీరధీః. 30

ఇట్టి పవిత్రమగు స్వాత్మపదవినొంది ధీరబుద్ధిగల మనుజుడీ మిథ్యాప్రపంచమును జూచి నవ్వుచు, పర్వతముపైనున్నవాడు క్రిందివానిని గాంచునట్లు, యద్దానిని గాంచుచుండును.

అస్యాంతు తుర్యావస్థాయాం స్థితిం ప్రాప్యావినాశినీమ్
ఆనన్దైకాన్తలీనత్వాదనానన్దపదం గతః. 31

నాశరహితమగు తురీయావస్థనొంది సర్వథా యానందమగ్నుడై, జీవుడు సాటిలేని యానందము బడయును.

అనానన్దమహానన్దకలాతీతస్తతోఽపి హి
ముక్త ఇత్యుచ్యతే యోగీ తుర్యాతీతం పదం గతః. 32

అవస్థాత్రయమందలి యానందముకంటె యతీతమైనట్టి మహానందసంయుతమగు తురీయ స్థితినికూడ దాటినచో యిక నాయోగి తురీయాతీతపదము నొందెననఁబడును.

పరిగలితసమస్తజన్మపాశః
సకలవిలీనతమోమయాభిమానః,
పరమరసమయీం ప్రయాతి సత్తాం
జలగతసైన్ధవఖణ్డవన్మహాత్మా. 33

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే అసఙ్గసవికల్పోపదేశో నామ సప్తతితమః

సర్గః ॥ 70 ॥

అత్తటి తమోగుణాత్మకమగు యభిమానమంతయు నశించినవాడును, సమస్త జన్మలకును హేతుభూతములగు వాసనా, కర్మపాశములు తొలగినవాడునునగు మహాత్ముడు నీటియందలి ఉప్పుగడ్డవలె, స్వస్వరూపమున లయించి పరమానందమయమగు ఆత్మసత్తను బొందును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
అసంగసవికల్పోపదేశమను సప్తతితమ
సర్గము ॥ 70 ॥

---

ఏకసప్తతితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యావత్తుర్యపరామర్శస్తావత్కేవలతాపదమ్
జీవన్ముక్తస్య విషయో వచసాం చ రఘూద్వహ. 1

శ్రీ వసిష్ఠుడు:—రఘుకులోత్తముఁడవగు నోరామా! అవస్థాత్రయంబుల విచారించి సాక్షియగు చిన్మాత్రమున వాటిని లయమొందింప శేషించునట్టి చిన్మాత్రస్థితిరూపమగు తురీయావస్థయొక్క యనుభవమెంతవఱకుండునో, అంతవఱకే జీవన్ముక్తులయొక్కయు వేదవాక్యములయొక్కయు విషయమగు కేవలీపదముండును.

అత ఊర్ధ్వమదేహానాం ముక్తానాం వచసాం తథా
విషయో న మహాబాహో పురుషాణామివామ్బరమ్. 2

మహాబాహుఁడవగు నో రామా! మనుజులకాకాశము విషయముగాకట్లు తురీయమునకు పైగల తురీయాతీతపదము విదేహ, జీవన్ముక్తులకును, వేదవాక్యలకును గూడ [illegible] తెలియఁగానేరదు.

సాహి విశ్రాన్తిపదవీ దూరేభ్యోఽపి దవీయసీ
గమ్యా విదేహముక్తానాం ఖలేఖేవ నభస్వతామ్. 3

ఆ విశ్రాంతిపదవి అన్నిటికంటెను యతిదూరమునకలదు. వాయువున కాకాశమువలె నది విదేహముక్తులకు గమ్యమై యలరుచున్నది.

సుషుప్తావస్థయా కంచిత్కాలం భుక్త్వా జగత్స్థితిమ్
తుర్యతామేతి తదను పరమానన్దఘూర్ణితః. 4

జ్ఞాని సుషుప్తావస్థయందు కొంతకాలము జగత్స్థితి ననుభవించి యాపిదప పరమానందపూరితుడై తురీయపదము నొందును.



తుర్యాతీతదశాం తజ్జ్ఞా యథా యాన్త్యాత్మకోవిదాః
తథాధిగచ్ఛ నిర్ద్వన్ద్వం పదం రఘుకులోద్వహ. 5

రఘుకులశ్రేష్ఠుఁడవగు నోరామా! తురీయాతీతపదమెఱింగిన ఆత్మజ్ఞులెట్లా తురీయాతీతదశనొందుచున్నారో, అట్లనే నీవున్ను ద్వంద్వరహితమగు యాపదమునొందుము.

సుషుప్తావస్థయా రామ భవ సంవ్యవహారవాన్
చిత్రేన్దోరివ తే న స్తః క్షయోద్వేగావరిన్దమ. 6

శత్రునాశకుఁడవగు నో రామా! సుషుప్తావస్థయందుండి నీవు జగద్వ్యవహారము లాచరింపుము, చిత్రస్థచంద్రునివలె క్షయోద్వేగంబుల బొందకుండువు.

శరీరసంనివేశస్య క్షయే స్థైర్యే చ సంవిదః
మా గృహాణ భ్రమో హ్యేష శరీరమితి జృమ్భతే. 7

దేహము క్షయమొందినను, స్థిరత్వముఁజెందినను జ్ఞానమున్ను క్షతిస్థిరత్వములఁజెందునను భ్రమనెన్నటికి గల్గియుండకుము ఏలన, క్షయాది ధర్మములు దేహమునకు మాత్రమే గలవు.

దేహనాశేన కోఽర్థస్తే కోఽర్థస్తే దేహసంస్థయా
భవ త్వం ప్రకృతారమ్భస్తిష్ఠ త్వేవ యథాస్థితమ్. 8

దేహనాశముచేగాని, దేహస్థితిచేగాని నీకేమిప్రయోజనము? దేహమేయవస్థయందున్నను నీవు మాత్రము కేవలమాత్మబోధయొక్క స్థిరత్వము కొఱకే యత్నింపుము.

జ్ఞాతవానసి తత్సత్యం బుద్ధవానసి తత్పదమ్
ప్రాప్తవానసి రూపం స్వం విశోకో భవ భూతయే. 9

ఓ రామా! అవస్థాత్రయ, జగత్తులకధిష్ఠానమగు సత్యరూపమైన యాబ్రహ్మపదమును నీవెఱింగినావు మఱియు, అఖండవ్యాకారస్వరూపమగు ఆత్మను నీవు పొందితివి. కాన, దుఃఖరహితుడవై ముక్తియను యైశ్వర్యము నొందుము.

ఈప్సితానీప్సితం త్యక్త్వా శీతలాలోకశోభయా
అన్ధకారాత్తథామ్భోదాన్ముక్తం ఖమివ శోభతే. 10

ఓ రామా! అంధకార, మేఘవినిర్ముక్తమై శరదాకాశము శోభించునట్లు, ఇష్టానిష్టములఁ ద్యజించి శీతలాత్మప్రకాశముచే నీవు శోభించుచున్నావు.

మనస్తవాత్మసంపన్నం నాధః సమనుధావతి
యోగమన్త్రతపఃసిద్ధః పురుషః ఖాదివావనిమ్. 11

మంత్రప్రభావంబున ఆకాశగమనసిద్ధిని బొందిన యోగి ఆకాశమును వదలి భూమిపై బరుగిడనట్లు, ఆత్మసంపన్నమగు నీ మనంబు నీచవిషయములందు బరుగిడదు.

ఇహ శుద్ధా చిదేవాస్తి పారావారవివర్జితా
అయం సోఽహమిదం తన్మ ఇతి తే మాస్తు విభ్రమః. 12

ఈ బ్రహ్మాండమందంతటు దేశకాలవస్తుపరిచ్ఛేదరహితమగు శుద్ధచిన్మాత్రమే గలదు. 'ఈ శరీరాదులు నేను, ఈ ధనాదులు నావి' యను భ్రమ నీకు కలుగకుండుగాక !

ఆత్మేతి వ్యవహారార్థమభిధా కల్పితా విభోః
నామరూపాదిభేదస్తు దూరమస్మాదలం గతః. 13

వ్యాపకమగు పరమాత్మకు 'ఆత్మ'యను నామము కేవలము వ్యవహారార్థమే కల్పింపబడినది. యథార్థముగ నాతడు నామరూపాదిభేదముల కతిదూరముననున్నవాడగును.

జలమేవ యథామ్భోధిర్న తరఙ్గాదికం పృథక్
ఆత్మైవేదం తథా సర్వం న భూతోయాదికం పృథక్. 14

సముద్రము జలమాత్రమెట్లగునో, మఱియు తరంగాదులద్దానికి భిన్నములెట్లు గావో, అట్లనే యీ సమస్తమున్న ఆత్మయే యగును; భూ, జలాదులద్దాని కన్యములు గావు.

యథా సమస్తాజ్జలధౌ జలాదన్యన్న లభ్యతే
తథైవ జగతః స్ఫారాదాత్మనోఽన్యన్న లభ్యతే. 15

జలపూర్ణమగు సముద్రమున జలమున కన్యముగ నెద్దియు లభింపనట్లు, జగదాకారమున విస్తరించిన పరమాత్మకు భిన్నముగ యీ జగత్తున మఱెద్దియు లభింపదు.

అయం సోఽహమితి ప్రాజ్ఞ క్వ కరోషి వ్యవస్థితిమ్
కిం తత్త్వం కించ వా తే స్యాత్కిం తత్త్వం కించ వా న తే. 16

ప్రాజ్ఞుఁడవగు నో రామా ! 'ఈ దేహాదులు నేను, ఈ ధనాదులు నావి' యను నీ భావమునకు చోటెచట ? ఈ దేహాదులందు నీ వెవడవు ? వాటియందు నీకు చెందినదేది ? చెందనిదేది? ఆ రెంటియొక్క తత్త్వమేమి?

న ద్విత్వమస్తి నో దేహాః సంబన్ధో న చ తైః స్థితః
సంభావ్యతే కలఙ్కో వా భానోరివ తమః పదైః. 17

యథార్థముగ ద్వైతముగాని, దేహములుగాని లేవు. సూర్యునితో యంధకారమునకు సంబంధము పొసగనట్లు, ఆత్మతో వాటికిని సంబంధమేమియు పొసగదు.

ద్విత్వమభ్యుపగమ్యాపి కథయామి తవారిహన్
దేహాదిభిః సద్భిరపి న సంబన్ధో విభోర్భవేత్. 18

శత్రునాశకుఁడవగు నో రామా ! ద్వైతమునకు సత్తగలదని యొప్పుకొనినను, విద్యమానములగు యీ దేహాదులతోటి వ్యాపకశుద్ధచిన్మాత్రమగు పరమాత్మకు సంబంధముండ నేరదనియే నేను వచించుచున్నాను.

ఛాయాతపప్రసరయోః ప్రకాశతమసోర్యథా
న సంభవతి సంబన్ధస్తథా వై దేహదేహినోః. 19

ఛాయాతపములకును, అంధకారప్రకాశములకును సంబంధముండనట్లు దేహాత్మలకున్ను సంబంధముండ నేరదు.



యథా శీతోష్ణయోర్నిత్యం పరస్పరవిరుద్ధయోః
న సంభవతి సంబన్ధో రామ దేహాత్మనోస్తథా. 20

ఓ రామా ! పరస్పరము సదా విరుద్ధస్వభావము గల శీతోష్ణములకు సంబంధమెట్లుండదో, అట్లనే దేహాత్మలకున్ను సంబంధముండ నేరదు.

అవినాభావినోర్యస్తు సంబన్ధః కథమేతయోః
జడచేతనయోర్దేహదేహినోరనుభూయతే. 21

చిన్మాత్రస్యాత్మనో దేహసంబన్ధ ఇతి యా కథా
సైషా దురవబోధార్థా దావాగ్నౌ జలధిర్యథా. 22

జడచేతనములకును దేహాత్మలకును అవినాభావసంబంధము యనుభూతమగుచున్నదనియు చిన్మాత్రమగు ఆత్మకు దేహముతోటి తాదాత్మ్యము గలదనియు వచించుట, దావాగ్నియందు సముద్రము గలదనుటవలె దురవబోధమైయున్నది.

సత్యావలోకనేనైషా మిథ్యాదృష్టిర్వినశ్యతి
అవలోకనయా సామ్యమాతపే జలధిర్యథా. 23

మృగతృష్ణాభ్రమయందు అతపజ్ఞానముచే సముద్రభావము నశించునట్లు సత్యవస్తుసందర్శనము చేసిన మిథ్యాదృష్టియు నశించును.

చిదాత్మా నిర్మలో నిత్యః స్వావభాసో నిరామయః
దేహస్త్వనిత్యో మలవాంస్తేన సంబధ్యతే కథమ్. 24

చిత్స్వరూపమగు ఆత్మ నిర్మలమై, నిత్యమై, స్వయంప్రకాశమై, వికారరహితమైయున్నది. దేహమో, అనిత్యమై, మలయుతమై, పరప్రకాశమై వికారవంతమైయున్నది. కాన, యిద్దాని ఆత్మతోటి సంబంధమెట్లు పొసగును?

స్పన్దమాయాంతి వాతేన భూతైర్వా పీవరీకృతః
దేహస్తేన న సంబన్ధో మనాగేవ సహాత్మనా. 25

దేహము ప్రాణవాయువుచే చేష్టితమగుచున్నది. మఱియు అన్న, జల, పృథ్వ్యాదులచే వర్ధితమగుచున్నది. కాన ఆత్మతోటి దీనికి కొంచెమైనను సంబంధము లేదు.

సిద్ధే ద్విత్వేఽపి దేహస్య న సంబన్ధస్య సంభవః
ద్విత్వాసిద్ధౌ తు సుమతే కలనైవేదృశీ కుతః. 26

ద్వైతము సిద్ధించినను, దేహముతోటి ఆత్మకు సంబంధము లేకయుండ నిక ద్వైతాసిద్ధియందట్టి కల్పనయే యెచట?

ఇత్యేతదేవ తత్సత్త్వే తత్రైవాన్తఃస్థితిం కురు
న బన్ధోఽస్తి న మోక్షోఽస్తి కదాచిత్కస్యచిత్క్వచిత్. 27

ద్వైతసిద్ధి సత్యమని యెంచిన మున్ను వచించినట్లే వచింపనగును. అనగా మఱియొక సత్త గలదనిన, అది చైతన్యమగుచో, యీ చైతన్యమునకును దానికిని భేదమేమియు నుండదు,

జడమైనచో, ఛాయాతపములవలె విరుద్ధమగుటంబట్టి మిథ్యయే యగును. కాన యెవనికిని, యెచటను, బంధము గాని మోక్షము గాని యెన్నడును లేదు.

సర్వమాత్మమయం శాన్తమిత్యేవం ప్రత్యయం స్ఫుటమ్
సబాహ్యాభ్యన్తరం రామ సర్వత్ర దృఢతాం నయ. 28

ఓ రామా ! ఈ బాహ్యాభ్యంతరజగత్తంతయును శాంతస్వరూపమగు ఆత్మమయమే యనునీ భావన యెల్లెడల దృఢపఱచుకొనుము.

సుఖీ దుఃఖీ విమూఢోఽస్మీత్యేతా దుర్దృష్టయః స్మృతాః
ఆసు చేద్వస్తుబుద్ధిస్తే తచ్చిరం దుఃఖమిచ్ఛసి. 29

'నేను సుఖిని, నేను దుఃఖిని' యనీ భావనలు దుర్దృష్టులని వచింపబడినవి. ఇట్టివానియందు నీకు సత్యత్వబుద్ధియున్నచో చిరకాలము దుఃఖము వాంఛించువాడవే యగుదువు.

యః క్రమః శైలతృణయోః కౌశేయోపలయోస్తథా
సామ్యం ప్రతి స ఏవోక్తః పరమాత్మశరీరయోః. 30

పర్వతతృణములకును, శిలాకౌశేయము (పట్టువస్త్రము) లకును గల సామ్యక్రమమే దేహాత్మలకున్ను వచింపబడినది.

యథా తేజస్తిమిరయోర్న సంబన్ధో న తుల్యతా
అత్యన్తభిన్నయో రామ తథైవాత్మశరీరయోః. 31

అంధకారప్రకాశములకు సంబంధముగాని సామ్యముగాని లేనట్లు, అత్యంతభిన్నమగు దేహాత్మలకున్ను సంబంధ సామ్యములు లేవు.

యథా శీతోష్ణయోరైక్యం కథాస్వపి న దృశ్యతే
జడప్రకాశయోః శ్లేషో న తథాత్మశరీరయోః. 32

శీతోష్ణముల యైక్యము, జడప్రకాశముల సంబంధము కల్పనయందైన గాన్పించనట్లు దేహాత్మలస్థితియు నట్లనేయని యెఱుంగుము.

దేహశ్చలతి వాతేన తేనైవాయాతి గచ్ఛతి
శబ్దం కరోతి వాతేన దేహనాడీవిలాసినా. 33
శబ్దః కచటతప్రాయః స్ఫురత్యన్తః సమీరణైః
యథా ప్రజాయతే వంశాద్దేహరన్ధ్రాత్తథైవ హి. 34
కనీనికా పరిస్పన్దశ్చక్షుః స్పన్దస్య మారుతాత్
ఇన్ద్రియస్ఫురణాత్త్వేవ సంవిత్కేవలమాత్మనః. 35

దేహము ప్రాణవాయువుచే చలించుచు, ఆవాగమనముల నల్పుచున్నది. మఱియు నాడులందు వసించు ప్రాణవాయువుచే శబ్దము గావించుచున్నది. వేణురంధ్రముగుండా శబ్దము జనించునట్లు, దేహమందును కంఠమను ఛిద్రమును పొందిన ప్రాణవాయువుచే క, చ, ట, త, పాది స్వరములు స్ఫురించుచున్నవి. అట్లే ప్రాణవాయువుద్వారా గల్గు కనుగ్రుడ్డుయొక్క చలనమే నేత్రసంచలనమునకు కారణమగును. ఇట్లు ఇంద్రియములన్నియు దేనిచే స్ఫురించుచున్నవో, అట్టి సర్వసాక్షియగు సంవిత్తు (జ్ఞానము) కేవల మాత్మయే యగునుగాని యన్యముగాదు.



ఆకాశోపలకుడ్యాద్యా సర్వత్రాత్మదశా స్థితా
ప్రతిబిమ్బమివాదర్శే చిత్త ఏవాత్ర దృశ్యతే. 36

ఆకాశశిలాభిత్త్యాదులందంతటను ఆత్మసత్త విద్యమానమైయున్నను, దర్పణమున ప్రతిబింబమువలె, చిత్తముననే ఆయ్యది వ్యక్తమగును.

శరీరాలయముత్సృజ్య యత్ర చిత్తవిహంగమః
స్వవాసనావశాద్యాతి తత్రైవాత్మానుభూయతే. 37

స్వవాసనావశమున దేహమను స్థానమువీడి చిత్తమను పక్షి యెచటకుపోవునో, అచటనే ఆత్మయొక్క అనుభవము కలుగుచున్నది.

యత్ర పుష్పం తత్ర గన్ధసంవిదః సంస్థితా యథా
యత్ర చిత్తం హి తత్రాత్మసంవిదః సంస్థితాస్తథా 38

ఎచట పుష్పముండునో యచట గంధముండునట్లు, ఎచట చిత్తముండునో యచట ఆత్మయుండును.

సర్వత్ర స్థితమాకాశమాదర్శే ప్రతిబిమ్బతి
యథా తథాత్మా సర్వత్ర స్థితశ్చేతసి దృశ్యతే. 39

ఆకాశ మంతటనున్నను అద్దమందే ప్రతిబింబించునట్లు ఆత్మయు సర్వత్రవ్యాపించినను చిత్తమందే యనుభూతమగును.

అపామవనతం స్థానమాస్పదం భూతలే యథా
అన్తఃకరణమేవాత్మసంవిదామాస్పదం తథా. 40

భూతలమున నిమ్నస్థానము జలమున కాస్పదమగునట్లు అంతఃకరణ మాత్మసంవిత్తులకు స్థానమైయున్నది.

సత్యాసత్యం జగద్రూపమన్తఃకరణబిమ్బితా
ఆత్మసంవిత్తనోతీదమాలోకమివ సూర్యభా. 41

సూర్యప్రభ ప్రకాశమునెట్లు విస్తరించునో, అట్లనే వ్యావహారిక, ప్రాతిభాసిక జగత్తులను, అంతఃకరణముయొక్క ప్రతిబింబత్వమును ఆత్మచైతన్యమే విస్తరించుచున్నది.

అన్తఃకరణమేవాతః కారణం భూతసంసృతౌ
ఆత్మా సర్వాతిగత్వాత్తు కారణం సదకారణమ్. 42

ఇక్కారణమున సమష్టి అంతఃకరణస్వరూపమే (హిరణ్యగర్భుడే) సర్వభూతముల సృష్టికిని కారణమైయున్నది. సమస్తమున కతీతమగుటచే ఆత్మ ప్రతిబింబరూపమున కారణమును శుద్ధరూపమున అకారణము నగును.

అవిచారణమజ్ఞానం మౌర్ఖ్యమాహుర్మహాధియః
సంసారసంసృతౌ సారమన్తఃకరణకారణమ్. 43

జగత్సృష్టియందు సారభూతమైనట్టి అంతఃకరణముయొక్క కారణము అవిచారము అజ్ఞానము, మూఢత్వమని పెద్దలు నుడివిరి.

అసమ్యక్ప్రేక్షణాన్మోహాచ్చేతఃసత్తాం గృహీతవత్
సంమోహబీజకణికాం తమోఽర్కాదివ దృశ్యతే. 44

విపరీతసంస్కారగ్రహణమను మోహముచే భ్రమబీజసహితమగు చిత్తాకారపరిణామము నాత్మయే ధరించుచున్నది. సూర్యునియందు రాహువను తమస్సు గన్పట్టునట్లు, మిగుల యసంభవమైనను, ఆత్మయందు జననమరణాదులు అజ్ఞానముచే గన్పట్టుచున్నవి.

యథా భూతాత్మతత్త్వైక పరిజ్ఞానేన రాఘవ
అసత్తామేత్యలం చేతో దీపేనేవ తమః క్షణాత్. 45

ఓ రామా! ఇట్లనర్థహేతువైన చిత్తము సత్యమగు ఆత్మతత్త్వజ్ఞానముచే, దీపముచే నంధకారమువలె క్షణములో నశించును.

సంసారకారణమితః స్వయం చేతో విచారయేత్
జీవోఽన్తఃకరణం చిత్తం మనశ్చేత్యాదినామకమ్. 46

చిత్తమువలననే సంసారకారణమగు అజ్ఞానము జనించినదని యెంచి యధికారిజను లద్దానిని బాగుగ విచారింపవలెను. ఈచిత్తమునకే జీవుడు, అంతఃకరణము, మనస్సు మున్నగు పేర్లుగలవు.

శ్రీ రామ ఉవాచ :—

ఏతాః సంజ్ఞాః ప్రభో బ్రహ్మంశ్చేతసో రూఢిమాగతాః
కథమిత్యేవ కథయ మయి మానద సిద్ధయే. 47

శ్రీరాముడు:—ఓప్రభూ! చిత్తముయొక్క యీ సంజ్ఞలన్నియు యెట్లు రూఢినొంది నవో పూర్వోక్తవిచారసిద్ధికొఱకై దయచేసి నాకు వచింపుము?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

సర్వే భావా ఇమే నిత్యమాత్మతత్త్వైకరూపిణః
చత్తాత్తరఙ్గకగణా జలైకకలితా యథా. 48

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! సమస్త పదార్థములును ఆత్మతత్త్వముతోటి యేకతాభ్యాసముచే జలమునుండి తరంగములవలె యేకరూపమగు సమష్టిచిత్తమునుండి ప్రాదుర్భవించినవి.

ఆత్మా స్పన్దైకరూపాత్మా స్థితస్తేషు క్వచిత్క్వచిత్
తరఙ్గేషు విలోలేషు పయోధేః సలిలం యథా. 49
క్వచిదస్పన్దరూపాత్మా స్థితస్తేషు మహేశ్వరః
తరఙ్గత్వమయాతేషు జలభావో జలేష్వివ. 50



చంచల తరంగములందు సముద్రజలమువలె స్పందరూపమగు ఆత్మ వానియందు ప్రతిబింబరూపమున నచటచట స్థితినొందియున్నది. మఱియు తరంగదశను పొందని జలములందు జలమువలె యొకచో స్పందములేకయు నున్నది.

తత్రోపలాదయో భావా అలోలాః స్వాత్మని స్థితాః
సురాఫేనవదుత్పన్నా లోలాస్తు పురుషాదయః. 51

ఆయా పదార్థములలో శిలాదులు చంచలత్వములేక తమయందే స్థితిగల్గియున్నవి. కాని మానవాదులు మద్యఫేనమువలె యుత్కటచేష్టాయుతులై చంచలత్వము గల్గియున్నారు.

తత్ర తేషు శరీరేషు సర్వశక్తిస్తదాత్మనః
కలితాఽజ్ఞానకలనా తేనాజ్ఞానమసౌ స్థితః. 52

ఆ శరీరములన్నిటియందు నాయారూపముగ పరమాత్మయొక్క (కల్పిత యజ్ఞానముచే ప్రసిద్ధమగు) సర్వశక్తి గలదు. ఇక్కారణమున స్వయముగనా పరమాత్మ కల్పిత యజ్ఞానరూపుడై సుషుప్తి, ప్రళయములందు స్థితిఁగల్గియున్నాడు.

తదజ్ఞానమనన్తాత్మభూషితం జీవ ఉచ్యతే
స సంసారే మహామోహమాయాపఞ్జరకుఞ్జరః. 53

ప్రతిబింబదశనొందిన పరమాత్మచే భూషితమగుచు నాయజ్ఞానమే జీవుడనంబడుచున్నది. ఆ జీవుడీ సంసారమున మహామోహమయాత్మకమగు మాయయను పంజరము (బోను) నందలి గజమగును.

జీవనాజ్జీవ ఇత్యుక్తోఽహంభావః స్యాత్త్వహన్తయా
బుద్ధిర్నిశ్చాయకత్వేన సంకల్పకలనాత్మనః. 54
ప్రకృతిః ప్రకృతిత్వేన దేహో దిగ్ధతయా స్థితః
జడః ప్రకృతిభావేన చేతనః స్వాత్మసత్తయా. 55

జీవ (ప్రాణ) ధారణచే నది జీవుఁడనంబడుచున్నది. అట్లనే యహంకరించుటచే అహంకారమనియు, నిశ్చయించుటచే బుద్ధియనియు, సంకల్పవికల్పముల నొనర్చుటచే మనంబనియు, మనోదేహాదులకు కారణమగుటచే ప్రకృతియనియు, వర్ధిల్లుటచే దేహమనియు, అజ్ఞానాధిక్యముచే జడమనియు, చైతన్యప్రాధాన్యముచే చేతనమనియు వచింపబడుచున్నది.

జడాజడదృశోర్మధ్యం యత్తత్త్వం పారమార్థికమ్
తదేతదేవ నానాత్వం నానాసంజ్ఞాభిరాతతమ్. 56

అజ్ఞాన, తత్సాక్షుల మధ్యగల పరమాత్మాభాససహితమగు మనస్సను తత్త్వమే అనేకత్వమునొంది జీవ, బుద్ధి, చిత్తాహంకారాది నానాసంజ్ఞల ధరించుచున్నది.

ఏవం స్వరూపం జీవస్య బృహదారణ్యకాదిషు
బహుధా బహుషు ప్రోక్తం వేదాన్తేషు కిలానఘ. 57

పాపరహితుఁడవగు నోరామా! ఇవ్విధమున జీవస్వరూపము బృహదారణ్యకాది

వేదాంతగ్రంథములందు పలువిధముల వచింపబడినది. ఎట్లన "ప్రాణన్నేవ ప్రాణో నామ భవతి వదన్వాక్ పశ్యంశ్చక్షుః" (ఆ యాత్మయే శ్వాసాదిక్రియలచే ప్రాణముగను, వచించుటచే వాక్కుగను, చూచుటచే నేత్రముగను నగుచున్నది.)

అజ్ఞైస్త్వేతాసు సంజ్ఞాసు కువికల్పకుతార్కికైః
మోహాయ కేవలం మూఢైర్వ్యర్థమాస్థాః ప్రకల్పితాః. 58

అజ్ఞానులు, దుర్బుద్ధులు, మూఢులునగు కుతార్కికులు లోకుల మోహింపజేయుటకై యీ నామములందే వ్యర్థముగ యభినివేశము గలిగియున్నారు.

ఏవమేష మహాబాహో జీవః సంసారకారణమ్
మూకేనాతివరాకేణ దేహకేనేహ కిం కృతమ్. 59

మహాబాహుండవగు నో రామా! ఇవ్విధమున జీవుడే సంసారమునకు కారణమగును గాని మూకమై, దీనమైనట్టి శరీరముకాదు.

ఆధారాధేయయోరేకనాశే నాన్యస్య నష్టతా
యథా తథా శరీరాదినాశే నాత్మని నష్టతా. 60

ఆధార (ఘట) ఆధేయ (జల) ములలో యొకటి నశించిన రెండవది నశింపనట్లు, దేహాదుల వినాశముచే ఆత్మయు నశింపదు.

ఏకపర్ణరసే క్షీణే రసో నైతి యథా క్షయమ్
యాతి పర్ణరసశ్చార్కరశ్మిజాలాన్తరే యథా. 61
శరీరసంక్షయే దేహీ న క్షయం యాతి కస్యచిత్
నిర్వాసనశ్చేత్తద్వ్యోమ్ని తిష్ఠత్యాత్మపదే తథా. 62

ఒక యాకునందలి రసమెండిపోయిన, ఆరసము నశింపక సూర్యకిరణములందెట్లుండునో, అట్లనే శరీరము నశించిన, యెవరి ఆత్మయు నశింపదు. వాసనాసహితమగుచో యా శరీరము వాసనయందే యుండును; వాసనారహితమగుచో చిదాకాశమున నుండును.

దేహనాశే వినష్టోఽస్మీత్యేవం యస్యాఽమతేర్భ్రమః
మాతుస్తనతటాత్తస్య మన్యే వేతాల ఉత్థితః. 63

ఏ దుర్బుద్ధికి దేహము నశించిన తాను నశించితినను భావముండునో యానికి మాతృస్తన తటమునగూడ బేతాళము ప్రకటితమగునని నేనెంచెద.

యస్య హ్యాత్యన్తికో నాశః స్యాదసావుదితః స్మృతః
చిత్తనాశో హి నాశః స్యాత్స మోక్ష ఇతి కథ్యతే. 64

ఉపాధి సంపూర్ణముగ నశింప జీవుడు తన బ్రహ్మస్వభావమును సంస్మరించి నిరతిశయానందము నొందును. చిత్తనాశమే నాశమనియు, అదియే మోక్షమనియు వచింపబడినది.

మృతో నష్ట ఇతి ప్రోక్తో మన్యే తచ్చ మృషా హ్యసత్
స దేశకాలాన్తరితో భూత్వా భూత్వానుభూయతే. 65



'ఈతడు మరణించెను, నశించెన'ననీ కథనము మిథ్యయని నేనెంచెద ఏలన నది యసత్కల్పనయే యగును. జీవుడు దేశకాలాంతరములందు శరీరాంతరముల గ్రహించుచు మరల మరల గన్పట్టుచునే యున్నాడు.

ఇహలోకవ్యాస్తే జనైరేవం తరఙ్గాన్తస్తృణైరివ
మరణవ్యపదేశాసు దేశకాలతిరోహితైః. 66

ఈ ప్రపంచమున మరణమను నదియందు, తరంగములలోని తృణమువలె కొట్టుకొని పోవుచు దేశకాలములచే గప్పబడినట్టి జీవులచే 'ఇది మరణించెను, ఇది జనించెను, ఈతడు సుఖి, ఈతడు దుఃఖి' ఇత్యాది కల్పనలు గావింపబడుచున్నవి.

వాసనావస్థితో జీవో యాత్యుత్సృజ్య శరీరకమ్
కపిర్వనతరుం త్యక్త్వా తర్వన్తరమివాస్థితః. 67

వానర మొకవృక్షమును వదలి మఱియొక వృక్షముపైకి బోవునట్లు, వాసనలుగల జీవుడొకశరీరమును వదలి మఱియొక శరీరమునకు జనుచున్నాడు.

పునస్తదపి సంత్యజ్య గచ్ఛత్యన్యదపి క్షణాత్
అన్యస్మిన్వితతే దేశే కాలేఽన్యస్మింశ్చ రాఘవ. 68

ఓ రాఘవా! మరల నెంటనే దానినికూడ త్యజించి యింకొకదానిని గ్రహించుచున్నాడు. ఆ పిదప విస్తృతమైన అన్యదేశకాలములందు మరల జనించుచున్నాడు.

ఇతశ్చేతశ్చ నీయన్తే జీవా వాసనయా స్వయా
చిరం తదపి జీవిన్యా ధూర్త్యా ధాత్ర్యేవ బాలకాః. 69

ధూర్తనియందాసక్తిగల దాదిచే బాలకునివలె, చిరకాలము సంసారమున జీవింపజేయునట్టి స్వవాసనలచే జీవులొకచోటునుండి మఱియొక చోటునకు చేర్చబడుచున్నారు.

వాసనారజ్జువలితా జీర్ణాః పర్వతకుక్షిషు
జరయన్త్యతిదుఃఖేన జీవితం జీవజీవికాః. 70

వాసనలను త్రాటిచే గట్టబడి, శిథిలత్వమునొంది, యతిదుఃఖముతో గూడుకొని జీవులు తమ జీవితమును వినాశమొనర్చుచున్నారు.

జరతజరదుపోఢదుఃఖభారాః
పరిణతిజర్జరజీవితాశ్చ సత్యః
హృదయజనితవాసనానువృత్త్యా
నరకభరే జనతాశ్చిరం పతన్తి. 71

జీవులు తమ హృదయమందు జనించిన వాసనలచే శిథిలప్రాయులై, దారిద్ర్యరోగాది దుఃఖముల భారమును వహించుచు వివిధయోనులందలి దుర్దశలచే జర్జరితమైన జీవితముగలిగి చిరకాలము నరకసమూహమున బడుచున్నారు.

శ్రీ వాల్మీకిరువాచ:—

ఇత్యుక్తవత్యథ మునౌ దివసో జగామ
సాయంతనాయ విధయేఽస్తమినో జగామ,
స్నాతుం సభాకృతనమస్కరణా జగామ
శ్యామాక్షయే రవికరైశ్చ సహాజగామ. 72

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే సంసారోపదేశో నామైక సప్తతితమః
సర్గః ॥ 71 ॥
త్రయోదశో దివసః

శ్రీవాల్మీకి:—శ్రీ వసిష్ఠమునీంద్రులిట్లు వచించిన నంత సాయంకాలమయ్యెను. సాయం విధుల నిర్వర్తించుటకై సూర్యభగవానుడున్ను అస్తాద్రిం గ్రుంకెను. అత్తతి స్నానసంధ్యాదులొనర్చుటకై సభ విరమింపబడెను. ఒండొరుల నమస్కరించుకొనుచు సభ్యులచ్చోట వీడిరి. ఆరాత్రి గడచినమీదట మఱునాడు సూర్యోదయము కాగానే మరల యట సభకూడెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సంసారోపదేశమను ఏకసప్తతితమ
సర్గము ॥ 71 ॥
పదమూడవ రోజు ॥ 13 ॥

## ద్విసప్తతితమః సర్గః.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

దేహే జాతే న జాతోఽసి దేహే నష్టే న నశ్యసి
త్వమాత్మన్యకలఙ్కాత్మా దేహస్తవ న కశ్చన. 1

శ్రీవసిష్ఠుడు:—ఓరామా! దేహము జనించుటచే నీవు జనించుటలేదు, దేహము నశించుటచే నీవు నశించుటయులేదు. నీవు స్వాత్మయందు అకళంకరూపుఁడవై వెలయుచున్నావు. దేహముతో నీకేమియు సంబంధములేదు.

యః కుణ్డబదరన్యాయో యా ఘటాకాశసంస్థితిః
తత్రైకస్మిన్నతే క్షీణే ద్వే ఇతి వ్యర్థకల్పనా. 2

కుండబదరన్యాయమునగాని లేక, ఘటాకాశస్థితియందుగాని, ఒకటి నశించిన రెండును నశించుననుట, అనగా, కుండ నశించిన యందలి రేగుపండును నశించుననుటయు, ఘటము నశించిన యందలి ఘటాకాశమున్ను నశించుననుటయు వ్యర్థకల్పనే యగును,



వినాశిని వినష్టేఽస్మిన్దేహే స్వాం స్థితిమాగతే
వినశ్యామీతి యః ఖేదీ తం ధిగస్త్వన్ధచేతసమ్. 3

నశ్వరమైన యీదేహము నశించి తనస్వస్థితినిబొంద 'నేను నశించుచున్నా'నని దుఃఖించు మూఢచిత్తునకు ధిక్కారమగుగాక !

యాదృశో రశ్మిరథయోః స్నేహోద్వేగవివర్జితః
సంబన్ధస్తాదృశో దేహచిత్తేన్ద్రియముఖైశ్చితేః. 4

రాగద్వేషవర్జితములగు అశ్వాదులకు రథముతోడిగాని, రజ్జువుతోడిగాని గల సంబంధమే దేహేంద్రియచిత్తాదులతోడి చైతన్యమునకున్ను గలదు.

గతేతరేతరాపేక్షః సరః పఙ్కమలామ్బుసామ్
యథా రాఘవ సంబన్ధస్తథా దేహేన్ద్రియాత్మనామ్. 5

ఓరామా ! తటాకమున పంకమునకును స్వచ్ఛజలమునకును గల సంబంధమే దేహేంద్రియములతోడి ఆత్మకున్ను గలదు.

యాదృశోఽధ్వా గతాధ్వానాం నిరాస్థాపరిదేవనః
సంయోగో విప్రయోగశ్చ తాదృశో దేహదేహినోః. 6

బాటసారికిని, మార్గమునకును గల మమత్వాభిమాన, వియోగదుఃఖవర్జితమగు సంయోగ వియోగములే దేహాత్మలకున్ను గలవు.

యథా కల్పితవేతాలవికారభయభీతయః
మిథ్యైవ కల్పితా ఏతే తథా స్నేహసుఖాదయః. 7

కల్పిత బేతాలుని ముఖదంతాదుల స్మరించుటచే బాలునకు మరల భయాదులు గలుగునట్లు ఆత్మయందును, ప్రీతి, సుఖాదులు మిథ్యారూపమున కల్పింపబడినవి.

భూతపఞ్చకసంపిణ్డాద్రచితా జనతాః పృథక్
ఏకస్మాదేవ విటపాద్విచిత్రా ఇవ పుత్రికాః 8

ఒకే వృక్షమునుండి వేర్వేరు విగ్రహములు నిర్మింపబడునట్లు, సమ్మిళితములైన పంచభూతములనుండియే జనసమూహమంతయు వేర్వేరుగ సృజింపబడినది.

కాష్ఠేతరత్కాష్ఠభారే కించిదన్యన్న దృశ్యతే
భూతపిణ్డేతరద్దేహే కించిదన్యన్న దృశ్యతే. 9

కట్టెమోపునందు కట్టెలు తప్ప అన్యమెద్దియు గనబట్టనట్లు, దేహమందును పంచభూత సముదాయము తప్ప అన్యమెద్దియును గానిపించుటలేదు.

భూతపఞ్చకవిక్షోభనాశోత్పాదేషు హే జనాః.
హర్షామర్షవిషాదానాం కిం భవన్తో వశం గతాః. 10

ఓ జనులారా! పంచభూతములయొక్క యుత్పత్తి, క్షోభ, వినాశములందేల మీరు హర్షశోకములకు వశులగుచున్నారు?

కో నామాతిశయః పుంసాం స్త్రీనామ్న్యపరనామ్ని చ
పేలవే భూతసంఘాతే ప్రోద్భూతజనపాతవత్. 11

అగ్నియందు మిడుతవలె తుచ్ఛ పాంచభౌతికసంఘాతరూపమై, స్త్రీయను అన్యనామధేయము గల్గినట్టి విషయాగ్నియందు బడుచున్న పురుషులకండె విశేషముగలదో!

సంనివేశాంశవైచిత్ర్యమజ్ఞానామేవ తుష్టయే
తజ్జ్ఞానాం తు యథాభూతభూతపఞ్చకదర్శనమ్. 12

దేహముయొక్క సుకుమారత్వ సౌందర్యాది రచనావైచిత్ర్యవిశేషము లజ్ఞానులకే ప్రీతిం జనింపజేయునుగాని, జ్ఞానులకు యథారీతి పంచభూతరూపములుగనే గన్పట్టును.

మిథః శిలాపుత్రకయోర్యథైకోపలపుత్రయోః
శ్లిష్టయోరపి నో రాగస్తథా చిత్తశరీరయోః. 13

ఒకే శిలనుండి నిర్మింపబడిన రెండు విగ్రహములను పరస్పరము సమ్మేళన మొనర్చిన వాటియందు రాగముదయింపనట్లు చిత్తశరీరములకును నుదయింపదు.

మృత్పుంసాం యాదృశోఽన్యోన్యమాశయః సంగమే భవేత్
బుద్ధీన్ద్రియాత్మమనసాం సంగమే తాదృశోఽస్తు తే. 14

మృత్తికానిర్మితపురుషుల సమాగమమున మమత్వరహితమగు యాశయమెట్లుగల్గునో బుద్ధీన్ద్రియాత్మమనంబుల సంసర్గమునను నీకట్లనే కలుగుగాక!

నాన్యోన్యస్నేహసంబన్ధభాజనం శైలపుత్రకాః
దేహేన్ద్రియాత్మప్రాణాశ్చ కస్యాత్ర పరిదేవనా. 15

శిలావిగ్రహములకు పరస్పరము ప్రేమయుండనట్లు దేహేంద్రియాత్మప్రాణంబుల యొడలను రాగములేక యుండవలెను. వాటికై యీ ప్రపంచమున విలపింపనేల?

ఇతశ్చేతశ్చ జాతాని యథా సంశ్లేషయత్యలమ్
తరఙ్గాస్తృణజాలాని తథా భూతాని దేహదృక్. 16

భిన్నభిన్న దేశకాలములందుత్పన్నమైన తృణములను తరంగము లొకచోట జేర్చునట్లు పంచభూతముల నాత్మయునొకచో జేర్చుచున్నది.

సంయుజ్యన్తే వియుజ్యన్తే, తృణాన్యబ్ధిజలే యథా
నుక్తాన్తఃకలనం దేహే భూతాన్యాత్మని వై తథా. 17

సముద్రజలమున తృణములు రాగాభిమానములేనివై కలయుచు, వేఱుబడుచునుండు నట్లు పుత్రపశ్వాదిప్రాణులును పంచభూతములును ఆత్మయందు కలయుచు, వేఱుబడుచు నున్నారు.

ఆత్మా చిత్తతయా దేహభూతాన్యాశ్లేషయస్థితః
తృణాన్యావృత్తవృత్తాన్తకలనోత్సిక్తమబ్ధివత్. 18



ఆవర్తములచే ప్రవర్ధితరూపము ధరించిన సముద్రము తనయందలి తృణముల నొకచో జేర్చుచుండునట్లు, చిత్తరూపమును బొందిన ఆత్మయు పంచభూతముల నొకచోట జేర్చుచున్నది.

ప్రబోధాచ్చేత్యతాం త్యక్త్వా వ్రజత్యాత్మాత్మతాం స్వయమ్
స్వస్పన్దవశతో వారి త్యక్త్వాచ్ఛత్వమివాచ్ఛతామ్. 19

సంచలనముచే మాలిన్యమొందిన జలము క్రమముగ తన మాలిన్యమును వదలి శుద్ధరూపమును బడయునట్లు, జ్ఞానముచే విషయరూపమును త్యజించి జీవుడున్ను స్వయముగ బ్రహ్మరూపము నొందును.

తతో విశ్లిష్టభూతౌఘో దేహం సంప్రతి పశ్యతి
వాయుస్కన్ధగతో జన్తుర్వసుధామణ్డలం యథా. 20

మఱియు, వాయుమండలమునందుండి ఆకాశచారులగు దేవాదులు భూమండలమును వీక్షించునట్లు, ప్రబోధసమయమున జీవుడున్ను పంచభూతసమూహమునుండి విడువడిన తనదేహమును గాంచును.

పృథగ్భూతగణం దృష్ట్వా దేహాతీతో భవత్యజః
పరం ప్రకాశమాయాతి సూర్యకాన్తిరివాహని. 21

పంచభూతములను వేర్వేఱుగ గాంచుచు దేహాతీతుఁడగు యాజీవుడు జన్మరాహిత్యము నొంది పగటియందు సూర్యకాంతమణివలె పరమప్రకాశము నొందును.

జానాత్యథాత్మనాత్మానం మానమేయామయోజ్ఝితమ్
ముక్తక్షీబత ఏవాన్తః స్వాం సంవిదమనుస్మరన్. 22

మద్యము త్రావినవాడు మత్తువదలిన పిదప తన పూర్వజ్ఞానమును స్మరించునట్లు, ఆ పిమ్మట, జీవుడు ప్రమాణప్రమేయవికారరహితుడై తనయాత్మను గాంచును.

ఆత్మైవ స్పన్దతే విశ్వం వస్తుజాతైరివోదితమ్
తరఙ్గకణకల్లోలైరనన్తామ్బ్వమ్బుధావివ. 23

తరంగకల్లోలముచే వివిధసముద్రజలములు జేష్టల యొనర్చునట్లు, ఈ వస్తుసమూహరూపమున నావిర్భవించినట్లు తోచు ఆత్మయే సమస్త క్రియలను చేయుచున్నది.

ఏవంప్రాయమహాబోధా వీతరాగా గతైనసః
జీవన్ముక్తాశ్చరన్తీహ మహాసత్త్వపదం గతాః. 24

ఇట్లీ ప్రపంచమున, మహాబోధకులును, వీతరాగులును, పాపరహితులును, బ్రహ్మపదము నొందిన జీవన్ముక్తులు నగుమహాత్ములు విహరించుచున్నారు.

యథా చరన్తి వివిధైర్మణిరత్నైర్మహోర్మయః
నిరస్తవాసనాశ్చిత్తవ్యవహారైస్తథోత్తమాః. 25

పలుకిన మణిరత్నములతో గూడియున్నను వాటియందాసక్తి లేక మహాతరంగములెట్లు

సముద్రమున చేష్టల గావించుచుండునో, అట్లనే వాసనారహితులైన మహాత్ములగు జ్ఞానులు అనాసక్త చిత్తముతో వ్యవహారము లాచరించుచుందురు.

న కూలకాష్ఠైర్జలధిర్న రజోభిర్నభస్తలమ్
న మ్లాయతి నిజైర్లోకవ్యవహారైరిహాత్మవాన్. 26

తీరముననున్న కట్టెలచే సముద్రముగాని, ధూళిచే నాకసముగాని మలినము గానట్లు, ప్రపంచ వ్యవహారములచే నాత్మజ్ఞానియు మాలిన్యము నొందడు.

గతైరభ్యాగతైః స్వచ్ఛైశ్చపలైర్మలినైర్జడైః
న రాగో నామ్బుధేర్ద్వేషో భోగైశ్చాధిగతాత్మనః. 27

స్వచ్ఛమైనట్టియు, లేక మలినమై చంచలమై జడమైనట్టియు తరంగాదుల గమనాగమనములచే సముద్రము రాగమునుగాని ద్వేషమునుగాని బొందకుండునట్లు, ఆత్మజ్ఞానియు ఉత్తమ భోగములచే రాగమునుగాని, నికృష్టభోగములచే ద్వేషముగాని బొందకుండును.

యన్మనో మననం కించిత్సమగ్రం జగతి స్థితమ్
తచ్చేతో్యన్ముఖచిత్తత్వవిలాసోల్లసనం విదుః. 28

ఈ జగత్తుననున్నదంతయును మనస్సుయొక్క సంకల్పమాత్రమే యనియు, విషయోన్ముఖమైన చైతన్యముయొక్క విలాసమేయనియు ఆత్మజ్ఞానులెఱింగియున్నారు.

యదహం యచ్చ భూతాది కాలత్రితయభావి యత్
దృశ్యదర్శనసంబన్ధవిస్తారైస్తద్విజృమ్భతే. 29

అహంభావమున్ను, త్రికాలస్థవిషయములున్ను దృశ్యదర్శనసంబంధమున్ను సర్వము మనోవిజృంభణమాత్రమే యగును.

యద్దృశ్యం తదసత్సద్వా దృష్టిమేకాముపాశ్రితమ్
అన్యత్త్వలేపకం తస్మాద్ధర్షశోకదృశౌ కుతః. 30

దృశ్యదర్శనముల మధ్యగల దృక్కునకధీనమగు దృశ్యము సత్తనిగాని, అసత్తనిగాని నిర్ణయింపబడనందున హర్షశోకముల కయోగ్యమగును. ఇక స్వయంసిద్ధమగు దృక్స్వరూపమైన ఆత్మయో, అసంగమైనది; కాన నిక హర్షశోకములకు తావెచట?

అసత్యమేవాసత్యం హి సత్యం సత్యం సదేవ హి
సత్యాసత్యమసద్విద్ధి తదర్థం కిం ను ముహ్యసి. 31

ఓ రామా! నీకు గల్గు హర్షశోకములు అసత్యమైనదానిఁ గూర్చియా, సత్యమైనదానిఁ గూర్చియా, లేక సత్యాసత్యమైనదానిఁ గూర్చియా? అసత్యమైనది మిథ్యయేగాన యిక దానికై హర్షశోకము లేల? సత్యమైనది నిత్యప్రాప్తముగాన దానికొఱకును హర్షశోకము లొందుట వ్యర్థము. ఇక విరుద్ధధర్మములగుటచే సత్యాసత్యములొకచో నెన్నడును సంభవింపవుగాన నదియును మిథ్యయే యగును. ఇట్లుండ నీవేల విమోహితుఁడవగుచుంటివి?



అసమ్యగ్దర్శనం త్యక్త్వా సమ్యక్పశ్య సులోచన
న క్వచిన్ముహ్యతి ప్రౌఢః సమ్యగ్దర్శనవానిహ. 32

ఉత్తమనేత్రుఁడవగు నో రామా! అసమ్యక్ (మిథ్యా) దర్శనమును త్యజించి సమ్యక్ దర్శన మవలంబింపుము. సమ్యగ్దర్శనమున స్థిరుఁడగు వాఁడెచటను విమోహితుఁడు కాఁడు.

దృశ్యదర్శనసంబన్ధవిస్తారైస్తద్విజృమ్భతే
దృశ్యదర్శనసంబన్ధే యత్సుఖం పారమాత్మికమ్. 33

దృశ్యదర్శనసంబంధవిస్తారముచే మనోరూపమగు ఆత్మయే ప్రకాశించుచున్నది. దృశ్యదర్శనసంబంధమున గల్గు పరమాత్మసంబంధమగు అనుభవరూపసుఖస్ఫూర్తియు, ఉపాధికృతభేద నిరసనముచే గలుగు సుఖమున్ను అఖండ బ్రహ్మమే యగును.

అనుభూతిమయం తస్మాత్సారం బ్రహ్మేతి కథ్యతే
దృశ్యదర్శనసంబన్ధే సుఖసంవిదనుత్తమా. 34

దదాత్యజ్ఞాయ సంసారం జ్ఞాయ మోక్షం సదోదయమ్
దృశ్యదర్శనసంబన్ధసుఖమాత్మవపుర్విదుః. 35

తద్దృశ్యవలితం బన్ధస్తన్ముక్తం ముక్తిరుచ్యతే
దృశ్యదర్శనసంబన్ధసుఖసంవిదనామయా. 36

క్షయాతిశయముక్తా చేత్తన్ముక్తిః సోచ్యతే బుధైః
దృశ్యదర్శనసంబన్ధే యానుభూతిః స్వగోచరా. 37

కాన యనుభవమే సారమగు బ్రహ్మమని పేర్కొనబడినది. దృశ్యదర్శనసంబంధమునగల సర్వోత్తమమగు సుఖానుభవమే అజ్ఞానులకు సంసారమున్ను, జ్ఞానులకు మహాభ్యుదయయుక్తమగు మోక్షమున్ను గలుగజేయుచున్నది. మఱియు, దృశ్యదర్శనసంబంధమునగల యనుభవరూపమగు సుఖమే ఆత్మయొక్క దేహమని యెన్నబడినది. ఆసుఖమే దృశ్య (విషయ)ముతో గూడినచో బంధమనియు, దృశ్యరహితమైనచో ముక్తియనియు వచింపబడినది. దృశ్యదర్శనసంబంధమునగల సుఖసంవిత్తు వికారరహితమై, వృద్ధిక్షయములు లేనిదగుచో ముక్తియనియే విజ్ఞులచే దలంపబడినది. దృశ్యదర్శన సంబంధమునగల యనుభవమే అఖండపూర్ణానందస్వరూపమగు బ్రహ్మమగును.

దృశ్యదర్శననిర్ముక్తా తామాలమ్బ్య భవాభవః
సౌషుప్తీ దృష్టిరేషా హి యాత్యేవం సంప్రకాశతే. 38

ఓ రామా! దృశ్యదర్శనవర్జితమగు సుఖమునవలంబించి సంసారబంధరహితుఁడవు గమ్ము. ఇట్లు తన సుఖస్వరూపము నాశ్రయించుటచే సుషుప్తివృత్తి నశించి జీవునకు స్వస్వరూపదృష్టి ప్రకాశించును.

ఏవం చ యాతి తుర్యత్వమేవం ముక్తిరితి స్మృతా
దృశ్యదర్శనముక్తాయాం యుక్తాయాం పరయా ధియా. 39

ఇవ్విధమున తురీయావస్థ సంప్రాప్తించును. ఈస్థితియే ముక్తియనియు పేర్కొనబడినది. దృశ్యదర్శనవర్జితుడై, పరమాత్మబుద్ధితో గూడుకొనియున్న జీవుడట్టి స్థితినొందును.

దృశ్యదర్శనసంబన్ధసంవిదస్యాం తు రాఘవ
నాత్మా స్థూలో న చైవాణుర్న ప్రత్యక్షో న చేతరః. 40
న చేతనో న చ జడో న చైవాసన్న సన్మయః
నాహం నాన్యో న చైవైకో నానేకో నాప్యనేకవాన్. 41
నాభ్యాశస్థో న దూరస్థో నైవాస్తి న చ నాస్తి చ
న ప్రాప్యో నాతి చాప్రాప్యో నవా సర్వో న సర్వగః. 42
న పదార్థో నాపదార్థో న పఞ్చాత్మా న పఞ్చ చ
యదిదం దృశ్యతాం ప్రాప్తం మనఃషష్ఠేన్ద్రియాస్పదమ్. 43

ఓరామా! ముక్తిరూపమగునా తురీయావస్థయందు ఆత్మ స్థూలముగాని, సూక్ష్మముగాని, ప్రత్యక్షముగాని, అప్రత్యక్షముగాని, చైతన్యముగాని, జడముగాని, సత్తుగాని, అసత్తుగాని, అహంకారరూపముగాని, అన్యరూపముగాని, ఏకముగాని, అనేకముగాని, సమీపస్థముగాని, దూరస్థముగాని, సత్తారూపముగాని, అసత్తారూపముగాని, ప్రాప్యముగాని, అప్రాప్యముగాని, సర్వరూపముగాని, సర్వవ్యాపకముగాని, పదార్థరూపముగాని, అపదార్థరూపముగాని, పంచభూతాత్మగాని, పంచభూతరూపముగాని గాకయుండును. కాని యీ దృశ్యరూపము నొందిన దంతయు షష్ఠేంద్రియమనదగు మనస్సేయగును.

తదతీతం పదం యత్స్యాత్తన్న కించిదివేహ తత్
యథాభూతమిదం సమ్యగ్జ్ఞస్య సంపశ్యతే జగత్. 44

అట్టి 'మనస్సునకు పరమగు ఆత్మతత్వము' ఏమియు కాదనుట యసత్యము. కాని యథారూపమున నీజగత్తును గాంచువానికంతయు నాయాత్మయే యగును.

సర్వమాత్మమయం విశ్వం నాస్త్యనాత్మమయం క్వచిత్
కాఠిన్యద్రవణస్పన్దభావకాశావలోకనైః. 45
ఆత్మైవ సర్వం సర్వేషు భూవార్యనిలఖాగ్నిషు.

ఈ జగత్తంతయు ఆత్మమయమైయున్నది. ఆత్మకు భిన్నముగ నేదియును లేదు. ఆత్మయే పృథివ్యాపస్తేజోవాయురాకాశములందు కాఠిన్య, ద్రవత్వ, ప్రకాశన, సంచలన, అవకాశాది గుణములచే ప్రకాశించుచు సర్వరూపము ధరించి నటునివలె చెన్నొందుచున్నది.

సత్తైవాస్తి న వస్తూనాం యా యా రామ చితా వినా
వ్యతిరిక్తం తతోఽస్మీతి విద్ధి ప్రోన్మత్తజల్పితమ్. 46

ఓరామా! చైతన్యము లేనిచో వస్తువుల సత్తయే సిద్ధించదు. మఱియు 'ఆత్మకు భిన్నముగ నేనున్నాను'ను వాక్యము ఉన్మత్తప్రలాపమే యగును.

ఏకో జగన్తి సకలాని సమస్తకాల
కల్పక్రమాన్తరగతాని గతాగతాని,



ఆత్మైవ నేతరకలాకలనాస్తి కాచి
దిత్థం మతిర్భవ తయాతిగతో మహాత్మన్. 47

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే షూపశమప్రకరణే మోక్షస్వరూపోపదేశో నామ
ద్విసప్తతితమః సర్గః ॥ 72 ॥.

మహాత్ముడవగు నో రామా! సమస్త దేశకాలములును, అనంతకోటి కల్పములును తన్మధ్యమున ప్రవేశించిన యనేకబ్రహ్మండములును, వానియందలి వివిధజీవులయొక్క గమనాగమనరూపవికారములును ఆత్మయొక్కటియే యగును. ఇందు మఱొక కల్పనయెద్దియును లేదు. ఇట్టి నిశ్చయబుద్ధిగల్గి యీ బుద్ధికంటెను పరుడవై ప్రపంచాతీతుడవు గమ్ము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
మోక్షస్వరూపోపదేశమను ద్విసప్తతితమ
సర్గము ॥ 72 ॥

---

త్రిసప్తతితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవంవిచారయా దృష్ట్యా ద్వైతత్యాగేన రాఘవ
స్వభావః ప్రాప్యతే తజ్జైస్తజ్జైశ్చిన్తామణిర్యథా. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! చింతామణి నెఱింగిన దేవతలద్దానిని బొందునట్లు, నైవిధమున విచారదృష్టిచేతను, ద్వైతత్యాగముచేతను, ఆత్మస్థితిరూపమగు ముక్తిని జీవులు స్వభావముగనే పొందుచున్నారు.

అథేమామపరాం దృష్టిం శృణు రామానయా యథా
దృశ్యస్యాత్మానమచలం భవిష్యసి చ దివ్యదృక్. 2

ఓ రామా! ఇక యెద్దానిచే దృశ్యముయొక్క స్వరూపమును, అచలమగు స్వాత్మను యెఱింగి దివ్యదృష్టి గలవాడగుదువో అట్టి యుత్తమదృష్టి నిపుడు వివరించుచున్నాను, వినుము.

అహం ఖమహమాదిత్యో దిశోఽహమహమప్యధః
అహం దైత్యా అహం దేవా లోకాశ్చాహ మహం మహః. 3
అహం తమోఽహమభ్రాణి భూః సముద్రాదికం త్వహమ్
రజో వాయురథాగ్నిశ్చ జగత్సర్వమిదం త్వహమ్. 4
జగత్త్రయేఽహం సర్వత్ర య ఆత్మైవ కిలాస్థితః
కోఽహం కిమన్యద్దేహాది ద్విత్వమేకస్య కీదృశమ్. 5

'నేనాకాశమును, నేనే సూర్యుడను, దిక్కులన్నియును నేనే, ఊర్ధ్వాధోభాగములు నేనే, దైత్యులును నేనే, దేవతలు నేనే, స్వర్గలోకములు నేనే, చంద్రాదుల ప్రకాశమున్న నేనే, అంధకారము నేనే, మేఘమండలమును నేనే, పృథివీ సముద్రాదులున్ను నేనే, ధూళియు అగ్నియు నేనే, వెయ్యేల, యీ జగత్తంతయు నేనే. ముల్లోకములందును ఆత్మయగు నేనే నిక్కముగ్గ యుండియున్నాను. నేను పరిచ్ఛిన్నుడ నెట్లగుదును ? నాకన్యముగ యీ దేహాదు లెట్లు గలవు ? సర్వభూతస్వరూపుడనై యేకమైనట్టి నాయందిక ద్వైత (స్వగత) భేదమెద్ది ?

ఇతి నిశ్చయవానన్తస్సర్వాత్మతయా జగత్
పశ్య హర్ష విషాదాభ్యాం నావశః పరి భూయసే. 6

ఇట్లు విచారించి, నిశ్చయయుతుడవై జగత్తంతయు నాత్మరూపముగ గాంచువాడవై హర్షశోకములకు వశుడవుగాక, వాటిచే పరాజితుడవై ద్వబడక యుందువు.

తన్మయేఽస్మిన్నిఖిల జగత్యఖిలే సంస్థితేఽనఘ
కిమాత్మీయం పరం కిం వ్యాత్మకమలేపణ కథ్యతామ్. 7

కమలనేత్రుడవును పాపరహితుడవు నగు నో రామా ! ఈ ప్రపంచమంతయు ఆత్మమయమైయుండ నిక ఆత్మీయమేమియో పరకీయమేమియో వచింపుము ?

కిం తజ్జ్ఞవ్యతిరేకేణ విద్యతే యదుపాగతమ్
హర్షమేతు విషాదం వా విషాదే జ్ఞో జగన్మయః. 8

ఈ జగత్తున యేదైన సంప్రాప్తించిన నయ్యది ఆత్మజ్ఞాని కన్యముకాదు గనుక జ్ఞానియైనయాతడు హర్షశోకములం బొందవలిలేదు. అట్లు పొందినచో నాతడజ్ఞుడును, జగన్మయుడు నగునే కాని చిన్మయుడు కానేరడు.

అహంకారదృశావేతే సాత్వికే ద్వేఽతినిర్మలే
తత్త్వజ్ఞానాత్ప్రవర్తేతే మోక్షదే పారమార్థికే. 9

ఈ చెప్పబోవు అహంకారదృష్టులు రెండును నిర్మలములును, సాత్వికములును, తత్త్వజ్ఞానజనితములును, మోక్షదాయకములును, పారమార్థికములునై యున్నవి.

పరోఽణుః సకలాతీతరూపోఽహం చేత్యహంకృతిః
ప్రథమా సర్వమేవాహమిత్యన్యోక్తా రఘూద్వహ. 10

రఘుకులశ్రేష్ఠుడవగు నో రామా ! 'ఆకాశముకంటెను సూక్ష్మమై, అన్నిటికిని పరమైనట్టి చిత్స్వరూపమగు ఆత్మయే నేన'ను యహంకారము మొదటిది. 'సర్వము నేనే' యను అహంకారము రెండవది.

అహంకారదృగన్యా తు తృతీయా విద్యతేఽనఘ
దేహోఽహమితి తాం విద్ధి దుఃఖాయైవ న శాన్తయే. 11

పాపరహితుడవగు నో రామా ! 'ఈ దేహము నేన'ను యహంకారము మూడవది. ఇది దుఃఖదాయకమేగాని శాంతిప్రదము కాదని యెఱుంగుము.



అథ చైతత్త్రయమపి త్యక్త్వా సకలసిద్ధయే
యచ్ఛేషం తదుపాలమ్బ్య తిష్ఠావష్టబ్ధతత్పరః. 12

ఇక నీ మూడహంకారములం ద్యజించి శేషించు నిరహంభావరూపమైన పూర్ణచిన్మాత్రమునవలంబించి, యందే తత్పరుడవై యుందుము.

సర్వాతీతస్వరూపోఽపి సర్వసత్తాతిగోఽపి చ
అసత్తాపూరితజగదస్త్యేవాత్మా ప్రకాశకః. 13

అన్నిటికతీతమైనను, సత్తలన్నింటికి పరమైనను తనమాయాశక్తిచే జగత్తును పరిపూర్ణముగ వ్యాప్తమును ఆత్మ స్వయంప్రకాశమై వెలుగుచున్నది.

స్వానుభూత్యైవ పశ్యాశు స ఏవాసి సదోదితః
సాశయం హృదయగ్రన్థిం త్యజ తత్త్వవిదాంవర 14

తత్వజ్ఞులలో శ్రేష్ఠుడవగు నో రామా ! నిత్యోదితమైన ఆత్మయే నీవని స్వానుభవముద్వారా శీఘ్రముగ తెలిసికొని దేహాదివాసనాసహితమగు హృదయగ్రంథిని వీడుము.

నాత్మాస్త్యనుమయా రామ న చాప్తవచనాదినా
సర్వదా సర్వథా సర్వం స ప్రత్యక్షోఽనుభూతితః. 15

ఓ రామా ! ఆత్మ అనుమాన, శబ్దప్రమాణములచే పొందబడునది కాదు. సదా సర్వవిధముల సర్వరూపమైనట్టి యది అనుభవముచేతనే ప్రత్యక్షమగును.

యదిదం స్పర్శనం స్పన్దం కించిద్యత్సంవిదాద్యపి
తత్సర్వమాత్మా భగవాన్దృశ్యదర్శనవర్జితః. 16

అంతఃకరణవృత్తిచే గల్గు బాహ్యాభ్యంతరపదార్థదర్శనమున్ను, అనుమాన, ఉపమాన, శబ్దప్రమాణ జనితమగు జ్ఞానమున్ను అంతయు, దృశ్యత్యాగముచేతను, అంతఃకరణవృత్తిరూపమగు ఉపాధిత్యాగముచేతను భగవంతుడగు ఆత్మయే యగును.

న సన్నాసన్న సో దేవో నాణుర్నాపి మహానసౌ
నాప్యేతయోర్ద్వయోర్మధ్యం స ఏవేదం చ సర్వతః. 17

దేవుడగు నాయాత్మ సత్తుకాదు, అసత్తున్నుకాదు; అణురూపము కాదు, మహద్రూపమున్నుకాదు; సదసత్తుగల మధ్యగల సత్యాసత్యస్వరూపమున్ను కాదు. కాని సర్వము నదియే యగును.

స ఏవ చైవం వదతి స చ వక్తుం న యుజ్యతే
న తదదన్యదిదం తాత పశ్యాత్మానమనామయమ్. 18

ప్రియుడవగునో రామా ! 'అదియే ఆత్మ'యని చెప్పుదురేకాని యథార్థముగ నది వచించుట కలవిగానిది. దాని కన్యముగ యేదియు లేదుగాన నిర్వికారమగు నాయాత్మనే సర్వత్ర గాంచుము.

నాత్మాయమయమప్యాత్మా సంజ్ఞాభేద ఇతి స్వయమ్
తేనైవ సర్వగతయా శక్త్యా స్వాత్మని కల్పితః. 19

'ఇది ఆత్మ, ఇది ఆత్మకాదు' అను నీ నామరూపవిభాగము నాత్మయే సర్వవ్యాపకమగు తన యజ్ఞానశక్తిచే తనయందు కల్పించుకొనినది.

సంస్థితః స హి సర్వత్ర త్రిషు కాలేషు భాస్కరః
సూక్ష్మత్వాత్సుమహత్త్వాచ్చ కేవలం న విభావ్యతే. 20

ప్రకాశవంతమగు నాయాత్మ త్రికాలములందును యెల్లెడల స్థితిగల్గియున్నది. మఱియు, అతిసూక్ష్మమును, మహత్తరమునగుటచే స్థూల (దేహాది) పదార్థములం దాసక్తబుద్ధిగల మనుజులచే నది భావింపశక్యము కానిదై యుండును.

సత్స్వనన్తపదార్థేషు జీవత్వేనాభిబిమ్బతి
ఆత్మా పుర్యష్టకాదర్శే స్వభావవశతః స్వతః. 21

ఆత్మ, సృష్టియందలి యనేకపదార్థములందున్నను, పుర్యష్టక (లింగశరీర) మను యద్దమున మాత్రము స్వభావవశమున జీవరూపముగ ప్రతిబింబించుచున్నది.

పుర్యష్టకోదయాదేవ స్వయమాత్మానుభూయతే
సర్వదా సర్వసంస్థః ఖే ఘనాస్పన్దాదివానిలః. 22

పంఖాదుల చలనముచే ఆకాశమున వాయువనుభూతమగునట్లు, సదా అన్నింటియం దున్నప్పటికి లింగశరీరమున నుదయించినపుడే ఆత్మ అహంకారరూపమున వ్యక్తమై యనుభూతి మగుచున్నది.

చిదాత్మా సర్వగో వ్యాపీ న క్వచిన్నామ సంస్థితః
యద్వత్సర్వపదార్థానాం సత్తా తద్వన్మహేశ్వరః. 23

చిత్స్వరూపమై, సర్వవ్యాపకమైనట్టి ఆత్మ దేహమాత్రముననే గలదనుట యసత్యము. సర్వపదార్థములందును సత్త యెట్లు గలదో, అట్లనే మహేశ్వరుఁడగు నాయాత్మ యంతటను గలదు.

సతి పుర్యష్టకే తస్మిఞ్జీవః స్ఫురతి నోపలే
సతి వాయావివ రజః సతి దీప ఇవేక్షణమ్. 24

వాయువుండిన, ధూళి యెగురునట్లును దీపముండిన, కాంతి గలుగునట్లును, లింగదేహ ముండిన జీవుడున్ను స్ఫురించును.

ఇయం పుర్యష్టకే స్వేచ్ఛా స్వాత్మన్యేవాత్మని స్థితే
సతి స్ఫురత్యభ్యుదితే భానావివ జనైషణా. 25

ఆకాశమున సూర్యుడుదయించుటచే జనులకు దైనికవ్యాపారములం దిచ్ఛ జనించునట్లు పరమప్రేమాస్పదమై నిరతిశయానందరూపమైన ఆత్మ స్ఫురించిననే లింగశరీరమునగల విషయ భోగేచ్ఛయు సంభవముగుచున్నది. [illegible] సర్వము ఆత్మప్రీతికొఱకేగదా!



యది సూర్యే స్థితే వ్యోమ్ని తాదృశోచితసంస్థితిః
నశ్యతి వ్యవహారోఽయం భాస్కరే తత్కిమాగతమ్. 26
యద్యాత్మని స్థితే దేవే తత్సత్తాలబ్ధసంస్థితిః
దేహో నాశముపాయాతి తత్కిం నష్టమిహాత్మని. 27

సూర్యుఁడాకసమున నుండినపుడు తత్సమయోచితకార్యము జనులకు వినష్టమైన నద్దానిచే సూర్యునకేమియు హానిలేనట్లు ఆత్మదేవుని సత్తచే స్థితినొందినట్టి యీ దేహమున్ను నశించిన ఆత్మకేమి హాని?

న జాయతే న మ్రియతే నాదత్తే నాభివాఞ్ఛతి
న ముక్తో న చ బద్ధోఽయమాత్మా సర్వస్య సర్వదా. 28

ప్రాణికోట్లన్నింటియొక్క ఆత్మయు యేకాలమునను జనించుటలేదు, మరణించుటలేదు, గ్రహించుటలేదు, వాంఛించుటలేదు, బంధింపబడలేదు, ముక్తినొందుటయు లేదు.

ఆత్మా ప్రబోధాభ్యుదితా నిరాత్మన్యాత్మతాంగతా
సర్పరజ్జుభ్రమాకారా భ్రాన్తిర్దుఃఖాయ కేవలమ్. 29

అజ్ఞానజనితమై, అనాత్మయందాత్మత్వమొంది, రజ్జుసర్పభ్రమవలె దేహాదులదాంత్మ భ్రాంతిగల్గి యుండుచో ఆత్మ కేవలము దుఃఖభాజనమే యగును.

అనాదిత్వాన్న జాతోఽయమజాతత్వాన్న నశ్యతి
ఆత్మాత్మవ్యతిరిక్తం తు నాభివాఞ్ఛత్యసంభవాత్. 30

అనాదియగుటంబట్టి ఆత్మ యెన్నడును యుత్పన్నముకాలేదు. ఉత్పన్నము కానందున నశించుటయులేదు. మఱియు నది తనకు భిన్నమగు దేనిని వాంఛించుటలేదు. ఆత్మకు భిన్నముగ యేదియు సంభవింపదు గదా!

దిక్కాలాద్యనవచ్ఛేదాన్న బద్ధోఽయం కదాచన
బన్ధాభావే క్వ ముక్తిః స్యాదమోక్షస్తేన సంస్థితః. 31

దేశకాలాదులచే నపరిచ్ఛిన్నమగుటచే ఆత్మ యెపుడును బంధింపబడనిదే యగును. బద్ధమేగానందున నిక ముక్తియెందులకు? యెవనికొఱకు? కాన, ఆత్మ మోక్షాభావమే గలదగుచున్నది.

ఏవం గుణవిశిష్టోఽయమాత్మా సర్వస్య రాఘవ
అవిచారవశాన్మూఢో లోకోఽయం పరిరోదితి. 32

ఓ రాఘవా! ఇట్టి స్వభావము గలిగియే సర్వుల యాత్మయు దనరుచున్నది. అవిచార వశముననే మూఢులగు జనులు దుఃఖమునొందుచున్నారు.

సమ్యగాలోకితాశేష పూర్వాపరజగత్క్రమః
మా శోకం గచ్ఛ సుమతే మూర్ఖోపగతలోకవత్. 33

కాన సుమతుఁడవగు నో రామా! పూర్వాపరజగత్క్రమమును లెస్సగ విచారించి, మూఢుల పగిది దుఃఖమునొందక యుండుము.

ద్వే ఏవ కలనే త్యక్త్వా మోక్షబన్ధాత్మికే యథా
విదుషా వ్యవహర్తవ్యం యన్త్రేణేవాత్మమానినా. 34

విజ్ఞుడు బంధమోక్షములను కల్పనల రెంటిని గూడ త్యజించి, ఆత్మస్థుడై, యంత్రము వలె మానముతో వ్యవహరింపవలెను.

న మోక్షో నభసః పృష్ఠే న పాతాలే న భూతలే
మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞానవిబోధితమ్. 35

మోక్ష మాకాశమునగాని, పాతాళమునగాని, భూతలమునగాని లేదు. ఉత్తమ (ఆత్మ) జ్ఞానముచే బోధితమగు నిర్మలచిత్తమే మోక్షము.

సకలాశాస్వసంసక్త్యా యత్స్వయం చేతసః క్షయః
స మోక్షనామ్నా కథిత స్తత్త్వజ్ఞైరాత్మదర్శిభిః. 36

వాంఛితపదార్థము లన్నింటియందునుగల ఆసక్తి తొలగుటచే సంభవించు చిత్తము యొక్క స్వయం వినాశమే మోక్షమని ఆత్మజ్ఞులగు మహనీయులు బల్కిరి.

యావత్ప్రబోధో విమలో నోదితస్తావదేవ సః
మౌర్ఖ్యాద్దీనతయా రామ భక్త్యా మోక్షోభివాఞ్ఛ్యతే. 37

ఓ రామా! నిర్మలమగు ఆత్మజ్ఞానము కలుగనంతవఱకు మనుజుడు దీనుడై భక్త్యాదులచే మోక్ష మభిలషించుచుండును.

పరం ప్రబోధమాసాద్య చిత్తే చిత్తత్వతాం గతే
దశ మోక్షా న వాఞ్ఛ్యన్తే కిముతైకో హి మోక్షకః. 38

పరమవిజ్ఞానమొంది, చిత్తము బ్రహ్మత్వదశనొందినపుడు పది మోక్షములనైనను కోరదు. అట్టిచోనిక యొక మోక్షమును గూర్చి వేఱు చెప్పవలెనా?

అయం మోక్ష స్త్వయం బన్ధః పేలవాం కలనామితి
పరిత్యజ్య మహాత్యాగీ స త్వమేవ భవాభవ. 39

సంసారరహితుఁడవగునో రామా! 'ఇది బంధము', 'ఇది మోక్షమ'ను నీ తుచ్ఛకల్పనను త్యజించి మహాత్యాగివై మోక్షరూపుఁడవే గమ్ము.

పరిగలితవికల్పనాం ప్రయాతః
సగరసుతౌఘనిఖాతమేఖలాఙ్కామ్,
అవనివలయమ న్తర స్తసఙ్గ
శ్చిరమనుపాలయ సర్వదోదితశ్రీః. 40

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే స్వాత్మవిచారో నామ త్రిసప్తతితమః
సర్గః ॥ 73 ॥



నశించిన వికల్పములుగలవాఁడవై, అంతస్సంగరహితుఁడవై నిత్యోదితమగు శోభగల్గి, సగరపుత్రులచే త్రవ్వబడిన సముద్రమను మేఖలతోఁగూడినట్టి యీ భూవలయమును చిరకాలము పాలింపుము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
స్వాత్మవిచారమను త్రిసప్తతితమ
సర్గము ॥ 73 ॥

---

చతుః సప్తతితమః సర్గః.

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

లీలయా పశ్యతివపుః కాలేనాత్మని జాయతే
రమ్యస్యాపశ్యతో వక్త్రం హృది దారూపస్యథేరివ. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! రమ్యమైన దారాపుత్రాదుల ముఖంబులవలోకింపమి విరహమునందు కృశత్వ, కురూపత్వాదులచే యుదాసీనత్వము జనించువిధమున, ఆత్మయు పరమ ప్రేమాస్పదమగు తన స్వరూపమును గాంచమి, కామ, కర్మ, వాసనా పరిపాకముచే క్రమప్రాప్తమగు సృష్టియు, జాగరణకాలమందు చైతన్యముయొక్క లీలామాత్రముచేగల్గు స్థూల, సూక్ష్మ, సమష్టి, వ్యష్టి శరీరములున్ను యుత్పన్నములగుచున్నవి.

తద్వశాదియమాయాతా మహతీ మేదురోదరా
మాయా మదమహాశక్తిః సురాస్వాదలవాదివ. 2

స్వల్పముగ మద్యము నాస్వాదించుటచే గొప్పదగు మదశక్తి గలుగునట్లు స్థూల, సూక్ష్మ, సమష్టి, వ్యష్టి శరీరములందలి యహంభావము (అధ్యాసము) చేసలి కాలమున మాయ జనించినది.

తయానయా వికారిణ్యా తదతద్భావభూతయా
ఇదం సంపన్నమఖిలం తాపాదివ మరౌ పయః. 3

అధిక వేడిమిచే మరుభూమియందు జలముత్పన్నమగునట్లు, పుణ్యపాపవాసనాది అనర్థపరంపరారూపమై, వికారమయమై, ఆత్మయొక్క అన్యథాభావముచే జనించినదైన మాయచే యీ జగత్తంతయు నుత్పన్నమైనది.

మనోబుద్ధిరహంకారో వాసనాశ్చేన్ద్రియాణ్యపి
ఏవం కలితనామాఙ్కైః స్ఫురత్యాత్మాబ్ధిరమ్బుభిః. 4

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, వాసన, ఇంద్రియములు, మున్నగు కల్పిత నామరూపచిహ్నములను జలములతోఁగూడి ఆత్మయను సముద్రము స్ఫురించుచున్నది.

చిత్తాహంకారయోర్ద్విత్వం వచస్యస్తి న వస్తుతః
యచ్చిత్తం సహ్యహంకారో యోఽహంకారో మనో హి తత్. 5

పదార్థములఁగూర్చి మననము చేయుటచే మనస్సు, స్మరించుటచే చిత్తము, నిశ్చయించుటచే బుద్ధి, అభిమానించుటచే అహంకారము యేర్పడుచున్నవి, ఇవన్నియు నొక్క యంతఃకరణముయొక్క వివిధనామములే గాన, చిత్తాహంకారముల భేదము వాఙ్మాత్రమేగాని యథార్థము కాదు. ఏది చిత్తమో, అదియే అహంకారము; ఏది అహంకారమో, అదియే చిత్తము.

వ్యతిరిక్తం హిమాచ్ఛౌక్ల్యమితి సంకల్ప్యతే యథా
ముధైవ కల్ప్యతే భేదశ్చిత్తాహంకారయో స్తథా. 6

మంచుకంటె తెలుపుదనము వేఱనుట యసత్యకల్పన యెట్లగునో, అట్లనే చిత్తాహంకారముల భేదమున్ను మిథ్యాకల్పనయే యగును.

మనోహంకారయోర న్తర్ద్వయోరేకతరక్షయే
క్షీణే ద్వే ఏవ హి యథా పటశౌక్ల్యే పటక్షయే. 7

వస్త్రము నశింప, దాని తెలుపుదనమున్ను నశించునట్లు, అహంకార, మనంబులందొకటి నశింప, రెండును నాశమొందుచున్నవి.

తుచ్ఛాం మోక్షధియం త్యక్త్వా బన్ధబుద్ధిం తథైషణామ్
స్వవైరాగ్యవివేకాభ్యాం కేవలం క్షపయేన్మనః. 8

తుచ్ఛమగు మోక్షబుద్ధిని వదలి, యాపిదప బంధబుద్ధిని, ధనపుత్రాదులందలి యాశను గూడ త్యజించి స్వవివేకవైరాగ్యములచే మనస్సును లెస్సగ వినాశమొనర్పుము.

మోక్షో మేస్త్వితి చిన్తాన్తర్జాతా చేదుత్థితం మనః
మననోత్కం మనస్యుచ్చై ర్వపుర్దోషాయ కేవలమ్. 9

'నాకు మోక్షము కలుగవలెన'ను కోరిక చిత్తమున నుదయించుటతోడనే మనస్సు ప్రబలముగ నావిర్భవించినదనియే యెఱుంగవలెను. అట్లు మనస్సు మననోత్కంఠితముకాగా క్రమముగ నదియే దేహాకారమును ధరించి కేవలము దోషమునే కలుగజేయును.

ఆత్మన్యతీతే సర్వస్మాత్సర్వభూతేఽథవా తతే
కో బన్ధః కశ్చ వా మోక్షో నిర్మూలం మననం కురు. 10

ఓ రామా ! ఆత్మ సర్వాతీతమై, సర్వభూతములందును వ్యాపించియుండ నిక బంధమేమి మోక్షమేమి? కాన నీవు నీ మనంబును మననరహితముగా జేయుము.

వాయుః స్పన్దనధర్మత్వాద్యదా చలతి దేహకే
తదా స్ఫురతి హస్తాఙ్ఘ్రిరసనాపల్లవావలీ. 11
పాదపే పల్లవశ్రేణీం చాలయత్యనిలో యథా
తథైవాఙ్గావలీం వాయుర్దేహే సంచాలయత్యలమ్. 12

ప్రాణవాయువు చలనధర్మము కలదిగాన, యీ తుచ్ఛదేహమున నది యెపుడు చలించునో, అపుడు హస్తపాదజిహ్వాద్యంగరూప పల్లవసముదాయమున్ను చలించుచున్నది. వృక్షమున పల్లవములను వాయువు కదలించునట్లు దేహమునను అవయవములను ప్రాణవాయువు చలింపజేయుచున్నది.



చిత్సర్వవ్యాపినీ సూక్ష్మా న చలా నైవచాల్యతే
న స్వతః స్పన్దమాయాతి దేవాచల ఇవానిలైః. 13

సర్వవ్యాపియగు చైతన్యము చలింపకయు, దేనిచేతను చలింపబడకయు నుండును. వాయువులచే పర్వతము చలింపనట్లు స్వయముగ నది యెన్నడును చలింపనిదై యుండును.

ప్రతిబిమ్బితసర్వార్థా కేవలం స్వాత్మని స్థితా
ప్రకాశయతి బోధేన జగన్తీమాని దీపవత్. 14

దీపము ఘటపటాది వస్తువులఁ బ్రకాశింపజేయునట్లు, సర్వపదార్థములందును ప్రతిబింబించి, స్వస్వరూపమున నెలకొనియున్న యీ చైతన్యము జ్ఞానముద్వారా యనేక బ్రహ్మాండములఁ బ్రకాశింప జేయుచున్నది.

తత్ర కోఽయం ముధా మోహో భవతామతిదుఃఖదః
అయం సోఽహం మమాఙ్గాని మమేదం చేతి దుర్ధియామ్. 15

ఇట్లుండ నిక దుర్బుద్ధులగు మీకీ 'దేహాదులు నేను, ఇవి నా యంగములు, ఇది నా ధనము'ను నీ యతిదుఃఖదాయకమగు మిథ్యామోహ మెటనుండి గల్గినది?

ఇతి కల్లోలహతయా దృశా నిత్యమనిత్యయా
జ్ఞత్వకర్తృత్వభోక్తృత్వ క్రియా సముపలభ్యతే. 16

ఇవ్విధమున కేవలమాత్మకు విరుద్ధమైన ధర్మములుగల యీ దేహమందు అవిద్యాతరంగరూపములగు రాగాదులచే హతమైనట్టి అనిత్యదృష్టిచే జ్ఞత్వ, కర్తృత్వ, భోక్తృత్వాది ధర్మములతో గూడిన క్రియలు సంప్రాప్తించుచున్నవి.

తత్రాయమహమాఙ్గన్తా భోక్తా కర్తేతి జాయతే
ముధైవాజ్ఞాతతాపోత్థా మృగతృష్ణేవ వాసనా. 17

వేడిమియొక్క ధర్మమెఱుంగమిచే మృగతృష్ణ గోచరించునట్లు, యీదేహముననే 'నేనాగంతను, కర్తను, భోక్త'నను మిథ్యావాసన గలుగుచున్నది.

అజ్ఞత్వైషా మనోమత్తమృగం విషయతర్షులమ్
అసత్యైవ హి సత్యేవ మృగతృష్ణేవ కర్షతి. 18

మృగతృష్ణ హరిణమును తనయొద్దకాకర్షించునట్లు మిథ్యారూపమునదాక, సత్యముగ దలంపబడిన నీ యవిద్య ప్రమత్తయు, విషయలుబ్ధయునగు మనోమృగమును యీడ్చుచున్నది.

విజ్ఞాతా సత్యరూపాఙ్గ నాశం యాతి పలాయతే
విప్రమధ్యాత్పరిజ్ఞాతా యథా చాణ్డాలకన్యకా. 19

ఎఱుంగబడిన చండాలకన్య బ్రహ్మణుల మధ్యనుండి పారిపోవునట్లు, మిథ్యారూపమున యెఱుంగబడిన నీ యవిద్యయు నశించి పలాయనమగుచున్నది.

అవిద్యా సంపరిజ్ఞాతా న చైనం పరికర్షతి
మృగతృష్ణా పరిజ్ఞాతా తర్షులం నావకర్షతి. 20

మృగతృష్ణ యెఱుంగబడ నిక యది దప్పికగొనిన మృగము నాకర్షింపనట్లు, తెలిసికొనబడిన అవిద్యయు మనస్సు నీడ్వకుండును.

పరమార్థావబోధేన సమూలం రామ వాసనా
దీపేనేవాన్ధకారశ్రీర్గలత్యాలోక ఏతి చ. 21

ఓరామా! దీపముచే యంధకారము నశించి ప్రకాశ ముదయించునట్లు పరమార్థ (ఆత్మ) జ్ఞానముచే వాసనయు సమూల (అవిద్యాసహితముగ) నశించును.

నాస్త్యవిద్యేతి సంజాతే నిశ్చయే శాస్త్రయుక్తితః
గలత్యవిద్యా తాపేన తుషారకణికా యథా. 22

వేడిమిచే మంచుబిందువు కరగునట్లు, శాస్త్ర, యుక్తులచే 'అవిద్య లేద'ను నిశ్చయము గలుగునప్పుడా యవిద్యయు నశించును.

దేహస్యాస్య జడస్యార్థే కిం భోగైరితి నిశ్చయః
భినత్త్యాశామలం జ్ఞాత్వా పఞ్జరం కేసరీ యథా. 23

సింహము బోనును పగులగొట్టునట్లు, 'జడమగు యీ దేహమునకై భోగములతో నేమి ప్రయోజనమ'ను నిశ్చయముగలవాడు ఆశయను మలమును నశింపజేయుచున్నాడు.

ఆశాపరికరే రామ నూనం పరిహృతే హృదా
పుమానాగతసౌన్దర్యో హ్లాదమాయాతి చన్ద్రవత్. 24

ఆశయొక్క పరివారమగు దేహాభిమానాదులు హృదయమునుండి తొలగింపబడ, నంత సౌందర్యాది గుణముల నొందినట్టి మనుజుడు చంద్రునివలె యితరుల ప్రసన్నులుగ జేయును.

పరాం శీతలతామేతి వృష్టిధౌత ఇవాచలః
నిర్వృతిం పరమాం ధత్తే ప్రాప్త రాజ్య ఇవాధమః. 25

వర్షముచే కడుగబడిన పర్వతమువలె నాతడు కడుశీతలత్వము నొందును; మఱియు, రాజ్యప్రాప్తినొందిన దరిద్రునివలె పరమశాంతిని బడయును.

శోభతే పరయా లక్ష్మ్యా శరదీవ నభస్తలమ్
ఆత్మన్యేవ నమాత్యుచ్చైః కల్పస్యాన్త ఇవార్ణవః. 26

శరదాకాశమువలె జ్ఞాని యధికశోభాన్వితుఁడై యుండును. మహాద్రూపముగల్గి కల్పాంత సముద్రమువోలె తనయందు తానిముడక (అపరిచ్ఛిన్నుడై) యుండును.

భవత్యపేతసంరమ్భో వృష్టిమూక ఇవామ్బుదః
తిష్ఠత్యాత్మని సంవేత్తా ప్రశాన్త ఇవ వారిధిః. 27

శరత్కాలమందలి వర్షాంత మేఘమువలె క్షోభవర్జితుడై యుండును; సముద్రమునవలె స్వాత్మయందు ప్రశాంతుడై యుండును.

పరం ధైర్యముపాదత్తే స్థైర్యం మేరురివాచలః
రాజతే స్వచ్ఛయా లక్ష్మ్యా శాన్తేన్ధన ఇవాచలః. 28



అత్యధిక ధైర్యమును, మేరువువంటి స్థిరత్వమును బొందును; ఇంధనము శమించిన అగ్నివలె మోక్షలక్ష్మిచే శోభిల్లును.

భవత్యాత్మని నిర్వాణః ప్రశాన్త ఇవ దీపకః
తృప్తిమాయాతి పరమాం నరః పీతామృతో యథా. 29

గాలిలేని స్థలమందున్న దీపమువలె స్వాత్మయందు పరమశాంతిని బడయును. అమృతము త్రాగిన మనుజునివలె అతిశయతృప్తిఁ జెందును.

అన్తర్దీపో ఘట ఇవ మధ్యజ్వాల ఇవానలః
స్ఫురద్దీప్తిర్మణిరివ ప్రయాత్యన్తః ప్రకాశతామ్. 30

ఘటమధ్యమున గల దీపమునవలెను, జ్వాలామధ్యమున గల అగ్నివలెను, దేదీప్యమానమగు మణివలెను ఆత్మజ్ఞాని ప్రకాశము నొందును.

సర్వాత్మకం సర్వగతం సర్వేశం సర్వనాయకమ్
సర్వాకారం నిరాకారం స్వమాత్మానం ప్రపశ్యతి. 31

సర్వాత్మకుఁడును, సర్వవ్యాపకుడును, సర్వేశుడును, సర్వనాయకుడును, సర్వాకారుడును, నిరాకారుడును నగు తన యాత్మను వీక్షించును.

హసత్యలమతీతాః స్వాః పేలవా దినసావలీః
యాసు స్మరశరశ్రేణీచపలం చిత్తమాస్థితమ్. 32

మన్మథబాణములచే చలించుచుండిన చిత్తముగల యీ గడచిన తన తుచ్ఛదివసంబులఁ గాంచి నవ్వుచుండును.

సఙ్గరఙ్గవినిర్ముక్తః శాన్తమానమనోజ్వరః
అధ్యాత్మరతిరాసీనః పూర్ణః పావనమానసః. 33

విషయసంగ, విషయానురంజనముల వీడినవాడును, అభిమాన, మనోరూప సంతాపములు శమించినవాడునగు జ్ఞాని ఆత్మయందు ప్రీతిగల్గి, పూర్ణుడై, పవిత్రచిత్తుడై యుండును.

నిర్మృష్టకామపఙ్కశ్చిన్నబన్ధనిజభ్రమః
ద్వన్ద్వదోషభయోన్ముక్తస్తీర్ణసంసారసాగరః. 34
ప్రాప్తానుత్తమవిశ్రాన్తిరగాధాలభ్యపరాస్పదః
అనివృత్తిపదం ప్రాప్తో మనసా కర్మణా గిరా. 35
సర్వాభివాఞ్ఛితారమ్భో న కించిదపి వాఞ్ఛతి
సర్వానుమోదితానన్దో న కించిదనుమోదతే. 36

కామమను పంకమును తొలగించినవాడును, బంధనమను భ్రమను నిర్మూలించినవాడును, శీతోష్ణ, సుఖదుఃఖాది ద్వంద్వదోషములనుండి విడువడినవాడును, సంసారసముద్రమును దాటినవాడును, సర్వోత్తమమగు విశ్రాంతి నొందినవాడును, సర్వాతీతమును, అలభ్యమును నగు స్థానమును పొందినవాడును, పునరాగమనరహితుడును, మోక్షసామ్రాజ్యము నలంకరించినవాడును,

ఋనో వాక్కాయములచే సర్వజనాభిలషితమగు చారిత్రముగలవాఁడును నగు ఆత్మజ్ఞాని దేనినిగూడ వాంఛింపఁడు. వాని చారిత్రఫలము నందఱును యనుమోదింతురు. కాని యాతఁడేమియు నను మోదింపఁడు.

న దదాతి న చాదత్తే న స్తౌతి న చ నిన్దతి
నాస్తమేతి న చోదేతి న తుష్యతి న శోచతి. 37

ఆతఁడేదియు నివ్వఁడు, దేనిని గ్రహింపఁడు; దేనిని స్తుతింపఁడు, దేనిని నిందింపఁడు; స్వస్వరూపముయొక్క యావిర్భావతిరోభావముల నొందఁడు; ప్రసన్నుఁడు కాఁడు, దుఃఖింపఁడు.

సర్వారమ్భపరిత్యాగీ సర్వోపాధివివర్జితః
సర్వాశాసంపరిత్యాగీ జీవన్ముక్త ఇతి స్మృతః. 38

సర్వకార్యములఁ ద్యజించినవాఁడును, సర్వోపాధివివర్జితుఁడును, సర్వాశావినిర్ముక్తుఁడును జీవన్ముక్తుఁడనఁబడును.

సర్వైషణాః పరిత్యజ్య చేతసా భవ మానవాన్
ధారా నిరవశేషేణ యథా త్యక్త్వా పయోధరః. 39

ఓ రామా! ఈషణంబులన్నింటిని పరిత్యజించి, జలధారనంతయు విడచిన మేఘమువలె చిత్తముచే మౌనము వహించియుండుము.

న తథా సుఖయత్యఙ్గ సంలగ్నా వరవర్ణినీ
యథా సుఖయతి స్వాన్తమిన్దుశీతా నిరాశతా. 40

చంద్రునివలె శీతలమైనట్టి నైరాశ్యముచే యంతఃకరణమునకు గలుగు సుఖము, అంగసంలగ్నమగు యుత్తమవనితచే గూడ కలుగనేరదు.

న తథేన్దుః సుఖయతి కణ్ఠలగ్నోఽపి రాఘవ
నైరాశ్యం సుఖయత్యన్తర్యథా సకలశీతలమ్. 41

జగంబంతయు శీతలమొనర్చునట్టి నైరాశ్యము కలుగజేయు సుఖము కంఠసంలగ్నునగు చంద్రుఁడున్ను కలుగచేయజాలఁడు.

పుష్పపూర్ణనవలతో న తథా రాజతే మధుః
యథోదారమతిర్మౌనీ నైరాశ్యసమమానసః. 42

నిరాశాయుత మనంబుగల్గి, ఉదారచిత్తుఁడై, మౌనియైనట్టి జ్ఞాని శోభించువిధమున, పుష్పప్రపూర్ణమై, నూతనలతాసంయుతమైన వసంతఋతువున్ను శోభించదు.

న హిమాద్రేర్న ముక్తాభ్యో న రమ్భాభ్యో న చన్దనాత్
న చ చన్ద్రమసః శైత్యం నైరాశ్యాద్యదవాప్యతే. 43

నైరాశ్యముచే గలుగు శీతలత్వము (శాంతి) హిమాలయముచేగాని, ముత్యములచేగాని, కదళీ వనముచేగాని, చంద్రునిచేగాని కలుగనేరదు.



అపి రాజ్యాదపి స్వర్గాదపీన్దోరపి మాధవాత్
అపి కాన్తాసమాసఙ్గాన్నైరాశ్యం పరమం సుఖమ్. 44

రాజ్యముకంటెను, స్వర్గముకంటెను, చంద్రునికంటెను, విష్ణువుకంటెను, వనితాసంగముకంటెను, నైరాశ్యము పరమమగు సుఖము.

తృణవన్నోపకుర్వన్తి యత్ర త్రిభువనశ్రియః
సా పరా నిర్వృతిః సాధో నైరాశ్యాదుపలభ్యతే. 45

సాధువగు నోరామా! ఎద్దానియందు త్రిలోకైశ్వర్యమున్ను తృణమువలె నేమియు నుపకరింపజాలకుండునో, అట్టి పరమశాంతి నైరాశ్యముచే గలుగును.

ఆపత్కరఞ్జపరశుం పరాయా నిర్వృతేః పదమ్
పుష్పగుచ్ఛం సమతరోరాలమ్బస్వ నిరాశతామ్. 46

ఓ రామా! ఆపదయను కంటకవృక్షమునకు గండ్రగొడ్డలివంటిదియు, పరమశాంతికి నిలయమును, శమమను వృక్షముయొక్క పుష్పగుచ్ఛమునగు నైరాశ్య మవలంబింపుము.

గోష్పదం పృథివీ మేరుః స్థాణురాశాః సముద్గికాః
తృణం త్రిభువనం రామ నైరాశ్యాలంకృతాకృతేః. 47

ఓరామా! నైరాశ్యమను భూషణముచే నలంకృతుఁడగువానికి భూమి గోష్పదతుల్యమును, సుమేరువు స్థాణుసమానమును, త్రిలోకములు తృణసదృశమున్ను యగును.

దానాదానసమాహారవిహార విభవాదికాః
క్రియా జగతి హాస్యన్తే నిరాశైః పురుషోత్తమైః. 48

ఈ ప్రపంచమున దానము, పరిగ్రహము, ధనాదుల సంచయము, పుత్రాదుల క్రీడ, వస్త్రాలంకారాన్నపానాదిక్రియలు మున్నగు వానినిగాంచి నిరాశాయుతుఁడగు యుత్తమమనుజుఁడు నవ్వును.

పదం యస్య న బధ్నాతి కదాచిత్కలనా హృది
తృణీకృతత్రిభువనః కేనాసావుపమీయతే. 49

ఎవని హృదయమున ఆశ నెలవుస్థాపించుకొనకుండునో, అట్టి ముల్లోకములను తృణముగనెంచు మహాత్ముని యెవనితో పోల్పనగును.

ఇదమేవాస్త్విదం మాస్తు మమేతి హృది రఞ్జనా
న యస్యాస్తి తమాత్మేశం తోలయన్తి కథం జనాః. 50

'ఇది నాకు కావలెను, ఇది వలద'నునీ రాగద్వేష మెవని హృదయమునలేదో, అట్టి స్వాధీనచిత్తుని బోల్చుటకు మనుజులకెట్లు సాధ్యమగును?

సర్వసంకటపర్యన్తమసంకటమలం సుఖమ్
సౌభాగ్యం పరమం బుద్ధైర్నైరాశ్యమవలమ్బ్యతామ్. 51

ఓ రామా! సంకటవర్జితమును, పూర్ణసుఖస్వరూపమును, బుద్ధియొక్క పరమసౌభాగ్యరూపమునునగు నైరాశ్యమును నవలంబింపుము.

నాశాస్తేనత్వమాశానాం విద్ధి మిథ్యాభ్రమం జగత్
వహద్రథస్థదిక్చక్రపరావర్తవదుత్థితమ్. 52

ఓ రామా! ఆశతో నీకుగాని, నీకాశతోగాని సంబంధమేమియును లేదు. కాన, కదలుచున్న రథముపైనున్నవాని కిరువైపులగల వృక్షలతాదులు చక్రాకారముగ తిరుగునట్లు భాసించువిధమున, ఈ జగత్తునున్ను నీవు మిథ్యగా నెఱుంగుము.

కిం ముహ్యసి మహాబాహోమూర్ఖవద్బోధితోఽపి సన్
మమేదం తదయం సోఽహమిత్యుద్భ్రాన్తేన చేతసా. 53

మహాబాహుండవగు నోరామా! బోధితుండవైనను నీవింకను 'ఆ పదార్థములు నావి, ఈ దేహము నేన'ని యెంచుచు భ్రాంతచిత్తముచే మూఢునిపగిది యేల విమోహితుండవగుచుంటి?

ఆత్మైవేదం జగత్సర్వం నానాతేహ న విద్యతే
ఏకరూపం జగజ్జ్ఞాత్వా ధీరైర్నామ న ఖిద్యతే. 54

ఈ ప్రపంచమంతయు ఆత్మయే. ఇట ననేకత్వము లేదు. కాన యేకమైన ఆత్మరూపముగ యీ జగత్తు నెఱింగి ధీరులు ఖేదమొందకయున్నారు.

యథాభూతపదార్థౌఘదర్శనాదేవ రాఘవ
పరమాశ్వాసనం బుద్ధేర్నైరాశ్యమధిగచ్ఛతి. 55

ఓ రాఘవా! పదార్థములన్నింటియొక్క యథార్థ (ఆత్మరూప) దర్శనముచే బుద్ధికి పరమస్థైర్యము లభించును. మఱియు నైరాశ్యముదయించును.

భావాభావవిసంవాదముక్తమాద్యన్తయోః స్థితమ్
యద్రూపం తత్సమాలమ్బ్య పదార్థానాం స్థితిం కురు. 56

భావాభావ (ఉత్పత్తినాశ) వికల్పరహితుడవై, సర్వవస్తువుల యాద్యంతములందున్నట్టి సచ్చిన్మాత్రమున నవలంబించి, పదార్థముల స్థితిని నిశ్చయింపుము.

వైరాగ్యవీరమనసో మాయేయమతి మోహినీ
పలాయ్య యాతి సంసారీ మృగీ కేసరిణో యథా 57

వైరాగ్యముచే ధీరమైనట్టి మనంబుగలవానినుండి మహామోహప్రదమగు యీ సాంసారిక మాయ, సింహమునుండి హరిణమువలె, యెటకో పారిపోవుచున్నది.

కాన్తాముద్దామమదనాం లోలాం వనలతా[illegible]
జర్జరోపలపాషాణాలీసమాం పశ్యతి ధీరధీః. 58

కామోన్మత్తయై, వనలతవోలె చంచలమైనట్టి స్త్రీని ధీరబుద్ధియగు ఆత్మజ్ఞాని శిథిలమైన శిలావిగ్రహము[illegible]



భోగా నానన్దయన్త్యస్య న ఖేదయన్తి న చాపదః
దృశ్యశ్రియో హరన్త్యజ్ఞ నలమద్రిమివానిలాః. 59

అట్టి యాత్మజ్ఞానికి విషయభోగము లానందమును గొల్పజాలవు. ఆపదలు ఖిన్నునిగా నొనర్పజాలవు. మఱియు, పర్వతమును వాయువు చలింపచేయజాలనట్లు దృశ్యవైభవము వానిని స్వాత్మరూపమునుండి తొలగింపజాలదు.

రక్తబాలాఙ్గనస్యాపి జ్ఞస్యోదారధియో మునేః
కణశః పాంసుతాం యాన్తి మనసః స్మరసాయకాః. 60

బాలవనిత యాసక్తమైయున్నను గూడ, మననశీలుడును, ఉదారబుద్ధియునగు జ్ఞానియొక్క మనంబుచే మన్మథుని బాణములన్నియు ప్రక్కలుప్రక్కలై చూర్ణములగుచున్నవి.

రాగద్వేషైః స్వరూపజ్ఞో నావశః పరికృష్యతే
స్పన్ద ఏవాస్య నైతాభ్యాం కిముతాక్రమణం భవేత్. 61

ఆత్మస్వరూపము నెఱింగిన మనుజుండవశుడై రాగద్వేషములచే యెన్నటికి నీడ్వబడడు. వాటిచే నాతడు కొంచెమైనను చలింపకయుండ నిక వానిపై నయ్యవి యాక్రమణమెట్లు సల్పగలవు?

సమదృష్టలతాలోలవనితోఽద్రిశిలాకృతిః
రమతే నైష భోగేషు పాన్థో మరుమహీష్వివ. 62

లతను, చంచలస్త్రీని సమానముగ జూచువాడును, పర్వతశిలవలె స్థిరమైన యాకృతిగలవాడునునగు జ్ఞాని, బాటసారి మరుభూములందు ప్రీతిలేకయుండునట్లు, భోగములందు ప్రీతిగల్గియుండును.

అయత్నోపనతం సర్వం లీలయా సక్తమానసః
భుఙ్క్తే భోగభరం ప్రాజ్ఞస్త్వాలోకమివ లోచనమ్. 63

నేత్రము ప్రకాశము ననుభవించులాగున, ఆత్మజ్ఞాని అప్రయత్నముగ సంప్రాప్తించు భోగసమూహము నసక్తచిత్తుడై లీలామాత్రమున ననుభవించును.

కాకతాలీయవత్ప్రాప్తా భోగాలీ లలనాదికా
స్వాదితాప్యజ్ఞ ధీరస్య న దుఃఖాయ న తుష్టయే. 64

కాకతాళీయముగ సంప్రాప్తించిన వనితాది భోగముల ననుభవించినను, ధీరునకవి సంతోషమునుగాని దుఃఖమునుగాని, కలుగజేయవు.

సమ్యగ్దృష్టపథం తజ్జ్ఞం సుఖదుఃఖమతీ మనాక్
ద్వే వీచ్యావివ శైలేన్ద్రం క్షోభం నేతుం న శక్నుతః. 65

తరంగద్వయము పర్వతరాజమును చలింపచేయజాలనట్లు, ఆత్మమార్గమును లెస్సగ దర్శించునట్టి తత్త్వజ్ఞానిని సుఖదుఃఖములు సంక్షుభితునొనర్పజాలవు.

హేలయా లోకయన్భోగాన్మృదుర్దాన్తో గతజ్వరః
స్వమేవ పదమాలమ్బ్య సర్వభూతాన్తరస్థితమ్. 66
జ్ఞస్తిష్ఠతి గతవ్యగ్రో వ్యగ్రేణాపి సమన్వితః
జగన్తి జనయన్నేవ బ్రహ్మేవాత్మపరాయణః. 67

లోకముల నిర్మించుచున్నను ఆత్మపారాయణుఁడగు బ్రహ్మదేవుడు వ్యగ్రుడుగాకయుం, న్నట్లు, మిథ్యాదృష్టిచే భోగములఁగాంచుచు, కాఠిన్యములేక, జితేంద్రియుఁడై, సంతాపవర్జితుఁడై సర్వభూతస్థమగు తన యాత్మస్వరూపము నాశ్రయించునట్టి జ్ఞానియు ఆయా సమయోచిత క్రియలం దింద్రియాదులచే సంయోగముగల్గియున్నను వ్యగ్రుడు గాకయుండును.

ఆపతత్సు యథాకాలం యథాదేశం యథాక్రమమ్
సుఖదుఃఖేషు న క్షోభమేతి భూభృదృతుష్వివ. 68

ఋతువులన్నింటియందును గూడ పర్వతము క్షోభజెందకయుండునట్లు, దేశకాలక్రమానుసారము ప్రాప్తించు యాపదలందును, సుఖదుఃఖములందును జ్ఞాని యేక్షోభను జెందకుండును.

మజ్జతోఽపి బహుజ్ఞస్య రామ కర్మేన్ద్రియభ్రమైః
అసక్తమనసో నిత్యం న కించిదపి మజ్జతి. 69

ఓ రామా ! కర్మేంద్రియవ్యాపారములచే విషయములందు నిమగ్నమైనను, నిత్యమనాసక్తమగు జ్ఞానియొక్క చిత్తమేమియు మగ్నముగానిదై యే యుండును.

కలఙ్కస్యన్తః కలఙ్కేన ప్రోచ్యతే హేమ నాన్యథా
భావాసక్త్యా సమాసక్త ఉక్తో జన్తుర్హి నాన్యథా. 70

లోన మాలిన్యముండిననే బంగారము మలినమని చెప్పబడును గాని, పైన పూయబడిన బురద మున్నగువానిచే గానట్లు, అంతఃకరణాసక్తిచేతనే జీవుడాసక్తుఁడనబడును గాని యున్యముగ గాదు.

శరీరాద్వ్యతిరిక్తం జ్ఞం పశ్యతః ప్రవివేకినః
వికర్తితాఙ్గకస్యాపి న కించిత్ప్రవికర్తితమ్. 71

దేహమునకు భిన్నముగ ఆత్మను వివేకముచే గాంచువానియొక్క అవయవములు ఛేదింపబడినను ఛేదింపబడనివే యగును.

సకృత్ప్రభాతం విమలం యజ్జ్ఞాతం జ్ఞాతమేవ తత్
నహి బన్ధః పరిజ్ఞాతః పునరజ్ఞాతతాం వ్రజేత్ 72

ఒక్క పర్యాయము నిర్మలజ్ఞానము నొందిన వాడిక యెన్నటికి నట్టి స్థితియందే యుండును. ఏలన, ఆత్మను లెస్సగ నెఱింగినవాడు మఱల యజ్ఞత్వ మెన్నటికి నొందడు.

సర్పభ్రాన్తౌ నివృత్తాయాం న రజ్జ్వాం సర్పభావనా
పునరేతి యథా ప్రావృణ్నదీ గిరితటాచ్చ్యుతా. 73



వర్షాకాలమున పర్వతమునుండి జారి ప్రవహించిన నది మఱల వెనుకకు తిరిగి రానట్లు, సర్పభ్రాంతి తొలగిన పిదప మఱల రజ్జువునందు సర్పభావన యెట్లు కలుగును?

న హేమ తాపశుద్ధాఙ్గం స్వభావమలమాగతమ్
కర్దమే మగ్నమపి సత్సమాదత్తే మలం పునః. 74

అగ్నియందు స్ఫుటమొనర్పబడుటచే శుద్ధమై తన సహజరూపమును పూర్ణముగ నొందినట్టి సువర్ణము, బురదయందు పడద్రోయబడినను మాలిన్యము నొందకయుండును గదా!

క్షీణే స్వహృదయగ్రన్థౌ న బన్ధోఽస్తి పునర్గుణైః
యత్నేనాపి పునర్బద్ధం కేన వృన్తే చ్యుతం ఫలమ్. 75

చెట్టుతొడిమనుండి వ్రాలిన పండు, యెట్టి ప్రయత్నముచేసైనను మఱల నా తొడిమకు జేర్చబడ జాలనట్లు, అజ్ఞానహృదయగ్రంథి తొలగ, మఱల గుణములచే బంధన మెన్నటికి సంభవింపదు.

అవచ్ఛేదవిచారాభ్యామభితః ఖణ్డశో గతమ్
పాషాణం చ మణిం చైవ సంధాతుం కస్య శక్తతా. 76

మణియొక్క తత్వమును బాగుగ విచారించి, ఛేదనము ద్వారా యద్దానిని శిలనుండి వేఱు పఱచిన పిదప, మఱల దాని నా శిలకు జేర్చుట యేరికి సాధ్యమగును?

విజ్ఞాతాయామవిద్యాయాం కః పునః పరిమజ్జతి
పరిజ్ఞాయ శ్వపాకానాం యాత్రాం కః ప్రేక్షతే ద్విజః. 77

అట్లనే, అవిద్య నెఱింగిన పిదప మఱల దానియందెవరును మగ్నులు కారు. ఏలన యెఱింగి యే బ్రాహ్మణుడు చండాలోత్సవమును గాంచనెంచును?

శుద్ధామ్బుని యథా క్షీరధీర్విచారాన్నివర్తతే
సంసారవాసనా తద్వద్ధీవిచారాన్నివర్తతే. 78

మంచినీటియందలి పాలబుద్ధి విచారణచే తొలగునట్లు, విచారణచే వాసనయు నివృత్తమగును.

మద్యమ్బుశఙ్కయా తావద్విప్రవర్యైః ప్రపీయతే
యావన్నాత్ర పరిజ్ఞాతం పరిజ్ఞాతం ప్రహీయతే. 79

మద్యమని యెఱుంగనంతవఱకు బ్రాహ్మణోత్తము లద్దానిని జలభ్రాంతిచే త్రావుచునే యుందురుగాని, యెఱింగన పిదప త్యజించివైతురు గదా!

రూపలావణ్యయుక్తాపి చిత్రకాన్తేవ కామినీ
ద్రవ్యమాత్రసమారమ్భాత్తత్త్వవిద్భిర్విలోక్యతే. 80

రూప, సౌందర్యాది గుణములు గల్గియున్నను, కేవలము పంచభూతములచే నిర్మింపబడుటఁబట్టి స్త్రీని లిఖిత చిత్రమువోలె తత్వజ్ఞులు వీక్షింతురు.

యథా మషీకుసుమ్భాది స్త్రీయాశ్చిత్రే తథైవ హి
జీవత్స్యా అపి కేశోష్ఠం కస్తాం పరి కిల గ్రహః. 81

చిత్రస్త్రీ యొక్క అవయవములా యా రంగుభేదములచే పంచభూతసముదాయమే యగునట్లు, ప్రాణసంయుతమగు స్త్రీయొక్క కేశముఖాద్యవయవములున్ను, పంచభూతమాత్రములే యగును. అట్టిచో ప్రాణయుక్తమగు వనితయందే ఆసక్తి యేల?

అనుభూతో గుడః స్వాదురపి దాహావికర్తనైః
న శక్యతేఽన్యథాకర్తుం తత్త్వాలోక స్తథాత్మనః. 82

అనుభవింపబడిన బెల్లముయొక్క మాధుర్యము, దాహము మున్నగు పలువిధవికారములచే నైనను అన్యముగ గావింపబడనట్లు, ఆత్మానందానుభవమున్ను అన్యథా గావింపబడ నేరదు.

పరవ్యసనినీ నారీ వ్యగ్రాపి గృహకర్మణి
తదేవాస్వాదయత్యన్తః పరసఙ్గరసాయనమ్. 83
ఏవం తత్త్వే పరే శుద్ధే ధీరో విశ్రాన్తిమాగతః
న శక్యతే చాలయితుం దేవైరపి సవాసవైః. 84

పరపురుషునియందాసక్తిగల స్త్రీ గృహకృత్యములందు నిమగ్నమైయున్నను, అంతఃకరణమున తత్పురుషసాంగత్యసుఖానుభవమునే పొందునట్లు, శుద్ధబ్రహ్మమున విశ్రాంతినొందిన ధీరుడు తద్బ్రహ్మానందమునే యనుభవించుచు, యింద్రసంయుతులగు దేవతలచేగూడ చలింపబడకుండును.

పరవ్యసనినీ నారీ కేన భర్త్రా బలీయసా
విస్మారితా స్వసంకల్పకాన్తసఙ్గమహోత్సవమ్. 85

పరపురుషునియందాసక్తమగు స్త్రీని స్వసంకల్పకాంతసమాగమమహోత్సవమునుండియే బలవంతుడగు పతి తొలగించి విస్మరింపజేయగలడు?

జగత్సమరసానన్దచిదాలోకావలమ్బనమ్
కేన విస్మార్యతే బుద్ధిస్తత్త్వజ్ఞస్య మహాత్మనః. 86

వివిధపుష్పరసములన్నియు తేనెయందు గలసి యేకమగునట్లు, ప్రపంచమందలి యానందములన్నియు దేనియందు జేరి సమరసమగునో, అట్టి బ్రహ్మానందము నాశ్రయించు తత్త్వజ్ఞుడగు మహాత్ముని బుద్ధి నెవరు మఱపు జేయగలరు?

సమగ్రసుఖదుఃఖాఢ్యం వ్యవహారమఖణ్డితమ్
కుర్వన్కులజనాయత్తో భర్తృశ్వశురఖేదితః. 87
యథా సంకల్పకాన్తేన భవత్యానన్దమన్థరః
వధూలోకో వ్యసనవాన్దుఃఖవృన్దైర్న బాధ్యతే. 88
తథా విగలితావిద్యో వ్యవహారపరోఽప్యలమ్
సమ్యగ్... ...ముదమేత్యన్తరాత్మనా. 89

సర్వదుఃఖపరిపూర్ణమైనను, సర్వకార్యనిమగ్నమైనను, కులజనుల యాధీనమైనను, పతి, శ్వశురాదులచే దుఃఖితమొనర్పబడినను, పరపురుషునియందాసక్తమగు స్త్రీ యాదుఃఖములచే బాధింపబడక స్వసంకల్పకాంతసమాగమసుఖముగ మగ్నమైయుండునట్లు, అవిద్యారహితుడగు జ్ఞానియు సదాచార, లోకవ్యవహారతత్పరుడైనను అంతఃకరణమున యాత్మానందమునే ననుభవించుచుండును.



ఛిద్యతే న నికృత్తాఙ్గో గలదశ్రుర్న రోదితి
దహ్యతే న ప్రదగ్ధోఽపి నష్టోఽపి న వినశ్యతి. 90

జ్ఞాని, అవయవములు ఛేదింపబడినను ఛేదింపబడకయు, కన్నీరుగారుచున్నను దుఃఖింపకయు, కాల్చబడినను దహింపకయు, దేహమునశించినను నశింపకయు నుండును.

వ్యపగతసుఖదుఃఖసంనిపాతో
విధివిధురేష్వపి సంకటేష్వచిత్తః,
విలసతు సదనే పురోత్తమే వా
వితతగిరౌ విపినే తపోవనే వా. 91

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే వైరాగ్యోపదేశో నామ చతుఃసప్తతితమః
సర్గః ॥ 74 ॥

చిత్తవర్జితుడైన ఆత్మజ్ఞాని ప్రారబ్ధకర్మలందును, దారిద్ర్యాది దశలందును, సంకటములందును సుఖదుఃఖరహితుడైయుండును. అతడుత్తమనగరమునగాని, యరణ్యమందుగాని, గొప్ప పర్వతముపైగాని, తపోవనమునగాని, యెటనుండినను హర్షశోకములచే స్పృశింపబడకయే యుండును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
వైరాగ్యోపదేశమను చతుఃసప్తతితమ
సర్గము ॥ 74 ॥

---

## పఞ్చసప్తతితమః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

జనకః సంస్థితో రాజ్యే వ్యవహారపరోఽపి సన్
విగతజ్వర ఏవాన్తరనాకులమతిః సదా. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓరామా! జనకమహారాజు రాజ్యకార్యములందు నిమగ్నుడైయున్నను, సదా దుఃఖరహితుడై, వ్యాకులత్వమునొందక నుండెను.

పితామహో దిలీపస్తే సర్వారమ్భపరోఽప్యలమ్
వీతరాగతయైవాన్తర్బుభుజే మేదినీం చిరమ్. 2

మీ పితామహుఁడగు దిలీపుడు సర్వకార్యములఁ జేయుచున్నను, అంతఃకరణమున వీతరాగుఁడై చిరకాలము భూమిని పరిపాలించెను.

నిరఞ్జనతయా బుద్ధో జనతాం పాలయంశ్చిరమ్
జీవన్ముక్తాకృతిర్నిత్యం మనూ రాజ్యమపాలయత్. 3

ప్రబుద్ధుడగు మనువు రాగాది కళంకదోషమెద్దియును లేక సదా జీవన్ముక్తుఁడై బహుకాలము ప్రజలనేలెను.

విచిత్రబలయుద్ధేషు వ్యవహారేషు భూరిషు
మాన్ధాతా సుచిరం తిష్ఠన్ప్రాప్తవాన్పై పరం పదమ్. 4

వివిధసేనలు గల్గినట్టి యుద్ధములందును, అనేక వ్యవహారములందును చిరకాలము పాల్గొని మాంధాంత పరమపదమును ప్రాప్తినొందెను.

బలిః పాతాలపీఠస్థః కుర్వన్నదివ సంస్థితిమ్
సదా త్యాగీ సదాఽసక్తో జీవన్ముక్త ఇతి స్థితః. 5

పాతాళముననున్న బలిచక్రవర్తి సర్వవ్యవహారములను సత్యముగనే యాచరించుచు, సదా త్యాగియై, అసక్తుడై, జీవన్ముక్తుడై యుండెను.

నముచిర్దానవాధీశో దేవద్వన్ద్వపరః సదా
నానాచారవిచారేషు క్వచిన్నాన్తరతప్యత. 6

దానవుల ప్రభువగు నముచి దేవతలతోటి యెల్లపుడు యుద్ధమొనర్చుచు, వివిధాచార విచారతత్పరుఁడై యున్నను, అంతఃకరణమున ఖిన్నుఁడు గాకయే యుండెను.

వాసవాజౌ తనుత్యాగీ వృత్రో వితతమానసః
అన్తఃశాన్తమనా మానీ చకార సురసంగరమ్. 7

ఇంద్రునిలో గావింపబడిన యుద్ధమున శరీరమును త్యజించినవాడును, ఉదారచిత్తుడును, మానవీయుడునగు వృత్రాసురుడు అంతఃకరణమున ప్రశాంతుడై దేవతలతోటి, యుద్ధమొనర్చెను.

కుర్వన్దానవకార్యాణి పాతాలతలపాలకః
అనపాయం నిరాక్రోశం ప్రహ్లాదో హ్లాదమాగతః. 8

పాతాళాధీశుఁడగు ప్రహ్లాదుడు దానవకార్యములఁ జేయుచున్నను, వాగగోచరమైన అక్షయ సుఖమును పొందెను.

శమ్బరైకపరోఽప్యన్తః శమ్బరైకతయోదితః
సంసారశమ్బరం రామ శమ్బరస్త్యక్తవానిదమ్. 9
అసక్తబుద్ధిర్హరిణా కుర్వన్దానవసంగరమ్
ఘరాం సం[illegible] కుశల స్త్యక్తవానిదమ్. 10



ఓ. రామా! ఎల్లపుడు మాయాతత్పరుడైయున్నను, అసక్తబుద్ధిగల్గి, కుశలుడై, ఉత్తమ జ్ఞానమునొంది, దానవులకొఱకై విష్ణువుతోటి యుద్ధమొనర్చుచు శంబరాసురుడు పరమచిదాకాశముతోటి యేకత్వరూపమున నావిర్భవించిన యీ సాంసారికమాయను పరిత్యజించెను.

సర్వామరముఖో వహ్నిః క్రియాజాలపరో హ్యపి
యజ్ఞలక్ష్మీశ్చిరం భుఙ్క్తే ముక్త ఏవేహ తిష్ఠతి. 11

సర్వదేవతాముఖరూపమైన అగ్ని క్రియాజాలతత్పరుడై, యజ్ఞములందలి హవిస్సును చిరకాల మనుభవించుచు, ముక్తుడై యీప్రపంచమున వెలయుచున్నాడు.

పీయమానః సురైః సర్వైః సోమః సమరసాశయః
క్వచిదేతి న సంసర్గమాక్రాన్తావమ్బరం యథా. 12

పాదముల యాక్రమణముచే ఆకాశము సంగములేకయుండునట్లు, దేవతలందఱిచే త్రాగబడునదియు, పునరుజ్జీవింపజేయునదియునగు అమృతము తనయందుగల చంద్రుడు దేనితోడను సంగములేకయున్నాడు.

బృహస్పతిర్దేవగురుర్దారార్థం చన్ద్రయోధ్యపి
ఆచరన్నపి చిత్రేహాం ముక్త ఏవ హ్యవస్థితః. 13

దేవతలకు గురువును, భార్యకొఱకై చంద్రునితోటి యుద్ధమొనర్చినవాడునునగు బృహస్పతి స్వర్గమున దేవతాపౌరోహిత్యాది క్రియలఁ జేయుచున్నను ముక్తుడే యైయున్నాడు.

శుక్రోఽమ్బరతలద్యోతీ బుధః సర్వార్థపాలకః
నిర్వికారమతిః కాలం నయత్యసురదేశికః. 14

ఆకాశతలమును ప్రకాశింపజేయువాడును, జ్ఞానియు, నీతిశాస్త్రరచనచే సర్వుల యభిమతముల బాలించువాడును, అసురుల గురువునునగు శుక్రాచార్యుడు నిర్వికారబుద్ధిగల్గి కాలము గడపుచున్నాడు.

జగద్భూతగణాఙ్గాని చిరం సంచారయన్నపి
సర్వదా సర్వసంచారీ ముక్త ఏవ సమీరణః. 15

ఊర్ధ్వాధోలోకములను, ప్రాణులన్నింటియొక్క అవయవములను చలింపజేయుచు, సదా సర్వప్రదేశములందును సంచరించుచునున్నను వాయువు ముక్తుడే యగును.

లోకాజవం జవీభావప్రోద్వేగజ్ఞోఽప్యఖిన్నధీః
బ్రహ్మా సమమనా రామ క్షపయత్యాయురాతతమ్. 16

ఓ రామా! లోకంబులన్నింటియొక్క ఊర్ధ్వాధోమధ్యగతిపరివర్తనంబుల నెఱింగిన బ్రహ్మదేవుడు సమచిత్తముగల్గి ద్విపరార్ధమువఱకు దీర్ఘమగు తన ఆయువును గడపుచున్నాడు.

జరామరణయుద్ధాది ద్వన్ద్వసంగరలీలయా
చరతీహాచిరం కాలం ముక్తోఽపి భగవాన్హరిః 17

ముక్తుఁడైనను విష్ణుభగవానుడు జరామరణయుద్ధాది ద్వంద్వలీలలచే తన కాలమును గడపుచున్నాడు.

ముక్తేనాపి త్రినేత్రేణ సౌన్దర్యతరుమఞ్జరీ
దేహార్ధే ధార్యతే గౌరీ కాముకేనేవ కామినీ. 18

కాముకుడు కామినిని వహించునట్లు, త్రినేత్రుఁడగు మహేశ్వరుడున్ను ముక్తుఁడైనప్పటికి సౌందర్యవృక్షమునకు లతవంటి పార్వతీదేవిని తన శరీరార్ధభాగమున ధరించెను.

ముక్తయాపి గలే బద్ధో గౌర్యా గౌరస్త్రిలోచనః
సంశుద్ధ ఇవ ముక్తానాం హారః శశికలామలః. 19

ముక్తయైనను పార్వతీదేవి త్రినేత్రుఁడగు పరమశివుని, చంద్రకళవలె నిర్మలమై శుద్ధమైనట్టి ముత్యాలహారమునువలె తన కంఠభాగమున బంధించుకొనెను.

గుహో గహనధీర్వీరస్తారకాదిరణక్రియామ్
ముక్తోఽపి కృతవాన్సర్వం జ్ఞానరత్నైకసాగరః. 20

మహాధీశాలియు, వీరుడును, జ్ఞానమను రత్నములకు సముద్రుఁడునువగు కార్తికేయుడు (కుమారస్వామి) ముక్తుఁడైనను తారకాసుర యుద్ధము మున్నగు సర్వక్రియలనొనర్చెను.

భృఙ్గీశో రక్తమాంసం స్వం స్వమాత్రే ప్రవితీర్ణవాన్
ముక్తయైవ ధియా రామ ధీరయా ధ్యానధౌతయా. 21

ఓ రామా! ధైర్యయుక్తమై, ధ్యానముచే విశుద్ధమైనట్టి ముక్తబుద్ధిచే భృంగిరిటుడు తల్లియగు పార్వతీదేవికి తన రక్తమాంసముల నర్పించెను.

మునిర్ముక్తస్వభావోఽపి జగజ్జఙ్గలఖణ్డకమ్
నారదో విజహారేమం శీతయా కార్యశీలయా. 22

ముక్తస్వభావుఁడైనను నారదుడు శాంత, కార్యశీల బుద్ధిగల్గి యీ జగత్తను యరణ్యభాగమున సంచరించుచున్నాడు.

జీవన్ముక్తమనా మాన్యో విశ్వామిత్రోఽప్యయం ప్రభుః
వేదోక్తాం మఖనిర్మాణక్రియాం సమధితిష్ఠతి. 23

సర్వమాన్యుడగు నీ విశ్వామిత్రమహాముని ముక్తుఁడైనను వేదోక్తమగు యజ్ఞక్రియ నాచరించుచున్నాడు.

ధారయత్యవనీం శేషః కరోత్యర్కో దినావలీమ్
యమో యమత్వం కురుతే జీవన్ముక్తతయైవ హి. 24

జీవన్ముక్తుడైనను శేషభగవానుడు భూమిని ధరించుచున్నాడు. సూర్యుడు దినముల నిర్మించుచున్నాడు. యముడు దుష్టుల దండించుచున్నాడు.

అన్యేఽప్యస్మింస్త్రిభువనే యక్షాసురనరాః సురాః
శతశో ముక్తతాం యాతాః సన్తస్తిష్ఠన్తి సంసృతౌ. 25



ఇంకను యీ ముల్లోకములందును యెందఱో శతసంఖ్యాకులగు యక్షులు, అసురులు, మనుష్యులు, దేవతలు ముక్తులైరి. మఱియు ముక్తులగు మహాత్ములిప్పుడున్ను లోకమున గలరు.

సంస్థితా వ్యవహారేషు విచిత్రాచారధారిషు
అన్తరాశీతలాః కేచిత్కేచిన్మూఢాః శిలాసమాః. 26

కొందఱు జీవన్ముక్తులు శోకమోహదాయకములును, పుత్ర ధనదారాదిగ్రహణరూపములును, యుద్ధ వధ బంధనాది విచిత్రాచారసహితములునగు వ్యవహారములందు తగుల్కొనియున్నను, అంతఃకరణమున ప్రశాంతులైయున్నారు. మఱికొందఱు శిలవలె జడస్వభావయుతులైయున్నారు.

పరమం బోధమాసాద్య కేచిత్కాననమాగతాః
యథా భృగుభరద్వాజవిశ్వామిత్రశుకాదయః. 27
కేచిద్రాజ్యేషు తిష్ఠన్తి చ్ఛత్రచామరపాలితాః
యథా జనకశర్యాతిమాన్ధాతృసగరాదయః. 28
కేచిద్వ్యోమని తిష్ఠన్తి ధిష్ణ్యచక్రాన్తరస్థితాః
యథా బృహస్పత్యుశనశ్చన్ద్రసూర్యమునీశ్వరాః. 29
కేచిత్సురపదే యాతా విమానవలిమాస్థితాః
యథాగ్నివాయువరుణయమతుమ్బురునారదాః. 30
కేచిత్పాతాలకుహరే జీవన్ముక్తా వ్యవస్థితాః
యథా బలిసుహోత్రాన్ధప్రహ్లాదాహ్లాదపూర్వకాః. 31

భృగు, భరద్వాజ, విశ్వామిత్ర, శుకాదులను కొందఱుత్తమజ్ఞానమును బడసి యరణ్యముల నాశ్రయించిరి. ఛత్రచామరాదియుతులై జనక, శర్యాతి, మాంధాత, సగరాది మఱికొందఱు రాజ్యకార్యములందు పాల్గొనిరి. బృహస్పతి, శుక్ర, చంద్ర, సూర్య, సప్తర్షులాదిగాగల వారాకాశమండలి జ్యోతిశ్చక్రమున నెలకొనియున్నారు. అగ్ని, వాయు, వరుణ, యమ, తుంబురు, నారదాదులు స్వర్గమునకేగి విమానముల నాశ్రయించియున్నారు. బలి, సుహోత్ర, అంధ, ప్రహ్లాద, అహ్లాదాది మఱికొందఱు జీవన్ముక్తులై పాతాళమను గుహాయందు వసించియున్నారు.

తిర్యగ్యోనిష్వపి సదా విద్యన్తే కృతబుద్ధయః
దేవయోనిష్వపి ప్రాజ్ఞా విద్యన్తే మూర్ఖబుద్ధయః. 32

తిర్యగ్యోనులందును సదా జ్ఞానులు గలరు. ప్రాజ్ఞులైనను దేవయోనులందును మూర్ఖులు గలరు.

సర్వం సర్వేణ సర్వత్ర సర్వథా సర్వదైవ హి
సంభవత్యేవ సర్వాత్మన్యాత్మన్యాతతరూపిణి. 33

సర్వరూపమై, సర్వవ్యాపకమైనట్టి ఆత్మయందును సర్వము, సర్వవిధముల, సర్వత్ర సర్వదా సంభవమగును.

విధేర్విచిత్రా నియతిరనన్తారమ్భమన్థరా
సంనివేశాంశవై చిత్ర్యాత్సర్వం సర్వత్ర దృశ్యతే. 34

అనంతకార్యతత్పరమగు పరమాత్మ నియతి కడువిచిత్రమైనది. కాన, రచనా వైచిత్ర్యముచేతనే అంతయు నెల్లడల గన్పట్టుచున్నది.

విధిర్దైవం విధిర్ధాతా సర్వేశః శివ ఈశ్వరః
ఇతి నామభిరాత్మనః ప్రత్యక్చేతన ఉచ్యతే. 35

బ్రహ్మ, దైవము, విష్ణువు, ధాత, సర్వేశ్వరుడు, శివుడు, ఈశ్వరుడు మున్నగు నామములచే మనయందలి ఆత్మయగు ప్రత్యక్ చైతన్యమే చెప్పబడుచున్నది.

అస్త్యవస్తుని వస్త్వన్తః కాఞ్చనం సికతాస్వివ
అస్తి వస్తున్యవస్త్వన్తర్మలం హేమకణేష్వివ. 36

ఇసుకయందు బంగారువలె అవస్తువందు వస్తువుగలదు. మఱియు, బంగారుకణములందు మాలిన్యమువలె వస్తువునం దవస్తువున్ను గలదు.

అయుక్తే యక్తతా యుక్త్యా ప్రేక్ష్యమాణా ప్రదృశ్యతే
పాపస్య హి భయాల్లోకో రామ ధర్మే ప్రవర్తతే. 37

మిక్కిలి అయుక్తమైనదానియందును యుక్తిచేజూచిన యుక్తత్వము గాన్పించును. అయుక్తమగు పాపముయొక్క భీతిచే లోకము ధర్మమున బ్రవృత్తమగుచున్నదిగదా !

అసత్యే సత్యతా సాధో శాశ్వతీ పరిలక్ష్యతే
శూన్యేన ధ్యానయోగేన శాశ్వతం పదమాప్యతే. 38

అసత్యమునను, శాశ్వతమగు సత్యము ప్రతీతియగుచున్నది. శూన్యధ్యానయోగముచేతను శూన్యసాక్షియగు నిత్యాత్మపదము సంప్రాప్తించుచున్నది గదా !

యన్నాస్తి తదుదేత్యాశు దేశకాలవిలాసతః
శశకాః శృఙ్గవన్తో హి దృశ్యన్తే శమ్బరస్థితౌ. 39

ఇంద్రజాలమందు కుందేళ్లున్ను కొమ్ములుగలవిగ గన్పట్టునట్లు, లేనివస్తువుకూడ దేశకాలవిలాసముచే నుత్పన్నమగుచున్నది.

యే వజ్రసారాః సుదృఢా దృశ్యన్తే తే క్షయం గతాః
కల్పస్యాన్తే యథేన్ద్వర్కధరాబ్ధినిబుధాదయః. 40

కల్పాంతమున చంద్ర, సూర్య, పృథివీ, సముద్ర, దేవతాదులున్ను సంక్షయమొందునట్లు వజ్రమువలె మిగుల దృఢముగ గన్పట్టునవికూడ నశించుచున్నవి.

ఇతి పశ్యన్మహాబాహో భావాభావాభవక్రమమ్
హర్షామర్షవిషాదేహాః సంత్యజ్య సమతాం వ్రజ. 41

మహాబాహుండవగు నోరామా ! ఇట్లెఱింగి, నాశోత్పత్తిరూపమగు యీ సంసారక్రమమును, హర్షామర్షవిషాదేచ్ఛలను బరిత్యజించి సమత్వము నొందుము.



అసత్సదేవ భాతీహ సదసచ్చాపి దృశ్యతే
ఆస్థానాస్థే పరిత్యజ్య తేనాశు సమతాం వ్రజ. 42

ఓ రామా! ఈప్రపంచమున అసత్తు సత్తువలెను, సత్తు (బ్రహ్మము) అసత్తువలెను గన్పించుచున్నది. కాన నీవు-యిచ్ఛానిచ్ఛలం ద్యజించి శీఘ్రముగ సమత్వము నొందుము.

ముక్తౌ రాఘవ లోకేఽస్మిన్న ప్రాప్తిః సంభవత్యలమ్
అప్రవృత్తౌ వివేకస్య మగ్నా హి జనకోటయః. 43

ఓ రాఘవా ! వివేకములేనిచో యీ ప్రపంచమున ముక్తియెన్నటికిని లభించదు. వివేకమును పొందనివారై కోట్లకొలది మనుజు లజ్ఞానదశయందు మునుంగుచున్నారు.

ముక్తౌ రాఘవ లోకేఽస్మిన్ప్రాప్తిరస్తి సదైవ హి
ప్రవృత్త్యా హి వివేకస్య విముక్తా భూతకోటయః. 44

ఓరామా! వివేకము గల్గినచో మోక్షప్రాప్తి సదా చేకూరును. వివేకమును పొంది కోట్లకొలది మనుజులు ముక్తులైరి.

ప్రవివేకావివేకాభ్యాం సులభా లభ్యతాం గతా
ముక్తిర్మనఃక్షయప్రాప్త్యై వివేకం తేన దీపయ. 45

ఓరామా ! ముక్తి వివేకముచే సులభ్యమును, అవివేకముచే అలభ్యమునగును. కాన మనోనాశముద్వారా నీవు వివేకము నభివృద్ధిపఱచుకొనుము.

ఆత్మావలోకనే యత్నః కర్తవ్యో భూతిమిచ్ఛతా
సర్వదుఃఖశిరశ్ఛేద ఆత్మాలోకేన జాయతే. 46

మోక్షము నిచ్ఛగించువారు ఆత్మదర్శనము కొఱకై వివేకమను యత్నమాచరింపవలెను. ఏలన, ఆత్మసందర్శనముచే సర్వదుఃఖములున్ను సమూలముగ నశించును.

నీరాగా నిరుపాసఙ్గా జీవన్ముక్తా మహాధియః
సంభవన్తీహ బహుశః సుహోత్రజనకా ఇవ. 47

రాగవర్జితులును, సంగరహితులును, మహాధీమంతులును, మహాత్ములునగు సుహోత్ర, జనకాదియనేక జీవన్ముక్తులిపుడును యుండియున్నారు.

తస్మాత్త్వమపి వైరాగ్యవివేకోదితధీరధీః
జీవన్ముక్తో విహర భో సమలోష్టాశ్మకాఞ్చనః. 48

ఓరామా ! కాన నీవును వివేక, వైరాగ్యములచే నుదయించిన ధీరబుద్ధిగల్గి, సువర్ణ, లోష్టములందు సమబుద్ధిగలవాడవై యీ ప్రపంచమున జరింపుము.

ద్వివిధా ముక్తతా లోకే విద్యతే దేహధారిణామ్
సదేహైకా విదేహాన్యా విభాగోఽయం తయోః శృణు. 49

ఓరామా ! ఈ ప్రపంచమున జీవులకు ముక్తి యిరుతెఱంగులు. ఒకటి సదేహముక్తి, రెండవది విదేహముక్తి. వాటికిఁగల భేదమును వినుము.

అసంసక్త్యాత్పదార్థానాం మనఃశాన్తిర్విముక్తతా
సత్యసత్యపి దేహే సా సంభవత్యనఘాకృతే. 50

పాపరహితుఁడవగు నో రామా! పదార్థములందలి యసంగముచే గల్గు మనశ్శాంతిరూపమగు ముక్తి దేహమున్నను, లేకున్ననుగూడ సంభవమగును.

స్నేహసంక్షయమేవాజ్ఞ విదుః కైవల్యముత్తమమ్
తత్సంభవతి దేహస్య భావే చాభావ ఏవ చ. 51

దేహాదులం దాత్మభ్రాంతిచే గల్గు ప్రీతి నివారించుటయే ఉత్తమకైవల్యమని మహాత్ము లెఱింగిరి. అట్టిది దేహమున్నను, లేకున్ననుగూడ సంభవమగును.

యో జీవతి గతస్నేహః స జీవన్ముక్త ఉచ్యతే
సస్నేహజీవితో బద్ధో ముక్త ఏవ తృతీయకః. 52

దేహాదులందాసక్తి లేక జీవించువాడు జీవన్ముక్తుఁడనఁబడును. దేహాదులందాసక్తి గల్గి జీవించువాడు బద్ధుడు. రాగ, ద్వేషములు రెండును లేనివాడు ముక్తుడు.

యత్నో యత్నేన కర్తవ్యో మోక్షార్థం యుక్తిపూర్వకమ్
యత్నయుక్తివిహీనస్య గోష్పదం దుష్కరం భవేత్. 53

మోక్షముకొఱకై సాధనచతుష్టయమను యత్నముచేతను, బ్రహ్మతత్వనిశ్చయమను యుక్తిచేతను మఱల మఱల ప్రయత్నమాచరింపవలెను. ఏలన యుక్తి, యత్నములులేని మనుజునకు గోష్పదమున్ను తరింపశక్యముగానిదై యుండును.

నత్వనధ్యవసాయస్య దుఃఖాయ విపులాత్మనే
ఆత్మా పరవశః కార్యో మోహమాశ్రిత్య కేవలమ్. 54

ప్రయత్నము ననాదరించి, కేవలము మోహమున జిక్కుకొని, మహాదుఃఖమనుభవించుచు, ఆత్మను పరవశ మొనర్పరాదు.

సుమహద్ధైర్యమాలమ్బ్య మనసా వ్యవసాయినా
విచారయాత్మనాత్మానమాత్మనశ్చిరసిద్ధయే
వితతాధ్యవసాయస్య జగద్భవతి గోష్పదమ్. 55

ఓ రామా! మహద్ధైర్య మవలంబించి ఫలప్రాప్తిపర్యంతము దృఢ, యత్నశీలమనంబుతో స్వయముగ నాత్మవిచారణ గావింపుము. దృఢప్రయత్నముగలవానికి ప్రపంచము గోష్పదతుల్యమే యగును.

యదుపగతః సుగతః పదం ప్రధానం
యదుపగతోఽధ్రువతాం నృపశ్చ కశ్చిత్,
యదుపగతాః పదముత్తమం మహాన్తః
ప్రయతనకల్పతరోర్మహాఫలం తత్. 56



ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే ముక్తాముక్తవిచారో నామ పఞ్చసప్తతితమః
సర్గః ॥ 75 ॥

బుద్ధ, కపిల, అర్హతాదులు స్వయంప్రకాశమగు ఆత్మపదమునుండి చ్యుతులై, ప్రధానము మున్నగు అస్థిరపదములనొందిరి. కాని, వేదరహస్యమెఱింగిన మహాత్ములు సత్యజ్ఞానానందస్వరూపమగు ఆత్మపదమునే పొందిరి. అట్లు పొందుట ప్రయత్నమను కల్పవృక్షముయొక్క మహాఫలమే యగును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
ముక్తాముక్తవిచారమను పంచసప్తతితమ
సర్గము ॥ 75 ॥

---

## షట్సప్తతితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

బ్రహ్మణః సముపాయాన్తి జగన్తీమాని రాఘవ
స్థైర్యం యాన్త్యవివేకేన శామ్యన్త్యేవ వివేకతః. 1

శ్రీ వసిష్ఠుడు,—ఓ రామా! అవిద్యాప్రభావమున నీ జగత్తులనియు బ్రహ్మమునుండియే యుద్భవించి, అవివేకముచే స్థితిఁబొందినవై మఱల వివేకముచే నశించుచున్నవి.

జగజ్జాలజలావర్తవృత్తయో బ్రహ్మవారిధౌ
సంఖ్యాతుం కేన శక్యన్తే భాసాం చ త్రసరేణవః. 2

బ్రహ్మమను సముద్రమందున్న జగత్సమూహమను తరంగజాలము నెవరు లెక్కింపగలరు? సూర్యకిరణములందలి త్రసరేణువుల లెక్కింప నేరికి తరము?

అసమ్యక్ప్రేక్షణం విద్ధి కారణం జగతః స్థితౌ
సంసారశాన్తయే శాన్త కారణం సమ్యగీక్షణమ్. 3

ఓ రామా! అసమ్యక్ దర్శనమే యీ జగత్స్థితికి హేతువనియు, సమ్యక్దర్శనమే దాని వినాశమునకు కారణమనియు యెఱుంగుము.

అయం హి పరదుష్పారో ఘోరః సంసారసాగరః
వినా యుక్తిప్రయత్నాభ్యామస్మాద్రామ న తీర్యతే. 4

ఓ రామా! మిగుల దుష్కరమును, భయంకరమునగు యీ సంసార సముద్రము యుక్తి ప్రయత్నాదులులేక దాటుటకు శక్యము కాదు.

యస్యాయం సాగరః పూర్ణో మోహామ్బుభరపూరితః
అగాధమరణావర్తకల్లోలాకులకోటరః. 5

ప్రభుమత్పుణ్యడిణ్డీరో జ్వలన్నరకవాడవః
తృష్ణావిలోలలహరిర్మనోజలమతజ్జజః. 6
ఆలీనజీవితసరిద్భోగరత్నసముద్గకః
క్షుబ్ధరోగోరగాకీర్ణ ఇన్ద్రియగ్రాహఘుర్ఘురః. 7

ఈ సంసార సముద్రము మోహమను జలముచే నిండినదియు, మరణమను భయంకరమైన సుడులను విశాలమగు తరంగములును గలదియు, పుణ్యమను చలించు నురుగు గలదియు, నరకమను జ్వలించు బడబాగ్నితో గూడినదియు, తృష్ణయను చంచల తరంగములు గల్గియున్నదియు, మనస్సను నీటియేనుగు గలదియు, జీవితమను నదులు కలయు తావును, భోగములను రత్నములకు పేటికయు, రోగములను క్రూరసర్పములచే వ్యాప్తమును, ఘుర్ఘురనాదంబొనర్చు ఇంద్రియములను మొసళ్లు గలదియునై యున్నది.

పశ్యాస్మిన్ప్రసృతా రామ వీచయశ్చారుచఞ్చలాః
ఇమా ముగ్ధాఙ్గనానామ్న్యః శిఖరాకర్షణక్షమాః. 8
ఛదశ్రీపద్మరాగాఢ్యా నేత్రనీలోత్పలాకులాః
దన్తపుష్పఫలాకీర్ణాః స్మితఫేనోపశోభితాః. 9
కేశేన్ద్రనీలవలయా భ్రూవిలాసతరఙ్గితాః
నితమ్బపులినస్ఫీతాః కణ్ఠకమ్బువిభూషితాః. 10
లలాటమణిపట్టాఢ్యా విలాసగ్రాహసంకులాః
కటాక్షలోలగహనా వర్ణకాఞ్చనవాలుకాః. 11

ఓ. రామా! దీనిఁగాంచుము: ఇందు పర్వతశిఖరములవలె ధీరులైన పురుషులను కూడ యాకర్షించునట్టి ఉత్తమ, చపల, మనోహర, స్త్రీరూప తరంగములు గలవు. అయ్యవి పెదవులను పద్మరాగమణులు గలవియు, నేత్రములను నీల కమలములచే వ్యాప్తములును, దంతములను ఫల, పుష్పములచే యాకీర్ణములును, చిరునగవను నురుగుచే శోభితములును, కేశములను యింద్రనీలమణులచే పూర్ణములును, కనుబొమ్మల విలాసమను తరంగపంక్తి గలవియు, నితంబములను స్వచ్ఛమైన యిసుక తిన్నెలు గలవియు, కంఠమను శంఖములచే నలంకరింపబడినవియు, లలాటమను మణులు గలవియు, విలాసమను మొసళ్లతో గూడినవియు, క్రేకంటిచూపులను చాపల్యము గలవియు, దేహకాంతియను బంగారువన్నెగల యిసుక గల్గియున్నవియునై యులరుచున్నవి.

ఏవం విలోలలహరీ భీమాత్సంసారసాగరాత్
ఉత్తీర్యతే చేన్మగ్నేన తత్పరం పౌరుషం భవేత్. 12

ఇట్టి చంచల తరంగములు గల్గి భయంకరమైనట్టి యీసంసారసముద్రమున మగ్నుడైనవాడద్దానిని దాటగల్గిన నదియే పరమ పౌరుషమగును.

సత్యాం ప్రజ్ఞామహానావి వివేకే సతి నావికే
సంసారసాగరాదస్మాద్యో న తీర్ణో ధిగస్తు తమ్. 13



బుద్ధియను విశాలనౌకయు, వివేకమను నావికుడును నుండ, యిక నీ సంసారసముద్రమును దాటని వానికి ధిక్కారమగుగాక!

అపారావారమాక్రమ్య ప్రమేయీకృత్య సర్వతః
సంసారాబ్ధిం గాహతే యః స ఏవ పురుషః స్మృతః. 14

అపారమగు సంసారసముద్రమును బ్రహ్మజ్ఞానముచే బాధితమొనర్చి, జగత్తునంతయు బ్రహ్మమయముగజేసి యాపిదప సంసారసాగరమున బ్రవేశించువాడే పురుషుఁడనఁబడును.

విచార్యార్యైః సహాలోక్య ధియా సంసారసాగరమ్
ఏతస్మింస్తదనుక్రీడా శోభతే రామ నాన్యథా. 15

ఓ రామా! శ్రేష్ఠులగు ఆత్మజ్ఞులతో గూడి యీ సంసారసాగరమును దాటి, బుద్ధిచే దానినంతయు బ్రహ్మమయముగ నెఱింగి, తదుపరి యద్దానియందు క్రీడించుటయే శోభించునుగాని అన్యముగ గాదు.

ఇహ భవ్యో భవాన్సాధో విచారపరయా ధియా
త్వయాధునైవ తేనాయం సంసారః ప్రవిచార్యతే. 16

సాధువగు నోరామా! ఈ యల్పవయస్సుననే విచారతత్పరమగు బుద్ధిచే నీవీ సంసారమునుగూర్చి చింతనజేయుచున్నావుగాన నీవు ధన్యుడవు.

భవానివ విచార్యాదౌ సంసారమతికాసన్తయా
మత్యా యో గాహతే లోకో నేహాసౌ పరిమజ్జతి. 17

నీవలె ప్రారంభముననే యీ సంసారమునత్యుత్తమ బుద్ధితో విచారించి యాపిదప బ్రహ్మమునఁ బ్రవిష్టుఁడగువాడు మఱల యెన్నటికిని మోహమగ్నుడు కానేరడు.

పూర్వం ధియా విచార్యైతే భోగా భోగిభయప్రదాః
భోక్తవ్యాశ్చరమం రామ గరుడేనేవ పన్నగాః. 18

ఓ రామా! మొమ్మొదట విచారణగావించి సర్పములవలె భయంకరమైనట్టి విషయభోగముల నుపేక్షించి యాపిదప గరుత్మంతుడు సర్పముల భక్షించునట్లు వాటిననుభవింపవలెను.

విచార్య తత్త్వమాలోక్య సేవ్యన్తే యా విభూతయః
తా ఉదర్కోదయా జన్తోః శేషా దుఃఖాయ కేవలమ్. 19

ఈ ప్రపంచమునగూడ, బాగుగవిచారించి తత్త్వమెఱింగి సేవింపబడునట్టి విభూతులే జీవులకు భావికాలమున ఉత్తమ ఫలోదయము గల్గజేయుచున్నవిగాని, తదితరములు దుఃఖప్రదములే యగుచున్నవి.

బలం బుద్ధిశ్చ తేజశ్చ దృష్టతత్త్వస్య వర్ధతే
సవసన్తస్య వృక్షస్య సౌన్దర్యాద్యా గుణా ఇవ. 20

వసంతకాలమున వృక్షముయొక్క సౌందర్యాది గుణములు వృద్ధినొందునట్లు ఆత్మతత్త్వదర్శనమొనర్చినవాని బలము, బుద్ధి, తేజము వృద్ధియగును.

ఘనరసాయనపూర్ణసుశీతయా
విమలయా సమయా సతతం శ్రియా,
శిశిరరశ్మిరివాతివిరాజసే
విదితవేద్య సుఖం రఘునన్దన. 21

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే సంసారసాగరసామ్యప్రతిపాదనం నామ
షట్ సప్తతితమః సర్గః ॥ 76 ॥

ఓ రాఘవా! తెలియఁదగిన ఆత్మవస్తువును నీవు సులభముగ తెలిసికొంటివి. ఇక్కారణమున, ఆనందామృతపూర్ణమును, అతిశీతలము (తాపత్రయనివారకము)ను, స్వచ్ఛమును నగు శోభతోఁగూడి పూర్ణచంద్రునివలె విరాజిల్లుచున్నావు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సంసారసాగరసామ్యప్రతిపాదనమను షట్సప్తతితమ
సర్గము ॥ 76 ॥

---

## సప్తసప్తతితమః సర్గః

---

శ్రీరామ ఉవాచ:—

సమాసేన మునే భూయో దృష్టతత్త్వచమత్కృతేః
కథయోదారవృత్తాన్తం కస్తే వచసి తృప్యతి. 1

శ్రీరాముడు:—ఓమునీంద్రా! ఆత్మతత్త్వచమత్కృతిఁ గాంచిన జీవన్ముక్తుని యుదారచారిత్రమును సంక్షేపముగ మఱల వచింపవేడెద. ఏలన, తమ వాక్యములవిన నెవరు తృప్తిబొందగలరు?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

జీవన్ముక్తస్య బహుధా కథితం లక్షణం మయా
భూయోఽపి త్వం మహాబాహో కథ్యమానమిదం శృణు. 2

శ్రీవసిష్ఠుడు:—మహాబాహుఁడవగు నోరామా! జీవన్ముక్తుని లక్షణములను పెక్కువిధముల వర్ణించియుంటిని. అయినను మఱల వచించుచున్నాను, వినుము.

సుషుప్తవదిదం నిత్యం పశ్యత్యపగతైషణః
అసద్రూపమివాసక్తం సర్వత్రాఖిలమాత్మవాన్. 3

సర్వేచ్ఛారహితుఁడగు ఆత్మజ్ఞాని యీ ప్రపంచమును వ్యవహారదృష్టియందు సుషుప్తునివలెను, పరమార్థదృష్టియందు అసద్రూపముగను యంతటను గాంచును.



కైవల్యమివ సంప్రాప్తః పరిసుప్తమనా ఇవ
ఘూర్ణమాన ఇవానన్దీ తిష్ఠత్యధిగతాత్మదృక్. 4

ముక్తినొందినవానివలెను, లయించిన మనంబుగలవానివలెను, ఆనందోన్మత్తునివలెను ఆత్మజ్ఞుఁడీ జగత్తున మెలంగును.

నాదత్తమప్యుపాదత్తే గృహీతమపి పాణినా
అన్తర్ముఖతయోదాత్తరూపయా సమయాధియా. 5

అంతర్ముఖమై, సమరూపమైనట్టి యుదారబుద్ధిచే జ్ఞాని ధనవస్త్రాలంకారాదులను హస్తాదియింద్రియములచే గ్రహించినను గ్రహింపనివాఁడే యగును.

యన్త్రపుత్రకసంచార ఇతీమం జనతాక్రమమ్
అన్తఃసంలీనయా దృష్ట్యా పశ్యన్హసతి శాన్తధీః. 6

అంతర్ముఖదృష్టి గల్గి జనుల వ్యవహారములను కాష్ఠవిగ్రహమువలె ప్రశాంతబుద్ధితో నవలోకించుచు నవ్వుచుండును.

నాపేక్షతే భవిష్యం చ వర్తమానే న తిష్ఠతి
న సంస్మరత్యతీతం చ సర్వమేవ కరోతి చ. 7

ఆత్మజ్ఞుడు భావిపదార్థముల నభిలషింపడు. వర్తమాన పదార్థములయందు ప్రీతిలేకయుండును. గడచినవస్తువులఁ జింతింపడు. కాని సర్వము నాచరించుచునే యుండును.

సుప్తః ప్రబుద్ధో భవతి ప్రబుద్ధోఽపి చ సుప్తవాన్
సర్వం కర్మ కరోత్యన్తర్నకరోతి చ కించన. 8

వ్యవహారములందు సుప్తప్రాయముగనున్నను ఆత్మవిషయమున జాగరూకుఁడై యుండును. వ్యవహారమున కుశలుఁడైనను సుప్తుని చందముననే యుండును. బాహ్యమనంబుచే సర్వకర్మలఁ జేయుచున్నను, యంతరంగమున నేమియు జేయకయేయుండును.

అన్తః సర్వపరిత్యాగీ నిత్యమన్తరనేషణః
కుర్వన్నపి బహిః కార్యం సమమేవావతిష్ఠతే. 9

అంతఃకరణముచే సర్వమును పరిత్యజించి, కోర్కెలెవ్వియు లేక, బాహ్యమున సర్వకార్యములఁ జేయుచున్నను యంతరంగమున సదా సమరూపముగనే యుండును.

బహిః ప్రకృతసర్వేహో యథాప్రాప్తక్రియోన్ముఖః
స్వకర్మక్రమసంప్రాప్త బన్ధుకార్యానువృత్తిమాన్. 10

బాహ్యమున యథాప్రాప్తములగు క్రియలన్నిటిని జేయుచుండును. స్వవర్ణాశ్రమోచితకార్యములను, పితృపితామహక్రమమున ప్రాప్తించిన రాజ్యాదికార్యములను, బంధుమిత్రాదుల కార్యములను నెరవేర్చుచుండును.

సమగ్రసుఖభోగాత్మా సర్వాశాస్వివ సంస్థితః
కరోత్యఖిలకర్మాణి త్యక్తకర్తృత్వవిభ్రమః. 11

ఆతడు సుఖభోగలన్నిటిని ఆత్మరూపముగనే యెఱుంగును. సర్వవిషయములందును వర్తించుచున్నట్లు గాన్పించినను కర్తృత్వాభిమానము లేకయే యెల్లకార్యములఁ జేయుచుండును.

ఉదాసీనవదాసీనః ప్రకృతః క్రమకర్మసు
నాభివాఞ్ఛతి న ద్వేష్టి న శోచతి న హృష్యతి. 12

ఉదాసీనునివలె నుండి, క్రియల ఇష్టానిష్టఫలములందు సమరూపుఁడై, దేనిని వాంఛింపకయు, ద్వేషింపకయు, శోకింపకయు, హర్షింపకయు నుండును.

అనుబన్ధపరే జన్తావసంసక్తేన చేతసా
భక్తే భక్తసమాచారః శఠే శఠ ఇవ స్థితః. 13
బాలో బాలేషు వృద్ధేషు వృద్ధో ధీరేషు ధైర్యవాన్
యువా యౌవనవృత్తేషు దుఃఖితేష్వను దుఃఖితః. 14

అనుకూల, ప్రతికూల కర్మాచరణతత్పరుఁడై, అనాసక్తచిత్తముతో వ్యవహరించును. భక్తులయందు భక్తునివలెను, శఠులయందు శఠునివలెను, బాలురందు బాలునివలెను, ధీరులందు ధీరునివలెను, యౌవనవృత్తాంతములందు యువకునివలెను, దుఃఖులందు దుఃఖిగను వర్తించుచుండును.

ప్రవృత్తవాక్పుణ్యకథో దైన్యాద్వ్యపగతాశయః
ధీరధీరుదితానన్దః పేశలః పుణ్యకీర్తనః. 15
ప్రాజ్ఞః ప్రసన్నమధురః పూర్ణః స్వప్రతిభోదయే
నిరస్తఖేదదౌర్గత్యః సర్వస్మిన్స్నిగ్ధబాన్ధవః. 16
ఉదారచరితాకారః సమః సౌమ్యసుఖోదధిః
సుస్నిగ్ధః శీతలస్పర్శః పూర్ణచన్ద్ర ఇవోదితః. 17

పుణ్యవాక్కులనే యాతడుచ్చరించును. దైన్యకారణమున అభిమానరహితుఁడును, ధీరబుద్ధియు, ఆసంతోషయాన్వితుఁడును, కోమలస్వభావయుతుఁడును. ప్రపంచమున పుణ్యకీర్తి గలవాఁడును, ధీమంతుఁడును, ప్రసన్నముఖుఁడును, పూర్ణప్రజ్ఞాసహితుఁడును, ఖేద, దుర్దశారహితుఁడును, సర్వప్రాణులందును స్నేహముగల్గి లోకబాంధవుఁడై వెలయువాఁడును, ఉదారచరితుఁడును, సర్వావస్థలయందును సమరూపుఁడును, సౌమ్యుఁడును, సుఖసాగరుఁడును, అధికస్నేహయుక్తుఁడును, ని[illegible]చే సర్వుల దుఃఖమును హరింపజేయువాఁడునునై, పూర్ణచంద్రునివలె నుదితుఁడై ఆత్మజ్ఞుఁడు విరాజిల్లును.

న తస్య సుకృతేనార్థో న భోగైర్న చ కర్మభిః
న దుష్కృతైర్న భోగానాం సంత్యాగేన న బన్ధుభిః. 18
న కార్యకారణారమ్భైర్న నిష్కృతతయా తథా
న బన్ధేన న మోక్షేణ న పాతాలేన నో దివా. 19

అతనికి సుకృతముచేగాని, దుష్కృతముచేగాని భోగములచేగాని, భోగత్యాగముచే గాని, బంధువులచేగాని, కర్మాచరణచేగాని, నైష్కర్మ్యముచేగాని, బంధమోక్షములచేగాని, స్వర్గపాతాళములచేగాని ప్రయోజనమేమియును లేదు.



యథా వస్తు యథా దృష్టం జగదేకమయాత్మకమ్
తదా బన్ధవిమోక్షాణాం న క్వచిత్కృపణం మనః. 20

అనుభూతమైన ఆత్మతత్త్వమువలెనే జగత్తంతటినిగూడ యేకమగు పరబ్రహ్మమయముగ గాంచువారికిక బంధమోక్షములందు మనస్సెన్నటికిని దీనత్వము నొందదు.

సమ్యగ్జ్ఞానాగ్నినా యస్య దగ్ధాః సందేహజాలికాః
నిఃశఙ్కమలముడ్డీనస్తస్య చిత్తవిహఙ్గమః. 21

సమ్యక్ జ్ఞానమను అగ్నిచే సంశయమను పంజరము దగ్ధమైనవానికిక చిత్తమను పక్షి ని[illegible]గ యెగిరిపోయినదే యగును.

యస్య భ్రాన్తివినిర్ముక్తం మనః సమరసం స్థితమ్
నాస్తమేతి న చోదేతి వ్యోమవత్సర్వదృష్టిషు. 22

ఆత్మజ్ఞాని మనస్సు భ్రమవిముక్తమై, బ్రహ్మరూపమై, నశింపకయు, ఉదయింపకయు నుండి సర్వావస్థలయందును ఆకాశమువలె సమరూపమున వెలయుచుండును.

మఞ్జూషాయాం నిషణ్ణస్య యథా బాలస్య చేష్టతే
అఙ్గావల్యనుసంధానవర్జితం యస్య వై తథా. 23

ఊయెలయందు పరుండిన బాలుని అవయవములవలెనే అనుసంధానము లేకయే ఆత్మజ్ఞాని అవయవములు చేష్టల సల్పుచుండును.

ఘూర్ణన్క్షీబ ఇవానన్ద మన్దీభూత పునర్భవః
అనుపాదేయ బుద్ధ్యా తు న స్మరత్యకృతం కృతమ్. 24

మదిరోన్మత్తునివలె బ్రహ్మానందమునందోలలాడుచు, పునర్జన్మభయరహితుఁడై, తన యగ్రాహ్యబుద్ధిచే చేసినకర్మనుగాని చేయనికర్మనుగాని జ్ఞాని స్మరింపకయే యుండును.

సర్వం సర్వప్రకారేణ గృహ్ణాతి చ జహాతి చ
అనుపాదేయ సర్వార్థో బాలవచ్చ విచేష్టతే. 25

సర్వము సర్వవిధముల గ్రహించుచును, త్యజించుచును యుండును. పదార్థములన్నియు వానికి అనుపాదేయ (అగ్రాహ్య)ములే యగును. బాలునివలె యాతడు చేష్టల సల్పును.

న తిష్ఠన్నపి కార్యేషు దేశకాలక్రియాక్రమైః
న కార్యసుఖదుఃఖాభ్యాం మనాగపి హి గృహ్యతే. 26

దేశకాలక్రియాక్రమము ననుసరించి కార్యములందు ప్రవృత్తుఁడైనను, తత్క్రియాజనిత సుఖదుఃఖములకు వశీభూతుఁడు గాకయుండును.

బహిః ప్రకృతసర్వార్థోఽప్యన్తః పునరనీహయా
న సత్తాం యోజయత్యర్థే న ఫలాన్యనుధావతి. 27

బాహ్యమనంబుచే నాతడు, ప్రాప్తించిన సర్వకార్యములఁ జేయును. కాని యంతరంగమున క్రియావర్జితుఁడై యుండును. బాహ్యపదార్థము లసత్తని యాతఁడెఱుంగును. కాననే వాటి ఫలములకై పరువిడకుండును.

నోపేక్షతే దుఃఖదశాం న సుఖాశామపేక్షతే
కార్యోదయే నైతి ముదం కార్యనాశే న ఖిద్యతే. 28

అతడు దుఃఖదశను గాంచడు. సుఖస్థితి నపేక్షింపడు. కార్యసాఫల్యముచే సంతోషమును గాని, కార్యవిఫలత్వముచే దుఃఖమును గాని బొందడు.

అపి శీతరుచావర్కే సుతప్తేఽపీన్దుమణ్డలే
అప్యధఃప్రసరత్యగ్నౌ విస్మయోఽస్య న జాయతే. 29

సూర్యుడు చల్లబడినను, చంద్రమండల ముష్ణత్వముం జెందినను, అగ్ని క్రిందికి జ్వలించినను, ఆత్మజ్ఞానికి ఆశ్చర్యము కలుగదు.

చిదాత్మన ఇమా ఇత్థం ప్రస్ఫురన్తీహ శక్తయః
ఇత్యస్యాశ్చర్యజాలేషు నాభ్యుదేతి కుతూహలమ్. 30

ఈ వివిధశక్తులన్నియు చిదాత్మనుండియే యివ్విధమున స్ఫురించుచున్నవను నిశ్చయముచే విస్మయజాలమందును గూడ జ్ఞాని ఆశ్చర్యములేకయే యుండును.

న దయాదైన్యమాదత్తే న క్రౌర్యమనుధావతి
న లజ్జామనుసంధత్తే నాలజ్జత్వం చ గచ్ఛతి. 31

దయచే నాతడు దీనత్వము వహింపడు; కాని క్రౌర్యమున్ను యాశ్రయింపడు, అవమానాదులందు లజ్జితుడుకాడు; దుష్కార్యములందు నిర్లజ్జయు నొందడు.

న కదాచన దీనాత్మా నోద్ధతాత్మా కదాచన
న ప్రమత్తో న ఖిన్నాత్మా నోద్విగ్నో న చ హర్షవాన్. 32

అతడెన్నడును దీనుడుగాని, గర్విగాని, ప్రమత్తుడుగాని, ఖిన్నుడుగాని, హర్షితుడుగాని, భయశోకాదియుతుడుగాని కాకయుండును.

నాస్య చేతసి సుస్ఫారే శరదమ్బరనిర్మలే
కోపాదయః ప్రజాయన్తే నభసీవ నవాఙ్కురాః. 33

ఆకాశమున నూతనయంకుర ముద్భవింపనట్లు విశాలశరదాకాశమువంటి జ్ఞానిచిత్తమున కోపాదులు జనింపవు.

అనారతపతజ్జాతభూతాయాం జగతః స్థితౌ
క్వ కథం కిల కాసౌ స్యాత్సుఖితాఽసుఖితాథవా. 34

నిరంతరము జననమరణములతో గూడియున్న యీ జగత్స్థితియందు సుఖముగాని, దుఃఖముగాని యేది యెట్లుండగలదు?

ఫేనావనం జవీభావే జలే భూతక్రమే తథా
క్వ కిలేదం కుతః కోఽన్తః ప్రసఙ్గః సుఖదుఃఖయోః. 35

తరంగములచే చలించు నురుగువలె చపలమైనట్టి యీ పంచభూత (ప్రాణిసముదాయ) క్రమమున సుఖదుఃఖముల ప్రసంగ మెచట నుండగలదు?



భావాభావైరపర్యన్తైరజస్రం జన్తుసంభవైః
న విశీర్యన్తి నోద్యన్తి దృష్టిసృష్టిక్షమా నరాః. 36

నిరంతరముగల్గు ప్రాణికోట్లయొక్క జననమరణాదులచే జగద్దృష్టి, జగత్సృష్టిసమర్థులగు జీవన్ముక్తులు ఉత్పత్తివినాశములనుగాని, హర్షశోకములనుగాని బొందకుందురు.

నిమేషం ప్రతియామిన్యాం యథాన్యాః స్వప్నదృష్టయః
క్షణోత్పత్తివినాశిన్యస్తథైతా లోకదృష్టయః. 37

రాత్రియందొక నిమిషకాలముననే స్వప్నదృష్టులన్నియు సంభవమగునట్లు, క్షణక్షణమున నుత్పత్తివినాశములతో గూడినట్టి యీ జగద్దృష్టులున్ను సంభవమగును.

అనారతసముత్పత్తావనారతవినాశిని
కః క్రమో దగ్ధసంసారే కారుణ్యానన్దయోరిహ. 38

నిరంతర ముత్పత్తివినాశములతో గూడిన యీ తుచ్ఛప్రపంచమున హర్షశోకములం గూర్చిన ప్రసంగమేమి?

శుభాభావాత్సుఖాభావే స్థితిం యాతే విలక్షణాః
కీదృశ్యః కథమాయాతాః క్వ వా తా దుఃఖసంవిదః. 39

జీవన్ముక్తునకు శుభకర్మాభావముచే సుఖాభావమే సిద్ధింప నిక శుభఫలమునకు విలక్షణమైనట్టి దుఃఖానుభవమెట్లు యెచట యేదిగల్గును?

సుఖసంవేదనాన్తోత్థా స్వబీజం వితనోతి యా
శాన్తా దుఃఖదశా సేయం కథమన్తర్హితే సుఖే. 40

శుభకర్మాభావముచే సుఖమే స్వయముగ నశింప, నిక స్వకార్యమగు శోకమోహాదులను విస్తరింపజేయునదై, సుఖానుభవముయొక్క అంతమున గలదైనట్టి దుఃఖదశ జ్ఞానికెట్లు సంభవించును?

క్షీణాభ్యాం సుఖదుఃఖాభ్యాం హేయోపాదేయయోః క్షయే
ఈప్సితానీప్సితే క్వాస్తో గలితేఽథ శుభాశుభే. 41

జ్ఞానికి సుఖదుఃఖసంక్షయముచే త్యాజ్యగ్రాహ్యములు నశింప, దానిచే శుభాశుభములు తొలగ నిక యిష్టానిష్టము లెచటుండును?

రమ్యారమ్యదృశోర్నాశాద్యాతే భోగాభివాఞ్ఛనే
నైరాశ్యే సంతతం ప్రౌఢే హిమవద్విగలేన్మనః. 42

శుభాశుభదృష్టి శమింప, భోగేచ్ఛ నాశమొంద, నైరాశ్యము నిరంతరము ప్రబలముకాగా, మంచువలె మనస్సు విలయమొందును.

ఆమూలాన్మనసి క్షీణే సంకల్పస్య కథా చ కా
తిలేష్వివాతిదగ్ధేషు తైలస్య కలనా కుతః. 43

మనస్సు సమూలముగ నశింప నిక సంకల్పకల్పన యెచట? నువ్వులు కాలిపోవ, యిక నూనెను గూర్చిన ప్రసంగమేమి?

భావేష్వభావఘనభావనయా మహాత్మా
నిర్ముక్తసంకలనమమ్బరవత్సితేషు
చిత్తం ప్రతి స్వముదితో వితతైకరూపీ
జ్ఞస్తిష్ఠతి స్వపితి జీవతి నిత్యతృప్తః. 44

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే జీవన్ముక్తస్వరూపవర్ణనం నామ సప్తసప్తతితమః సర్గః ॥ 77 ॥

స్వాత్మకన్యముగ యెద్దియులేదను నీ దృఢభావనచే సంకల్పవికల్పములు నశించి, సర్వదృశ్యపదార్థములును ఆకాశమువలె స్థితిఁబొంద, పరిచ్ఛిన్నత్వములేమి, ఆత్మజ్ఞానియగు మహాత్ముఁడు ఆనందముచే ప్రమోదితుఁడై, జాగ్రత్స్వప్నములందు యథాప్రాప్తములగు పదార్థములను చిత్తముచే నవలోకించుచు, చిత్తము విలయమొంద యాపై నిదురించుచు, ప్రారబ్ధక్షయపర్యంతము జీవితమును గడపును నిత్యతృప్తుఁడైయుండును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున జీవన్ముక్తస్వరూపవర్ణనమను సప్తసప్తతితమ సర్గము ॥ 77 ॥

## అష్టసప్తతితమః సర్గః

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యథాలాతపరిస్పన్దాదగ్నిచక్రం ప్రదృశ్యతే
అసదేవ సదాభాసం చిత్తస్పన్దాత్తథా జగత్. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! కొఱవిని త్రిప్పుటచే చక్రాకారమగు అగ్ని గన్పట్టునట్లు చిత్తచంచలనముచే మిథ్యారూపమగు నీ జగత్తున్ను భాసించుచున్నది.

యథా జలపరిస్పన్దాద్వ్యతిరిక్త ఇవామ్భసః
దృశ్యతే వర్తులావర్తశ్చిత్తస్పన్దాత్తథా జగత్. 2

చలనముచే నీటియందు వర్తులాకారమగు యావర్తము జలమునకు భిన్నముగ గోచరించునట్లు, చిత్తస్పందముచే నీ జగత్తున్ను గాన్పించుచున్నది.

యథా వ్యోమ్ని క్షణస్పన్దాత్పిచ్ఛమౌక్తికమణ్డలమ్
దృశ్యతే సదివాసత్యం చిత్తస్పన్దాత్తథా జగత్. 3

సూర్యరశ్మియందు దాకసమును బరికించిన క్షణములో నెమలి కన్నులవంటివియు, ముత్తెములవంటివియునగు పదార్థములు గన్పించునట్లు, చిత్తస్పందముచే మిథ్యయగు నీ జగత్తున్ను సత్యముగ గన్పట్టుచున్నది.



శ్రీరామ ఉవాచ:—

యేన ప్రస్పన్దతే చిత్తం యేన న స్పన్దతే తథా
తద్బ్రహ్మన్బ్రూహి మే యేన చికిత్స్యేయం తదేవ హి. 4

శ్రీరాముడు:—ఓ మహాత్మా! చిత్తము దేనిచే చలించుచున్నది? దేనిచే నయ్యది చలింపకుండును? మనోదమన మత్యావశ్యకముగాన యద్దానిని నాకు వచింప వేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యథా శౌక్ల్యహిమే రామ తిలతైలలవౌ యథా
యథా కుసుమసౌగన్ధ్యే తథాగ్న్యౌష్ణ్యదహనౌ యథా. 5
తథా రాఘవ సంశ్లిష్టౌ చిత్తస్పన్దౌ తథైవ హి
అభిన్నౌ కేవలం మిథ్యా భేదః కల్పిత ఏతయోః. 6

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! మంచు తెలుపుదనము, నువ్వులు నూనెకణములు, పుష్పము సుగంధము, అగ్ని ఉష్ణత్వము యభిన్నములగునట్లు చిత్తము దానిస్పందమున్ను యభిన్నములే యగును. వీటిభేదము మిథ్యారూపమునసే కల్పింపబడినది.

చిత్తచిత్తపరిస్పన్దపక్షయోరేకసంక్షయే
స్వయం గుణగుణీ స్థిత్వా నశ్యతో ద్వౌ న సంశయః. 7

గుణగుణీరూపమునమున్నందున చిత్త, చిత్తస్పందములం దొకటి నశించుటచే రెండును నశించుచున్నవి.

ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానం చ రాఘవ
యోగస్తద్వృత్తిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణమ్. 8

ఓ రామా! చిత్తనాశనమునకై యోగమనియు, జ్ఞానమనియు యిరు తెఱఁగులగు ఉపాయములు చెప్పబడినవి. అందు యోగము చిత్తవృత్తినిరోధమున్ను, జ్ఞానము సమ్యక్ దర్శనమున్ను నగును.

శ్రీరామ ఉవాచ:—

కదా కీదృక్క్రియా యుక్త్యా ప్రాణాపాననిబన్ధయా
యోగనామ్న్యా మనః శాన్తిమేత్యనన్తసుఖప్రదామ్. 9

శ్రీరాముడు:—ఓ మునీంద్రా! ప్రాణాపాననిరోధరూపమగు ఏ యోగయుక్తిచే జీవుడెపుడు యెట్లు అనంతసుఖదాయకమగు మనశ్శాంతిని పొందగల్గునో వచింపుము?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

దేహేఽస్మిన్దేహనాడీషు వాతః స్ఫురతి యోఽభితః
స్పన్దేష్వివ భువో వారి స ప్రాణ ఇతి కీర్తితః. 10

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! ఈ దేహమున ప్రతిశాఖయందును 72 నాడీసమూహములు గలవు. భూరంధ్రములందు జలమువలె యావేళకొలది నాడులంతటను వాయువు స్ఫురించుచున్నది. దానినే ప్రాణమందురు.

తస్య స్పన్దవశాదన్తః క్రియావైచిత్ర్యమీయుషః
అపానాదీని నామాని కల్పితాని కృతాత్మభిః. 11

సంచలనముచే యధోగమనాది విచిత్రక్రియలొనర్చుటచే యాప్రాణమునకే అపానము మున్నగు పేర్లను విజ్ఞులు కల్పించిరి.

ఆమోదస్య యథా పుష్పం శౌక్ల్యస్య తుహినం యథా
తథైష రస ఆధారశ్చిత్తస్యాభిన్నతాం గతః. 12

సుగంధమునకు పుష్పమున్ను, తెలుపుదనమునకు మంచున్ను ఆధారమగునట్లు, చిత్తమునకు వేఱుగానున్నట్టి యీ ప్రాణమున్ను చిత్తమున కాధారమగును.

అన్తఃప్రాణ పరిస్పన్దాత్సంకల్పకలనోన్ముఖీ
సంవిత్సంజాయతే యైషా తచ్చిత్తం విద్ధి రాఘవ. 13

ఓ రాఘవా! లోన ప్రాణచలనమగుటచే సంకల్పోన్ముఖమై జనించునట్టి సంవిత్తు (జ్ఞానవృత్తి) చిత్తమని యెఱుంగుము.

ప్రాణస్పన్దాచ్చితఃస్పన్దస్తత్స్పన్దాదేవ సంవిదః
చక్రావర్తవిధాయిన్యో జలస్పన్దాదివోర్మయః. 14

ప్రాణస్పందముచే చిదాభాసునిచే వ్యాప్తమగు వృత్తులయొక్క స్పందమున్ను కలుగుచున్నది. మఱియు జలస్పందముచే చక్రాకారమగు యావర్తము ననుసరించునట్టి తరంగమువలె యా వృత్తుల స్పందముచే విషయానుభవమున్ను గలుగుచున్నది.

చిత్తం ప్రాణపరిస్పన్దమాహురాగమభూషణాః
తస్మిన్సంరోధితే నూనముపశాన్తం భవేన్మనః. 15

వేదరహస్యమెఱింగినవారు ప్రాణస్పందమునే చిత్తమని పేర్కొనిరి. కాన, ప్రాణనిరోధముచే చిత్తమున్ను తప్పక యుపశమించును.

మనఃస్పన్దోపశాన్త్యాయం సంసారః ప్రవిలీయతే
సూర్యాలోకపరిస్పన్దశాన్తౌ వ్యవహృతిర్యథా. 16

సూర్యప్రకాశ ముశమింప, దైనిక వ్యవహారములున్ను యుపశమించునట్లు మనఃస్పందము నశింప యీ జగత్తున్ను విలయమొందును.

శ్రీరామ ఉవాచ :—

అనిశం చరతాం దేహగేహే గగనగామినామ్
ప్రాణాదీనాం పరిస్పన్దో వాయూనాం రోధ్యతే కథమ్. 17

శ్రీ రాముడు:—ఓ మునీంద్రా! ఈ దేహగృహమునగల 72 వేల నాడులలో నాసికాదిరంధ్రములందు గల యాకాశమున నిరంతరము గమనమొనర్చునట్టి ప్రాణాదివాయువుల చలన మెట్లు నిరోధింపబడును?



శ్రీవసిష్ఠ ఉవాచ :—

శాస్త్రసజ్జనసంపర్కవైరాగ్యాభ్యాసయోగతః
అనాస్థాయాం కృతాస్థాయాం పూర్వసంసారవృత్తిషు. 18

యథాభివాఞ్ఛితధ్యానాచ్చిరమేకతయోదితాత్
ఏకతత్త్వఘనాభ్యాసాత్ప్రాణస్పన్దో నిరుధ్యతే. 19

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! శాస్త్ర, సజ్జన సంపర్కముచేతను, వైరాగ్యాభ్యాసముల చేతను, పూర్వాభ్యస్తములగు సాంసారికవృత్తులం దవిశ్వాసము దృఢపడ, ఏకాగ్రతచే నుదయించిన యభిమత ధ్యానముచేతను, యేకతత్వముయొక్క దృఢాభ్యాసముచేతను ప్రాణచలనము నిరోధింపబడును.

పూరకాదినిజాయామాద్దృఢాభ్యాసాదఖేదజాత్
ఏకాన్తధ్యానసంయోగాత్ప్రాణస్పన్దో నిరుధ్యతే. 20

దృఢాభ్యాసముచేతను, సుఖపూర్వకముగ సిద్ధించిన పూరకాది నిజప్రాణాయామము చేతను, ఏకాంతధ్యానయోగముచేతను ప్రాణస్పందము నిరోధింపబడును.

ఓంకారోచ్చారణప్రాన్తశబ్దతత్త్వానుభావనాత్
సుషుప్తే సంవిదో జాతే ప్రాణస్పన్దో నిరుధ్యతే. 21

ఓంకారమును దీర్ఘముగ నుచ్చరించి, యద్దాని చతుర్థమాత్ర నవలంబించి, శబ్దార్థమును భావనచేయుటచే బాహ్యవిషయజ్ఞానము పూర్ణముగ నుపశమింప, యత్తఱి ప్రాణస్పందము నిరుద్ధమగును.

రేచకే నూనమభ్యస్తే ప్రాణే స్ఫారే ఖమాగతే
న స్పృశత్యజరన్ధ్రాణి ప్రాణస్పన్దో నిరుధ్యతే. 22

రేచకముయొక్క దృఢాభ్యాసముచే విశాలమగు ప్రాణము విచ్ఛిన్నమేఘమువలె ఆకాశరూపముఁజెంద, నాసికారంధ్రాదుల నయ్యది స్పృశింపకుండుటచే ప్రాణచలనము నిరోధింపబడును.

పూరకే నూనమభ్యస్తే పూరాద్గిరిఘనస్థితే
ప్రాణే ప్రశాన్తసంచారే ప్రాణస్పన్దో నిరుధ్యతే. 23

పూరకము దృఢముగ నభ్యసింపబడ యాభ్యంతర పూరణముచే, పర్వతముపై మేఘమువలె ప్రాణసంచారము నిశ్చలమై యుపశమింప నంత ప్రాణస్పందము నిరుద్ధమగును.

కుమ్భకే కుమ్భవత్కాలమనన్తం పరితిష్ఠతి
అభ్యాసాత్స్తమ్భితే ప్రాణే ప్రాణస్పన్దో నిరుధ్యతే. 24

పూరకమైన పిదప, పూర్ణఘటమువలె కుంభక ప్రాణాయామము దీర్ఘకాలమువఱకు స్థిరపడ, అభ్యాసముచే ప్రాణము స్తంభితమవ, ప్రాణస్పందనిరోధము గల్గును.

తాలుమూలగతాం యత్నాజ్జిహ్వయాక్రమ్య ఘణ్టికామ్
ఊర్ధ్వరన్ధ్రగతే ప్రాణే ప్రాణస్పన్దో నిరుధ్యతే. 25

తాలువుయొక్క మొదటిభాగమున వ్రేలాడుచున్న ఘంటికను జిహ్వచే యణచి ప్రాణమును బ్రహ్మరంధ్రమునఁ బ్రవేశింపజేసి ధారణ యొనర్చుటచే ప్రాణస్పందము నిరోధింపబడును.

సమస్తకలనోన్ముక్తే న కించిన్నామ సూక్ష్మఖే
ధ్యానాత్సంవిది లీనాయాం ప్రాణస్పన్దో నిరుధ్యతే. 26

సర్వకల్పనావికారవర్జితమై నామరహితమైనట్టి సూక్ష్మహృదయాకాశమున బాహ్యాభ్యంతర సంవేదనవృత్తి నిర్వికల్పసమాధిచే విలయమునొంద ప్రాణచలము నిరోధింపబడును.

ద్వాదశాఙ్గులపర్యన్తే నాసాగ్రే విమలామ్బరే
సంవిద్దృశి ప్రశామ్యన్త్యాం ప్రాణస్పన్దో నిరుధ్యతే. 27

నాసికాగ్రభాగమున నిర్మలాకాశమునందు పండ్రెండంగుళములవఱకు మనోదృష్టుల నిరోధించుటచే ప్రాణస్పందనిరోధము గల్గును.

అభ్యాసాదూర్ధ్వరన్ధ్రేణ తాలూర్ధ్వం ద్వాదశాన్తగే
ప్రాణే గలితసంవృత్తే ప్రాణస్పన్దో నిరుధ్యతే 28

అభ్యాసముచే తాలువుపై పండ్రెండంగుళముల మేరనున్న బ్రహ్మరంధ్రమునందు ప్రాణవృత్తి లయింప ప్రాణస్పందము నిరోధింపబడును.

భ్రూమధ్యే తారకాలోకశాన్తావన్తముపాగతే
చేతనే కేతనే బుద్ధే ప్రాణస్పన్దో నిరుధ్యతే. 29

భ్రూమధ్యభాగమున నేత్రేంద్రియము చిరకాలము నిరోధింపబడి శాంతినొంద, పైరీతి ప్రాణమును బ్రహ్మరంధ్రమునఁ బ్రవేశపెట్టుటచే చిన్మాత్రస్వభావుడగు పరమాత్మను స్వాత్మరూపమున యెఱుంగ నంత ప్రాణస్పందము నిరుద్ధమగును.

ఝటిత్యేవ యదుద్భూతం జ్ఞానం తస్మిన్దృఢాశ్రితే
అసంశ్లిష్టవికల్పాంశే ప్రాణస్పన్దో నిరుధ్యతే. 30

గురు, ఈశ్వరానుగ్రహములచే కాకతాళీయముగ ఆత్మజ్ఞానము శీఘ్రముగ జనింప, నయ్యది వికల్పాంశరహితమై దృఢపడ, ప్రాణచలనము నిరుద్ధమగును.

చిరం కాలం హృతే కాన్తవ్యోమసంవేదనాన్మనే
అవాసనాన్మనోధ్యానాత్ప్రాణస్పన్దో నిరుధ్యతే. 31

మననశీలుఁడవగు నోరామా! హృదయాకాశమున చిరకాలము చిత్తమును సంలగ్నమొనర్చుటచేతను, వాసనారహితుడై ఆత్మధ్యానము చేయుటచేతను ప్రాణస్పందము నిరోధింపబడును.

శ్రీరామ ఉవాచ:—

బ్రహ్మన్ జగతి భూతానాం హృదయం తత్కిముచ్యతే
ఇదం సర్వం మహాదర్శే యస్మింస్తత్ప్రతిబిమ్బతి. 32

శ్రీరాముడు:–ఓమహాత్మా! ఈ ప్రపంచమున యే విశాలహృదయదర్పణమున నీదృశ్యమంతయు స్ఫురించుచున్నదో యట్టి ప్రాణులయొక్క హృదయ మెయ్యది?



శ్రీ వసిష్ఠ ఉవాచ:—

సాధో జగతి భూతానాం హృదయం ద్వివిధం స్మృతమ్
ఉపాదేయం చ హేయంచ విభాగోఽయం తయోః శృణు. 33

శ్రీవసిష్ఠుడు:—సాధువగు నోరామా! ఈ ప్రపంచమున ప్రాణుల హృదయ మిరుతెఱఁగులు. ఒకటి గ్రాహ్యము. రెండవది త్యాజ్యము. వాటిభేదమును వచించెద వినుము.

ఇయత్తయా పరిచ్ఛిన్నే దేహే యద్వక్షసోఽన్తరమ్
హేయం తద్ధృదయం విద్ధి తనావేకతటే స్థితమ్. 34

పరిచ్ఛిన్నమైనట్టి దేహమందు, వక్షస్థలమున యేకదేశమున గల మాంసపిండమును 'త్యాజ్య' హృదయమని నీ వెఱుంగుము.

సంవిన్మాత్రం తు హృదయముపాదేయం స్థితం స్మృతమ్
తదన్తరే చ బాహ్యేచ న చ బాహ్యే న చాన్తరే. 35

జ్ఞానమాత్రమగు హృదయము 'గ్రాహ్య'మని యెన్నబడినది. అది సర్వుల బాహ్యాభ్యంతరములందును గలదు. కాని, యథార్థముగ నయ్యది బాహ్యమునగాని, అంతరంగమునగాని లేనిదేయగును.

తత్తు ప్రధానం హృదయం తత్రేదం సమవస్థితమ్.
తదాదర్శః పదార్థానాం తత్కోశః సర్వసంవిదామ్. 36

అదియే ప్రధానమగు హృదయము. దానియందే యీ జగత్తంతయు స్థితినొందియున్నది. అదియే సర్వపదార్థములకు యాధారమును, సర్వసంపదలకు విలయమును నగును.

సర్వేషామేవ జన్తూనాం సంవిద్ధృదయముచ్యతే
న దేహావయవైకాంశో జడజీర్ణోపలోపమః. 37

జీవులందఱి హృదయము సంవిత్తని (జ్ఞానమని)యే వచింపబడెనుగాని జడమై, శిథిలమై శిలాసదృశమైన మాంసపిండమను శరీరావయవముకాదు.

తస్మిన్సంవిన్మయే శుద్ధే హృదయే హృతవాసనః
బలాన్నియోజితే చిత్తే ప్రాణస్పన్దో నిరుధ్యతే. 38

కాన సంవిద్రూపమగు శుద్ధహృదయమున వాసనాత్యాగపూర్వకముగ చిత్తమును ప్రబలముగ నియోగింప ప్రాణచలనము నిరుద్ధమగును.

ఏభిః క్రమైస్తథాన్యైశ్చ నానాసంకల్పకల్పితైః
నానాదేశికవక్త్రస్థైః ప్రాణస్పన్దో నిరుధ్యతే. 39

ఇట్టిమార్గములచేతను, ఇంకను పలువిధ యాచార్యులచే ప్రకల్పితములగు తదితరక్రమములచేతను ప్రాణస్పందము నిరోధమొనర్పబడును.

అభ్యాసేన నిరాబాధమేతాస్తా యోగయుక్తయః
ఉపాయతాముపాయాన్తి భవ్యస్య భవభేదనే. 40

మోక్షాధికారికి సంసారవినాశమున యీ చెప్పబడిన యోగయుక్తులన్నియు అభ్యాసముచే తప్పక నుపాయత్వముఁజెందును.

అభ్యాసాద్దృఢతాం యాతో వైరాగ్యపరిలాఞ్ఛితః
యథావాసనమాయామః ప్రాణానాం సఫలః స్మృతః. 41

అభ్యాసముచే దృఢపడినదియు, వైరాగ్యయుక్తమైనదియునగు ప్రాణాయామము వాసనానిరోధమున సాఫల్యము గలుగజేయునని వచింపబడినది.

భ్రూనాసాతాలుసంస్థాసు ద్వాదశాఙ్గులికోటిషు
అభ్యాసాచ్ఛామ్యతి ప్రాణో దూరే గిరినదీ యథా. 42

దూరదేశమున కేగుటచే సెలయేరు ఆగిపోవునట్లు, భ్రూ, నాసికా, కంఠభాగములనుండి పండ్రెండంగుళముల వఱకుగల ప్రదేశమున చిత్తమును స్థిరము నర్చునట్టి అభ్యాసముచే ప్రాణమున్ను యుపశమించును.

భూయోభూయశ్చిరాభ్యాసాజ్జిహ్వాగ్రప్రాన్తేన తాలుని
ఘణ్టికా స్పృశ్యతే ప్రాణో యేనోర్ధ్వే న వహత్యలమ్. 43

చిరకాలాభ్యాసముచే తాలువునందు వ్రేలాడు ఘంటికను జిహ్వాగ్రభాగముచే పలుమారులు స్పృశింప, ప్రాణమధికముగ చలింపకుండును.

వికల్పబహులా స్త్వేతే స్వాభ్యాసేన సమాధయః
పరమోపశమాయాశు సంప్రయాన్త్యవికల్పతామ్. 44

ఈ సమాధిభేదములు తత్తత్ఫలసిద్ధియందనేక వికల్పములతో గూడుకొనినవైనను, నిష్కామున కవన్నియు పరమోపశమఫలమున వికల్పరహితములే యగును.

ఆత్మారామో వీతశోకో భవత్యన్తఃసుఖః పుమాన్
అభ్యాసాదేవ నాన్యస్మాత్తస్మాదభ్యాసవాన్భవ. 45

ఓ రామా ! అభ్యాసముచేతనే మనుజుడు ఆత్మారాముడును, శోకరహితుడును, అంతఃకరణమున సుఖియు నగునుగాని మఱియే యితర ఉపాయముచేతను గాదు.

అభ్యాసేన పరిస్పన్దే ప్రాణానాం క్షయమాగతే
మనః ప్రశమమాయాతి నిర్వాణమవశిష్యతే. 46

అభ్యాసముచే ప్రాణస్పందము నశింప, మనస్సు శాంతినొందును. మఱియు కేవలము నిర్వాణ (బ్రహ్మ, లేక మోక్ష) పదము శేషించును.

వాసనావలితం జన్మ మోక్షం నిర్వాసనం మనః
ప్రాణం చ రామ గృహ్ణాతి యథేచ్ఛసి తథా కురు. 47

ఓ రామా ! వాసనాయుక్తమగు చిత్తము జన్మమును, శరీరమును, ప్రాణమును గ్రహించును. వాసనారహితమగునది మోక్షమునే గ్రహించును. ఇట్లుటెంగి యిక నీయిచ్ఛవచ్చినట్లాచరింపుము.



ప్రాణస్పన్దో మనోరూపం తస్మాత్సంసృతివిభ్రమః
తస్మిన్నేవ శమం యాతే దీయతే సంసృతిజ్వరః. 48

ప్రాణస్పందమే మనస్సు. ఆ మనస్సువలననే యీ సంసారభ్రమయంతయు కలుగుచున్నది. కాన ప్రాణస్పందముపశమింప సంసారదుఃఖమున్ను నశించును.

వికల్పాంశక్షయాజ్జన్తోః పదం తదవశిష్యతే
యతో వాచో నివర్తన్తే సమస్తకలనాన్వితాః. 49

కల్పనాయుక్తమగు వాక్సముదాయమంతయు దేనినుండి నివృత్తిఁబొందునో, అట్టి బ్రహ్మపదము జీవుని వికల్పాంశము నశించుటచే శేషించును.

యత్ర సర్వం యతః సర్వం యత్సర్వం సర్వతశ్చ యత్
యత్ర నేదం యతో నేదం యన్నేదం నేదృశం జగత్. 50

బ్రహ్మముననే యీ జగత్తంతయును గలదు. దానినుండియే నిది యావిర్భవించినది. ఇదంతయు నాబ్రహ్మరూపమే. ఆ బ్రహ్మమే యంతటను వ్యాపించియున్నది. కాని యథార్థముగ బ్రహ్మమునని జగత్తులేదు. దానినుండి యావిర్భవింపను లేదు. ఇది యద్దానిరూపమున్ను గాదు. ఏ యంశముననను నిది యాబ్రహ్మముతోటి సామ్యముకలదియును గాదు.

వినాశిత్వాద్వికల్పత్వాద్గుణిత్వాన్నిర్గుణాత్మనః
యస్య నో సదృశో దృష్టో దృష్టాన్తః కశ్చిదేవ హి. 51

ఈ జగత్తు నాశవంతమును, వికల్పమయమునగుటచే యిట్టి నిర్గుణపరమాత్మకు సదృశమైన దృష్టాంతమెద్దియును గాంచబడలేదు.

స్వాదినీ సర్వశీలానాం దీపికా సర్వతేజసామ్
కలనా సర్వకామానామన్తశ్చిచ్ఛన్ద్రికోదితా. 52

అంతఃకరణమున నుదితమైన చిద్రూప చంద్రిక, సర్వరూపరసాది బాహ్యవృత్తు (త్రిపుటు) లను సాక్షిరూపమున ననుభవించునదియు, తేజోవంతములగు పదార్థములన్నింటికిని గూడ ప్రకాశకమైనదియు, కామాది యాభ్యంతర వృత్తులఁగూడ ప్రకాశింపజేయునదియునై యున్నది.

యస్మాత్కల్పతరోర్బ్రహ్మణః సంసారఫలపఙ్క్తయః
అనాగతం బహురసా జాయన్తే చ పతన్తి చ. 53
తత్పదం సర్వసీమాన్తమవలమ్బ్య మహామతిః
యః స్థితః స్థిరధీస్తజ్జ్ఞః స జీవన్ముక్త ఉచ్యతే. 54

ఏ చైతన్యమను కల్పవృక్షమునుండి వివిధరసయుక్తములగు జగద్రూప ఫలములు నిరంతరముత్పన్నమై నశించుచున్నవో, సర్వసీమాంతమగు యట్టి బ్రహ్మపదము నవలంబించియుండునట్టి మహామతియు, ధీరుడును, బ్రహ్మజ్ఞుడును నగు యుత్తముడే జీవన్ముక్తుడనఁబడును.

విగత సర్వసమీహితకౌతుకః
సముపశాన్తహితాహితకల్పనః,

సకల సంవ్యవహారసమాశయో
భవతి ముక్తమనాః పురుషోత్తమః. 55

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఉపశమప్రకరణే యోగవర్ణనం నామ అష్టసప్తతితమః
సర్గః ॥ 78 ॥

అన్ని కామభోగాదుల యభిలాషయు నశింపినవాడును, హితాహిత కల్పనయంతయు నుపశమింపినవాడును, వ్యవహారములన్నిటియందును హర్షశోకములఁ బొందనివాడును నగు వాఁడే ముక్తమానసుఁడును, పురుషోత్తముఁడును నగును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
యోగవర్ణనమను అష్టసప్తతితమ
సర్గము ॥ 78 ॥

---

## ఏకోనాశీతితమః సర్గః

---

శ్రీ రామ ఉవాచ :—

యోగయుక్తస్య చిత్తస్య శమ ఏవ నిరూపితః
సమ్యగ్జ్ఞాన మిదానీం మే కథయానుగ్రహాత్ప్రభో. 1

శ్రీ రాముడు:—ఓ మహాత్మా ! యోగయుక్తునకు చిత్తనాశమునకై మొదటియుపాయమును తాము వచించితిరి. ఇపుడు నాయందనుగ్రహముంచి సమ్యక్ జ్ఞానమును వచింపుడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అనాద్యన్తావభాసాత్మా పరమాత్మేహ విద్యతే
ఇత్యేకో నిశ్చయః స్ఫారః సమ్యగ్జ్ఞానం విదుర్బుధాః. 2

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా ! 'ఆద్యంతరహితుడును, అసాధారణుడునునగు పరమాత్మ యొకడే యీ జగత్తున కలడు. అతనికన్య మొద్దియును లేద'ననీ మహత్తర నిశ్చయమునే విజ్ఞులు సమ్యక్ జ్ఞానమందురు.

ఇమాః ఘటపటాకారాః పదార్థశతపఙ్క్తయః
ఆత్మైవ నాన్యదస్తీతి నిశ్చయః సమ్యగీక్షణమ్. 3

ఘటపటాద్యాకారముల స్ఫురించు యీ వివిధపదార్థములన్నియు ఆత్మయేగాని యన్యముగాదను నిశ్చయమే సమ్యక్ జ్ఞానము.

అసమ్యగ్వేదనాజ్జన్మ మోక్షః సమ్యగవేక్షణాత్
అసమ్యగ్వేదనాద్రజ్జుః సర్పో నో సమ్యగీక్షణాత్. 4



మిథ్యాజ్ఞానముచే జన్మాదులును సమ్యక్ జ్ఞానముచే మోక్షమును గలుగును. ఏలన, మిథ్యాజ్ఞానమువలననే రజ్జువు సర్పమగుచున్నదిగాని సమ్యక్ జ్ఞానముచే గాదు.

సంకల్పాంశవినిర్ముక్తా సంవిత్సంవేద్యవర్జితా
సంవిత్త్యాభిసమాఖ్యాతా ముక్తావస్థేహ నేతరత్. 5

సంకల్పాంశవినిర్ముక్తమును, విషయవర్జితమును నగు సంవిత్తే తన స్వప్రకాశస్వభావముచే మోక్షార్థమంతటను విఖ్యాతమైయున్నది గాని యన్యముగాదు.

సా శుద్ధరూపా విజ్ఞాతా పరమాత్మేతి కథ్యతే
శుద్ధా త్వశుద్ధరూపా స్తరవిద్యేత్యుచ్యతే బుధైః 6

శుద్ధరూపమున తెలియఁగబడిన యా సంవిత్తే పరమాత్మయని వచింపబడినది శుద్ధరూపమైనప్పటికి, అశుద్ధరూపకల్పనచే నదియే అవిద్య యగునని విజ్ఞులచే యెన్నబడినది.

సంవిత్తిరేవ సంవేద్యం నానయోర్ద్విత్వకల్పనా
చినోత్యాత్మానమాత్మైవం రామైవం నాన్యదస్తిహి. 7

ఓ రామా ! సంవిత్తే (జ్ఞానమే) సంవేద్యము (జ్ఞేయము). ఈ రెంటియందును ద్వైతకల్పనయే లేదు. అజ్ఞానవశముననే ఆత్మ తన్ను తాను జగద్రూపముగ సంచయమొనర్చుకొనుచున్నది గాని యథార్థముగయిటు ఆత్మకన్యముగ యేమియును లేదు.

యథా భూతాత్మదర్శిత్వమేతావద్భువనత్రయే
యదాత్మైవ జగత్సర్వమితి నిశ్చిత్య పూర్ణతా. 8

ఈ ముల్లోకములందును సత్యమగు ఆత్మయే దృగ్గోచరమగుచున్నది. ఈ జగత్తంతయు ఆత్మయేయను నిశ్చయముచే పూర్ణకామత్వము సిద్ధించును.

సర్వమాత్మైవ కా దిష్టౌ భావాభావౌ క్వ చ స్థితౌ
క్వ బన్ధమోక్షకలనే కిమన్యద్రామ శోచ్యతే. 9

ఓ రామా ! ప్రపంచమంతయు ఆత్మయేయైయుండ నిక భావాభావములాత్మకంటె వేఱుగ యెచట యెట్లు గలవు? బంధమోక్షముల కల్పనయే యెచట? అట్టిచో నిక ఆత్మేతరమగు యెద్దానికై అజ్ఞులు శోకించుచున్నారు?

న చేత్యమన్యన్నో చిత్తం బ్రహ్మైవేదం విజృమ్భతే
సర్వమేకం పరం వ్యోమ కో మోక్షః కస్య బన్ధతా. 10

ఆత్మకన్యముగ విషయముగాని చిత్తముగాని లేవు. బ్రహ్మమే యీదృశ్యరూపమున శోభించుచున్నది. ఈ జగత్తంతయు చిదాకాశమేయైయుండ నిక మోక్షమేమి? బంధమెవనికి?

బ్రహ్మేదం బృంహితాకారం బృహద్బృహదవస్థితమ్
జ్ఞానాదస్తమితద్విత్వం భావాత్మైవ త్వమాత్మనా. 11

మహత్తునకున్న మహత్తైనట్టి బ్రహ్మమే విశాలమగు యీదృశ్యరూపమునసున్నది. ఇకాకారణమున జ్ఞానముచే ద్వైతమును రహితమొనర్చి, యత్నముచే నాత్మస్వరూపుఁడవు గమ్ము.

సమ్యగాలోకితే రూపే కాష్ఠపాషాణవాససామ్
మనాగపి న భేదోఽస్తి క్వాసి సంకల్పనోన్ముఖః. 12

ఓరామా! కాష్ఠ, శిలా, వస్త్రములయొక్క తత్వమును అధిష్ఠానమగు సన్మాత్రదృష్టిచే లెస్సగ విచారించి జూచిన వాటియందు లేశమైనను భేదము గాన్పింపదు. అట్టిచో నీవిక దేనికై సంకల్పోన్ముఖుడవుచుంటివి?

ఆదావన్తే చ సంశాన్తం స్వరూపమవినాశి యత్
వస్తు నామాత్మనశ్చైవ తన్మయో భవ రాఘవ. 13

ఆద్యంతములందును నాశరహితమైన స్వరూపమెద్ది గలదో అదియే 'వస్తువని' ప్రసిద్ధి కెక్కినది. అదియే ఆత్మయొక్క స్వరూపమున్ను యగును. కాన నోరామా! నీవాత్మమయుడవు గమ్ము.

పరం వ్యోమేదమఖిలం జగత్స్థావరజఙ్గమమ్
సుఖదుఃఖక్రమః కుత్ర విజ్వరో భవ రాఘవ. 14

ఓ రాఘవా! స్థావరజంగమాత్మకమగు యీజగత్తంతయు పరబ్రహ్మరూపమగు చిదాకాశమే. ఇకనిందు సుఖదుఃఖక్రమమెచట? కాన నీవు సంతాపరహితుడవు గమ్ము.

ద్వైతాద్వైతసముద్భూతైర్జరామరణవిభ్రమైః
స్ఫురత్యాత్మభిరాత్మైవ చిత్రైరమ్బ్వివ వీచిభిః. 15

విచిత్ర తరంగములతో గూడి జలము స్ఫురించునట్లు, ద్వైతాద్వైతములచే నుత్పన్నమగు జరామరణభ్రమతో గూడిన విచిత్రజీవసమూహముతో గూడి ఆత్మయే స్ఫురించుచున్నది.

శుద్ధమాత్మానమాలిఙ్గ్య నిత్యమన్తస్థయా ధియా
యః స్థితస్తం క ఆత్మేహ భోగా బన్ధయితుం క్షమాః. 16

నిత్యమంతర్ముఖమగు బుద్ధిచే శుద్ధాత్మ నవలంబించియుండు ఆత్మాభిలాషియగు తత్వజ్ఞాని విషయభోగములు బంధించుటకు సమర్థములు కావు.

కృతస్ఫారవిచారస్య మనో భోగాదయోఽరయః
మనాగపి న భిన్దన్తి శైలం మన్దానిలా ఇవ. 17

పర్వతమును పిల్లవాయువులు చలింపచేయజాలనట్లు మహత్తరమగు ఆత్మనుగూర్చి విచారణసల్పినట్టి జ్ఞాని మనస్సును భోగాది శత్రువులు లేశమైనను భిన్నము సేయజాలవు.

అవిచారిణమజ్ఞానం మూఢమాశాపరాయణమ్
నిగిరన్తీహ దుఃఖాని బకా మత్స్యమివాజలమ్. 18

అల్పజలమునయున్న మత్స్యమును కొంగలు తినివేయునట్లు విచారరహితుడును, అజ్ఞానియు మూఢుడును, ఆశాపరాయణుడునునగు జీవుని దుఃఖములు మ్రింగివేయును.

జగదాత్మైవ సకలమవిద్యా నాస్తి కుత్రచిత్
ఇతి దృష్టిమవష్టభ్య సమ్యగ్రూపః స్థిరో భవ. 19



ఓరామా! 'ఈ జగత్తంతయును ఆత్మయే. అవిద్య యెచటను లేద'ను నీ దృష్టి నవలంబించి ఆత్మస్వరూపమున స్థిరుడవు గమ్ము.

నానాత్వమస్తి కలనాసు న వస్తుతోఽన్త
ర్నానావిధాసు సరసీషు జలాది నాన్యత్,
ఇత్యేకనిశ్చయమయః పురుషో విముక్త
ఇత్యుచ్యతే సమవలోకితసమ్యగర్థః. 20

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే సమ్యగ్జ్ఞానలక్షణనిరూపణం నామైకోనాశీతితమః
సర్గః ॥ 79 ॥

వివిధ జలాశయములందలి తరంగ, ఫేన, బుద్బుదాదులు జలమునకు వేఱుగ లేనట్లు, వివిధ కల్పనలందును ఆత్మ తప్ప నాస్తవముగ మఱెద్దియును లేదని, విచారించి ఇట్లాత్మను గూర్చిన ముఖ్యనిశ్చయము గల్గియుండునట్టి సమ్యక్ ఆత్మదర్శియే ముక్తుడనబడును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సమగ్జ్ఞానలక్షణనిరూపణమను ఏకోనాశీతితమ
సర్గము ॥ 79 ॥

## అశీతితమః సర్గః

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇదమన్తః కలయతో భోగాన్ప్రతి వివేకినః
పురఃస్థితానపి సదా స్పృహైవాఙ్గ న జాయతే. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓరామా! ఈ చెప్పబోవు విచారణ గావించిన, యెదుటనున్నప్పటికిని భోగములయెడ వివేకవంతునకు ప్రీతి యెన్నటికిని కలుగనేరదు.

చక్షురాలోకనాయైవ జీవస్తు సుఖదుఃఖయోః
భారాయైవ బలీవర్దో భోక్తా ద్రవ్యస్య నాయకః. 2

ఎద్దు బరువును లాగును. కాని యా పదార్థము ననుభవించునది వాటి యజమానుడు. అట్లనే నేత్రములు కేవలము రూపమును జూచును. కాని సుఖదుఃఖముల ననుభవించునది జీవుడేయగును.

నయనే రూపనిర్మగ్నే క్షోభః క ఇవ దేహినః
గర్దభే పల్వలే మగ్నే కైవ సేనాపతేః క్షతిః. 3

నేత్రేంద్రియము రూపమున మగ్నమైన, ఆత్మకు క్షోభయేల? గార్దభము మడుగున దిగబడ సేనాపతికి హానియేమి?

రూపకర్దమమేతన్మానయనాస్వాదయాధమ
నశ్యత్యేతన్నిమేషేణ భవన్తమపి హింసతి. 4

ఓ నీచనేత్రమా! స్త్రీపుత్రాదుల సౌందర్యమను పంకము నాస్వాదింపకుము. ఏలన, అదిరెుుక క్షణములో నశించి నిన్నును నశింపజేయును.

యేనైవ సంఖ్యా క్రియతే యేనైవాఽస్వాఽనుగమ్యతే.
తదీయైః కర్మభిః క్షిప్రం ప్రాజ్ఞః క్రూరో నిబధ్యతే. 5

అంతఃస్థితమగు యే చిదాత్మచే బాహ్యాభ్యంతర పదార్థములు ప్రకాశించుచున్నవో, దేనిచే అనాత్మభూతములగు పంచకోశములు ఆత్మతోటి యభిన్నరూపమున ననుగమింపబడు చున్నవో, అట్టి ఆత్మసంబంధములగు కర్మలచేతను, ఔదాసీన్యముచే యథాప్రాప్తములగు పదార్థముల ననుభవించుట మున్నగు క్రియలచేతను, తీక్ష్ణబుద్ధిగల ప్రాజ్ఞుడు సంబంధితుడగునే గాని మూఢులవలె రూపపంకము నాస్వాదించు కర్మలచే గాదు.

ఉత్పన్నధ్వంసి చాపాతమాత్రహృద్యమసన్మయమ్.
రూపమాశ్రయ మా నేత్ర వినాశాయావినాశినే. 6

ఓ నేత్రమా! ఉత్పత్తివినాశములు గలదియు, అవిచారముచే రమణీయముగ దోచునదియు, మిథ్యయునగు రూపము నాశ్రయించి అనివార్యమగు మృత్యుముఖమున బ్రవేశింపకుము.

సాక్షివత్త్వం స్థితం నేత్ర రూపమాత్మని తిష్ఠతి
ఆలోకం కాలవశతస్త్వమేకం కిం ప్రతప్యసే. 7

ఓ నేత్రమా! అన్యాశ్రయములేక సదా సర్వపదార్థములను ప్రకాశింపజేయుటయందు సమర్థమైనను పరమాత్మ రూపాది విషయములం దుదాసీనుడై సాక్షిరూపమునను న్నాడు. కాన నీవున్ను సాక్షివలెనుండి సదా సద్రూపమగు ఆత్మను వీక్షించుచుండుము. ఏల యేకాకివై సంతాపమొందుచుంటివి?

సలిలస్పన్దవద్వృష్టిః పిచ్ఛికేవామ్బరోత్థితా
సుజాతిబన్ధా స్ఫురతి తవ చిత్త కిమాగతమ్. 8

ఓ చిత్తమా! గో,అశ్వ స్త్రీపురుషాది సుజాతి దుర్జాతిసంబంధములతో [illegible] స్ఫురించుచున్నట్టి రూపము, నదీజలముయొక్క గతివలె అనిత్యమును, ఆకాశమున గన్పట్టు నెమలికన్నులవలె మిథ్యాభూతమును నగును. అట్టిదానిచే నీకేమి లాభము?

కల్పామ్బుసీవ శఫరీ చిత్తే స్ఫురణధర్మిణి
స్వయం స్ఫురత్యహంకారస్త్వమయం ప్రోత్థితః కుతః. 9

ఓ యహంకారమా! ప్రళయకాలజలమున మత్స్యమువలె, చిత్తమున నీజగత్తు స్ఫురించుచున్నది. స్ఫురించుగాక; కాని నీవెటునుండి వచ్చితివి?

ఆలోకరూపయోర్నిత్యం జడయోః స్ఫురతోర్మిథః
ఆధారాధేయయోశ్చిత్తం వ్యగ్రమాకులతా తవ. 10



ఓ చిత్తమా! పదార్థములు సూర్యాదుల ప్రకాశము నాశ్రయించుటచేతను, సూర్యాదుల ప్రకాశము పదార్థముల నాశ్రయించుటచేతను వ్యక్తమగుచున్నవి. ఇవ్విధమున జడమగు ఆధారాధేయములు స్ఫురించుచున్నవి. ఇట్లుండ నిక యేవస్తువుల సౌందర్యభ్రాంతిచే కామాదుల బాధకులోనై సంబంధములేకయే నీవేల వ్యర్థముగ వ్యాకులపడుచుంటివి?

రూపాలోకమనస్కారాః పరస్పరమసఙ్గినః
సంపన్నా ఇవ లక్ష్యన్తే వదనాదర్శబిమ్బవత్. 11

[illegible]పము, నేత్రాదులచేగల్గు బాహ్యపదార్థదర్శనము, మనస్సంకల్పము ఈ మూడును పరస్పరము సంబంధము లేనివైనను, ముఖ, దర్పణ, ప్రతిబింబములవలె కలసియున్నట్లే గన్పించుచున్నవి.

అజ్ఞానజన్తునా హ్యేతే శ్లిష్టా జాతా నిరన్తరాః
అజ్ఞానే జ్ఞానగలితే పృథక్తిష్ఠన్త్యసన్మయాః. 12

అజ్ఞానికట్లు కలసియున్నట్లే గానుపించును కాని జ్ఞానముచే అజ్ఞానము తొలగునపుడు అయ్యవి వేఱుగావింపబడ నంత యసద్రూపములై అధిష్ఠానమాత్రముననే శేషించును.

మనః కల్పనయా హ్యేతే సుసంబద్ధాః పరస్పరమ్
రూపాలోకమనస్కారా దారుణీ జతునా యథా. 13
స్వమనో మననం తన్తుర్మనోభ్యాసేన యత్నతః
విచారాచ్ఛేదమాయాతి చ్ఛిన్నేవాజ్ఞానభావనా. 14

రూపము, ప్రకాశము, మనస్సంకల్పము—ఇవన్నియు మనస్సుయొక్క కల్పనచేతనే, లక్కచే కొయ్యవలె పరస్పరము కూడియున్నవి.

అజ్ఞానసంక్షయాత్క్షీణే మనసీమే పునర్మిథః
రూపాలోకమనస్కారాః సంఘట్టన్తే న కేచన. 15

అజ్ఞానసంక్షయముచే మనస్సు నశింప రూప, ప్రకాశ, సంకల్పములిక యెన్నటికిని కలియజాలవు.

సర్వేషాం చిత్తమేవాన్తరిన్ద్రియాణాం ప్రబోధకమ్
తదేవ తస్మాదుచ్ఛేద్యం పిశాచ ఇవ మన్దిరాత్. 16

చిత్తమొకటియే ఇంద్రియములన్నిటిని ప్రేరణజేయునది గాన, యింటినుండి పిశాచమునువలె దానినే పారద్రోలవలెను.

చిత్త వల్గసి మిథ్యైవ దృష్టోఽన్తో భవతో మయా
ఆద్యన్తయోః సుతుచ్ఛం త్వం వర్తమానే వినశ్యసి. 17

ఓ చిత్తమా! మిథ్యారూపముననే నీవు విజృంభించుచుంటివి, కాని యిపుడు నీ యంతు కనుగొంటిని. ఆద్యంతములందును నీవు సర్వదా యసద్రూపుడవగుచో వర్తమానమునగూడ వినష్టప్రాయుండవే యగుదువు.

ముధా పఞ్చభిరాకారైః కిమన్తః పరివల్గసి
యస్త్వాం స్వమితి జానాతి తస్యైవ పరివల్గసి. 18

పంచేంద్రియములద్వారా కలుగు శబ్దస్పర్శాదులరూపమున లోన వ్యర్థముగ నీవెందుకు విజృంభించుచుంటివి? నిన్ను తనవానినిగ యెఱుంగుచున్న జీవుని యుపకరణార్థమే నీవు విజృంభించుచున్నావు కాని అసంగమగు చైతన్యము కొఱకు గాదు.

త్వద్వల్గనం మే కుమనో న మనాగపి తుష్టయే
మాయయా మనః స్పష్ట ఇవ వ్యర్థం వృత్తిషు దహ్యసే. 19

ఓ మనసా! ఈ నీవిజృంభణము నాకు లేశమైనను సంతోషమొసగూర్పదు. ఇంద్రజాలికుని మాయచే ప్రేరితమగు మనస్సువలె, వివిధ విషయాకారవృత్తులందు తగుల్కొని యేల వ్యర్థముగ దగ్ధమగుచుంటి?

తిష్ఠ వా గచ్ఛ వా చిత్త నాసి మే న చ జీవసి
ప్రకృత్యాసి మృతం నిత్యం విచారాత్సుమృతం స్మృతమ్. 20

ఓ చిత్తమా! నీవిక ఉండుము లేక పొమ్ము, నీతో నాకట్టి సంబంధమును లేదు. మిథ్యాస్వరూపుఁడవుగాన నీవు మృతుడవే యగుదువు. మఱియు విచారదృష్టిచే బరికింప నీవేకాలమునను లేనివాడవేయై యున్నావు.

నిస్తత్త్వం త్వం జడం భ్రాన్తం శఠం నిత్యమృతాకృతే
మూఢ ఏవ త్వయాజ్ఞేన బాధ్యో న ప్రవిచారవాన్. 21

నిత్యమృతుఁడవగు నోచిత్తమా! నీవు తత్త్వరహితుడవు, జడుడవు, భ్రాంతియుతుడవు, శఠుడవు, అజ్ఞానసహితుడవు. కాన అజ్ఞునకే నీవు దుఃఖము కలిగింపగలవుగాని విచారవంతునకుగాదు.

వయమజ్ఞాతవన్తస్త్వాం మౌర్ఖ్యేణాశు మృతం భవత్
మృతమస్మాకమద్యాసి దీపానాం తిమిరం యథా. 22

అజ్ఞానకారణమున మేము నిన్ను మృతునిగ శీఘ్రమెఱుంగకుంటిమి. కాని యిపుడాత్మదర్శనముచే, దీపముచే యంధకారమువలె నిన్ను మృతునిగ యెఱింగితిమి.

శఠేన భవతా దీర్ఘకాలం దేహగృహం మమ
ఉపరుద్ధమభూత్సర్వం సాధుసంసర్గవర్జితమ్. 23

జ్ఞానము కలుగకమునుపు శమదమాదిరహితమును, సాధుసంసర్గవర్జితమును నగు మాదేహగృహమును దుష్టుడవగు నీవు చాలకాలము నిరోధించియుంటివి.

జడే ప్రేతసమాకారే గతే త్వయి మనః శఠే
సర్వసజ్జనసంసేవ్యమిదం దేహగృహం మమ. 24

పిశాచమువంటి యాకృతిగల నీచుడవగు నీవు వెడలుటచే మా దేహగృహము శమదమాది సర్వసజ్జనులకును సేవనీయమయ్యెను.



పూర్వమేవాసి నాసీస్త్వం సంప్రత్యేవ శఠం జగత్
న భవిష్యసి చేదానీం వేతాల కిం న లజ్జసే. 25

జగద్రూపధారివియు, శఠుడవునగు నో చిత్తవేతాళమా! నీవు పూర్వమున్ను లేవు. ఇపుడును లేకుంటివి. ముందును యుండబోవు. అట్లయియున్నను నీవింక లజ్జితుఁడవుకావేల?

సహ తృష్ణాపిశాచీభిః సహ కోపాదిగుహ్యకైః
నిర్గచ్ఛ చిత్తవేతాల శరీరసదనాన్మమ. 26

ఓ చిత్తపిశాచమా! లజ్జితుఁడవగుచో, నా దేహగృహమునుండి తృష్ణాపిశాచముల [illegible], క్రోధాది గుహ్యకులతోటిన్ని గూడి వెడలి పొమ్ము.

దిష్ట్యా వివేకమాత్రేణ నిర్గతో దేహమన్దిరాత్
ప్రమత్తశ్చిత్తవేతాలః కువృకః కన్దరాదివ. 27

ఆహా! సౌభాగ్యవశమున వివేకమను మంత్రముచే చిత్తమను మదించిన బేతాళము, గుహనుండి తోడేటివలె నా దేహగృహమునుండి యిపుడు పారిపోయినది.

అహోను చిత్రం సుమహజ్జడేన క్షణభఙ్గినా
మనః శఠేన సర్వోఽయం నీతో వివశతాం జనః. 28

అహా! ఎట్టి యాశ్చర్యకరమగు విషయము! మిగుల జడమై, క్షణభంగురమై, శఠరూపమైనట్టి యీ మనస్సు జనులందఱను తన వశమొనర్చుకొనెను గదా!

కస్తే పరాక్రమః కిం తే బలం కస్తే సమాశ్రయః
యది వల్గసి మామేకం జనానాం బాధసే మృతమ్. 29

ఓ దుష్ట మానసమా! ప్రాణులలో దేహాత్మబుద్ధిచే స్వయముగ మృతినొందిన వారినే నీవు బంధించుచున్నావు. ఇందు నీ పరాక్రమమేమి? బలమేమి? ఆశ్రయమేమి? అద్వితీయమైన ఆత్మస్వరూపుఁడనగు నన్ను బాధింప సమర్థమైనచో, అపుడుగదా నీ పరాక్రమము!

సర్వథైవాసి న మయా దీనచిత్తక మార్యసే
మృతమిత్యవబుద్ధం త్వమద్య కేవలమజ్ఞ హే. 30

దీనుడవగు నో చిత్తమా! ఇక యెన్నడు నిన్ను నే వధింపను. ఏలన, ఆత్మసందర్శనముచే నీవు పూర్వమే మృతుఁడవైతివని నేనిపుడెఱింగితిని.

ఏతావన్తమహం కాలం త్వాం జ్ఞాత్వా జీవదాస్థితి
శిష్టః ప్రభూతసజ్జాసు చిరం సంసృతిరాత్రిషు. 31

ఇంతకాలము వఱకు నిన్ను నే జీవితునిగ యెఱింగి యీ సంసారరాత్రులందు చిరకాలమభేదబుద్ధిచే నీతో గూడియుంటిని.

చిత్తం మృతం హి నాస్తీదమిత్యద్యాధిగతం మయా
తేన త్వదాశాం సంత్యజ్య తిష్ఠామ్యాత్మని కేవలమ్. 32

చిత్తములేదు, అది పూర్వమే మృతించినదను విషయమును నేనిపుడెఱింగితిని. కావున నే నిన్నుగూర్చిన యాశను వదలివేసి కేవలమాత్మయందే నేనిపుడు స్థితిఁబొందితిని.

దిష్ట్యా చిత్తం మృతమితి జ్ఞాతమద్య మయా స్వయమ్
న శతేన సమం నేయం సమగ్రం జీవితం నిజమ్. 33

నేనిపుడు చిత్తమును మృతునిగ గనుగొంటిని. ఆహా! ఇది నా పరమసౌభాగ్యమే. జీవన్ముక్తుడనగు నేను దుష్టమగు యీ చిత్తముతోఁగూడి నా జీవితమంతయు వ్యర్థముగ గడుపరాదు.

ఉత్సార్య దేహసదనాన్మనఃశఠమహం క్షణాత్
అహం స్వస్థః స్థితోఽస్మ్యన్తర్వేతాలపరివర్జితః. 34

కామక్రోధాదిరూపమగు యీ దుష్టమనస్సును దేహగృహమునుండి వెడలగొట్టి, పిశాచము తొలగిన జీవునివలె నేనిపుడు నా యంతఃకరణమున స్వస్థుడనై యున్నాను.

చిత్తవేతాలలబ్ధేన చిరం కాలం మయాత్మనా
కృతా వికారా వివిధాః స్వయం స్మృత్వా హసామ్యహమ్. 35

చిత్తమను పిశాచముచే వంచింపబడి, దానితో యభేదమువడసి మొట్టమొదట నేఁగావించిన యనేక దుష్కర్మల నిపుడు స్మరించి నవ్వుచుంటిని.

చిరాన్నిపాతితో దిష్ట్యా విచారాసిపరార్దితః
హృద్గేహాచ్చిత్తవేతాలస్తాలోత్తాలసమున్నతిః. 36

విచారమను ఖడ్గముచే, తాటివృక్షమువలె దీర్ఘకారము గల్గియున్న యీ చిత్తమను శేతాలమును ఛేదించి చిరకాలమున కిపుడద్దానిని నా హృదయగేహమునుండి త్రోసివైచి నిర్మూలించితిని. ఆహా! ఇది నా పరమ సౌభాగ్యము.

ప్రశాన్తే చిత్తవేతాలే పవిత్రాం పదవీం గతే
దిష్ట్యా శరీరనగరే సుఖం తిష్ఠామి కేవలమ్. 37

సౌభాగ్యవశమున చిత్తమను పిశాచము తొలగగ పవిత్రతను గాంచినట్టి యీ నా దేహమున నేనిపుడు సుఖముగనున్నాను.

మృతం మనో మృతా చిన్తా మృతోఽహంకారరాక్షసః
విచారమన్త్రేణ సమః స్వస్థస్తిష్ఠామి కేవలమ్. 38

విచారణమను మంత్రముచే మనస్సు నశించినది. చింత యడుగంటినది. అహంకారమను దుష్టరాక్షసుడు మరణించెను. కావున నేనిపుడు విషము వైషమ్యమేమియు లేక స్వస్థుడనై యున్నాను.

కిం మనో మే మమాశా కా కో మేఽహంకారకో భవేత్
దిష్ట్యా వ్యర్థం కలత్రం మే నష్టమేతదశేషతః. 39

నాకు మనస్సేమి? ఆశయేమి? తుచ్ఛమగు అహంకారమేమి? సౌభాగ్యవశమున



యిపుడు స్త్రీపుత్రాదులన్నియు వ్యర్థములని నాకు తోచినది. మఱియు మనస్సు, ఆశ మున్నగునవన్నియు నాశమొందినవి.

ఏకస్మై కృతకృత్యాయ నిత్యాయ విమలాత్మనే
నిర్వికల్పచిదాఖ్యాయ మహ్యమేవ నమోనమః. 40

అద్వితీయుడును, కృతార్థుడును, నిత్యుడును, నిర్మలుడును, నిర్వికల్పుడును, చిత్స్వరూపుడునునగు నాయాత్మకు పలుమారులు వందనములు.

న శోకోఽస్తి న మోహోఽస్తి న చైవాహమహం స్వయమ్
న చ నాహం నచాన్యోఽహం మహ్యమేవ నమోనమః. 41

నాయందు శోకముగాని మోహముగాని లేవు. నేనభిమానప్రధానమైన జడరూపుఁడను గాను. అహంకారమునకు సాక్షియగు చిత్స్వరూపుడనే నేను. తద్భిన్నమగు యేదియును గాను. కావున నట్టి సాక్షిచైతన్యమగు నాకు పెక్కువందనములు.

న మమాశా న కర్మాణి న సంసారో న కర్తృతా
న భోక్తృతా న దేహో మే మహ్యమేవ నమోనమః. 42

నాయందాశగాని, కర్మగాని, సంసారముగాని, కర్తృత్వభోక్తృత్వములుగాని, దేహముగాని లేవు. అట్టినాకు పలుమారులు వందనములు.

నాహమాత్మా నవా కోఽన్యో నాహమస్మి న చేతరః
సర్వమేవాహమేతస్మై మహ్యమేవ నమోనమః. 43

నేనాత్మశబ్దవాచ్యుఁడను గాను. మఱియు అహంప్రత్యయభిన్నుఁడను గాను. నాకన్యముగ నేది గలదు? కావున నంతయు నేనే అయియున్నాను. అట్టి సర్వరూపుడనగు నాకనేక నమస్కారములు.

అహమాదిరహం ధాతా చిదహం భువనాన్యహమ్
మమ నాస్తి వ్యవచ్ఛేదో మహ్యమేవ నమోనమః. 44

సర్వలోకములకును ఆదికారణుఁడను నేనే. ఆ లోకముల వహించునదియు నేనే. నేనే చైతన్యమును. లోకములున్ను నేనే. దేశకాలవస్తువులచే నేను పరిచ్ఛిన్నుడను గాను.

నిర్వికారాయ నిత్యాయ నిరంశాయ మహాత్మనే
సర్వస్మై సర్వకాలాయ మహ్యమేవ నమోనమః. 45

నీరూపాయ నిరాఖ్యాయ ప్రకాశాయ మహాత్మనే
స్వయమాత్మైకసంస్థాయ మహ్యమేవ నమోనమః 46

నిర్వికారమై, నిత్యమై, అంశరహితమై, సర్వరూపమై, సర్వకాలస్వరూపమై, రూపరహితమై, నామవర్జితమై, ప్రకాశస్వరూపమై, మహత్తరమై యేకమైనట్టి ఆత్మస్వరూపమగు పరమాత్మకనేక నమస్కారములు.

సమాం సర్వగతాం సూక్ష్మాం జగదేకప్రకాశినీమ్
సత్తాముపగతోఽస్మ్యస్తస్మహ్యమేవ నమోనమః. 47

సమరూపమై, సర్వవ్యాపకమై, సూక్ష్మమై, యేకమై, జగత్తును ప్రకాశింపజేయునట్టి చైతన్యసత్తను నేను బొందితిని. అట్టి యాత్మస్వరూపుఁడనగు నాకనేక వందనములు.

సాద్ర్యబ్ధ్యుర్వీ నదీ సేయం నాహమేవాహమేవ వా
జగత్సర్వం పదార్థాఢ్యం మహ్యమేవ నమోనమః. 48

పర్వత, సముద్ర, పృథివీ, నదీసహితమగు యీ జగత్తుయొక్క శోభయు, సర్వవస్తుపరిపూర్ణమగు యీ ప్రపంచమున్ను నేను గాను. లేక, అంతయును నేనే. అట్టి యాత్మరూపుఁడనగు నాకు పెక్కువందనములు.

వ్యపగతమననం సమాభిరామం
ప్రకటితవిశ్వమవిశ్వమప్యనన్తమ్
స్వయమజమజరం గుణాదతీతం
వపురహమచ్యుతమీశ్వరం నమామి. 49

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమపకరణే దృశ్యదర్శనసంబన్ధో నామాశీతితమః
సర్గః ॥ 80 ॥

మనోవికల్పరహితుడును, సమత్వముచే శోభితుడును, విశ్వమును ప్రకటితమొనర్చువాడును, జగద్రహితుడును, అనంతుడును, జరాజన్మరహితుఁడును, అచ్యుతుడును, గుణాతీతుడును చిత్స్వరూపుడును నగు యీశ్వరునకు నమస్కరించుచున్నాను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
దృశ్యదర్శనసంబంధమను అశీతితమ
సర్గము ॥ 80 ॥

---

ఏకాశీతితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవం విచార్య బుద్ధ్వాన్తః పునరిత్థం విచార్య తే
తత్త్వవిద్భిర్మహాబాహో జ్ఞేయ ఆత్మా మహాత్మభిః. 1

శ్రీ వసిష్ఠుడు:—మహాబాహుడవగు నో రామా! ఇట్లంతఃకరణమున విచారణచే నిశ్చయము గావించుకొని అవశ్యమెఱుఁగదగిన ఆత్మనుగూర్చి మఱల నీ చెప్పబోవురీతి తత్త్వవేత్తలు విచారణ సల్పుదురు.



ఆత్మైవేదం జగదితి సత్యం చిత్తేన మార్జితమ్
ఉత్థితం స్యాత్కుతశ్చిత్తమహో చిత్తమవస్తు యత్ 2

'ఈ ప్రపంచమంతయు ఆత్మయే' దృశ్యము'లేద'ని యివ్విధమున జగన్నిరాకరణ మొనర్చునట్టి చిత్తము తానుకూడ దృశ్యమున నంతర్భూతమగుటఁజేసి మిథ్యయైనందున, అద్దానికి మఱల యుత్థానమెట్లు సంభవించును?

అవిద్యత్వాదచిత్తత్వాన్మాయాత్వాచ్చాసదేవ హి
ధ్రువం నాస్త్యేవ వా చిత్తం భ్రమాదన్యత్ఖవృక్షవత్. 3

అవిద్యయొక్కయు మాయయొక్కయు కార్యమగుటచేతను, అన్యచిత్తదృష్టియందు శూన్యమగుటచేతను, నిక్కముగ యీ జగత్తు లేనిదేయగును. ఆకాశవృక్షభ్రాంతివంటి యీజగత్తు ఆత్మకంటె వేఱుగ ప్రతీతిమాత్రమున్నదిగాని యథార్థముగ నిది శుద్ధాత్మస్వరూపమే యగును.

సిద్ధః స్థాణుపరిస్పన్దో నౌగతస్య యథా శిశోః
అబుద్ధస్య న బుద్ధస్య తథా చిత్తమసన్మయమ్. 4

నౌకయందున్న బాలునకు భ్రాంతిచే తీరమందలి వృక్షముయొక్క చలనము సత్యముగ దోచునట్లు అజ్ఞానికి యీ చిత్తము సత్యముగ గన్పించునుగాని జ్ఞానికి మిథ్యయేయగును.

మౌర్ఖ్యమోహభ్రమే శాన్తే చిత్తం నోపలభామహే
చక్రారోహభ్రమస్యాన్తే పర్వతస్పన్దనం యథా. 5

(నూనె లేక చెఱకు) యంత్రములపైనున్నవానికి గన్పట్టు పర్వతచలనము తద్భ్రాంతి నివారణసమయమున లేకుండుచందమున, అజ్ఞానజనితమగు మోహభ్రాంతి యుపశమింప చిత్తమున్ను లేనిదేయగును.

ఏవం హి చిత్తం నాస్త్యేవ బ్రహ్మైవాస్తి తథాత్మకమ్
పదార్థభావనాశ్చిత్తాత్తేనాసత్యా మయోజ్ఝితాః. 6

ఇవ్విధమున వాస్తవముగ చిత్తము లేనిదై యున్నది. బ్రహ్మమే చిత్తరూపమున గన్పించుచున్నది. బాహ్యాభ్యంతర పదార్థభావనలు అసత్తగు చిత్తమునుండియే యావిర్భవించుటచే అసద్రూపములే యైనందున వానిని నేను త్యజించివైచితిని.

జాతోఽస్మి శాన్తసన్దేహః స్థితోఽస్మి విగతజ్వరః
తథా తిష్ఠామి తిష్ఠామి తథైవ విగతైషణమ్. 7

నేనిపుడు సంశయరహితుడనై, సంతాపవర్జితుడనైయున్నాను. ఈషణారహితమగు పారమార్థికస్వభావమునందువలె స్వానుభవమునగూడ యిపుడు నే విరాజిల్లుచున్నాను.

చిత్తాభావే పరిక్షీణా బాల్యతృష్ణాదయో గుణాః
ఆలోకోపరమే చిత్రా వర్ణాఖ్యా ఇవ సంవిదః. 8

ప్రకాశాభావముచే నేత్రజ్ఞానము నశించునట్లు, చిత్తాభావముచే తృష్ణాచాపల్యాదులున్ను నశించినవి.

మృతం చిత్తం గతా తృష్ణా ప్రక్షీణో మోహపఞ్జరః
నిరహంకారతా జాతా జాగ్రత్యస్మిన్ప్రబుద్ధవాన్. 9

చిత్తము నశించినది. తృష్ణ పలాయనమైనది. మోహపంజరము విచ్ఛిన్నమైనది. నిరహంకారము ప్రవేశించినది. అజ్ఞాననిద్ర పటాపంచలైనది. కాన నేనిపుడు ప్రబుద్ధుఁడనైతి.

ఏకమేవ జగచ్ఛాన్తం నానాత్వం న సదిత్యపి
కిమన్యద్విమృశామ న్తః కథమైవాలమేతయా. 10

ఈ జగత్తు శాంతమై, యేకమైనట్టి బ్రహ్మమేయగును. ఇటు యనేకత్వముగాని, ఆత్మకంటె భిన్నమగు వస్తుగాని సంభవింపనేరవు నేనంతఃకరణమున దేనిని గూర్చి విచారించెదను? అసద్విషయకమైనదానితో నాకే ప్రయోజనమును లేదు.

నిరాభాసమనాద్యన్తం పదం పావనమాగతః
సౌమ్యః సర్వగతః సూక్ష్మః స్థిత ఆత్మాస్మి శాశ్వతః. 11

జీవదశావర్జితమై, ఆద్యంతరహితమైనట్టి పరమ పవిత్రపదము ప్రాప్తినొంది, సౌమ్యమై సర్వవ్యాపకమై, సూక్ష్మమై, నిత్యమైనట్టి ఆత్మస్వరూపము నేనిపుడు గల్గియున్నాను.

యదస్తి యచ్చ నాస్తీహ చిత్తాద్యాత్మాద్యవస్తు చ
తత్స్థాదచ్ఛతరం శాన్తమనన్తాగ్రావ్యామాతతమ్. 12
చిత్తం భవతు మా వాన్తర్మ్రియతాం స్థితిమేతు వా
కో విచారణయార్థో మే చిరం సామ్యోదితాత్మనః. 13

లోన చిత్తముండుగాక, లేకుండుగాక, నశించుగాక, స్థితిఁబొందుగాక, నాకిపుడు విచారణచే నేమి ప్రయోజనము ? ఏలన, ఆత్మయొక్క సమత్వము చిరకాలమునుండియే యుదయించియున్నది గదా !

విచారాకారకో హ్యాస్త్యాదహామాసం మితస్థితిః
విచారేణామితాకారః క్వ నామాహం విచారకః. 14

ఇంతకాలమువఱకు నేను విచారణయొనర్పక అజ్ఞానవశమున పరిచ్ఛిన్నరూపమున నుంటిని. కాని యిపుడు విచారణచే అపరిచ్ఛిన్నుఁడనైనందున, అహంకారమిపుడెటకేగెనో చెప్పనలవిగాకున్నది.

మృతోఽపి మనసీయం మే వికల్పశ్రీర్నిరర్థికా
మనోవేతాలవృత్త్యర్థం కిమర్థముపజాయతే. 15

మనస్సు నశించిన పిదప, యిక విచారకుడు కలడా లేడా యనునీ వికల్పనగూడ నిరర్థకమే యగును. కాని మనస్సను పిశాచమును మఱల నుజ్జీవింపజేయుటకై యేల నాకిట్టి వికల్పము మఱల గలుగుచున్నది ?

తామిమాం ప్రజహామ్యన్తః సంకల్పకలనామితి
నిర్ణీయోమితి శాన్తాత్మా తిష్ఠామ్యాత్మని మానవత్. 16



కాన నేనిపుడీ సంకల్పకల్పనను యంతఃకరణమునుండి తొలగించి ఓంకారముయొక్క లక్ష్యమగు తురీయాత్మయందు ప్రశాంతముగ స్థితినొందుచున్నాను.

అశ్నన్గచ్ఛన్స్వపంస్తిష్ఠన్నితి రాఘవ చేతసా
సర్వత్ర ప్రజ్ఞయా తజ్జ్ఞః ప్రత్యహం ప్రవిచారయేత్. 17

ఓ రామా ! నడచుచున్నను, కదలుచున్నను, తినుచున్నను, త్రాగుచున్నను, నిద్రించుచున్నను, ఆత్మజ్ఞుడెల్లెడల ప్రజ్ఞతోగూడియుండి స్వచిత్తముచే ప్రతిదిన మాత్మవిచారణగావించుచుండవలెను.

ప్రవిచార్య స్వసంస్థేన స్వస్థేన స్వేన చేతసా
తిష్ఠన్తి విగతోద్వేగం సన్తః ప్రకృతకర్మసు. 18

సాధువులగు మహాత్ములు తమ యాంతర్యమునయున్న స్వస్థచిత్తముచే నాత్మవిచారణగావించి, భయాదిరహితులై, స్వస్వవర్ణాశ్రమోచిత కార్యములఁ జేయుచుందురు.

విగతమానమదా ముదితాశయాః
శరదుపోఢశశాఙ్కసమత్విషః,
ప్రకృతసంవ్యవహారవిహారిణ
స్త్విహ సుఖం విహరన్తి మహాధియః. 19

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
ఘూపశమప్రకరణే చిత్తాసత్తాప్రతిపాదనం నామైకాశీతితమః
సర్గః ॥ 81 ॥

మానమదరహితులును, ప్రసన్నచిత్తులును, శరచ్చంద్రునివలె ప్రసన్నమైన ముఖకాంతిగలవారును, తమతమ వర్ణాశ్రమములకుఁ జెందిన వ్యవహారముల నాచరించువారును, మహాధీమంతులునై వివేకులీ ప్రపంచమున వెలయుచున్నారు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
చిత్తసత్తాప్రతిపాదనమను ఏకాశీతితమ
సర్గము ॥ 81 ॥

---

## ద్వ్యశీతితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

విచార ఏవం విదుషా సంవర్తేన కృతః పురా
కథితో మమ విన్ధ్యాద్రౌ తేనైవ విదితాత్మనా. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా ! ఇట్టి విచారణనే బృహస్పతి సోదరుడగు సంవర్తుడు పూర్వము సల్పియుండెను. ఆత్మజ్ఞుడగు నాతడే నాకద్దానిని వింధ్యపర్వతముపై జెప్పియుండెను,

ఏతాం దృష్టిమవష్టభ్య విచారపరయా ధియా
సంసారసాగరాదస్మాత్తారతమ్యేన సంతర. 2

కాన నో రామా! విచారనిష్ఠమగు బుద్ధిచే నీవీ (యాత్మ) దృష్టి నవలంబించి, ఉత్తరోత్తరభూమికారోహణక్రమమున యీ సంసారసాగరము నవశ్యము దాటుము.

అథేమామపరాం రామ శృణు దృష్టిం పదప్రదామ్.
మునినా వీతహవ్యేన యథా స్థితమశఙ్కితమ్. 3

ఓ రామా! ఇక, దేనిచే వీతహవ్యముని యాత్మపదమున దృఢముగ నారూఢుండయ్యెనో, అట్టి ఇంద్రియప్రబోధరూపమై బ్రహ్మపదప్రదమైనట్టి యుత్తమదృష్టినిగూర్చి యిపుడు వినుము.

వీతహవ్యో మహాతేజా విబభ్రామ వనే పురా
విన్ధ్యశైలదరీర్దీర్ఘా రవిర్మేరుదరీరివ. 4

పూర్వకాలమున మహాతేజస్వియగు వీతహవ్యముని సమాధినిమిత్తము వింధ్యపర్వతగుహలందు, సుమేరుపర్వతకందరములను సూర్యుడు వెదకునట్లు తగిన ప్రదేశమును వెదకికొనుచు యరణ్యమున సంచరించుచుండె.

అస్మాత్క్రియాక్రమాద్ఘోరాత్సంసారభ్రమదాయినః
ఆధివ్యాధిమయాకారాత్కాలేనోద్వేగమాయయౌ. 5

శారీరిక, మానసికవ్యథాపూర్ణమగు యీ సంసారమున భ్రమదాయకమైనట్టి భయంకర క్రియాక్రమమునంతటినుండియు కాలక్రమమున నాతడు విరక్తుండయ్యె.

నిర్వికల్పసమాధ్యంతే లబ్ధోదారపరేచ్ఛయా
స జహార జగజ్జీర్ణాం స్వవ్యాపారపరమ్పరామ్. 6

నిర్వికల్పసమాధిచే పరబ్రహ్మప్రాప్తినొందవలెనను తీవ్రేచ్ఛచే అసారములగు ప్రాపంచిక వ్యాపారములన్నింటిని యాతడు విడచిపెట్టెను.

వివేశ రమ్యారచితం నిజం పర్ణోటజాన్తరమ్
కృతగౌరం సుసౌగన్ధ్యమలినీలమివోత్పలమ్. 7

కదళీదళనిర్మితమై, శ్వేత పీత పుష్పములచేతను, కర్పూర పరాగములచేతను తెల్లనై, సుగంధితమై నీలకమలమువలె శోభించు తన పర్ణశాలయందాతడు ప్రవేశించెను.

తత్రాసనే సమే శుద్ధే స్వాస్తీర్ణహరిణాజినే
విశశ్రామాచలే శాన్తే వీతవర్ష ఇవామ్బుదః. 8

వృష్ట్యనంతరము శాంతపర్వతముపై మేఘము విశ్రమించునట్లు, సమమై శుద్ధమై మృగాజినయుక్తమైనట్టి తనయాసనమున నాతడు విశ్రమించెను.

బద్ధపద్మాసనస్తస్థౌ పార్ష్ణ్యోరధికరాఙ్గులిః
శృఙ్గవచ్ఛాన్తచలనమతిష్ఠత్సు స్థకన్ధరమ్. 9



పాదతలముపై వ్రేళ్లనుంచి, పద్మాసనాసీనుడై, కంఠము పైకెత్తి, చలనరహితమగు పర్వతమువోలె యాతడుండెను.

స జహారాలమాలోకాద్దిగ్వికీర్ణం మనః శనైః
విశన్మేరుదరీం సాయం భానుర్భాస ఇవోత్కరమ్. 10

సాయంసమయమున మేరుపర్వతకందరమున ప్రవేశించుచు సూర్యుడు తన కిరణజాలమును వశీకరించుకొనునట్లు, ఇంద్రియప్రవేశముచే సర్వదిశల వ్యాపించునట్టి మనస్సును యాతడు మెల్ల మెల్లగ నిరోధించి ఉపాయముచే నిగ్రహించెను.

బాహ్యానాభ్యన్తరాంశ్చైవ స్పర్శాన్పరిజహత్క్రమాత్
ఇదమాకలయామాస మనసా విగతైనసా. 11

క్రమముగ నాతడు బాహ్యాభ్యంతర విషయములఁ ద్యజించునట్టి తన శుద్ధమనస్సుచే నిట్లు విచారణ గావించెను.

అహో ను చఞ్చలమిదం ప్రత్యాహృతమపి క్షణాత్
న మనః స్థైర్యమాయాతి తరఙ్గప్రౌఢపర్ణవత్. 12

ఆహా! ఈ చిత్తమెంత చపలమైనది! నిగ్రహించుచున్నను మహాతరంగములందు కొట్టుకొనిపోవు ఆకువలె క్షణమైనను స్థిరత్వము నొందకున్నదే!

చక్షురాదిభిరుద్దామై రూపైరాహితసంభ్రమైః
అజస్రముత్పతత్యేవ వీచేవ తలతాడితా. 13

భ్రమణయుక్తమై పలువిధ విషయములందు దిరుగుటచే ప్రబలమైనట్టి నేత్రాదియింద్రియములచే మనస్సున్ను కాలిచే కొట్టబడిన బంతివలె, నాట్యము సల్పుచున్నది.

త్యజదేవానుగృహ్ణాతి వృత్తీరిన్ద్రియవర్ధితాః
యస్మాన్నివార్యతే తస్మిన్నప్యన్మత్త ఇవ ధావతి. 14

చిత్తము, ఇంద్రియములచే ప్రవర్ధితములగు పూర్వకాలిక వృత్తులఁద్యజించుచు, మఱల తదనుకూలములగు నూతనవృత్తులఁ బరిగ్రహించుచున్నది. మఱియు దేనినుండి నిగ్రహించిన, దానిపై పునకే ప్రమత్తునివలె పరుగిడుచున్నది.

ఘటాత్పటముపాయాతి పటాచ్ఛకటముత్కటమ్
చిత్తమర్థేషు చరతి పాదపేష్వివ మర్కటః. 15

ఘటమునుండి పట (వస్త్ర)మునకును, పటమునుండి శకటమునకును నతివేగముగ బరుగిడుచున్నది. వృక్షముపై వానరమువలె యీ చిత్తము పదార్థములందు జరించుచున్నది.

పఞ్చద్వారాణి మనసశ్చక్షురాదీన్యమూన్యలమ్
దగ్ధేన్ద్రియాభిధానాని తావదాలోకయామ్యహమ్. 16

ఇక, మిగుల నిందితములై మనస్సునకు ద్వారభూతములైనట్టి నేత్రాది యింద్రియములనుగూర్చి యిపుడు విచారించెద.

హేహే హా తేన్ద్రియగణాః కిం మే బోధాయ నేహ వః
వేలావిలులితామ్బూనామబ్ధీనామివ చఞ్చలాః. 17

సముద్రతరంగములవలె చంచలములైనట్టి యో యింద్రియములారా! నిర్వికల్పసమాధి యందు చిరకాలమాత్మదర్శనము చేయుటకు మీకు సమయములేదా ?

మా కురుధ్వమనర్థాయ చాపలం చపలాశయాః
స్మరతాతీతవృత్తీని దుఃఖజాలాని భూరిశః. 18

ఆశాయుక్తములును, చపలములునగు నో యింద్రియములారా! అనర్థకారకమగు మీ చపలత్వమును వీడి, దుఃఖజాలమయములగు మీ పూర్వకర్మలను స్మరింపుడు.

రూపాణి మనసో యూయం జడా ఏవ కిలాధమాః
జడే తూష్ణీ క్తతా వ్యర్థం మృగతృష్ణేవ వల్గతి. 19

మీరందఱును మనస్సునకు ద్వారభూతులై, కల్పితులును, అధములును, జడరూపులునై యున్నారు. జడ (జల) రూపములే యగు తరంగములకు జలముపోయుట వ్యర్థమగునట్లు వ్యర్థముగ యేల మృగతృష్ణవలె మీరు విజృంభించుచున్నారు ?

అసారాత్మస్వరూపాణామనాలోకవతీ సదా
అన్ధానాముద్ధతిర్యేయం సాదృశ్యాయైవ జాయతే. 20

మిథ్యాభూతులును, ఆత్మజ్ఞానరహితులునునగు మీయొక్క దుర్వినయముచే గల్గిన కుమార్గప్రవృత్తి అంధులగతి చందమున పతనముకొఱకే యగును.

చిదాత్మా భగవాన్సర్వం సాక్షిత్వేన కరోమ్యహమ్
హా తేన్ద్రియగణా యూయం కిం నిరర్థకమాకులాః. 21

ఓ యింద్రియములారా! భగవంతుఁడగు చిదాత్మరూపమైన నేనే సమస్తమును సాక్షిరూపమున నెఱవేర్చుచుండ అల్పులగు మీరేల వ్యర్థముగ వ్యాకులపడుచుంటిరి ?

మిథ్యైవ మే వివల్గన్తి నీరూపా నయనాదయః
అలాతచక్రప్రతిమాః సర్పరజ్జుభ్రమోపమాః. 22

కొఱవిచక్రమువలెను, రజ్జుసర్పభ్రమవలెను యసద్రూపముననే యీ నేత్రాదులు నా యందు విజృంభించుచున్నవి.

తేనాత్మనా బహుజ్ఞేన నిర్జ్ఞాతాశ్చక్షురాదయః
మనాగపి న సమ్బన్ధో ద్యుపాతాలతలాద్రివత్. 23

స్వర్గమునకును, పాతాళలోకపర్వతములకున్న సంబంధములేనట్లు, బహుజ్ఞుడును, సర్వప్రకాశకుడును, సాక్షియునగు ఏ యాత్మచే నేత్రాదులెఱుగబడుచున్నవో, అట్టి ఆత్మతో నేత్రాదులకు సంబంధమేమియును లేదు.

భీతః పాన్థ ఇవాహిభ్యః పుక్కసేభ్య ఇవ ద్విజః
దూరే తిష్ఠతి చిన్మాత్ర మిన్ద్రియేభ్యస్తనామయమ్. 24



సర్పములయెడ భీతిల్లిన బాటసారి సర్పములనుండియు, చండాలురయెడ భీతిల్లిన బ్రాహ్మణుడు చండాలురనుండియు దూరముగానుండునట్లు, నిర్వికారమై చిన్మాత్రమైన పరమాత్మనుండి ఇంద్రియాదులున్న యతిదూరమున నుండును.

చిత్సత్తామాత్రకేణాలం సంక్షోభో భవతాం మిథః
తిష్ఠతి స్వైరమాదిత్యే దినకార్యవతామివ. 25

ఓ యింద్రియములారా ! సూర్యుడు నిజేచ్ఛచే యాకసమున స్థితినొందియుండ శ్రాద్ధ, కృష్యాదిదైనికవ్యవహారములు జరుగునట్లు, చైతన్యసత్తయొక్క సామీప్యమాత్రముననే మీ చేష్టలన్నియు లెస్సగ కొనసాగుచున్నవి.

చిత్తచారణ చార్వాక చతుర్దిక్కుక్షిభిక్షుక
శ్వేవ వ్యర్థమనర్థాయ మైవం విహర హే జగత్. 26

ఓ. చిత్తమా! ఇంద్రియములను మోసగించుటచే చారణుఁడవును, దేహాభిమాని యగుటచే చార్వాకుఁడవును, దిక్కులందు జరించుటచే భిక్షుకుఁడవునునగు నీవు శునకముపగిది వ్యర్థముగ యీజగత్తున సంచరించుచు యనర్థముల గల్గజేయకుము.

అహం చిద్వదితి వ్యర్థమసత్యా తవ వాసనా
అత్యన్తభిన్నయోరైక్యం నాస్తి చిన్మనసోః శఠ. 27

'నేను చేతనుఁడన'ను యీనీవాసన అసత్యమును, వ్యర్థమునగును. ఓరీ దుష్టా ! మిగుల భిన్నములై జడ, చేతనరూపములైనట్టి మనశ్చిత్తులకు యేకత్వమెన్నటికిని కలుగదు.

జీవామ్యేవాహమిత్యేషా తవాహంకారదుర్మతిః
మిథ్యైవ జాతా దుఃఖాయ న సత్యా సత్యవర్జితా. 28

'నేను జీవించుచున్నాన'నునీ దుష్ట యహంకారభావన సత్యవర్జితమై, మిథ్యారూపముననే యుదయించినదై దుఃఖమును గల్గజేయుచున్నది.

అహంకారోదయే సోఽస్మీత్యేతాం సంరబ్ధతాం త్యజ
న కించిదపి మూర్ఖ త్వం కిం వ్యర్థం తరలాయసే. 29

'అహంకారోదయమున నేనుందున'నునీ గర్వమును వదలుము. ఓ మూర్ఖచిత్తమా ! నీవు యథార్థముగ లేనేలేవు. వ్యర్థముగ యేల చపలత్వము గల్గియున్నావు.

సంవిచ్చిత్త్వమనాద్యన్తం సంవిదోఽన్యన్న విద్యతే
దేహేస్మింస్తన్మహామూర్ఖ కిం త్వం స్యాశ్చిత్తనామకమ్. 30

సంవిత్తగు చైతన్యము అనాదియు, అనంతమునైయున్నది సంవిత్తు (జ్ఞానము)న కన్యముగ యేదియును లేదు. కాన మహామూర్ఖుఁడవగు నో చిత్తమా ! చిత్తమను పేరిట నీవీ దేహమున యెవఁడవు ?

విషపర్యవసానేయం రసాయనవదుత్థితా
భోక్తృతాకర్తృతాశజ్కా బత చిత్త ముధైవ హి. 31

అనుభవకాలమున యమృతరూపముగను, తుదకు విషరూపముగను నావిర్భవించు యీ కర్తృత్వభోక్తృత్వములందు నీకుగల యాశ వ్యర్థమే యగును.

మోహపహాసపదం గచ్ఛ మూర్ఖేన్ద్రియగణాశ్రయమ్
న కర్తా త్వం న భోక్తా త్వం జడోఽస్యన్యేన బోధ్యసే. 32

ఓ మూర్ఖచిత్తమా! ఇంద్రియముల నాశ్రయించి హాస్యాస్పదుఁడవు గాకుము. నీవు కర్తవు గావు, భోక్తవును గావు; జడుడవును, సాక్షిచే బోధితుఁడవు నగుదువు.

కస్త్వం భవసి భోగానాం కే వా భోగా భవన్తి తే
జడస్యాత్మైవ తే నాస్తి బన్ధుమిత్రాది తత్కుతః 33

భోగానుభవశక్తిలేని జడుడవగు నీకు భోగములతోగాని, భోగములతో నీకుగాని సంబంధమేమి గలదు? జడుఁడవగుటచే యథార్థముగ నీకు స్వరూపమే లేనపుడు యిక బంధుమిత్రాదులు నీకెటనుండి వత్తురు?

యజ్జడం తద్ధి నాస్త్యేవ సదేవాసత్తయాన్వితమ్
జ్ఞత్వకర్తృత్వభోక్తృత్వమన్యత్వానామసంభవాత్. 34

ఏది జడమో, అది లేనిదే యగును. స్ఫటికమణియొక్క యెఱుపుదనమువలె మణియొక దాని సత్తచే సత్తుగ భాసించుచున్నది గాన యథార్థముగనది అసత్తే యగును. ఏలన, ఆత్మయందు జ్ఞత్వ, కర్తృత్వ, భోక్తృత్వ, అన్యత్వములెవ్వియును సంభవింపవు.

ప్రత్యక్చేతనరూపశ్చేత్త్వం తదాత్మైవ తే వపుః
భావాభావామయీ చిత్తసత్తా తే కేవ దుఃఖదా. 35

నీవు సాక్షియగు చైతన్యమే యగుచో యిక నిర్వికల్పమగు ఆత్మయే నీయొక్క స్వరూపమగును. అపుడు భావాభావమయమును, దుఃఖప్రదమునునగు యీచిత్తసత్త నీకెట్లు సంభవించును?

యథా కర్తృత్వభోక్తృత్వే మిథ్యైవాధిగతే త్వయా
మయా తే హి ప్రమార్జ్యేతే శృణు యుక్త్యా కథం శనైః. 36

మిథ్యారూపమున నీవు పొందిన కర్తృత్వభోక్తృత్వములను యిపుడు [illegible] శక్తిచే నేనెట్లు క్రమముగ నివారించెదనో, యారీతిని వినుము.

స్వయం తావద్భవానేష జడో నాస్త్యత్ర సంశయః
జడస్య కీదృక్కర్తృత్వం నృత్యన్తీహ కథం శిలాః. 37

చైతన్యప్రతిబింబములేనిచో నీవు స్వయముగ జడుడవే యగుదువు. ఇందు సంశయమేమియును లేదు. జడవస్తువునకు కర్తృత్వభోక్తృత్వము లెట్లు సంభవించును? శిలాప్రతిమ యెచటనైన నాట్యము సల్పునా?

ఉపజీవ చిరం తస్మాచ్ఛుద్ధం తద్భాగమైశ్వరమ్
జీవసీచ్ఛసి హంసి త్వం వృథా యాసి విపల్గసి. 38



కాన, నీవు జీవింపదలంచుచో శుద్ధమగు ఈశ్వరసంబంధమైన చిదాభాసుని యాశ్రయించి నీ రూపమును ధరింపుము. ఏల వ్యర్థముగ మృతినొందుదువు, వచ్చెదు, పోయెదు, విజృంభించుచున్నావు.

క్రియతే యత్తు యచ్ఛక్త్యా తత్తేనైవ కృతం భవేత్
లునాతి దాత్రం పుంశక్త్యా లావకః ప్రోచ్యతే పుమాన్. 39
హన్యతే యస్తు యచ్ఛక్త్యా స తేనైవ హతో భవేత్
నిహన్తి ఖడ్గః పుంశక్త్యా హన్తైవ ప్రోచ్యతే పుమాన్. 40
పీయతే యస్తు యచ్ఛక్త్యా పీతం తేనైవ తద్భవేత్
పాత్రేణ పీయతే పానం పాతా యస్తూచ్యతే నరః. 41

ఎవనిశక్తిచే నేది చేయబడునో, అది వానిచేతనే చేయబడెనని చెప్పబడును. ఎట్లన, మనుజుని శక్తిచే కొడవలి కోయుచున్నదిగాన మనుజుడే కోయువాడనఁబడును. అట్లనే యెవని శక్తిచే నేది హతమొనర్పబడునో, అది వానిచేతనే హతమైనదనఁబడును. ఎట్లన, మనుజునిశక్తిచే ఖడ్గము ఛేదించుచున్నదిగాన మనుజుడే ఛేదకుడనబడుచున్నాడు. అవ్విధముననే, యెవనిశక్తిచే నేది త్రాగబడునో, అది వానిచేతనే త్రాగబడెనని చెప్పబడును. ఎట్లన, పాత్రము మున్నగువానిచే జలాదులు త్రాగబడినను, త్రాగువాడు మనుజుడనియే వచింపబడును.

ప్రకృత్యేవాసి సుజడః సమస్తజ్ఞేన బోధ్యసే
తేనాత్మైవాత్మనాత్మానం చినోతీదం హి నో భవత్. 42

ఓ చిత్తమా! నీవు స్వభావముగనే జడుడవు. సర్వజ్ఞుడగు పరమాత్మచేతనే నీవు బోధితుఁడవగుచున్నావు. ఏలన నా యాత్మయే స్వయముగ భోక్తృభోగ్య కరణోపకరణాదులచే యీ సమస్త జగత్తున్ను స్వప్నమువలె సంచయమొనర్చినది.

అనారతం బోధయతి త్వామాత్మా పరమేశ్వరః
బోధనీయా బుధైర్మూఢాః కిలావృత్తిశతైరపి. 43

ఆత్మయగు పరమేశ్వరుడు నిన్ను నిరంతరము ప్రబోధితమొనర్చుచునేయున్నాడు. విజ్ఞులు మూఢులకు వివిధరీతుల బోధింపవలెనుగదా!

ఆత్మసత్తైవ బోధైకరూపిణీ స్ఫురతీహ హి
తయైవ చిత్తశబ్దార్థావఙ్గీకృత్య త్వయా స్థితమ్. 44

బోధస్వరూపమగు ఆత్మయొక్క సత్తవలననే నీయొక్క సత్తయున్ను స్ఫురించుచున్నది. ఆయాత్మనుండియే చిత్తశబ్దార్థసత్తల నంగీకరించి నీవు స్థితిఁబొందియున్నావు.

ఏవం చిత్తత్వమజ్ఞానాదాత్మశక్తేరుపాగతమ్
జ్ఞానే త్వయా విగలితం తీవ్రే హిమమివాతపే. 45

ఇవ్విధమున ఆత్మశక్తినుండియే అజ్ఞానకారణమున చిత్తత్వము సంప్రాప్తించినది. కాని, తీక్ష్ణమగు యెండయందు మంచు కరగునట్లు జ్ఞానముచే నీవు నశించుచున్నావు.

తస్మాన్మృతం త్వం మూఢం త్వం నాసి త్వం పరమార్థతః
తదేహాహమితి వ్యర్థమశోో మా స్వసుఖాయ తే. 46

కాన నో చిత్తమా ! నీవు మృతుడవు; మూఢుడవు; పరమార్థమున యేమియు కానివాడవు; కాన 'ఆత్మయే నేన'ను తాదాత్మ్యాధ్యాసముచే జన్మాదిదుఃఖములఁ గల్గింపకుము.

అసత్యా చిత్తకలనా ఇన్ద్రజాలలతా ఇవ
విజ్ఞానమాత్రమేవేహ బ్రాహ్మమజం విజృమ్భితమ్. 47

ఇంద్రజాలలతవలె చిత్తకల్పన వ్యర్థమే యగును. విజ్ఞానమాత్రమగు బ్రహ్మముయొక్క స్వరూపమే యీ జగత్తంతటను వికాసమొందుచున్నది.

నరామరజగద్రూపై ర్బ్రాహ్మీ శక్తిరుదేత్యలమ్
సాముద్రకణకల్లోలజాలై శ్వేలేవ వల్గతి. 48

సముద్రతరంగములచే తీరము గర్జించునట్లు, బ్రహ్మముయొక్క చిచ్ఛక్తితోఁగూడిన మాయయు మనుష్య, దేవతాది జగద్రూపములచే పూర్ణముగ విజృంభించుచున్నది.

చిన్మయశ్చేద్భవేన్మూఢ తత్తస్మాత్పరమాత్పదాత్
నిత్యమవ్యతిరిక్తం త్వం కిమన్యత్పరిశోచసి. 49

ఓ మూఢచిత్తమా ! నీవు చిన్మయుఁడవగుచో యీ పరమపదములోఁటి నిత్యమభిన్నరూపుఁడవే యగుదువు. అట్లైన నిక యన్యమగు దేనికై నీవు ఖేదమొందుచుంటివి?

సర్వగం సర్వభావస్థం సర్వరూపం హి తత్పదమ్
తత్ప్రాప్తౌ సర్వమేవాజ్ఞ ప్రాప్తం భవతి సర్వదా. 50

అజ్ఞుఁడవగు నో చిత్తమా! ఆ పరమపదము సర్వవ్యాపకమును, భూతభవిష్యద్వర్తమాన పదార్థములన్నింటియందున్నదియు నగును. అద్దాని ప్రాప్తిచే సర్వమున్ను సంప్రాప్తించినదే యగును.

న త్వమస్తి న దేహోఽస్తి బ్రహ్మాస్తీహ మహత్స్ఫురత్
అహంత్వమితి నిఃస్పన్దే స్ఫురత్యాద్రిక్థా కస్య కా. 51

వాస్తవముగ నీవుగాని, యీ దేహముగాని లేవు. మహద్వస్తువగు బ్రహ్మమే యీ జగద్రూపమున స్ఫురించుచున్నది. 'నేను' 'నీవ'ను ఆభాసము నిష్క్రియమగు ఆత్మయందే స్ఫురించుచుండ నిక యెవనికేవిధమగు దుఃఖముగలదు?

ఆత్మా చేత్త్వం తదాత్మైవ సర్వగోఽస్తీహ నేతరః
ఆత్మనోఽన్యజ్జడత్వం చేత్తత్త్వం నాస్త్యసి తద్వపుః. 52

నీవు చిదాత్మవగుచో, అపుడును యెల్లెడల సర్వవ్యాపకమగు ఆత్మయే కలదగునుగాని, అన్యముకాదు. ఏలన, ఆత్మకన్యమైనది జడమున్ను, అసద్రూపమున్ను యగునుగదా!

ఆత్మైవ సర్వం త్రిజగత్తదన్యత్తు న కించన
తత్త్వం కిం చిత్తమాత్మాన్యద్యది తత్త్వం న కించన. 53



మల్లోకములున్ను ఆత్మయే. ఆత్మకన్యముగ యేమియును లేదు. కాన, నీవాత్మకంటె వేఱుగుచో పరమార్థమున లేనివాడవే యగుదువు.

అహం త్విదమహం తన్న ఇతి వ్యర్థం కిమిహాసే
అసద్వపుః కిం స్ఫురతి శశశృఙ్గేణ కో హతః. 54

'ఈ బాలశరీరము నేను, ఈవృద్ధశరీరము నేను, ఈ బాలశరీరసంబంధమగు క్రీడాదులు గాని ఈ వృద్ధశరీరసంబంధమగు పుత్రపౌత్రాదులు నాయవి' అని యిట్లెల్ల వ్యర్థముగ జింతించు చున్నావు. ఆత్మకు దేహములేదు. కాన యసత్తైన నయ్యది యెట్లు స్ఫురించగలదు? కుందేటి కొమ్ముచే యెవరైన చంపబడుదురా?

తృతీయా కలనా నాస్తి చిజ్జడాంశేతరాశిత
ఛాయాతపనయోర్మధ్యే తృతీయేవానురఞ్జనా. 55

ఓ మూఢచిత్తమా ! ఛాయాతపములమధ్య పదార్థముల యనురక్తమొనర్చు మఱొక వస్తువెయ్యదియు లేనట్లు చేతన, జడాంశములకు వేఱుగ మఱొకదాని కల్పనయే లేదు.

సత్యావలోకనాజ్జాతే చిత్తజాడ్యదృశోః క్షయే
సంపద్యతే యత్తు తజ్జం స్వసంవేదనమాత్రకమ్. 56

సత్యవస్తుజ్ఞానముచే చిత్త, జడత్వదృష్టులు పశమింప, అంతిమసాక్షాత్కారవృత్తిచే నావిర్భూతమగు స్వప్రకాశ చిన్మాత్రరూపమై శేషించునట్టి స్వానుభవరూపమును ఆత్మయే నీవు.

తేన మూఢ న కర్తృత్వం న భోక్తృత్వం తవాపి హి
తదేవాసి పరం బ్రహ్మ త్యజ మౌర్ఖ్యం భవాత్మవాన్. 57

కావనో మూఢచిత్తమా ! నీకు కర్తృత్వముగాని భోక్తృత్వముగాని లేవు. నీవా పరబ్రహ్మవే. అందుచేమూర్ఖ్యమును వదలి ఆత్మజ్ఞానివి కమ్ము.

కేవలం జ్ఞత్వవిషయముపదేశార్థసిద్ధయే
త్వయా కరణభూతేన కరోత్యాత్మేతి కథ్యతే 58

'మనసైవానుద్రష్టవ్యం మనసైవేదమాప్తవ్యమితి' (మనస్సుచేతనే ఆత్మను దర్శింపవలెను, మనస్సుచేతనే ఆత్మ సంప్రాప్తించుచున్నది) — ఈ మున్నగు శ్రుతులాత్మప్రాప్తియందు నిన్ను కరణముగ యొనర్చినవనెదవేమో, స్వముఖమును గాంచుటకై మనుజుడు దర్పణమును కరణము నవలంబించునట్లు, అజ్ఞదశయందు శాస్త్రాచార్యకృతములగు తత్త్వమస్యాది ఉపదేశములప్రయోజన సిద్ధికొఱకే శ్రుతి కల్పితుఁడనగు నీకాత్మసాక్షాత్కారమును విషయముగ నొనర్చుచున్నది.

అసత్స్వరూపం కరణం జడం నిరవలమ్బనమ్
నిఃస్పన్దనం న స్పన్దేత కర్తృసంబోధనం వినా. 59

స్వయముగ స్పందశక్తిలేనిదై, అసన్మాత్రమై, జడమై, ఆశ్రయరహితమైనట్టి చిత్తము చైతన్యప్రకాశములేక యెట్లు చేష్టల సల్పగలదు?

అకర్తుః కరణస్యాస్య శక్తిః కాచిన్న విద్యతే
దాత్రస్య లావకాభావే కర్తుం కిమివ శక్తతా. 60

ఏలన, కర్తలేకున్న కరణశక్తి లేనిదేయగును. కోయువాడులేకున్న కొడవలికి కోయుశక్తి యెచట?

ఖడ్గప్రహారవిచ్ఛేదక్రియాయాం పుంసి శక్తతా
న ఖడ్గే సుజడే చిత్త సర్వాఙ్గేష్వపి శక్తతా. 61

ఓచిత్తమా! ఖడ్గముయొక్క ప్రహారశక్తి, ఛేదనక్రియాశక్తి మనుజునియందే కలదు గాని జడమైన ఖడ్గమందేకోశమునను లేదు.

తస్మాన్నాసి సఖే కర్తృ మా వ్యర్థం దుఃఖభాగ్భవ
పరార్థం క్లేశితా మూర్ఖ ప్రాకృతేషు న శోభతే. 62

కాన సఖుఁడవగు నోచిత్తమా! నీవు కర్తవుకావు. వ్యర్థముగ దుఃఖభాజుఁడవు కావలదు. ఓ మూర్ఖా! నీచములగు ప్రకృతికార్యములందు మఱొకనికై క్లేశపడుట శోభించదు.

ఈశ్వరో నేదృశః శోచ్యో యస్త్వయా సదృశో భవేత్
నచ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన. 63

నీవలె జడమైనదానికొఱకే నీవు శోకింపవలెను. కాని ఈశ్వరుఁడట్టివాఁడు కాడు. వానికి జగత్తున చేయబడినదానిచేగాని, చేయబడనిదానిచేగాని ప్రయోజనమేమియును లేదు.

గర్వాత్తూపకరోమ్యేనమితి కేవలమల్పధీః
క్లిశ్యతేవ సతాం త్వర్థో న కించిదుపయుజ్యతే. 64

కార్యకారణసంఘాతమందలి యభిమానముచే 'నేనీయాత్మ కుపకారమొనర్చుచున్నాన'ను భ్రాంతిచే నీవు పరిచ్ఛిన్నమగు బుద్ధిని పీడించుచున్నావు. కాని సంఘాతముననున్న పంచప్రాణమనోబుద్ధిదశేంద్రియములన్నియు జడములగుటచే భోగములచే వానికే ప్రయోజనమున్న లేదు. కనుక దేనికిని యేవిధముగను నీవు యుపకారివి కానేరవు.

కర్తుర్భోగేశ్వరస్యైవమర్థే చేదనువర్తసే
తదస్య కాచిన్నేచ్ఛేహ తృప్తత్వాత్సర్వదైవ హి. 65

'భోగానుభవమునొందునట్టి కర్తయగు ఈశ్వరునికొఱకే నేను వర్తించుచున్నాన'ందువేమో, నిత్యతృప్తుఁడగుటచే వానికే కోర్కెయు లేదనియే యెఱుంగుము.

అకృత్రిమావభాసేన సర్వగేన చిదాత్మనా
ఏకేనైవేదమాపూర్ణం కల్పనైవాస్తి నేతరా. 66

స్వాభావికప్రకాశయుక్తుడును, సర్వవ్యాపియు, యేకరూపుడునునగు చిదాత్మచే యీ జగత్తంతయు వ్యాపింపబడియున్నది. వానికన్యముగ యే కల్పనయు లేదు.

ఏకానేకావభాసేన సమస్తేన తదాత్మనా
ఆత్మన్యేవా [illegible] కిం కిమిష్యతే. 67



ఏకమును, అనేకమునుగూడ ప్రకాశింపజేయు నాయాత్మ, తనయందే యీ జగత్తునంతయు రచించెను. సమస్తము వానియందు సిద్ధించుటచే నిక వానికలభ్యమగు వస్తువెయ్యది? ఇక దేనినాతఁడిచ్ఛగింపవలెను?

త్వాదృశస్య తు దృష్ట్యైవ క్షుబ్ధతా జాయతే ముధా
ఆలోక్య రాజమహిషీం యూనో మదమయీం తథా. 68

[illegible] చిత్తమా! రాజమహిషిని గాంచుటచే మూర్ఖుఁడగు యువకునకు మన్మథవికారము [illegible]చునట్లు, ప్రపంచమందలి సర్వవస్తువులును ఈశ్వరస్వరూపములైనను నీవంటి మూర్ఖునకే వాని[illegible]చుటచే క్షోభ జనించుచున్నది.

ఆత్మనా సహ సంబద్ధం చేతః కర్త్రసి సున్దర
కింతు నాస్యాసి సంబద్ధి కుసుమస్య యథా ఫలమ్. 69

ఓ సుందరచిత్తమా! ఆత్మతోటి సంబంధము గల్గియుండవలంచెదవేమో, ఫలించుకాలమున పుష్పముండమిచే ఫలము పుష్పసంబంధమున కయోగ్యమగునట్లు నీవాత్మసంబంధనకున్న అయోగ్యుఁడవగుదువు.

ద్వితీయేన సమం ద్వైషా తత్త్వావద్భవ నైకతా
సా సంబన్ధగతిః ప్రోక్తా ప్రాగ్ద్విత్వాదధునైకతా. 70

ఒకటి మఱియొకదానితో ఒకదానిక్రియతోగాని లేక రెంటిక్రియలతోగాని గూడి కలియుటచే, ఒకదానియొక్క మఱియొక దానియందలి యంతర్భావముగాని, లేక రెంటియొక్క యేకత్వముగాని 'సంబంధగతి' యని పేర్కొనబడినది. ఎట్లన, పూర్వము ద్వైతముండెను. ఇపుడేకత్వము సిద్ధించినది.

నానాప్రకారరచనా నానారూపక్రియోన్ముఖీ
సుఖదుఃఖదశాహేతుర్భవాన్నైకవిధా స్మృతా. 71

కాని నీవా యేకత్వసంబంధమునకును కారణము గానేరవు. ఏలన, కార్యములందు వివిధ రచనలను గల్గి, వివిధక్రియోన్ముఖమై, సుఖదుఃఖములతోగూడి యుండుటచే నీకు యేకప్రకారత్వము లేదనియే వచింపబడినది.

సంబన్ధః సమయోర్దృష్టస్తథాఽర్ధసమయోరపి
న విలక్షణయోశ్చాన్యస్తస్మిన్నపి జగత్త్రయే. 72

మఱియు, (పాలతోపాలకువలె) సంబంధము సమానరూపములకు గాని, (నీటితో పాలకువలె) అర్ధసమానరూపములకుగాని సంభవించును. కాని అగ్నిజలములవలె కేవలము విలక్షణమై, సర్వథా విరుద్ధములైనవాటియొక్క సంబంధమీ ముల్లోకములందెచటను యుండదు. అట్లుండినచో వానిలో నొకదాని నాశమవశ్యము సంభవించును.

దవ్యాన్తరగుణా దవ్యాణ్యాశ్రియస్తి బహూన్యలమ్
సంవిదశ్చ్యవనం దుఃఖం సంవిదో మా చ్యుతో భవ. 73

రూపరసాది పదార్థముల గుణము ఆ పదార్థమునే యాశ్రయించుకొనియుండునుగాని అన్యమగు విరుద్ధమైనదానిని గాదు. ఓచిత్తమా! నీవు సంవిత్తునకు వేఱై పతనమునొందుటకొఱకు నీయమే యగును. కాన యట్లు సంవిత్తునుండి చ్యుతుఁడవు గాకుము.

ఏతావత్త్వైకధ్యానేన నిత్యధ్యానోఽథవాత్మదృక్
అభావే దుఃఖదస్యాన్తర్దృశా దృశ్యస్య వస్తునః. 74

లేక, అంతర్దృష్టిరూప జ్ఞానముచే దృశ్యసముదాయమంతయు లేనిదికాఁగా, దుఃఖరహితమై ఆనందరూపమైనట్టి ఆత్మయే శేషించును. దీనిచే నీవు సంతుష్టుడవగుచో యిక నిరంతరధ్యానముచే సమాధినిష్ఠుడవై ఆత్మదర్శివి గమ్ము.

సంకల్పోన్ముఖతాం విద్ధి దుఃఖదాం సంవిదశ్చ్యుతిమ్
జడేషూపలభూతేషు మనోదేహేన్ద్రియాదిషు. 75

ఓ చిత్తమా! జడమగు శిలవంటి మనోదేహేంద్రియాదులందు, సంకల్పోన్ముఖమగునట్టి చైతన్యముయొక్క చ్యుతి దుఃఖప్రదమేయని నీవెఱుంగుము.

కీదృశీ కర్తృతా చిత్త పుష్పం వ్యోమ్ని కథం భవేత్
నిరస్తకలనా పజ్కే మననధ్వంసరూపిణి. 76

కల్పనాపంకరహితమై, సంకల్పవికల్పవిధ్వంసకమైనట్టి ఆత్మయందు కర్తృత్వమెట్లు సంభవించును? ఆకాశమున పుష్పముండునా?

నచైవాత్మని కర్తృత్వం సంభవత్యమ్బరాజ్గవత్
అయం కేవలమాత్మైవ నానానానాతయాత్మని. 77

ఆకాశమునకు హస్తపాదాద్యంగము లుండజాలనట్లు ఆత్మయందు కర్తృత్వమున్ను సంభవింపనేరదు. ఈ యాత్మయే తనయందేకరూపముగను, అనేకరూపములుగను స్ఫురించుచున్నది.

స్ఫురత్యబ్ధిరివామ్భోభిః ఫేనబుద్బుదవీచిభిః
ఆభాసమాత్రే సర్వస్మిన్స్ఫురత్యస్మింశ్చిదాత్మని. 78

ఫేన, బుద్బుద, తరంగరూపములగు జలములచే సముద్రము తనయందు స్ఫురించునట్లు ఆభాసమాత్రమైన చిదాత్మయందు ఆత్మయే జగద్రూపముగ స్ఫురించుచున్నది.

ద్వితీయా నాస్తి కలనా తప్తాగ్గార ఇవామ్బుధౌ
కలనారహితే దేవే దేహే మనసి వా జడే. 79

సంవిత్సంవేద్యనిర్ముక్తా సారం సున్దర నేతరత్
ఇదమన్యదిదం నాన్యచ్ఛుభం వాఽశుభమేవ చ. 80

సముద్రమునందుచున్న నిప్పుకణిక యుండనట్లు, ఆత్మయందు రెండవ కల్పనయే లేదు. ఓ సుందరచిత్తమా! ఇట్లాత్మదేవుడు కల్పనారహితుడైయ్యు, మనస్సు జడమైయ్యు నుండ, 'ఇది నేను, ఇది నేనుకాదు, [illegible], ఇది అశుభమైనది' యనీ యసత్కల్పన కల్పకుని యభావంబున లేనిదేయగును. ఈసమస్తమున్ను, విషయవర్జితమై, సారభూతమైనట్టి చైతన్యమే యగునుగాని అన్యమేమియునుగాదు.



ఇత్యసత్కల్పనా నాస్తి యథా నభసి కాననమ్
సంవేద్యరహితం సంవిన్మాత్రమేవేదమాతతమ్. 81

ఆకాశమున యరణ్యము లేనట్లు, పూర్వోక్తకల్పన ఆత్మయందు లేనిదేయగును. కాన విషయవర్జితమగు సంవిత్తుమాత్రమే సర్వజగద్రూపమునను వ్యాపించియున్నది.

తత్రాయమహమన్యోఽయమిత్యసత్కలనా కథమ్.
అనాదిమతి నీరూపే సర్వగే వితతాత్మని
ఆరోపయేత్కః కలనామృగ్వేదం వ్యోమ్ని కో లిఖేత్. 82

'నేను వేఱు, ఇది వేఱు' యనీ యసత్కల్పన యెట్లుండనేరును? అనాదియై, రూపరహితమై సర్వవ్యాపకమైనట్టి ఆత్మయందు కల్పనాకళంకము నెవరారోపించగలరు? ఆకాశమున ఋగ్వేద మెవరైన వ్రాయగలరా?

నిత్యోదితే సకలవస్తుపదార్థసారే
సంవిత్తి తే భరితనిర్భరభూరిదిక్కమ్,
ఆత్మన్యసత్యమివ సాధుగతే మలత్వాత్
క్షీణౌ సుఖాసుఖలవౌ మమ వై సమోహౌ. 83

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే ఉపశమప్రకరణే ఇన్ద్రియానుశాసనయోగోపదేశో నామ ద్వ్యశీతితమః సర్గః ॥ 82 ॥

నిత్యోదయము నొందినదియు, సర్వవస్తువులందును సారభూతమైనదియు, దిక్కులందంతటవ్యాపించి పరిపూర్ణమైనదియు, సంవిన్మాత్రమున స్థితిగల్గియున్నదియునగు ఆత్మను ప్రత్యక్షముగా తెలిసికొనినమీదట మిథ్యారూపములగు మృగతృష్ణాజలమువలెను, రజ్జుసర్పమువలెను నా సుఖదుఃఖములున్ను నశించినవి. కాన యీనాపూర్వపు సుఖదుఃఖప్రతీతియను మోహమున్ను భ్రాంతియేగాని యథార్థముగాదు

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున ఇంద్రియానుశాసనయోగోపదేశమను ద్వ్యశీతితమ సర్గము ॥ 82 ॥

---

## త్ర్యశీతితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

భూయో మునివరో ధీరో ధియా ధవలమేధయా
స్వమిన్ద్రియగణం గుప్తో బోధయామాస సాధ్వదమ్. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! ధీరుడును, మునిశ్రేష్ఠుడునునగు నా వీతహవ్యుఁడేకాంతమున నుంగుహయందే సద్ధర్మప్రజ్ఞతో గూడుకొనిన బుద్ధిచే తన యింద్రియముల మఱల నుపోద్ఛించెను.

తచ్ఛ్రేష్ఠేన్ద్రియగణస్యార్థే శృణు వక్ష్యామి తే స్ఫుటమ్
శ్రుత్వా తద్భావనామేత్య పరాం నిర్దుఃఖతాం వ్రజ. 2

ఓ రామా! ఆ క్రమమును విస్పష్టముగ నీ కెఱింగించెద. స్వేంద్రియనిరోధమునకై యద్దానిని నీవాలకింపుము. దాని నాకర్ణించి తదనురూపమగు భావమేగల్గి దుఃఖరాహిత్యము నొందుము.

భవతామాత్మసత్తైషా దుఃఖాయైవానర్థదాయినీ
అసత్యామాత్మనః సత్తాం తద్భవన్తస్త్యజన్త్వితి. 3

ఓ యింద్రియములారా! అవిద్యాకారణమున ఆత్మకు వేఱుగ మీకు గల్గియున్న సత్త జీవితకాలమున పెక్కుదుఃఖముల గల్గజేయునదియు, యాపిదప మఱలమఱల మృత్యు, నరకాదులఁ బొందించునదియు గాన మిథ్యయగు యద్దానిని మీరు త్యజింపుడు.

మదీయేనోపదేశేన సత్తైషా భవతాం క్షయమ్
గత్త్రైవేతి స్ఫుటం మన్యే యూయం హ్యజ్ఞానసంభవాః. 4

నేను పూర్వము గావించిన యాత్మోపదేశముచే మీ సత్త పూర్ణముగ నశించియేయుండును. మీయుత్పత్తి అజ్ఞానముచే సంభవించుచున్నదిగాన నయ్యజ్ఞానము క్షయమొంద మీకిక సత్తయుండ నేరదు.

స్వసత్తా స్ఫుటతాం యాతి దుఃఖాయ తవ చిత్తక
తప్తకాఞ్చనరుల్లాసో దాహాయైవ స్వపార్శ్వయోః. 5

ఓ చంచచిత్తమా! అగ్నితో క్రీడించుటచే యిరుపార్శ్వములు దహింపబడునటుల మీ సత్త మీకు దుఃఖమునే గల్గించును.

పశ్య త్వయి సతి భ్రాన్తజలకల్లోలసంకులాః
విశన్తి కాలజలధిం సంసారసరితాం గణాః. 6

చూడుడు, మీరుండుటచేతనే భ్రాంత జీవులను తరంగములతోగూడిన సంసార నదీ సమూహములు కాలసాగరమున నిరంతరము ప్రవేశించుచున్నవి.

పతన్త్యహమహమికా విహితాన్యోన్యచిన్తితాః
కుతోఽపి దుఃఖావలయో ధారా ఆసారగా ఇవ. 7

పరస్పరాహంకారములచే నుద్భూతమగు వధ, పరాజయ, బాధలఁ గూర్చిన చింతలుగల్గి దుఃఖపరంపరలు వర్షధారలవలె గురియుచున్నవి.

పరిస్ఫురత్యపర్యన్తా హృదయోన్మూలనోద్యతా
అక్రన్దకారిణీ క్రూరా భావాభావవిషూచికా. 8

... కాలనై, హృదయవిక్షేపనకత్సరనై, దుఃఖకరమై, క్రూరమై, సంపద్విపదరూపమైనట్టి ... వ్యాధి స్ఫురించుచున్నది.



కాసశ్వాసరణద్భృఙ్గా కలేవరజరద్ద్రుమే
వికసత్యమలోద్యోతా జరామరణమఞ్జరీ. 9

ఈ దేహమను పురాతన వృక్షమునకాస (దగ్గు) శ్వాసమను తుమ్మెదల శబ్దముగలదియు, నిర్మలమై ప్రకాశయుతమైనదియునగు జరామరణరూప లత వికసించుచున్నది.

కల్లోలవ్యాలవలితే శరీరశ్వభ్రకోటరే
ఘననీహారఖే స్వాన్తశ్చిన్తాచపలమర్కటీ. 10

మనోరథతరంగములను సర్పములతోగూడినదియు, మిగుల జడరూపములైన యింద్రియచ్ఛిద్రములను ద్వారములు గలదియు నగు శరీరాంతర్గత కోటరమున (హృదయమున), చపలమైనట్టి చింతయను సాలీడు తిరుగాడుచున్నది.

లోభనాట్యా రటత్పక్షీ తీక్ష్ణయా ద్వన్ద్వతుణ్డయా
కాయజీర్ణద్రుమాదస్మాద్గుణఖణ్డం నికృన్తతి. 11

లోభమను స్వవిలాసములతోగూడి, శబ్దమొనర్చుచు చిత్తమను పక్షి సుఖదుఃఖాది ద్వంద్వములను వాడియైన ముక్కుతో శమ, దమ, ధర్మాది గుణసమూహమను ఫలపుష్పములను దేహమను పురాతనవృక్షమునుండి పెరకివేయుచున్నది.

హృదయావకరం కీర్ణమితశ్చేతశ్చ కర్కశః
అపవిత్రో దురాచారః కురుతే కామకుక్కుటః 12

అపవిత్రమై, దురాచారసంయుతమై, కర్కశమైనట్టి కామమను కోడి రాగాదివాసనలచే బరివేష్టితమగు హృదయమును తన పాదములచే విస్తరింపజేయుచున్నది.

మహత్యాం మోహయామిన్యముల్బణోఽజ్ఞానకౌశికః
శ్మశాన ఇవ వేతాలః పరివల్గతి హృద్ద్రుమే. 13

మహామోహమను రాత్రియందు అజ్ఞానమను భయంకరమైన గుడ్లగూబ, శ్మశానమందు బేతాళమువలె హృదయవృక్షమున విజృంభించుచున్నది.

ఏతాశ్చాన్యాశ్చ బహ్వ్యోఽపి త్వయీన్ద్రియగణే సతి
పిశాచ్య ఇవ శర్వర్యాం పరివల్గన్త్యశుభశ్రియః. 14

ఓ యింద్రియములారా! మీరుండుటచేతనే యీపై యనర్థములును, ఇంకను అనేకములైన పాపములును రాత్రియందు పిశాచమువలె విజృంభించుచున్నవి.

త్వయి త్వసతి హే సాధో సర్వా ఏవ శుభశ్రియః
ప్రభాత ఇవ పద్మిన్యః సాలోకం విలసన్త్యలమ్. 15

సాధువగు నో చిత్తమా! నీవు లేకున్నచో, ఉత్తమగుణసమూహమంతయు వివేకమను ప్రకాశముతోగూడి ప్రాతఃకాలమున పద్మసరస్సువోలె వికాసమొందును.

ప్రశాన్తమోహమిహికం రాజతే హృదయామ్బరమ్
నిర్మలాలోకవలితం నిరస్తకుతరాన్తరమ్. 16

మఱియు, మోహమను మంచులేనిదై, రజోగుణమను దుమ్ముచే గప్పబడనిదై, నిర్మల ప్రకాశముతోఁగూడి హృదయాకాశము శోభించును.

అశఙ్కితనభఃకోశపతితాకులపూరవత్
నాపతన్తి వికల్పౌఘాశ్చిరం వైకల్యకారిణః. 17

వాయువుచే వ్యాప్తమై యకస్మాత్తుగ నాకసమున వర్షధార కురియునట్లు, విక్షేపము గల్గజేయు వికల్పసమూహము లెవ్వియు మైబడకుండును.

సర్వస్యాహ్లాదనీ శాన్తా మైత్రీ పరమపావనీ
అభ్యుదేతి హృదో హృద్యా సుతరోరివ మఞ్జరీ. 18

మంచి వృక్షమునుండి రమణీయములగు చిగుళ్లుద్భవించునట్లు, సర్వులకు నానందము గొల్పునదియు, పరమపవిత్రమునునైన మైత్రి హృదయమున జనించును.

అన్తశ్ఛిద్రవతీ జాడ్యయుక్తాయుక్తగుణా స్వయమ్
చిన్తా శోషముపాయాతి హిమదగ్ధేవ పద్మినీ. 19

అపూర్ణమై జడులగు మూర్ఖులందే తన కౌశల్యమును జూపునట్టి చింత, మంచుచే కమలసరస్సువలె శుష్కించిపోవును.

ఆలోకః స్ఫుటతామన్తరాయాత్యజ్ఞానసంక్షయే
ప్రశామ్యత్యమ్బుదే వ్యోమ్ని శరదీవార్కమణ్డలమ్. 20

శరత్కాలమున, మేఘము క్షయింప నాకసమున సూర్యమండలము గన్పట్టునట్లు, అజ్ఞానము నశింప నంతఃకరణమున జ్ఞానప్రకాశము ప్రత్యక్షమగును.

ప్రసన్నం స్ఫారగామ్భీర్యమక్షుబ్ధమపరాహతమ్
హృదయం సమతామేతి శాన్తవాత ఇవార్ణవః. 21

ప్రసన్నమై, విశాలమై, గంభీరమై, క్షోభావర్జితమై, వైషమ్యాదులచే పరాజితము గానట్టి హృదయము శమించిన వాయువుగల సముద్రమువలె ప్రశాంతమగును.

అమృతాపూరపూర్ణేన నిత్యానన్దమయేన చ
స్థీయతే పురుషేణాన్తః శీతేన శశినా యథా 22

అత్తఱి మనుజుడు ఆత్మానందామృతముచే పరిపూర్ణుడై, నిత్యానందమయుడై శీతల చంద్రునివలె విరాజిల్లును.

సంవిదః స్ఫుటతామన్తరాయాన్త్యజ్ఞానసంక్షయే
సంవిదంశైకవిశ్రాన్తం సమగ్రం సచరాచరమ్. 23

అజ్ఞానము నశింప, యంతఃకరణమున ఆత్మాకారవృత్తి సుస్పష్టమగును. మఱియు, చరాచరదృశ్యప్రపంచము బాధితమై కేవలము సంవిత్తగు చైతన్యముమాత్రము స్థిరపడును.

భావ్యతే భరితాకారం వపురానన్దమన్థరమ్
న భవత్యనుసజ్జానామాశాపాశవిధాయినామ్. 24



ఆనందముచే పరివ్యాప్తమైన ఆత్మయొక్క పూర్ణస్వరూప మప్పుడనుభూతమగును. కాని ఆశాజాలమున బంధింపబడి, కేవలము ప్రాణసంయుతులై యున్నట్టి దేహసంగులకు మాత్ర మియ్యనుభవము కలుగజాలదు.

దగ్ధానామివ పర్ణానాం రసానాం పునరాగతిః
పుంసాం క్షపితసంసారజరాజన్మమహాధ్వనామ్. 25

గ్రీష్మర్తువందు సంతప్తములైన పత్రములుగల వృక్షములందు, వర్షాకాలమున మఱల రససంచారము ప్రాదుర్భవించునట్లు, జ్ఞానాగ్నిచే, జరాజన్మాది యుతమగు సంసారమహామార్గము నంక్షయింప, మనుజులకు ఆరోగ్యము, తుష్టి, పుష్టి, కాంతిమున్నగు గుణము లుద్భాసమగును.

అపునర్భ్రమణాయాత్మద్రుమే విశ్రమ్యతే చిరమ్
ఏవంప్రాయాస్తథాన్యాశ్చ భవన్తి గుణసంపదః. 26

మఱల యెన్నటికి సంసృతియందు బడకుండు నిమిత్తమై వివేకి ఆత్మయను వృక్షముపై చిరకాలము విశ్రమించును. ఓ చిత్తమా! నీవు క్షయించుటచే పైనదెల్పినవియు యింకను అన్యములైనవియునగు గుణసంపదలు గల్గును.

అసతి త్వయి సర్వాశిన్సర్వాశాక్షయసంక్షయే
పక్షయోరేతయోశ్చిత్తసత్తాసత్తాస్వరూపయోః. 27
యే నైవ పశ్యసి శ్రేయస్తమేవాఙ్గీకురు క్షణమ్
స్వాత్మభావస్తవ సుఖం మన్యే మానవతాం వర. 28

సర్వనాశకుఁడవగు నోచిత్తమా! సర్వాశావర్ధకుఁడవగు నీవు లేకున్నచో గుణసంపద యంతయు చేకూరును. ఆత్మయొక్క సత్తాసత్తలలో నీవేది శ్రేయప్రదమని తలంచెదవో, దానినే క్షణకాలమంగీకరింపుము. మాన్యవరుఁడవగు నోచిత్తమా! ఆత్మసత్తయే నీకు సుఖదాయకమని నేనెంచెద.

తమేవ భావయాభావం సుఖత్యాగో హి మూఢతా
యది త్వస్తి భవేత్సత్యమన్తర్భావితచేతనమ్. 29
జీవతస్తత్తవాత్యన్తమభావం క ఇవేచ్ఛతి
కింతు నాస్త్యసి సత్యేన వదామి తవ సున్దర. 30

అన్యపదార్థముల సత్తయేమియులేని అయ్యాత్మనే నీవు భావింపుము. సుఖమును త్యజించుట మూఢత్వమేయగును. నీయందే సత్యమైనట్టి ప్రసిద్ధమగు చైతన్యముగలదో, తద్రూపముగల్గి జీవించుచో నీయభావ మప్పుడెవరిచ్ఛగించెదరు? కాని నీవట్టి రూపము గల్గియుండలేదు. అసద్రూపమే గల్గియున్నావు. ఓ సుందరా! నేను శ్రుతిశాస్త్రానుభవాదులచే లెస్సగ విచారించి సత్యమును బల్కుచున్నాను.

తేన మిథ్యైవ జీవామిత్యాశయా మా సుఖీ భవ
పూర్వమేవాసి నాస్త్యేవ యావద్భ్రాన్త్యా త్వదస్థితా. 31

కాన 'నేను జీవితుఁడన'నునీ మిథ్యయగు యాశచే సుఖమునొందకుము. నీవు కల్పిత రూపుఁడవేనైయున్నావు. యథార్థముగ నీవులేవు. నీయస్తిత్వము భ్రాంతిసిద్ధమేనైయున్నది.

సైవేదానీం విచారేణ భృశం క్షయముపాగతా
ఏతావదేవ తే రూపం సాధో యదవిచారణమ్. 32

ఆభ్రాంతి యిపుడు విచారణచే పూర్ణముగ నశించినది. ఓసాధూ! నీ స్వరూప మాత్మ యొక్క అవిచారమాత్రమే యగును.

విచారే విహితే సమ్యక్స్వరూపం సమం స్థితమ్
అవిచారాత్ప్రజాతం త్వమనాలోకాత్తమో యథా. 33

విచారణచే నీయొక్క స్వరూపము విక్షేపాది వైషమ్యరహితమైన సన్మాత్రముగనే యుండును. ప్రకాశాభావముచే యంధకారమువలె అవిచారముచే నీ వుత్పన్నమగుదువు.

విచారేణోపశాన్తం త్వమాలోకేన తమో యథా
ఏతావన్తం సఖే కాలం బభూవాల్పవివేకితా. 34
తవానేనాభిపీనత్వమభూద్దుఃఖైకకారణమ్
మోహసంకల్పమాత్రేణ బాలవేతాలవద్భవేత్. 35
ద్వన్ద్వం చాద్యన్తసంకల్పక్షీణం క్షయి భవ స్థితమ్

కాని, ప్రకాశముచే యంధకారమువలె విచారముచే నీవు నశించెదవు. ఓమిత్రమా! ఇంతకాలము నేనల్పవివేకము గల్గియుంటిని. సంకల్పమాత్రమున బాలునకు బేతాలముద్భవమగునట్లు, ఆ యల్పవివేకముచే, దుఃఖకారణమున నీవు స్థూలాకృతిఁజెందితివి. కాని సృష్టికర్తయొక్క ఆద్యంత సంకల్పముచే సంకల్పకాలముననే నీవు క్షయించి సుఖదుఃఖాది ద్వంద్వరహితుఁడవైతి.

ఇదానీముదితం నిత్యం స్వప్రాగ్రూపే క్షయం గతే. 36
వివేకస్య ప్రసాదేన వివేకాయ నమోనమః

ఏ వివేకానుగ్రహముచే యీ జ్ఞానోదయకాలమున పూర్వపు అవిద్య నశించి ఆత్మస్వరూప ముదయమయ్యెనో, అట్టి వివేకమునకు నమస్కారము.

బహుధాపి ప్రబుద్ధస్త్వం చిత్తకాప్యనుబోధితః. 37
చిత్తతాయాం ప్రనష్టాయాం స్థితస్త్వం పరమేశ్వరః
ప్రాక్స్వరూపవిలాసస్తే శ్రేయసే స్థితిమాగతః. 38
సమస్తవాసనోన్ముక్తః సంప్రత్యసి మహేశ్వరః
యస్యావివేకాదుత్పత్తిః స వివేకాద్వినశ్యతి. 39
ప్రకాశేన ప్రయాత్యస్తమనాలోకోఽభవత్తమః

ఓ చిత్తమా! నీవు స్వయముగ ప్రబుద్ధుడవే యైయున్నావు. మఱియు, చిత్తత్వము నశింప పరమేశ్వరుఁడవే యగుదువని శాస్త్రములచే నీవు బోధింపబడితివి. పూర్వమున్న నీవు పరమేశ్వరుఁడవేనైయుంటివి. ఇపుడును ప్రబుద్ధత్వకారణమున స్వరూపస్థితి సంభవించినందున, సర్వాశా



వినిర్ముక్తుఁడగు మహేశ్వరుఁడవేయైయున్నావు. ఏలన, అవివేకముచే జనించినది వివేకముచే నశించును. ప్రకాశముచే యంధకారము నశించునుగదా!

అనిచ్ఛతోఽపి తే సాధో విచారే స్థితిమాగతే. 40
సర్వతోఽయముపాయాత్తో వినాశః సుఖసిద్ధయే
తస్మాన్నాస్త్యసి నిర్ణీతమితి సిద్ధాన్తయుక్తిభిః. 41

సాధువగు నో చిత్తమా! ఆత్మవిచారమున్నచో, నీవు కోరకున్నను సుఖసిద్ధికొఱకై నీ వినాశమే యెల్లెడల సంప్రాప్తించును. కావ, శాస్త్రసిద్ధాంత, యుక్తులచే నీవులేవనియే నిర్ణయింపబడినది.

చిత్తేన్ద్రియేశ్వర స్వస్తి భవతే త్వస్తమాగతః
నిత్యం పూర్వమభూతాయ నాస్తిరూపాయ సంప్రతి. 42

ఓ చిత్తమా! ఇంద్రియములకు ప్రభువగు నీవిపుడు సంసారమును దాటినవాడవైతివి. నీవు పూర్వమున్న లేవు. ఇపుడున్న లేనివాడవే యగుదువు. అట్టి నీకు శుభమగుగాక!

భవిష్యతే చ నోదర్కం స్వమనః స్వస్తి తేస్త్వితి
పరినిర్వామి శాన్తోఽస్మి దిష్ట్యాస్మి విగతజ్వరః. 43

స్వకీయమగు నోచిత్తమా! భవిష్యత్కాలమునను నీవుండనేరవు. నీకు శుభమగుగాక! సౌభాగ్యవశమున నేనిపుడు దుఃఖరహితుడనై పూర్ణతృప్తుఁడనై శాంతుడనైయున్నాను.

స్వాత్మన్యేవావతిష్ఠేఽహం తుర్యరూపపదే స్థితః
అతో నాస్త్యేవ నాస్త్యేవ సంసారే చిత్తమస్థితి. 44

తురీయపదమున స్వాత్మయందు నేను స్థితిఁగల్గియున్నాను. కాన, స్థితిలేని కారణమున చిత్తమీ ప్రపంచమున లేనిదేయగును.

ఆత్మాత్మన్యస్త్యేవ చాస్త్యేవ యస్మాదన్యత్ర విద్యతే
అయమాత్మాహమేవాసౌ నాస్త్యన్యన్మద్ృతే క్వచిత్. 45

ఆత్మయే అవశ్యము గలదు. ఈయాత్మయే నేను. నాకన్యముగ యెచటను యేమియును లేను.

స్ఫురచ్చిదేవ బోధాత్మా సర్వత్రాహం స్థితః సదా
అయమాత్మేతి కలనా మన్యే నో నిర్మలాన్తరే. 46

అనుభవరూపమున స్ఫురించునట్టి బోధస్వరూపమైన ఆత్మయగు నేనే సదా యంతటను వెలయుచున్నాను. శుద్ధచిద్రూపమగు ఆత్మయందు 'ఈ యాత్మ నేన' ను కల్పనగూడ యుండనేరదని యెంచెద. అట్టిచోనిక యితరకల్పనలగూర్చి వేఱు చెప్పవలెనా?

ప్రతియోగివ్యవచ్ఛేదకలనైకస్య వై కుతః
అహం తేనాయమాత్మేతి కలనామనుదాహరన్
మౌనీ స్వాత్మని తిష్ఠామి తరఙ్గ ఇవ వారిణి. 47

ఏకమై, అద్వితీయమైనట్టి పరమాత్మయందు 'ఆత్మకు వేఱుగ నేదియు లేద'ను కల్పన గూడ యెట్లు సంభవించును? ఇక్కారణమున 'ఈ ఆత్మ నేన'ను కల్పననుగూడ జింతింపక, జలమందు తరంగమునలె నేనిపుడాత్మయందు మౌనముగ నుండుచున్నాను.

సంశాన్తవాసనమనాశ్రితచేతనాంశ
మప్రాణసంచరణమస్తమితాంశదోషమ్,
సంవేద్యవర్జితముపేత్య సుసంవిదంశం
శామ్యామి మౌనమహమేవ నిరీహమన్తః. 48

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
మూపశమప్రకరణే చిత్తాసత్తావిచారయోగోపదేశో నామ త్ర్యశీతితమః
సర్గః ॥ 83 ॥

వాసనారహితుడనై, ప్రాణసంచారవర్జితుఁడనై, సర్వదోషవిముక్తుడనై, చిదాభాసాశ్రయము లేనివాడనై చిన్మాత్రమగు ఆత్మను పొంది, మనశ్చేష్టలెవ్వియు లేక నేను మౌనముగ విశ్రాంతి నొందుచున్నాను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
చిత్తసత్తావిచారయోగోపదేశమను త్ర్యశీతితమ
సర్గము ॥ 83 ॥

---

## చతురశీతితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఇతి నిర్ణీయ స మునిర్వీతహవ్యో వివాసనః
ఆసీత్సమాధావచలో విన్ధ్యకన్దరకోటరే. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓరామా! వాసనారహితుడగు వీతహవ్యముని వింధ్యపర్వత గుహయందిట్లు సమాధియందు నిశ్చలుఁడయ్యె.

అపరిస్పన్దితాశేష సంవిదానన్దసున్దరః
బభూవ స్తంగతమనాః స్తిమితామ్భోధిశోభనః. 2

ఏచేష్టలును లేక, స్వప్రకాశమును, పూర్ణమునునగు ఆత్మానందముచే సుందరుడై యొప్పుచు, మనోరహితుడై నిశ్చల సముద్రమువోలె యాతడు శోభించెను.

అన్తరేవ శశామాస్య క్రమేణ ప్రాణసంతతిః
జ్వాలాజాలపరిస్పన్దో దగ్ధేన్ధన ఇవానలే. 3

కట్టెలన్నియు కాలిపోన అగ్నిజ్వాలయొక్క గతియు నుపశమించునట్లు, క్రమముగ వానియందు ప్రాణసంచారముడిగెను.



అనన్తర్నిష్ఠతాం యాతే బాహ్యార్థే చాప్యసంస్థితే
శేషేఽన్తర్లబ్ధసంస్థానే తస్యాస్ఫురితపక్ష్మణీ. 4

బాహ్యపదార్థములందు జరింపకయున్న వాని నేత్రముల యర్ధభాగము నిమీలితమైయుండ తక్కిన యర్ధభాగము అంతర్ముఖమైయ్యు నుండెను.

ఘ్రాణప్రాన్తగతాల్పాల్పసమాలోకే ఇవేక్షణే
అర్ధకుడ్మలితైః పద్మైః శ్రియమాయయతుః సమామ్. 5

నాసాగ్రమువఱకు వ్యాపించి సమప్రకాశముగల్గియున్నట్టి వాని నేత్రములు అర్ధవికసిత కమలములవలె నుండెను.

సమకాయ శిరోగ్రీవస్థానకః స మహామతిః
ఆసీచ్ఛైలాదివోత్కీర్ణశ్చిత్రార్పిత ఇవాథవా. 6

శిరస్సు, కంఠము, శరీరము సమముగ నుంచినట్టి మహాధీశాలియగు నామునియత్తతి పర్వతముపై చెక్కబడిన విగ్రహమువలెను, లేక, లిఖిత చిత్రమువలెను గన్పట్టుచుండెను.

తథాభితిష్ఠతస్తస్య సంవత్సరశతత్రయమ్
కోటరే విన్ధ్యకచ్ఛస్య యయావర్ధముహూర్తవత్. 7

వింధ్యపర్వతముపై సెలయేటిచెంత నవ్విధముగ సమాధియందున్న యామునికి మూడు వందల సంవత్సరములు అర్ధముహూర్తమువలె గడచెను.

ఏతావన్తమసౌ కాలం నాబుద్ధ్యత కిలాత్మవాన్
జీవన్ముక్తతయా ధ్యానీ న చ తత్యాజ తాం తనుమ్. 8

జీవన్ముక్తత్వకారణమున జ్ఞానియు, ధ్యానియునగు నాముని యంతకాలమువఱకు సమాధినుండి లేవకయు, దేహమును త్యజింపకయు నుండెను.

తావత్కాలం స శుభగో న ప్రాబుద్ధ్యత యోగవిత్
ఉదారై రమ్బుదారావై రాసారభరఘర్ఘరైః 9
పర్యన్తమణ్డలాధీశమృగయాగతబృంహితైః
పక్షివానరనిర్హ్రాదైర్మాతఙ్గాస్ఫోటనిఃస్వనైః. 10
సింహసంరమ్భరటితైర్నిర్ఝరారావసీత్కృతైః
విషమాశనిసంపాతైర్జనకోలాహలైర్ఘనైః 11
ప్రమత్తశరభాస్ఫోటైర్ఝాకమ్పతటఘట్టనైః
వనదాహథమధ్వానైర్జలౌఘూహాతివల్గనైః. 12
మహోపలతటాఘాతైర్ధరణీతలమృజ్జలైః
జలౌఘాన్దోలనాయాతైస్తాపైరనలకర్కశైః. 13

సౌభాగ్యశీలుఁడగు నా యోగి యంతకాలము వఱకును, గొప్పగొప్ప మేఘగర్జనలచేగాని, వర్ష ధారల ఘర్ఘరధ్వనులచేగాని, సమీపస్థ సామంతరాజుల వేటయందలి కోలాహలముచే

గాని, వానరముల యఱపులచేగాని, ఏనుగుల ఘీంకారముచేగాని, క్రుద్ధసింహముల గర్జనలచేగాని, సెలయేళ్ల సీత్కారధ్వనులచేగాని, భయంకరమైన పిడుగులచేగాని, మనుజుల సందడిచేగాని, మదించిన శరభమృగముల శబ్దములచేగాని, భూకంపముచే పగిలిన పర్వతములయొక్క శిలాసంఘట్టనలచే గాని, దావాగ్ని ధ్వనులచేగాని, జలప్రవాహ శబ్దములచేగాని, గొప్పగొప్ప పర్వతముల శిలాఘాతములచే గాని, భూమినుండి బయల్వెడలిన మృత్తికాజలముల శబ్దములచేగాని, అగ్నిసమానములగు తాపములచే గాని, సమాధినుండి లేవకుండెను.

కేవలం వహతి స్వైరం కాలే గలితకారణమ్
పరియాన్తీషు వర్షాసు లహరీష్వివ వారిణి. 14

స్వల్పేనైవ హి కాలేన తస్మిన్పర్వతకన్దరే
ప్రావృడోఘవినున్నేన పఙ్కేనోర్వీతలే కృతః. 15

తత్రాసావవసద్భూమా కోటరే సంకటోదరే
పఙ్కసంపీడితస్కన్ధః పర్వతేషు శిలా యథా. 16

కాలము కేవలము స్వతంత్రముగను, నిష్కారణముగను గడచుచుండ, జలమందలి తరంగములవలె పెక్కువరుసలు వర్షాకాలము గతింప, కొలదికాలములో నాపర్వతగుహయందు వర్షాకాలమువాటి బురదచే వీతహవ్యుని దేహము భూమిక్రింద కూరుకొనిపోయెను. అట్లా సంకటస్థలమున పంకముతోనుగు భుజములుగల్గ భూమియందున్నను, యాతడు వ్యథారహితుడై పర్వతశిలవలె నిశ్చలముగనుండెను.

శతత్రయే స వర్షాణామథ తాతే స్వయంప్రభుః
వ్యబుధ్యతాత్మనాపాత్మా ధరాకోటరపీడితః. 17

మూడునందల సంవత్సరములు గడచినవెనుక, భూబిలమున పీడితమై వాని యాత్మప్రభవు స్వయముగనే సమాధినుండి మేల్గాంచెను.

సంవిదేవాస్య తం దేహం జుగ్రాహోర్వీనిపీడితమ్
తనుః ప్రాణమయస్త్వన్తః ప్రాణసంసరణం వినా. 18

భూపీడితమగు వాని దేహమును చైతన్యమే రక్షించెనుగాని ప్రాణస[illegible]ము కాదు. ఏలన, వానిదేహము ప్రాణచలనములేనిదై సూక్ష్మమై యుండెనుగదా.

ఉత్పత్తిప్రాప్తిమాసాద్య కలనా హృదయాన్తరే
స్వమనోరూపిణీ తస్య హృద్యేవానుబభూవ సా. 19

ఆ మున్నూరు వత్సరములు గడచిన తదుపరి, శేషించిన ప్రారబ్ధము ననుభవించుటకై వాని జీవచైతన్యము హృదయమున ప్రబలముగ నావిర్భవించి స్వమనోరూపము ధరించి యీ క్రింది విషయముల నచటనే యనుభూతి మొనర్చుకొనెను.

కైలాసకాననే కాన్తే కదమ్బస్య తరోస్తలే
మునిత్వం శతమబ్దానాం జీవన్ముక్తాత్మ నిర్మలమ్. 20



విద్యాధరత్వం వర్షాణాం శతమాధివివర్జితమ్
యుగపఞ్చకమిన్ద్రత్వం ప్రణతం సురచారణైః. 21

జీవన్ముక్తుడగుటచే నిర్మలాత్ముడై మనోహరమగు కైలాసపర్వత కాననమున కదంబవృక్షముక్రింద నూఱువత్సరములకాలము మునిత్వ మనుభవించెను. మనోవ్యథారహితుడై నూఱువత్సరములు విద్యాధరత్వ మనుభవించె. దేవ, చారణవందితుడై ఐదుయుగముల వఱకు యింద్రత్వ మనుభవించె.

శ్రీరామ ఉవాచ:—

శక్రత్వాదిషు తేష్వస్య ప్రతిభాసేషు భో మునే
నియమోఽనియమశ్చైవ దిక్కాలనియతేః కథమ్. 22

శ్రీరాముడు:- ఓ మునీంద్రా! పంచయుగాదుల కాలమున్న, కైలాసకాననాదుల విశాల ప్రదేశమున్న, అల్పకాలమున అల్పమగు వానిహృదయదేశమున యెట్లు సంభవించెను? అట్లు సంభవించుటచే దేశకాలముల అనియమమేర్పడినదిగదా? దేశకాలముల కొకపుడు నియమమున్న మఱియొకపుడు అనియమమున్న యెట్లు సంభవించును?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

సర్వాత్మికైషా చిచ్ఛక్తిర్యత్రోదేతి యథా యథా
తథా తత్రాశు భవతి తథాత్మైకస్వభావతః. 23

యథా యత్ర యదా బుద్ధో నియమః స తదా స్థితః
దేశకాలాదినియమక్రమాణాం తన్మయాత్మతా. 24

శ్రీవసిష్ఠుడు:-ఓ రామా! సర్వరూపమగు చైతన్యశక్తి యెచట నేయేరూపమున నుదయించునో అచట యనుభవమునొందు చేతనముయొక్క స్వభావమునను సరించి శీఘ్రముగ నాయారూపమగుచుండును. ఎపుడెచట బుద్ధియందెట్టి యనుభవము కలుగునో అపుడట్టి నియమమే యచ్చోట నుదితమగును. ఏలన, దేశకాలాదుల నియమక్రమములన్నియు బుద్ధిమయమగు చిదాత్మయందధ్యస్తములై యున్నవిగదా! అనగా అసర్వరూపమున నెఱుంగబడిన చైతన్యమున, అల్పదేశకాలములందు విశాలదేశకాలములు సంభవింపవుగాని సర్వరూపమున నెఱుంగబడిన చైతన్యమున సంభవించును.

తేన నానావిధాన్యేష జగన్తి పరిదృష్టవాన్
హృది సంవేదనాకాశే వీతహవ్యో వివాసనః. 25

ఇక్కారణమున వాసనారహితుడగు వీతహవ్యముని స్వహృదయస్థ చిదాకాశమున వివిధజగంబుల గాంచెను.

సమ్యగ్బోధవతామేషా వాసనైవ న వాసనా
జ్ఞానాగ్నిదగ్ధా దగ్ధస్య కైవ బీజస్య బీజతా. 26

ఉత్తమజ్ఞానుల (ఆత్మజ్ఞుల) వాసన వాసన కాదు. వేయించిన విత్తనమువలె జ్ఞానాగ్నిచే దగ్ధమై మాటకు మాత్రము దగ్ధముగాకయున్నట్టి యర్థానికి బీజత్వము (జన్మాంకురముత్పన్న మొనర్చు శక్తి) యెచట?

కల్పమేకం గణత్వం స చన్ద్రమౌలేశ్చకార హ
సమస్తవిద్యానిపుణం త్రికాలామలదర్శనమ్. 27

ఆవీతహవ్యుడు, సర్వవిద్యలందును నిపుణుడై, త్రికాలములందును నిర్మల జ్ఞానము గలవాడై శ్రీమహేశ్వరుని గాణపత్య మొకకల్పముపఱకనుభవించెను.

యో యాదృగ్దృఢసంస్కారః స తం పశ్యతి తాదృశమ్
జీవన్ముక్తతయాప్యేష తద్వీతహవ్యోఽనుభూతవాన్. 28

ఎవఁడెట్టి దృఢసంస్కారము గల్గియుండునో యాతఁడట్లనే గాంచును. ఎట్లన, జీవన్ముక్తుడైనను అనుభవము గల్గఁజేయునదగు ప్రారబ్ధకర్మయొక్క దృఢసంస్కార మావిర్భవించుటచే వీతహవ్యముని పైయనుభవము లన్నింటిని బొందెను.

శ్రీ రామ ఉవాచః—

ఏవం స్థితే మునిశ్రేష్ఠ జీవన్ముక్తమతేరపి
బన్ధమోక్షదృశః సన్తి వీతహవ్యాత్మనో యథా. 29

శ్రీరాముడు:- ఓ మునీంద్రా! అట్లైనచో, వీతహవ్యునివలె జీవన్ముక్తునకుగూడ బంధమోక్షముల దృష్టియుండునా?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

యథాస్థితమిదం విశ్వం శాన్తమాకాశనిర్మలమ్
బ్రహ్మైవ జీవన్ముక్తానాం బన్ధమోక్షదృశః కుతః. 30

శ్రీవసిష్ఠుడు:- ఓ రామా! ప్రత్యక్షమగునీ జగత్తంతయు జీవన్ముక్తులదృష్టియందు శాంతమై నిర్మలాకాశసదృశమైనట్టి బ్రహ్మమేయైయుండ నిక వారలకు బంధమోక్షముల దృష్టియెచట?

ఏతత్సంవిన్నభో భాతి యత్రయత్ర యథాయథా
తత్రతత్ర తథా తావత్తావత్తద్విద్ధి తే తతమ్. 31

సంవిద్రూపమగునీ చిదాకాశమెచట నేయేవిధముగ భాసించునో, అచట నాయావిధముగ నంతంత వ్యాప్తిఁబొందినదైయుండును.

తేనానుభూతాని బహూన్యనుభూయన్త ఏవ చ
జగన్తి సర్వాత్మతయా బ్రహ్మరూపేణ రాఘవ. 32

ఓ రాఘవా! సర్వస్వరూపుఁడగుటచే బ్రహ్మరూపుఁడైన నావీతహవ్యుడు అనేక జగత్తుల ననుభవించెను. ఇంకను ననుభవించుచునేయున్నాడు.

ధరాకోటరనిర్మగ్నవీతహవ్యచిదాత్మసు
జగత్సు తేష్వసంఖ్యేషు నీరూపేషు మహాత్మసు. 33
యః శక్రోఽనవబుద్ధాత్మా సోఽద్య దీనేషు పార్థివః
కర్తుం ప్రవృత్తో మృగయాం క్షణేఽస్మిన్నపి కాననే. 34



యోఽహం సోఽనవబుద్ధాత్మా పాద్మే పైతామహేఽభవత్
స్థితః స ఏవ దాశేన్ద్రః కైలాస వనకుఞ్జకే. 35
యో రాజానవబుద్ధాత్మా భూమేః సౌరాష్ట్రమణ్డలే
స ఏషోఽద్య స్థితోఽన్ధ్రాణాం గ్రామే బహులపాదపే. 36

వీతహవ్యుని హృదయమందలి చైతన్యము అస్మదాది సర్వజీవుల చైతన్యమే యగుటచే [illegible]మందలి జీవులందఱి యనుభవమున్ను వాని దేయగును అందుచే, భూమియందు జొచ్చియున్న [illegible]మందలి అసంఖ్యాకములైన రూపరహితములును లేక ప్రతిభాసముచే విశాలరూపములును [illegible] బ్రహ్మాండములందు పూర్వమింద్రుడైయున్నవాడిపుడు దీనమను దేశమున రాజైయుండి [illegible]లో వనమందు వేటాడుటకై ప్రవృత్తుఁడయ్యెను. బ్రహ్మదేవుని పద్మకల్పమున వీతహవ్యుడు గణపతియైయున్నకాలమున కైలాసమునగల వాని క్రీడాహంసయే యిపుడు నిషాదరాజైయున్నది, అట్లనే యియ్యవనితలమున సౌరాష్ట్రదేశమున పూర్వము రాజైయున్నవాడిపుడు ఆంధ్రదేశమున పలువృక్షములు గల నొకగ్రామమున వసించుచున్నాడు.

శ్రీ రామ ఉవాచ :—

మానసః కిల సర్గోఽసౌ వీతహవ్యస్య తత్ర యే
దేహినో భ్రాన్తిమాత్రం చేత్తద్దేహాకారిణః కథమ్. 37

శ్రీరాముడు:—ఓ ప్రభూ! వీతహవ్యుని సృష్టి మానసికమైయున్నదిగదా! దానియందలి జీవులును మిథ్యామాత్రులేగదా! అట్టిచో, ఇంద్రుడు, హంస దేహాకారముగల్గి సచేతనముగ యెట్లుండగల్గెను?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యది భ్రాన్త్యేకమాత్రాత్మ వీతహవ్యస్య తజ్జగత్
తదిదం నామ తే రామ కిం భూయః పరిభాసతే 38

శ్రీవసిష్ఠుడు:—ఓరామా! వీతహవ్యుని మానసికజగత్తు భ్రాంతిమాత్రమగుటచే నందలి జీవులు సచేతనులై యెట్లుండిరని శంకించుచుంటివిగదా. అట్లైన నీయీ ప్రసిద్ధమగు జగత్తు సచేతనముగ యేల భాసించుచున్నది? (అనగా, మనఃకార్యమగుటచే నిదియు భ్రాంతిమాత్రమేయని అర్థము.)

ఇదమప్యఙ్గ చిన్మాత్రం మనోమాత్రభ్రమోపమమ్
తదపి వ్యోమ చిన్మాత్రం మనోమాత్రం భ్రమోపమమ్. 39

నీయీజగత్తు చిన్మాత్రాంగమగు మనస్సుయొక్క భ్రమమైయున్నట్లే, వీతహవ్యుని జగత్తున్ను చిదాకాశమాత్రమగు మనస్సుచే కల్పితమగు భ్రమమైయున్నది.

వస్తుతస్తు న తద్రామ జగన్నైవం న చేతరత్
తథాపి న జగత్సత్తా బ్రహ్మేదం భాతి కేవలమ్. 40

ఓరామా! యథార్థముగ వానియాజగత్తు దీనికి సదృశముకాదు, విలక్షణమున్ను కాదు. నీయీ జగత్తున్ను లేనిదేయగును. కేవలము బ్రహ్మమే యీ జగద్రూపముగ భాసించుచున్నది.

భావి భూతం భవిష్యచ్చ యథేదం చ తథేతరత్
జగత్సర్వమిదం దృశ్యం సంవిన్మాత్రమనోమయమ్. 41

భూతభవిష్యద్వర్తమానకాలములందలి యీ దృశ్యమాత్రమగు జగత్తంతయు చిన్మాత్రావశిష్టమగు మనోమయమైయున్నది.

ఏవంరూపమిదం యావన్న పరిజ్ఞాతమీదృశమ్
వజ్రసారదృఢం తావజ్జాతం సత్పరమామ్బరమ్. 42

ఎంతవఱకిట్టి జగత్తు తెలియంగబడలేదో, అంతవఱకు సద్రూపమగు చిదాకాశము వజ్రమువలె దృఢముగ నెఱుంగబడియేయుండును.

అజ్ఞానాన్మన ఏవేద మిత్థం సంప్రవిజృమ్భతే
ప్రత్యుల్లాసవిలాసాభ్యాం జలమమ్బునిధావివ. 43

సముద్రమున తరంగరూపమున జలము విస్తరించునట్లు, మనోమాత్రమేయగు నీజగత్తు అజ్ఞానులకు ఉత్పత్తి, వృద్ధియున్నగు పరిణామములతోగూడి విశాలమగుచున్నది.

యథాస్థితేనైవ చిదమ్బరేణ
స్వచిత్తమేవైతి మనోభిధానమ్,
స్ఫారం కృతం తేన జగచ్చదృశ్య
మేవం తతం నైవ గతం చ కించిత్. 44

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే వీతహవ్యమనోజగద్వర్ణనం నామ చతురశీతితమః
సర్గః ॥ 84 ॥

నిర్వికారమై, చిదాకాశస్వభావమునను్న బ్రహ్మమే స్వమాయచే యల్పముగ చేష్టితమై, తన్ను చిత్తరూపముగ కల్పించుకొనుచు, చిత్తముకాగా, యుద్దాని మననశక్తియే మనోరూపత్వము నొందుచున్నది ఆ మనస్సుచే నయ్యది యీవిశాలజగత్తును నిర్మించెను. దానిచేతనే యీదృశ్యమంతయు వ్యాపింపబడియున్నది. కాని యథార్థముగ బ్రహ్మమునకు భిన్నముగ నిది దేనిచేతనున్ను వ్యాపింపబడియుండలేదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
వీతహవ్యమనోజగద్వర్ణనమను చతురశీతితమ
సర్గము ॥ 84 ॥

---

పఞ్చాశీతితమః సర్గః

---

శ్రీ రామ ఉవాచ :—

అథ కిం వీతహవ్యః స్వంస్థితం తస్మిన్ధరోదరే
కథముద్ధృతవాన్దేహం సపంపన్నశ్చకిం కథమ్. 1



శ్రీరాముడు:— ఓ మునీంద్రా! వీతహవ్యముని భూగర్భమందున్నట్టి తనదేహము నెట్లు పైకిదీసెను? ఆతడచట యెట్లుండెను? ఏమిచేసెను?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అనన్తరమనన్తాత్మ వీతహవ్యాభిధం మనః
స్వమేవాత్మచమత్కారమాత్రం సమవబుద్ధవాన్. 2

వసిష్ఠుడు:— ఓ రామా! ఆపిదప అనంతాత్మస్వరూపమైన వీతహవ్యాఖ్యమగు వాని మనస్సు తన్నాత్మచమత్కృతిమాత్రమున నెఱింగెను.

శార్వస్యాస్య గణస్యాభూత్ప్రాగ్జ్యోతిఃస్మరణే స్వయమ్
ఇచ్ఛా కదాచిత్సకలప్రాగ్జన్మాలోకనోన్ముఖీ. 3

ఆ వీతహవ్యుని మనంబీశ్వరుని గణమైయున్నపుడొకతటి యాత్మధ్యానకాలమున నద్దానికి తన పూర్వకాలిక దేహములన్నిటిని బరికింప నిచ్ఛపొడమెను.

అశేషాన్స దదర్శాథ నష్టానష్టాన్స్వదేహకాన్
అనష్టానాం తతో మధ్యాత్తత్తత్కోటరసంస్థితమ్. 4

యదృచ్ఛయైవ ప్రోద్ధర్తుం దేహం తస్యాభవన్మతిః
అపశ్యత్తత్తథా తత్ర పఙ్కే కీటమివ స్థితమ్. 5

పిమ్మటనది నశించినవియు, నశింపనివియునగు తన దేహములనన్నిటిని గాంచెను. నశింపనివాటిలో భూగర్భమున కీటమువలెనున్న తన యాదేహమును జూచెను.

శరీరం వీతహవ్యాఖ్యం ధరాకోటరపీడితమ్
ప్రావృడోఘోపనీతం తత్పృష్ఠస్థపఙ్కమణ్డలమ్. 6
తృణజాలావకీర్ణత్వగ్దేహపృష్ఠమృదం తథా
ఏతద్దృష్ట్వా మహాతేజా ధరావివరయన్త్రితమ్. 7

వర్షాకాల జలప్రవాహముచే దూరముగ నీడ్వబడినదియు, వీపువెనుకభాగము బురదతో గూడుకొనినదియు, తృణములచే గప్పబడిన చర్మముగలదియు, భూగర్భమున పంకముచే బరివేష్టితమైనదియునగు తన యాదేహమును మహాతేజస్వియగు నాఋషి గాంచెను.

భూయోఽపి చిన్తయామాస ధియా పరమబోధయా
సర్వసంపీడితాఙ్గత్వాత్కాయో మే ప్రాణవాయుభిః. 8
ముక్తశ్చలితుమాకర్తుం శక్నోతి న మనాగపి
తజ్జాత్వా ప్రవిశామ్యాశు దేహమేవం వివస్వతః. 9
తదీయః పిఙ్గలో దేహముద్ధరిష్యతి మే తతః
అథవా కిం మమైతేన శామ్యామ్యహమవిఘ్నతః. 10
నిర్వామి స్వపదం యామి కోఽర్థో మే దేహలీలయా

అంత నుత్తమజ్ఞానయుక్తమగు తన బుద్ధిచే యాతడిట్లు చింతనజేసెను- ఈదేహము సర్వాంగముల సంపీడితమగుటచే ప్రాణసంచారరహితమైయున్నది. కొంచెమైనను నడచుటకుగాని, పని చేయుటకుగాని శక్తిలేనిదై యున్నది. కాన, దీనినుద్ధరించుట కుపాయమెఱింగి శీఘ్రముగ సూర్యదేహంబున బ్రవేశించెద. అట్లొనర్చుటచే పింగళుడను సూర్యునిగణము నా దేహమునుద్ధరించును. అయినను, ఈప్రపంచముతో నాకిక యేమిపని ? ఈదేహమునువదలి, విదేహముక్తుడనై, స్వాత్మపదమొంది నిర్విఘ్నముగ నేను శాంతినొందెదను. నాకీదేహలీలచే నిక యేమిప్రయోజనము ?

ఇతి సంచిన్త్య మనసా వీతహవ్యో మహామతే.
తూష్ణీం స్థిత్వా క్షణం భూయశ్చిన్తయామాస భూతలే 11
ఉపాదేయో హి దేహస్య న మే త్యాగో న సంశ్రయః.
యాదృశో దేహసంత్యాగస్తాదృశో దేహసంశ్రయః 12
తద్యావదస్తి దేహోఽయం న యావదణుతాం గతః.
తావదేనముపారుహ్య కించిత్ప్రవిహరామ్యహమ్ 13
పిఙ్గలేన శరీరం స్వముద్ధర్తుం తాపనం వపుః.
ప్రవిశామి నభఃసంస్థం ముకురం ప్రతిబిమ్బవత్ 14
ఇత్యసౌ మునిరాదిత్యం వివేశానిలరూపధృక్.
పుర్యష్టకవపుర్భూత్వా భస్త్రాఖమివ చానలః 15
భగవాన్మునిరప్యేనం హృద్గతం మునినాయకమ్.
దృష్ట్వాసౌ చిన్తయన్కార్యం పౌర్వాపర్యముదారధీః 16
విన్ధ్యభూధరభూకోశమన్తర్మునికలేవరమ్.
తృణోపలపరిచ్ఛన్నం దదర్శ గతసంవిదమ్ 17
ఋషేశ్చికీర్షితం జ్ఞాత్వా భానుర్గగనమధ్యగః.
ధరాతో మునిముద్ధర్తుమాదిదేశాగ్రగం గణమ్ 18
వీతహవ్యమునేః సంవిత్సా పుర్యష్టకరూపిణీ.
రవిం వాతమయీ పూజ్యం ప్రణనామాశు చేతసా 19
భానునాప్యభ్యనుజ్ఞాతో మానపూర్వకమగ్రగమ్.
వివేశ పిఙ్గలాకారం విన్ధ్యకన్దరగామినమ్ 20
పిఙ్గలోఽసౌ నభస్త్యక్త్వా కుఞ్జకుఞ్జరసున్దరమ్.
ప్రాప విన్ధ్యవనం ప్రావృణ్మత్తాభ్రామ్బరభాసురమ్ 21
ఉద్దధార ధరాకోశాన్నఖనిష్కృష్టభూతలః
కలేవరం మునేః పఙ్కాన్మృణాలమివ సారసః 22
మానం పుర్యష్టకమథ స్వం వివేశ కలేవరమ్.
నభస్తలపరిభ్రాన్తో విహఙ్గమ ఇవాలయమ్ 23
ప్రణే... ...ము... వీతహవ్యనభశ్చరౌ. 24



బభూవతుః స్వకార్యైకతత్పరౌ తేజసాం నిధీ
జగామ పిఙ్గలో వ్యోమ మునిశ్చ విమలం సరః. 25
తారకాగారకుముదం సూర్యాంశుకవదాకృతి
వీతహవ్యో మమజ్జాశు సరస్యుద్భిన్నపఙ్కజే. 26
పఙ్కపల్వలలీలాన్తే వనే కలభకో యథా
తత్ర స్నాత్వా జపం కృత్వా పూజయిత్వా దివాకరమ్
మనోభూషితయా తన్వా పూర్వవత్పునరాబభౌ. 27

మహామతివగు నోరామా ! ఇట్లుచింతనజేసి వీతహవ్యముని క్షణకాలము మౌనము వహించి మఱల యిట్లు విచారింపదొడగెను.- 'నాకీదేహమునుగూర్చిన గ్రహణముగాని, త్యాగముగాని, ఆశ్రయముగాని లేదు. దేహత్యాగమెట్లో, దేహాశ్రయమున్ను నాకట్లే. కాన నీదేహము పరమాణురూపము నొందనంతవఱకు, దీనిని ధరించి విహరించెద. పింగళునిచే యీ దేహమును నుద్ధరింపజేయుటకై, దర్పణమున ప్రతిబింబము ప్రవేశించునట్లు నేనాకాశముననున్న సూర్యునియందు ప్రవేశించెదన'ని యిట్లు నిశ్చయించుకొని, వాయువువలెను, కొలిమితిత్తియందలి యాకాశమువలెను, సూక్ష్మమైనట్టి తనలింగదేహముతో నాముని సూర్యమండలమున బ్రవిష్టుండయ్యె. అత్తఱి మననశీలుండును, ఉదారబుద్ధియునగు సూర్యభగవానుడు తన హృదయమున బ్రవేశించిన వీతహవ్యమునీంద్రుని గాంచి, కార్యమును యోచించి, వాని పూర్వాపరదేహముల బరికించి, చింతన జేయుచు, వింధ్యపర్వతభూప్రదేశమున తృణశిలాదులచే గప్పబడి చేష్టారహితమైయున్నట్టి వాని దేహమును గాంచెను. ఆకాశమధ్యమందున్న సూర్యుండంతనా ఋషియొక్క కర్తవ్యమెఱింగి భూమియందుండి వాని శరీరమును లేవనెత్తుటకై అగ్రగామియగు పింగళుండను తనగణమున కాజ్ఞయొసంగెను. అపుడు వాయురూపమగు వీతహవ్యుని సూక్ష్మశరీర సంవిత్తు పూజ్యుడగు సూర్యభగవానునకు శీఘ్రముగ ప్రణామమాచరించెను. సూర్యునిచే సమ్మానపూర్వకముగ నాజ్ఞాపింపబడి స్వకార్యనిర్వహణమునకై సంసిద్ధుడై, వింధ్యపర్వతగుహకుం బోనునున్న పింగళుని దేహమున నంత యాముని ప్రవేశించెను. అపుడా పింగళుడున్న ఆకాశమును వీడి లతాగృహ, గజాదులతోటి రమణీయమై, వర్షాకాలమేఘములచే చెన్నొందుచున్నట్టి వింధ్యపర్వతవనముం బ్రవేశించి, సారసపక్షి బురదనుండి కమలమును దీయునట్లు గోళ్లతో త్రవ్వి, భూమినుండి యామునిశరీరమును బయటకు దీసెను. ఆకాశమున జరించుచు పక్షి తన గూటియందు ప్రవేశించునట్లు యామునీంద్రుని సూక్ష్మదేహమంత నా శరీరమునం బ్రవేశించెను. తదనంతరము మూర్తరూపమును ధరించిన వీతహవ్యుడును, ఆకాశచారియగు పింగళుడును పరస్పరము వందనమొనర్చుకొనిరి. అత్తఱి తేజోసముద్రులగు వారిద్వరును వారివారి కార్యములందు మగ్నులైరి. పింగళుండాకాశమునకుం బోయెను. మునీంద్రుడు స్నానార్థము నిర్మల సరోవరమునకుం జనెను. కలువలను నక్షత్రములు గలదియు, ప్రాతఃకాల సూర్యకిరణములతోగూడి రక్త, పీత వర్ణవస్త్రముల ధరించినట్లున్నదియునగు యాకమలసరంబున వీతహవ్యముని స్నానమొనర్చెను. అడవియందు యేనుగుగున్నవలె, బురదతోగూడిన యా సరోవరమున క్రీడించి, అనంతరము స్నానమొనర్చి

జపహూచరించి, సూర్యుని బూజించి, మనోభూషితమగు తన శరీరముతోఁగూడి యాతఁడు పూర్వము వలనే ప్రకాశింపఁదొడఁగెను.

మైత్ర్యా తయా సమతయా పరయా చ శాన్త్యా
సత్ప్రజ్ఞయా ముదితయా కృపయా శ్రియా చ,
యుక్తో మునిః సకలసఙ్గవిముక్తచేతా
విన్ధ్యే సరిత్తటగతో దినమేవ రేమే. 28

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
సూపశమప్రకరణే వీతహవ్యసమాధియోగోపదేశో నామ
పఞ్చాశీతితమః సర్గః ॥ 85 ॥

జీవన్ముక్తులందు ప్రసిద్ధములగు సమత్వము, పరమశాంతి, ఉత్తమబుద్ధి, (సమానులయెడ) మైత్రి, (ఉత్తములయెడ) ప్రసన్నత్వము, దీనులయెడ (కరుణ) మున్నగు గుణములచే శోభించుచు సర్వసంగవినిర్ముక్తమైన మనస్సుగల యామని వింధ్యపర్వతనదీతటమున నొకదినమంతయు లీలచే గడపెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
వీతహవ్యసమాధియోగోపదేశమను పంచాశీతితమ
సర్గము ॥ 85 ॥

---

## షడశీతితమః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

దినాన్తే స సమాధాతుం పునరేవ మనో మునిః
వివేశ కాంచిద్వితతాం విజ్ఞాతాం విన్ధ్యకన్దరామ్. 1

శ్రీ. వసిష్ఠుఁడు:— ఓ రామా! దినాంతమున మఱల నా మునికి సమాధియొనర్ప కోర్కె జనించెను. అపుడు తా నెఱింగియున్నట్టి యొక విశాలమైన వింధ్యపర్వతగుహయందాతఁడు ప్రవేశించెను.

తదేవాత్మానుసంధానమత్యజన్సమమిన్ద్రియైః
చేతసా కలయామాస దృష్టలోకపరావరః. 2
పూర్వమేవేన్ద్రియగణో మయా పరిత్యాజ్యతః స్ఫుటమ్
ఇదానీం చిన్తయా నార్థః పునర్వితతయా మమ. 3

ప్రపంచమున సారాసారములను గుర్తెఱింగిన యామని ఆత్మానుసంధానమును వదలకయే పూర్వమువలె యిట్లింద్రియములతోఁటి విచారణసల్పెను. - పూర్వమే నేనింద్రియములను లెస్సగ విడచినవాఁడను. ఇపుడు మఱల నాదీర్ఘచింతతోఁటి నాకే ప్రయోజనమున్ను లేదు.



అస్తినాస్తీతి కలనాం భఙ్క్త్వా మృద్వీం లతామివ
శేషం తు బద్ధసంస్థాన స్తిష్ఠామ్యచలశృఙ్గవత్. 4

'కలదు, లేద'నునీకల్పనను మృదువైన తీగెనువలె త్రుంచివైచి, శేషించిన సాక్షియగు చిన్మాత్రము నాశ్రయించి, కంఠశిరశ్శరీరముల సమముగనుంచి, దృఢముగ యాసనమువైచికొని, పర్వతశిఖరమువలె అచంచలుఁడనై యుండెద.

ఉదితోఽస్తంగత ఇవ స్వస్తం గత ఇవోదితః
సమః సమరసాభాస స్తిష్ఠామి స్వచ్ఛతాం గతః. 5

జీవించియున్నను, అజ్ఞానిదృష్టియందు మృతించినవానివలెను, జ్ఞానిదృష్టియందు తద్విపరీతముగను నున్నవాఁడనై, నిర్మలత్వమొంది, ఏకమగు చిన్మాత్రస్వరూపుఁడనై యుండెద.

ప్రబుద్ధోఽపి సుషుప్తస్థః సుషుప్తస్థః ప్రబుద్ధవత్
తుర్యమాలమ్బ్య కాయాన్త స్తిష్ఠామి స్తమ్భితస్థితిః. 6

జాగ్రద్దశయందున్నను, ద్వైతజాలమును బరికింపక సుషుప్తుఁడనై, సుషుప్తియందున్నను స్వాత్మరూపముఁ గాంచుటచే జాగరుకుఁడనై, తురీయపదము నవలంబించి దేహపతనపర్యంతము నచలుఁడనై యుండెద.

స్థితః స్థాణురివైకాన్తే స్వాన్తాన్తే సర్వతః స్థితే
సత్వసామాన్యసామ్యే హి తిష్ఠామ్యపగతామయః. 7

మనస్సునకతీతమై, సత్తాసామాన్యరూపమున సంతతము వ్యాపించి, యేకమైయున్నట్టి పరమాత్మయందు, వికారరహితుఁడనై స్థాణువువలె స్థితిఁబొందెద.

ఇతి సంచిన్త్య స ధ్యానే పునస్తస్థౌ దినాని షట్
తతః ప్రబోధమాపన్నః క్షణసుప్త ఇవాధ్వగః. 8

ఇట్లునిశ్చయించుకొని మఱల యాతఁ డాఱుదినములవఱకును. ధ్యానతత్పరుఁడై తదనంతరము, బాటసారి క్షణముసేపు విశ్రమించి లేచుచందమున యాతఁడు సమాధినుండి మేల్కాంచెను.

తతః సిద్ధః స భగవాన్వీతహవ్యో మహాతపాః
విజహార చిరం కాలం జీవన్ముక్తతయా తదా. 9

పిదప, మహాతపస్వియగు నావీతహవ్యుఁడు సిద్ధుఁడై జీవన్ముక్తరూపమున బహుకాల మీ యవనిపై సంచరించెను.

వస్తు నాభినన్దాసౌ నినిన్ద న కదాచన
న జగామ తథోద్వేగం న చ హర్షమవాప సః. 10

అతఁడే వస్తువును ప్రశంసింపకయు, దేనిని నిందింపకయు, సదా హర్షశోకభయ రహితుఁడయ్యు నుండెను.

గచ్ఛతస్తిష్ఠతశ్చైవ తస్యైవమ భవద్ధృది
వినోదాయ విచిత్తస్య కథా స్వమనసా సహ. 11

నడచుచున్నను, కదలుచున్నను, కూర్చొనుచున్నను, లీలామాత్రమున వానిహృదయమున మనస్సుతోఁటి చిత్తమున క్రింది విచారణయెల్లపుడు జరుగుచుండెడిది.

అవ్యయేన్ద్రియవర్గేశ మనః శమవతా త్వయా
పశ్యానన్దసుఖం కీదృగ్విధమాసాదితం తతమ్. 12

చపలశ్రేష్ఠుఁడగు నో మనసా! మున్ముందును నీవీ రాగరహితస్థితినే యవలంబించి నీ చాపల్యమును విడనాడవలసియుండును.

ఏషైవావిరతం తస్మాన్నీరాగైవ దశా త్వయా
అవలమ్బ్య పరిత్యాజ్యం చాపలం చలతాం వర. 13

భోభో ఇన్ద్రియచౌరా హే హతాశా హతనామకాః
యుష్మాకం నాయమాత్మాస్తి న భవన్తస్తథాత్మనః. 14

వ్రజతాం వో వినాశాంశమాశా వో విఫలీకృతాః
న సమర్థాః సమాక్రాన్తౌ భవన్తో భఙ్గురాశ్రయాః. 15

ఓ యింద్రియచోరులారా! హతుఁడవగు నోయాశా! ఈ యాత్మ మీదికాదు. మీ రాత్మకును జెందరు. ఆత్మతోఁటి సంబంధము లేకయున్నందుననే మీరు వినాశంబొందిరి. మీయాశలన్నియు వ్యర్థములైనవి. అట్టి విఫలులగు మీరు నాపై యాక్రమణమునల్ప సమర్థులు కారు.

వయమాత్మేతి యైషా వో బభూవ కిల వాసనా
తత్త్వవిస్మృతిజాతా హి దృష్టరజ్జుభుజఙ్గవత్. 16

'మేమాత్మ'యనునట్టి మీయీవాసన, త్రాటియందు సర్పమువలె ఆత్మతత్వవిస్మరణముచేతనే గల్గినది.

అనాత్మన్యాత్మతా సైషా సైషా వస్తున్యవస్తుతా
అవిచారేణ వై జాతా విచారేణ క్షయం గతా. 17

ఇదియే అనాత్మయందలి ఆత్మత్వము; వస్తువునందలి అవస్తుత్వము; అవిచారముచే నిది జనించినది, విచారముచే నశించినది.

భవన్తోఽన్యే వయం చాన్యే బ్రహ్మన్యత్కర్తృతా పరా
అన్యో భోక్తాన్య ఆదత్తే కో దోషః కస్య కీదృశః. 18

ఓ యింద్రియములారా! కరణభూతులగు మీరు వేఱు, అభిమానించునట్టి మేము వేఱు. ఆశ్రితమగు బ్రహ్మము వేఱు, ప్రాణప్రేరితమగు క్రియాకారణత్వము వేఱు. భోక్తయగు చిదాభాసుడు వేఱు, గ్రహించునట్టి మనస్సు వేఱు అట్టిచోఁ దేనికేదోష మెవ్విధమున గలదు?



వనేభ్యో దారు సంజాతం రజ్జవో వేణుచర్మణః
వాసీ చాయః ఫలాన్యేవ తక్ష్ణో గ్రాసార్థముద్యతః. 19

ఇత్థం యథేహ సామగ్ర్యా స్వశక్తిస్థపదార్థయా
సంపన్నా కాకతాలీయా దృఢా వరగృహాకృతిః. 20

సంపన్నాః కాకతాలీయాత్స్వశక్తినియతేన్ద్రియాః
తథైవ కలికాలోలం కేవ కస్యాత్ర ఖణ్డనా. 21

అరణ్యములందు కాష్ఠము లుద్భవించుచున్నవి. వెదురుచర్మముతో వానిఁగట్టుటకు త్రాడు యల్లబడుచున్నది. గొడ్డలి, బాడిస మున్నగు పనిముట్లు యినుమునుండి యేర్పడుచున్నవి. వడ్రంగి తన యుదరపోషణార్థమే కార్యమందు ప్రవృత్తుఁడగుచున్నాడుగాని గృహనిర్మాణసిద్ధి కొఱకుగాదు. ఇట్లు తమతమశక్తిననుసరించి వేఱువేఱు ప్రయోజనములుగల క్రియాకారకసామగ్రిచే కాకతాళీయముగ దృఢమైన యావరణగల గృహమేర్పడుచున్నది. అట్లనే యీ శరీరమునను, కార్యకారణసంఘాతమున దర్శన, శ్రవణ, వచన, ఆదానాది ఫలరూపములగు ఆయా తమతమశక్తులచే జ్ఞాన, కర్మేంద్రియములు నియమింపబడ కాకతాళీయముగ వ్యవహారకార్యము సిద్ధించుచున్నది. ఇట్లుండనిక దీనియందెవని కేమినష్టము గలదు?

విస్మృతిర్విస్మృతా దూరం స్మృతిః స్ఫుటమనుస్మృతా
సత్సజ్జాతమసచ్చాసత్క్షతం క్షీణం స్థితం స్థితమ్. 22

ఇప్రుడవిద్య పూర్ణముగ విస్మరింపబడినది. ఆత్మవిద్య స్పష్టముగ స్మృతికి వచ్చినది. సత్తు సత్తైనది అసత్తు అసత్తైనది. విఘ్నములు నశించినవి ఉండదగినదేదియో, అదిగేయున్నది.

ఏవంవిధేన భగవాన్విచారేణ మహాతపాః
సోఽతిష్ఠన్మునిశార్దూలో బహూన్వర్షగణానిహ. 23

ఓ రామా! మునిశ్రేష్ఠుఁడును, మహాతపస్వియునగు వీతహవ్యుడిట్టి విచారణతోఁగూడి పెక్కువత్సరములీ ప్రపంచమున కాలముగడపెను.

అపునర్భవనాయైవ యత్ర చిన్తాన్తమాగతా
మూఢతా చ సుదూరస్థా తత్రాసావవసత్సదా. 24

ఆపిమ్మట మఱల పునరాగమనము లేకుండుటకై యాతడు చిన్తారహితమై, అజ్ఞానవర్జితమైనట్టి బ్రహ్మపదమున సదా స్థితిబొందెను.

యథా భూతపదార్థౌఘదర్శనోత్థమనర్థకమ్
ధ్యానాశ్వాసనమాలమ్బ్య సోఽవసత్సుఖగః సదా. 25

ఆయా సహజరూపములనున్న పదార్థములనుండి గల్గు యనర్థములను వారించుటకై ధ్యానయోగము నవలంబించి సదా యాత్మసుఖముననే నాతడు పొందుచునుండెను.

హేయాదేయసమాసఙ్గత్యాగాదానదృశోః క్షయే
వీతహవ్యమునేరాసీదిచ్ఛానిచ్ఛాతిగం మనః 26

త్యాజ్యగ్రాహ్య పదార్థములు సంప్రాప్తించినను, గ్రహణత్యాగదృష్టి నశించినందున యా వీతరాగుని మనంబు యిచ్ఛానిచ్ఛల కతీతమైయుండెను.

విదేహకేవలీభావే సీమాన్తే జన్మకర్మణామ్
సంసారసఙ్గసంత్యాగరసాసవనవేచ్ఛయా. 27
వివేశ స తమైవాస్తే సహ్యాద్రౌ హేమకన్దరమ్
అపునః సఙ్గమాయాసు జగజ్జాలమవేక్ష్య సః. 28
బద్ధపద్మాసనః స్థిత్వా తత్రోవాచాత్మనాత్మని

విదేహకేవలీభావరూపమును, జన్మకర్మవివర్జితమును, సంసారసంగపరిత్యాగముచే నవశిష్టమునగు బ్రహ్మసందరసామృతమునందు నూతనేచ్ఛగల్గి యాతడు సహ్యాపర్వతకందరమునఁ బ్రవేశించెను. మఱియుని జగజ్జాలమును వీక్షించి, యద్దానితో సంగము లేకుండుటకై, పద్మాసనమున గూర్చొని తనలో తానిట్లు ప్రసంగించుకొనెను.

రాగ నీరాగతాం గచ్ఛ ద్వేష నిర్ద్వేషతాం వ్రజ. 29
భవద్భ్యాం సుచిరం కాలమిహ ప్రక్రీడితం మయా

ఓ రాగమా! నీవిపుడు నీరాగత్వమును బొందుము. ఓ ద్వేషమా! నీవిపుడు నిర్ద్వేషత్వము జెందుము మీరిరువురతోటి నేను బహుకాలము క్రీడించియుంటిని.

భోగా నమోస్తు యుష్మభ్యం జన్మకోటిశతాన్యహమ్. 30
భవద్భిర్లాలితో లోకే లాలకైరివ బాలకః

ఓ భోగములారా! మీకు నమస్కారము. లాలనచేయు మాతాపితరులచే బాలకునివలె, కోట్లకొలఁది జన్మలవఱకును నేను మీచే పాలింపబడితిని.

ఇమామపి పరాం పుణ్యాం నిర్వాణపదవీమహమ్. 31
యేన విస్మారితస్తస్మై సుఖాయాస్తు నమోనమః

పరమపవిత్రమగు యీ నిర్వాణపదమును మఱపింపజేసినట్టి విషయసుఖమునకు నమస్కారము.

త్వదుత్తప్తేన హే దుఃఖ మయాత్మాన్విష్ట ఆదరాత్. 32
తస్మాత్త్వదుపదిష్టోఽయం మార్గో మమ నమోస్తు తే
త్వత్ప్రసాదేన లబ్ధేయం శీతలా పదవీ మయా. 33
దుఃఖనామ్నే దుఃఖతత్త్వ సుఖదాత్మన్నమోస్తు తే

ఓ దుఃఖమా! నీచే సంతప్తుడనై నేనాదరమున నాత్మనన్వేషించితిని. ఈ యాత్మమార్గోపదేశమును నీవే నాకొసంగితివి. కాన నీకున్ను నమస్కృతులు. నీ కృపచేతనే యీ శాంతమగు ఆత్మపదమును నాకు లభించినది. దుఃఖనామంబున బరగు సుఖప్రదుండవగు నోదుఃఖతత్త్వమా! నీకు వందనములు.



కల్యాణమస్తు తే మిత్ర సంసారాసార జీవిత. 34
దేహస్థితిరియం యామో వయమాత్మీయమాస్పదమ్
ప్రయోజనానాం జన్తూనామహో ను విషమా గతిః 35
దేహేనాపి వియుజ్యేఽహం భూత్వా జన్మశతాన్యపి
మిత్రకాయ మయా యత్త్వం త్యజ్యసే చిరబాన్ధవః. 36
త్వమేవాత్మన్యుపానీతా సాత్మజ్ఞానవశాత్క్షతిః
అధిగమ్యాత్మవిజ్ఞానమాత్మనాశః కృతస్త్వయా. 37
దేహ నాన్యేన భగ్నోఽసి త్వమేవైతదుపాసితమ్

ప్రపంచమున అసారమగు జీవితముగల నోదేహమిత్రమా! నీకృపవలననే ఆత్మజ్ఞానము లభించియున్నదిగాన నీకు శుభమగుగాక! ఓదేహమా! నేనిపుడు బ్రహ్మపదమునకేతెంచుచున్నాను. నీయొక్కయు, నాయొక్కయు ఈవియోగస్థితి అనాదియగు నియతియొక్క స్వభావమైయున్నది. జీవుల స్వార్థగతి అతివిషమమైనది. ఏలన, అనేకవందలజన్మలందు నీతోగూడియుండి యిపుడు నేను వేఱగుచున్నాను. మిత్రుడవగు నోదేహమా! చిరకాలబంధునగు నిన్ను నే త్యజించుట స్వార్థలీలయే యగును. ఆత్మజ్ఞానవశమున నీవే నీకు హానియొనర్చుకొంటివి. ఆత్మభావమునొంది నిన్ను నీవు నశింపజేసికొనినావు. నీ వెవనిచేతను నశింపబడలేదు. నీవే నిన్ను నాశమొనర్చుకొంటివి.

ఏకాకిన్యాపి శుష్యన్త్యా ప్రశాన్తే మయి దీనయా. 38
త్వయా దుఃఖం న కర్తవ్యం మాతతృష్ణే వ్రజామ్యహమ్

తల్లీ! తృష్ణా! నేను శాంతినొంద, నీవొంటరిదానవై, శుష్కించుచు, దీనత్వముచే దుఃఖింపవలదు. నేనిపుడు వెడలుచున్నాను.

క్షన్తవ్యాః కామ భగవన్విపరీతాపరాధజాః. 39
దోషా ఉపశమైకాన్తం వ్రజామ్యాదిశ మఙ్గలమ్

దేవా! కామమా! నీవినాశమునకై నేను వైరాగ్యాదుల నవలంబించితిని. అయ్యపరాధములవలన గల్గిన దోషములను మన్నింపవలెను.

చిరాచ్చిరాయ చేదానీమస్తు తృష్ణే శిలావయోః. 40
వియోగో యోగదోషేణ ప్రణామోఽయం స పశ్చిమః

తల్లీ! తృష్ణా! నీదోషకారణమున యిపుడు మన యిద్దరకును శాశ్వతవియోగము సంభవించినది. ఇదిగో నీకు నా యంతిమప్రణామము.

నమః సుకృతదేవాయ భవతేఽస్తు త్వయా పురా. 41
నరకేభ్యః సముత్తార్య స్వర్గేఽహమిభియోజితః

దేవా! సుకృతమా! నీకు నమస్కారము. పూర్వము నీవు నరకములనుండి లేవనెత్తి నన్ను స్వర్గమునకు బంపియుంటివి.

దుష్కార్యక్షేత్రరూఢాయ నరకస్కన్ధవాహినే. 42
యాతనాపుష్పభారాయ నమో దుష్కృతశాఖినే
యేన సార్థం చిరం బహ్వ్యో భుక్తాః ప్రాకృతయోనయః. 43

దుష్క్రియలను క్షేత్రమున జనించి, నరకములను విశాలశాఖలుగల్గి, నరకయాతనలను పుష్పభారమును వహించునట్టి 'పాప' వృక్షమునకు నమస్కారము. దీనితోగూడి చిరకాలము నేనే నేక నీచజన్మల ననుభవించితిని.

అద్యప్రభృత్యదృశ్యాయ తస్మై మోహాత్మనే నమః
ప్రధ్వనద్వంశమధురవచసే పత్రవాససే. 44
నమో గుహాతపస్విన్యై వయస్యాయై సమాధిషు
సంసారధ్వని ఖిన్నస్య త్వం మమాశ్వాసకారణమ్. 45
ఆసీర్వయస్యా సుస్నిగ్ధా సర్వలోభాపహారిణీ
సర్వసంకటఖిన్నేన దోషేభ్యో ద్రవతా మయా. 46
త్వమేకా శోకనాశార్థమాశ్రితా పరమా సఖీ

నేటినుండి యదృశ్యమైనట్టి మోహమునకు నమస్కారము. వేణునాదమను మధురవాక్కులు గలదియు, వ్రాలిన యాకులను వస్త్రములుగలదియు, సమాధియందు సఖివలె బరగినదియునగు గుహాయను తపస్వినికి నమస్కారము. పూర్ణానందస్వరూపమగు ఆత్మయందు విశ్రాంతి కలుగజేయుటద్వారా లోభమంతయు హరింపజేసినట్టి నీవు నాయందతిస్నేహము గల్గినసఖివి. సంకటములచే ఖిన్నుడనై, సమాధివిఘ్నములచే ద్రవీభూతుడనై నేను తచ్ఛోకవినాశార్థము పరమసఖివగు నిన్నాశ్రయించితిని.

సంకటావటకుఞ్జేషు హస్తాలమ్బనదాయినే. 47
వార్ధకైకాన్తసుహృదే దణ్డకాష్ఠాయ తే నమః

గోతులందును, అరణ్యకుంజములందును చేతికాలంబన మొసగునదియు, వార్ధక్యమున పరమమిత్రుని వంటిదియునగు దండమునకు నమస్కారము.

అస్థిపఞ్జరమాత్మీయం తథా రక్తాన్త్రితన్తుకమ్. 48
ఏతావన్మాత్రసారైకం గృహీత్వా గచ్ఛ దేహక
పయఃక్షోభప్రకారేభ్యః స్నానేభ్యోఽపి నమోస్తు తే. 49
నమోస్తు వ్యవహారేభ్యః సంసృతిభ్యో నమోస్తు తే

ఓ దేహమా! అస్థిపంజరము, రక్తము, దారములవంటి ప్రేవులు - ఇవియే ముఖ్యతత్త్వము గాగల నీవు వాటిని గ్రహించి నీప్రకృతియొద్దకు బొమ్ము. నీనుండి వెడలు మల, దుర్గంధ, స్వేదాది జలప్రకోపముల వారించి నిన్ను పవిత్రవంతముగ జేయునట్టి స్నానములకు నమస్కారము. మఱియు భోజన, శయన, వ్యవహారములకును, వానికొఱకగు గమనాదిక్రియలకునుగూడ నానమస్కారము.

ఏతే భవన్తః సహజాః ప్రాక్తనాః సుహృదో మమ. 50



క్రమేణాద్యోత్కృతాః ప్రాణాః స్వస్తి వోఽస్తు వ్రజామ్యహమ్
భవద్భిః సహ చిత్రాసు మయా బహ్వీషు యోనిషు. 51
విశ్రాన్తం గిరికుఞ్జేషు భ్రాన్తం లోకాన్తరేషు చ
క్రీడితం పురపీఠాన్తరుషితం పర్వతేషు చ. 52
స్థితం కార్యవిలాసేషు ప్రస్థితం వివిధాధ్వసు
న తదస్తి జగత్కోశే భవద్భిః సహ యన్మయా. 53
న కృతం న హృతం యాతం న దత్తం నావలమ్బితమ్
ఇదానీం స్వాం దిశం యాన్తు భవన్తో యామ్యహం ప్రియాః. 54

ఓ ప్రాణములారా! మీరు నాపూర్వకాలిక సహజమిత్రులు. ఇపుడు నేగావించు యీ మిత్రులసందనక్రమమున మీరున్ను లెస్సగ సత్కరింపబడితిరి. మీకు శుభమగుగాక! నేనిపుడు వెడలుచున్నాను. మీతోగూడి నేననేక విచిత్రయోనులందు విశ్రమించితిని. పర్వతకుంజములందును, లోకాంతరములందును విహరించితిని. సిద్ధుల క్షేత్రములందు క్రీడించితిని, పర్వతములందు వసించితిని. కార్యవిలాసములం బాల్గొంటిని. వివిధమార్గములందు జరించితిని. వెయ్యేల, ఈప్రపంచమున మీతోగూడి నేనొర్పని కార్యమేలేదు మీతోగూడి హరింపనిదియు, విహరింపనిదియు, గ్రహింపనిదియు, త్యజింపనిదియు లేదు. ప్రియులగు నో ప్రాణములారా! ఇపుడు మీరు మీ ప్రకృతియొద్దకు జనుడు. నేను బ్రహ్మపదమున కేగుచున్నాను.

సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః
సంయోగా విప్రయోగాన్తాః సర్వే సంసారవర్త్మని. 55

సమస్తమైన యో ప్రాణములారా! ఈ ప్రపంచమున యెచ్చోటనున్న సంచయమొనర్పబడినవస్తువు నాశమొందును. ఉన్నతములైనవి తప్పక నిమ్నస్థానము జెందును. సంయోగము గలవి తప్పక వియోగము నొందును,

అయం చాక్షుష ఆలోకో విశత్వాదిత్యమణ్డలమ్
విశన్తు వనపుష్పాణి సౌగన్ధ్యాన్యన్ధసంవిదః. 56
ప్రాణానిలస్తథా స్పన్దం విశత్వద్య పరిభఞ్జనమ్
విశన్త్వాకాశకుహరం శబ్దశ్రవణశక్తయః 57
ఇన్దుమణ్డలమాయాన్తు రసనారసశక్తయః

ఈనా నేత్రప్రకాశము సూర్యమండలమున బ్రవేశించుగాక! ఘ్రాణేంద్రియము భూమిని జొచ్చుగాక! ప్రాణవాయు, స్పందములు మహాకాశమున బ్రవేశించుగాక! కర్ణేంద్రియము ఆకాశబిలమును జేరుగాక! జిహ్వేంద్రియముయొక్క రసనశక్తి జలమయమగు చంద్రమండలమునఁ బ్రవిష్టమగునుగాక! (అనగా పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు, పంచప్రాణములు వాటి వాటి ప్రకృతులందు లీనమైపోవుగాక యని యర్థము.)

నిర్మన్దర ఇవామ్భోధిరతార్క ఇవ వాసరః. 58

సరదీవ ఘనః స్వైరం ప్రాప్తః కల్పాన్త సర్గవత్

ఓంకారాన్తే స్వమననం ప్రశామ్యామ్యాత్మనాత్మని

దగ్ధేన్ధన ఇవార్చిష్మాన్నిఃస్నేహ ఇవ దీపకః. 59

ఆత్మయగు నేను మందరపర్వతములేని సముద్రమువలెను, సూర్యుడులేని పగలువలెను, శరత్కాలమున తన యుపాదానకారణమున లయించిన మేఘమువలెను, కల్పాంతమందలి సృష్టివలెను, కట్టెలులేని అగ్నివలెను, తైలములేని దీపమువలెను, ఓంకారార్ధమాత్రయొక్క లక్ష్యభూతమైన బ్రహ్మరూపమగు ఆత్మయందు శాంతినొందుచున్నాను.

వ్యపగతాఖిలకార్యపరమ్పరః

సకలదృశ్యదశాతిగతస్థితిః,

ప్రణవశాన్త్యనుసంస్మృతిశాన్తధీ

ర్విగతమోహమలోఽయమహం స్థితః. 60

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే షూపశమప్రకరణే ఇన్ద్రియవర్గనిరాకరణోపదేశో నామ షడశీతితమః సర్గః ॥ 86 ॥

సర్వకార్యపరంపరావర్జితుడనై, సర్వదృశ్యాతీతుడనై, ఉచ్చస్వరమున ప్రణవము నుచ్చరించుచు, బ్రహ్మరంధ్రమున శాంత్యనుసరణము గావించుటచే బ్రహ్మైకాత్మ్యమునొంది, శాంతుడనై, మోహరహితుడనై, నేనాత్మయందు పూర్ణరీతి స్థితిగల్గియున్నాను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున ఇంద్రియవర్గనిరాకరణోపదేశమను షడశీతితమ సర్గము ॥ 86 ॥

---

## సప్తాశీతితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ఏవం కలితవానన్తః ప్రశాన్తమననైషణః

శనైరుచ్చారయంస్తారం ప్రణవం ప్రాప్తభూమికః. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! ఇట్లు మననవర్జితుడై, సర్వేచ్ఛారహితుడై యా మునీంద్రుడు ప్రణవము నుచ్చస్వరమున మెల్లమెల్లగ నుచ్చరించుచు ఆఱవ, లేక ఏడవభూమికను పొంది, స్వహృదయమున బ్రహ్మమును ప్రాప్తినొందెను.

మాత్రాదిపాదభేదేన ప్రణవం సంస్మరన్యతిః

అధ్యారోపాపవాదేన స్వరూపం శుద్ధమవ్యయమ్. 2



సబాహ్యాభ్యన్తరాన్భాగాన్స్థూలాన్సూక్ష్మతరానపి

త్రైలోక్యసంభవాంస్త్యక్త్వా సంకల్పాకల్పకల్పితాన్. 3

తిష్ఠన్నక్షుభితాకారశ్చిన్తామణిరివాత్మని

సంపూర్ణ ఇవ శీతాంశుర్విశ్రాన్త ఇవ మన్దరః. 4

కుమ్భకారగృహే చక్రం సంరోధిత ఇవ భ్రమాత్

అమ్భోధిరివ సంపూర్ణస్తిమితస్ఫారనిర్మలః. 5

శాన్తతేజస్తమః పుఞ్జం విగతార్కేన్దుతారకమ్

అధూమాభ్రరజః స్వచ్ఛమనన్తం శరదీవ ఖమ్. 6

సహ ప్రణవపర్యన్తదీర్ఘనిఃస్వనతన్తునా

జహౌ విన్ద్రియతన్మాత్రజాలం గన్ధమివానిలః. 7

అకార, ఉకార, మకార, అర్ధమాత్రలచే కల్పితములైన స్థూల, సూక్ష్మ, అవ్యాకృత, తురీయ పాదభేదములచే ప్రణవమును స్మరించుచు, విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృత లక్షణములు గల పాదములందు తురీయమున మొట్టమొదట జాగరితస్థానమగు బహిఃప్రజ్ఞగలదు, అని యిట్లు వేదోక్తప్రకారము అధ్యారోపముచేతను, పిదప 'అంతఃప్రజ్ఞగాని, బహిఃప్రజ్ఞగాని లేదని' యిట్లు అపవాదముచేతను, ముల్లోకములకుత్పత్తిస్థానములును, సంకల్పముచే కల్పాంతములకు కల్పింపబడినవియునగు స్థూలసూక్ష్మకారణములయొక్క బాహ్యాభ్యంతర భాగములఁ ద్యజించి శుద్ధమై, అవ్యయమై, ప్రకాశాంధకారరహితమై, సూర్య చంద్రనక్షత్రవర్జితమై, ధూమ, ధూళి, మేఘరహితమై, నిర్మలమై, అనంతమైనట్టి శరదాకాశమువలెనున్న తనయాత్మను వీక్షించి, స్వయముగ నాతడు క్షోభారహితుడై, చింతామణివలెను, పూర్ణచంద్రునివలెను, విశ్రాంత మందరపర్వతమువలెను, చలనముడిన చక్రమువలెను, బ్రహ్మకారగృహమున, శాంత, నిర్మల, పూర్ణసముద్రవలె, పైనదెల్పిన తురీయాత్మయందు స్థితిగల్గియుండుచు, గంధమును వాయువు త్యజించునట్లు, దీర్ఘప్రణవనాదమను సూత్రముతో సహా ఇంద్రియతన్మాత్రజాలమును పరిత్యజించెను.

తతో జహౌ తమోమాత్రం ప్రతిభాతమివామ్బరే

ఉత్తిష్ఠత్ప్రిస్ఫురద్రూపం ప్రాజ్ఞః కోపలవం యథా. 8

ఆకాశమున ప్రకాశము సంత్యక్తమగునట్లును, బుద్ధిమంతుడు కోపమును త్యజించునట్లును, సాక్షిచే స్ఫురించునట్టిరూపముగల తమోమాత్రము నాతడపుడు త్యజించెను.

ప్రతిభాతం తతస్తేజో నిమేషార్ధం విచార్య సః

జహౌ బభూవ చ తదా న తమో న ప్రకాశకమ్. 9

అపిమ్మట ప్రకాశమావిర్భవించెను. కాని, విచారణచే నిమేషార్ధభాగములో యాతడద్దానినికూడ త్యజించివైచెను. అత్తఱి తమస్సుగాని ప్రకాశముగాని లేకుండెను.

తామవస్థామథాసాద్య మనసా తన్మనస్తృణమ్

మనాగపి ప్రస్ఫురితం నిమిషార్ధాదశాతయత్. 10

అట్లు తమఃప్రకాశరహితమగు స్థితిఁబొంది, కల్పనాహేతువై కొంచెముస్ఫురించినట్టి మనస్సను తృణము నాతడు నిమేషార్ధమున ఛేదించివైచెను.

తతోఽజ్ఞ సంవిదం స్వస్థాం ప్రతిభాసముపాగతామ్
సద్యో జాతశిశుజ్ఞానసమానకలనామలమ్. 11

నిమేషార్ధార్ధభాగేన కాలేన కలనాం ప్రభుః
జహౌ చితశ్చైత్యదశాం స్పన్దశక్తిమివానిలః. 12

తదుపరి గాలిలేనిచోటనున్న దీపమువలె స్ఫుటప్రకాశరూపమొందిన సంవిత్తు నాలంబనముగఁగైకొని తత్కాలజనితమగు బాలకపరిజ్ఞానమువంటి యీ కల్పనను నిమేషార్ధభాగమున నాతడు త్యజించివైచెను. ఇదియే చైతన్యముయొక్క విషయదశను పరిత్యజించుటయగును.

పశ్యన్తీపదమాసాద్య సత్తామాత్రాత్మకం తతః
ప్రసుప్తపదమాలమ్బ్య తస్థౌ గిరిరివాచలః. 13

ఇవ్విధమున సాక్షిమాత్రమున శేషించిన 'పశ్యంతీ' పదమునొంది, యాపిదప సత్తామాత్రపదముఁ జెందెను. పిదప సుషుప్తపదమవలంబించి పర్వతమువలె నిశ్చలముగ నుండెను.

తతః సుషుప్తసంస్థానం స్థిత్వా స్థిత్వా విభుర్మనాక్
సుషుప్తే స్థైర్యమాసాద్య తుర్యరూపముపాయయౌ. 14

ఆపిమ్మట సమర్థుడగు నాముని కొంచెముకొంచెము సేపు సుషుప్తపదమందుండుచు, యీవ్విధమున నటస్థిరత్వమునడసి యాపిదప తురీయపదమొందెను.

నిరానన్దోఽపి సానన్దః సచ్చాసచ్చాపి తత్ర సః
ఆసీన్న కించిత్కించిత్త్రప్రకాశస్తిమిరం యథా. 15

ఆతురీయస్థితియందాతడు విషయానందరహితుడైయు స్వస్వరూపానందసహితుడును, అన్యసత్తారహితుడైనను ఆత్మసత్తాసహితుడును, అన్యరూపరహితుడైనను, స్వస్వరూపయుతుఁడును నై యుండెను.

అచిన్మయం చిన్మయం చ నేతినేతి యదుచ్యతే
తత్తత్సంబభూవాసౌ యద్గిరామప్యగోచరః. 16

ఓరామా! ప్రకాశ్యవిషయములేనందున అచిన్మయమును, కాని స్వయముగ చిన్మయమును, 'ఇదికాదు, ఇదికాద'ని వచింపబడునదియునగు వాగగోచరమగు స్థితినాతడు పొందెను.

తదసౌ సుసమం స్ఫారం పదం పరమపావనమ్
సర్వభావాన్తరగతమభూత్సర్వవివర్జితమ్. 17

ఆతడు మిగుల సమమును, విశాలమును, పరమపవిత్రమును, సర్వపదార్థాంతర్గతమును, సర్వవస్తువివర్జితమునునగు బ్రహ్మరూపుఁడయ్యె.

యచ్ఛూన్యవాదినాం శూన్యం బ్రహ్మ బ్రహ్మవిదాం వరమ్
విజ్ఞానమాత్రం విజ్ఞానవిదాం యదమలం పదమ్. 18



పురుషః సాంఖ్యదృష్టీనామీశ్వరో యోగవాదినామ్.
శివః శశికలాఙ్కానాం కాలః కాలైకవాదినామ్. 19

ఆత్మాత్మనస్తద్విదుషాం నైరాత్మ్యం తాదృశాత్మనామ్
మధ్యం మాధ్యమికానాం చ సర్వం సుసమచేతసామ్. 20

ఏది శూన్యవాదులకు శూన్యమో, బ్రహ్మవేత్తలకు బ్రహ్మమో, విజ్ఞానవాదులకు ని[illegible]మో, సాంఖ్యవాదులకు పురుషుడో, యోగవాదుల కీశ్వరుడో, శైవులకు శివుడో, [illegible]మో, సౌతాంత్రిక వైభాషికులకు నైరాత్మ్యమో, మాధ్యమికులకు చిదచిన్మధ్యము[illegible]శ్యమాత్రమో, జీవన్ముక్తులకు సర్వరూపమో, అట్టి సద్రూపమై యాతడు చెన్నొందెను.

యత్సర్వశాస్త్రసిద్ధాన్తో యత్సర్వహృదయానుగమ్
యత్సర్వం సర్వగం సార్వం యత్తత్తత్సదసౌ స్థితః. 21

మఱియు, షట్ఛాస్త్రసిద్ధాంతమును, సర్వహృదయస్థమును, సర్వస్వరూపమును, సర్వవ్యాపకమును, సర్వతత్వమునునగు సద్రూపమై యాతడు విరాజిల్లుచుండెను.

యదనుత్తమనిఃస్పన్దం దీప్యతే తేజసామపి
స్వానుభూత్యైకమాత్రం యద్యత్తత్తత్సదసౌ స్థితః 22

సర్వథా నిష్క్రియమై, సూర్యాదిప్రకాశవస్తువులఁగూడ ప్రకాశింపజేయునదై, నిజానుభవరూపమైనట్టి సద్రూపమై యాతడుండెను.

యదేకం చాప్యనేకం చసాఞ్జనం చ నిరఞ్జనమ్.
యత్సర్వం చాప్యసర్వం చ యత్తత్తత్సదసౌ స్థితః. 23

స్వయముగ యేకమును, ఉపాధిభేదముచే యనేకమును, మాయాభేదముచే రాగయుక్తమును, శుద్ధరూపమున రాగరహితమును, సర్వరూపమును, సర్వమునకు భిన్నమునునగు సద్రూపమై యాతడుండెను.

అజమజరమనాద్యనేకమేకం
పదమమలం సకలం చ నిష్కలం చ,
స్థిత ఇతి స తదా నభఃస్వరూపా
దపి విమలసితిరీశ్వరః క్షణేన. 24

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయేషూపశమప్రకరణే వీతహవ్యనిర్వాణో నామ
సప్తాశీతితమః సర్గః ॥ 87 ॥

ఆ వీతహవ్యుడు ముక్తులదృష్టియందు పైఁజెప్పినరీతి జన్మజరావర్జితమై, అనాదియై, ఏకమై, విమలమై, నిష్కలమైనట్టి ఆత్మపదస్థుడై యుండెను. బద్ధులదృష్టియందు క్షణములో నీశ్వరుఁడై కార్యవిభేదములచే యనేకరూపుడై, కళాసహితుడైయుండెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
వీతహవ్యనిర్వాణోపదేశమను సప్తాశీతితమ
సర్గము ॥ 87 ॥

---

## అష్టాశీతితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ప్రాప్య సంసృతిసీమాన్తం దుఃఖాబ్ధేః పారమాగతః
వీతహవ్యః శశామైవమపునర్జననే మునిః. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామా! పైజెప్పిన విధమున సంసారసీమాంతమొంది దుఃఖసాగరమును దాటిన వీతహవ్యముని, పూర్ణమనోనాశంబుచే పరబ్రహ్మమున లీనుడయ్యె.

తస్మింస్తథోపశాన్తే హి పరాం నిర్వృతిమాగతే
పయఃకణ ఇవామ్భోధౌ స్వే పదే పరిణామిని. 2

తత్రైవ తిష్ఠన్నిఃస్పన్దః స కాయో మ్లానిమాయయౌ
అన్తర్నీరసతాం ప్రాప్య మార్గశీర్షాన్తపద్మవత్. 3

అట్లా ముని ప్రశాంతినొంది, పరమనిర్వృతి జెందుచు, సముద్రమున జలబిందువువలె పరిణామరహితమగు స్వాత్మపదమున యుండుచుండ, హేమంతకాలమున కమలము వాడునట్లు, లోన నీరసత్వమొంది, చేష్టారహితమై వాని శరీరమపుడు మ్లానిం బొందెను.

తస్య దేహద్రుమాన్తఃస్థం త్యక్త్వా హృన్నీడమాయయుః
ప్రోడ్డీయ విహగాయన్తో యన్త్రోన్ముక్తా ఇవాసవః. 4

అంత నమ్మునీంద్రుని ప్రాణపక్షి దేహమను వృక్షమందలి హృదయమను గూటిని వదలి, యంత్రమునుండి శిలవలె యెగిరిపోయెను.

భూతేష్వేవ ప్రతిష్ఠాని భూతాని సకలాన్యలమ్
మాంసాస్థియన్త్రదేహస్తు వనావనితలేఽవసత్. 5

చిదర్ణవప్రతిష్ఠా చిద్ధాతవో ధాతుషు స్థితాః
స్వే స్వరూపే స్థితం సర్వం మునావుపశమం గతే. 6

వాని దేహమందలి పంచభూతములన్నియు పంచభూతములందు పూర్ణముగ విలయమొందెను. మాంసాస్థిమయమగు యంత్రమువంటి వాని దేహము అరణ్యమందలి భూతలమున వసించె. చైతన్యము మహాచైతన్యసాగరమున బ్రవేశించె. రక్తమాంసమేదోమజ్జాది సప్తధాతువులు సప్తధాతువులందు లీనమయ్యె. అమ్ముని ప్రశమనమొందగ నన్నియు వాటివాటి కారణములందు [illegible]



ఏషా తే కథితా రామ విచారశతశాలినీ
విశ్రాన్తిర్వీతహవ్యస్య ప్రజ్ఞయైనాం వివేచయ. 7

ఓ రామా! ఇట్లు వివిధవిచారయుక్తమై శోభించు వీతహవ్యుని విశ్రాంతిం గూర్చిన యివ్విషయమును నీకెఱింగించితిని. ఇక నీవిద్దానిని నీస్వబుద్ధిచే వివేచింపుము.

ఏవంప్రకారయా చార్వ్యా స్వవిచారణయోద్ధయా
తత్త్వమాలోక్య తత్సారమాతిష్ఠోత్తిష్ఠ రాఘవ. 8

ఓ రాఘవా! లెమ్ము. పైవిధముగ నుత్తమవిచారణచే ప్రదీపితమైన యాత్మతత్త్వమును [illegible] సారమగు యద్దానియం దారూఢుండవుగమ్ము.

యదేతదఖిలం రామ భవతే వర్ణితం మయా
యదిదం వర్ణయామ్యద్య వర్ణయిష్యామి యచ్చ వా. 9

త్రికాలదర్శినా నిత్యం చిరం చ కిల జీవతా
విచారితం చ దృష్టం చ మయా తదఖిలం స్వయమ్. 10

ఓ రామా! ఈ నేను వర్ణించిచెప్పినది, చెప్పుచున్నది, చెప్పనున్నది. అంతయు త్రికాలదర్శియు, చిరంజీవియునైన నేను స్వయముగ నిత్యము విచారించి చూచినదేయైయున్నది.

తదేతామమలాం దృష్టిమవలమ్బ్య మహామతే
జ్ఞానమాసాదయ పరం జ్ఞానాన్ముక్తిర్హి లభ్యతే. 11

కాన మహామతివగునో రామా! ఇట్టి నిర్మలదృష్టి నవలంబించి నీవు జ్ఞానమును పొందుము. ఏలన, జ్ఞానముచేతనే ముక్తిలభించును.

జ్ఞానాన్నిర్దుఃఖతామేతి జ్ఞానాదజ్ఞానసంక్షయః
జ్ఞానాదేవ పరాసిద్ధిర్నాన్యస్మాద్రామ వస్తుతః. 12

ఓ రామా! జ్ఞానముచేతనే అజ్ఞానము నశించును. జ్ఞానముచేతనే పరమసిద్ధి లభించును. యథార్థముగనీ జ్ఞానముకంటె యుత్తమమైన దింకొకటి లేదు.

జ్ఞానేన సకలామాశాం వినికృత్య సమన్తతః
శాతితాశేషచిత్తాద్రిర్వీతహవ్యో మునీశ్వరః. 13

చూడుము, మునీశ్వరుండగు వీతహవ్యుడీ జ్ఞానముచేతనే ఆశలన్నింటిని తెగద్రుంచి, చిత్తమను పర్వతమును పూర్ణముగ ఛేదించివైచెను!

వీతహవ్యాత్మికా సంవిత్సంకల్పజగతీతి సా
అనుభూతవతీ దృశ్యమిదమేవ చ తజ్జగత్. 14

ఆ వీతహవ్యుని సంవిత్తు (జ్ఞానము) స్వహృదయమందలి బ్రహ్మమున యీ మన జగత్తును స్వసంకల్పజగద్రూపమున ననుభవించెను.

వీతహవ్యో మనోమాత్రం మనోహంత్వమి[illegible]య
మనో జగదిదం కృత్స్నమన్యతానన్యతే తు [illegible].

నేత్రాదీంద్రియములయొక్క యీ దృశ్యమున్ను, వీతహవ్యుడున్ను, సమస్తము మన మనోమాత్రమేయైయున్నది. ఈ గానుపించు నీవున్ను, నేనున్ను మన మనస్సుకంటె వేఱుగాము. ఈ ప్రపంచమంతయు మనోమాత్రమే. అట్టిచోనికి దానియందు స్వకీయమేమి? పరకీయమేమి?

అధిగతపరమార్థః క్షీణరాగాదిదోషః
సకలమలవికారోపాధిసఙ్గాద్యపేతః,
చిరమనుసృతమస్తః స్వం స్వభావం వివేకీ
పదమమలమనన్తం ప్రాప్తవాన్శాన్తశోకః. 16

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
మోక్షోపాయేషూపశమప్రకరణే వీతహవ్యవిశ్రాన్తిర్నామాష్టాశీతితమః
సర్గః ॥ 88 ॥

పరమార్థమును పొంది, రాగాదిదోషములులేక, అవిద్యాకామకర్మాది యే మాలిన్యము గాని, వాటిద్వారా గల్గు ఇంద్రియవికారములు గాని, స్థూలసూక్ష్మకారణ శరీరములుగాని, తజ్జనిత సంగములుగానిలేని శోకరహితుడును, వివేకియునైన వీతహవ్యుడు చిరకాల శ్రవణమననాదులచే స్వహృదయమున సాక్షాత్కరించుకొనిన స్వస్వభావరూపమగు నిర్మలయాత్మతత్వము నొందెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
వీతహవ్యవిశ్రాంతియను అష్టాశీతితమ
సర్గము ॥ 88 ॥

---

## ఏకోననవతితమః సర్గః.

---

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

వీతహవ్యవదాత్మానం నీత్వా విదితవేద్యతామ్
వీతరాగభయోద్వేగస్తిష్ఠ రాఘవ సర్వదా. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! వీతహవ్యునివలె నీవాత్మజ్ఞుడవై, రాగద్వేషభయక్రోధాది వర్జితుడవై, ఈ ప్రపంచమున సదా విహరింపుము.

త్రింశద్వర్షసహస్రాణి విజహార యథాసుఖమ్
వీతహవ్యో వీతశోకస్తథా విహర రాఘవ. 2

ఓ. రాఘవా! శోకరహితుడగు వీతహవ్యుడీ ప్రపంచమున ముప్పదివేల సంవత్సరములు సుఖపూర్వకముగ విహరించిన చందనమున నీవును విహరింపుము.

అన్యే చ రాజమునయో జ్ఞాతజ్ఞేయా మహాధియః
యథావసన్స్వరాష్ట్రే త్వం తథైవాస్వ మహామతే. 3



మహామతివగు నోరామా! మహాధీమంతులైన ఆత్మజ్ఞులగు యితర మునులున్ను తమతమ రాజ్యములందు మెలఁగిన విధముననే నీవును మెలంగుము.

సుఖదుఃఖక్రమైరాత్మా న కదాచన గృహ్యతే
సర్వగోఽపి మహాబాహో కిం ముధా పరిశోచసి. 4

మహాబాహుఁడవగు నోరామా! సుఖదుఃఖక్రమములచే ఆత్మయెన్నటికిని వశీభూతము గాదు. అట్టి సర్వవ్యాపియగు ఆత్మ నీవైయుండియు వ్యర్థముగ యేల దుఃఖమొందుచుంటివి?

బహవో విదితాత్మానో విహరన్తీహ భూతలే
న కేచన వశం యాన్తి దుఃఖస్యాజ్ఞ భవానివ. 5

ఓ రామా! అనేకులగు ఆత్మజ్ఞులీ ప్రపంచమునఁ జరించుచున్నారు. కాని నీవలె యొవరును దుఃఖములకు వశీభూతులగుటలేదు.

స్వస్థో భవ భవోదారః సమో భవ సుఖీభవ
సర్వగస్త్వం త్వమాత్మైవ తవ నాస్తి పునర్భవః. 6

ఓ రామా! నీవు స్వస్థుఁడవు గమ్ము. అంతఃకరణముచే సర్వత్యాగివి గమ్ము. సముఁడవై, సుఖవంతుడవై యుండుము. ఏలన, నీవు సర్వవ్యాపియగు ఆత్మవు. నీకు పునర్జన్మము లేదు.

హర్షామర్షవికారాణాం జీవన్ముక్తా భవాదృశాః
న కేచన వశం యాన్తి మృగేన్ద్రాః శిఖినామివ. 7

సింహములు నెమళ్లకు వశముగానట్లు జీవన్ముక్తులగు మహాత్ములెవరును నీవలె హర్షక్రోధాదివికారములకు వశులుగారు.

శ్రీరామ ఉవాచ:—

అనేనైవ ప్రసఙ్గేన సంశయోఽయం మమోదితః
శరత్కాల ఇవామ్భోదం తం మే త్వం తనుతాం నయ. 8

శ్రీరాముడు:—ఓ మహాత్మా! ఈసందర్భమున నాకొక సంశయము జనించినది. శరత్కాలము మేఘమును సూక్ష్మమొనర్చునట్లు, తామద్దానిని విచ్ఛిన్నమొనర్పవలెను.

జీవన్ముక్తశరీరాణాం కథమాత్మవిదాం వర
శక్తయో నేహ దృశ్యన్తే ఆకాశగమనాదికాః. 9

ఓ యాత్మవిద్వరా! జీవన్ముక్తులయందాకాశగమనాది శక్తులేల గన్పట్టుటలేదు?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఆకాశగమనాదీని యాన్యేతాని రఘూద్వహ
ప్రమాణితాః పదార్థానాం సహజాః ఖలు శక్తయః. 10

శ్రీవసిష్ఠుడు:—రఘుకులప్రదీపకుఁడవగు నోరామా! ఆకాశగమనాది సిద్ధులు అగ్నియొక్క ఊర్ధ్వజ్వలనమువలె పదార్థముల స్వాభావికశక్తులై యున్నవి.

యద్విచిత్రం క్రియాజాలం దృశ్యతే గమ్యతే పునః
రామ వస్తుస్వభావోఽసౌ న తదాత్మవిదాం మతమ్. 11

ఓ రామా! ఈ గన్పట్టునవియు, అనుభూతమగునవియునగు ఆకాశగమనాది విచిత్రక్రియా జాలములన్నియు పక్షి, మశకాదుల యాకాశగమనాదులవలె, ఆయాజీవుల దేహస్వభావములై యున్నవి. ఇవి ఆత్మజ్ఞానుల కిష్టముగావు.

అనాత్మవిదముక్తోఽపి నభోవిహరణాదికరమ్
ద్రవ్యకర్మక్రియాకాలశక్త్యా ప్రాప్నోతి రాఘవ. 12

ఆత్మజ్ఞానరహితుడైనను, ముక్తుడుకానివాడైనను, మణి, ఔషధాదులను ద్రవ్యశక్తిచేతను, మంత్రశక్తి చేతను, యోగాభ్యాసాదులను క్రియాశక్తిచేతను, వాటి పరిపాకమను కాలశక్తులచేతను, ఆకాశగమనాది సిద్ధులను పొందగల్గును.

నాత్మజ్ఞస్యైష విషయ ఆత్మజ్ఞో హ్యాత్మవాన్స్వయన్
ఆత్మనాత్మని సంతృప్తో నావిద్యామనుధావతి. 13

ఆకాశగమనాది సిద్ధులు ఆత్మజ్ఞు అభిలషింపదగినవి కావు. ఏలన, ఆత్మజ్ఞుడు స్వయముగ తన ఆత్మయందే సంతృప్తినొందును. అతడవిద్యనై పునకు బరువిడడు.

యే కేచన జగద్భావాస్తానవిద్యామయాన్విదుః
కథం తేషు కిలాత్మజ్ఞస్త్యక్తావిద్యో నిమజ్జతి. 14

ఈ ప్రపంచమునగల పదార్థములన్నియు అవిద్యామయములై యున్నవి. అట్టిచో, అవిద్యనద్యజించిన ఆత్మజ్ఞాని వాటియందేల మునుంగును.

అవిద్యాంశాన్ యే యుక్త్యా సాధయన్తి సుఖాత్మికామ్
తే హ్యవిద్యామయా ఏవ న త్వాత్మజ్ఞాస్తథాక్రమాః. 15

యోగాభ్యాసము మున్నగు పరిశ్రమలద్వారాలబ్ధమై, విషయసుఖముకొఱకేయగు ఆకాశగమనాదులు అవిద్యామయములేగాన ఆత్మజ్ఞానులు వాటి క్రమమునకు గడంగరు.

తత్త్వజ్ఞోవాప్యతత్త్వజ్ఞో యః కాలద్రవ్యకర్మభిః
యథాక్రమం ప్రయతతే తస్యార్థవత్త్వాది సిద్ధ్యతి. 16

ఆత్మజ్ఞానియైనను, అజ్ఞానియైనను, ద్రవ్య, కాల, క్రియాదులచే శాస్త్రోక్తక్రమమున యత్నించువానికి ఆకాశగమనాది సిద్ధులు కలుగును.

ఆత్మవానిహ సర్వస్మాదతీతో విగతైషణః
ఆత్మన్యేవ హి సంతుష్టో న కరోతి న చేహతే. 17

ఆత్మజ్ఞాని సమస్తమున కతీతుడై, ఇచ్ఛారహితుడై, స్వాత్మయందే నిత్యము సంతుష్టుడై యుండును. అతడు దేనిని వాంఛింపడు, దేనిని గావింపడు.

న తస్యార్థో నభోగత్యా న సిద్ధ్యా న చ భోగకైః
న ప్రభావేణ నో మానైర్నాశామరణజీవితైః. 18



అతనికి ఆకాశగమనములచేగాని, సిద్ధులచేగాని, తుచ్ఛములగు భోగములచేగాని, ప్రభావముచేగాని, మానముచేగాని, జీవనమరణములచేగాని యేప్రయోజనమునులేదు.

నిత్యతృప్తః ప్రశాన్తాత్మా వీతరాగో వివాసనః
ఆకాశసదృశాకారస్తజ్జ్ఞ ఆత్మని తిష్ఠతి. 19

ఆత్మజ్ఞుడు నిత్యతృప్తుడై, శాంతచిత్తుడై, రాగరహితుడై, వాసనావర్జితుడై, ఆకాశమువలె మహదాకారముగల్గి ఆత్మయందే నెలకొనియుండును.

అశఙ్కితోపయాతేన దుఃఖేన చ సుఖేన చ
తృప్యత్యపగతాసఙ్గో జీవేన మరణేన చ. 20

జీవనమరణములయందసంగుడైనట్టి ఆత్మజ్ఞాని అకస్మాత్తుగ సంప్రాప్తించు సుఖదుఃఖములచేనైనను తన స్వాభావికతృప్తిని వీడకయుండును.

సముద్రః సరితేవాన్తః క్రమసంప్రాప్తవస్తునా
సమేన విషమేణాపి తిష్ఠత్యాత్మానమర్చయన్. 21

ప్రతికూల, అనుకూల ప్రారబ్ధముచే సంప్రాప్తించు భోగ్యవస్తులచేగూడ యెప్పటియట్లె యాతడఖండాకారవృత్తిరూప పుష్పములచే ఆత్మను పూజించుచు, నదులచే సముద్రమువలె స్వాత్మయందే పరిపూర్ణుడై యుండును.

నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః. 22

అతనికి చేసినదానిచే ప్రయోజనముగాని, చేయనిదానిచే ప్రత్యవాయముగాని లేదు. మఱియు వానికి సర్వభూతములందును ప్రయోజననిమిత్త మాశ్రయింపదగిన దేమియునులేదు.

యస్తు వా భావితాత్మాపి సిద్ధిజాలాని వాఞ్ఛతి
స సిద్ధిసాధకైర్ద్రవ్యైస్తాని సాధయతి క్రమాత్. 23

సదా యాత్మజ్ఞానరహితుడైనను, సాధకద్రవ్యాదులచే సిద్ధుల నపేక్షించువాడు క్రమముగ వాటినవశ్యము పొందును.

సిద్ధ్యతీత్థమిదం యుక్త్యేత్యేవ నియతేః క్రమః
త్ర్యక్షాదిభిః సురవరైరన్యథీకర్తుం న శక్యతే. 24

మణిమంత్రాదియుక్తులచేతనే ఆకాశగమనాది సిద్ధులు గలుగుననుట ఆయాశాస్త్రముల యొక్క ప్రసిద్ధమైన నియతిక్రమమైయున్నది. ఈ నియతిక్రమము నుత్తమదేవతలుగాని, మహేశ్వరాదులుగాని మఱియొకవిధముగ చేయజాలరు.

స్వభావ ఏష వస్తూనాం స్వతఃసిద్ధిర్హి నాన్యతః
నియతిం న జహాత్యేవ శశాఙ్క ఇవ శీతతామ్. 25

దేవ, పక్ష్యాదులకును స్వయముగ గల యాకాశగమనాది సిద్ధులు వస్తుస్వభావములై యున్నవి. చంద్రుడు తనశీతలత్వమును త్యజింపనట్లు, అయ్యవి వాటివాటి నియతిని త్యజింపకుండును.

సర్వజ్ఞోఽపి బహుజ్ఞోఽపి మాధవోఽపి హరోఽపి చ
అన్యథా నియతిం కర్తుం న శక్తః కశ్చిదేవ హి. 26

సర్వజ్ఞుడైనను, బహుజ్ఞుడైనను, విష్ణువైనను, మహేశ్వరుడైనను, యెవరును నియతిని మఱియొకవిధముగ చేయజాలరు.

ద్రవ్యకాలక్రియామన్త్రప్రయోగానాం స్వభావజాః
ఏతాస్తాః శక్తయో రామ యద్వ్యోమగమనాదికమ్. 27

ఓ రామా! ఈ ఆకాశగమనాదులు ద్రవ్య, కాల, క్రియా, మంత్రప్రయోగముల స్వాభావికశక్తులై యున్నవి.

యథా విషాణి నిఘ్నన్తి మదయన్తి మధూని చ
వమయన్తి చ భుక్తాని మదనాని ఫలాని చ. 28
తథా స్వభావవశతో ద్రవ్యకాలక్రియాక్రమాః
నియతం సాధయన్త్యాశు ప్రయోగం యుక్తియోజితాః. 29

విషములు ప్రాణుల జంపునట్లును, మద్యము మత్తత గల్గజేయునట్లును, తేనెయు, ఉమ్మెత్తఫలమున్ను వమనముగలుగజేయునట్లును, వస్తుస్వభావముచే ద్రవ్య, కాల, క్రియాక్రమములు యోగాదులందు కుశలురగువారిచే నియతములైనట్టి సిద్ధులను గల్గజేయుచున్నవి.

ఏతస్మాత్సమతీతస్య త్యక్తావిద్యస్య రాఘవ
ఆత్మజ్ఞానస్య నాస్త్యత్ర కర్తృతాకర్తృతానఘ. 30

పాపరహితుడవగు నోరామా! ద్రవ్యకాలక్రియాక్రమరూపమగు అవిద్యకు పరమై, అవిద్యను త్యజించునట్టి ఆత్మజ్ఞానికి సిద్ధులవిషయమున కర్తృత్వముగాని, అకర్తృత్వముగాని యుండదు.

ద్రవ్యదేశక్రియాకాలయుక్తయఃసాధుసంవిదః
పరమాత్మపదప్రాప్తౌ నోపకుర్వన్తి కాశ్చన. 31

ద్రవ్య, దేశ, కాల, క్రియాదులు తత్వజ్ఞానజనితమగు పరమాత్మపదప్రాప్తియం దేమియు నుపకరింపవు.

యస్యేచ్ఛా విద్యతే కాచిత్స సిద్ధిం సాధయత్యలమ్
ఆత్మజ్ఞస్యతు పూర్ణస్య నేచ్ఛా సంభవతి క్వచిత్. 32

ఎవనికి కోర్కెయుండునో, యాతడే సిద్ధులను లెస్సగ సంపాదించును. కాని, ఎల్లప్పుడు పరిపూర్ణుడైయుండు ఆత్మజ్ఞానికే కోర్కెయు యుండనేరదు

సర్వేచ్ఛాజాలసంశాన్తావాత్మలాభోదయో హి యః
తద్విరుద్ధా కథం కస్మాదిచ్ఛా సంజాయతేఽనఘ. 33



పాపరహితుడవగు నోరామా! కోర్కెలన్నియు శమించినవానికిని, ఆత్మలాభోదయమైనవానికిని, తద్విరుద్ధమగు అల్పలాభముగూర్చిన కోర్కె యేల జనించును?

యథోదేతి చ యస్యేచ్ఛా స తయా యతతే తథా
యథాకాలం తదాప్నోతి జ్ఞో వాప్యజ్ఞతరోఽపి వా. 34

జ్ఞానియైనను, అజ్ఞానియైనను, యెవనికట్టి యిచ్ఛజనించునో యాతడట్లనే ప్రయత్నించుచు కాలక్రమమున యద్దానిని పొందుచున్నాడు.

వీతహవ్యేన యతితం నో జ్ఞానేచ్ఛేన కించన
జ్ఞానేచ్ఛ్యేనాశు యతితం ప్రోత్థితోఽసౌ యథా వనే. 35

జ్ఞానాభిలాషియగు వీతహవ్యుడు జ్ఞానముకొఱకుతప్ప మఱిదేనికొఱకును యత్నింపలేదు. కనుకనే జ్ఞానాభ్యాసమునకై యాతడు వనమునకేగెను.

ఏవం కాలక్రియాకర్మద్రవ్యయుక్తిస్వభావజాః
యథేచ్ఛమేవ సిద్ధ్యన్తి సిద్ధయః స్వాః క్రమార్జితాః. 36

ఇవ్విధమున, దేశ, కాల, క్రియా, ద్రవ్య, కర్మాది యుక్తులచే నుత్పన్నములై, క్రమముగ నుపార్జింపబడి సిద్ధులు వారివారి కోర్కెలననుసరించి సిద్ధించుచున్నవి.

యాః ఫలాఫలయో యేన సంప్రాప్తాః సిద్ధినామికాః
తాస్తేనాధిగతా రామ నిజాత్ప్రయతనద్రుమాత్. 37

ఓ రామా! సిద్ధులనుపేరిట ప్రసిద్ధమగు యే ఫలప్రాప్తి గలదో అది వాటి వాటి ప్రయత్న రూప వృక్షముయొక్క ఫలరూపములుగనే గన్పట్టుచున్నది.

మహతాం నిత్యతృప్తానాం తజ్జ్ఞానాం భావితాత్మనామ్
ఈహితం సంప్రయాతానాం నోపకుర్వన్తి సిద్ధయః. 38

నిత్యతృప్తులును, భావితాత్ములును, అభిలషితమగు ఆత్మసుఖమును పొందినవారునునగు ఆత్మజ్ఞులైన మహాత్ములకు సిద్ధులేమియు నుపకరింపవు.

శ్రీ రామ ఉవాచ:—

అయం మే సంశయో బ్రహ్మన్వీతహవ్యస్య సా తనుః
క్రవ్యాదైర్న కథం భుక్తా కథం క్లిన్నా న భూతలే. 39

శ్రీరాముడు:—ఓ మహాత్మా! వీతహవ్యుని యాదేహమును హింస్రజీవులేల భక్షింపలేదు? మఱియు పంకాదులచేనది శిథిలముకాలేదేల? యనునీ సంశయము నాకు గలదు.

తదైవ వీతహవ్యోఽసౌ కథం వనగతః ప్రభో
విదేహముక్తతాం శీఘ్రం యథావదితి మే వద. 40

ఓ ప్రభూ! వీతహవ్యుడు వనమునకేగ, యాతని శరీరము పంకాదులచే గప్పబడియుండ, అట్టి తరుణముననే యాతడు విదేహముక్తినేల పొందకయుండెనో వచింపుము?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యా సంవిద్వలితా సాధో వాసనామలతన్తునా
సుఖదుఃఖదశాదాహభాగినీ భవతీహ సా. 41

శ్రీ వసిష్ఠుడు:—సాధువగునో రామా! అజ్ఞానియొక్క సంవిత్తు రాగద్వేషాది వాసనలచే మలినమైనట్టి త్రాడుచే దృఢముగ పరివేష్టింపబడియుండును. అదియే సుఖ, దుఃఖ, దహనాది క్రియల ననుభవించును.

నిర్ముక్తవాసనా శుద్ధసంవిన్మాత్రమయీ తు సా
తనుస్తిష్ఠతి తచ్ఛేదే శక్తా నేహ హి కేచన. 42

జ్ఞానముచే అవిద్యాంశను నశించుటచే వాసనారహితమగు శుద్ధసంవిన్మాత్రమైన జీవన్ముక్తుని శరీరము నికయెవరును ఛేదింప శక్యులుగారు.

శృణు యుక్త్యా కయా యోగీ తనుచ్ఛేదాది విభ్రమైః
నాక్రమ్యతే మహాబాహో బహువర్షశతైరపి. 43

మహాబాహుండవగునో రామా! ఇక నేయుక్తిచే యోగి శరీరచ్ఛేదనాది సంభ్రమములచే పెక్కుసంవత్సరములైనను వ్యాకులుడుగాకయుండునో యద్దాని నెఱింగించెద వినుము.

చేతః పదార్థే పతతి యస్మిన్యస్మిన్యదా యదా
తన్మయం తద్భవత్యాశు తస్మింస్తస్మింస్తదా తదా. 44

చిత్తమెప్పుడెప్పుడేయే పదార్థములందు సంలగ్నమగునో, అప్పుడప్పుడు శీఘ్రముగయా నా పదార్థరూపముం జెందును.

తథా దృష్టారి హి మనో వికారముపగచ్ఛతి
దృష్టమిత్రం సుహార్దత్వం స్వయమిత్యనుభూయతే. 45

ఈ మనస్సు తన శత్రువును గాంచునపుడు వికారమునొందుటయు, మిత్రునిగాంచునపుడు ఆనందమునొందుటయు సర్వుల ప్రత్యక్షానుభవమైయేయున్నది.

రాగద్వేషవిహీనే తు పథికే పాదపే గిరౌ
భవత్యరాగద్వేషం చ స్వయమిత్యనుభూయతే. 46

రాగద్వేషరహితుడగు బాటసారి వృక్షమునుగాని, పర్వతమునుగాని జూచునపుడు వాటియందు రాగముగాని, ద్వేషముగాని లేకుండుటయు సర్వుల అనుభవైకవేద్యమే యైయున్నది.

మృష్టే లౌల్యముపాదత్తే దుర్భోజ్యే యాతి నిఃస్పృహమ్
వైరస్యం యాతి కటుని స్వయమిత్యనుభూయతే. 47

రుచిగల పదార్థమునందీ మనస్సు చపలమగుటయు, నీరసవస్తువునందు కోర్కెలేకుండుటయు, కటుపదార్థమందయిష్టము గల్గియుండుటయును స్వయముగ నందఱకును అనుభూతమైన విషయమేయగును.



సమసంవిద్విలాసాఢ్యే యద్యదా యతిదేహకే
హింస్రచేతః పతత్యాశు సమతామేతి తత్తదా. 48

రాగద్వేషవైషమ్యరహితమగు సంవిద్విలాసముచే పూర్ణమగు యోగి శరీరముపై హింస్రజీవుల చిత్తము పడునపుడది వాని సమరూపమగు సంవిత్తుయొక్క ప్రతిబింబముచే సమత్వము నొందును. అందుచే నట హింస సంభవింపకుండును.

సమసఙ్గవిముక్తత్వాచ్ఛేదాదౌ న ప్రవర్తతే
పాన్థో వ్యర్థం పథి గ్రామే యథా గ్రామీణకర్మణి. 49

యాత్రికుడు మార్గమందలి గ్రామసమీపముననున్న వృక్షముయొక్క ఛేదనాదిక్రియలందు ప్రవృత్తుడుగానట్లు సమదర్శియగు యోగిసంసర్గముచే నాహింస్రజీవులు రాగద్వేషాదులనుండి విడిపడుటం జేసి ఛేదనాదులందలి ప్రవృత్తులుగాకయుండును.

యోగిదేహసమీపాత్తు గత్వా ప్రాప్నోతి హింస్రతామ్
యద్యద్భవతి తత్రాశు తథారూపం న సంశయః. 50

మఱియును, యోగిశరీరమువీడి మఱొకతావునకేగునపుడు, ఆచ్చోట దోషాదియుక్తమగు యే జంతుజాలముండునో తదనురూపమగు హింస్రస్వభావమునే యవి శీఘ్రముగ నవశ్యము నొందును.

ఇతి హింస్రైర్మృగవ్యాఘ్రసింహకీటసరీసృపైః
న చ్ఛిన్నా వీతహవ్యస్య తనుర్భూతలశాలినీ. 51

ఈపైరెండు కారణములచేతను, భూమియందు బడియున్న యా వీతహవ్యుని శరీరము సింహ, వ్యాఘ్ర, సర్ప, వృశ్చికాదులచే ఛేదింపబడకుండెను.

సర్వత్ర విద్యతే సంవిత్కాష్ఠలోష్టోపలాదికే
సత్తాసామాన్యరూపేణ సంస్థితా మూకబాలవత్ 52

మూగబాలునివలె కాష్ఠ, లోష్ఠ, శిలాదులన్నిటియందును సత్తాసామాన్యరూపమున చిత్-శక్తి యుండియేయున్నది.

ప్రోప్లూయమానా తరలా కేవలం పరిదృశ్యతే
తన్వీ పుర్యష్టకేష్వేవ ప్రతిబిమ్బజలేష్వివ. 53

కేవలము పంచజ్ఞానేంద్రియ, పంచకర్మేంద్రియ, పంచప్రాణ, మనోబుద్ధియుక్తములగు సూక్ష్మశరీరములందే ఆ చిత్-శక్తి జలప్రతిబింబములవలె చంచలమై, పరిచ్ఛిన్నమై గన్పట్టుచున్నది.

తేన భూజలవాయ్వగ్నిసంవిత్త్యా సమరూపయా
నిర్వికారం తనుర్నీతా వీతహవ్యస్య రాఘవ. 54

ఓ. రాఘవా! ఇక్కారణమున నిర్వికారస్థితి (బ్రహ్మభావము) నొందిన యా వీతహవ్యుని శరీరముసమరూపముననున్న భూజలాదుల సంవిత్తుచే వికారము నొందకయుండెను.

అన్యచ్చ శృణు మే రామ స్పన్దో నాశస్య కారణమ్
వికారః స చ చిత్తోత్థో వాతజో వా జగత్స్థితౌ. 55

ఓ రామా! ఇంకొకయుక్తిని గూడ వినుము; నాశమునకు కారణము స్పందమై (శరీరము, లేక అంతఃకరణముయొక్క చేష్టయై) యున్నది. అట్టి స్పందరూపమగు వికారము చిత్త, (ప్రాణ) వాయుజనితములగు జగద్వ్యవహారములందు ప్రసిద్ధమైయున్నది.

ప్రాణానాం ప్రాణనం స్పన్దస్తచ్చాన్తౌ తే దృషత్సమాః
యతఃస్థితా ధారణయా తేనానష్టాస్య సా తనుః. 56

ప్రాణముల చలనమే స్పందము. అట్టిచలన మాగిపోవుటచే యా ప్రాణములు శిలవలె దృఢీభూతములైయుండును. కావనే వీతహవ్యుని యాశరీరము నశింపకుండెను.

స బాహ్యాభ్యన్తరం స్పన్దశ్చిత్తజో వాతజోఽథవా
న యస్య విద్యతే తస్య దూరస్థా ప్రకృతిక్షయా. 57

అభ్యంతరప్రాణములతోను, బాహ్యహస్తపాదాదులతోను గూడిన దేహమున చిత్తముచే గాని, లేక ప్రాణవాయువులచేగాని నుత్పన్నమగు స్పందమెవనికి లేదో, యట్టివానికి వృద్ధిక్షయాదు లుండవు.

స బాహ్యాభ్యన్తరే శాన్తే స్పన్దే తత్త్వవిదాం వర
ధాతవః సంస్థితిం దేహే న త్యజన్తి కదాచన. 58

తత్వవేత్తలలో శ్రేష్ఠుడవగు నోరామా! బాహ్యాభ్యంతరస్పంద ముపశమింప, దేహమున త్వఙ్మాంసాది ధాతువులు తమ స్థితి నెన్నటికిని వీడకుండును.

సంశాన్తే దేహప్రస్పన్దే చిత్తవాతమయే తథా
ధాతవో మేరవం స్థైర్యం యాన్తి సంస్తమ్భితాత్మకాః. 59

చిత్తముయొక్కగాని, లేక ప్రాణవాయువుయొక్కగాని చలనముడుగ, యోగముచే స్తంభితములైనట్టి ధాతువులు మేరువువలె స్థిరత్వము నొందును.

తథా చ దృశ్యతే లోకే స్పన్దశాన్తౌ దృఢా స్థితిః
దారూణామివ ధీరాణాం శవాఙ్గానామచోపతా. 60

కాష్ఠములభగిది స్థిరమైనట్టి ధీరులగు యోగులయొక్క అచంచలస్థితియు, మృతకదేహముయొక్క అవయవముల అచంచలత్వమున్ను లోకమున గన్పట్టుచున్నవి.

ఇతి వర్షసహస్రాణి దేహా జగతి యోగినామ్
న క్లిద్యన్తే న భిద్యన్తే మగ్నవజ్జలదా ఇవ. 61

ఇక్కారణమున, వేలకొలంది సంవత్సరములకు గూడ యోగుల శరీరము మేఘమువలె కరుగకయు, భూమియందలి శిలవలె విదీర్ణముగాకయు నుండును.

తదైవ వీతహవ్యోఽసౌ శృణు కిం నోపశాన్తవాన్
దేహముత్సృజ్య తత్త్వజ్ఞో జ్ఞాతజ్ఞేయవతాం వరః 62



ఇక, జ్ఞానులలో శ్రేష్ఠుడగు వీతహవ్యుడత్తతి తన దేహమును త్యజించి విదేహముక్తుడేల కాకుండెనో, దానికి కారణమును వినుము.

యే హి విజ్ఞాతవిజ్ఞేయా వీతరాగా మహాధియః
విచ్ఛిన్నగ్రన్థయః సర్వే తే స్వతన్త్రాస్తనౌ స్థితాః. 63

ఆత్మజ్ఞానులును, వీతరాగులును, మహాధీమంతులును, చిన్నగ్రంథులునునగు మహాత్ములు తమ దేహవిషయములందు స్వతంత్రులై యుందురు.

దైవం వాపి చ కర్మాణి ప్రాక్తనాన్యైహికాని చ
వాసనా వా న తేషాం తచ్చేతో నియమయన్త్యలమ్. 64

దైవము (ప్రారబ్ధకర్మఫలమొసంగు ఈశ్వరుడు) గాని, వర్తమాన, పూర్వజన్మల కర్మగాని, ప్రారబ్ధశేషమనుభవించుటకై ప్రవృత్తులైన యోగుల చిత్తమును అన్యథా గావింప జాలవు.

తేన తత్త్వవిదాం తాత కాకతాలీయవన్మనః
యద్యద్భావయతి క్షిప్రం తత్తదాశు కరోత్యలమ్. 65

కాన ప్రియుడవగు నోరామా! కాకతాళీయముగ ప్రారబ్ధముచే సంప్రాప్తించు ఏ యే కార్యములను తత్వజ్ఞులమనస్సు భావనచేయునో వాటినే లెస్సగ నది శీఘ్రము గావించుచుండును.

కాకతాలీయయోగేన వీతహవ్యస్య సంవిదా
సాంప్రతం జీవితం బుద్ధం తదేవాశు స్థిరీకృతమ్. 66

కాకతాళీయముగ వీతహవ్యుని సంవిత్తు యిపుడు జీవితమును గూర్చిన భావన చేసెను. కాన నదియే వానికి శీఘ్రముగ స్థిరపడెను.

యదా తు తస్య ప్రతిభా విదేహోన్ముక్తతాం గతా
తదా విదేహముక్తోఽభూదసౌ స్వాతన్త్ర్యసంస్థితిః. 67

మఱియు వానిప్రతిభ యెపుడు విదేహముక్తికై యున్ముఖమయ్యెనో, అపుడాతడు విదేహముక్తుడయ్యెను. ఏలన, తన శరీరముయొక్క త్యాగాదులందాతడు స్వతంత్రుడై యుండెను.

విగతవాసనమాశు విపాశతా
ముపగతం మన ఆత్మతయోదితమ్,
యదభివాఞ్ఛతి తద్భవతి క్షణా
త్సకలశక్తిమయో హి మహేశ్వరః. 68

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే సద్విలాసవిచారయోగోపదేశో నామైకోననవతితమః
సర్గః ॥ 89 ॥

వాసనారహితుడును, శీఘ్రముగ బంధమునుండి విడివడినవాడునునగు అంతఃకరణోపాధియుతుడగు వీతహవ్యుని జీవుడు ఆత్మరూపమున నావిర్భవించుటచే సకలశక్తిమయుడగు మహేశ్వరుడేమైయుండెను. కావనే, ఎయ్యది వాంఛించెనో యది వానికి శీఘ్రముగ కటస్థించెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సద్విలాస విచారయోగోపదేశమను ఏకోననవతితమ
సర్గము ॥ 89 ॥

---

## నవతితమః సర్గః

---

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యదా హ్యస్తం గతప్రాయం జాతం చిత్తం విచారతః
తదా హి వీతహవ్యస్య జాతా మైత్ర్యాదయో గుణాః. 1

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! విచారణచే చిత్తమెపుడు ప్రాయః నశించెనో, అపుడు వీతహవ్యునకు మైత్రి, కరుణ మున్నగు గుణములుద్భవించెను.

శ్రీ రామ ఉవాచ:—

విచారాభ్యుదయాచ్చిత్త స్వరూపేఽస్తమితే మునేః
మైత్ర్యాదయో గుణా జాతా ఇత్యుక్తం కిం త్వయా ప్రభో. 2

శ్రీ రాముడు:—ఓ మహాత్మా! స్వవిచారణచే చిత్తమాత్మయందు లయింపమఱల, మైత్ర్యాద గుణములుత్పన్నమైనవని తామేల వచించిరి?

బ్రహ్మణ్యస్తం గతే చిత్తే కస్య మైత్ర్యాదయో గుణాః
క్వ వా పరిస్ఫురన్తీతి వద మే వదతాం వర. 3

వక్తలలో శ్రేష్ఠుడవగు నో మునీంద్రా:—చిత్తము బ్రహ్మమున లయింప, అపుడు మైత్ర్యాది గుణము లెద్దానికి కలుగును? లయించిన చిత్తమునకా? లేక, అధిష్ఠానమునకా? మఱియు నవి దేనియందు స్ఫురించును? చిదాభాసునియందా, లేక బింబరూపమగు చైతన్యమందా? ఇవ్విషయమును నాకు వచింపవేడెద (ఏలన, బాధితమగు మృగతృష్ణానదికి శైత్యాది గుణము లుండవు కదా!)

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ద్వివిధశ్చిత్తనాశోఽస్తి స్వరూపోఽరూప ఏవ చ
జీవన్ముక్తః సరూపః స్యాదరూపో దేహముక్తిజః. 4

శ్రీ వసిష్ఠుడు:—ఓ రామా! సరూపమనియు, అరూపమనియు, చిత్తనాశ మిరువిధములు అందు జీవన్ముక్తునిది సరూపమును విదేహముక్తినిది అరూపమును నగును.

చిత్తసత్తేహ దుఃఖాయ చిత్తనాశః సుఖాయ తు
చిత్తసత్తాం క్షయం నీత్వా చిత్తం నాశము పానయేత్. 5

ఈ ప్రపంచమున చిత్తసత్తయే దుఃఖమును కలిగించును చిత్తనాశమే సుఖమును కలిగించును. కాన, చిత్తసత్తను నశింపజేసి చిత్తనాశ మొనగూర్పవలెను.



తామసైర్వాసనాజాలైర్వ్యాప్తం యజ్జన్మకారణమ్
విద్యమానం మనో విద్ధి తద్దుఃఖాయైవ కేవలమ్. 6

మలిన వాసనాజాలముచే వ్యాప్తమై జన్మసమూహమునకుఁ గారణమైనట్టి మనస్సే యునికి గలదనియు, అదియే దుఃఖమును కలుగజేయుననియు యెఱుంగుము.

ప్రాక్తనం గుణసంభారం మమేతి బహు మన్యతే
యత్తు చిత్తమతత్త్వజ్ఞం దుఃఖితం జీవ ఉచ్యతే. 7

అనాదియైన అభేదాధ్యాసముచే సిద్ధమగు దేహేంద్రియ విషయాదుల ధర్మములను 'ఇవి నావి' అని యెంచి దుఃఖమొందునట్టి యజ్ఞచిత్తమునే జీవుడందురు.

విద్యమానం మనో యావత్తావద్దుఃఖక్షయః కుతః
మనస్యస్తంగతే జన్తోః సంసారోఽస్తముపాగతః. 8

ఎంతవఱకు మనస్సుండునో అంతవఱకు దుఃఖక్షయమెచట? మనస్సు క్షయించుటతోడనే జీవునకు సంసారవినాశము సంభవించినదే యగును.

దుఃఖమూలమవష్టబ్ధమస్మిన్నేవ వినిశ్చలమ్
విద్యమానం మనో విద్ధి దుఃఖవృక్షవనాఙ్కురమ్. 9

అజ్ఞానియగు యీ జీవునియందు వాసనాజాలములచే దృఢముగ ప్రతిష్ఠింపబడినట్టి మనస్సును దుఃఖవృక్షమునకు మూలమని యెఱుంగుము. దుఃఖారణ్యవృక్షముల కంకురము లద్దానినుండియే ప్రాదుర్భవించును.

శ్రీ రామ ఉవాచ:—

నష్టం కస్య మనో బ్రహ్మన్నష్టం వా కీదృశం భవేత్
కీదృశశ్చాస్య నాశః స్యాత్సత్తానాశస్య కీదృశీ. 10

శ్రీ రాముడు:—ఓ మహాత్మా! నశించిన మనస్సేది? నశింపనిదేది? ఆ మనస్సెట్లు నశించును? నశించినదానికి మఱల సత్త (వ్యవహార సామర్థ్యము) యెటుల సంభవించును?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

చేతసః కథితా సత్తా మయా రఘుకులోద్వహ
అస్య నాశమిదానీం త్వం శృణు ప్రశ్నవిదాం వర. 11

శ్రీ వసిష్ఠుడు:—ప్రశ్నవేత్తలలో శ్రేష్ఠుఁడవును, రఘుకులోత్తముఁడవునగు నో రామా! ఇంతవఱకు చిత్తసత్తనుగూర్చి చెప్పితిని. ఇక చిత్తనాశము నెఱింగించెద వినుము.

సుఖదుఃఖదశా ధీరం సామ్యాన్న ప్రోద్ధరన్తి యమ్
నిఃశ్వాస ఇవ శైలేన్ద్రం చిత్తం తస్య మృతం విదుః. 12

శ్వాసవాయువు మేరుపర్వతమును చలింపచేయజాలనట్లు, యే ధీరుని సుఖదుఃఖదశలు సమస్వరూపమగు ఆత్మనుండి చలింపచేయజాలవో, అట్టివాని చిత్తము నశించినదని చెప్పుదురు.

అయం సోఽహమయం నాహమితి చిన్తా నరోత్తమమ్
ఖర్వీకరోతి యం నాన్తర్నష్టం తస్య మనో విదుః. 13

'ఈ యల్పదేహమే నేను, తదన్యముగ నేదియును కాన'నునీ చింత, యే శ్రేష్ఠ మానవుని పరిచ్ఛిన్నునిగా నొనర్పజాలదో, యట్టివాని చిత్తము నశించినదని బల్కుదురు.

ఆపత్కార్పణ్యముత్సాహో మదో మాన్ద్యం మహోత్సవః
యం నయన్తి న వైరూప్యం తస్య నష్టం విదుర్మనః. 14

ఆపద, దీనత్వము, ఉత్సాహము, మదము, మహత్త, మహోత్సవము మొదలైనవి యెవని ముఖమున వైవర్ణ్యము కలుగచేయజాలవో, యట్టివాని చిత్తము నశించినదని యెంచుదురు.

ఏష సాధో మనోనాశో నష్టం చేహ మనో భవేత్
చిత్తనాశదశా చైషా జీవన్ముక్తస్య విద్యతే. 15

సాధువగునో రామా! ఇదియే మనోనాశము. ఇవ్విధముగనున్న మనస్సునే నశించిన మనస్సందురు. ఇట్టి చిత్తనాశస్థితియే జీవన్ముక్తునకుండును.

మనస్తాం మూఢతాం విద్ధి యదా నశ్యతి సానఘ
చిత్తనాశాభిధానం హి తదా సత్త్వముదేత్యలమ్. 16

పాపరహితుఁడవగునో రామా! పరమార్థమును వదలి దృశ్యమును మననము చేయుటయే మూఢత్వమని యెఱుంగుము, అట్టి మూఢత్వమెపుడు నశించునో, అపుడే చిత్తనాశరూపమగు సత్స్వభావము పూర్ణముగ నుదయించును.

తస్య సత్త్వవిలాసస్య చిత్తనాశస్య రాఘవ
జీవన్ముక్తస్వభావస్య కైశ్చిత్తాభిధా కృతా. 17

ఓ రాఘవా! శుద్ధ సత్స్వభావమునకును, జీవన్ముక్తుని స్వభావరూపమగు నీ చిత్తనాశమునకును (తద్వ్యవహారాభాస దర్శకులగు) కొందరు చిత్తమని పేరిడిరి.

మైత్ర్యాదిభిర్గుణైర్యుక్తం భవత్యుత్తమవాసనమ్
భూయో జన్మవినిర్ముక్తం జీవన్ముక్తమనోఽనఘ. 18

పాపరహితుఁడవగునో రామా! జీవన్ముక్తుని మనస్సు మైత్ర్యాది గుణసంపన్నమై, ఉత్తమవాసనామయమై, పునర్జన్మవర్జితమై యుండును.

వ్యాప్తం వాసనయా యత్స్యాద్భూయో జననముక్తయా
జీవన్ముక్తమనఃసత్తా రామ తత్సత్త్వముచ్యతే. 19

బ్రహ్మాకారవాసనచే పరివ్యాప్తమై, పునర్జన్మరహితమైనట్టి జీవన్ముక్తుని మనస్సత్తయే సత్త్వమని చెప్పబడును.

సంప్రత్యేవానుభూతత్వాత్సత్త్వావస్త్యా తన్వసంయుతః
సరూపోఽసౌ మనోనాశో జీవన్ముక్తస్య విద్యతే. 20



వ్యుత్థానకాలమున ననుభూతమగుటచే సరూపమును, సన్మాత్రస్వభావప్రాప్తిచే దేహాది పరిచ్ఛేదము స్పృశింపనిదియునగు నీ మనోనాశము జీవన్ముక్తుల కుండును.

మైత్ర్యాదయోఽథ ముదితాః శశాఙ్క ఇవ దీప్తయః
జీవన్ముక్తమనోనాశే సర్వదా సర్వథా స్థితాః. 21

చంద్రునియందు కాంతి సముదాయమువలె, జీవన్ముక్తుని మనోనాశమున మైత్ర్యాది గుణ [illegible] ప్రఫుల్లితములై యుండును.

జీవన్ముక్తమనోనాశే సత్త్వనామ్ని హిమాలయే
వసన్త ఇవ మఞ్జర్యః స్ఫురన్తి గుణసంపదః. 22

శైత్యమను శీతలత్వమునకు (సంతుష్టికి) స్థానభూతమగు జీవన్ముక్తుని మనోనాశమున, వసంతకాలమున చిగుళ్లవలె గుణసంపదయంతయు స్ఫురించును.

అరూపస్తు మనోనాశో యో మయోక్తో రఘూద్వహ
విదేహముక్త ఏవాసౌ విద్యతే నిష్కలాత్మకః. 23

రఘుకులోత్తముఁడవగునో రామా! మున్ను నేను తెల్పిన అరూప మనోనాశము నిష్కళాత్ముఁడగు విదేహముక్తునకే గల్గును.

సమగ్రాగ్ర్యగుణాధారమపి సత్త్వం ప్రలీయతే
విదేహముక్తే విమలే పదే పరమపావనే. 24

ఉత్తమగుణములకన్నిటికి నాధారభూతమైన సత్త్వము (ప్రాతిభాసిక మనంబు) గూడ, పరమపావనమై నిర్మలమైనట్టి విదేహముక్తపదమున విలీనమై పోవును.

విదేహముక్తవిషయే తస్మిన్సత్త్వక్షయాత్మకే
చిత్తనాశే విరూపాఖ్యే న కించిదపి విద్యతే. 25

కేవలము విదేహముక్తునకు విషయమైనదియు, సత్త్వక్షయాత్మకమును, రూపరహితమును నగు నీ చిత్తనాశస్థితియందు దృశ్యమేమాత్రమునుండదు.

న గుణా నాగుణాస్తత్ర న శ్రీర్నాశ్రీర్న లోలతా
న చోదయో నాస్తమయో న హర్షామర్షసంవిదః. 26

న తేజో న తమః కించిన్న సంధ్యా దినరాత్రయః
న దిశో న చ వాకాశో నార్థో నానర్థరూపతా. 27

న వాసనా న రచనా నేహానీహా న రఞ్జనా
న సత్తా నాపి వాఽసత్తా నచ సాధ్యం హి తత్పదమ్. 28

అట్టిరూప చిత్తనాశపదము గుణముగాని, అగుణముగాని, లక్ష్మిగాని, దారిద్ర్యముగాని, చంచలత్వముగాని, ఉదయముగాని, అస్తమయముగాని, హర్షముగాని, శోకముగాని, తేజముగాని అంధకారముగాని, సంధ్యాకాలముగాని, పగలుగాని, రాత్రిగాని, దిక్కులుగాని, ఆకాశముగాని

అధోభాగముగాని, అనర్ఘరూపముగాని, వాసనగాని, రచనగాని, ఇచ్ఛగాని, అనిచ్ఛగాని, రాగముగాని, సత్తగాని, అసత్తగాని, అరెంటి సంధిరూపముగాని కానిదై యున్నది.

అతమస్తేజసా వ్యోమ్నా వితారేన్ద్వర్కవాయునా
తత్సమం శరదచ్ఛేన నిఃసంధ్యేనారజస్త్విషా. 29

అది, అంధకారతేజోరహితమై, సూర్యచంద్రనక్షత్రవాయువర్జితమై, సూర్యప్రభావిరహితమై శరదాకాశమువలె నిర్మలమైనట్టి పదమై యలరుచున్నది.

యే హి పారం గతా బుద్ధేః సంసారాచరణస్య చ
తేషాం తదాస్పదం స్ఫారం పవనానామివామ్బరమ్. 30

ఆకాశము వాయువునకు స్థానమగునట్లు, బుద్ధిని, సంసారాడంబరమును దాటినట్టి మహాత్ములకా నిర్మలమగు విదేహముక్తపదము స్థానభూతమై యొప్పుచున్నది.

సంశాన్తదుఃఖమజడాత్మకమేవ సుప్త
మానన్దమన్థరమపేతరజస్తమో యత్,
ఆకాశకోశతనవో తనవో మహాన్త
స్తస్మిన్పదే గలితచిత్తలవా వసన్తి 31

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే చిత్తోపదేశవిచారయోగోపదేశో నామ నవతితమః
సర్గః ॥ 99 ॥

జడత్వ, దుఃఖరహితమై, ఉన్మేషాది క్రియావర్జితమై, పరమానందసంయుతమై అజ్ఞాన, రజోగుణ శూన్యమైనట్టి యా నిర్మలపదమున, ఆకాశమువలె విశాలమైన రూపులును, విదేహముక్తులును, చిత్తము లేశమైనను లేనివారునునగు మహాత్ములు పునరావృత్తిరహితులై వసించుచుందురు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
చిత్తోపదేశవిచారయోగోపదేశమను నవతితమ
సర్గము ॥ 90 ॥

---

ఏకనవతితమః సర్గః.

---

శ్రీరామ ఉవాచ:—

పరమాకాశకోశాద్రిరూఢలోకాన్తరద్రుమమ్
తారకాపుష్పశబలం దేవాసురవిహంగమమ్. 1
విద్యున్మఞ్జరిశోభాన్త నీలనీరదపల్లవమ్
సర్వర్తురమ్యకాలిర్కగిరిరమ్యకదన్తురమ్. 2



సప్తాబ్ధివాపీవలితం సరిచ్ఛతమనోహరమ్
చతుర్దశవిధానన్తభూతజాతోపజీవితమ్. 3
జగత్కాననమాక్రమ్య స్థితాయాః కృతజాలకమ్
బ్రహ్మాన్సంసృతిమృద్వీకాలతాయా వితతాకృతేః. 4
జరామరణపర్వాయాః సుఖదుఃఖఫలావలేః
ఆరూఢమూలమూలాయా మోహాసేకజలాఞ్జలేః. 5
కిం బీజమథ బీజస్య తస్య కిం బీజముచ్యతే
అథ తస్యాపి కిం బీజం బీజం తస్యాపి కిం భవేత్. 6
సర్వమేతత్సమాసేన పునర్బోధవివృద్ధయే
సిద్ధయే జ్ఞానసారస్య వద మే వదతాంవర. 7

శ్రీరాముడు:— ఓ మహాత్మా! నిర్విశేషమగు బ్రహ్మమును యడ్డగించుటయందు పర్వతమువంటిదగు అవ్యాకృతమున, అనేక బ్రహ్మాండములను వృక్షములుగలదియు నక్షత్రములను పుష్పములతోగూడి విచిత్రమైనదియు, దేవాసురులను పక్షులు గలదియు, మెఱపులను తీగెలు గలదియు, దిక్కులను కొమ్మల చివర నీలవర్ణమేఘములను చిగుళ్లచే శోభించునదియు, ఋతువులన్నింటియందును మనోహరముగ నుండునదియు చంద్రసూర్యనక్షత్రములను వికసితపుష్పములచే యున్నదమై మందహాసమొనర్చుచున్నదియు, సప్తసముద్రములను దిగుడుబావులచే పరివేష్టింపబడినదియు, పెక్కునదులచే సుందరమైనదియు, పదునాల్గు లోకములయొక్కయు, అందలి అనంత ప్రాణికోట్లయొక్కయు జీవనహేతువైయున్నదియునగు యీ జగత్తను వనమునుజుట్టి, జాలమువలె నున్నదై, విశాలాకృతిగల్గి జరామరణగ్రంథిసహితమై, సుఖదుఃఖఫలములచే పరిపూర్ణమై, దృఢమైన మూలముగల్గి, మోహమను జలసేచనము గలదైనట్టి సంసారమను ద్రాక్షలతకు బీజమేది? ఆ బీజమునకు బీజమేది? దానికి మఱల బీజమేది? వక్తలలో శ్రేష్ఠుడవగు ఓ ప్రభూ! బోధాభివృద్ధికై మఱియు జ్ఞానసారసిద్ధికై యిద్దాని నంతయు నాకు వచింపవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

అన్తర్లీనఘనారమ్భశుభాశుభమహాఙ్కురమ్
సంసృతివ్రతతేర్బీజం శరీరం విద్ధి రాఘవ. 8

శ్రీవసిష్ఠుడు:— ఓ రామా! అంతఃకరణమున దాగియున్నదియు, అనేక విచిత్రకార్యములఁజేయునదియు, శుభాశుభములను గొప్ప యంకురము గలదియునగు యీ శరీరమే సంసారలతకు బీజమని యెఱుంగుము.

శాఖాప్రతానగహనా ఫలపల్లవశాలినీ
తేనేయం భవతి స్ఫీతా శరదీవ వసున్ధరా. 9

శాఖావిస్తారముచే దట్టమైనదియు, ఫలపల్లవాదులచే శోభించునదియునగు యీ సంసారలత శరత్కాలమున సస్యసంపత్తిచే భూమి వృద్ధినొందునట్లు, శరీరమను బీజము నుండియే వృద్ధియగుచున్నది.

భావాభావదశాకోశం దుఃఖరత్నసముద్గకమ్
బీజమస్య శరీరస్య చిత్తమాశావశానుగమ్. 10

ఓ రామా! పదార్థముల అభివృద్ధి వినాశదశలకు నిలయమును, దుఃఖములను రత్నములకు పేటికయు, ఆశలకు వశమై వాటిననుసరించునదియునగు చిత్తమే యాశరీరమునకు బీజమగును.

చిత్తాదిదముదేత్యుచ్చైః సదసచ్చాబ్జజాలకమ్
తథా చైతత్స్వయం స్వప్నసంభ్రమేష్వనుభూయతే. 11

చిత్తమువలననే భూతభవిష్యద్వర్తమాన దేహసముదాయములన్నియు నుత్పన్నమగుచున్నవి. స్వప్న, సంభ్రమాదులం దివ్విషయమందఱకు ననుభూతమైయేయున్నది.

యథా గన్ధర్వసంకల్పాత్పురమేవం హి చేతసః
సవాతాయనమాకారభాసురం జాయతే వపుః. 12

ప్రకాశయుక్తమై, వాతాయనములతో గూడినట్టి గంధర్వనగరము సంకల్పముచే నుద్భూతమగునట్లు చిత్తముచే నీశరీరమున్ను యుత్పన్నమగుచున్నది.

యదిదం కించిదాభోగి జాగతం దృశ్యతాం గతమ్
రూపం తచ్చేతసః స్ఫారం ఘటాదిత్వం మృదో యథా. 13

ఘటాదులు మృత్తికను జెందినట్లు, కృత్రిమాకారమును ధరించి, దృశ్యత్వము నొందినట్టి యీ జగద్రూపమంతయు విశాలమగు చిత్తమునకు జెందినదేయైయున్నది.

ద్వే బీజే చిత్తవృక్షస్య వృత్తివ్రతతిధారిణః
ఏకం ప్రాణపరిస్పన్దో ద్వితీయం దృఢభావనా. 14

వృత్తియను తీగెగల చిత్తమను యీ వృక్షమునకు బీజములురెండు; ఒకటిప్రాణస్పందము, * రెండవది దృఢవాసన.

యదా ప్రస్పన్దతే ప్రాణో నాడీసంస్పర్శనోద్యతః
తదా సంవేదనమయం చిత్తమాశు ప్రజాయతే. 15

నాడుల స్పృశింప నుద్యుక్తమగు ప్రాణముయొక్క చలనము కలుగుటతోడనే చిద్వికారమయమగు నీచిత్తమున్ను శీఘ్రముగ జనించుచున్నది.

యదా న స్పన్దతే ప్రాణః శిరాసరణికోటరే
అసంవిత్తివశాత్తేన చిత్తమన్తర్న జాయతే. 16

నాడీమార్గరంధ్రములందు ప్రాణము చలింపనిచో యత్తఱి బాహ్యానుభవములేమి చిత్తమున్ను యుత్పన్నము కానేరదు.

ప్రాణస్పన్దనమేవేదం చిత్తద్వారేణ దృశ్యతే
జగన్నామాగతం వ్యోమ్ని నీలత్వాదివదీదృశమ్. 17

* స్పందము=చలనము



ఈ ప్రాణస్పందమే చిత్తముద్వారా జగత్తనుపేరిట ప్రసిద్ధికెక్కి ఆకాశమందు నీలత్వాదులవలె గన్పట్టుచున్నది.

ప్రాణస్పన్దనసుప్తా చ తచ్ఛాన్తిః శాన్తిరుచ్యతే
ప్రాణసంస్పన్దనాత్సంవిద్యాలీవీ ఓవ చోదితా. 18

సమష్టిప్రాణస్పందోపశమనమను చైతన్యముయొక్క నిష్క్రియత్వరూప శాంతిస్థితియే జగత్ప్రళయమనియు, లేక మోక్షమనియు వచింపబడినది. కాని ప్రాణస్పందము కలుగుటతోడనే, చేతితో కొట్టబడిన బంతివలె చిత్తవృత్తి విజృంభించును.

సంవిత్స్ఫురతి దేహేషు ప్రాణస్పన్దప్రబోధితా
చక్రాన్తర్వైతజగణేషు వీ ఓవ కరతాడితా. 19

చేతితో కొట్టబడిన బంతి ప్రాంగణమున గంతులిడునట్లు, ప్రాణస్పందముచే ప్రబోధితమగు సంవిత్తున్ను † దేహములందు స్ఫురించును.

సతీ సర్వగతా సంవిత్ప్రాణస్పన్దేన బోధ్యతే
సూక్ష్మాత్సూక్ష్మతరాకారా గన్ధలేఖేవ వాయునా. 20

అతిసూక్ష్మమగు గంధము వాయువుచే ప్రబోధితమగునట్లు, సర్వత్రవ్యాపించియున్నను సంవిత్తు ప్రాణచలనముచేతనే ప్రబోధితమగుచున్నది.

సంవిత్సంరోధనే శ్రేయః పరమం విద్ధి రాఘవ
కారణాక్రమణం యత్ర క్షోభస్తత్ర న విద్యతే. 21

ఓ రామా! చిత్తవృత్తిని నిరోధించుటచే పరమశ్రేయము (మోక్షము) సంభవించును. కాన, ప్రాణాయామాభ్యాసముద్వారా, క్షోభకారణమగు ప్రాణస్పందమును నిరోధించిన నిక యే క్షోభయునుండనేరదు.

సంవిత్సముదితైవాశు యాతి సంవేద్యమాగరాత్
సంవేదనాదనన్తాని తతో దుఃఖాని చేతసః. 22

చిత్తవృత్తి యుదయించుటతోడనే బాహ్యవిషయములం దనురాగము జనించును. బాహ్యవస్తూపభోగముచే చిత్తమున కనంతదుఃఖము సంప్రాప్తించును.

సంసుప్తాన్తరబోధాయ సంవిత్సంతిష్ఠతే యదా
లబ్ధం భవతి లబ్ధవ్యం తదా తదమలం పదమ్. 23

బాహ్యవిషయములందు సుప్తప్రాయమై, అభ్యంతరస్థ ఆత్మజ్ఞానవిషయమున చిత్తవృత్తి మేల్కొనుచో నిక పొందదగిన విమలపదము పొందబడినట్లేయగును.

తస్మాత్ప్రాణపరిస్పన్దైర్వాసనాచోదనైస్తథా
నోచేత్సంవిదముచ్ఛూనాం కరోషి తదజో భవాన్. 24

† సంవిత్తు=చిత్తవృత్తి లేక వృత్తిజ్ఞానము.

కాన, ప్రాణచలనములచేతను, వాసనల యుత్తేజనముచేతను అజ్ఞులవలె నీవు సంవిత్తును వృద్ధినొందిపకున్నచో జన్మాదివికారము లెవ్వియులేక ముక్తుఁడవగుదువు.

సంవిదుచ్ఛూనతాం చిత్తం విద్ధి తేనేదమాతతమ్
అనర్థజాలమాలూనవిశీర్ణజనజీవకమ్. 25

ఓరామా! సంవిత్తు వృద్ధినొందుటయే చిత్తమని యెఱుంగుము. దానిచే యనేకుల జీవితములు ఖండింపబడి నశించినవి. అట్టి చిత్తరూప యనర్థజాలముచే నీప్రపంచమంతయు వ్యాప్తమైయున్నది.

యోగినశ్చిత్తశాన్త్యర్థం కుర్వన్తి ప్రాణరోధనమ్
ప్రాణాయామైస్తథా ధ్యానైః ప్రయోగైర్యుక్తికల్పితైః. 26

ప్రాణాయామములచేతను, ధ్యానములచేతను, యోగశాస్త్రోక్త, సద్గురు సాంప్రదాయ సిద్ధములగు యుక్తులచేతను, కల్పితప్రయోగములచేతను, చిత్తశాంత్యర్థము యోగులు ప్రాణనిరోధమును సల్పుచున్నారు.

చిత్తోపశాన్తిఫలదం పరమం సామ్యకారణమ్
సుభగం సంవిదః స్వాస్థ్యం ప్రాణసంరోధనం విదుః. 27

ప్రాణనిరోధము చిత్తశాంతియను ఫలమును గలుగజేయుననియు, సమత్వమునకు పరమ కారణమనియు, సౌఖ్యదాయకమనియు, సంవిత్స్వాస్థ్యమునకు హేతువనియు వచింపబడినది.

జ్ఞానవద్భిః ప్రకటితామనుభూతాం చ రాఘవ
చిత్తస్యోత్పత్తిమపరాం వాసనాజీవితాం శృణు 28

ఓరామా! జ్ఞానులగు మహాత్ములచే నుపదిష్టమును, స్వయముగ ననుభూతమున, వాసనలచే నుజ్జీవితమువనగు అన్యవిధమగు చిత్తోత్పతిని గూర్చి వినుము.

దృఢభావనయా త్యక్తపూర్వాపర విచారణమ్
యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా. 29

పూర్వకాలిక దృఢభావనావశమున, పూర్వాపర విచారణను వదలి దేహాది పదార్థములను 'నేను' 'నాది' యన్నగు సంస్కారములచే గ్రహించుటయే వాసనయని చెప్పబడినది.

భావితస్తీవ్రసంవేగాదాత్మనా యత్తదేవ సః
భవత్యాశు మహాబాహో విగతేతరసంస్మృతిః. 30

ఆత్మ తీవ్రసంవేగమున నెట్టిభావన యొనర్చునో, అద్దాని యాకృతినే అది యితరభావములఁ ద్యజించి శీఘ్రముగ పొందును.

తాదృగ్రూపః స పురుషో వాసనావివశీకృతః
యత్పశ్యతి తదేత త్తత్సద్వస్త్వితి విముహ్యతి. 31

వాసనలకు వశీభూతుఁడగువాడు తద్వాసనారూపముచే యెద్దానిని జూచునో, అదియే సద్వస్తువనియెంచి దానిచే విమోహితుఁడగును,



వాసనావేగవైవశ్యాత్స్వరూపం ప్రజహాతి తత్
భ్రాన్తం పశ్యతి దుర్దృష్టిః సర్వం మదవశాదివ. 32

వాసనావేగవైవశ్యమున జీవుడు తన సత్యస్వరూపమును వీడును. మఱియు మద్యము త్రావినవాడు మదవశమున దోషదృష్టి గల్గి పదార్థములన్నియు తిరుగుచున్నట్లు గాంచువిధమున, వాసనలచే సంస్థాపితమైన జగద్రూపమునంతయు నాతడు వీక్షించును.

అసమ్యగ్జ్ఞానవానేవ భవత్యాధిపరిప్లుతః
అన్తస్థయా వాసనయా విషేణేవ వశీకృతః. 33

విషమునకు వశీభూతులైన జనులు దుఃఖము నొందునట్లు, తన యంతఃకరణముననున్న వాసనచే మిథ్యాజ్ఞానయుతుఁడైన మనుజుడు మానసికవ్యథలచే బూర్ణుడై యుండును.

అసమ్యగ్దర్శనం యస్మాదనాత్మన్యాత్మ భావనమ్
యదవస్తుని వస్తుత్వం తచ్చిత్తం విద్ధి రాఘవ. 34

ఓ రామా! దేనిచే మిథ్యాజ్ఞానము, అనాత్మయందాత్మబుద్ధి, అవస్తువందు (దేహాదులందు) వస్తుత్వ (ఆత్మ) బుద్ధి కలుగునో దానినే చిత్తమని యెఱుంగుము.

దృఢాభ్యాసపదార్థైక వాసనాదతిచఞ్చలమ్
చిత్తం సంజాయతే జన్మజరామరణకారణమ్. 35

దృఢాభ్యాసముచే దేహాదిపదార్థములతోటి యభేదవాసన జనించుటచే జన్మజరామృత్యుకారణమగు అతిచపలమైన చిత్త ముద్భూతమగుచున్నది.

యదా న వాస్యతే కించిద్ధేయోపాదేయరూపి యత్
స్థీయతే సకలం త్యక్త్వా తదా చిత్తం న జాయతే. 36

చైతన్యమెపుడు త్యాజ్యగ్రాహ్యదృష్టి నవలంబింపక సమస్తమును వదలి వాసనారహితమై యుండునో, అపుడు చిత్తము జనింపకుండును.

అవాసనత్వాత్సతతం యదా న మనుతే మనః
అమనస్తా తదోదేతి పరమోపశమప్రదా. 37

వాసనాభావముచే మనస్సెపుడు లేశమైనను మననముచేయక యుండునో, అపుడు పరమశాంతిదాయకమగు అమనస్కముదయించును.

యదా కించిన్న సంవిత్తౌ స్ఫురత్యభ్రమివామ్బరే
తదా పద్మ ఇవాకాశే చిత్తమన్తర్న జాయతే. 38

ఆకాశమున మేఘము స్ఫురించునట్లు సంవిత్తునందేమియు నెపుడు స్ఫురింపకుండునో, అపుడాకాశమున కమలము జనింపనట్లు చైతన్యమున చిత్త ముదయింపకుండును.

యదా న భావ్యతే భావః క్వచిజ్జగతి వస్తుని
తదా హృదమ్బరే శూన్యే కథం చిత్తం ప్రజాయతే. 39

జగత్తునందలి పదార్థములెవ్వియు నెపుడు భావింపబడకుండునో అత్తం శూన్యమగు నాహృదయాకాశమున చిత్తమెట్లు ప్రాదుర్భవించును ?

ఏతావన్మాత్రకం మన్యే రూపం చిత్తస్య రాఘవ
యద్భావనం వస్తునోఽన్తర్వస్తుత్వేన రసేన చ. 40

ఓ రాఘవా ! రాగవశమున వస్తువును సత్యముగ భావించునదే చిత్తము. చిత్తరూపమింతియేయని నే నెంచెద.

న కించిత్కల్పనాయోగ్యం దృశ్యం భావయతస్తతః
ఆకాశకోశస్వచ్ఛస్య కుతశ్చిత్తోదయో భవేత్. 41

దృశ్యపదార్థము కల్పనాయుక్తులచే సమర్థింపయోగ్యముకాదని భావించునదియు, ఆకాశమువలె స్వచ్ఛమైనదియునగు ఆత్మయందు చిత్తోదయ మెట్లుగల్గును?

యదభావనమాస్థాయ యదభావస్య భావనమ్
యద్యథావస్తుదర్శిత్వం తదచిత్తత్వముచ్యతే. 42

బాహ్యవస్తువిస్మరణరూపమగు నిరోధయోగ మవలంబించి గావింపబడు సర్వదృశ్యమార్జనము నభావసంపాదకమైనట్టి ఆత్మవస్తుదర్శనమే అచిత్తత్వమనఁబడును.

సర్వమన్తః పరిత్యజ్య శీతలాశయవర్తి యత్
వృత్తిస్థమపి తచ్చిత్తమసద్రూపముదాహృతమ్. 43

అంతఃకరణముచే సర్వమును త్యజించినట్టి శీతలాశయవర్తియగు చిత్తము వృత్తితోఁగూడియున్నను దగ్ధవస్త్రాభాసమువలె అసద్రూపమనియే చెప్పబడును.

వాసనాయా రసాధ్యానాద్రాగో యస్య న విద్యతే
తస్య చిత్తమచిత్తత్వం గతం సత్త్వం తదుచ్యతే. 44

వాసనావశమున విషయములఁ ధ్యానింపక, వాటియందనురాగము లేకయుండువాని చిత్తము అచిత్తదశనొందినదనియు, అదియే సత్త్వమనియు వచింపబడును.

ఘనా న వాసనా యస్య పునర్జననకారిణీ
జీవన్ముక్తః స సత్త్వస్థశ్చక్రభ్రమవదాస్థితః. 45

మఱల జననమరణములఁ గలుగజేయునట్టి ఘనవాసనలేని జీవన్ముక్తుడు చక్రభ్రమణమువలె ప్రపంచకార్యములఁ జేయుచున్నను సదా సత్త్వముననే యుండియుండును.

భ్రష్టబీజోపమా యేషాం పునర్జననవర్జితా
వాసనారసనిర్హీనా జీవన్ముక్తా హి తే స్థితాః. 46

వేయించిన విత్తన మంకురింపనట్లు పునర్జన్మాంకురములేని, రాగరహితమైనట్టి వాసన గలవారీ ప్రపంచమున జీవన్ముక్తులైయే యున్నారు.

సత్త్వరూపపరిప్రాప్తచిత్తాస్తే జ్ఞానపారగాః
అచిత్తా ఇతి కథ్యన్తే దేహాన్తే వ్యోమరూపిణః. 47



సత్త్వరూపము నొందిన చిత్తముగలవారును, జ్ఞానపారంగతులునగు మహాత్ములు చిత్తరహితులనియే వచింపబడిరి. అట్టివారీ దేహాంతమున చిదకాశరూపమే యగుదురు.

ద్వే బీజే రామ చిత్తస్య ప్రాణస్పన్దనవాసనే
ఏకస్మింశ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః. 48

ఓ రామా ! చిత్తమునకు రెండు బీజములు గలవు. ఒకటి ప్రాణస్పందము, రెండవది వాసన. వీటిలో నొకటి నశించిన రెండును నాశమొందును.

మిథః కారణమేతే హి బీజే జన్మని చేతసః
జలాఙ్గీకరణే రామ జలాశయఘటావివ. 49

ఘటజలమునకు ఘటము, జలాశయము కారణమైనట్లు చిత్తోత్పత్తికి ప్రాణస్పంద, వాసనలు రెండును కలసి కారణమగును.

ఘనా న వాసనా యస్య పునర్జననకారిణీ
బీజాఙ్కురవదేతే హి సంస్థితే తిలతైలవత్. 50

పునర్జన్మకు కారణభూతమైన ఘనవాసనలేనివానికి ప్రాణస్పందవాసనలు రెండును తిలతైలములవలె పరస్పరమొకదానియందు మఱొకటియుండి బీజాంకురన్యాయముచే కాలక్రమమున నొకదానికొకటి కారణమై యొప్పును.

అవినాభావినీ నిత్యం కాలాకాఙ్క్షిక్రమే తథా
సర్వముత్పాదయత్యేతచ్చిత్తకః సంవిదాత్మకః. 51

అట్లనే కాలక్రమమున చిత్తముకూడ ఆరెంటికిని కారణమై ఇంద్రియ, సుఖదుఃఖాదుల నుత్పన్నమొనర్చును.

యథా ప్రాణేన్ద్రియానన్దమానన్దపవనావుభౌ
చిత్తస్యోత్పాదికే సార్థం యద్వైతే వాసనే తదా. 52

యథాక్రమముననీ చిత్తము మొదట ప్రాణమును, పిదప ఇంద్రియములను, ఆపిదప విషయానందమును, ఇవ్విధమున సమస్తమును యుత్పన్నమొనర్చుచున్నది. అట్లే ప్రాణవాయు, విషయానందములు రెండును పరస్పరముకూడి వాసనారూపమై చిత్తమును జనింపజేయుచున్నవి.

ఆమోదపుష్పవత్తైలతిలవచ్చ వ్యవస్థితే
వాసనావశతః ప్రాణస్పన్దస్తేన చ వాసనా. 53

ప్రాణస్పంద, వాసనలు రెండును పుష్పముగంధ, తిలతైలములవలె పరస్పరము కూడియున్నవి. వాసనచే ప్రాణస్పందమున్ను, ప్రాణస్పందముచే వాసనయున్ను గలుగుచున్నవి.

జాయతే చిత్తబీజస్య తేన బీజాఙ్కురక్రమః
వాసనోత్ప్లవమానత్వాత్సంవిత్క్షుభ్నోభకర్మణా. 54

ప్రాణస్పన్దం బోధయతి తేన చిత్తం ప్రజాయతే
ప్రాణిః స్పన్దనధర్మిత్వాత్స్పన్దతే స్పృష్టహృద్గుణః. 55

సంవిదం బోధయంస్తేన చిత్తబాలః ప్రజాయతే
ఏవం హి వాసనాప్రాణస్పన్దౌ ద్వౌ తస్య కారణమ్. 56

అందుచే చిత్తబీజక్రమమున్న బీజాంకురక్రమువంటిదై యున్నది. ఇందు వాసన యూర్ధ్వగతి గలదగుటచే సంవిత్ ప్రక్షోభమను క్రియద్వారా ప్రాణస్పందము నుద్బోధించును. దానిచే చిత్తము జనించును. మఱియు హృదయగుణములగు రాగాదులు ప్రేరణయొనర్చు ప్రాణధర్మములగుటచే సంవిత్తు నుద్బోధించును. దానిచే చిత్తమను బాలకుడుద్భవించును. ఇవ్విధమున ప్రాణస్పంద, వాసనలు రెండును చిత్తమునకు కారణములై యున్నవి.

తయోరేకక్షయే నాశో ద్వయోశ్చిత్తస్య రాఘవ
సుఖదుఃఖమనఃస్పన్దం శారీరకబృహత్ఫలమ్. 57
కార్యపల్లవితాకారం కృతివల్లితతివేష్టితమ్
తృష్ణాకృష్ణాహివలితం రాగరోగబకాలయమ్. 58
అజ్ఞానమూలం సుదృఢం లీనేన్ద్రియవిహంగమ్
వాసనా క్షయమానీతా చిత్తవృక్షం క్షణేన హి. 59
ప్రపాతయతి వాతౌఘః కాలపక్వఫలం యథా

ఓ రామా! ప్రాణస్పంద, వాసనలను నీరెంటిలో నొకటి నశించినను చిత్తము తప్పక నశించును. మఱియు కాలక్రమమున పరిపక్వఫలమును వాయువేగము పడగొట్టునట్లు సుఖదుఃఖములచే వ్యాకులమును మననమను చలనము గలదియు, శరీరమను గొప్పఫలముగల్గి యున్నదియు, క్రియలను పల్లవములతోఁగూడిన యాకృతి గలదియు, తృష్ణయను నల్లని సర్పముచే జుట్టబడినదియు, రాగ, రోగములను కొంగలకు నిలయమును. అజ్ఞానమను మిగుల దృఢమైన మూలముగలదియు ఇంద్రియములను పక్షులకు నెలవునగు చిత్తమను వృక్షమును, నశించిన వాసన క్షణములో బడద్రోయుచున్నది.

పాణ్డురీకృత సర్వాంశం స్థగితాఖిలదర్శనమ్. 60
విలోలజలదాకారమజ్ఞానావకరోత్థితమ్
తృష్ణాతృణలవవ్యాప్తం స్తమ్భాకృతి శరీరకమ్. 61
స్ఫురత్తను తనుక్షుబ్ధం సుఖముత్ప్లవనం ప్రతి
అన్తఃస్థితమహాలోకమపశ్యత్ప్రవిలీయతే. 62
పవనస్పన్దరోధాచ్చ రామ చిత్తరజః క్షణాత్

మఱియు నోరామా! దిక్కులనన్నింటిని మలినమొనర్చునదియు సర్వప్రాణులకు నేత్రమై యొప్పు చిద్రూపము నాచ్ఛాదించునదియు, చంచలమేఘాకృతి గలదియు, అజ్ఞానమను మూర్ఖునిచే జనించినదియు, తృష్ణయను తృణఖండములచే వ్యాప్తమును, స్తంభాకారమగు దేహమను నెలవుగలదియు, అత్యల్పప్రవృత్తియను వాయువుచే క్షుభితమును, దిక్కులందంతట సులభముగ నెగురుటయందు ప్రవీణమైనదియు, అంతఃకరణముననున్న బ్రహ్మప్రకాశమును (లేక, మహాసూర్యప్రకాశమును) జూడ నసమర్థమునునగు చిత్తమను ధూళి ప్రాణస్పందనిరోధముచే క్షణములో లయమొందును.



వాసనాప్రాణపవనస్పన్దయోరనయోర్ద్వయోః. 63
సంవేద్యం బీజమిత్యుక్తం స్ఫురతస్తౌ యతస్తతః
హృది సంవేద్య మాప్యైవ ప్రాణస్పన్దోఽథ వాసనా. 64

ప్రాణస్పంద, వాసనల రెంటికిని శబ్దస్పర్శాది విషయములుగూడ బీజమగును. ఏలనన శబ్దాదివిషయముల బొందియే ప్రాణస్పంద, వాసనలు రెండును హృదయమున నటునిటు స్ఫురించుచున్నవి.

ఉదేతి తస్మాత్సంవేద్యం కథితం బీజమేతయోః
సంవేద్యసంపరిత్యాగాత్ప్రాణస్పన్దనవాసనే. 65
సమూలం నశ్యతః క్షిప్రం మూలచ్ఛేదాదివ ద్రుమః
సంవిదం విద్ధి సంవేద్యం బీజం ధీరతయా వినా. 66

శబ్దాదివిషయప్రాప్తిచేతనే ప్రాణస్పంద, వాసనలుదయించుచున్నవి. కాన సంవేద్యమే (శబ్దాదులే) ప్రాణస్పంద, వాసనలకు బీజమని చెప్పబడినది. సంవేద్యమును త్యజించుటచే ప్రాణస్పంద వాసనలు రెండును మూలము నఱికిన వృక్షమువలె సమూలముగ శీఘ్రముగ నశించును. మఱియు సంవిత్తున్ను తన స్వాభావిక ధీరత్వమును వీడి సంవేద్యరూపమై చిత్తమునకు బీజముగ నుండును.

న సంభవతి సంవేద్యం తైలహీనస్తిలో యథా
న బహిర్నాన్తరే కించిత్సంవేద్యం విద్యతే పృథక్. 67

నువ్వులు లేకున్న నూనె గలుగనట్లు సంవిత్తు (వృత్తిజ్ఞానము) లేనిచో సంవేద్యము (శబ్దాది విషయములు) సంభవింపదు. మఱియు బాహ్యాభ్యంతర విషయములు సంవిత్తుకంటె వేఱు కావు.

సంవిత్స్ఫురన్తీ సంకల్పాత్సంవేద్యం పశ్యతి స్వతః
స్వప్నే యథాత్మమరణం తథా దేశాన్తరస్థితిః. 68
స్వచమత్కారయోగేన సంవేద్యం సంవిదస్తథా
స్వవేదనం స్వసంకల్పాత్సంవిదో యత్ర వర్తతే. 69

ఈ సంవిత్తు స్ఫురించుచు స్వప్నమున స్వమరణ, దేశాంతరస్థితులను తన చమత్కారయోగముచే గాంచునట్లు జాగ్రత్తునందును స్వసంకల్పముచేతనే పదార్థములఁ గాంచుచున్నది. మఱియు నేవివేకస్థితియందు స్వసంకల్పముచేనది తన్ను తానెఱుంగుచున్నదో, అట్టివివేకమున్ను స్వప్నతుల్యమే యగును. ఏలన అద్వైతబ్రహ్మమున స్వసంవేదన వివేకవిచారాదులు సంభవింపనేరవు!

జగజ్జాలమతో భాతి తదిదం రఘునన్దన
యథా బాలస్య వేతాలః ససంకల్పోద్భవాద్భవేత్. 70

ఓ రఘునందనా! స్వసంకల్పభ్రమచే బాలునకు బేతాలము గన్పించునట్లు సంవిత్తువలననే యీ జగజ్జాలమంతయు స్ఫురించుచున్నది.

పురుషత్వం యథా స్థాణోః సంవేద్యం సంవిదస్తథా
యథా చన్ద్రార్కరశ్మీనాం దణ్డతా రేణుతా తథా 71
యథా నౌస్థాచలస్పన్దః సంవేద్యం సంవిదస్తథా

స్థాణువు పురుషరూపమున భాసించునట్లు సంవిత్తు విషయరూపమున స్ఫురించుచున్నది. మఱియు, చంద్ర, సూర్యకిరణములు గృహచ్ఛిద్రములగుండా ప్రసరించి దండాకారమై, పరిభ్రమించు త్రసరేణువులయాకృతిని గన్పట్టునట్లును, నావయందున్నవానికి అచలములైన వృక్షాదులు చలించునట్లు గన్పడువిధమునను, సంవిత్తున్ను సంవేద్య ( విషయ ) రూపమున భాసించుచున్నది.

ఏతన్మిథ్యా హి దుర్జ్ఞానం సమ్యగ్జ్ఞానాద్విలీయతే. 72
రజ్జ్వామివ భుజఙ్గత్వం ద్విన్దుత్వం స్వీక్షితాదివ
శుద్ధైవ సంవిత్త్రిజగత్సంవేద్యం నాన్యదస్త్యలమ్. 73

రజ్జువునందలి సర్పత్వమున్ను, ద్విచంద్రభ్రాంతియు సమ్యక్‌దృష్టిచే నశించునట్లు, ఈ మిథ్యాజ్ఞానమున్ను సమ్యక్‌జ్ఞానముచే నశించును. ఈ ముల్లోకములును శుద్ధసంవిన్మాత్రమే యగును గాని అన్యమగు సంవేద్యమిట యేమియును లేదు.

ఇత్యన్తర్నిశ్చయో రూఢః సమ్యగ్జ్ఞానం విదుర్బుధాః
పూర్వం దృష్టమదృష్టం వా యదస్యాః ప్రతిభాసతే. 74
సంవిదస్తత్ప్రయత్నేన మార్జనీయం విజానతా
తదమార్జనమాత్రం హి మహాసంసారసంగతమ్. 75

అంతఃకరణమున నిట్టి దృఢనిశ్చయము గల్గియుండుటయే సమ్యక్‌జ్ఞానమని విజ్ఞులు బల్కుదురు. పూర్వము గాంచినదియు, గాంచనదియునగు యేదేది చిత్తమునకు స్ఫురించునో, దానినంతయు జ్ఞాని ప్రయత్నపూర్వకముగ తొలగింపవలెను. (మిథ్యారూపముగ నిశ్చయింపవలెను). అట్లుతొలగింపకుండుటయే ఆత్మకు మహాసంసారముతోటి సంబంధమగును.

తత్ప్రమార్జనమాత్రం తు మోక్ష ఇత్యనుభూయతే
సంవేదనమనన్తాయ దుఃఖాయ జననాత్మనే. 76

చిత్తముచే నీదృశ్యమును తొలగించుటయే మోక్షమను విషయ మనుభవసిద్ధమైనది. దృశ్యమును సత్యముగ నెంచుటయే జననమరణాది అనంతదుఃఖమునకు కారణమగుచున్నది.

అసంవిత్తిరజాడ్యస్థా సుఖాయాజననాత్మనే
అజడో గలితానన్దస్త్యక్తసంవేదనో భవ
అసంవేద్యప్రబుద్ధాత్మా యస్తు స త్వం రఘూద్వహ. 77

ఓ రామా ! విషయాదర్శనమే చిదేకరసమై, జడత్వరహితమైనట్టి ఆత్మస్వభావమున పరిణతమగును. కాన నీవు విషయదర్శనమును వదలి పూర్ణానంద స్వరూపుడవు గమ్ము. ఏలన, విషయరహితమగు స్వయంప్రబుద్ధమైన ఆత్మయే నీవైయున్నావు.



శ్రీరామ ఉవాచ:—

అజడశ్చాప్యసంవిత్తిః కీదృశో భవతి ప్రభో
అసంవిత్తౌ చ జాడ్యం తత్కథం వా వినివర్తతే. 78

శ్రీరాముడు:—ఓ ప్రభూ! జడత్వత్యాగముచే సంవేదన (జ్ఞాన)మున్ను, సంవేదనత్యాగముచే జడత్వమున్ను శేషించును. కాని ఒకేవస్తువు అజడమై, అసంవేదనమై (ఇట్లు విరుద్ధస్వభావను గల్గి) యెట్లుండగల్గును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యః సర్వత్రానవస్థాస్థో విశ్రాన్తాశో న కుత్రచిత్
జీవో న విన్దతే కించిదసంవిదజడో హి సః. 79

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా ! బాహ్యపదార్థములు సత్యములని నమ్ముటయే సంవిత్తనబడును. జీవన్ముక్తుడు భూతభవిష్యద్వర్తమానవిషయములందెచటను సత్యత్వబుద్ధి గల్గియుండడు. అట్లు సత్యరూపమున నెఱుంగకుండుటచే నాతడు కాష్ఠశిలాదులవలె సంవేదనరహితుడును, స్వయంప్రకాశకుడగుటచే జడత్వరహితుడున్ను నగును.

సంవిద్వస్తుదృశాలమ్బః స యస్యేహ న విద్యతే
సోఽసంవిదజడః ప్రోక్తః కుర్వన్కార్యశతాన్యపి. 80

పదార్థము లసత్యములని యెఱుంగుటనే సంవిత్తందురు. అట్టి సంవిత్తు నాశ్రయింపకయుండువాడీ ప్రపంచమున సర్వకార్యములఁ జేయుచున్నను అసంవిదుడనియు, అజడుడనియు చెప్పబడును.

సంవేద్యేన హృదాకాశో మనాగపి న లిప్యతే
యస్యాసావజడా సంవిజ్జీవన్ముక్తశ్చ కథ్యతే. 81

విషయములందలి సత్యత్వబుద్ధిచే యెవని చిత్తము వాటియందు లేశమైనను తగుల్కొనకయుండునో యాతడు అజడుడనియు, అసంవిదుడనియు, జీవన్ముక్తుడనియు వచింపబడును.

యదా న భావ్యతే కించిన్నిర్వాసనతయాత్మని
బాలమూకాదివిజ్ఞానమివ చ స్థీయతే స్థిరమ్. 82
తదా జాడ్యవినిర్ముక్తమచ్ఛవేదనమాతతమ్
ఆశ్రితం భవతి ప్రాజ్ఞో యస్మాద్భూయో న లిప్యతే. 83

వాసనారహితమగుటచే ఆత్మయందు పదార్థములెవ్వియు నెపుడు భావింపబడకుండునో, బాలునివలెను, మూగవానిచందమునను విజ్ఞానమెపుడుండునో, అపుడు జడత్వరహితమై, వ్యాపకమైనట్టి స్వచ్ఛజ్ఞానమే బుద్ధిమంతున కాశ్రయమగును. అద్దానిచే నాతడు మఱల విషయములందు తగుల్కొనకయుండును.

సమస్తవాసనాత్యాగీ నిర్వికల్పసమాధితః
నీలత్వమివ ఖాత్స్ఫార ఆనన్దః సంప్రవర్తతే. 84

ఆకాశమునుండి నీలత్వ ముద్భవముగునట్లు వాసనలనన్నింటిని త్యజించినవానికి నిర్వికల్ప సమాధిచే అనంతానందము ప్రవృత్తమగును.

యోగినస్తత్ర తిష్ఠన్తి సంవేదనమసంవిదః
తన్మయత్వాదనాద్యన్తం తదప్యన్తర్విలీయతే. 85

చిత్తరహితులగు యోగులు పరమానందస్వరూపముననే స్థితిగల్గియుందురు. అద్దాని యందు తన్మయులగుటచే అనాదియై, అనంతమైనట్టి వారి బ్రహ్మాకారసంవేదనమును బ్రహ్మ ప్రకాశమధ్యమున విలీనమగును.

గచ్ఛంస్తిష్ఠన్స్పృశఞ్జిఘ్రన్నపి తేన స ఉచ్యతే
అజడో గలితానన్దస్త్యక్తసంవేదనః సుఖీ. 86

నడచుచున్నను, కూర్చొనుచున్నను, చూచుచున్నను, సంవేదనము (వృత్తిజ్ఞానము) త్యజించువాడెల్లవేళలందును సుఖవంతుడనియు, అజడుడనియు, పరమానందరూపుడనియు వచింప బడును.

ఏతాం దృష్టిమవష్టభ్య కష్టయా యత్నచేష్టయా
తర దుఃఖామ్బుధేః పారమపారగుణసాగర. 87

అపారగుణసాగరుడవగు నోరామా! ఇట్టి దృష్టినవలంబించి శ్రమసాధ్యమగు ప్రాణా యామాది యత్నములచే దుఃఖసముద్రమును దాటుము.

యథా బీజాద్బృహద్వృక్షో వ్యోమ వ్యాప్నోతి కాలతః
తథైవేదం స్వసంకల్పాత్సంవేద్యమసదుత్థితమ్. 88

కాలక్రమమున బీజమునుండి యావిర్భవించి ఆకాశమును వ్యాప్తమొనర్చునట్టి మహా వృక్షమువోలె స్వసంకల్పముచే నావిర్భూతమైన యీ విషయప్రపంచము మిథ్యయైనది.

యదా సంకల్ప్య సంకల్ప్య సంవిత్సంవిన్దతే వపుః
తదాస్య జన్మజాలస్య సైవ గచ్ఛతి బీజతామ్. 89

మఱల మఱల సంకల్పించుచు సంవిత్తెపుడు స్వసంకల్పరూపమును జెందునో, అపుడదియే తన జన్మసమూహముయొక్క బీజభావమును పొందును.

జనయిత్వాత్మనాత్మానం మోహయిత్వా పునఃపునః
స్వయం మోక్షం నయత్యన్తః సంవిత్త్వం విద్ధి రాఘవ. 90

ఓ రామా! ఈ సంవిత్తు తన్నుతానే జనింపజేసికొని, మఱల మఱల మోహబఱచి తుదకు హృదయస్థమగు ఆత్మతత్వముం గాంచునపుడు స్వయముగనే తన్ను ముక్తినొందింప జేసికొనును.

యదేవ భావయత్యేషా తదేవ భవతి క్షణాత్
న భవద్భూమికాముక్తా సమాయాతి చిరాద్వపుః. 91

ఈ సంవిత్తు యెటుల భావించునో క్షణములో నటులే యగును. రాగాదులనుండి విముక్తిం బొందనిచో నది చిరకాలమునకైనను యథార్థమగు తన శుద్ధచిద్రూపమును పొందకుండును.



దేవో నాసౌ సురో రక్షో యక్షః కిం కిన్నరో జనః
ఆత్మైవాద్య విలాసిన్యా జగన్నాట్యం ప్రనృత్యతి. 92

ఈ గాన్పించు దేవాసురయక్షరక్షకిన్నరాదులు కల్పితులేగాని సత్యస్వరూపులుగారు. ఆత్మయే అనాదిసిద్ధయై విలాసవతియైన మాయతోగూడి యివ్విధమున జగన్నాటక మాడుచున్నది.

బద్ధ్వాత్మానం రుదిత్వా చ కోశకారకృమిర్యథా
చిరాత్కైవలతామేతి స్వయం సంవిత్స్వభావతః. 93

పట్టుపురుగువలె తన్నుతాను బంధించుకొని దుఃఖించుచు యీ సంవిత్తు స్వభావముగనే చిరకాలమునకు స్వయముగ కేవలత్వమును (ముక్తిని) పొందుచున్నది.

జగజ్జలధిజాలానాం సంవిజ్జలమలం గతా
ఏషైవాపూర్వదిక్చక్రం స్ఫురత్యద్ర్యాదితాం గతా. 94

ఈ సంవిత్తే జగత్తులను సముద్రములకు జలరూపమై అంతయు పూర్ణముగ వ్యాపించి యున్నది. అపూర్వదిఙ్మండలమంతయు నిదియే. పర్వతాదుల రూపమునను నిదియే స్ఫురించు చున్నది.

ద్యౌః క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
ఇత్యస్యా వీచయః ప్రోక్తాః సంవిత్సలిలసంతతేః. 95

అంతరిక్షము, భూమి, వాయువు, ఆకాశము, పర్వతములు, నదులు, దిక్కులు మున్నగు నవన్నియు సంవిత్సముద్రముయొక్క తరంగములనియే వచింపబడినవి.

సంవిన్మాత్రం జగత్సర్వం ద్వితీయా నాస్తి కల్పనా
ఇత్యేవ సమ్యగ్జ్ఞానేన సంవిద్గచ్ఛతి నాన్యతామ్. 96

ఈప్రపంచమంతయు సంవిన్మాత్రమే. ఇటు రెండవ కల్పనయే లేదనునీ సత్యజ్ఞానముచే సంవిత్తు అద్వైతబ్రహ్మరూపత్వము నొందుచున్నది.

యదా న విన్దతే కించిత్స్పన్దతే న న వేపతే
స్వాత్మన్యేవ స్థితిం యాతి సంవిన్నో లిప్యతే తదా. 97

ఈ సంవిత్తు యెపుడు న్యూనాధికచలనములు లేక స్వాత్మయందు స్థిరత్వమునొందునో, అపుడది దేనియందును తగుల్కొనక స్వస్వరూపముయొక్క సమ్యక్జ్ఞానము గలిగియుండును.

అథాస్యాః సంవిదో రామ సన్మాత్రం బీజముచ్యతే
సంవిన్మాత్రాదుదేత్యేషా ప్రాకాశ్యమివ తేజసః. 98

ఓరామా! ఇకనీసంవిత్తుయొక్క సన్మాత్రబీజమును వచించుచున్నాను వినుము. సంవిన్మాత్రమగు బ్రహ్మమునుండి యీ (ప్రతిబింబిత) సంవిత్తు సూర్యాదులనుండి ప్రకాశమువలె నుదయించుచున్నది.

ద్వే రూపే తత్ర సత్తాయా ఏకం నానాకృతి స్థితమ్
ద్వితీయమేకరూపం తు విభాగోఽయం తయోః శృణు. 99

ఓరామా! ఈ సత్తకు రెండు రూపములు గలవు. ఒకటి పలువిధ యాకారములుగలది. రెండవది ఏకమగు సన్మాత్రరూపమైనది. వాటి యా విభాగమునుగూర్చి వినుము.

ఘటతా పటతా చైవ త్వత్తా మత్తేతి కథ్యతే
సత్తారూపవిభాగేన యత్తన్నానాకృతి స్థితమ్. 100

ఘటము, వస్త్రము; నీవు, నేను మున్నగు విభాగములచే జెప్పబడు సత్త వివిధరూపములు గలది.

విభాగం తు పరిత్యజ్య సత్తైకాత్మతయా తతమ్
సామాన్యేనైవ సత్తయా రూపమేకముదాహృతమ్. 101

ఘటపటాది విభాగములఁ ద్యజించి సర్వుల యాత్మరూపముననున్నట్టి సత్త, సర్వప్రపంచమున కధిష్ఠానమగును సత్తాసామాన్యస్వభావముచే యేకరూపమని వచింపబడినది.

విశేషం సంపరిత్యజ్య సన్మాత్రం యదలేపకమ్
ఏకరూపం మహారూపం సత్తాయాస్తత్పదం విదుః. 102

ఘటపటాది విశేషములఁ ద్యజించి, సర్వత్రవ్యాపించి, నిర్లిప్తముగనున్న సన్మాత్రసత్త యొక్క యేకమగు మహద్రూపమునే వస్తుతత్త్వ (బ్రహ్మపద) మందురు.

రూపం నానాకృతిత్వేన సత్తయా న కదాచన
అసంవేద్యం సంభవతి తస్మాదేతదవస్తుకమ్. 103

ఘటపటాది వివిధరూపములనున్న సత్త ఆయా ఘటాదుల చూర్ణాద్యవస్థలందు యనువృత్తిరూపమున వ్యాప్తముగాకయున్నది. కాని సన్మాత్రమంతటను వ్యాపించియే యున్నది. అందుచే ఘటాదు లవస్తువనియు, సన్మాత్రమే సద్వస్తువనియు చెప్పబడుచున్నది.

ఏకరూపం తు యద్రూపం సత్తాయా విమలాత్మకమ్
న కదాచన తద్యాతి నాశం నాపి చ విస్మృతిమ్. 104

సత్తయొక్క యేకమైన నిర్మల సన్మాత్రరూపము యెపుడున్ను విస్మృతిగానిదై, నశింపకయుండును.

కాలసత్తా కలాసత్తా వస్తుసత్తేయమిత్యపి
విభాగకలనాం త్యక్త్వా సన్మాత్రైకపరో భవ. 105

కాలసత్త, కళాసత్త, వస్తుసత్త యనునీ విభాగకల్పనయంతయు త్యజించి సన్మాత్రైకపరాయణుఁడవుగమ్ము.

కాలసత్తా స్వసత్తా చ ప్రోన్ముక్తకలనా సతీ
యద్యప్యుత్తమసద్రూపా తథాప్యేషా న వాస్తవీ. 106

కాలసత్తయు సర్వజగత్సత్తవలె అధ్యస్తభేదకల్పనాత్యాగముచే సన్మాత్రమున శేషించుటచే ఉత్తమసత్తయేయగును. కాని విభక్తరూపమున బాధితమగుటచే వాస్తవముగానిదైయున్నది.



విభాగకలనా యత్ర విభిన్నపదదాయినీ
నానాతాకారణం దృష్ట్వా తత్కథం పావనం భవేత్. 107

భిన్నపదముల నొసంగు విభాగకల్పనగలదియు, అనేకత్వమునకు కారణమునునగునది పరమపావనమెట్లగును?

సత్తాసామాన్యమేవైకం భావయత్సకలం వపుః
పరిపూర్ణపరానన్దీ తిష్ఠాభరితదిగ్భరః. 108

ఓరామా! సత్తాసామాన్యరూపమున శరీరమంతటిని యేకరూపముగ భావించుచు, పరిపూర్ణ పరమానందము గల్గి, సర్వదిశలను, తదంతర్గత సర్వవస్తుసమూహమును పూర్ణమొనర్చి యుండుము.

సత్తాసామాన్యమాత్రస్య యా కోటిః కోవిదేశ్వర
సైవాస్య బీజతాం యాతా తత ఏవ ప్రవర్తతే. 109

జ్ఞాతలలో నుత్తముఁడవగు నోరామా! సత్తాసామాన్యముయొక్క పరమావధిభూతమైన సత్తయే యీ జగత్తుయొక్కయు, ప్రతిబింబిత చైతన్యము యొక్కయు బీజత్వము (కారణత్వము) నొందినది. ఏలన, దానినుండియే యిదంతయు ప్రవృత్తమైనది.

సత్తాసామాన్యపర్యన్తే యత్తత్కలనయోజ్ఝితమ్
పదమాద్యమనాద్యన్తం తస్య బీజం న విద్యతే. 110
సత్తాలయం యాతి యత్ర నిర్వికారం చ తిష్ఠతి
భూయో నావర్తతే దుఃఖే తత్ర లబ్ధపదః పుమాన్. 111

ధర్మధర్మివిభాగకల్పన లయమొందుటఁజేసి యెచట సత్-ధర్మమున్ను విలయమొందునో, అట్టినిర్వికారమగు (యాత్మ) పదమున స్థితినొందువాడిక మఱల నీ దుఃఖమయసంసారమునకు తిరిగి రాకుండును. మఱియు మోక్షమను పురుషార్థమును సాధించుటయందు సమర్థుడగుటచే నాతడే పురుషుఁడనబడును.

తద్ధేతుః సర్వహేతూనాం తస్య హేతుర్న విద్యతే
సంసారః సర్వసారాణాం తస్మాత్సారం న విద్యతే. 112

అట్టిపదము సర్వకారణములకును కారణమైనది. దానికి మఱొక కారణమేదియును లేదు. సర్వవస్తువుల సారమదియే. దానికి మఱొక సారమేదియును లేదు.

తస్మింశ్చిద్దర్పణే స్ఫారే సమస్తా వస్తుదృష్టయః
ఇమాస్తాః ప్రతిబిమ్బన్తి సరసీవ తటద్రుమాః. 113

చెఱువునందు తీరమందలి వృక్షములు ప్రతిబింబించునట్లు, అట్టి చైతన్యదర్పణమున యీ సర్వవస్తువులున్ను ప్రతిబింబించుచున్నవి.

సర్వేభావా ఇమే తత్ర స్వదన్తే సాధువారిధేః
షడ్రసా ఇవ జిహ్వాయాః ప్రకటత్వం ప్రయాన్తి చ. 114

ఆ ప్రత్యక్ - చైతన్యమున వశ్యస్తమగుటచేతనే సర్వపదార్థములును ప్రీతివంతములగుచున్నవి. జిహ్వకు షడ్రసములు వ్యక్తమగునట్లు, ఆ యానందసముద్రమునుండియే సర్వానందములును వ్యక్తమగుచున్నవి.

తస్మాదచ్ఛతరస్యాపి చిదాకాశస్య వై పదమ్
సర్వేషాం స్వాదుజాతీనామలమాస్వాదనం చ తత్. 115

స్వాదరహితములైనను విషయము లద్దాని సంయోగముచే స్వాదుత్వము నొందుచున్నవి. ఇక్కారణముననా చిదాకాశ స్వరూపము సమస్తస్వాదుజాతీయ ఆనందములందును, ప్రియవస్తువులందును అతిస్వాదువుగా, అతిప్రియతమమైనది.

జాయతే వర్తతే చైవ వర్ధతే స్పృశ్యతేఽథవా
తిష్ఠన్తి చ గలన్తీహ తత్రత్యా జగతాం గణాః. 116

ఆనందమయమగు నాపరమాత్మనుండియే సమస్తబ్రహ్మాండసమూహములు నుత్పన్నమగుచున్నవి. దానియందే స్థితిగల్గియున్నవి. దానియందే వృద్ధినొందుచున్నవి. దానినే స్పృశించుచున్నవి. తుదకు దానియందే లయించుచున్నవి.

తత్తద్గురు గరిష్ఠానాం తత్తల్లఘు లఘీయసామ్
తత్తత్స్థూలం స్థవిష్ఠానామణీయస్తదణీయసామ్. 117

దవీయసాం దవిష్ఠం తదన్తికానాం తదన్తికమ్
కనీయసాం కనీయస్తత్జ్యేష్ఠం జ్యాయసామపి. 118

ప్రసిద్ధమగు నాపరమాత్మ గురుతరవస్తువులన్నిటికంటెను గురుతమమును, లఘుతరవస్తువులన్నిటికంటె లఘుతమమును, స్థూలతరవస్తువులన్నిటికంటె స్థూలతమమును, అణుతరవస్తువులన్నిటికంటె అణుతమమునైయున్నది. మఱియునది దూరతర వస్తువులన్నిటికంటెను దూరమై, సమీపతరవస్తువులన్నిటికంటెను సమీపమై, కనిష్ఠవస్తువులన్నిటికంటెను కనిష్ఠమై, జ్యేష్ఠవస్తువులన్నిటికంటెను జ్యేష్ఠమైయున్నది.

తేజసామపి తత్తేజస్తమసామపి తత్తమః.
వస్తూనామపి తద్వస్తు దిశామప్యఙ్గ దిక్పరా. 119

అదియే (సూర్యాది) తేజములకు తేజమును, అంధకారములకు అంధకారమును, వస్తువులకు వస్తువును (ఆత్మయు), దిక్కులకు దిక్కును (అవకాశప్రదాతయు) నైయున్నది.

తన్న కించిచ్చ కించిచ్చ తత్తదస్తీవ నాస్తి చ
తత్తద్దృశ్యమదృశ్యం చ తత్తదస్మి న చాస్మి చ. 120

అది లోకప్రసిద్ధమున్ను కాదు; కాని అత్యంతప్రసిద్ధమున్ను అదియేయైయున్నది. భావాభావరూపమున్ను, దృశ్యాదృశ్యరూపమున్ను, ప్రత్యక్ - చైతన్య, అహంకారరూపములున్ను అదియే.

రామ సర్వప్రయత్నేన తస్మిన్పరమపావనే
పదే స్థితిముపాయాసి యథా కురు తథానఘ. 121



పాపరహితుఁడవగు నోరామా! ఏయుపాయముచే నీవాపరమపవిత్రమగు యాత్మపదమున స్థితినొందగలవో దానినే సర్వప్రయత్నములచేతను యాచరింపుము.

తదమలమజరం తదాత్మతత్త్వం
తదవగతావుపశాన్తిమేతి చేతః,
అవగతవితతైకతత్స్వరూపో
భవభయముక్తపదోఽసి తచ్చిరాయ. 122

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే
షూపశమప్రకరణే సంసృతిబీజవిచారయోగోపదేశో నామైకనవతితమః
సర్గః ॥ 91 ॥

ఓ రామా! ఆ యాత్మపదము పవిత్రమును, జరావర్జితమునగును. అద్దాని సాక్షాత్కారానుభవముచేతనే చిత్తము శాంతినొందును. ఎపుడు నీవావ్యాపకస్వరూపము నెఱుంగుదువో, అపుడే మఱల పునరావృత్తిలేక సంసారభయమునుండి విముక్తుఁడవగుదువు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సంసృతిబీజవిచారయోగోపదేశమను ఏకనవతితమ
సర్గము ॥ 91 ॥

---

## ద్వినవతితమః సర్గః

---

శ్రీరామ ఉవాచ:—

ఏతాని తాని ప్రోక్తాని త్వయా బీజాని మానద
కథమస్య ప్రయోగేణ శీఘ్రం తత్ప్రాప్యతే పదమ్. 1

శ్రీరాముడు:—మాననీయుడవగు నోమునీంద్రా! సంసారలతకు బీజములను తాము వచించియుండిరి. వానిలో యెద్దాని ప్రయోగము (నివృత్తి) చే పరమపదము సంప్రాప్తించును?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఏతేషాం దుఃఖబీజానాం ప్రోక్తం యద్యన్మయోత్తరమ్
తస్య తస్య ప్రయోగేణ శీఘ్రమాసాద్యతే పదమ్. 2

శ్రీవసిష్ఠుడు:—ఓ రామా! దుఃఖబీజములఁ గూర్చి నేనేయే యుత్తరముల నొసంగితినో వాటివాటి ప్రయోగముచే శీఘ్రముగ పరమపదము సంప్రాప్తించును.

[illegible]
పౌరుషేణ ప్రయత్నేన బలాత్సంత్యజ్య వాసనామ్. 3

స్థితిం బధ్నాసి తత్త్వజ్ఞ క్షణమప్యక్షయాత్మికామ్
క్షణేఽస్మిన్నేవ తత్సాధు పదమాసాదయస్యలమ్. 4

ఓ రామా! పురుషప్రయత్నముచే వాసనను బలపూర్వకముగ త్యజించి సత్తాసామాన్యము (శోధిత తత్పదార్థము) యొక్క పరాకాష్ఠయందున్న చిద్రూపము (శోధిత 'త్వం' పదార్థము) యొక్క ఐక్యముచే అఖండపదమున క్షణమైనను నిశ్చలస్థితి గల్గియుండుచో, తత్క్షణముననే నీవా యుత్తమపదమును పూర్ణరీతి పొందగలవు.

సత్తాసామాన్యరూపే వా కరోషి స్థితిమఙ్గ చేత్
తత్కించిదధికేనేహ యత్నేనాప్నోషి తత్పదమ్. 5

శోధితజగత్కారణమగు సత్తాసామాన్యరూపమున నీవు స్థితిగల్గియుండుచో, బోధరూపమగు అల్పయత్నముచేతనే నీవాత్మపదమును పొందగలవు.

సంవిత్తత్త్వే కృతధ్యానో యది తిష్ఠసి చానఘ
తద్యత్నేనాధికేనోచ్చైరాసాదయసి తత్పదమ్. 6

పాపరహితుఁడవగు నోరామా! శోధిత 'త్వం' పదార్థరూపమగు సంవిత్ - తత్త్వమున ధ్యాననిష్ఠుడవైయుండుచో అధిక యత్నముచే నాయున్నతపదమును బొందుదువు.

సంవేద్యే కేవలే ధ్యానం న సంభవతి రాఘవ
సర్వత్ర సంభవాదస్యాః సంవిత్తేరేవ సర్వదా. 7

ఓ రామా! కేవలము సంవేద్య (విషయ)మున ధ్యానము సంభవింపదు. ఏలన, విషయములకు పూర్వమే సదా యంతటను సంవిత్-స్ఫూర్తియే వ్యాప్తమైయున్నది. అందుచే సంవిత్తును సంవేద్యము కప్పుటకు శక్యముకాదు. అట్లు సంవిత్తు కప్పబడినచో విషయములే స్ఫురింపకుండునుగదా.

యచ్చిన్తయసి యద్యాసి యత్తిష్ఠసి కరోషి చ
తత్ర తత్ర స్థితా సంవిత్సంవిదేవ తదేవ సా. 8

ఓ రామా! నీవేది చింతనజేసెదవో, ఎచట నడచెదవో, ఎచట యుండెదవో, ఎచట క్రియఁజేసెదవో, అచటచట సంవిత్తున్నయుండును. కాన చింతన, చింతనీయము మున్నగునవన్నియు సంవిత్తేయగును.

వాసనాసంపరిత్యాగే యది యత్నం కరోషి చ
తత్తే శిథిలతాం యాన్తి సర్వాధివ్యాధయః క్షణాత్. 9

ఓ రామా! వాసనాత్యాగమునకై యత్నమొనర్చుచో క్షణములో నీ శారీరక, మానసిక దుఃఖములన్నియు నశించును.

పూర్వేభ్యస్తు ప్రయత్నేభ్యో విషమోఽయం హి సంస్మృతః
దుఃసాధ్యో వాసనాత్యాగః సుమేరూన్మూలనాదపి. 10

పై ప్రయత్నములన్నిటికంటెను యీ వాసనాత్యాగమే మిగుల భయంకరమైనదని వచింపబడినది. ఏలన, సుమేరుపర్వతమును పెకలించుటకంటెను వాసనాత్యాగము మిగుల దుస్సాధ్యమైనదగును.



యావద్విలీనం న మనో న తావద్వాసనాక్షయః
న క్షీణా వాసనా యావచ్చిత్తం తావన్న శామ్యతి. 11

ఎంతదనుక మనోలయము కాదో, అంతదనుక వాసనాక్షయమున్ను కాదు. వాసనలెంతవఱకు క్షయింపవో, అంతవఱకు చిత్తమున్ను శమింపదు.

యావన్న తత్త్వవిజ్ఞానం తావచ్చిత్తశమః కుతః
యావన్న చిత్తోపశమో న తావత్తత్త్వవేదనమ్. 12

(ఆత్మ) తత్త్వజ్ఞానము గలుగనంతవఱకు చిత్తశమనమెచట? చిత్తము శమింపనంతవఱకు వాసనాక్షయమెచట?

యావన్న వాసనానాశస్తావత్తత్త్వాగమః కుతః
యావన్న తత్త్వసంప్రాప్తిర్న తావద్వాసనాక్షయః. 13

వాసనలు నశింపనంతవఱకు తత్త్వజ్ఞానమెచట? (ఆత్మ) తత్త్వప్రాప్తి కలుగనంతవఱకు వాసనాక్షయమెచట?

తత్త్వజ్ఞానం మనోనాశో వాసనాక్షయ ఏవ చ
మిథః కారణతాం గత్వా దుఃసాధ్యాని స్థితాన్యతః. 14

తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనాక్షయములు మూఁడున్ను పరస్పరము కారణత్వమును బొందియున్నవిగాన దుస్సాధ్యములైనవి.

తస్మాద్రాఘవ యత్నేన పౌరుషేణ వివేకినా
భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వా త్రయమేతత్సమాశ్రయేత్. 15

ఓ రామా! ఇక్కారణమున జీవుడు వివేకయుక్తమగు పురుషప్రయత్నమొనర్చి, భోగేచ్ఛను దూరీకరించి వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములను నీమూఁటిని లెస్సగ నాశ్రయింపవలెను.

సర్వథా తే సమం యావన్న స్వభ్యస్తా ముహుర్ముహుః
తావన్న పదసంప్రాప్తిర్భవత్యపి సమాశతైః. 16

ఈ మూఁటిని యేకకాలము మఱల మఱల నభ్యసింపనంతవఱకు యెన్నివత్సరములకైనను నాబ్రహ్మపదము లభింపదు.

వాసనాక్షయవిజ్ఞానమనోనాశా మహామతే
సమకాలం చిరాభ్యస్తా భవన్తి ఫలదా మునే. 17

మననశీలుఁడవగునో మహామతీ! వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములు మూఁడును చిరకాల మభ్యసింపబడిననే ఫలప్రదములగును.

ఏకైకశో నిషేవ్యన్తే యద్యేతే చిరమప్యలమ్
తన్న సిద్ధిం ప్రయచ్ఛన్తి మన్త్రాః సంకీలితా ఇవ. 18

వాటిలో నొక్కొకటి వేయువేలుగ చిరకాలము పరిపూర్ణముగ నభ్యసింపబడినను దోష, ప్రతిబద్ధములగు మంత్రములవలె సిద్ధిని కలుగజేయజాలవు.

చిరకాలోపరచితా అప్యేతే సుధియాపి చ
ఏకశః పరమభ్యేతుం న శక్తాః సైనికా ఇవ. 19

ఒక్కొక యోధుడు విడివిడిగ శత్రుసైన్యమును జయింపజాలనట్లు, ఒక్కొకటిగ మహాబుద్ధిమంతునిచే చిరకాలము సేవింపబడినను యీవాసనాక్షయాదులు పరమాత్మను పొందింప సమర్థములుకావు.

సముద్యోగమానీతాః సన్త ఏతే హి ధీమతా
సంసారాబ్ధిం నికృన్తన్తి జలాన్యద్రితటానివ. 20

జలప్రవాహము పర్వతతటముల భేదించునట్లు, బుద్ధిమంతునిచే సమకాలమభ్యసింపబడిన యీమూఁడును సంసారసాగరమును విఛిన్నమొనర్చును.

వాసనాక్షయవిజ్ఞానమనోనాశాః ప్రయత్నతః
సమం సేవ్యాస్తవ చిరం తేన తాత న లిప్యసే. 21

ఓ రామా! వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములను నీమూఁటిని సమకాలముననే చిరము సేవించిన, నిస్సంగభావముగల్గి బ్రహ్మపదమున నీవు స్థితుఁడవగుదువు.

త్రిభిరేతైశ్చిరాభ్యస్తైర్హృదయగ్రన్థయో దృఢాః
నిఃశేషమేవ త్రుట్యన్తి బిసచ్ఛేదాద్గుణా ఇవ. 22

కమలనాళమును త్రుంచిన యందలి దారమున్ను తునిగిపోవునట్లు, ఈమూఁటిని చిరకాల మభ్యసించిన హృదయగ్రంథులు వీడిపోవును.

జన్మాన్తరశతాభ్యస్తా రామ సంసారసంస్థితిః
సా చిరాభ్యాసయోగేన వినా న క్షీయతే క్వచిత్. 23

ఓ రామా! ఈ సంసారస్థితి అనేక జన్మలందభ్యసింపబడియున్నది. కాన చిరకాలాభ్యాసములేనిచో నయ్యది క్షయింపదు.

గచ్ఛన్శృణ్వన్స్పృశఞ్జిఘ్రం స్తిష్ఠఞ్జాగ్రత్స్వపం స్తథా
శ్రేయసే పరమాయాస్య త్రయస్యాభ్యాసవాన్భవ. 24

ఓ రామా! నడచుచున్నను, కదలుచున్నను, తిరుగుచున్నను, వినుచున్నను, తాకుచున్నను వాసనజూచుచున్నను, మేల్కొనుచున్నను, నిద్రించుచున్నను, పరమశ్రేయమగు మోక్షముకొఱకు యీమూఁటిని (వాసనాక్షయాదులను) సదా యభ్యసించుచుండుము.

వాసనాసంపరిత్యాగసమం ప్రాణనిరోధనమ్
విదుస్తత్త్వవిదస్తస్మాత్తదాప్యేవం సమాహరేత్. 25

వాసనాత్యాగముతోబాటు ప్రాణాయామముగూడ చేయవలెనని తత్త్వజ్ఞులు బల్కుదురు. కాన యద్దానినిగూడ నభ్యసింపవలెను.



వాసనాసంపరిత్యాగాచ్చిత్తం గచ్ఛత్యచిత్తతామ్
ప్రాణస్పన్దనిరోధాచ్చ యథేచ్ఛసి తథా కురు. 26

వాసనాత్యాగ, ప్రాణనిరోధములచే చిత్తము అచిత్తత్వము నొందును. ఇట్లెటింగి యిక నీ యిచ్చవచ్చిన యాచరింపుము.

ప్రాణాయామచిరాభ్యాసైర్యుక్త్యా చ గురుదత్తయా
ఆసనాశనయోగేన ప్రాణస్పన్దో నిరుధ్యతే. 27

ప్రాణాయామాభ్యాసముచేతను, యోగాభ్యాసకుశలురగు గురువులొసంగిన యుక్తిచేతను, ఆసనజయముచేతను, హిత, మిత, పవిత్రభోజనముచేతను, యమనియమాది రూపమగు యోగముచేతను ప్రాణచలనము నిరుద్ధమగును.

యథాభూతార్థదర్శిత్వాద్వాసనా న ప్రవర్తతే
ఆదావన్తే చ వస్తూనామవిసంవాది యత్స్థితమ్. 28

నిర్వివాదమగు సన్మాత్రమైన ఆత్మయే సర్వవస్తువుల యాద్యంతములందును గలదను నీ యథార్థదర్శనముచే వాసన ప్రవర్తింపకుండును.

రూపం తద్దర్శనం జ్ఞానం క్షీయతే తేన వాసనా
నిఃసఙ్గవ్యవహారిత్వాద్భవభావనవర్జనాత్. 29

బహిర్ముఖులగు జనుల సాంగత్యము లేకుండుటచేతను, సాంసారిక మనోరథముల వీడుటచేతను, ఆత్మదర్శనము, జ్ఞానము కలుగును. వానిచే వాసన క్షయించును.

శరీరనాశదర్శిత్వాద్వాసనా న ప్రవర్తతే
వాసనావిభవే నష్టే న చిత్తం సంప్రవర్తతే. 30

శరీరనాశమును బరికించుటచే వాసన యుదయింపదు వాసనావిభవనాశముచే చిత్తము ప్రవర్తింపదు

సంశాన్తే పవనస్పన్దే యథా పాంసుర్నభస్తలే
యః ప్రాణపవనస్పన్దశ్చిత్తస్పన్దః స ఏవ హి. 31

వాయువు శమింప నాకసమున ధూళియు శమించునట్లు, ప్రాణస్పందము శమింప చిత్తస్పందమున్ను శమనమొందును. ఏలన, ప్రాణస్పందమే చిత్తస్పందమైయున్నది.

తస్మాజ్జగతి జాయన్తే పాంసవోఽవకరాదివ
ప్రాణస్పన్దజయే యత్నః కర్తవ్యో ధీమతోచ్చకైః. 32
ఉపవిశ్యోపవిశ్యైకచిత్తకేన ముహుర్ముహుః

ధూళి సమూహమునుండి ధూళిలేచునట్లు, యీ ప్రాణసంచలనకారణమున ప్రపంచమున ననేక యనర్థములు జనించుచున్నవి. కాన ప్రాణస్పందనిరోధమునకై యేకాంతమున గూరుచుండి పలుమారులు మిగుల గొప్పయత్నమాచరింపవలెను.

అథవైనం క్రమం త్యక్త్వా చిత్తాక్రమణమేవ చేత్. 33
రోచతే తత్తదాప్నోషి కాలేన బహునా పదమ్

ఓ రామా! ఇట్టి క్రమమందిష్టములేక చిత్తాక్రమణముననే యిష్టముగల్గియున్నచో చిరకాలమునకా యాత్మపదమును నీవు పొందెదవు.

న శక్యతే మనో జేతుం వినా యుక్తిమనిన్దితామ్. 34
అఙ్కుశేన వినా మత్తం యథా దుష్టం మతఙ్గజమ్

ఏలన, అంకుశములేక దుష్టమదగజము జయింప శక్యముగానట్లు, అధ్యాత్మశాస్త్రోక్తమగు నుత్తమ యత్నములేనిచో చిత్తమున్ను జయింప శక్యముకాదు.

అధ్యాత్మవిద్యాధిగమః సాధుసఙ్గమ ఏవ చ. 35
వాసనాసంపరిత్యాగః ప్రాణస్పన్దనిరోధనమ్
ఏతాస్తా యుక్తయః పుష్టాః సన్తి చిత్తజయే కిల. 36

అధ్యాత్మవిద్యాప్రాప్తి, సాధుమహాత్ముల సాంగత్యము, వాసనాత్యాగము, ప్రాణస్పందనిరోధమను నివియే చిత్తజయమునకు ప్రబలోపాయంబులగును

యాభిస్తజ్జీయతే క్షిప్రం ధారాభిరివ భూరజః
సతీషు యుక్తిష్వేతాసు హఠాన్నియమయన్తి యే. 37
చేతస్తే దీపముత్సృజ్య వినిఘ్నన్తి తమోఞ్జనైః
విమూఢాః కర్తుముద్యుక్తా యే హఠాచ్చేతసో జయమ్. 38
తే నిబధ్నన్తి నాగేన్ద్రమున్మత్తం బిసతన్తుభిః

జలధారలచే దుమ్ము యణగునట్లు, యీ పైయుక్తులచే చిత్తము శీఘ్రముగ జయింపబడును. ఇట్టి యుక్తులుండ, గురూక్తమార్గమును వదలి శరీరశోషణముచేతను మంత్ర, యంత్రాదులచేతను హఠముగ చిత్తమును వశీకరింపజూచువారు, దీపమును వదలి కాటుకచే యంధకారమును నశింపజేయువారును, కమలంపుదారములచే గొప్పమదపుటేనుగను బంధించువారును నగుదురు.

చిత్తం చిత్తస్య వాఽదూరం సంస్థితం స్వశరీరకమ్. 39
సాధయన్తి సముత్సృజ్య యుక్తిం యే తాన్హతాన్విదుః
భయాద్భయముపాయాన్తి క్లేశాత్క్లేశం వ్రజన్తి తే. 40

చిత్తమును, చిత్తసమీపముననున్న తన దేహమును స్థిరమొనర్చుటకై యుక్తినివదలియే మూఢులు ప్రయత్నించుదురో వారిని మహాత్ములు శతులందురు. అట్టివారొక భయమునుండి మఱొక భయమునకును, ఒకక్లేశమునుండి మఱొక క్లేశమునకును జనుచుందురు.

నిర్వృతిం నాధిగచ్ఛన్తి దుర్భగా ఇవ జన్తవః
భ్రమన్తి గిరికూటేషు ఫలపల్లవభోజనాః. 41

మఱియు వారు భాగహీనులవలె ఉత్తమధైర్యవిశ్రాంతిని పొందక, ఫలపల్లవములఁదినుచు పర్వతములపై జరించుచున్నారు.



ముగ్ధముగ్ధధియో భీతా వరకా హరిణా ఇవ
మతిరాలూనశీర్ణాఙ్గీ తదీయా పేలవాఙ్గికా. 42
న క్వచిద్యాతి విశ్వాసం మృగీ గ్రామగతా యథా
కల్లోలకలితం చేతస్తేషాం జల ఇవాహితే. 43
ప్రోహ్యతే ప్రపతద్దూరం తృణం గిరినదీష్వివ

వారు మిగుల మూర్ఖులై, బుద్ధిహీనులై, దీనులై, హరిణములవోలె భీతిల్లుచున్నారు శీర్ణమై, యల్పమైనట్టి వారి బుద్ధి, గ్రామమును జొచ్చినలేడి చందమున యెచటను విశ్వాసము నొందుటలేదు. జలమందు తరంగములవలె భయస్థానమున చింతలచే వ్యాప్తమై విషయములబడునట్టి వారి చిత్తము నదులందు తృణమువలె రాగాదులచే గొట్టుకొనిపోబడుచున్నది.

కాలం యజ్ఞతపోదానతీర్థదేవార్చనభ్రమైః. 44
చిరమాధిశతోపేతాః క్షపయన్తి మృగా ఇవ
ఆత్మతత్త్వం విధివశాత్కదాచిత్కేచిదేవ తే. 45
దుఃఖదోషశతాదగ్ధా విదన్తి న విదన్తి వా
ఆగమాపాయినోఽనిత్యా నరకస్వర్గమానుషైః. 46
పాతోత్పాతకరాకారాః క్షీయన్తే కన్దుకా ఇవ
ఇతో గచ్ఛన్తి నరకం తతః స్వర్గమిహైవ చ. 47
ఆవృత్తిభిర్నివర్తన్తే సరసీవ తరఙ్గకాః

మఱియు వారు యజ్ఞ, దాన, తప, తీర్థ, దేవార్చనాది భ్రమలతోగూడి, పెక్కు మానసిక వ్యథలుగల్గి హరిణములవలె యరణ్యములందు చిరకాలము కాలముగడపుచున్నారు. పలువిధదుఃఖములచేతను, రాగాది దోషములచేతను నలువైపుల పీడితులై, ఆత్మతత్వమును తెలిసికొనక యున్నారు. కొందఱధిక యత్నముచే తెలిసికొనుచును యున్నారు. ఉత్పత్తివినాశములుగల్గి అనిత్యమై, స్వర్గ, నరక, మనుష్య, భోగభేదనిమిత్తములచే పతనోత్పతములతో గూడినట్టి దేహములు గలవారై వారు కందుకములవలె సదా పీడితులగుచున్నారు. వారొకప్పుడు నరకమునకును, ఒకప్పుడు స్వర్గమునకు బోవుచుందురు. ఇవ్విధమున తటాకమందలి జలమువలె వారా వృత్తులు గల్గియే యుందురు

తస్మాదేతాం పరిత్యజ్య దుర్దృష్టిం రఘునన్దన. 48
శుద్ధాం సంవిదమాశ్రిత్య వీతరాగః స్థిరో భవ

కాన నోరామా! ఇట్టి దోషయుక్తమగు దృష్టిని వదలి, శుద్ధసంవిత్తు నాశ్రయించి, వీతరాగుడవై స్థిరముగనుండుము.

జ్ఞానవానేవ సుఖవాన్జ్ఞానవానేవ జీవతి
జ్ఞానవానేవ బలవాంస్తస్మాజ్జ్ఞానమయో భవ. 49

ఈ ప్రపంచమున జ్ఞానవంతుడే సుఖియగును. జ్ఞానవంతుని జీవితమే సఫలమైనది. జ్ఞానవంతుడే బలయుతుడు. కాన నీవు జ్ఞానివే గమ్ము.

సంవేద్యవర్జితమనుత్తమమాద్యమేకం
సంవిత్పదం వికలనం కలయన్మహాత్మన్,
హృద్యేవ తిష్ఠ కలనారహితః క్రియాం తు
కుర్వన్నకర్తృపదమేత్య శమోదితశ్రీః. 50

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయే షూపశమప్రకరణే సంసృతినిరాకరణక్రమయోగోపదేశో నామ ద్వినవతితమః సర్గః ॥ 92 ॥

మహాత్ముఁడవగు నోరామా! విషయవర్జితమై, సర్వోత్తమమై అనాదియై, కల్పనారహితమై, నిర్వికారమైనట్టి సంవిత్-పదమును భావించుచు కల్పనావర్జితుఁడవై హృదయాకాశము (బ్రహ్మము) ననే స్థితుఁడవు గమ్ము. వ్యుత్థానకాలమున యథోచితములగు క్రియల నాచరించుచున్నను శమముచే నుదితమగు, జీవన్ముక్తుల గుణసంపద గల్గి అకర్తృపదమునే పొందియుండుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున సంసృతినిరాకరణక్రమయోగోపదేశమను ద్వినవతితమ సర్గము ॥ 92 ॥

---

## త్రినవతితమః సర్గః

---

శ్రీవసిష్ఠ ఉవాచ:—

మనాగపి విచారేణ చేతసః స్వస్య నిగ్రహః
మనాగపి కృతో యేన తేనాప్తం జన్మనః ఫలమ్. 1

శ్రీవసిష్ఠుడు:— ఓ రామా! అల్పవిచారణచేనైనను యెవడు తన చిత్తమును కొంచెమైన నిగ్రహించుకొనునో యాతడే తన జీవితఫలమును పొందినవాడగును.

విచారకణికా హ్యేషా హృది స్ఫురతి పేలవా
ఏషైవాభ్యాసయోగేన ప్రయాతి శతశాఖతామ్. 2

విచారణయను కల్పవృక్షముయొక్క కోమలాంకురమైనను హృదయమున స్ఫురించుచోనదియే అభ్యాసయోగముచే క్రమముగ అనంతశాఖాయుతమగును.

కించిత్ప్రౌఢవిచారం తు నరం వైరాగ్యపూర్వకమ్
సంశ్రయన్తి గుణాః శుద్ధాః సరః పూర్ణమివాణ్డజః 3

నిండుసరస్సును పక్షులు, చేపలు ఆశ్రయించునట్లు, కొంచెము ప్రౌఢవిచారముగల వైరాగ్యయుతుడగు మానవుని శమదమాది శుద్ధగుణములన్నియు ఆశ్రయించును.



సమ్యగ్విచారణం ప్రాజ్ఞం యథాభూతావలోకినమ్
ఆసాదయన్త్యపి స్ఫారా నావిద్యావిభవా భృశమ్. 4

ఉత్తమవిచారయుక్తుడును, యథార్థమగు ఆత్మతత్త్వమును గాంచువాడును, బుద్ధిమంతుడునగు జ్ఞానిని బ్రహ్మదేవునివలెనుగల అనంతైశ్వర్యముగూడ ప్రలోభితమొనర్ప జాలదు.

కిం కుర్వన్తీహ విషయా మానస్యో వృత్తయస్తథా
ఆధయో వ్యాధయో వాపి సమ్యగ్దర్శనసన్మతేః.

ఆత్మసాక్షాత్కారమను సమ్యగ్దర్శనముగల ఉత్తమబుద్ధిమంతుని విషయములుగాని మానసికవృత్తులుగాని, శారీరికమానసికవ్యథలుగాని యేమి చేయగలవు?

క్వ భ్రమత్పవనాపూరాస్తడిత్పటలపాటలాః
పుష్కరావర్తజలదా గృహీతా బాలముష్టిభిః. '6

భ్రమణశీలమై, వాయువేగసహితమై, మెఱపులతోగూడి పీతవర్ణయుతమైనట్టి ప్రళయకాలిక పుష్కరావర్తమేఘములు బాలుర పిడికిళ్లచే గ్రహింపబడునా?

క్వ నభోమధ్యసంస్థేన్దుర్ముగ్ధైర్మణిసముద్గకైః
ముగ్ధయాఽఙ్గనయా బద్ధో ముగ్ధేన్దీవరశఙ్కయా. 7

వికాసముచే మనోహరమైన రాత్రికమలములచే తన నేత్రపరాభవమును గూర్చిన యాశంకచే ముగ్ధస్త్రీ ఆకాశమధ్యమందున్న చంద్రుని రత్నపేటికయందెపుడైన బంధించినదా?

క్వ కటప్రోచ్చలద్భృఙ్గమణ్డలోత్పలశేఖరాః
ముగ్ధస్త్రీశ్వాసమధురైర్గ్మశకైర్మథితా గజాః. 8

గండస్థలములనుండి యెగురుచున్న తుమ్మెదలచే నీలకమలములవలె శోభించునట్టి శిరోభాగములుగల గజములను, ముగ్ధస్త్రీశ్వాసకంటె కోమలమగు దోమ లెపుడైన వధించినవా?

క్వేభముక్తాఫలోల్లాసలసత్సన్నఖపఞ్జరాః
సింహాః సమరసంరబ్ధా హరిణైః ప్రవిమర్దితాః. 9

తనచే వధింపబడిన యేనుగులయొక్క గండస్థలములందలి ముత్యములచే శోభించు గోళ్లు గలవియు, యుద్ధమున గర్వముగల్గియుండునవియునగు సింహములను లేళ్లెపుడైన చంపినవా?

క్వ విషోల్లాసనిర్వాసదగ్ధోన్నతవనద్రుమాః
క్షుధితాజగరాః క్షుద్రైర్నిగీర్ణా బాలదర్దురైః. 10

విషాధిక్యతచే స్రవించినట్టి విషబిందువులచే మిగుల యెత్తైన వనవృక్షములఁ గూడ దగ్ధమొనర్చునవియు, మిగుల యాకలిగొనినవియునగు కొండచిలువలను చిన్నకప్పలెపుడైన మ్రింగినవా?

క్వ ప్రాప్తభూమికో ధీరో జ్ఞాతజ్ఞేయో వివేకవాన్
ఆక్రాన్తః కిల విక్రాన్తో విషయేన్ద్రియదస్యుభిః. 11

నాల్గవ లేక, అయిదవ భూమికను పొందినవాడును, ధీరుడును, జ్ఞేయము నెఱిఁగినవాడును, వివేకియునగు బ్రహ్మజ్ఞాని విషయేంద్రియములను శత్రువులచే యెపుడైన జయింపబడెనా?

విచారధియమప్రౌఢాం హరన్తి విషయారయః
ప్రచణ్డపవనామృద్వీం కృతవృన్తాం లతామివ. 12

మూలమునఱుకబడిన మృదువైన తీగెను ఝుంఝూమారుతమీడ్చుకొనిపోవునట్లు, దుర్బల విచారయుక్తమగు బుద్ధిని విషయములను శత్రువులు హరించివైతురు.

న వివేకలవం ప్రౌఢం భఙ్క్తుం శక్తా దురాశయాః
కల్పక్షోభమహాధీరం శైలం మన్దానిలా ఇవ. 13

మహాస్థైర్యముగల్గి కల్పక్షోభమునందును చలింపనట్టి మేర్వాది పర్వతములను పిల్లవాయువులు చలింపజేయజాలనట్లు, ప్రౌఢమగు వివేకమును రాగాదివృత్తులు లేశమాత్రమైనను నాశమొనర్పజాలవు.

అగృహీతమహీపీఠం విచారకుసుమద్రుమమ్
చిన్తావాత్యావిధున్వన్తి నాస్థిరస్థితిసుస్థితమ్. 14

భూపీఠమునాశ్రయింపని (అదృఢమైన) విచారమను పుష్పవృక్షమునే చింతయను తుపాను కదలింపగలదుగాని దృఢముగ నాటుకొనిన విచారవృక్షమును గాదు.

గచ్ఛతస్తిష్ఠతో వాపి జాగ్రతః స్వపతోఽపి వా
న విచారమయం చేతో యస్యాసౌ మృత ఉచ్యతే. 15

నడచుచున్నను, కూర్చొనుచున్నను, మేల్కొనియున్నను నిదురించుచున్నను, యెవరి చిత్తము (తత్వ) విచారమయమైయుండదో యాతడు మృతుఁడనియే చెప్పబడును.

కిమిదం స్యాజ్జగత్కిం స్యాద్దేహమిత్యనిశం శనైః
విచారయాధ్యాత్మదృశా స్వయం వా సజ్జనైః సహ. 16

ఓ రామా! ఈ ప్రపంచమేమి? ఈ దేహమేమి? అని నిరంతరము అధ్యాత్మదృష్టితో స్వయముగనో, లేక సజ్జనులతోగూడియో విచారణ సల్పుము.

అన్ధకారహరేణాశు విచారేణ పరం పదమ్
దృశ్యతే విమలం వస్తు ప్రదీపేనేవ భాస్వతా. 17

ప్రకాశవంతమగు దీపముచే వస్తువులు గనబట్టునట్లు, ప్రమాదమను చీకటిని నశింపజేయు విచారముచే విమలమగు పరమపదము గానుపించును.

జ్ఞానేన సర్వదుఃఖానాం వినాశ ఉపజాయతే
కృతాలోకవిలాసేన తమసామివ భానునా. 18

ప్రకాశముచే విలాసమొనర్పు సూర్యునిచే యంధకారము నశించునట్లు, జ్ఞానముచే సర్వదుఃఖములున్ను నశించును.



జ్ఞానే ప్రకటతాం యాతే జ్ఞేయం వ్యయముదేత్యలమ్
రవావభ్యుదితే భూమావాలోక ఇవ నిర్మలః. 19

సూర్యుడుదయించ, భూతలమున నిర్మలప్రకాశము వ్యాపించునట్లు, జ్ఞానము వ్యక్తముకాగా జ్ఞేయము స్వయముగనే పూర్ణరీతి యుదయించును.

యేన శాస్త్రవిచారేణ బ్రహ్మతత్త్వం ప్రబుధ్యతే
తద్భావనముచ్యతే జ్ఞేయాదభిన్నమివ సంస్థితమ్. 20

బ్రహ్మతత్వమెఱింగింపజేయునదియు, జ్ఞేయముతోటి యభిన్నరూపమున నున్నదియునగు శాస్త్రవిచారమే జ్ఞానమనఁబడును.

విచారోత్థాత్మవిజ్ఞానం జ్ఞానమఙ్గ విదుర్బుధాః
జ్ఞేయం తస్యాన్తరేవాస్తి మాధుర్యం పయసో యథా. 21

విచారముచే జనించిన యాత్మజ్ఞానమునే విజ్ఞులు జ్ఞానమందురు. క్షీరమున మాధుర్యమున్నట్లు అట్టిజ్ఞానముననే జ్ఞేయమున్ను గలదు.

సమజ్ఞానసమాలోకః పుమాఞ్జ్ఞేయమయః స్వయమ్
భవత్యాపీతమైరేయః సదా మదమయో యథా. 22

మద్యముత్రావువాడెల్లపుడు మదయుక్తుడైయుండునట్లు, సమ్యక్జ్ఞానముచే సమ్యక్ప్రకాశయుక్తుడగు మనుజుడెల్లపుడు స్వయముగ జ్ఞేయమయుడై యుండును.

సమం స్వరూపమమలం జ్ఞేయం బ్రహ్మ పరం విదుః
జ్ఞానాభిగమమాత్రేణ తత్స్వయం సంప్రసీదతి. 23

సమమై, నిర్మలమై, పరమైనట్టి బ్రహ్మమునే జ్ఞేయమందురు. జ్ఞానప్రాప్తిమాత్రముచే నది స్వయముగ అవిద్యా, తత్కార్యరహితమైనదగును.

జ్ఞానవానుదితానన్దో న క్వచిత్పరిమజ్జతి
జీవన్ముక్తో గతాసఙ్గః సమ్రాడాత్మేవ తిష్ఠతి. 24

జ్ఞానవంతుఁడానందయుతుడై యెందును సంలగ్నముగాక యుండును. ఆతడు జీవన్ముక్తుడై, సంగదోషరహితుడై, సమ్రాడాత్మవలె పూర్ణమనోరథుడైయుండును.

జ్ఞానవాన్హృద్యశబ్దేషు వీణావంశరవాదిషు
కామిన్యాః కాన్తగీతేషు సంభోగమలినేషు చ. 25
వసన్తమదమత్తానాం షట్పదానాం స్వనేషు చ
ప్రావృట్ప్రసరపుష్టేషు జలదస్తనితేషు చ. 26
ఉత్తాణ్డవశిఖణ్డేషు కేకాకలరవేషు చ
రణితామ్భోజఖణ్డేషు సారసక్వణితేషు చ. 27
కర్తర్యాటికరాన్తేషు గమ్భీరమురజేషు చ.
తతావనద్ధసుషిర చిత్రవాద్యస్వనేషు చ. 28

కేషుచిన్న నిబధ్నాతి రూక్షేషు మధురేషు చ
రణితేషు రతిం రామ పద్మేష్వివ నిశాకరః. 29

వీణ, వేణువు మున్నగువాని మధురధ్వనులందును, విషయభోగములచే మలినులగు వనితల ప్రియగీతములందును, వసంతకాలమదముచే మదించినట్టి తుమ్మెదల శబ్దములందును, వర్షాకాలిక పుష్పములందును, మేఘధ్వనులందును, నెమళ్ల నృత్య, మధురగీతములందును, శబ్దించు మేఘఖండము లందును, సారసపక్షుల మధురనాదములందును, మురళీవీణామృదంగాది విచిత్రవాద్య విశేషము లందును, దేనియందునుగూడ జ్ఞానవంతుడు తనచిత్తమును లగ్న మొనర్పడు. పద్మములందు చంద్రుడు ప్రీతిలేకయుండునట్లు, కర్కశ మధురశబ్దములం దాతడాసక్తి లేకయుండును.

జ్ఞానవాన్బాలకదలీస్తమ్భపల్లవపాలిషు
సురగన్ధర్వకన్యాఙ్గలతానన్దనకేలిషు. 30
కేషు క్వచిన్న బధ్నాతి స్వాయత్తేష్వప్యసక్తధీః
రామ స్పర్శరతిం ధీరో హంసో మరుమహీష్వివ. 31

నూతనకదళీస్తంభపల్లవసమూహముచే శోభించునదియు, దేవగన్ధర్వకన్యల అవయవములను లతలచే మనోహరమైనదియునగు నందనవనక్రీడలందును, వేటియందునుగూడ జ్ఞాని ప్రీతిగల్గియుండడు. మఱియు మరుభూమియందు హంస ప్రీతిలేక యుండునట్లు తన స్వాధీనమునందున్న విషయములందుగూడ యాతడాసక్తి లేకయుండును.

జ్ఞానవాన్పిణ్డఖర్జూరకదమ్బపనసాదిషు
మృద్వీకౌర్వారుకాక్షోటబిమ్బజమ్బీరజాతిషు. 32
మదిరామధుమైరేయమాధ్వీకాసవభూమిషు
దధిక్షీరఘృతామిక్షానవనీతౌదనాదిషు. 33
షడ్రసేషు విచిత్రేషు లేహ్యపేయవిలాసిషు
ఫలేష్వన్నేషు మూలేషు శాకేష్వప్యామిషేషు చ. 34
కేషుచిన్నానుబధ్నాతి తృప్తమూర్తిరసక్తధీః
ఆస్వాదనరతిర్విప్రః స్వశరీరలవేష్వివ. 35

స్వశరీరమాంసఖండములందు బ్రాహ్మణుడు ప్రీతిలేకయుండునట్లు, అసక్తబుద్ధియు, పరితృప్తుడునునగు జ్ఞాని ఖర్జూర, కదంబ, పనస, ద్రాక్షాది ఫలములందును, మద్య, మధు, మైరేయ మాధ్వీక, ఆసవాది మద్యభేదములందును, దధి, క్షీర, ఘృత, నవనీతాన్నాది పదార్థములందును, భక్ష్య, భోజ్య, లేహ్య, పేయాదులతో గూడిన విచిత్రములగు షడ్రసములందును, ఇంకను వివిధ ములగు ఫల, మూల, శాక, మాంసాదులందును ప్రీతిలేకయుండును.

జ్ఞానవాన్యమచన్ద్రేన్ద్రరుద్రార్కానిలసద్మసు
మేరుమన్దరకైలాససహ్యదర్దురసానుషు. 36



కౌశేయదలజాతేషు చన్ద్రబిమ్బకలాదిషు
కల్పపాదపకుఞ్జేషు దేహశోభావిలాసిషు. 37
రత్నకాఞ్చనకుడ్యేషు ముక్తామణిమయేషు చ
తిలోత్తమోర్వశీరమ్భామేనకాఙ్గలతాసు చ. 38
కేషుచిద్దర్శనం శ్రీమాన్నాభివాఞ్ఛత్యసక్తధీః
పరిపూర్ణమనా మానీ మానీ శత్రుషు చాచలః. 39

యమ, చంద్ర, రుద్ర, సూర్య, వాయ్వాది స్థానములందును, మేరు, మందర, కైలాస, సహ్య, దర్దురాది పర్వతసానువులందును, పట్టువలె మృదువైన పల్లవసమూహములందును, చంద్రబింబ కళాదులందును, దివ్యశరీరసంపత్తిచే విలాసముగనున్న కల్పవృక్షకుంజరములందును, ముక్తామాణిక్య జటితములగు సువర్ణ, రత్న కుడ్యములందును, తిలోత్తమ, ఊర్వశి, రంభ, మేనక మున్నగు దేవతాస్త్రీల అవయవములను లతలందును, జ్ఞాని ఆసక్తిలేక వాటిదర్శనమైన యపేక్షింపక, పరి పూర్ణచిత్తుడై, మానయుతుడై, మానియై, శత్రువులందచలుడైయుండును.

జ్ఞానవాన్కున్దమన్దారకహ్లారకమలాదిషు
కుముదోత్పలపున్నాగకేతక్యగురుజాతిషు. 40
కదమ్బచూతజమ్బ్వామ్రకింశుకాశోకశాఖిషు
జపాతిముక్తసౌవీరబిమ్బపాటలజాతిషు. 41
చన్దనాగురుకర్పూరలాక్షామృగమదేషు చ
కాశ్మీరజలవఙ్గైలాకఙ్కోలతగరాదిషు. 42
కేషుచిన్న నిబధ్నాతి సౌగన్ధ్యరతిమేకధీః
సమబుద్ధిరవిక్షోభో మద్యామోదేష్వివ ద్విజః. 43

మద్యపుగంధమున విప్రుడాసక్తిలేకుండునట్లు ప్రియాప్రియములందు సమబుద్ధిగలవాడును, బ్రహ్మనిష్ఠుడునునగు జ్ఞాని కుంద, మందార, రక్తకమల, నీలకమల, కుముద, పున్నాగ, కేతక్యాది పుష్పజాతులందును, కదంబ, చూత, జంబూ, ఆమ్ర, కింశుక, అశోకాది వృక్షములందును, జప, అతిముక్త, సౌవీర, బింబ, పాటలాది లతాజాతులందును, చందన, అగరు, కర్పూర, లాక్ష, కస్తూరీ, కేసర, లవంగ, కంకోల, తగరాది గంధములందును ప్రీతిలేకయుండును.

అబ్ధౌ గుడగుడారావే ప్రతిశ్రుత్కస్వనే గిరౌ
నినాదే చ మృగేన్ద్రాణాం న క్షుభ్యతి మనాగపి. 44
ద్విషద్భేరీనినాదేన పటహారణితేన చ
కటుకోదణ్డఘోషేణ న బిభేతి మనాగపి. 45

సముద్రపు గుడగుడారావములవలనను, ఆకాశజనిత ప్రతిధ్వనులవలనను, సింహధ్వనుల వలనను, శత్రువుల భేర్యాది నాదములవలనను, డమరుకశబ్దములవలనను, కర్ణకటువగు ధనుష్టంకార మువలనను జ్ఞాని కొంచెమైనను భీతిల్లకయుండును.

మత్తవారణబృంహాసు వేతాలకలనాసు చ
పిశాచరక్షఃక్ష్వేడాసు మనాగపి న కమ్పతే. 46

మదగజముల ఘీంకారములచేతను, బేతాలముల కలహములచేతను, పిశాచరాక్షసాదుల యఱపులచేతను, జ్ఞాని లేశమైనను చలింపకయుండును.

అశనిస్వనఘోషేణ నగస్ఫోటరవేణ చ
ఐరావణనినాదేన సమగ్ధ్యానీ న కమ్పతే. 47

సమ్యగ్జ్ఞానయుక్తుడు పిడుగుల శబ్దములచేగాని, పర్వతముల యాస్ఫోటనములచేగాని, ఐరావతముల ఘీంకారములచేగాని చలింపకయేయుండును.

మహాత్రక్రకచకాషేణ సితాసిదలనేన చ
శరాశనినిపాతేన కమ్పతే న స్వరూపతః. 48

కదలుచుండు అంపముయొక్క ఘర్షణచేగాని, తీక్ష్ణమైన ఖడ్గముయొక్క ఛేదనముచేగాని, బాణ, వజ్రపాతములచేగాని జ్ఞాని స్వస్వరూపమునుండి చలింపకయుండును.

నానన్దమేత్యుపవనే న ఖేదముపగచ్ఛతి
న ఖేదమేతి మరుషు నానన్దముపగచ్ఛతి. 49

వనవాటికయందును, మరుభూమియందునుగూడ యతడానందముగాని, దుఃఖముగాని పొందకుండును.

పూతాఙ్గారసమాకల్పసైకతేష్వపి ధన్వసు
పుష్పప్రకరసంఛన్నమృదుశాద్వలభూమిషు. 50
క్షురధారాసు తీక్ష్ణాసు శయ్యాసు చ నవోత్పలైః
ఉన్నతాచలదేశేషు కూపకోశలతేషు చ. 51
శిలాస్వర్కాంశురూక్షాసు మృద్వీషు లలనాసు చ
సంపత్స్వాపత్సు చోగ్రాసు రమణేషూత్సవేషు చ. 52
విహరన్నపి నోద్వేగీ నానన్దముపగచ్ఛతి
అన్తర్ముక్తమనా నిత్యం కర్మకర్తేవ తిష్ఠతి. 53

భస్మముచే గప్పబడిన నిప్పుకణికవలె సహింపరాని వేడిమిగల యిసుకతోగూడిన మరుభూములందును, పుష్పసమూహములచే గప్పబడిన మృదువైన లేపచ్చికబయళ్లయందును, తీక్ష్ణమైన ఖడ్గముయొక్క ప్రహారములందును, నూతన కమలములచే నాచ్ఛాదితమగు శయ్యలపైనను, ఎత్తైన పర్వతములందును, బావుల యడుగుభాగములందును, సూర్యకిరణములచే సంతప్తమగు శిలలపైనను, మృదువైన తీగెలందును, సంపదలందును, గొప్పయాపదలందును విహరించుచున్నను తత్త్వజ్ఞుడు భయమునుగాని, ఆనందమునుగాని పొందక, భారమును మోయువాండలయుటచే భారమును దించి విశ్రాంతిసుఖమును అనుభవించునట్లు, సదా యంతర్ముఖచేతస్కుడై విశ్రాంతిని, ఆనందమును పొందుచుండును.



అయఃసంకుచితాఙ్గాసు నరకారణ్యభూమిషు
పరస్పరేరితానన్తకున్తతోమరవృష్టిషు. 54
న బిభేతి న వాదత్తే వైవశ్యం నచ దీనతామ్
సమః స్వస్థమనా మానీ ధీరస్తిష్ఠతి శైలవత్. 55

లోహమయయంత్రములచే అవయవములను సంపీడితమొనర్చు నరకారణ్యభూములందును, కుంత, తోమరాది అస్త్రములవృష్టిగురియు తావులందును, జ్ఞాని భీతిగాని, వ్యాకులత్వముగాని, దైర్యముగాని జెందక, సముడై, స్వస్థచిత్తుడై, మానియై, ధీరుడై, పర్వతమువలె స్థిరముగనుండును.

అపవిత్రమపథ్యం చ విషసిక్తం మలాద్యపి
భుక్త్వా జరయతి క్షిప్రం క్లిన్నం నష్టం చ మృష్టవత్. 56

జ్ఞాని అపవిత్రములును, అపథ్యములును, విషసమ్మిళితములునునగు గోమయాదులను, తడచి, రసహీనమైనట్టి ఆహారమునుగూడ భక్షించి శుద్ధాన్నమునువలె వాటిని వెంటనే పచనమొనర్చుకొనును.

బిమ్బప్రతివిపాకల్కక్షీరేక్షుసలిలాన్ధసామ్
అసక్తబుద్ధిస్తత్త్వజ్ఞో భవత్యాస్వాదనే సమః. 57

అసక్తబుద్ధియగుటచే తత్త్వజ్ఞాని బింబఫలముల యొక్కయు, అతికలుషితమై, విషతుల్యమైనట్టి క్షీరముయొక్కయు, చెఱకురసముయొక్కయు, అన్నముయొక్కయు యాస్వాదనమున సమచిత్తుడై యుండును.

మైరేయమదిరాక్షీరరక్తమేదోరసాసవైః
రూక్షాస్థితృణకేశాద్యైర్న హృష్యతి న కుప్యతి. 58

మైరేయ, మద్య, క్షీర, రక్తాది మాదకరసములయెడలను, ఎండిన యెముకలు, తృణములు, కేశములు, ప్రేవులు, మున్నగువానియెడలను జ్ఞాని సంతుష్టుడుగాని, కృద్ధుడుగాని గాకయుండును.

జీవితస్యాపి హర్తారం దాతారం చైకరూపయా
దృశా ప్రసాదమాధుర్యశాలిన్యా పరిపశ్యతి. 59

జీవనహర్తను, జీవనదాతనుగూడ ప్రసన్నత్వ, మాధుర్యములచే శోభించు యేక దృష్టిచేతనే జ్ఞాని వీక్షించును.

స్థిరాస్థిరశరీరేషు రమ్యారమ్యేషు వస్తుషు
న హృష్యతి గ్లాయతి వా సదా సమతయేద్ధయా. 60

చిరకాలస్థలములగు దేవాది శరీరములందును, అల్పకాలస్థములగు మానుషాది దేహములందును, వాటి భోగ్యములైన రమణీయ, అరమణీయ విషయములందును సదా ప్రదీప్తమగు సమత్వముగల్గి, జ్ఞాని వాటిచే సంతోషమునుగాని దుఃఖమునుగాని బొందకుండును.

ముక్తాస్థత్వాదనాస్థేయరూపత్వాజ్జగతః స్థితౌ
నూనం విదితవేద్యత్వాన్నీరాగత్వాత్సచేతసః. 61

న కస్యచిన్నో కదాచిదతఃస్య విషయస్థితౌ
దదాతి ప్రసరం సాధురాధిప్రోజ్ఝితయా ధియా. 62

చిత్తము రాగరహితమగుటచేతను, వేద్యమగు ఆత్మ నెఱుంగుటచేతను, జగత్స్థితియం దాసక్తిలేకుండుటచేతను, విషయములు మిథ్యయని నిశ్చయించుటచేతను, జ్ఞాని తన నిశ్చింతబుద్ధిచే ఇంద్రియములకు విషయస్థితియందెపుడును యవకాశమీయకయేయుండును.

అతత్త్వజ్ఞమవిశ్రాన్తమలబ్ధాత్మానమస్థితమ్
నిగిరన్తీన్ద్రియాణ్యాశు హరిణా ఇవ పల్లవమ్. 63

లేళ్లు చిగుళ్లను భక్షించునట్లు, తత్త్వజ్ఞుడుకానివానిని, ఆత్మయందు విశ్రాంతినొందని వానిని, స్వరూపస్థితిలేనివానిని ఇంద్రియములు కబళించివైచుచున్నవి.

ఉహ్యమానం భవామ్భోధౌ వాసనావీచివేల్లితమ్
నిగిరన్తీన్ద్రియగ్రాహా మహాక్రన్దపరాయణమ్. 64

సంసారసముద్రమున కొట్టుకొనిపోవుచు, వాసనాతరంగములచే జుట్టబడి మహారోదన మొనర్చుచున్నట్టి జీవుని, ఇంద్రియములను మొసళ్లు మ్రింగివేయుచున్నవి.

విచారిణం భవ్యపదం విశ్రాన్తధియమాత్మని
న హరన్తి వికల్పౌఘా జలౌఘా ఇవ పర్వతమ్. 65

పర్వతమును జలప్రవాహము తొలగింపజాలనట్లు విచారయుతుడై, భవ్యపదమున స్థితిగల్గి, ఆత్మయందు విశ్రాంతినొందిన బుద్ధిగల జీవుని వికల్పసమూహము లెవ్వియు హరింపజాలకుండును.

సర్వసంకల్పసీమాన్తే విశ్రాన్తా యే పరే పదే
తేషాం లబ్ధస్వరూపాణాం మేరురేవ తృణాయతే. 66

సర్వసంకల్ప సీమాంతమగు పరమపదమున విశ్రమించువారికిని, ఆత్మస్వరూపమును ప్రాప్తినొందినవారికిని మేరుపర్వతముగూడ తృణప్రాయమేయగును.

జగజ్జరత్తృణలవో విషం చామృతమేవ చ
క్షణః కల్పసహస్రం చ సమమాతతచేతసామ్. 67

పూర్ణమై, ఆత్మాకారముఁజెంది, విస్తృతమైనట్టి చిత్తము గలవారలకు జగత్తు శిథిలమైన తృణఖండమువంటిదగును. మఱియు విషము అమృతమగును. క్షణకాలమున్ను, అనంతకల్పములున్ను సమముగనే యుండును.

సంవిన్మాత్రం జగదితి మత్వా ముదితబుద్ధయః
సంవిన్మయత్వాదన్తస్థ జగత్కా విహగన్త్యమీ. 68



ప్రపంచమంతయు సంవిన్మాత్రమేయని యెంచుటచే ప్రసన్నచిత్తులై జగత్తునంతయు సాక్షియగు ఆత్మమాత్రముగ జూచుటచే సర్వజగన్మధ్యముననున్నవారై జ్ఞానులు విహరింతురు.

సంవిన్మాత్రపరిస్పన్దే జాగతే వస్తుపఞ్జరే
కిం హేయం కిముపాదేయమిహ తత్త్వవిదాం మతమ్. 69

జగద్వస్తుపంజరమంతయు సంవిత్తుయొక్క స్పందమాత్రమేయగుటచే తత్త్వవేత్తలకట గ్రహింపదగినదేది? త్యజింపదగినదేది?

సంవిదేవేదమఖిలం భ్రాన్తిమన్యాం త్యజానఘ
సంవిన్మయవపుః స్ఫారం కిం జహాతి కిమీహతే. 70

పాపరహితుడవగు నోరామా! ఈ జగత్తంతయు సంవిన్మాత్రమే. కాన నీవన్యభ్రమలను వీడుము. సంవిన్మాత్రమగు విశాలదేహము దేనిని త్యజించును? దేనిని గ్రహించును?

యదేతజ్జీయతే భూమేర్భవిష్యత్పల్లవాఙ్కురమ్
తత్సంవిదేవ ప్రథతే తథా తత్త్వాఙ్కురస్థితమ్. 71

అజ్ఞానమను హరిణమున కభిలషితములై యుద్భవించు వర్తమాన భవిష్యద్విషయజాతమను పల్లవాంకురములన్నియు తత్త్వజ్ఞాని దృష్టియందు, సంవిత్తు యెవ్విధమున ప్రసిద్ధమైయుండునో అవ్విధమున ఆకాశాదితత్త్వములుగను, వాటినుండి యంకురించిన శబ్దస్పర్శాది విషయరూపములు గనునున్నవగును.

ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తస్య చ
కంచిత్కాలలవం దృష్టా సత్తాసౌ సంవిదో భ్రమః. 72

ఆద్యంతములందు లేని వస్తువు వర్తమానమందును లేనిదేయగును, వర్తమానసమయమున యల్పకాలమువఱకు గోచరించుదాని సత్త కేవలము సంవిత్తుయొక్క భ్రమమాత్రమేయైయున్నది.

ఇతి మత్వా ధియం త్యక్త్వా భావాభావానుపాతినీమ్
నిస్సఙ్గసంవిద్భారూపో భవ భావాన్తమాగతః. 73

ఇట్టి దృఢనిశ్చయము గల్గి భావాభావములఁ గూడు బుద్ధిని పరిత్యజించి నిస్సంగమై ప్రకాశయుతమైనట్టి సంవిన్మాత్రుఁడవై భావాతీతుఁడవుగమ్ము.

కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి
కర్మ కుర్వన్న కుర్వన్వా నిఃసఙ్గః సన్న లిప్యతే. 74

శరీరముచేతను, మనస్సుచేతను బుద్ధిచేతను సంగదోషరహితములగు యింద్రియములచేతను (వ్యుత్థానకాలమున) కర్మలఁజేసినను, (సమాధికాలమున) చేయకున్నను, నిస్సంగుడవగుటచే వాటిచే నీవంటబడకుందువు.

గతసఙ్గేన మనసా కుర్వన్నపి న లిప్యతే
సుఖదుఃఖైర్మహాబాహో మనోరథదశాస్వివ. 75

మహాబాహుండవగు నోరామా! అసంగమగు మనస్సుచే కర్మలఁజేసినను, మనోరథ దశలందువలె సుఖదుఃఖములచే సంటుబడకయేయుందువు.

గతసఙ్గాం మతిం కుర్వన్కుర్వన్నప్యఙ్గయష్టిభిః.
న లిప్యతే సుఖైర్దుఃఖైర్మనోరథదశాస్వివ. 76

సంగములేని బుద్ధి స్వయముగ క్రియలాచరించినను, లేక అవయవములను యుపకరణముల ద్వారా వ్యవహరించినను మనోరథదశలందువలె సుఖదుఃఖములచే సంటుబడకయుండును.

గతసఙ్గమనా దృష్ట్యా పశ్యన్నపి న పశ్యతి
ఏతదన్యస్థచిత్తత్వాద్బాలేనాప్యనుభూయతే. 77

సంగములేని మనస్సుగలవాడు కంటిచేచూచుచున్నను చూడకయేయుండును. అన్య వస్తువునందు చిత్తము సంలగ్నమైనపు డివ్విషయము బాలునకుగూడ యనుభూతమగుచునే యున్నది.

గతసఙ్గమనా జన్తుః పశ్యన్నేవ న పశ్యతి
న శృణోత్యపి శృణ్వంశ్చ న స్పృశత్యపి చ స్పృశన్. 78

న జిఘ్రత్యపి సంజిఘ్రన్నున్మిషన్నిమిషన్నపి
పదార్థే చ పతత్యేవ బలాత్పతతి నాప్యయమ్. 79

అసంగచేతస్కుఁడగు జీవుడు చూచుచున్నను, చూడకయుండను; వినుచున్నను వినక యుండును; తాకుచున్నను తాకకుండును; వాసనజూచున్నను వాసనజూడకుండును; కనులు తెఱయుచున్నను తెఱయకుండును. ఇట్లు కర్మేంద్రియములు సంస్కారబలమున వాటి వాటి విషయములందు బడినను ఆత్మ పడకయేయుండును,

దేశాన్తరస్థచేతోభిరేతదాత్మగృహస్థితైః
అప్రౌఢమతిభిః సాధుమూర్ఖైరప్యనుభూయతే. 80

స్వగృహముననున్నను మనస్సు అన్యస్థానముననున్నచో, చూచుచున్నను చూడకయే యుండునను నీవిషయమును అప్రౌఢబుద్ధులగు మూర్ఖులకుగూడ యనుభూతమగుచునేయున్నది.

సఙ్గః కారణమర్థానాం సఙ్గః సంసారకారణమ్
సఙ్గః కారణమాశానాం సఙ్గః కారణమాపదామ్. 81

సంగమే సర్వపదార్థములకును కారణము. సంసారమునకున్ను హేతువదియే. ఆశలన్నిటి కిని నదియే మూలకారణము. ఆపదలకును హేతువదియే.

సఙ్గత్యాగం విదుర్మోక్షం సఙ్గత్యాగాదజన్మతా
సఙ్గం త్యజ త్వం భావానాం జీవన్ముక్తో భవానఘ. 82

సంగమును వదలుటయే మోక్షమని వచింపబడినది సంగత్యాగముచే జన్మాభావమున్ను కలుగును. కాన నోరామా! నీవు పదార్థములందు సంగమును వదలి జీవన్ముక్తుడవుగమ్ము.



శ్రీరామ ఉవాచ:—

సర్వసంశయనీహారశరన్మారుత హే మునే
సఙ్గః కిముచ్యతే బ్రూహి సమాసేన మమ ప్రభో. 83

శ్రీరాముడు:—సర్వసంశయములను నీహార ముపశమింపజేయుటయందు శరత్కాల వాయువువంటి ఓ మునీంద్రా! ప్రభూ! సంగమన నేమియో సంక్షేపముగ వచింపుము?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

భావాభావే పదార్థానాం హర్షామర్షవికారతా
మలినా వాసనా యైషా సా సఙ్గ ఇతి కథ్యతే. 84

శ్రీవసిష్ఠుడు:— ఓ రామా! పదార్థముల సంయోగవియోగములందు హర్షశోకాది వికారములఁ గల్గజేయు మలినవాసనయే సంగమనఁబడును.

జీవన్ముక్తశరీరాణామపునర్జన్మకారిణీ
ముక్తా హర్షవిషాదాభ్యాం శుద్ధా భవతి వాసనా. 85

జీవన్ముక్తుల శరీరములందుండునదియు, పునర్జన్మను కలుగజేయనిదియు, హర్షశోకవర్జిత మైనదియునగు వాసనయే శుద్ధవాసన యనఁబడును.

తామసఙ్గాభిధాం విద్ధి యావద్దేహం చ భావినీ
తయా యత్క్రియతే కర్మ న తద్బన్ధాయ వై పునః. 86

ప్రారబ్ధక్షయపర్యంతముండునట్టి యాశుద్ధవాసననే అసంగమను పేరిట నీ వెఱుంగుము. దానిచే చేయఁబడు కర్మ మఱల బంధమును గలుగచేయదు.

అజీవన్ముక్తరూపాణాం దీనానాం మూఢచేతసామ్
యుక్తా హర్షవిషాదాభ్యాం బన్ధనీ వాసనా భవేత్. 87

జీవన్ముక్తులు కానట్టి దీనులును, మూఢచిత్తులునగువారి వాసన హర్షశోకములతో గూడి నదై బంధమునే గల్గించును.

సైవోక్తా సఙ్గశబ్దేన న పునర్జననకారిణీ
తయా యత్క్రియతే కర్మ తద్బన్ధాయైవ కేవలమ్. 88

పునర్జన్మను గల్గజేయు వాసనయే సంగమనంబడును. అట్టివాసనచే జేయబడు కర్మయంతయు కేవలము బంధముకొఱకే యగును.

ఏవం రూపం పరిత్యజ్య సఙ్గం స్వాత్మావికారదమ్
యది తిష్ఠసి నిర్వ్యగ్రః కుర్వన్నపి న లిప్యసే. 89

ఓ రామా! ఆత్మకు వికారము గల్గజేయునదియు, వాసనారూపమునునగు యట్టిసంగమును త్యజించి, స్వస్థుఁడవై యున్నచో నిక కర్మలఁ జేసినను వాటిచే యంటుబడకయే యుందువు.

హర్షామర్షవిషాదాభ్యాం యది గచ్ఛసి నాన్యతామ్
వీతరాగభయక్రోధస్తదసఙ్గోఽసి రాఘవ. 90

ఓ రామా! హర్షామర్షవిషాదములచే వైరూప్యమును బొందక రాగభయక్రోధములులేనివాఁడవై యుండుచో నీవసంగుడవే యగుదువు.

దుఃఖైర్న గ్లానిమాయాసి యది హృష్యసి నో సుఖైః
ఆశావైవశ్యముత్సృజ్య తదసఙ్గోఽసి రాఘవ. 91

ఓ రాఘవా! దుఃఖములచే గ్లానిగాని సుఖములచే ప్రసన్నత్వముగాని బొందకయున్నచో ఆశాపారవశ్యమును త్యజించి యపుడు నీవసంగుడవే యగుదువు.

విహరన్వ్యవహారేషు సుఖదుఃఖదశాసు చ
న విముఞ్చసి సత్సామ్యం తదసఙ్గోఽసి రాఘవ. 92

ఓ రామా! లోకవ్యవహారములందును, సుఖదుఃఖాదిదశలందును, నీవు బ్రహ్మముతోటి యేకత్వమును త్యజింపకున్నచో అసంగుడవే యగుదువు.

సంవేద్యో యది చైవాత్మా వేదితే లక్ష్యతే సమః
యథా ప్రాప్తానువర్తీ చ తదసఙ్గోఽసి రాఘవ. 93

ఓ రాఘవా! ఎపుడు నీచిత్తము సంవేద్యమైయుండునో, మఱియు నెఱుంగబడినపిదప సమ (బ్రహ్మ) స్వరూపముగ గాన్పించునో, అపుడు నీవు యథాప్రాప్తములగు క్రియలనాచరించుచు అసంగుడవై యుండువు.

అసఙ్గతామనాయాసాజ్జీవన్ముక్తస్థితిం స్థిరామ్
అవలమబ్య సమః స్వస్థో వీతరాగో భవానఘ. 94

అనాయాసముగ చేకూరు యసంగత్వమే జీవన్ముక్తని స్థిరస్థితియగును. పాపరహితుడవగు నోరామా! నీవద్దాని నాశ్రయించి స్వస్థుఁడవును, వీతరాగుఁడవును గమ్ము.

జీవన్ముక్తమతిర్మానీ నిగృహీతేన్ద్రియగ్రహః
అమానమదమాత్సర్యమార్య స్తిష్ఠతి విజ్వరమ్. 95

జీవన్ముక్తుల స్వభావముగల్గి, మానియై, ఇంద్రియపాశముల నిగ్రహించి, ఆర్యుడు (ఉత్తమజ్ఞాని) మానమదమాత్సర్యరహితుడై, సంతాపవర్జితుడై యుండును.

సదా సమగ్రేఽపి హి వస్తుజాలే
సమాశయోఽప్యన్తరదీనసత్త్వః,
వ్యాపారమాత్రాత్సహజాత్క్రమస్థా
న్న కించిదప్యన్యదసౌ కరోతి. 96

భోగవిక్షేపాదులకు కారణమగు వస్తుసమూహమంతయు సదా యధికముగనున్ననుగూడ జ్ఞాని సమచిత్తుడై, అదీనస్వభావుడై, స్వవర్ణాశ్రమోచిత సహజక్రమసంప్రాప్తములైన క్రియలఁదప్ప అన్యమేమియు నాచరింపకయుండును.

యదేవ కించిత్ప్రకృతం క్రమస్థం
కర్తవ్యమాత్మీయమసౌ తదేవ,



సంసర్గసంబన్ధవిహీనయైవ
కుర్వన్న ఖేదం రమతే ధియాన్తః. 97

ప్రకృతక్రమము ననుసరించి తన కర్తవ్యమును క్రియాభినివేశ, ఫలాభిలాషరహితమగు బుద్ధిచే నొనర్చుచు జ్ఞాని సదా స్వాత్మయందే క్రీడించుచుండును.

అథాపదం ప్రాప్య సుసంపదం వా
మహామతిః స్వప్రకృతం స్వభావమ్
జహాతి నో మన్దరవేల్లితోఽపి
శౌక్ల్యం యథా క్షీరమయామ్బురాశిః. 98

మందరపర్వతముచే చిలుకబడినను క్షీరసముద్రము సహజమగు తన తెలుపుదనమును విడనట్లు, సంపద్విపత్తులం బొందినను మహామతియగు జ్ఞాని శమదమసంతోష సమదర్శనాదియుతమగు తన పూర్వసిద్ధ స్వభావము నెన్నటికిని వీడకుండును.

సంప్రాప్య సామ్రాజ్యమథాపదం వా
సరీసృపత్వం సురనాథతాం వా
తిష్ఠత్యఖేదోదయమస్తహర్షం
తుషోదయేష్విన్దురివైకరూపః. 99

సామ్రాజ్యపదము లభించినను, లేక కృమికీటత్వము సంభవించినను, ఇంద్ర పదము సంప్రాప్తించినను జ్ఞాని సంతోషముగాని దుఃఖముగాని పొందక, ఉదయాస్తమయములం దేకరూపముననుండు చంద్రునివలె భాసించును.

నిరస్తసంరమ్భమపాస్తభేదం
ప్రశాన్త నానాఫలవల్గువేషమ్
విచారయాత్మానమదీనసత్త్వో
యథా భవస్యుత్తమకార్యనిష్ఠః. 100

ఓ రామా! క్రోధ, భేదములఁ ద్యజించి, వివిధ తుచ్ఛాకారములఁ బారద్రోలి, అదీన స్వభావుఁడవై, అంతిమపురుషార్థమగు మోక్షమను ఉత్తమకార్యమున ప్రతిష్ఠితుఁడవగుటకై నీవాత్మవిచారణ యొనర్పుము.

తయోదితప్రసరవిలాసశుద్ధయా
గతజ్వరం పదమవలమ్బ్యయామలమ్
ధియేద్ధయా పునరిహ జన్మబన్ధనై
ర్న బధ్యసే సమధిగతాత్మదృశ్యయా. 101

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే
ద్వాత్రింశత్సాహస్ర్యాం సంహితాయాం మోక్షోపాయేషూపశమప్రకరణే
సమదర్శనం నామ త్రినవతితమః సర్గః ॥ 93॥

ఉపశమప్రకరణం సంపూర్ణమ్.

---

ఓరామా! అట్టి యాత్మవిచారముచే నుదితమగు సమాధిచే వాసనలన్నియు క్షయింప, శుద్ధమై, అవశ్యమాత్మపదమును పొందింపజేయునదై, అవిద్యా తత్కార్యముల దగ్ధ మొనర్చుట యందు సమర్థమగుటచే ప్రదీప్తమైనట్టి బుద్ధిచే నిరతిశయపరమానందపదమున స్థితుఁడవు గమ్ము. అత్తరి జననమరణాది బంధనములచే నీవిక మఱల బాధింపబడకుందువు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు ఉపశమప్రకరణమున
సమదర్శనమను త్రినవతితమ
సర్గము ॥ 93 ॥

---

ఉపశమప్రకరణము సంపూర్ణము.

---

పూర్వార్థము సమాప్తము.

---

ఓం తత్ సత్.



